# శివుడు-1

**"ఒరేయ్ శివుడూ..."**

**ఉలిక్కిపడి వెనుతిరిగి చూశాడు శివుడు.**

**అతని వయసువాళ్ళే ఆరుగురు బాలకులు నిలబడి వున్నారు ఒక చెట్టు క్రింద. నోటిలోని దంతాలన్నీ బయటకి కనిపించేటట్లు నవ్వుకుంటున్నారు.**

"ఎందుకు పిలిచారు నన్ను?" ఆ నవ్వుల్ని తాను గమనించనట్లు అమాయకంగా అడిగాడు శివుడు.

"మీ నాన్న పేరేమిటిరా?" అడిగాడు అతన్ని పిలిచిన బాలుడు.

చెంపమీద లాగిపెట్టి కొట్టినట్టు అయింది శివుడికి. అతనికి తెలియకుండానే బిగుసుకున్నాయి పిడికిళ్ళు. ఎరుపురంగుకు తిరిగాయి కళ్ళు.

"అబ్బో... శివుడికి కోపం వచ్చేస్తోందిరా... తల్లిపేరు కూడా అడిగితే మూడోకన్ను తెరిచి మనందర్నీ భస్మం చేసేస్తాడు. ఏం చేద్దాం? అడుగుదామా వద్దా?" నవ్వుతూనే పక్కకు తిరిగి తోటి బాలుర్ని అడిగాడు ఆ బాలుడు.

"అడుగు... అడుగు..." ఆనందంగా ప్రోత్సహించారు వాళ్ళు.

"మీ తల్లిగారి పేరేమిటిరా?" అడగనే అడిగాడు ఆ బాలుడు.

తనను తాను మరిచిపోయాడు శివుడు. తాను సంపంగి నగరం కోట వెలుపల సువర్ణానది ఒడ్డున వున్న సంగతిని కూడా విస్మరించాడు.

నది అవతలినించి శత్రువులు దొంగచాటుగా కోట దగ్గరికి రాకుండా నిరంతరాయంగా కాపలా వుంటారు పదిమంది భటులు. నది దగ్గర ఏవైనా తగాదాలు తన్నులాటలు జరిగితే వెంటనే వచ్చి తమ ఆధీనంలోకి తీసుకుంటారు వాళ్ళు. సర్వసైన్యాధిపతి దగ్గరికి తీసుకుపోయి తగిన శిక్షలు విధింపచేస్తారు.

ఆ విషయాలు ఏవీ ఆపలేకపోయాయి శివుడిని ఆ క్షణంలో. పళ్ళు పటపటమని కొరుకుతూ పెద్దపులిలా పోయి ఆ బాలుడిమీద కలబడ్డాడు.

సరి సమానమైన వయస్సే గాని, ఆకృతిలో మాత్రం శివుడి కంటే కొంచెం పెద్దగానే వున్నాడు ఆ బాలుడు. ఒక చేత్తో శివుడిని అడ్డుకుని, రెండవ చేత్తో చెంపలమీద ఛెళ్ళుమని వేశాడు రెండు దెబ్బలు.

అధికం అయిపోయింది శివుడి ఆగ్రహం. తనను తాను పూర్తిగా మర్చిపోయాడు. తగిలిన దెబ్బల్ని లక్ష్యపెట్టకుండా చేతుల్ని జాచి అతని మెడను గట్టిగా పట్టుకున్నాడు.

ఊపిరి తీసుకోవటం కష్టమైపోయింది ఆ బాలకుడికి. గిలగిలా కొట్టుకోవడం మొదలుపెట్టాడు. అది చూసి అతనికి సహాయం చెయ్యటానికి సిద్ధం అయ్యారు మిగిలినవారు. శివుడిని చుట్టుముట్టి పిడికిళ్ళతో అతని తలమీద, భుజాలమీద వెన్నుమీదా మర్దించటం మొదలుపెట్టారు.

భరించరాని బాధ నరాల్ని జివ్వుమనిపిస్తున్నా లెక్కచెయ్యలేదు శివుడు. పట్టుకున్న బాలుడిని వదిలిపెట్టలేదు.

"చంపేస్తున్నాడు... తల్లి ఎవరో తండ్రి ఎవరో తెలియని అనాధ శివుడు మా స్నేహితుడిని గొంతు పిసికి చంపేస్తున్నాడు" శివుడిని ఇవతలకు లాగటం తమవల్ల కాదని గ్రహించి బిగ్గరగా అరిచాడు ఒక బాలుడు.

"ఏయ్... ఎవరది... ఏం చేస్తున్నారక్కడ... ఆగండి" అని వినవచ్చింది ఒక ఉరుములాంటి కంఠం.

ఆరు మూరల పొడవున్న బరిశెను పట్టుకుని పరుగు పరుగున వస్తూ కనిపించాడు నది దగ్గర కావలి కాచే భటుడు ఒకతను.

అంతకుముందు తన వంటిమీద ఎన్ని దెబ్బలు పడినా ఇసుమంత కూడా లెక్కచెయ్యని శివుడు ఇప్పుడు ఆ భటుడిని చూడగానే చటుక్కున వదిలేశాడు తాను పట్టుకున్న బాలకుడిని. గిరుక్కున వెనుతిరిగి నదివడ్డునే పరుగు మొదలుపెట్టాడు.

"పట్టుకోండి వాడిని... పట్టుకు వచ్చి నాకు అప్పగించండి" వేగంగా పరిగెత్తుకురావడం వల్ల ఆయాసం వచ్చింది కాబోలు వగరుస్తూ చెప్పాడు భటుడు.

"పట్టుకు రావటమా? మేము ఆ పొగరుబోతు శివుడి వెనకాల పరిగెత్తి అతన్ని పట్టుకోవటమా?" ఉన్నచోటునించి కదలకుండా ఆశ్చర్యంగా అడిగాడు ఒక బాలకుడు.

"ఎందుకు పట్టుకోలేరు? వాడేమైనా పెద్ద పోటుగాడా? దగ్గరికి పోతే మిమ్మల్ని కూడా గొంతు పిసికి చంపేస్తాడా?" విసుగ్గా అడిగాడు ఆ భటుడు.

"చంపుతాడో లేదో తెలుసుకోవాలంటే అసలు మేము వాడి దగ్గరికి పోవాలి కదా... పరిగెత్తటం మొదలుపెడితే వాడు చిరుతపులి... ఎవరికీ అందడు... ఎవరూ వాడిని గెలవలేరు..." కారణం చెప్పాడు ఆ బాలకుడు.

"ఈ శివుడి ఆగడాలు రోజురోజుకీ అధికం అయిపోతున్నాయి. ఏదోలే అనాథ అని ఊరుకుంటుంటే తెగ రెచ్చిపోతున్నాడు. ఈరోజు తప్పకుండా మండలాధిపతి సాగరుల వారికి తెలియజేయవలసిందే" అంటూ శివుడు ఏ బాలుడి కంఠాన్ని పట్టుకున్నాడో ఆ బాలుడివంక చూశాడు ఆ భటుడు.

"తిన్నగానే వున్నావు కదా, ప్రాణభయం ఏమీలేదు కదా!" అని అడిగాడు.

ఎలుగుబంటి పట్టుకున్నట్టు ఎర్రగా కందిపోయింది ఆ బాలుడి కంఠం. చేతులతో అదుముకుంటూ తాను తిన్నగానే వున్నట్టు తలవూపాడు అతను.

"ఇళ్ళకు పోండి. ఇంకెప్పుడు ఆ శివుడితో గొడవలు పడకండి... అసలు వాడు కనిపిస్తే వాడివంక చూడనుకూడా చూడకండి. వెళ్లిపొండి" అని ఒక హెచ్చరికను వారందరికీ అందించి అవతలికి నడిచాడు ఆ భటుడు.

❖ ❖ ❖

అలుపు, ఆయాసం అనే మాటలకు అర్థం తెలియనట్లు అర్థయోజన దూరం పరిగెత్తి నది ఒడ్డున వున్న వెలగతోట దగ్గర ఆగాడు శివుడు.

పట్టెడు పట్టెడు లావున కనిపిస్తున్నాయి చెట్లకున్న వెలగకాయలు. మిగల పండిపోయాయి కాబోలు కొన్ని, మధురమైన సువాసనలు వెదజల్లుతున్నాయి.

నోరు ఊరిపోయింది శివుడికి. ఛెంగున కదిలి తోటలోకి ప్రవేశించాడు. ఎత్తుగా వున్న ఒక చెట్టు మీదికి ఎగబ్రాకి, దగ్గర్లో కనిపించిన రెండు కాయల్ని తెంపాడు.

"ఎవరు? ఎవరా చెట్టుమీద? పట్టపగలే దొంగతనానికి వచ్చారా? ఇది మండలాధిపతి సాగరుల వారి పండ్లతోట అని మర్చిపోయారా?" అంటూ వినవచ్చింది ఒక భీకర కంఠం.

మూడు మూరల పొడుగుండే లావుపాటి గడ్డపలుగు నొకదాన్ని పట్టుకుని పరుగు పరుగున వస్తూ కనిపించాడు తోటమాలి.

తెంపిన కాయల్ని చటుక్కున దుస్తుల్లో దాచుకుని, కూర్చుని వున్న కొమ్మమీది నించి క్రిందికి దూకాడు శివుడు. పాదాలు నేలకు ఆనిన మరుక్షణం తోట వెలుపలికి పరుగు మొదలుపెట్టాడు.

కోట వెలుపల నదిఒడ్డున కాపలా వుండే భటుల మాదిరి బద్ధకస్తుడు కాదు తోటమాలి. "దొంగ... పారిపోతున్నాడు... .పట్టుకోవాలి... రండిరోయ్ రండి" అని అరుస్తూ వెంటపడ్డాడు.

అతను అరిచిన వెంటనే చేస్తున్న పనుల్ని వదిలేసి వేగంగా వచ్చిపడ్డారు అతని సహాయకులు నలుగురు.

వెలగపళ్ళను రుచి చూడాలనే తన కోరిక తనకు ఎటువంటి ప్రమాదాన్ని తెచ్చి పెట్టబోతున్నదో అర్థమయ్యేసరికి చెమటలు ప్రత్యక్షం అయ్యాయి శివుడి ముఖం మీద. పట్టుబడటం అంటే వాళ్ళ చేతుల్లో చావుదెబ్బలు తినటమే అని తెలిసివచ్చేసరికి చాలా భయపడిపోయాడు.

దుస్తుల్లో దాచుకున్న వెలగపళ్ళు వాటంతట అవి జారి క్రిందపడిపోవటాన్ని అతను చూసుకోలేదు. దృష్టినంతా నది ఒడ్డుమీదే కేంద్రీకరించి, మరోసారి పరుగు మొదలుపెట్టాడు.

అతన్ని పట్టుకోవాలన్న పట్టుదల అయితే అధికంగానే వున్నది గానీ, అతనితో పాటు వేగంగా పరిగెత్తగల సామర్ధ్యం మాత్రం లేదా తోటమాలి సహాయకులికి. రెండు నిమిషాలు కూడా గడవకముందే వెనకబడిపోయారు వాళ్ళు.

ప్రమాదం తప్పిపోయిందని భ్రమపడలేదు శివుడు. తన వేగాన్ని తగ్గించనుకూడా తగ్గించలేదు.

కోట సమీపంలో నది ఒడ్డున కాపలా వుండే భటుల దృష్టిలో పడకుండా కోటలోకి వెళ్ళిపోయే మార్గాన్ని అన్వేషించుకోబోతుండగా అతని చెవులకు చేరింది ఆ ఆర్తనాదం.

"అయ్యయ్యో... నా బిడ్డ... నా బిడ్డ నదిలో పడిపోయింది. నా బిడ్డని కాపాడండి... రక్షించండి" గోలుగోలున అరుస్తూ నదికి ఆవలి ఒడ్డున నిలబడి వున్న ఒక యువతి అతనికి కనిపించింది.

చటుక్కున ఆగిపోయాడు శివుడు. నది వంక పరీక్షగా చూశాడు. పది క్షణాల తరువాత నీటిలో నుంచి పైకి లేచింది ఒక చిన్న శిరస్సు. అంతలోనే మళ్ళీ మునిగిపోయింది.

ఆగలేకపోయాడు అతను. తనను తరుముకు వస్తున్న తోటమాలి సహచరులను గురించి మరచిపోయి ఒక్కగంతులో పోయి నీటిలో దుమికాడు.

"అమ్మా! తల్లీ... బిడ్డా... నా తల్లీ" అని ఆక్రోశిస్తూనే వుంది ఒడ్డుమీది యువతి.

నీటిని తాకిన మరుక్షణం బలంగా బారలు వేశాడు శివుడు. ఎక్కడో పాతిక యోజనాల అవతల వున్న ప్రకీర్తి పర్వతాల్లో పుట్టి పరవళ్ళు తొక్కుతూ ప్రవహిస్తూ వస్తుంది సువర్ణ నది. ఏమరుపాటుగా వుంటే తన అలలతో ఉక్కిరిబిక్కిరి చేసేస్తుంది.

దాహం తీర్చుకోవటానికి తల్లితో ఆ నీటి అంచుకు వచ్చి, కాలుజారి పడిపోయింది కాబోలు ఆ యువతి బిడ్డ. నది వేగానికి ఉక్కిరిబిక్కిరి అయిపోతూ కొట్టుకుపోతోంది.

నేలమీద ఎంత వేగంగా పరిగెత్తినా, ఎటువంటి ఆయాసానికి గురికాని శివుడికి నీటిలో ఈదటం మాత్రం కొద్దిపాటి శ్రమే అనిపించింది. అయినా సరే లెక్కచేయలేదతను. నాలుగే నాలుగు క్షణికాల్లో అవతలి ఒడ్డు దగ్గరిగా పోయాడు. బిడ్డ తల కనిపించిన ప్రదేశానికి కొద్దిగా అవతల బుడుంగున నీటిలో మునిగాడు.

యదార్థమయింది అతని అంచనా. ఊపిరి తిత్తుల్లోకి నీరు చేరటం వల్ల బరువెక్కి నది అడుగుభాగానికి వెళ్ళిపోతున్న నాలుగు సంవత్సరాల వయసుండే ఆడబిడ్డ అతని చేతులకు అందింది.

అమాంతం వడిసిపట్టుకుని, బరిశెమొన నీటిలోనుంచి బయటికి వచ్చినట్లు ఒక్కసారిగా పైకి తేలాడు అతను. వేగంగా ఒడ్డుకుపోయి చేతుల్లో వున్న చిన్నారిని ఒడ్డుమీదికి నెట్టాడు.

తానుకూడా ఒడ్డుమీదికి పోయి కళ్ళు తేలవేసిన ఆ చిన్నారికి ప్రథమ చికిత్స చేయాలని అనుకున్నాడు గాని, నెరవేరలేదు ఆ ఉద్దేశ్యం.

అతను నీటిలోకి దుమకటాన్ని చూసి, తాముకూడా అదేపని చేశారు వెనుకగా వస్తున్న తోటమాలి సహాయకులు. వేగంగా ఈదుకుంటూ వచ్చి అతని పెడరెక్కలు విరిచి పట్టుకున్నారు.

❖ ❖ ❖

సంపంగి నగరం చుట్టూ వున్న కీకారణ్యంలో బాటసారులను దోపిడీ చేస్తున్న ఇద్దరు బందిపోట్లను విచారిస్తున్నాడు మండలాధిపతి సాగరుడు.

"మన భటులు నలుగురు తీవ్రంగా గాయపడ్డారు. ఇప్పటి వరకూ ఇరువది మంది బాటసారులను నిలువుదోపిడీ చేశారు వీళ్ళు" అంటూ ఆ దొంగల చరిత్రను వివరిస్తున్నాడు మంత్రి మహేశ్వరుడు.

"మీరు చెప్పుకోవాల్సింది ఏమైనా వున్నదా?" సింహాసనం ముందుకు జరిగి కూర్చుంటూ గంభీరంగా ఆ దొంగల్ని అడిగాడు సాగరుడు.

నేరం చేస్తుండగా దొరికిపోవడంవల్ల తాము నిర్దోషులమని చెప్పుకునే అవకాశం వారికి లేకపోయింది. తీక్షణంగా చూస్తున్న సాగరుడి వంక చూడలేక తలల్ని వంచుకున్నారు.

"తీసుకుపోయి అడవిలో వున్న మర్రిచెట్ల దగ్గర ఉరి తీయండి. ఇటువంటి నేరాలు చేసేవారికి హెచ్చరికగా శరీరాల్ని అక్కడే వదిలేయండి" సింహాసనం పక్కనే వున్న రాజదండాన్ని చేతుల్లోకి తీసుకుని శిక్షను ప్రకటించాడు సాగరుడు.

సిద్ధంగా వున్నారు భటులు. బందిపోట్లను చేతుల్ని వెనక్కి విరిచి పట్టుకుని సభా భవనంలో నుంచి అవతలికి తీసుకుపోయారు.

"ఈరోజు నేను చూడవలసిన విషయాలు అయిపోయాయి కదా... ఇక నేను వెళ్ళిపోవచ్చునా?" రాజదండాన్ని తిరిగి పక్కన బెట్టి మహేశ్వరుడిని అడిగాడు సాగరుడు.

"కోనేటి గట్టుమీద కొన్ని వ్యవసాయ క్షేత్రాలున్నాయి. వాటి సరిహద్దుల దగ్గర తేడాలు వచ్చి తగవు పడుతున్నారు సాగుదార్లు. వారిని కూడా..." అంటూ సాగరుడి వదనంలో ప్రతిఫలించిన భావాల్ని చూసి మాట ఆపేశాడు మహేశ్వరుడు.

"అదేపనిగా ప్రజల జీవితాల్లో జోక్యం చేసుకుంటుంటే మనం వాళ్ళకి అలుసు అయిపోతాము. గ్రామపెద్ద దగ్గర తేల్చుకోవచ్చు" తన అభిప్రాయాన్ని నిక్కచ్చిగా చెప్పాడు సాగరుడు.

"చిన్న చిన్న తగాదాలే అని మనం నిర్లక్ష్యం చేస్తే కాలక్రమంలో అవి చాలా పెద్దవిగా మారిపోయే ప్రమాదం వుంది" కనులు చిట్లిస్తూ చెప్పాడు మహేశ్వరుడు.

"అలా పెద్దవయిన విషయాలు ఏమైనా వున్నాయా?" అడిగాడు సాగరుడు.

"ఇప్పటివరకూ ఏమీ లేవుగాని, ఇప్పుడు మాత్రం ఇంకోటి మన దృష్టికి వచ్చింది" అన్నాడు మహేశ్వరుడు.

"ఏమిటది?" ఆశ్చర్యంగా అడిగాడు సాగరుడు.

"తల్లిదండ్రులు లేని అనాధలను చేరదీయటం మీకు అలవాటు. పెద్దవారయ్యేదాకా సంరక్షించి, విద్యాబుద్ధులు చెప్పించి అర్హులైన వారికి ఆస్థానంలో మంచిపదవులు ఇవ్వటం మీ ఆచారం..." సరయిన మాటల కోసం తడుముకుంటూ చెప్పాడు మహేశ్వరుడు.

"ఎప్పటినుంచో మేము చేస్తున్న పని అది... ఇప్పటి వరకూ అందరూ మెచ్చుకున్నారే తప్ప ఆక్షేపించినవారు లేరు కదా?" అన్నాడు సాగరుడు.

"లేదుగాని, ఇకముందు మీరు ఆక్షేపించబడతారు. తప్పదు" అంటూ ఆ మందిర ద్వారం దగ్గిర వున్న భటులకు సైగ చేశాడు మహేశ్వరుడు.

వెంటనే తీసుకువచ్చారు వాళ్ళు చేతులు వెనక్కి విరిచి కట్టబడి వున్న శివుడిని. విపరీతమైన ఆశ్చర్యంతో వెడల్పు అయ్యాయి సాగరుడి కళ్ళు.

"పదిహేను సంవత్సరాల క్రితం రాజమందిర ద్వారం దగ్గర ఒక బుట్టలో దొరికాడు ఇతను. ఇతని పేరు శివుడు అనే ఒక మాట లిఖించబడి వున్న తాళపత్రం తప్ప, తండ్రిని తల్లిని గురించిన వివరాలు ఏమీ మనకి లభించలేదు" అంటూ మొదలుపెట్టి ఆరోజు జరిగిన సంఘటనలన్నిటినీ వివరంగా చెప్పాడు మహేశ్వరుడు.

మండలేశ్వరుడు సాగరుడి వదనంలో ప్రత్యక్షం అయింది కొద్దిపాటి కోపం. "నీ వయస్సున్న పిల్లవాడి గొంతు పిసికావా?" అని అడిగాడు శివుడిని.

తలవంచుకుని అవునన్నాడు శివుడు.

"అనుమతి లేకుండా మా తోటలో వెలగపళ్ళు దొంగిలించావా?" అందుకు కూడా తలవూపాడు శివుడు.

"పట్టుకోవటానికి వచ్చినవారికి దొరక్కుండా వేగంగా పరిగెత్తిన నువ్వు, ఆఖరికి ఎలా దొరికిపోయావు?"

శివుడు చేసిన నేరాలను సవివరంగా చెప్పి, ఆ సంభాషణను ఆసక్తిగా ఆలకిస్తున్న మంత్రి మహేశ్వరుడి పెదవులమీద ప్రత్యక్షం అయింది చిన్న చిరునవ్వు.

"దారిలో చిన్న సాహసకార్యం చేశాడు. నదిలో కొట్టుకుపోతున్న పసిబిడ్డను కాపాడుతూ తోటమాలి సహాయకులకి దొరికిపోయాడు" అని చెప్పాడు.

నేరస్తులవంక తీక్షణంగా చూసే సాగరుడి కళ్ళల్లో కూడా ఏదో చిన్న మెరుపు ప్రత్యక్షమై వెంటనే మాయమయిపోయింది.

"బుద్ధిగా చదువుకుని, మన నగరానికి సేవ చేస్తాడని అనుకుంటుంటే పాడుపనులు చేసి చెడ్డవాడిగా పేరు తెచ్చుకుంటున్న ఇతనికి ఎటువంటి శిక్ష విధిస్తే బాగుంటుంది?" మహేశ్వరుడిని అడిగాడు ఆయన.

"తమరి వాంఛితం ఎలాగో అలాగే చేయండి. నాలుగు రోజులు చెరసాలలో పెట్టించవచ్చు. నాలుగు కొరడా దెబ్బలను కొట్టించవచ్చు...." అన్నాడు మహేశ్వరుడు.

"సువర్ణ నదిలో కొట్టుకుపోతున్న పసిబిడ్డను రక్షించే తెగింపు వున్నవాడికి నాలుగు రోజుల చెరసాల నాలుగు కొరడా దెబ్బలు ఒక లెక్కలోకి రావు" అంటూ తీక్షణంగా ఆలోచించడం మొదలుపెట్టాడు సాగరుడు.

మహేశ్వరుడు సూచించిన శిక్షల కంటె పెద్దదయిన ఇంకేదో శిక్ష శివుడికి విధించబడుతుందనే అనుకున్నారు సభాభవనంలో వున్నవారందరూ.

"ఈరోజు నుంచి తిరిగి పౌర్ణమి వచ్చేంత వరకూ ఇతను మన గజశాలలో కసువు ఊడ్చేపని చేయాలి... పగలు తన ఈడు వారితో పతంజలిశాస్త్రి వారి వద్ద విద్యాభ్యాసం తప్పించుకోకూడదు... తిండితిప్పలు అన్నీ గజశాలలోనే... మన భోజనశాలలో అడుగు పెట్టడం నిషిద్ధం" పక్కన పెట్టిన రాజదండాన్ని ఇంకోసారి చేతుల్లోకి తీసుకుంటూ శిక్షను ప్రకటించాడు సాగరుడు.

"మండలేశ్వరులు మహా కఠినంగా వ్యవహరిస్తున్నారు. గజశాలలో వున్న ఏనుగుల్లో మనకి మాలిమి అయినవి ఏమీలేవు. అన్నీ కొత్తగా అడవుల్లో నుంచి పట్టుకు వచ్చినవే. ఇతన్ని తమ పాదాలతో పాతాళంలోకి

అణగదొక్కేస్తాయి... మరోసారి ఆలోచించండి" వెంటనే అడ్డుకున్నాడు మహేశ్వరుడు.

"రాజదండం చేతిలో పట్టుకొని ఒకసారి శిక్షను ప్రకటించిన తర్వాత మా నిర్ణయంలో మార్పు వుండదు. వుండకూడదు. అంతే... ఈ రోజుకు సభ సమాప్తం" అంటూ తనంత తనే సభను ముగించాడు సాగరుడు.

తెల్లబోయి చూస్తున్న శివుడిని నెట్టుకుంటూ ఆ మందిరంలో నుంచి బయటకి తీసుకుపోయారు భటులు. సభలో వున్నవారు కూడా తమ ఆసనాలమీది నించి లేచి సాగరుడికి అభివాదాలు చేస్తూ వెళ్ళిపోయారు.

"శిక్ష కొంచెం గట్టిగానే వున్నది ప్రభూ..." సభలో తాము ఇద్దరే మిగిలి వుండటాన్ని గమనించి నెమ్మదిగా అన్నాడు మహేశ్వరుడు.

"ఇనుమును కొలిమిలో కాల్చి సమ్మెటలతో బాదినప్పుడే సరియైన ఆకృతిలోకి మార్చుకునే వెసులుబాటు లభిస్తుంది. ఇప్పుడు మన సంరక్షణలో ఎంతమంది తల్లిదండ్రులు లేనివారున్నారు?" అడిగాడు సాగరుడు.

తన దగ్గర వున్న భూర్జపత్రాల వంక ఒకసారి చూసి, "మొత్తం సరిగ్గా పన్నెండుమంది పిల్లలు పెరిగి పెద్దవాళ్ళు అవుతున్నారు. రేపు వచ్చే పౌర్ణమితో వారందరి విద్యాభ్యాస్యం పూర్తి అవుతుంది. వారి వారి అర్హతలను బట్టి సైన్యంలోనో, అశ్వదళంలోనో, మరేదైనా వృత్తిలోనో సహాయకులుగా చేర్పించి పూర్తి శిక్షణ ఇప్పించవలసి వుంటుంది" చెప్పాడు మహేశ్వరుడు.

"శివుడికి ఏ వృత్తి సరిపోతుందో నీకేమైనా ఊహ వున్నదా?"

తల అడ్డం తిప్పాడు మహేశ్వరుడు. "శివుడు మనసు పెట్టి చేస్తే ఎటువంటి పనయినా తేలికగా పూర్తి అయిపోతుంది. సరయిన వృత్తిని ఎంపిక చేయటం చాలా కష్టం" అన్నాడు.

"అందుకే నేను గజశాలను ఎంచాను. చూద్దాం... ఎలా నెగ్గుతాడో" అంటూ సింహాసనం మీదినించి దిగాడు సాగరుడు.

తల వంచి అభివాదం చేశాడు మంత్రి మహేశ్వరుడు.

వడివడిగా అడుగులు వేస్తూ సభాభవనం వెనుక వున్న తమ రాజభవనం లోకి పోయాడు సాగరుడు.

మొదటి ద్వారాన్ని అధిగమించిన వెంటనే ఎదురు వచ్చింది అతని సహధర్మచారిణి చారులత.

"అమావాస్యకు పౌర్ణమికి మధ్యన వున్న కాలంలో చకోర పుష్పాలు వికసించి సుమధుర పరిమళాలు అడవినంతా అలుముకుంటాయి. ఆ పువ్వులు కొన్నింటిని తెచ్చిపెట్టమని నేను శివుడిని అడిగాను. మీరు వాడిని గజశాలలో బందీ చేశారు" దగ్గరకి వస్తూనే చిరుకోపంతో చెప్పింది.

"అడవిలో పూలను సేకరించటం కోసం బయలుదేరాడు వాడు. ఆ పనిని వదిలి, లేనిపోని గొడవలన్నిటిలోను తలదూర్చాడు. అందుకే శిక్ష" ఇసుమంత కూడా బాధను ప్రదర్శించకుండా గంభీరంగా చెప్పాడు సాగరుడు.

"పాపం... తల్లీతండ్రి లేని బిడ్డ..." సానుభూతిగా అన్నది ఆమె.

"అని ఎవరన్నారు? నువ్వు ఎవరివి? వాడికి తల్లివి కాదా?" ఎదురు ప్రశ్న వేశాడు సాగరుడు.

శివుడికి శిక్ష పడిందన్న వార్త తనకేమైనా బాధ కలిగిస్తూ వుండి వుంటే... ఆ సమాధానంతో అది మటుమాయమైపోయినంత హాయి కలిగింది చారులతకి.

"భగవంతుడు మనకి సంతానం లేదనే లోపం తెలియకుండా ఈ పిల్లలందర్ని మన దగ్గరికి పంపిస్తున్నాడు... నాకు ఎటువంటి చింతా లేదు..." అన్నది ఆమె.

❖ ❖ ❖

వంచిన నడుము ఎత్తకుండా గజశాలనంతా శుభ్రం చేశాడు శివుడు. కోరగా చూస్తున్న ఏనుగుల దగ్గరికి పోవటానికి కొంచెం కూడా సందేహించలేదు. చిన్న కంఠంతో కూనిరాగాలు తీస్తూ వాటి పాదాల క్రింద వున్న చెత్తను కూడా తీసివేశాడు.

మిట్టమధ్యాహ్న సమయం అయింది అప్పటికి. సూర్యుడు నడిమింటికి చేరి పడమటి దిక్కుకు ప్రయాణం కట్టే పనిలో పడుతున్నాడు.

"చేసింది చాలుగాని వచ్చి భోజనం చెయ్యి... ఇంకో పావు ఘడియలో నువ్వు ఆచార్యుల వారి దగ్గరికి పోవాల్సి వుంది" గజశాల ముందు భాగంలో వున్న నీటితొట్టె దగ్గర కరచరణాలను శుభ్రపరచుకుంటున్న శివుడితో చెప్పాడు గజశాల నిర్వాహకుడు.

సాగరుడి సంరక్షణలో పెరిగి పెద్దవారయ్యే పిల్లలందరికీ రాజభవనం నుంచే భోజనం పంపబడుతుంది.

ఆరోజు శివుడికి మాత్రం గజశాల భోజనమే గతి అయింది. ఎండిపోయి నట్లున్న రెండు రొట్టెలు, ఉడికీ ఉడకని పప్పు, నాలుగు కూరముక్కలు ఒక సత్తు పళ్ళెరంలో అతనికి ఇవ్వబడ్డాయి.

"ఏనుగు లన్నిటినీ చూశావా?" రొట్టెల్ని విరిచి నోటిలో పెట్టుకుంటూ వుండగా అతన్ని అడిగాడు నిర్వాహకుడు.

"అన్ని ఏనుగులు మంచి వయసుమీద వున్నాయి. ఒకే ఒక పిల్ల ఏనుగు వుంది. అది తల్లిమీద బెంగతో నీరసంగా కనిపిస్తోంది" చెప్పాడు శివుడు.

"వలలు వేసినప్పుడు దాని తల్లి తప్పించుకుపోయింది. రెండురోజులు గడిచినా పిల్లకోసం రాలేదు. మిగిలినవాటితో కలిపి పట్టుకు వచ్చేశాము. దాని పరిస్థితి చూస్తుంటే ఎన్నో రోజులు బతికేట్టు లేదు. పౌర్ణమి లోపల ప్రాణాలు వదిలేస్తుంది. తిండి తినటంలేదు" చెప్పాడు నిర్వాహకుడు.

ఎందుకనో వికలమైపోయింది శివుడి మనస్సు. ఆకలి అధికంగానే వున్నా పళ్ళెంలోని పదార్థాలను ఆరగించబుద్ధి కాలేదు. నిర్వాహకుడు చూడకుండా వాటన్నిటినీ తను అంతకుముందు ఒక పక్కగా పోగుచేసిన చెత్తకుప్ప మీదికి విసిరి ఇవతలికి వచ్చాడు.

"అయ్యవారు వచ్చి పాఠాలు ప్రారంభించి వుంటాడు. త్వరగా వెళ్ళిరా" మూసివున్న గజశాల ద్వారాల దగ్గర వుండే చిన్న తలుపును తెరుస్తూ అతనికి చెప్పాడు నిర్వాహకుడు.

పరుగులాంటి నడకతో బయలుదేరి పది నిమిషాల తరువాత రాజభవనం వెనుక భాగంలో వున్న ఒక పురాతన కాలపు భవనంలోకి పోయాడు శివుడు.

సాగరుల వారి సంరక్షణలో వున్న అనాథలే కాకుండా, నగరంలోని పిల్లలు మరికొంతమంది కూడా కనిపిస్తున్నారు అక్కడ.

పొడుగాటి వెదురుచువ్వను పట్టుకుని గాలిలో ఊపుతూ, కంచుగంట వంటి కంఠంతో పాఠ్యబోధన చేస్తున్నాడు అయ్యవారు.

"వినోదంలోను, విషాదంలోను, కరువులోను, అరాచకంలోను, రాజ సన్నిధిలోను, శ్మశానంలోను మనకి తోడుగా నిలిచేవాడే నిజమైన స్నేహితుడు" అంటూ ఆలస్యంగా వచ్చిన శివుడికేసి చురుకుగా చూశాడు ఆయన.

"అందరి మాదిరిగా బుద్ధిగా వుండరా నాయనా అని చెవిన ఇల్లు కట్టుకుని మరీ చెప్పాను. నువ్వు వినలేదు... ఆఖరికి నీ బతుకు గజశాలను శుభ్రంచేసే విధంగా మారిపోయింది" చెపుతున్న పాఠాన్ని వదిలేసి వెక్కిరించాడు.

ఫక్కున నవ్వారు పిల్లలు అందరూ. వెక్కిరింపుగా చూశారు శివుడి వంక. "మాకందరికీ స్నేహితులు వున్నారు అయ్యవారూ... పాపం, శివుడికి ఎవరూ లేరు... మీరు చెపుతున్న పాఠాలు వాడికి వర్తించవు" పెద్దకంఠంతో అన్నాడు ఒక పిల్లాడు.

రివ్వుమంటూ వచ్చేసింది కోపం శివుడికి. పిడికిలి బిగించి, అతనికేసి కదలబోయాడుగాని, అయ్యవారి చేతిలోని వెదురుచువ్వని చూసి ఆగిపోయాడు.

"వెళ్ళి కూర్చో... దూరంగా... చెత్తను శుభ్రం చేసేవారి దగ్గర్నించి చెడు వాసనలే వస్తాయి... మంచివి రావు" అంటూ తిరిగి తన పాఠ్యాంశాన్ని మొదలుపెట్టాడు అయ్యవారు.

ఆయన చెప్పినట్లు అందరికీ వెనుకగా, ఒక గోడకు ఆనుకుని కూర్చున్నాడు శివుడు.

సాగరుల వారి సతీమణి అడవిలో నుంచి చకోర పుష్పాలను తెచ్చిపెట్టమని అడిగినప్పటి నుంచీ క్షణం కూడా విశ్రాంతి లేదు అతనికి. నది ఒడ్డున నగరంలోని ఆకతాయి బాలురతో తలపట్లు పట్టడంతో మొదలయ్యాయి అతని బాధలు. వెలగపళ్ళు కోయటంతో తోటమాలి సహాయకులు వెంటబడి తరమటం, నదిలో ఈతలు కొట్టటం, ఆ తరువాత గజశాలలో పనిచేయటం అన్నీ అతనికి అదోరకమైన అలసటను కలిగించాయి.

అతనికి తెలియకుండానే మూతలు పడ్డాయి కళ్ళు. తను అయ్యవారి ఎదుట వున్న సంగతి మర్చిపోతుండగా తెలిసివచ్చింది ఆ కదలిక.

సంపంగి నగరం కట్టబడిన కొత్తల్లో నిర్మించబడిన పాతకాలపు భవంతి అది. చూడటానికి బలిష్టంగానే వున్నా ఎప్పుడో ఒకప్పుడు కూలిపోవడం తప్పనిసరి అని అనిపిస్తూ వుంటుంది.

"అనిపించటం వరకే... అంత తేలికగా కూలిపోదు... పిల్లలు పాఠాలు చదువుకోవటానికి, వినటానికి పనికివస్తుంది. మరేం ఫరవాలేదు" అని సాగరులవారే స్వయంగా ప్రకటించి వున్నారు.

ఆయన మాటలకు వ్యతిరేకంగా మాట్లాడగల తాహతు ఎవరికీ లేకపోవడం వల్ల అప్పటికి చాలా కాలంనించీ ఆచార్యులవారు అందులోనే పాఠ్యబోధన కొనసాగిస్తూ వస్తున్నారు.

కంచుగంట వంటి కంఠంతో ఆయన చెపుతున్న మాటల్ని వింటూ వున్నట్లయితే శివుడికి కూడా వచ్చి వుండేది కాదు అనుమానం. మాటల్ని వినకుండా కునికిపాట్లు పడబోతుండడం వల్ల తేలికగా అర్థం అయింది అతనికి.

"పారిపోండి... అందరూ బయటకి పారిపోండి" అని బిగ్గరగా అందరినీ హెచ్చరించబోయి... ఆఖరి క్షణంలో ఆగిపోయాడు అతను.

ఎవరు నమ్ముతారు తన మాటల్ని? మళ్ళీ ఏదో దురాలోచనతో అందర్నీ ఆటలు పట్టించటానికి అలా చేస్తున్నాడని అనుకుంటారు. వెక్కిరింపుగా చూస్తూ అక్కడే వుండిపోతారు.

చెపుతూ చెపుతూ వున్న పాఠాన్ని చటుక్కున ఆపి, శివుడివంక చూశాడు అయ్యవారు. "ఇప్పుడు ఏం చెప్పానురా శివుడూ?" అని ప్రశ్నించాడు.

గుబగుబలాడిపోతున్నాయి శివుడి గుండెలు... ఆ ప్రశ్నకు సమాధానం చెప్పకుండా తాను బయటికి పారిపోవచ్చు. ప్రాణాలు దక్కించుకోవచ్చు. మరి మిగిలినవారు??

ఏం చేయాలో అతనికి అర్థం కాకముందే బర్రున అతని దగ్గరికి వచ్చేశాడు అయ్యవారు. "పాఠం వినకుండా నిద్రపోతున్నావా? మడ్డిముఖమా, నిన్ను అసలు ఊరికే వదిలిపెట్టకూడదు.." అంటూ వెదురుచువ్వతో లాగిపెట్టి భుజం మీద ఒక దెబ్బ వేశాడు.

జివ్వుమన్నాయి శివుడి నరాలు... గావురుమనలేదతను. కనీసం బాధగా కనులు కూడా చిట్లించలేదు... ఎదురుగా నిలబడి ఇంకో దెబ్బ కొట్టటానికి సిద్ధపడుతున్న అయ్యవారి గుండెలమీద చెయ్యివేసి బలంగా వెనక్కి నెట్టాడు.

కాలు నిలదొక్కుకోవడం చేతకాక వెల్లకిల్లా పడిపోయాడు అయ్యవారు. ఆయన పక్కనుంచి ఎగిరి అవతలికి దూకి భవన ద్వారంలో నుంచి బయటికి పరిగెత్తాడు శివుడు.

"పట్టుకోండిరా వాడిని... గట్టిగా పట్టుకోండి... మండలాధిపతుల వారి దగ్గరికి తీసుకుపోయి కఠినమైన శిక్షను విధింపచేయాలి. పట్టుకోండి" గయ్‌మని అరుస్తూ లేచి నిలబడ్డాడు అయ్యవారు.

ఆడపిల్లలున్నారు విద్యార్థుల్లో. వాళ్ళు కూడా మిగిలినవారితో కలిసి గోల గోలగా అరుస్తూ బయటికి పరిగెత్తుకు వచ్చారు... నడుముకు దెబ్బ తగిలింది కాబోలు... నడుమును నొక్కుకుంటూ అయ్యవారు కూడా బయటికి వచ్చారు.

భూకంపం వచ్చినట్లు వికృత శబ్దాలు చేస్తూ విరిగిపడింది ఆ భవనం పై కప్పు. ఏనుగు తలకాయంత లావుగా వున్న కొండరాళ్ళు నేలమీద పడి దూరంగా దొర్లుకుంటూ పోయాయి... తెల్లటి దుమ్ము పొగమంచు మాదిరి ఆ ప్రదేశాన్నంతా ఆవరించుకున్నది.

❖ ❖ ❖

"**ఒ**క్కరోజు... ఒకే ఒక్కరోజులో ఇన్ని ఉత్పాతాలు సృష్టించటం అసలు ఎవరికైనా సాధ్యపడుతుందా?"

విపరీతమైన కోపంతో పళ్లు కొరుకుతూ మాట్లాడవలసింది పోయి, తీవ్రమైన ఆశ్చర్యంతో గుండెలమీద చెయ్యి వేసుకుంటున్నట్టు అస్పష్టంగా అడిగాడు మండలాధిపతి సాగరుడు.

చెప్పాపెట్టకుండా, ఎటువంటి హెచ్చరికలు లేకుండా, నిట్టనిలువుగా కూలి పడిపోయిన భవనాన్ని చూడటానికి వచ్చారాయన సపరివార సమేతంగా.

రాళ్ళగుట్టల కింద చిన్నారులెవరయినా చిక్కుపడ్డారేమోనన్న భయం కలిగింది ఆయనకి, వచ్చీ రావటంతోనే.

"ఎవరూ లేరు...ఆ దుర్మార్గపు శివుడిని పట్టుకోవడానికి అయ్యవారితో సహా అందరూ బయటికి పరిగెత్తుకు వచ్చారు." పక్కనే నిలబడి చెవిలో ఊదాడు ఆయనకంటే ముందుగా అక్కడికి వచ్చి పరిస్థితినంతా ఆకళింపు చేసుకున్న మహేశ్వరుడు.

"మండలేశ్వరుల వారు ఈసారయినా మనసుపెట్టి నా మనవిని చిత్తగించాలి. ఆ శివుడు వట్టి పొగరుబోతు. ఈ సృష్టిలో ఏ విద్యార్థి చేయకూడని పని ఈరోజు అతను చేశాడు" శివుడు వెనక్కి నెట్టడం వల్ల నడుముకు దెబ్బ తగిలిన ప్రదేశాన్ని ఇంకా వత్తుకుంటూనే ఆరోపించాడు అయ్యవారు.

శివుడిని పట్టుకోవటానికి బిలబిలలాడుతూ బయటికి వచ్చిన తర్వాత, తాము ఎటువంటి ప్రమాదాన్నించి తప్పించుకున్నారో తెలిసివచ్చింది విద్యార్థులందరికీ. వచ్చిన పని మరచిపోయి కళ తప్పిన వదనాలతో రాళ్ళగుట్టగా మారిపోయిన భవనం వంకే చూస్తున్నారు వారందరూ.

"చెప్పండి... ఆ ఆకతాయి చేసింది ఏమిటో మీరందరూ చెప్పండి" వారివంక చూస్తూ జీరపడిన కంఠంతో ఆజ్ఞ ఇచ్చాడు అయ్యవారు.

మండలేశ్వరుల వారి ముందు నోరు విప్పే ధైర్యం వారిలో ఎవరికీ లేకపోయింది. తలలు వంచుకుని మౌనంగా నిలబడిపోయారు.

"వాడు... వాడు తల్లి ఎవరో తండ్రి ఎవరో తెలియని అనాథ. నన్ను గుండెలమీద చెయ్యివేసి వెనక్కి నెట్టాడు... కులమేమిటో గోత్రమేమిటో అసలు ఎవరికి ఏ విధంగా పుట్టాడో తెలియని ఒక అనామక అర్భకుడు" అంటూ ఆక్రోశాన్ని వెళ్ళగక్కటానికి సిద్ధం అయ్యాడు అయ్యవారు.

"అయ్యవారూ... అంతటితో చాలు ఆపండి..." వున్నట్లుండి పిడుగులాంటి కంఠంతో బిగ్గరిగా అన్నాడు మండలాధిపతి.

అదిరిపడి మాటల్ని ఆపేశాడు అయ్యవారు. తను మాట్లాడుతున్న దాంట్లో తప్పు ఏమున్నదో అర్థంకాక అయోమయంగా చూశాడు.

"దారి తప్పబోతున్న వారికి జ్ఞానాన్ని ప్రసాదించి సరైన దారిని చూపించ వలసిన పెద్దవారు మీరు. కాశీలో ఉద్దండ పండితుల దగ్గర విద్యాభ్యాసం చేసి వచ్చినవారు. అనాగరికుల మాదిరి మీరే ఎదుటివారి పుట్టు పూర్వోత్తరాలను ఎంచటం తగదు. పుట్టుకను బట్టి ఎవరూ గొప్పవాళ్ళు కాలేరు. ప్రవర్తనను బట్టే అందరికీ ఆదరాభిమానాలు లభిస్తాయి. ఇంత చదువు చదువుకుని కూడా మీరు సామాన్యుడి మాదిరిగా..." ఎర్రబడిన కనులతో కోరగా చూస్తూ మాటలు మొదలుపెట్టాడు మండలాధిపతి.

చూస్తూ వుంటే మాటల జోరుతోపాటు ఆయన కోపం కూడా అధికం అయిపోతుందని తెలిసిపోయింది మంత్రి మహేశ్వరుడికి. నోరు తెరుచుకుని నిలబడిపోయిన అయ్యవారి తల వాచిపోతుందని కూడా అర్థమయింది.

"ప్రభూ...మీరు దయచేసి కాస్తంత శాంతించండి. చూస్తూ చూస్తూ వుండగానే కళ్ళ ఎదుట భవనం కూలిపోవటం వల్ల కొంచెం కలతకు గురి అయినట్లున్నారు మన అయ్యవారు. నేను మాట్లాడతాను. మీరు చూస్తూ నిలుచోండి" అని మండలాధీశుడికి చెప్పి, శివుడు మీ వంటిమీద చెయ్యి వేయటం ముమ్మాటికీ తప్పే... కాని అతను అలా చేసి వుండకపోతే మీరు, మీ విద్యార్థులు అందరూ ఆ రాళ్ళగుట్టల క్రింద పడి సజీవ సమాధి

అయిపోయేవారు. అతను మిమ్మల్ని నెట్టాడన్న కక్షతోనే కదా మీరందరూ అతన్ని పట్టుకునే పనిమీద భవనంలో నుంచి బయటికి వచ్చింది?" అని అయ్యవారిని అడిగాడు.

మండలాధీశుడి ముందు నోరు మెదపలేకపోయినా మహేశ్వరుడితో మాట్లాడటానికి మాత్రం మహా ఉత్సాహం చూపించారు అయ్యవారు.

"మీరు చెప్పింది నిజమే కాని కాకతాళీయంగా జరిగిన మంచిని మాత్రమే చూసి హర్షించి వదిలేస్తారా? వాడు చేసిన ఘోర తప్పిదాన్ని మర్చిపోయారా?" దురుసుగా అడిగాడు.

శాంతంగా మాట్లాడి ఆ సమస్యను శాంతియుతంగానే పరిష్కరించాలని అనుకుంటున్న మంత్రి మహేశ్వరుడికి కూడా ముంచుకు వచ్చింది కోపం ఒక్కసారిగా.

"తప్పులు ఎవరు చేశారో నిర్ణయించవలసింది మండలాధిపతుల వారు. మీరు కాదు. ఎవరిని శిక్షించాలో ఎవరిని క్షమించాలో కూడా తెలియచెప్ప వలసింది ప్రభువులు మాత్రమే. మీరు కాదు. మీరు మీ అసంతృప్తిని మాత్రమే వెల్లడించటానికి అర్హులు. మర్చిపోకండి" తీవ్రస్వరంతో హెచ్చరించాడు.

ఎప్పుడు చూసినా పరమ శాంతమూర్తి మాదిరి చిరునవ్వుతో కనిపించే మంత్రి మహేశ్వరుడి కోపాన్ని చూసేసరికి చెమటలు ప్రత్యక్షం అయ్యాయి అయ్యవారి వదనం మీద.

"అన్యాయం జరిగిందన్న ఆక్రోశంతో అధికంగా మాట్లాడి వుంటే నన్ను మన్నించండి ప్రభూ..." తలవంచి సాగరులవారికి అభివాదం చేస్తూ క్షమాపణ చెప్పుకున్నాడు ఆయన వెంటనే.

"మహేశ్వరా... ఈ మాటలన్నీ అప్రస్తుతం... ముందు ఆ ఆకతాయిని మన ముందుకు పిలవండి" గంభీరంగా ఆజ్ఞ ఇచ్చారు సాగరులవారు.

విద్యార్థులందరికీ దూరంగా నిలుచుని వున్నాడు శివుడు. వెంటనే ఆయన ఎదుటికి వచ్చి తల వంచుకుని నిలబడ్డాడు.

పళ్ళు పటపటమని కొరుకుతూ, విపరీతమైన కోపంతో ముఖమంతా ఎర్రబడిపోతుండగా, దారుణాతి దారుణమైన శిక్షను ప్రకటిస్తాడని విద్యార్థులు అందరూ అనుకున్నారు. ఊపిరి బిగపట్టి అయ్యవారు కూడా ఎదురు చూశాడు.

"నీకు ఎటువంటి శిక్షను విధిస్తే నీ దుందుడుకుతనం దారిలోకి వస్తుందిరా శివుడు? నీ అల్లరిని ఆపటానికి నీకు ఏ శిక్షను విధించాలి?" మెత్తటి కంఠంతో అనునయంగా అడిగాడు మండలాధిపతి.

వంచిన తల ఎత్తలేదు శివుడు. సమాధానం చెప్పలేదు.

"ఒక్క నిమిషం పాటు కుదురుగా ఒకే ప్రదేశంలో నిలుచోవటం నీకు చేతకాదు. చిల్లర పనులు చేసి చీటికి మాటికి నేరస్తుడిగా పిలువబడటం నీకు సంతోషాన్ని కలిగిస్తుందేమో గాని మాకు మహా తలనొప్పిగా మారింది. చిన్నవాడివి, అభం శుభం తెలియని పసివాడివి కాబట్టి ఈసారి కూడా నిన్ను నామమాత్రపు శిక్షతో వదిలిపెడుతున్నాను..." అంటూ మహేశ్వరుడి కేసి చూశాడు సాగరులవారు.

"గజశాలలోనే మరో మాసం పాటు గడపవలసిందింగా చెప్పండి ప్రభు! అయ్యవారి దగ్గరికి రావాల్సిన అవసరం లేదని కూడా నిర్ణయించండి" అందించాడు మహేశ్వరుడు.

అతను చెప్పిన మాటకు సామాన్యంగా ఎదురు చెప్పడు మండలాధిపతి. క్షణికం పాటు కూడా ఆలోచించకుండా తల ఊపేస్తాడు. ఆరోజు మాత్రం అనంగీకారసూచకంగా తల అడ్డం తిప్పాడు.

"మదించిన ఏనుగుల మధ్య ప్రాణాలు అరచేత పెట్టుకుని పని చేస్తాడనీ, ఆ భయం కారణంగా తన అల్లరిని మర్చిపోతాడని అనుకుని అక్కడికి పంపాం మనం... ఆ శిక్ష వీడికి సరిపోదని నాకు తేటతెల్లం అయింది. నలుగురు భటుల్ని తోడు ఇచ్చి ముడుపుల గట్టు దగ్గరికి పంపించండి. రెండు పగళ్ళు మూడు రాత్రులు వంటరిగా అక్కడ గడిపిన తర్వాత తిరిగి నగరంలోకి ప్రవేశాన్ని కల్పించండి" అన్నాడు.

తెల్లబోయారు అక్కడికి చేరుకున్న వారందరూ... విద్యార్థుల్లో కొందరికైతే కళ్ళవెంట నీళ్ళు వచ్చేశాయి.

నడుమును అదేపనిగా అదుముకుంటూ నిలబడి వున్న అయ్యవారి ముఖంలో వెంటనే ప్రత్యక్షం అయ్యాయి ఆనందఛాయలు.

"సరైన శిక్ష ప్రభూ.. దయ్యాలకు భూతాలకు ఆలవాలం ఆ ముడుపుల గట్టు... క్రూర మృగాలకు ఆవాస స్థానం... వంటరిగా ఆ ప్రదేశంలోకి

పోవటం అంటే ప్రాణాలమీద ఆశను వదిలేసుకోవటమే... ఈ దెబ్బతో ఈ ఆకతాయి పొగరు దిగిపోతుంది..." అంటూ మొదలుపెట్టి మహేశ్వరుడు తనకేసి చురుకుగా చూడటంతో మాటల్ని మధ్యలోనే మింగేశాడు.

"మహేశ్వరా! వెంటనే పంపించు. ఆలస్యం చేయకు" ఏదో చెప్పటానికి ప్రయత్నించబోతున్న మంత్రిని వెంటనే హెచ్చరించాడు మండలాధిపతి.

దూరంగా నిలబడి వున్న భటుల్లో నలుగురిని దగ్గరికి పిలిచి ఆయన ఆజ్ఞలను వారికి వినిపించాడు మహేశ్వరుడు.

తల వంచుకుని నిలబడి వున్న శివుడిని నెట్టుకుంటూ ఆ ప్రదేశంలో నుంచి అవతలికి తీసుకుపోయారు వాళ్ళు.

❖ ❖ ❖

"అన్యాయం ప్రభూ... మీరు చేసింది ఒట్టి దురన్యాయం... అయ్యవారితో సహా ఇంతమంది ప్రాణాలను కాపాడిన శివుడికి మీరు శిక్ష విధించటం మహా పాపం... ఒక్కపూట కూడా ఆకలికి ఆగలేని ఆ పసివాడు వంటరిగా ఆ కీకారణ్యంలో ఎలా గడపగలడు? తన పుట్టుక గురించి తెలియకపోవటం వల్లనే కదా వాడు మీకందరికీ లోకువ అవటం?" ఉద్యానవనంలో జరిగినదంతా అంతఃపుర పరిచారికల ద్వారా తెలుసుకుని, సాగరుడు మందిరంలోకి రాగానే ద్వారం దగ్గిరే నిలబెట్టి సూటిగా అడిగింది అతని భార్య చారులత.

కోపంగా చూడటమో, బాధగా నిట్టూర్చటమో రెంటిలో ఏదో ఒకటి చేయవలసిన సాగరులవారు, ఆ పనులేవీ చేయలేదు సరికదా చిన్నగా నవ్వి, ఆమె బుగ్గలమీద సరసంగా చిన్న చిటికె వేశారు.

"వయస్సు అధికం అవుతున్నకొద్దీ ప్రభువుల వారి సరాగాలు కూడా ఎక్కువ అవుతున్నాయి. నా ప్రశ్నకు సమాధానం చెప్పకపోతే నేను ఊరుకునేది లేదు..." మూతిని ముడుస్తూ అన్నది ఆమె.

"వచ్చే పౌర్ణమి నాటికి పిల్లల విద్యాభ్యాసం పూర్తి అయిపోబోతున్నది. వారి వారి అర్హతలను పరీక్షించి వారికున్న నేర్పును బట్టి సైన్యంలోనో, సభామందిరంలోనో బ్రతకటానికి పనికివచ్చే వృత్తి విద్యలను ఆరంభించాలి" భుజం మీది ఉత్తరీయాన్ని తీసి పక్కన పడేసి ఒక సుఖాసనంలో చేరగిలబడుతూ చెప్పాడు సాగరులవారు.

"నేను అడుగుతున్నదేమిటి మీరు చెపుతున్నదేమిటి?" అయోమయంగా అడిగింది చారులత.

"పౌర్ణమిరోజున పిల్లలందర్నీ సభా మందిరంలోకి పిలిపించి, సైన్యాధికారుల ఎదుట, సభా వ్యవహారాలను చూసే ముఖ్యమంత్రుల ఎదుట వారి వారి అర్హతలను పరీక్షించటం జరుగుతుంది. ఎంతో కాలంగా మనం అనుసరిస్తున్న సంప్రదాయం అది" ఆమె మాటల్ని పట్టించుకోకుండా చెప్పుకుంటూ పోయాడు సాగరుడు.

"ఇది నాకు తెలిసిన విషయమే. పని కట్టుకుని ఇప్పుడు చెప్పటం దేనికి?"

"ఎందుకంటే ఎంతో కాలంగా మనం అనుసరిస్తూ వస్తున్న ఆ సంప్రదాయానికి శివుడి విషయంలో కొద్దిగా మార్పు చేయబోతున్నాను కాబట్టి."

"నాకు అవగతం కాలేదు ప్రభూ... వివరంగా చెప్పండి" గోముగా అడిగింది చారులత.

"శివుడి శక్తియుక్తులు ఎంతటివో, అతని నిజమైన బలం ఏమిటో ఎవరికీ తెలియదు. వాడు అల్లరి చేస్తాడన్న మాట ఒక్కటే బయటికి వస్తోంది గాని, ఆ అల్లరి వెనుకే వాడు చేసే కొన్ని కొన్ని మంచిపనులను గురించి ఎవరూ పట్టించుకోవటం లేదు. అందుకే మేము వాడికి కొంచెం క్రూరంగా కనిపించే శిక్షలు విధిస్తున్నాము. అర్హత పరీక్షలు ఆరంభం అయ్యేనాటికి వాడి పూర్తి శక్తి ఏమిటో మాకు తెలియాలి."

రెండు క్షణికాల తర్వాత వున్నట్లుండి చిరునవ్వు నవ్వింది చారులత. "పరిచారికలు చెప్పింది విని అనవసరంగా మిమ్మల్ని అనుమానించాను... నన్ను క్షమించండి" అన్నది.

తను కూడా నవ్వి ఆమెను దగ్గరికి తీసుకున్నాడు సాగరుడు.

"చీకటి పడితే చాలు రాజభవనంలోని తమ మందిరాన్ని వదిలి వెలుపలికి పోవటానికే భయపడతారు పిల్లలు అందరూ... ముడుపుల గట్టు దగ్గర పాపం శివుడు వంటరిగా ఎలా గడపగలడో!" అన్నది ఆమె.

❖ ❖ ❖

నెత్తిమీద నిప్పులకుండ పెట్టుకుని, మానవుల ఎముకల్ని హారాలుగా చేసి మెడలో వేసుకుని, బుగ్గల మీదికి పొడుచుకు వచ్చిన కోరలతో, చింతనిప్పుల వంటి కళ్ళతో, భయంకరంగా చూస్తూ వస్తుందట కొరివి భూతం. కనిపించిన వారందర్ని కరకరమని నమిలి మింగేస్తుందిట...

నిద్రపోకుండా అటూ ఇటూ మెసులుతున్న పిల్లల్ని త్వరగా నిద్ర పుచ్చటానికి నాలుగైదేళ్ళ క్రితం వరకూ అంతఃపురం దాసీలు చెప్పిన మాటలన్నీ వరుసపెట్టి గుర్తుకురావడం మొదలుపెట్టాయి శివుడికి.

సంపంగి నగరానికి ఏడు క్రోసుల దూరంలో వుంటుంది ముడుపుల గట్టు. దట్టమైన అడవి మధ్య నిట్టనిలువుగా కనిపించే చిన్నకొండగుట్ట అది.

చీకటి పడబోతున్న సమయంలో అతన్ని అక్కడికి తీసుకువచ్చి ఒక వటవృక్షం క్రింద వదిలిపెట్టారు మహేశ్వరుడు పంపించిన రాజభటులు. మూడు రాత్రులు రెండు పగళ్ళకు సరిపడే ఆహారాన్ని ఒక మూటగా కట్టి అతనికి ఇచ్చారు.

"గడువు తీరిన వెంటనే వచ్చి చూస్తాము. బతికి వుంటే నగరానికి తీసుకు పోతాము. లేకపోతే వట్టిచేతులతో వెళ్ళిపోతాము" వెక్కిరింపుగా చెప్పి, ఒక్క క్షణం కూడా ఆలస్యం చేయకుండా వెళ్ళిపోయారు.

ఆహారపు మూటను ఒక మర్రిఊడకు ఉట్టి మాదిరిగా కట్టి చెట్టు మొదలుకు చేరగిలబడబోయాడు శివుడు.

బుస్సుమని రొద చేస్తూ ఆ ప్రదేశంలో కింద పడి వున్న ఎండుటాకుల్లో నుంచి తలను బయటికి పెట్టింది ఒక పాము.

అదిరిపడి వెనక్కి దూకాడే గాని, భయపడి దూరంగా పారిపోలేదు శివుడు. అసలు పారిపోవాలని కూడా ఎందుకనో అనిపించలేదు అతనికి.

"ఈ చెట్టు నీ సొత్తు కాదు. ఈ భూమి నీ ఆస్తి కాదు. నలుగురితోను పంచుకోవాల్సిన ప్రదేశం. నువ్వే అవతలికి వెళ్ళు..." అంటూ, దగ్గర్లో కనిపించిన ఒక చిన్నచెట్టు కొమ్మను పట్టుకుని, దాని తలకు దగ్గరగా నేలమీద బలంగా కొట్టాడు.

బుస అయితే కొట్టింది గాని, అతనిమీదికి ఎగబడే ప్రయత్నం మాత్రం చెయ్యలేదు ఆ పాము.

తలను దించుకుని గబగబా అవతలికి పాక్కుంటూ వెళ్ళిపోయింది. చేతిలోని చెట్టుకొమ్మతోనే ఆ ప్రదేశాన్నంతా శుభ్రం చేసుకుని, నెమ్మదిగా కూర్చున్నాడు శివుడు.

చీకట్లు దట్టంగా అలుముకోవటం మొదలుపెట్టాయి. రాత్రి సమయంలో సంచరించే మృగాలన్నీ బద్దకాన్ని వదిలించుకుని వేటకు బయలుదేరటం మొదలుపెట్టాయి.

మర్రి ఊడకు కట్టిన మూటని కిందికి దించి, అందులో వున్న ఆహారంలో కొద్దిభాగాన్ని ఆరగించాడు శివుడు. మూటతో పాటు ఇవ్వబడిన సొరకాయ బుర్రలోని నీటితో దాహం తీర్చుకుని, నెమ్మదిగా మర్రిచెట్టు మీదికి ఎగబ్రాకాడు. లావుగా వెడల్పుగా వున్న కొమ్మనొకదాన్ని ఎంచుకుని, దానిమీద మేను వాల్చబోతుండగా అతని దృష్టిపథంలోకి వచ్చింది ఒక వెలుగు.

అంతఃపురంలోని దాసీలు అందరూ చెప్పే కథలన్నీ వెంటనే మనసులో మెదిలి, అతని వళ్ళు గగుర్పొడిచిన మాట వాస్తవం. అయితే దగ్గరికి రావటం లేదు ఆ వెలుగు. అతను ఎక్కి కూర్చున్న వృక్షానికి రెండు వందల దరువుల దూరంలో స్థిరంగా ఒకే ప్రదేశంలో నిలబడి వున్నది.

పది నిమిషాల పాటు పట్టి పట్టి చూసిన తర్వాత శివుడి మనసులోని అలజడి మటుమాయమై, దాని స్థానంలో అడుగుపెట్టింది కుతూహలం.

కొరివి భూతాలకు సంబంధించిన వెలుగు కాదు అది. అడవిలోకి వచ్చిన మనుషులే ఎవరో, క్రూరమృగాలు తమ మీదికి రాకుండా వెలిగించిన నెగడు అయివుంటుంది.

ఆ మాట మనసులో మెదిలిన వెంటనే చెట్టు కొమ్మమీదినించి జర్రున జారి నేలను తాకాడు అతను. ఆహారపు మూటను, సొరకాయ బుర్రను అక్కడే వదిలి వేగంగా నడిచాడు ఆ వెలుగు కనిపించిన దిశలోకి.

దట్టంగా ఎదిగివున్న చెట్లను, పొదలను అధిగమించటానికి అర్ధఘడియ పైగానే పట్టింది అతనికి. పిడిబాకుల వంటి ముళ్లను కలిగి వున్న ఒక పొదను దాటి అవతల పక్కకు చూసిన వెంటనే తెలిసివచ్చింది అతనికి తన ఊహ యదార్థమన్న సంగతి.

ఎండిపోయిన కొమ్మల్ని, పొదల్ని ఏరుకు వచ్చి పెద్ద మంట వేశారు పదిమంది దృఢకాయులు. దానిచుట్టూ వలయాకారంలో కూర్చుని, చిన్న చిన్న కంఠాలతో ఏవేవో మాట్లాడుకుంటున్నారు.

పిలవని పేరంటంలా వచ్చిన తనను చూసి వాళ్ళు ఎలా ప్రవర్తిస్తారో తెలియకపోవటం వల్ల ముళ్ళపొద దగ్గిరే ఆగిపోయి, చెవులు రిక్కించాడు శివుడు.

"మనం చాలా ఆలస్యంగా వచ్చాము. సరిగ్గా నెలరోజుల క్రితమే ఈ పరిసరాలన్నీ గాలించి పెద్ద ఏనుగుల మందను పట్టుకుపోయాడు సంపంగి నగర మండలేశ్వరుడు..." అంటున్నాడు ఒక దృఢకాయుడు.

"మనం అడవిలోకి రాకముందు తెలియవలసిన మాట అది. వచ్చిన తర్వాత నీకు మాత్రమే ఎలా తెలిసింది?" అడిగాడు ఒక మనిషి.

"ఇందాక చీకటి పడకముందు కట్టెల కోసం వచ్చిన ఒక ముసలివాడు చెప్పాడు. ఒక ఆడ ఏనుగు, ఒక మగది మాత్రం తప్పించుకుని ఈ గట్టు దగ్గరికి వచ్చాయట" అన్నాడు మొదటి మనిషి.

"పది ఏనుగుల దంతాలను సేకరించుకు వస్తామని చెప్పి ముందస్తుగా రెండువందల నాణేలను తీసుకున్నాము. ఈ ప్రదేశంలో ఏనుగులు ఏవీ కనిపించకపోతే మన శ్రమ అంతా వృథా అయిపోతుంది. ముందస్తుగా ఇచ్చిన నాణేలను తిరిగి తనకు వడ్డీతో సహా ఇచ్చేయమని కనకయ్య శ్రేష్ఠి వత్తిడి చేస్తే చిక్కులో పడతాము" సాలోచనగా అన్నాడు మూడో దృఢకాయుడు.

అడవుల్లో సంచరించే ఏనుగుల్ని వేటాడి వాటి దంతాలను అపహరించే దొంగల గుంపు తన ఎదుట వున్నదని వెంటనే తెలిసిపోయింది ఆ మాటల్ని వింటున్న శివుడికి.

సంపంగి నగరం చుట్టూ వున్న అడవులకు ఆవలగా వుంటుంది శ్రావస్తి నగరం. సమరపాలుడు దానికి మండలాధిపతి. అతని నగరంలోనే అత్యంత ధనికుడు ఈ దొంగలు చెపుతున్న కనకయ్య శ్రేష్ఠి.

ఏనుగు దంతాలతో చేయబడిన రకరకాల వస్తువులతో చాలా పెద్ద వ్యాపారం చేస్తాడని పేరు అతనికి. గట్టిగా మాట్లాడితే శ్రావస్తి నగరంలోనే కాదు జ్వలిత సామ్రాజ్యంలో భాగాలయిన ఇరువది నాలుగు మండలాల్లోను అతన్ని మించిన వ్యాపారస్థుడు ఎవరూ లేరని చెప్పుకుంటూ వుంటారు.

జ్వలిత సామ్రాజ్యానికి చక్రవర్తి మహాబలుడు. ఒక్కతే కూతురు ఆయనకి. పేరు జ్వాల.

ఏనుగు దంతాలతో చేయబడిన బొమ్మలంటే ఆమెకు ప్రాణమని, ఆ బొమ్మల్ని ఆమెకు బహుమతులుగా ఇస్తూ కనకయ్య శ్రేష్ఠి చక్రవర్తికి చాలా సన్నిహితుడయ్యాడని, అందుకే అనుమతి లేకుండా ఎన్ని ఏనుగుల్ని చంపించినా ఎవరూ పట్టించుకోరన్న ఒకమాట సంపంగి నగరంలో చాలా తరచుగా వినబడుతూ వుంటుంది.

ఇప్పుడు తన అదృష్టమో దురదృష్టమో ఆ నట్టడివిలో ఎదురయినవారు ఆ కనకయ్య శ్రేష్ఠి పంపించిన దొంగలు.

తల పక్కకు తిప్పుకుని తన దారిన తను వెనక్కి వెళ్ళిపోవటమే మేలు.

ఎలా నిలబడినవాడు అలాగే నిశ్శబ్దంగా వెనక్కి తిరిగాడు శివుడు. రెండు అడుగులే వేశాడు అతను. మూడో అడుగు వేయబోతుండగా అడ్డువచ్చిన పొదల్ని ఎగిరెగిరి అధిగమిస్తూ వచ్చాడు అక్కడికి మరో దృఢకాయుడు.

అతనికి కనిపించకుండా వుండటం కోసం గబుక్కున పొరబాటున బోర్లా పడుకున్నాడు శివుడు.

"మన పంట పండింది. బారెడు బారెడు పొడుగున్న దంతాలతో ఒక ఏనుగు ఇక్కడికి దగ్గర్లోనే కనిపించింది" చితుకులమంట దగ్గరికి పోతూనే పెద్దగా అన్నాడు కొత్తగా వచ్చిన దృఢకాయుడు.

"దాంతోపాటు ఇంకో ఆడ ఏనుగు కూడా కనిపించిందా?" అని అడిగాడు మంట దగ్గర వున్న దృఢకాయుడు.

ఆశ్చర్యం ప్రతిఫలించింది కొత్తగా వచ్చిన మనిషి మొఖంలో. "అవును. అది పెద్ద బురద గుంటలో చిక్కుపడిపోయి వుంది. మగ ఏనుగు దాన్ని బయటికి లాగటం చేతకాక ఆ గుంటచుట్టూ తిరుగుతోంది. మీకు ఎలా తెలుసు?" అని అడిగాడు.

"ఎలాగోలా తెలిసింది గాని, ఇప్పుడు మనం ఏం చేయాలో నువ్వు చెప్పు. ఈ అడవిలో ప్రస్తుతం ఆ రెండు మాత్రమే వున్నాయి. కనకయ్య శ్రేష్ఠికి తృప్తి కలిగించాలంటే మనం ఇంకో అరణ్యంలోకి వెళ్ళాల్సిందే" అన్నాడు మంట దగ్గరి దృఢకాయుడు.

"ఎలాగూ వచ్చాంకాబట్టి మగ ఏనుగును మట్టుబెట్టేద్దాం. దాని దంతాలను తీసుకుని వెళ్ళిపోదాం. ఇందులో ఆలోచించటానికి వేరే ఏమీలేదు" అన్నాడు కొత్తగా వచ్చిన మనిషి.

"మంటని పెద్దది చేసి అందరూ నిద్రలు పొండి. వెలుగు రాగానే వెళ్ళి పని పూర్తి చేసుకోవాలి" అంటూ మంటకి కొంచెం దూరంగా కూర్చుని వున్న ఇంకో దృఢకాయుడిని దగ్గరికి పిలిచాడు మంట దగ్గరి మనిషి.

"అనుమతి లేకుండా తన అడవిలోకి వేటాడటానికి వచ్చేవారంటే సాగరుడికి మహా చెడ్డ కోపం. పట్టుబడితే మర్రిచెట్లకు ఉరి తీయిస్తాడు. నువ్వు మన ఉనికి ఎవరికీ తెలియకుండా కాపలా కాయాలి" అని చెప్పాడు.

పొడవాటి బరిశెను తీసుకుని ఏ పొదచాటున శివుడు దాగుని వున్నాడో ఆ పొద దగ్గరికి వచ్చి నిలుచున్నాడు ఆ దృఢకాయుడు.

ఇరకాటంలో చిక్కుకుపోయాడు శివుడు. కదిలినా, మెదిలినా గట్టిగా గాలిని పీల్చి వదిలినా రట్టు అయిపోతుంది తన గుట్టు.

రెండో ఆలోచన చేయరు వాళ్ళు. గొంతు పిసికి చంపేస్తారు. గొయ్యి తవ్వి ఎవరికీ కనిపించకుండా పాతిపెట్టేస్తారు.

చప్పుడు కాకుండా తాను తప్పించుకోవాలి. ఎలా?

బరిశెను బిగించి పట్టుకుని రాతిస్తంభం మాదిరి కదలిక లేకుండా నిలుచుని వున్న ఆ దృఢకాయుడి వంకే దీక్షగా చూడడం మొదలుపెట్టాడు శివుడు.

పది... పన్నెండు... ఇరవైనాలుగు క్షణికాల తరువాత కనిపించింది ఆ వ్యక్తిలో చిన్న కదలిక. ఒంటరిగా నిలుచుని వుండడం విసుగ్గా వుంది కాబోలు... తలను మాత్రం వెనక్కి తిప్పి నెగడు దగ్గర నిద్రల్లోకి జారుకుంటున్న తన సహచరులవంక చూశాడు అతను.

మెరుపుకంటే వేగంగా కదిలింది శివుడి చేయి. నేలను తడిమి, చేతికి అందిన చిన్న పలుకురాయిని తీసి దూరంగా విసిరాడు.

కన్ను మూసి కన్ను తెరిచేటంతలో జరిగిపోయింది పని. వెనక్కి తిరిగిన దృఢకాయుడు తల తిప్పి ముందుకు చూసేసరికి, ఎప్పటి మాదిరిగానే కదలకుండా పడుకున్నాడు శివుడు.

గింగిరాలు తిరుగుతూ గాలిలోకి లేచింది అతను విసిరిన పలుకురాయి. వేగంగా పోయి పాతిక అడుగుల దూరంలో వున్న పెద్ద చెట్టు దగ్గర పడి దబ్బుమని శబ్దం చేసింది.

బరిశె మొనను భూమికి ఆనించి తన బరువునంతా దానిమీద వేసి కుశాలుగా నిలబడి వున్న ఆ దృఢకాయుడిలో వెంటనే కనిపించింది ఉలికిపాటు. బరిశెతో పాటు, తన నడుముచుట్టూ వున్న దట్టీలో నుంచి పొడుగాటి చురకత్తిని బయటికి లాగుతూ, పెద్దపులిలా శబ్దం వినవచ్చినవైపుకు పోయాడు.

ఆ పైన ఒక అర నిమిషం కూడా ఆలస్యం చేయలేదు శివుడు. అతివేగంగా పైకి లేచి అమాంతం ఇంకో పొదచాటుకు దూకాడు.

"ఎవరు? ఎవరు పొద దగ్గర ఎవరు?" అతను కదిలిన శబ్దాన్ని ఆలకించి, పెద్ద కంఠంతో అడుగుతూ ఈసారి రెట్టించిన వేగంతో వెనక్కి వచ్చాడు దృఢకాయుడు.

రెండో పొద దగ్గరే వుండిపోవాలని పొరపాటున కూడా అనుకోలేదు శివుడు. అక్కడికి పోయిన వెంటనే జాగ్రత్తలన్నిటినీ గాలికి వదిలేసి పాదాలకు పని చెప్పాడు.

దట్టంగా వున్న చీకట్ల మూలకంగా సరిగ్గా చూడలేకపోయినా, అడుగుల శబ్దాన్ని బట్టి పరిగెత్తుతున్నది ఎవరో మనిషేనని గ్రహించాడు దృఢకాయుడు.

"పట్టుకోండి... పారిపోతున్న వాడిని పట్టుకోండి. లేవండి" అంటూ బిగ్గరగా కేకలు పెట్టాడు.

చకచకా లేచారు చితుకుల మంట దగ్గర నిద్రలు పోతున్న దొంగలు అందరూ. తమ తమ ఆయుధాల్ని పట్టుకుని పొదల్లోకి పరిగెత్తుకు వచ్చారు.

పట్టుబడే ఉద్దేశ్యం లేకపోవడం వల్ల ఎక్కడా ఆగకుండా సూటిగా తన ఆహారపు మూటను తగిలించుకున్న మర్రిచెట్టు దగ్గరికి వచ్చేశాడు శివుడు. అక్కడే నిలబడి తాత్సారం చేస్తే ప్రమాదం తరుముకుంటూ వచ్చేస్తుందని తెలుసు కాబట్టి, మర్రిచెట్టు వెనుక భాగంలో కనిపించిన ఒక కాలిబాట మీదుగా మరోసారి పరుగు ప్రారంభించాడు.

రొప్పుతూ రొప్పుతూ నాలుగు నిమిషాల తరువాత ఆ చెట్టు దగ్గరికి చేరుకున్నారు దొంగలు.

"మనం అనవసరంగా కంగారుపడ్డామని నాకు అనిపిస్తోంది. మనవాడు విన్న అడుగుల చప్పుడు మనుషులవై వుండవు. చీకట్లో మందనించి తప్పిపోయిన కోతిదో, కొండముచ్చుదో అయివుంటాయి" మర్రిచెట్టు క్రింద నిలబడి చుట్టూ చూస్తూ అన్నాడు గుంపులోని దొంగ ఒకతను.

కాలిబాట మీదికి పోతూ పోతూ అంతకుముందు వూడలకు వేలాడతీసిన సొరకాయబుర్రని, ఆహారపు మూటనీ అక్కడే వదిలిపెట్టకుండా వెంట తీసుకుపోయాడు శివుడు. అందువల్ల రట్టు కాలేదు అతని గుట్టు.

"జరిగిందేదో జరిగిపోయింది. ఏదో ఒక విధంగా తెల్లవారే వరకు గడిపి వచ్చిన పని పూర్తి చేసుకుపోదాం. పదండి వెనక్కి" అంటూ చితుకుల మంట దగ్గరికి దారితీశాడు దొంగల నాయకుడు.

❖ ❖ ❖

నడుము ఎత్తున గద్దెల మాదిరి నిలబడి వున్నాయి ముదుపులగుట్టకి రెండో పక్కన వున్న కొండరాళ్ళు.

ఒక పెద్ద బండని ఎంపిక చేసుకుని వెలుగు వచ్చేంతవరకూ ముడుచుకు కూర్చున్నాడు శివుడు.

నిదుర రాలేదు అతనికి. అందుకు బలంగా వీస్తున్న చలిగాలి మాత్రం కారణం కాదు... అనుమతి లేకుండా తమ అడవిలోకి వచ్చి తమకు మాత్రమే స్వంతమైన అటవీ సంపదను దోచుకోవటానికి పథకం వేస్తున్నారు ఆ దొంగలు... ఎట్టి పరిస్థితిలోను వారి ఆటలు సాగనీయకూడదు. కాని ఆ పని చేయటం ఎలా?

పదకొండుమంది వున్నారు వాళ్ళు. దృఢంగా తుమ్మమొద్దుల మాదిరి కనిపిస్తున్నారు. అందరి దగ్గరా ఆయుధాలున్నాయి. ఎదురు పడితే పిట్టను కొట్టినట్టు ఒకే ఒక దెబ్బతో తనను పడగొట్టేసి మట్టిలో కప్పిపెట్టేస్తారు.

కాబట్టి పొరపాటున కూడా వాళ్ళకి తాను కనిపించకూడదు. తెల్లవారిన తర్వాత వాళ్ళు ఆర్చుకుని తీర్చుకుని ఆ ఏనుగుల జంట దగ్గరికి చేరుకోకముందే తను అక్కడికి వెళ్ళిపోవాలి.

తను పొరబాటున నిలబడి దొంగలు మాట్లాడుకుంటున్న మాటల్ని వింటున్నప్పుడు ఆఖరి దృఢకాయుడు ఎటునుంచి ఏ దిశలో నుంచి అక్కడికి వచ్చాడో గుర్తు చేసుకుంటూ తనకు తనే తల వూపుకున్నాడు శివుడు.

సరైన దారిలోనే వున్నాడు తను. బండల్ని దాటి కొద్ది దూరం పోయిన తరువాత తమ నగరం ప్రక్కనుంచి ప్రవహిస్తూ వస్తున్న సువర్ణానది కనిపిస్తుంది.

ఆఖరి దృఢకాయుడు చెప్పిన బురదగుంట బహుశా ఆ నదిలోని నీటి మూలకంగానే ఏర్పడి వుంటుంది.

ఆ మాటలు మనసులో మెదిలిన క్షణంనుంచీ అధికం అయిపోయింది శివుడి మనసులోని ఆత్రుత. అతికష్టంమీద కాలాన్ని వెళ్ళదీశాడు. తూర్పుదిక్కున తొలివెలుగు ప్రత్యక్షం అయిన వెంటనే బండమీదినించి దిగి తిరిగి పరుగు మొదలుపెట్టాడు.

❖ ❖ ❖

**త**ర్క, వ్యాకరణాలు, నీతిశాస్త్రాలను మాత్రమే కాదు- భౌగోళిక శాస్త్రాన్ని ముఖ్యంగా జ్వలిత సామ్రాజ్యాన్ని గురించి, అందులోని మండలాలు, వాటి సరిహద్దుల గురించి కూడా సవివరంగా బోధించాడు పతంజలి శాస్త్రులవారు.

బోధించేటప్పుడు విపరీతమైన తలనొప్పిని కలిగించిన ఆ వివరాలు ఇప్పుడు మాత్రం పూర్తిగా అక్కరకు వచ్చాయి శివుడికి.

ముడుపుల గట్టుకు అర్ధయోజన దూరంలోనే కనిపిస్తుందిట సువర్ణనది. అంతకుముందు వరకూ అల్లకల్లోలంగా ప్రవహించిన నది కాస్తా, అడవిలోకి అడుగుపెట్టిన వెంటనే ముగ్ధకన్యలా వంపులు తిరుగుతూ వయ్యారంగా నడుస్తూ వుంటుందిట.

'పరమ ప్రశాంతంగా ప్రవహిస్తున్నది కదా అని పొరపాటున లోనికి దిగితే, దిగిన మనిషిగాని, జంతువుగాని తిరిగి ప్రాణాలతో ఒడ్డుకు చేరుకోవటం అసంభవమట.

ఏనుగుల్ని సైతం అమాంతంగా ఒడిసి పట్టుకుని నదీగర్భంలోకి లాక్కుపోయే మొసళ్ళు, కన్ను మూసి కన్ను తెరిచేటంతలో నమిలి మింగేసే జలచరాలకు ఆవాసం ఆ ప్రదేశం. ఎప్పుడయినా ఎన్నడయినా అటుగా ప్రయాణించవలసిన అవసరం ఏర్పడేటట్లయితే ముఖ్యంగా మీరు గుర్తు పెట్టుకోవాల్సినది ఈ అంశం' గోడకు బిగించబడిన నల్లబల్లమీద సుద్దముక్కతో సువర్ణానదిని సూచిస్తూ చెప్పాడు అయ్యవారు అప్పటికి సరిగ్గా అరునెలలకు ముందు.

వింటినుంచి వెలువడిన బాణంలా నదికేసి పరుగులు పెడుతున్న శివుడి కనులముందు టకటకా ప్రత్యక్షం అయింది ఆ రోజున అయ్యవారు నల్లబల్లమీద గీసి చూపించిన పటం. అతనికి తెలియకుండానే మందగించింది పరుగు వేగం.

నది నీటివల్ల ఏర్పడిన బురదగుంట అంటే– అది తప్పకుండా నది ఒడ్డుకు దగ్గరిగానే వుండి వుంటుంది. మరి నదిలోని మొసళ్ళు ఆ గుంటలో దిగబడిపోయిన ఏనుగును చూడకుండా వుంటాయా?

తను అనవసరమైన శ్రమను తీసుకుంటున్నాడేమో అని కూడా అనిపించి మరింతగా తగ్గిపోయింది అతని వేగం. ముందుకు పోవటం అనవసరమేమో అనిపిస్తున్న సమయంలోనే అతని చెవులకు వినిపించింది ఆ ఘీంకారం.

విపరీతమైన ఆగ్రహంతోనో, ఆక్రోశంతోనో ఏదో ఏనుగు చేస్తున్న ఘీంకారం అది.

తన ఊహ యదార్థమేనని వెంటనే అనిపించింది శివుడికి. నదిలో వున్న దుర్మార్గపు మొసళ్ళు ఒడ్డుమీదికి వచ్చి, గుంటలో చిక్కుబడిపోయిన ఏనుగుమీద తమ ప్రతాపాన్ని చూపించటం మొదలుపెట్టి వుంటాయి. అందుకే అది అలా గావుకేకలు పెడుతోంది.

తనకు తెలియకుండానే మరోసారి పరుగు వేగాన్ని పెంచుకున్నాడు శివుడు. ఎత్తుగా వున్న రెండు బండల్ని అధిగమించి, అవతలివైపుకు చేరుకున్న వెంటనే కనిపించిన దృశ్యం, అతన్ని గగుర్పాటుకు గురి చేసేసింది.

పది బారల వెడల్పున ఇరువది బారల పొడవున ఏర్పడి వుందొక పెద్ద బురద గుంట. సరయిన ఆహారం లేకపోవటం వల్ల నీరసంగా కనిపిస్తున్న ఆడ ఏనుగు ఒకటి అందులో దిగబడిపోయి వుంది.

రాకాసి బల్లుల వంటి మొసళ్ళు రెండు అల్లంత దూరంలో వున్న నదిలోనుంచి వచ్చి దాన్ని ఆహారంగా చేసుకోవటానికి ప్రయత్నిస్తున్నాయి.

ఒడ్డునే వున్నది బారెడు బారెడు దంతాలతో మహోగ్రంగా కనిపిస్తున్న మగ ఏనుగు. వాటిని బురదలోకి దిగనీయకుండా ఘీంకారం చేస్తూ దూరంగా తరమటానికి నానా పాట్లూ పడుతోంది.

ఎంతసేపటి నుంచి అలా తంటాలు పడుతున్నదో తెలియదుగాని, అలసట కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది ఆ ఏనుగు కన్నుల్లో. తాను కూడా ఆహారం తీసుకోకుండా ఆడ ఏనుగుకు కాపలా కాస్తున్నట్లు నీరసంగా కనిపిస్తోంది.

బండల్ని అధిగమించి అవతలికి అడుగుపెట్టిన రెండవ క్షణికంలో కొట్టవచ్చినట్టు అవగతమైపోయింది శివుడికి. ఆలస్యం చేస్తే ఆ రెండూ రాకాసి మొసళ్ళకు ఆహారమైపోవటం తప్పనిసరి అని.

అధికంగా ఆలోచించలేదతను. చుట్టూ చూసి గుమ్మడికాయంత కొండరాయి నొకదాన్ని అతి ప్రయత్నంమీద చేతుల్లోకి ఎత్తుకున్నాడు.

మగ ఏనుగు తొండానికి అందకుండా దూరంగా పాకి, అది వెనక్కి తిరగగానే బురదగుంటలోకి దిగే ప్రయత్నం చేస్తున్న మొదటి మొసలి తలమీద పడేటట్లు బలంగా విసిరాడు.

బరువుగా పోయి దబ్బుమని శబ్దం చేస్తూ తగిలిందది దాని తలకి. కొండ గుహలాంటి నోటిని వెడల్పుగా తెరిచి ఇంతెత్తున గాలిలోకి లేచిందా మొసలి.

అంతటితో వదిలిపెట్టలేదు శివుడు. ఇంకో రాతిని అందుకున్నాడు. ఈసారి గురిచూసి వెడల్పుగా తెరిచిన దాని నోటికేసి కొట్టాడు.

పటపటమని శబ్దాలు చేస్తూ విరిగి పడిపోయాయి చురకత్తుల మాదిరి కనిపిస్తున్న దాని దంతాలు కొన్ని.

బాధను భరించటం అసాధ్యం అయిపోయింది కాబోలు... దారుణమైన పొర్లిగింతలు పెట్టిందది.

అదే సమయంలో రెండవ మొసలిని తన తొండానికి చిక్కించుకున్నది మగ ఏనుగు. పూలచెండును విసిరినట్టు బలంగా విసిరికొట్టింది అల్లంత దూరంలో పడిపోయేటట్టు.

కళ్ళు గిర్రున తిరిగినట్లున్నాయి. పడుతూ లేస్తూ నదికేసి పరుగు మొదలుపెట్టింది మొసలి.

పొర్లిగింతలు పెడుతున్న మొదటి మొసలి దగ్గరే వుండిపోయాడు శివుడు. దాని దంతాలను విరగగొట్టిన కొండరాయినే తిరిగి చేతుల్లోకి తీసుకుని, ఈసారి తలమీద పడేశాడు.

మైకం ముంచుకు వచ్చినట్టు నిశ్చలంగా వుండిపోయింది మొసలి. తోకను కాదు గదా కనీసం కళ్లను కూడా కదిలించకుండా అచేతనమైంది.

తోకను పట్టుకుని బరబరా వెనక్కి లాగుదామని అనుకున్నాడు శివుడు. అతను ఆ పని చేయకముందే వెనుకనుంచి ఎవరో తనను పక్కకు నెట్టినట్లు తూలి దూరంగా పడిపోయాడు.

ఎక్కడో చితుకుల మంట దగ్గిర వుండవలసిన దృఢకాయులు అక్కడికి రానే వచ్చారని అనుకుంటూ వెనక్కి చూసేసరికి కనిపించింది అతనికి మగ ఏనుగు. రెండో మొసలిని తొండంతో అవతలికి విసిరిన వెంటనే దానివల్ల ప్రమాదం లేదని గ్రహించి వెనక్కి వచ్చింది అది. శివుడిని తన దంతాలతో అవతలికి నెట్టి, మొదటి మొసలి తలమీద తన పాదాన్ని మోపి బలంగా అదిమింది.

గిలగిలలాడిపోయిందా మొసలి. తనను ఆవరించుకుని వున్న మగత నించి బయటపడి దూరంగా పారిపోవటానికి ప్రయత్నించింది గాని, ఒక్క అంగుళం మేరకూడా అవతలికి కదలలేక, ఉన్నట్లుండి ప్రాణాల్ని వదిలేసింది.

ఏనుగుకు అర్థమయిందో లేదోగాని, శివుడికి వెంటనే తెలిసిపోయిందా సంగతి.

"దాని పని అయిపోయింది. అది నిన్ను ఏమీ చేయలేదు. వదిలేయ్" అంటూ ముందుకు జరిగి దాని తొండంమీద అరచేత్తో అదుముతూ వెనక్కి నెట్టటానికి ప్రయత్నించాడు.

అప్పుడు తెలిసివచ్చింది అతనికి అది శిక్షణ పొందిన ఏనుగు కాదని... మనిషి వాసన తగిలితే మతిపోయినట్లు ఘీంకరిస్తూ మీదికి దుమికి, తన పాదాలతో పాతాళ లోకానికి పంపించే అడవి ఏనుగు అది.

దాహం వేస్తున్నట్టు ఎండుకుపోయింది అతని గొంతు. మొఖంమీద వెంటనే ప్రత్యక్షం అయ్యాయి చెమట బిందువులు.

"నేను నీకు అపకారం చెయ్యటానికి రాలేదు. నేను శత్రువుని కాను" అస్పష్టంగా అంటూ వెనక్కి జరిగాడు. మరొక్క అడుగు వెనక్కి వేసి, మెరుపు వేగంతో దూరంగా పారిపోవాలని అతని ఉద్దేశం.

అతని చేయి తనకు తగలగానే విపరీతమైన కోపంతో చెవులు చిల్లులు పడిపోయేటట్లు ఘీంకరించి, తొండంతో అతన్ని అమాంతం గాలిలోకి ఎత్తి రెండవ మొసలిని విసిరినట్లు దూరంగా విసరటమో, మొదటి మొసలిని

తొక్కి చంపినట్లు పాదాలతో నేలకేసి అణగదొక్కటమో చేయాలి అతని అంచనా ప్రకారం... ఆ ఏనుగు.

అటువంటి పనులేవీ చేయలేదు అది. తొండంతో అతని మొఖాన్ని సున్నితంగా స్పృశిస్తూ జాలిగొలిపే విధంగా చిన్నశబ్దం చేసింది. తన దంతాలతో అతన్ని బురద గుంటకేసి నెట్టింది.

బురదలో పడిపోబోయి ఆఖరి క్షణంలో కాలు నిలదొక్కుకుంటూ ఆశ్చర్యంగా చూశాడు శివుడు దానివంక.

మాటలు రాకపోయినా తన మనసులోని భావాన్ని చాలా స్పష్టంగా తెలియచేస్తోంది అది. బురదలో చిక్కుకుపోయి వున్న తన జోడీని కూడా రక్షించమని అభ్యర్థిస్తోంది.

కొండంత బరువుండే ఏనుగుని బురదలోనుంచి బయటికి లాగటం తన శక్తికి మించిన పని అని శివుడికి తెలుసు. బలాన్ని ఉపయోగించటం వల్ల సాధ్యపడే పని కాదు అది. తెలివిని ఉపయోగించాలి.

“నన్ను ఆలోచించుకోనీ... నువ్వు అనవసరంగా నన్ను తొందరపెట్టకు” అని మగ ఏనుగుతో చెప్పి ఆలోచించటం మొదలుపెట్టాడు అతను.

ఊబి మాదిరిగా వుంది ఆ బురదగుంట. కాలు పెడితే దిగబడిపోవడం తప్పనిసరి. లోపల వున్న ఏనుగు బయటికి రావాలంటే దిగబడిపోకుండా దాని బరువును భరించే గట్టి నేల అవసరం అవుతుంది.

ఏ కొండరాయితో తాను మొదటి మొసలిని గాయపరిచాడో, అటువంటి రాళ్ళనే తెచ్చి గుంటలో పడవేయాలి. ఒకటి రెండు రాళ్ళు సరిపోవు. కనీసం రెండు మూడు బళ్ళ రాళ్ళు అవసరం అవుతాయి.

వాటిని తను సేకరించే లోపల అక్కడికి రానే వస్తారు చితుకులమంట దగ్గర వున్న దృఢకాయులు.

ఒక చేయి నడుముమీద వేసుకుని, రెండవ చేత్తో తల బరుక్కుంటూ ఆలోచిస్తున్న శివుడికేసి చూసి, ఆలస్యమెందుకని అడుగుతున్నట్లు చిన్నపాటి శబ్దం చేసింది మగ ఏనుగు.

ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చేశాడు శివుడు.

“నువ్వు కంగారుపడి నన్ను కంగారుపెట్టకు. బురదగుంట కాదు ఇప్పుడు మీకు నాకు ప్రమాదం కలిగించేది. కాలయముళ్ళ వంటి దుర్మార్గులు మీకోసం బయలుదేరి రాబోతున్నారు. ముందు వాళ్ళ భరతం పట్టాలి” అంటూ అప్పటికప్పుడు ఒక నిర్ణయానికి వచ్చేశాడు.

బురదగుంటలో వుండటం వల్ల ఆహారం తీసుకోలేక నీరసపడిపోయి వుంది ఆడ ఏనుగు. దాన్ని కాపాడటం కోసం తనుకూడా నిరాహారంగా గుంట చుట్టూ తిరుగుతోంది మగది.

రెండింటికీ ముందు ఆహారం అత్యవసరం.

తను దాటి వచ్చిన బండల దగ్గరికి పరిగెత్తాడు శివుడు. నడుము ఎత్తున ఆ బండల దగ్గర పెరిగివున్న మొక్కలను పీకాడు. చిన్న చిన్న చెట్లకొమ్మలు విరిచాడు. దుబ్బులు దుబ్బులుగా పెరిగివున్న గడ్డిని మొదలంతా బయటికి లాగి, పెద్ద పెద్ద మోపులుగా తీసుకువచ్చి బురదగుంటలోకి విసిరాడు. కొంత భాగాన్ని మగ ఏనుగు ముందు పడేశాడు.

“మీరు తింటూ వుండండి. నేను ఇప్పుడే వస్తాను” అంటూ మళ్ళీ బండల మధ్యకు పరిగెత్తాడు.

❖ ❖ ❖

చక్కగా తయారయిన కొబ్బరికాయను కొట్టి, ఆ కొబ్బరిని శుభ్రంగా తురిమి పసందయిన బెల్లపు పాకంలో వేసి, ఘుమఘుమలాడే నేతితో కలిపి వుండలుగా చుడితే నోరు ఊరిపోతుంది శివుడికి.

అటువంటి తీపి పదార్థం చేసిన రోజున ఎవరూ చూడకుండా వంటశాల లోకి ప్రవేశించి దొంగ మాదిరిగా ఆరగించేస్తాడు అతను. ఎన్నోమార్లు జరిగింది అలా. చాలాసార్లు పట్టుబడి వంటశాల నిర్వాహకుల చేతుల్లో దెబ్బలు కూడా తిన్నాడు.

అతన్ని ముడుపుల గట్టు దగ్గరికి పంపించిన రోజు రాత్రి పరిచారికలకు ప్రత్యేకంగా చెప్పి రాత్రికి రాత్రి రెండురకాల తీపి పదార్థాలను తయారు చేయించింది సాగరులవారి అర్థాంగి చారులత.

తూర్పుదిక్కు తెల్లబడుతున్న సమయంలో ఇద్దరు భటులకు ఒక మూటలో కట్టి ఇప్పించింది.

"గట్టు దగ్గరే ఏ చెట్టుమీదనో ప్రాణాలను గుప్పిట్లో పెట్టుకుని కూర్చుని వుంటాడు. తీసుకుపోయి ఇవ్వండి. ఆరగించేదాకా దగ్గరే నిలబడి ఆ తరువాత వచ్చేయండి. మీరు వెళ్ళిన సంగతి వచ్చిన సంగతి ఎవరికీ తెలియకూడదు" అనికూడా హెచ్చరించింది.

వేగవంతాలైన రెండు అశ్వాల మీద నగరాన్ని వదిలి అడవికేసి బయలుదేరారు ఆ భటులు ఇద్దరూ.

సువర్ణానది ఒడ్డునే అర్ధయోజన దూరం పోయీ పోకముందే, అనుకోని విధంగా వారి దారికి ఎదురువచ్చారు ఇద్దరు అశ్వికులు.

"అడ్డం తప్పుకోండి. మండలాధీశ్వరుల అర్ధాంగి చారులతాదేవిగారి ఆనతి ప్రకారం అడవిలోకి పోతున్నాము మేము" తన అశ్వ వేగాన్ని తగ్గించుకోవటం ఇష్టంలేక బిగ్గరగా అరిచి హెచ్చరించాడు ఒక భటుడు.

విచిత్రంగా చూశాడు ఎదురువచ్చిన ఇద్దరిలో ఒక వ్యక్తి. తన మొఖాన్ని మరుగుపరుస్తున్న తలపాగా అంచును తొలగించి వదనాన్ని వారికి చూపించాడు.

లావుపాటి గులకరాయి తన గొంతుకు అడ్డం పడినట్టు అదిరిపడి తన అశ్వంమీదినుంచి కిందికి దూకి, తల వంచి నమస్కరించాడు ఆ భటుడు.

"ఇంత పొద్దున్నే చారులతాదేవిగారు మిమ్మల్ని అడవికి పంపించాల్సిన రాచకార్యం ఏమి వచ్చింది?" గంభీరంగా అడిగాడు ఆ వ్యక్తి.

మండలాధిపతి సాగరులవారే అతను. పక్కనే వున్నది మంత్రి మహేశ్వరుడు.

సూర్యోదయం కాకముందే తమ వెలగతోపు దగ్గరకి పోయి, అక్కడి తోటపనివారితో సంభాషించి, తిరిగి వస్తున్నారు వారిద్దరూ.

తమ అశ్వాల నడుములకు వేలాడదీసుకున్న తీపి పదార్థాల మూటల్ని చూపిస్తూ చారులతాదేవిగారి ఆజ్ఞను మండలాధిపతికి వినిపించారు ఆ భటులు.

ముఖాన్ని పక్కకు తిప్పుకుని ముంచుకువచ్చిన నవ్వును అతిబలవంతంగా అదుముకుంటున్న మంత్రి మహేశ్వరుడివంక గుర్రుగా చూసి, ఆ మూటల్ని తన అశ్వానికి తగిలించమని ఆదేశించాడు సాగరులవారు.

"వాటిని శివుడికి అందించే పనిని మేము స్వయంగా చూస్తాము. మీరు వెళ్లిపొండి" అంటూ ఆ ఇద్దరినీ వెనక్కి పంపించేశాడు.

"దేవిగారికి శివుడంటే వల్లమాలిన అభిమానం. మీరు అభ్యంతరపెట్టినా ఏమీ ఉపయోగముండదని నా అనుమానం" చిన్నగా అన్నాడు మహేశ్వరుడు.

"అంతఃపురంలో ఇంతటి ఆదరణ లభిస్తున్న ఆ శివుడికి మనం ఎటువంటి శిక్ష విధించినా ఏమిటి ఉపయోగం?" విసుగు నిండిన కంఠంతో అన్నాడు సాగరుడు.

"అతి చిన్న విషయం యిది. అతిగా ఆలోచించటం వల్ల మనసు పాడయి పోవటం తప్ప వేరే ఉపయోగం ఏదీ వుండదు. తన బిడ్డ ఎటువంటి వాడయినా ప్రేమించటం మాతృత్వంలోని మహత్తర లక్షణం..." అన్నాడు మహేశ్వరుడు.

"ఈ పద్ధతి ఇలాగే కొనసాగితే ఆ శివుడు ఎందుకూ పనికిరాకుండా పోతాడు. వాడి భవిష్యత్తు నాశనం అయిపోతుంది" సాలోచనగా అన్నాడు సాగరుడు.

"ఇంకెన్ని రోజులు ప్రభూ! వచ్చే పౌర్ణమి వరకే కదా... ఆ తరువాత వాడు నిజమైన శిక్షణలో పూర్తిగా నిమగ్నుడైపోతాడు. అల్లరి చేయటానికి కూడా వాడికి సమయం వుండదు. నన్ను నమ్మండి" అన్నాడు మహేశ్వరుడు.

తన అశ్వానికి తగిలించిన తీపి పదార్థాల మూటల్లో నుంచి రెండు పదార్థాలను తాను ఆరగించాడు సాగరుడు. రెండు మహేశ్వరుడి కిచ్చాడు. అశ్వాన్ని అదిలించి నగర ద్వారంకేసి నడిపించాడు.

❖ ❖ ❖

పరుగులాంటి నడకతో బండల మధ్యభాగంలోకి వచ్చిన శివుడి పాదాలు సంకెళ్ళు పడినట్లు ఆగిపోయాయి ఒక్కసారిగా.

దృఢకాయులందరి కంటె ముందుగా బురదగుంట దగ్గిరికి పోవాలన్న తొందరలో అంతకుముందు అటుగా వచ్చినప్పుడు పక్కచూపులు చూడకపోవటం ఒక కారణం అయితే– రెండవ కారణం, అప్పటికి ఆ చకోర పుష్పాలు పూర్తిగా విచ్చుకోకపోవడం.

సూర్యోదయమైన ఒక ఘడియ కాలం గడిచిన తర్వాత వికసిస్తాయి. చీకటి పడేంతవరకూ తమ సుమధుర సుగంధాలతో చుట్టూ వున్న పరిసరాల్ని మత్తెక్కిస్తూ వుంటాయి.

పూర్తిగా విచ్చుకున్న తర్వాత వాటిని సేకరించగలిగితే సరిగ్గా ఒక వారంరోజుల పాటు అలాగే సువాసనలను వెదజల్లుతూ వుంటాయి.

ఇప్పుడు వాటిని చూసీ చూడగానే చారులతాదేవి తనను అడవికి పంపించిన కారణం వెంటనే గుర్తుకు వచ్చింది శివుడికి.

తను తలపెట్టిన పనిని గురించి పది క్షణికాల పాటు మర్చిపోయి అటుగా ఆ మొక్కల దగ్గరికి పోయాడు అతను. నడుము ఎత్తులో వున్న ఒక మొక్క కొమ్మను వంచబోతుండగా బుస్సుమంటూ పడగను అతని చేతి మీదికి విసిరింది ఆ కొమ్మను చుట్టుకుని వున్న పాము.

అదిరిపడి అతివేగంగా చేతిని వెనక్కి లాక్కుని, ఛెంగున వెనక్కి దూకాడు అతను. వెంట్రుకవాసిలో కాటు పడకుండా తప్పించుకున్నాడు.

చకోర పుష్పాలు అడవిలో లభిస్తాయని మాత్రమే తెలుసు చారులతాదేవికి. ఆ సుగంధ పరిమళాలకు పరవశించిపోయే మిన్నాగులు ఆ చుట్టుపట్లే సంచరిస్తూ వుంటాయని మాత్రం తెలియదు.

ఎందుకైనా మంచిదని ఆ మొక్కలకు చాలా దూరంగా జరిగి, పరిశీలనగా వాటికేసి చూసిన శివుడికి కనిపించాయి ఆ మొక్కల క్రిందా, కొమ్మలమీదా లుకలుకలాడుతున్న మిన్నాగులు అనేకం.

అవి అక్కడ వుండగా చకోర పుష్పాలను సేకరించటం అసాధ్యమనే మాట మనసులో మెదులుతూ వుండగానే, మరో మాటను వెతికి పట్టుకున్నది పాదరసం మాదిరి చురుకుగా కదిలే అతని బుద్ధి.

బురదగుంట దగ్గర ఏనుగులను కాపాడటానికి నిశ్చయించుకోవటమైతే నిశ్చయించుకున్నాడు గాని, యమభటుల వంటి ఆ దృఢకాయుల్ని ఎదిరించటం ఎలాగో ఆలోచించుకోలేదతను. వాళ్ళు తనకు ఎదురు పడిన తర్వాత చూసుకోవచ్చనే ధైర్యంతో వారిని వెతుక్కుంటూ బయలుదేరాడు.

చితుకుల మంట దగ్గర్నించి బురదగుంట దగ్గిరికి పోవాలంటే ఇప్పుడు తను అనుసరిస్తున్నదే సరైన దారి అని అతని అభిప్రాయం. ఒకవేళ అది తప్పని తేలితే ఏం చెయ్యాలో కూడా ఊహించలేదు.

ఇప్పుడు చకోర పుష్పాల దగ్గర మాటువేసి వున్న మిన్నాగులను చూసిన వెంటనే అతని మనసులో మెదిలిందా మాట.

ఎటునుంచి ఎటుగా బయలుదేరినా, తనే ముందుగా వారిని గమనించి ఏదో ఒక విధంగా ఆ ప్రదేశంలోకి రప్పించి, వాళ్ళు అక్కడికి వచ్చిన వెంటనే ఆ మిన్నాగుల్ని రెచ్చగొట్టగలిగితే??

లుకలుకలాడుతున్న ఆ సర్పాల్ని రెచ్చగొట్టడం ఎలాగో కూడా ఆలోచించుకోలేదతను. మళ్ళీ ముందుకు నడక మొదలుపెట్టాడు.

ఈసారి పావు ఘడియ కూడా గడవకముందే దూరంలో అతనికి అగుపించారు బరిశెలు, కత్తులు పట్టుకువస్తున్న దృఢకాయులు.

వంద ధనువుల దూరంలోకి రానిచ్చి, ఒక బండచాటునుంచి సరిగ్గా దారి మధ్యలోకి పోయి నిలుచున్నాడు శివుడు.

"రండి రండి... మీ కోసం ఎదురు సన్నాహాలు చేయబడి వున్నాయి. త్వరగా రండి" వెక్కిరింపుగా అరిచాడు.

తాము తప్ప ఆ చుట్టుపట్ల మరెవ్వడూ లేడన్న నమ్మకంతో ఉత్సాహంగా వస్తున్న దృఢకాయులందరూ ఉలిక్కిపడ్డారు ఒక్కసారిగా.

"అరేయ్... ఎవడివిరా నువ్వు? ఏం చేస్తున్నావ్ ఇక్కడ?" బిగ్గరిగా అరిచారు వేగంగా నడవడం మొదలుపెడుతూ.

"నేనా? నేను మీకు బాగా కావల్సినవాడిని. కనకయ్య శ్రేష్ఠి దగ్గర మీరు పుచ్చుకున్న బంగారు నాణేలను తిరిగి అతనికి ఇప్పించేందుకు వచ్చిన వాడిని" బదులు అరిచాడు శివుడు.

ఒకరి మొఖాలు ఒకరు చూసుకున్నారు వారందరూ.

కనకయ్య శ్రేష్ఠి పేరు బయటికి వచ్చిన వెంటనే వారిలో ఆత్రుత అధికం అయిపోతుందని శివుడికి తెలుసు. తమ గుట్టు రట్టు అవటానికి వాళ్ళు ఎంతమాత్రము అంగీకరించరు.

శివుడు ఊహించిన విధంగానే ఒక్కసారిగా ముంచుకు వచ్చింది ఆవేశం దృఢకాయులందరికీ. "పట్టుకోండి... పట్టుకొని మన గురించి ఎలా తెలిసిందో కనుక్కోండి" అని ఒకరినొకరు హెచ్చరించుకుంటూ వేగాన్ని రెట్టింపు చేశారు.

వాళ్ళు దగ్గరిదాకా వచ్చేవరకూ ఆగితే తాను పట్టుబడిపోవటం తప్పనిసరి అని శివుడికి తెలుసు. ఒకసారి పట్టుబడితే తిరిగి తప్పించుకోవటం అసంభవం అని కూడా తెలుసు.

అతను కోరుకున్నది వాళ్ళు విపరీతమైన ఆవేశంతో తన వెంటబడడం. కనకయ్య శ్రేష్ఠి పేరు ఉచ్ఛరించిన వెంటనే అది నెరవేరింది. ఇంకా ఆలస్యం చేయటం దేనికి?

గిరుక్కున వెనుతిరిగి, జింకపిల్ల మాదిరి ఎగిరెగిరి దూకుతూ అతివేగంగా పరిగెత్తాడతను. చకోర పుష్పాలు వికసించి వున్న ప్రదేశంలోకి వచ్చిన వెంటనే పరుగును ఆపి, చిన్న చిన్న గులకరాళ్ళను అనేకం పోగుచేసి పట్టుకున్నాడు.

"పట్టుకోండి... పారిపోనీయకండి..." అని కేకలు పెడుతూ రానే వచ్చారు దృఢకాయులు ఆ ప్రదేశంలోకి పది క్షణికాల తరువాత.

పోగుచేసి పట్టుకున్న గులకరాళ్ళన్నిటినీ ఒకదాని తర్వాత ఒకటిగా చకోర వృక్షాల కేసి విసిరికొట్టాడు శివుడు.

పట్టరాని ఆగ్రహంతో రగులుకుపోతూ, భయంకరంగా బుసలు కొడుతూ వృక్షాలను వదిలి నేలమీద పడ్డాయి మిన్నాగులు. బరబరమని పాకుకుంటూ బండల దగ్గరికి వచ్చేశాయి.

దృష్టినంతా శివుడిమీదనే లగ్నం చేసి వున్నారు దృఢకాయులు. అతను రాళ్లను విసరటం చూశారుగాని, మిన్నాగుల్ని రెచ్చగొట్టటానికి అతను ఆ పని చేసినట్టు గ్రహించలేదు.

"మనల్ని చూసిన భయంతో వాడి చేతులు వణికి రాళ్ళు గురితప్పాయి. రాయి విసరటం కూడా చేతకాని అర్భకుడు మనల్ని రెచ్చగొడతాడా? గొంతు పిసికి చంపేద్దాం. పదండి" అంటూ ముందుకు వచ్చి వున్నట్టుండి గావుకేక ఒకటి పెట్టాడు దృఢకాయుల నాయకుడు.

పడగను బాగా పైకెత్తి సరిగ్గా అతని మోకాలిమీద కాటు వేసింది శివుడు విసిరిన రాయిదెబ్బకి పడగకు బాగా గాయం అయిన మిన్నాగు ఒకటి.

అప్పటికప్పుడు ప్రత్యక్షం అయ్యాయి తెల్లటి నురగలు ఆ దృఢకాయుడి పెదవులమీద. భరించరాని బాధతో గిలగిలా కొట్టుకుంటూ నేలకూలిపోయాడు అతను.

అతని వంటిమీదినుంచి ఇవతలికి పాకుతూ వస్తున్న ఇతర పాముల్ని చూసేసరికి శరవేగంతో జారిపోయింది మిగిలిన వారి ధైర్యం. కూడ బలుక్కున్నట్టు ఒకేసారి వెనక్కి తిరిగి వచ్చిన దారినే దూరంగా పారిపోయారు వారందరూ.

నిలువెత్తున వున్న ఒక బండచాటున నిలబడి వున్నాడు శివుడు. తృప్తిగా తల వూపి వేగంగా వెళ్ళాడు బురదగుంట దగ్గరికి.

అతని అంతరంగం తమకు బోధ పడినట్లు, అతను మోపులుగా కట్టితెచ్చిన గడ్డిదుబ్బుల్ని, చెట్టుకొమ్మల్ని హాయిగా ఆరగిస్తున్నాయి అక్కడ వున్న ఏనుగులు.

"మీ పని మీరు కానిచ్చుకుంటూ వుండండి. నేను చేయాల్సింది చేసి చూపిస్తాను" అంటూ బండరాళ్ళ మధ్య గిరికీలు కొట్టి, లావుపాటి రాళ్లను పోగుచేశాడు శివుడు. బురదగుంట దగ్గరికి వాటిని చేర్చి ఒకదాని తర్వాత ఒకటిగా ఒక ప్రత్యేకమైన వరుసలో బురదలో పేర్చాడు.

వెనక్కి పారిపోయిన దృఢకాయులు తమ భయాన్నించి తేరుకుని అటుగా వస్తారేమోనన్న భయం ఒకమూలగా అతన్ని భయపెడుతూనే వున్నది. అయినా సరే చేస్తున్న పనిని ఆపలేదు అతను.

సూర్యుడు నడిమింటికి చేరుకునే సమయానికి బురదలో తాను దింపిన బండల మీదుగా అడుగులు వేసి, ఆశ్చర్యంగా చూస్తున్నట్టు నిలబడిన ఆడ ఏనుగు దగ్గరికి పోయాడు. ధైర్యంగా ముందుకు వంగి, దాని పాదాన్ని ఒకదాన్ని గట్టిగా పట్టుకుని పైకి లేపే ప్రయత్నం చేశాడు.

ఆ పని అతనివల్ల కాలేదు గాని, అతని ఉద్దేశ్యం మాత్రం అర్థం అయినట్లు తనంతట తనే పాదాన్ని కదిపి, అతను పడవేసిన బండమీద పెట్టిందా ఏనుగు. పట్టుచిక్కింది కాబోలు ధైర్యంగా రెండోపాదాన్ని కూడా కదిలించింది. బురద తనకు ప్రతిబంధకం కావటం లేదని అర్థమైన వెంటనే గబగబా ముందుకు నడిచి, మూడే మూడు క్షణికాల్లో ఒడ్డుకు చేరుకున్నది.

ఘోరమైన ప్రమాదాన్ని తప్పించుకున్న మనుష్యులు ఎటువంటి ఆనందాన్ని పొందుతారో విని వున్నాడు శివుడు. ఆ రోజున జంతువులు కూడా తమ సంతోషాన్ని ప్రకటించటాన్ని అతను స్వయంగా చూశాడు.

తొండాలను గాలిలోకి ఎత్తి పాటలు పాడుతున్నట్టు ఘీంకారాలు చేశాయి ఆ ఏనుగులు రెండూ. అతని వంక ఒకసారి చూసి బండల మధ్యగా పరుగు మొదలుపెట్టి చిటికెలో కనుమరుగు అయిపోయాయి.

బురదగుంటకు చేరేటంతవరకూ, రాజభటులు తనకు ఇచ్చిపోయిన ఆహారపు మూటను నీటిబుర్రను తనతోపాటు వుంచుకున్నాడు శివుడు. ఏనుగులు కనిపించిన వెంటనే వాటిని ఒక బండ దగ్గర పడవేశాడు.

ఇప్పుడు వాటిని తీసుకుని నెమ్మదిగా రెండు బండల మధ్యన ఎదిగిన ఒక శింశుపా వృక్షం క్రిందికి పోయాడు.

ఆహారపు మూట ముడిని విప్పుతుండగా వచ్చింది అతనికి అనుమానం. బండల చాటునుంచి ఎవరో తనవంకే చూస్తున్నట్టు.

"ఎవరు? ఎవరది? బండల చాటున వున్నది ఎవరు?" అని బిగ్గరిగా అరవబోయి... ఆఖరి క్షణంలో నోటిని గట్టిగా అదుముకున్నాడు అతను.

పాముల దెబ్బకు బెదిరి వెనక్కి పారిపోయిన దృఢకాయులే తిరిగి వచ్చి ఉంటారన్న అనుమానం కలగటమే అందుకు కారణం.

ముడి విప్పబోయిన మూటని గట్టిగా పట్టుకొని నీటిబుర్రని రెండవ చేత్తో పట్టుకుని ఒక్కసారిగా పరుగు మొదలుపెట్టాడు అతను.

ఎంత దూరం పరిగెత్తాడో తెలియదు అతనికి. చుట్టూ వున్న బండలు మటుమాయమై తిరిగి దట్టమైన అడవిలోకి తను ప్రవేశించినట్టుగా కూడా గమనించలేదు.

"హేయ్... ఆగు... ఆగిపో... గుడ్డిగా పరిగెత్తితే ముళ్ళపొదల్లో చిక్కుపడిపోతావ్. ఆగు" రెండు కంఠాలు గట్టిగా హెచ్చరించడంతో ఆగాడు.

"ఎవర్రా నాయనా నువ్వు? ఎవరూ రాలేని ఈ అడవిలోకి ఒంటరిగా ఎందుకు వచ్చావ్?" మృదువుగా అడుగుతూ అతని ఎదుటికి వచ్చారు అడవిలో కట్టెలు కట్టుకోవటానికి వచ్చిన ఇద్దరు గ్రామీణులు.

తన వెనుక వుండాల్సిన దృఢకాయులు తనకంటె వేగంగా పరిగెత్తి, ముందునుంచి దాడిచేయబోతున్నారని అనుకోబోతున్న శివుడికి గుండెలమీది నుంచి కొండంత బరువు దిగిపోయినట్లు అనిపించింది.

"నా పేరు శివుడు. నేను సంపంగి నగరంలో నివశిస్తూ వుంటాను" ఎగసుకు వస్తున్న ఆయాసం కొద్దిగా తగ్గిన తర్వాత చెప్పాడతను వారితో. సాగరుల వారు తనకు విధించిన శిక్షల గురించి మాత్రం చెప్పలేదతను. స్నేహితులతో కలిసి ముడుపుల గట్టు దగ్గరికి వచ్చాను.దారి తప్పాను. రెండు ఏనుగులు నావెంట పడేసరికి ఇటుగా పారిపోయి వచ్చాను" అని అన్నాడు.

"ఈ దిక్కుమాలిన అడవిలో దారితప్పితే ప్రాణాంతకమే... రేపో ఎల్లుండో మా గ్రామపెద్దకి సంపంగి నగరంలో ఏదో పని వుందని చెప్పాడు. అతనితో

పాటుగా నిన్ను నీ నగరానికి పంపిస్తాం. ఇప్పుడు మాతోపాటు మా గ్రామానికి వచ్చి విశ్రాంతి తీసుకో" సానుభూతి నిండిన కంఠంతో చెప్పాడు ఒక గ్రామీణుడు.

దారి తెన్ను లేని ఆ కీకారణ్యంలో ఒంటరిగా వుండి, ఏనుగుల కోసం వచ్చిన దృఢకాయులకు దొరికిపోవడం కంటే, ఆప్యాయంగా మాట్లాడుతున్న ఆ గ్రామస్తులతో వారి గ్రామానికి వెళ్ళటమే మంచిదని అనిపించింది శివుడికి. రెండో ఆలోచన చేయకుండా తల ఊపేశాడు.

అంతవరకూ తాము నరికిన చెట్టుకొమ్మలన్నిటినీ పెద్ద పెద్ద మోపులుగా కట్టి తలలకు ఎత్తుకున్నారు ఆ గ్రామీణులు. ఇద్దరూ తాము ముందు నడుస్తూ అతనికి దారి చూపించారు.

❖ ❖ ❖

**మూ**డు కూరలు, నాలుగు పచ్చళ్ళు, రెండు రకాల పులుసులు, మీగడ పెరుగుతో భోజనం ముగించాడు శ్రావస్తి నగరంలోని కనకయ్య శ్రేష్ఠి. పచ్చ కర్పూరం వేసిన తాంబూలాన్ని నములుతూ తన భవనం ముందుభాగంలోని సభా భవనం వంటి మందిరంలోకి వచ్చాడు.

అంతవరకూ ఒక పక్కగా నిలుచుని వున్న దృఢకాయులు పదిమంది వెంటనే తలలు వంచి నమస్కారాలు చేశారు. "మీ నాయకుడు ఏడి?" అడిగాడు కనకయ్య శ్రేష్ఠి.

ఏదైనా విషయాన్ని గురించి అడిగిన వెంటనే, తడుముకోకుండా టకటకమని సమాధానాలు చెప్పేవాళ్ళు అంతకుముందు ఆ దృఢకాయులు. ఒక్కోసారి అవసరంలేని మాటలు కూడా మాట్లాడేవాళ్ళు.

అటువంటి వాగుడుకాయలు కాస్తా, ఇప్పుడు చిన్నబోయిన మొఖాలతో చటుక్కున తలలు వంచుకున్నారు.

"ఏమిటిరా? ఏమయింది మీకు?" ఆశ్చర్యంగా అడిగాడు కనకయ్య శ్రేష్ఠి.

అప్పుడు కూడా పెదవులు విప్పలేదు వాళ్ళు. వంచిన తలలు పైకి ఎత్తలేదు.

వెంటనే వచ్చింది కనకయ్య శ్రేష్ఠికి పెద్ద అనుమానం. "ఏదో... అప్పచెప్పిన పనిని వదిలేసి మీకు ఇచ్చిన నాణేలన్నిటినీ నాశనం చేసేశారా?" అని ప్రశ్నించాడు.

తలలు పైకి ఎత్తకుండానే అడ్డంగా తిప్పారు వాళ్ళు.

"మరి దంతాలను తెచ్చారా? ఎక్కడ పెట్టారు?" అడిగాడు శ్రేష్ఠి.

జారిపోయిన ధైర్యాన్ని కూడగట్టుకుంటున్నట్టు రెండుసార్లు గుటకలు మింగి, తలను కొంచెంగా పైకి ఎత్తాడు వాళ్ళలో ఒక దృఢకాయుడు. "సంపంగి మండలంలో తిరిగే ఏనుగులన్నిటినీ మండలాధిపతి సాగరుడు తన గజశాలకు పట్టించుకుపోయాడు. రెండే రెండు ఆడవిలో మిగిలిపోయాయి గాని, వాటి దగ్గరికి కూడా పోవటం మాకు చేతకాలేదు" అన్నాడు.

కనకయ్య శ్రేష్ఠి మొఖంలోని ఆశ్చర్యం కాస్తా ఆగ్రహంగా మారిపోయింది. "ఒట్టి చేతుల్ని ఊపుకుంటూ నా ఎదుటికి రావటానికి మీకు సిగ్గనిపించలేదా? ఒకటి కాదు రెండు కాదు... ఏకంగా రెండు వందల నాణేల్ని మీ మొఖంమీద పోశాను. పోసినప్పుడు ఎగురుకుంటూ పోయి ఇప్పుడు దేబె మొఖాలతో తిరిగి వచ్చారు. అసలు మీతో మాట్లాడవలసిన అవసరం నాకు లేదు. ఏడి మీ నాయకుడు? ఎక్కడ?" విపరీతమైన కోపంతో కంఠం జీరపడుతుండగా అడిగాడు.

"ఒక్కసారి మీరు భవనం వెలుపలికి రండి. మీకే అర్థం అవుతుంది" నెమ్మదిగా చెప్పాడు ఆ దృఢకాయుడు.

జారిపోతున్న జరీ ఉత్తరీయాన్ని భుజాలమీదికి లాగుకుంటూ వారి వెనుకగా భవనం వెలుపలికి వెళ్ళాడు కనకయ్య శ్రేష్ఠి.

వృషభ శకటం ఒకటి నిలబడి వుంది అక్కడ. అడ్డుగా కట్టిన మందపాటి తెరలోనుంచి చూసేసరికి అతనికి కనిపించాడు అడవిలో మిన్నాగు కాటుకు ప్రాణాలు కోల్పోయిన దృఢకాయుల నాయకుడు.

"ఎందుకు జరిగింది? ఇది ఎలా సంభవం అయింది? ఇంత బతుకు బతికి ఆఖరికి ఒక పాము కాటుకు బలైపోవటం ఏమిటి?" తల తిప్పి చూస్తూ అడిగాడు.

తాము సంపంగి మండలంలో అడుగుపెట్టిన దగ్గర్నించీ మొదలుపెట్టి అప్పటివరకూ జరిగినదంతా సవివరంగా చెప్పాడు ఆ దృఢకాయుడు.

"ఎన్నోసార్లు ఎన్నెన్నో మండలాల్లో మా వేట కొనసాగించాము. మేము వచ్చినట్లు గాని, వేటాడినట్లు గాని రెండో కంటివాడికి తెలియలేదు. ఇప్పుడు

ఒక బుడతడు మా గుట్టును రట్టు చేశాడు. ఒట్టిగా చేయటమే కాదు, మీరు మాకు బంగారు నాణేలను ఇచ్చినట్లు కూడా పెద్దగా ప్రకటించాడు. ప్రాణం లేని శరీరాన్ని పదిమంది నివశించే భవంతి ముందుకు తీసుకురాకూడదని తెలిసి కూడా మా నాయకుడిని మీ దగ్గరికి తీసుకురావటానికి అదే కారణం" అన్నాడు.

తన అభీష్టానికి విరుద్ధంగా ఏదైనా జరిగితే నిప్పు తొక్కిన కోతిలా గంతులు వేసి, అరిచి కేకలు పెట్టే కనకయ్య శ్రేష్ఠి గొంతు మూగబోయింది ఆ మాటల్ని వినేసరికి.

ఆటబొమ్మల కోసం అపురూపమైన ఏనుగుల్ని చంపిస్తున్నాడని తెలిస్తే జ్వలిత చక్రవర్తి ఎంత కోపానికి గురి అవుతాడో ఊహించుకునేసరికి చెమటలు ప్రత్యక్షం అయ్యాయి అతని మొఖంమీద.

"వాడు... ఆ బుడతడు ఎవడు? వెనక్కి తిరిగి తన భవనంలోకి ప్రవేశిస్తూ చిన్నకంఠంతో అడిగాడు.

"తెలియదు దేవరా... చకోర వృక్షాల దగ్గర కనిపించిన మిన్నాగుల కోపం చల్లారేవరకూ దూరంగానే వుండిపోయాము. ఆ తర్వాత ఆ ప్రదేశాన్నంతా గాలించాము గాని, అతని జాడ మాకు కనిపించలేదు" చెప్పాడు దృఢకాయుడు.

చక్రవర్తి సింహాసనం వంటి తన ఆసనంమీద కూర్చుంటూ పది క్షణికాల పాటు తీవ్రంగా ఆలోచించి, చిన్నగా చప్పట్లు చరిచాడు కనకయ్య శ్రేష్ఠి.

వెంటనే వచ్చి వినయంగా నమస్కారం చేసింది వెనుక మందిర ద్వారం దగ్గర నిలబడి వున్న పరిచారిక ఒకర్తె.

"వీళ్ళకి వంద బంగారు నాణేలు ఇచ్చి పంపించు" ఆజ్ఞ ఇచ్చాడు శ్రేష్ఠి.

తనతో రమ్మని దృఢకాయులకు సైగ చేసి, శ్రేష్ఠికి ఎడమ వైపున వున్న మరో మందిరంలోకి బయలుదేరిందా పరిచారిక.

"మీరు ఏం చేస్తారో నాకు తెలియదు. నా పేరును బయటపెట్టిన ఆ బుడతడు వెంటనే మరణించి మట్టిలో కలిసిపోవాలి. ఎట్టి పరిస్థితిలోను నేను చేసే వ్యాపారం గురించి ఎవరికీ తెలియకూడదు" ఒకరి తర్వాత ఒకరుగా ఆ పరిచారిక వెనుక బయలుదేరుతున్న దృఢకాయులందరికీ గట్టిగా చెప్పాడు కనకయ్య శ్రేష్ఠి.

"ఈరోజు మా నాయకుడికి అంత్యక్రియలు జరిపిస్తాం. రేపు ఉదయమే సంపంగి మండలానికి ప్రయాణం అవుతాము. మీరు అప్పచెప్పిన పనిని పూర్తి చేసిన తర్వాతనే తిరిగి మీకు కనిపిస్తాం" అన్నారు వాళ్ళు.

తృప్తి చెందినట్లు తలను ఊపటమైతే ఊపాడు కాని, కొంచెంగా కూడా కుదుటపడలేదు కనకయ్య శ్రేష్ఠి అంతరంగం.

"మా మనస్సు ఏమీ బాగోలేదు. కొద్దిసేపు మేము చంద్రవదన భవనం దగ్గిరికి పోయి వస్తాము" ముఖద్వారం దగ్గర కాపలాగా నిలబడి వున్న ఇద్దరు భటులకు చెప్పి వెలుపలికి వచ్చాడు. నాలుగు అశ్వాలు పూన్చిన శకటంలో వారకాంత చంద్రవదన నివశించే ప్రదేశం వైపు ప్రయాణం అయ్యాడు.

❖ ❖ ❖

చీకటి పడిన రెండు అర్ధ ఘడియలకు మేళతాళాల సవ్వడితో సందడి సందడిగా తయారవుతుంది శ్రావస్తి నగరంలోని ప్రముఖ వారకాంత చంద్రవదన నివశించే అందమైన సుందర గృహం.

పాదాలకు బంగారు మువ్వలను కట్టుకొని ఛెంగు ఛెంగున నృత్య గీతాలను ప్రదర్శిస్తుంది ఆమె. వచ్చిన అతిథులందరికీ అమితమైన మర్యాదలు చేస్తుంది.

నాలుగు అశ్వాలను పూన్చిన శకటంలో నుంచి ఆ ఇంటిముందు దిగిన కనకయ్య శ్రేష్ఠికి మేళతాళాల సవ్వడి ఏదీ వినిపించలేదు.

ఇంటి ముఖద్వారం దగ్గర పూలమాలలు పన్నీరు బుడ్లు పట్టుకుని నిలబడి వున్న చంద్రవదన చెలికత్తెల వంక ప్రశ్నార్థకంగా చూశాడతను.

తల దగ్గిర్నించి పాదాల వరకు తడిసి ముద్ద అయ్యేటట్టు అతనిమీద పన్నీరు జల్లి, పూమాలలతో సత్కరించారు వాళ్ళు.

"విదర్భ దేశానికి చెందిన కారడవుల్లో చిరకాలం తపస్సు చేసి అమోఘమైన శక్తుల్ని సిద్ధి పొందిన చక్రవాక స్వామివారు ఈ రోజున మా మందిరానికి విచ్చేశారు. బంధుమిత్రులందరితో కలిసి వారికి పాదపూజ చేసుకుంటోంది మా చెలి. మీరు కూడా సమయానికి వచ్చారు. లోపలికి దయచేయండి" అంటూ ఆహ్వానం పలికారు.

తపస్సులన్నా, తపస్సుల ద్వారా సిద్ధులు పొందటమన్నా చాలా చులకన కనకయ్య శ్రేష్ఠికి. "అమాయక జనాల్ని మోసగించటం కోసం చెప్పే మాటలు

అవి. అటువంటి దివ్యశక్తుల్ని పొందటం మనిషికి అసంభవం" అంటూ వుంటాడాయన అటువంటి మాటలు చెవిన బడినప్పుడు.

ఇప్పుడు మాత్రం ఏమీ మాట్లాడలేదు. ఠీవిగా ముఖద్వారాన్ని అధిగమించి లోపలికి పోయాడు.

వెంటనే అతన్ని గమనించింది చంద్రవదన. "రండి శ్రేష్ఠిగారూ! సమయానికి మీరు రావటం నిజంగా ముదావహం. మన నగరం యొక్క భవిష్యత్తును, ముఖ్యంగా మన సామ్రాజ్యం ఎలా వుండబోతున్నదో చెప్పబోతున్నారు చక్రవాక స్వామి. మీ వంటి పెద్దలు తప్పకుండా విని తీరాలి" ఎదురు వచ్చి చనువుగా చేయి పట్టుకుని తీసుకుపోతూ చెప్పింది.

"ఇందులో ఒకరు ప్రత్యేకంగా చెప్పేది ఏముంది చంద్రవదనా... నెలకు మూడు వానలు కురిసి సుభిక్షంగా వుంటామంటారు. ధరలు పెరిగి సామాన్యుల జీవితాలు కొంచెం దుర్భరమవుతాయంటారు. మన చక్రవర్తి తదనంతరం రాజకుమారి జ్వాల చక్రవర్తిని అవుతుందంటారు. అంతకు మించి మరేమీ చెప్పరు" నవ్వుతూనే అన్నాడు కనకయ్య శ్రేష్ఠి.

వివిధ రకాలయిన సుగంధ పుష్పాలతో అలంకరించబడిన ఒక ఉన్నతాసనం మీద కూర్చుని వున్నాడు చంద్రవంక చెపుతున్న చక్రవాక స్వామి. అప్పటివరకూ సుప్రసన్నంగా వున్న ఆయన వదనం ఒక్కసారిగా అప్రసన్నంగా మారిపోయింది.

"ఇక్కడికి ఉత్తరదిశగా వున్న కీకారణ్యంలో జరిగిన ఒక సంఘటన కనకయ్య శ్రేష్ఠి వారి జీవితాన్నే మార్చివేయబోతున్నది. తల్లి తండ్రి లేని ఊరు పేరు లేనివాడని అందరూ అనుకునే ఒక బుడతడు రాబోయే కాలంలో ఈ జ్వలిత సామ్రాజ్యపు చరిత్రనే మార్చివేయబోతున్నాడు... ఇది నిజం... పరమసత్యం" వున్నట్టుండి చెప్పాడాయన.

స్త్రీ పురుషులు ఎంతోమంది నిలువబడి వున్నారు మందిరంలో. విపరీతమైన ఆశ్చర్యంతో ఒకరి మొఖాలు ఒకరు చూసుకున్నారు వారందరూ.

"కీకారణ్యంలో ఎటువంటి సంఘటన జరగబోతున్నది స్వామి.. ఏ ప్రదేశంలో? ఏమిటి అది??" తన ఆశ్చర్యాన్ని అదుముకుని, కనకయ్య శ్రేష్ఠి తరపున తనే అడిగింది చంద్రవదన.

"జరగబోవటం కాదు జరిగేపోయింది. అదేమిటో శ్రేష్ఠికే తెలియాలి. నన్నేమీ అడగవద్దు" ముక్తసరిగా చెప్పాడు చక్రవాక స్వామి.

అందరి చూపులు శ్రేష్ఠికేసి తిరిగాయి.

త్వరపడకపోతే అనవసరమైన అనుమానాలు అనేకం అందరికీ వస్తాయని గ్రహించి జీవం లేని నవ్వొకటి నవ్వాడు కనకయ్య శ్రేష్ఠి. "వ్యాపారస్థుడిని నేను. వ్యాపారం నా వృత్తి. ఇక్కడ లేని సరుకును ఎక్కడినించో తెప్పించి వాణిజ్యం చేయటం నా పద్ధతి. ఉత్తరదిశలోనే కాదు... తూర్పు పడమర దక్షిణ దిశల్లో వున్న అడవుల్లో కూడా మా సేవకులు నిరంతరం ప్రయాణాలు చేస్తూ వుంటారు. ఎప్పుడో ఒకప్పుడు వారిలో ఎవరికో ఒకరికి ఏదో ఒక ప్రమాదం తటస్థించటం సర్వసాధారణం. అందువల్ల మాకు అప్పుడప్పుడు తీరని కష్టనష్టాలు సంభవించటం కూడా సాధారణమే. చక్రవాకస్వాముల వారు నా మొఖం చూసి చెప్పారు అంతే" అంటూ నాలుక చప్పరించేశాడు. ఆ మాటల్ని తాను పట్టించుకోలేదన్నట్టు.

ఆ మాటల్ని విన్న వెంటనే అతని ఆత్మస్థయిర్యానికి ముచ్చట పడుతున్నట్టు పెద్దగా చప్పట్లు కొట్టారు అక్కడి వారందరూ.

"ఎంత లేదన్నా శ్రేష్ఠి అంటే కనకయ్య శ్రేష్ఠే. ఆ గుండెనిబ్బరం వేరెవరికీ వుండదు" మెచ్చుకోలుగా అన్నది ఒక సుందరాంగి.

ఉబ్బితబ్బిబ్బయిపోయాడు కనకయ్య శ్రేష్ఠి. అంతలోనే అతినెమ్మదిగా అతని అంతరంగాన్ని కలవరపరచటం మొదలుపెట్టింది ఒక అంశం.

సంపంగి నగరం తమకు ఉత్తరదిశలోనే వున్నది. అక్కడి అడవిలోనే ఊరు పేరు తెలియని ఒక బుడతడి నోటిద్వారా తనపేరు బయటికి వచ్చింది. చినికి చినికి గాలివాన అయినట్లు ఆ సంఘటన అటు తిరిగి ఇటు తిరిగి ఇంకా పెద్దది అవదు కదా!

ఆ పైన అక్కడ నిలబడటం అసాధ్యమైపోయింది అతనికి. వెంటనే తన భవనానికి వెళ్ళి నూరు బంగారు నాణేలను పుచ్చుకుని పోయిన దృఢకాయులను మరోసారి మరింత గట్టిగా హెచ్చరించటం మంచిదని కూడా అనిపించింది.

"చక్రవాక స్వామికి మంగళహారతి పట్టి, బంధుమిత్రులందరికీ విందు ఏర్పాటు చేశాను. మీరు తప్పకుండా వుండితీరాలి" పట్టిపట్టి చెపుతున్న

చంద్రవదన మాటల్ని పట్టించుకోకుండా, అత్యవసరమైన వ్యవహారమొకటి సరిగ్గా అప్పుడే గుర్తుకువచ్చిందని అంటూ వెనక్కి వచ్చేశాడు అతను.

❖ ❖ ❖

చకోర వృక్షాల మీది మిన్నాగుల్లో ఒకటి సరిగ్గా తన మొఖంమీదికి పడగను విసిరినట్టు కల వచ్చింది శివుడికి.

కట్టెలు కొట్టుకోవటానికి అడవిలోకి వచ్చిన గ్రామీణ జంట వెంట వారి గ్రామంలోకి వచ్చిన అతనికి గ్రామపెద్ద ఇంట్లోనే బస ఏర్పాటు చేయబడింది. అతను తన వెంట తెచ్చుకున్న ఆహార పదార్థాల్ని కుడితితొట్లో పడవేయించి వేడి వేడి జొన్నన్నం అప్పటికప్పుడు వండి వడ్డించాడు గ్రామపెద్ద. నంజుడుకు ఎర్రెర్రటి ఊరగాయను పెట్టించాడు.

కడుపునిండా తిని, ఆ ఇంటిముందు భాగంలోని నులక మంచంమీద మందపాటి కంబళీని కప్పుకుని హాయిగా నిద్రపోతూ కలలోని మిన్నాగును చూసి కలవరపడుతూ కనులు విప్పాడు శివుడు.

మిన్నాగు కనిపించటం వల్ల మెలకువ రాలేదని వెంటనే అర్థం అయింది అతనికి. గ్రామపెద్ద ఇంటిముందు కాగడాలు పట్టుకుని నిలబడి వున్నారు గ్రామంలోని ఆడ మగ అందరూ. గగ్గోలుగా ఏడుస్తున్నారు కొందరు. గొడవ గొడవగా మాట్లాడుతున్నారు మరికొందరు.

“ఏమిటి సంగతి? ఏమయింది?” గుంపులోకి పోకుండా తమ ఇంటి చూరు కిందనే నిలబడి వున్న గ్రామపెద్ద కూతుర్ని అడిగాడు శివుడు.

“కట్టెలు కొట్టుకోవటానికి తుమ్మిడి మడుగు దగ్గరికి పోయినవాళ్ళు ఇద్దరు ఇంకా తిరిగి రాలేదు. కొత్తగా ఈ అడవిలోకి వచ్చిన పెద్దపులి వాళ్ళని చంపేసి వుంటుందని అందరూ భయపడుతున్నారు” చిన్నకంఠంతో చెప్పింది ఆమె.

పతంజలి శాస్త్రుల వారు నల్లబల్లమీద సుద్దముక్కతో గీసి చూపించిన గుర్తులు, బొమ్మలు అన్నీ ఒకదాని తరువాత ఒకటిగా శివుడి కళ్ళముందు కదలాడాయి.

నల్లబల్లమీద గీసిన గీతల్ని నల్లబల్లమీద వుండగా గుర్తుపట్టడం చాలా తేలిక. నిజంగా అడవిలోకి వచ్చిన తర్వాత ఆ బండల మధ్యన, ఆ పొదల

దగ్గర ఆ గుర్తుల్ని తిరిగి గుర్తు చేసుకోవడం చాలా కష్టమని అంతకుముందే అర్థం అయివుండడం వల్ల, ఎక్కువగా మాట్లాడలేదతను.

"తుమ్మిడి మడుగంటే ఏమిటి? ఎక్కడ వుంటుంది?" అని మాత్రం అడిగాడు.

"సువర్ణా నది రెండుగా చీలి పెద్ద చెరువుగా మారుతుంది. ఇక్కడికి మూడు గోరంతల దూరం... అడవి చాలా దట్టం. అద్భుతమైన చందన వృక్షాలు వుంటాయి. వాటికి ఆశపడిన వాళ్ళే అక్కడికి పోవాలి" అడగకుండానే ఎక్కువ విషయాలు అతనికి చెప్పింది గ్రామపెద్ద కూతురు.

గుంపుగా నిలబడి గొడవ గొడవగా మాట్లాడటం తప్ప తప్పిపోయిన వారిని వెతికేందుకు గ్రామీణులు ఎవరూ కదలకపోవటం కొంచెం వింతగానే అనిపించింది శివుడికి.

"నీకు తెలియదు... కొత్తవాడివి కాబట్టి ఈ అడవిలోకి వచ్చిన ఆ పెద్దపులి గురించి అస్సలు అర్థం కావటం లేదు. నెత్తురు రుచి మరిగిన పులి అది. మనిషి వాసన తగిలితే చాలు పాము మాదిరి వెంటపడుతుందిట" మళ్ళీ తానే చెప్పింది ఆమె.

అటువంటి ప్రమాదం అడవిలో వున్నప్పుడు ఎక్కడో మూడు గోరంతల దూరంలో వున్న ప్రదేశానికి ఆ గ్రామీణులు ఎందుకు వెళ్ళారో శివుడికి తెలియలేదు.

"పెళ్ళి కుదిరింది. తిరిగి రాని వాళ్ళలో ఇద్దరికీ పెళ్ళీడు వచ్చిన కూతుళ్ళున్నారు. నాలుగు చందన వృక్షాలను సేకరించుకోగలిగితే పెళ్ళి ఖర్చులకు సరిపోతాయని ఆశపడి, వద్దని చెపుతున్నా వినిపించుకోకుండా పోయారు" గట్టిగా నిట్టూరుస్తూ చెప్పింది గ్రామపెద్ద కూతురు.

"ఆవేదన పడటంవల్ల బాధ మినహా ఒనగూడే ప్రయోజనం లేదు. తెల్లవారగనే అందరమూ వెళ్లి వెతుకుదాం. మనుషులు దొరక్కపోయినా కనీసం వాళ్ళ అవశేషాలయినా మనకి లభిస్తాయి. ఇళ్ళకు వెళ్లిపొండి. తెల్లవారగానే ప్రయాణం" గొడవగా మాట్లాడుతున్న వారందరికీ విశదంగా చెప్పాడు గ్రామపెద్ద.

తప్పిపోయిన గ్రామీణుల కుటుంబాలు తప్ప మిగిలిన వారందరూ తమలో తాము మాట్లాడుకుంటూ వెళ్ళిపోయారు.

"మీరు కూడా వెళ్ళండి. తెల్లారిన తర్వాత చూద్దామని చెప్పానుగా" అంటూ గ్రామపెద్ద గట్టిగా విసుక్కోవటంతో ఆ కుటుంబాల వారుకూడా వెళ్ళిపోయారు. తిరిగి ఇంకోసారి నిశ్శబ్దమైపోయింది గ్రామం. నులక మంచంమీదికి చేరుకున్న శివుడికి మాత్రం నిద్ర దూరం అయింది.

తప్పిపోయిన ఇద్దరు గ్రామస్థులు ఎలా వుంటారో కూడా అతనికి తెలియదు. చుట్టాలు కాదు పక్కాలు అంతకన్నా కాదు. అయినా సరే ఎందుకనో వికలమైపోయింది అతని మనస్సు.

దారి తప్పి తిరుగుతున్నారన్న జాలితో చేరదీసి వెంటబెట్టుకు వచ్చారు ఆ గ్రామస్థులు తనని. ఊరూ పేరూ చెప్పకపోయినా ఆదరించి అన్నం పెట్టారు. వాళ్ళల్లో ఇద్దరు ఏదో అపాయంలో చిక్కుపడినట్లు తెలిసిన తర్వాత వెంటనే ఏదో ఒకటి చేయకుండా ఏమీ పట్టనట్టు పడుకోవడం సమంజసమా?

పది నిమిషాల పాటు అటూ ఇటూ పొర్లిగింతలు పెట్టాడు అతను మనసులోని ఆలోచనలని పక్కకు నెట్టి నిద్రపోవటానికి. క్షణాలు గడుస్తున్న కొద్దీ అవి అధికం అయ్యాయేగాని తగ్గుముఖం పట్టలేదు.

ఉన్నట్లుండి మంచం మీదినించి లేచి, అంతకుముందు గ్రామపెద్ద ఆ ఇంటిచూరులో దోపటాన్ని చూసిన మడ్డుకత్తిని బయటికి తీశాడు.

పెద్ద పెద్ద చెట్లను పడగొట్టటానికి పనికిరాదు అది. చిన్న చిన్న కొమ్మల్ని చాలా తేలికగా నరికి ముక్కలు చేయవచ్చు.

లోపలికి పోయి తలుపులు మూసుకున్న మరుక్షణం గాఢమైన నిద్రలోకి జారిపోయినట్లుంది గ్రామపెద్ద కుటుంబం. చిన్నపాటి అలికిడి కూడా వినరావడం లేదు పెద్ద పెద్ద గురకలు తప్ప.

పక్కన పడవేసిన గొంగళిని తీసి చక్కగా మడత పెట్టి మంచం తలాపీన పెట్టాడు శివుడు. మడ్డుకత్తిని గట్టిగా పట్టుకుని చీకట్లోకి నడిచాడు.

❖ ❖ ❖

రాత్రి రెండు ఝాములు గడిచి మూడో ఝాము అడుగుపెడుతున్నా కూడా నిద్రపోకుండా అంతఃపుర బాహ్య మందిరంలో కూర్చుని వున్న తన సతీమణి చారులతాదేవి దగ్గరికి వచ్చాడు సాగరులవారు.

"నిద్రపోకుండా మెలకువగా కూర్చుంటే ఆరోగ్యం చెడిపోతుందని మీరు నాకేమీ గుర్తు చేయవలసిన అవసరం లేదు. నిద్ర వస్తే నేనే వచ్చి

పడుకుంటాను" ఆయన ఎందుకు వచ్చారో తెలుసు కాబట్టి విసురుగా అన్నది ఆమె.

"నువ్వు మండలాధిపతి భార్యవి. నీ భర్తకు ఎంత బాధ్యత వున్నదో అంతే బాధ్యత కలిగినదానివి. నేరం చేసినవాళ్ళకి శిక్షలు పడి తీరాలి. మనం ప్రకటించిన శిక్షల్ని మనమే తేలికగా పరిగణిస్తే నలుగురిముందు చులకన అయిపోతాము." ఆమె ఎందుకలా కూర్చుని వున్నదో తెలుసు కాబట్టి అనునయంగా అన్నాడు సాగరుడు.

"శిక్షలు కరుడుగట్టిన నేరస్థులకు విధించాలి... చిన్నపిల్లలు చేసే అల్లరిని నేరాలుగా భావించటం నేను ఎక్కడా చూడలేదు. మా పుట్టింటిరాజ్యం..." అంటూ వాడిగా మాటలు మొదలుపెట్టింది చారులత.

ఎక్కడో లేదు ఆమె పుట్టిల్లు. జ్వలిత సామ్రాజ్యానికి చక్రవర్తి అయిన మహాబలుడికి ఆమె పెద్దమ్మ కూతురు. జ్వలిత సామ్రాజ్యమంతా ఆమె పుట్టిల్లే. సాగరుడి శౌర్యసాహసాలకు ముచ్చటపడి తనే స్వయంగా ఆమెను అతనికి ఇచ్చి వివాహం చేయించాడు చక్రవర్తి.

"చూడు దేవీ! అయిందేదో అయిపోయింది. శివుడికి నేను విధించిన రెండు పగళ్ళు, మూడురాత్రుల శిక్షలో మూడువంతులకు పైగానే అయిపోయింది. నువ్వు చెపుతున్నావు కాబట్టి రేపటి శిక్షను తగ్గించి తెల్లవారగానే భటుల్ని అడవికి పంపి, వాడిని రప్పిస్తాను. సరేనా?" ఆమె చుబుకం పట్టుకుని బతిమాలుతున్నట్టు చెప్పాడు సాగరులవారు.

అలుక తీరిపోయినట్టు చిన్నగా నవ్వింది ఆమె.

ఒకే ఒక కాగడా వెలుగుతున్న ఆ ప్రదేశంలో పది కాగడాలు వెలిగించినంత వెలుగు వచ్చినట్టు అనిపించింది సాగరుడికి. భార్యను గట్టిగా కౌగలించుకుని అంతఃపురంలోకి నడిపించాడు వెంటనే.

❖ ❖ ❖

మూడో ఝాము దాటి నాలుగో ఝాము నడుస్తున్న సమయంలో పరుగు ఆపి చుట్టూ చూశాడు శివుడు.

అక్కడితో అంతం అయిపోయింది అతను అనుసరించి వచ్చిన కాలిబాట. దూరంలో పెద్ద చెరువు ఏదో వున్నట్టు తెరలు తెరలుగా తెలియవస్తోంది నీటివాసన.

గ్రామపెద్ద కూతురు చెప్పిన తుమ్మిడి మడుగు తనకు చాలా దగ్గర్లోనే వున్నదని అర్థం అయింది అతనికి.

చీకటి సమయంలో వేటాడే పెద్దపులుల వంటి క్రూర మృగాలు నీళ్ళు తాగటానికి బయలుదేరేది వేకువఝాములోనే అని పతంజలి శాస్త్రులవారు చెప్పిన మాటల్ని గుర్తు చేసుకుంటూ అడుగు కదిపాడు అతను.

పాతిక అడుగుల దూరం కూడా పోకముందే ఈసారి అతని నాశికా రంధ్రాలకు సోకింది ఒక సుమధుర సుగంధం.

చందన వృక్షాలు! గ్రామపెద్ద కూతురు చెప్పిన వృక్షాలు ఆ ప్రదేశంలోనే పెరుగుతూ వుండివుంటాయి. వాటికోసం వచ్చిన గ్రామస్థులు అపాయానికి గురై వుండి వుంటే అక్కడే ఎక్కడో పడి వుండాలి.

తాను వేటాడి చంపిన మృగాన్ని ఒకేసారి ఆరగించదు పెద్దపులి... ఆకలి అయినప్పుడల్లా కొద్దికొద్దిగా తిని, తర్వాత తినటానికి వీలుగా ఏ పొదలోనో, గోతిలోనో దాచిపెట్టుకుంటుందిట. తనుకూడా ఆ చుట్టుపక్కల తిరుగుతూ వుంటుందిట.

ఆ మాటలు మనసులో మెదిలిన వెంటనే ఎడమచేతిలో వున్న మడ్డు కత్తిని కుడిచేతిలోకి మార్చుకున్నాడు శివుడు. తడి ఆరిపోయినట్లు తయారైన కంఠాన్ని సవరించుకుంటూ మరో పది అడుగులు వేశాడు.

ఉన్నట్లుండి అతని దారికి అడ్డంగా పడింది బరువుగా వున్న చందన వృక్షపు చిన్న కొమ్మ ఒకటి.

"ఎవరు? ఎవరు నువ్వు? ఏం చేస్తున్నావిక్కడ?" ఆత్రంగా అడిగింది ఒక కంఠం.

ఉలికిపాటును కప్పిపెట్టుకుంటూ ఆ కంఠం వినవచ్చినవైపు చూశాడు శివుడు.

పది అంగల దూరంలో వున్న ఒక చందనవృక్షం మీదినించి వినవచ్చింది ఆ కంఠం. పొడుగ్గా బలంగా వున్న ఆ వృక్షపు కొమ్మల్లో కూర్చుని వున్నారు ఇద్దరు వ్యక్తులు.

"వచ్చేయ్... త్వరగా చెట్టుమీదికి వచ్చేయ్... ఆలస్యం చేశావంటే హతమారిపోతావ్... వచ్చేయ్" మరింత ఆతృతగా అరిచింది రెండో కంఠం.

వాళ్ళు పనికట్టుకొని చెప్పాల్సిన అవసరం లేకుండానే అక్కడ జరిగింది ఏమిటో తెలిసిపోయింది శివుడికి.

చందన వృక్షాల దగ్గర వుండగానే వారి జాడల్ని పసికట్టి మీదపడటానికి వచ్చి వుంటుంది ఆ పెద్దపులి. అదృష్టం బాగుండి దాన్ని ముందుగానే గమనించినట్లున్నారు వాళ్ళు. అత్యవసరంగా ఆ చెట్టుమీదికి ఎగబ్రాకి ప్రాణాలు కాపాడుకున్నారు.

కళ్ళబడిన మనిషిని తేలికగా వదిలిపెట్టవట నెత్తురు రుచి మరిగిన వ్యాఘ్రాలు. మాటు వేసి వేటాడటానికి చూస్తాయట.

ఆ మాట మనసులో మెదిలిన వెంటనే ఛెంగున ఎగిరి ఆ గ్రామస్థులు ఎక్కి కూర్చున్న చెట్టు దగ్గరికి పరిగెత్తాడు శివుడు.

చెట్టు మొదలు మీద చెయ్యి వేస్తుండగానే ముంచుకు వచ్చింది ప్రమాదం. అతని రాకను అంతకుముందే గమనించి, ఆత్రతపడితే అతనుకూడా ఏదో ఒక చెట్టుమీదికి పారిపోతాడన్న భావనతో అతి నిశ్శబ్దంగా ముందుకు కదులుతోంది ఒక మహావ్యాఘ్రం.

అతను వేగంగా కదలటాన్ని చూసీచూడగానే తనుకూడా కదిలింది. చెట్టుమీదికి చేరుకునే వ్యవధి లేకపోయింది శివుడికి.

"వచ్చింది... దయ్యం వచ్చేసింది... పారిపో... పారిపో" ఆందోళన నిండిన కంఠంతో బిగ్గరగా అరిచారు చెట్టుమీది వారిద్దరు.

దగ్గరిగా వచ్చేసిన పులికి చిక్కకుండా చటుక్కున చెట్టు వెనక్కి గెంతాడు శివుడు.

అతని భుజాల మీదికి దూకి పంజాలతో శిరస్సును రెండుగా చీల్చాలన్న కోరికతో మహావేగంగా గాలిలోకి ఎగిరిందా పెద్దపులి. అతను చెట్టుచాటుకు జరుగుతాడని ఊహించలేదు. అంచనా తప్పిపోవటంతో ఇసుకమూట మాదిరి చెట్టు మొదలు కొట్టుకుని కిందపడింది. ఆ అదటుకు గజగజలాడిందా చందనపు చెట్టు. గలగలా రాలి పడ్డాయి పండిపోయిన ఆకులు.

"పారిపో నాయనా... దూరంగా పారిపో..." కూర్చున్న కొమ్మమీదినించి కింద పడిపోకుండా గట్టిగా పట్టుకుంటూ ఇంకోసారి అరిచారు ఆ చెట్టుమీద వున్న గ్రామస్థులు.

తెగబలిసి గున్న ఏనుగంత వున్న ఆ పెద్దపులిని తాను ఏమీ చేయలేడని శివుడికి తెలుసు. దాన్ని గాయపరచాలంటే తన దగ్గర వున్న మడ్డుకత్తి సరిపోదు. పదునైన వేటకత్తి కావాలి. అది అతని దగ్గర లేదు.

క్రిందపడిన వెంటనే పైకి లేచి చెట్టు వెనక్కి దాగింది పెద్దపులి. ఏదో ఒక విధంగా అతని తలను తన నోటిలో ఇరికించుకోవాలని, నోటిని గుహ మాదిరిగా తెరిచింది.

మడ్డుకత్తితో లాగిపెట్టి ఆ నోటిమీద కొట్టాడు శివుడు. దానికి దెబ్బ తగిలిందో లేదో చూడటం కోసం మాత్రం ఆగలేదు. కొట్టిన వెంటనే పక్కకు తిరిగి పరుగు మొదలుపెట్టాడు.

వేటకు బయలుదేరి ఎరను చూసిన తర్వాత అడవి జంతువుల వేగం అత్యద్భుతంగా వుంటుంది. వింటినుంచి వెలువడిన బాణం కూడా వాటిముందు దిగదుడుపే అనిపిస్తుంది.

సరిగ్గా అదే మాదిరి బయలుదేరిందా పెద్దపులి. మడ్డుకత్తి దెబ్బకు దాని మూతిమీద పెద్ద గాయం అయింది. అయినా సరే లక్ష్యపెట్టలేదు అది. ఆ గాయం తనను ఏమంత పెద్దగా బాధించదని నిశ్చయం చేసుకోవటానికి అన్నట్లు రెండే రెండు క్షణాలు ఆగి, ముందుకాళ్ళతో మూతిని తడుముకున్నది అది.

ఆ కాస్త వ్యవధిలోను ముప్పది అడుగులు ముందుకు వెళ్ళిపోయాడు శివుడు. క్షణక్షణానికి వేగాన్ని హెచ్చించి గాలిలో తేలుతున్నట్టు పరిగెత్తాడు.

భీకరంగా గాండ్రిస్తూ అనుసరించింది ఆ క్రూరజంతువు. ఒక మనిషి తనకు అందనంత వేగంతో పరిగెత్తగలడని అది ఊహించలేదు. అతను దూరం అవుతున్నకొద్దీ దాని ఆగ్రహం కూడా అధికం అవసాగింది.

పరిగెత్తి పరిగెత్తి దానికి అందనంత దూరం పోవాలనిగాని, పోగలనని కాని శివుడు అనుకోలేదు. పాతిక క్షణికాల అనంతరం అతనిముందు ప్రత్యక్షం అయింది సువర్ణనది చీలికవల్ల ఏర్పడిన తుమ్మిడి మడుగు.

రెండో ఆలోచన లేకుండా ఎగిరి అందులోకి దూకాడు అతను. చేతిలో వున్న మడ్డుకత్తిని వదిలిపెట్టకుండానే బలంగా బారలు వేశాడు.

నీటిని చూడగానే పెద్దపులి వేగం తగ్గిపోయింది. బారలు వేస్తూ మడుగు మధ్యకు వెళ్ళిపోతున్న మానవుడు తనను ఏమార్చాడని అర్థం అయింది కాబోలు. చెవులు చిల్లులు పడేలా శబ్దం చేసి ఒడ్డుమీదే కూర్చున్నది.

"నువ్వు అక్కడే కూర్చో. నేను ఇంకో పక్కనుంచి నా దారి నేను చూసుకుంటాను" భుజంమీదినించి దానివంక చూస్తూ బిగ్గరిగా అన్నాడు శివుడు.

నాలుగు నిమిషాలు పట్టింది అతనికి ఆవలి పక్కకు చేరుకోవటానికి. అతను నీటిని వదిలి ఒడ్డుకు ఎక్కటాన్ని గట్టిగానే చూసింది పెద్దపులి. గుండెలు చెదిరిపోయేలా గర్జిస్తూ తను కూర్చున్న చోటినుంచి మాత్రం కదలలేదు.

మడ్డుకత్తిని కిందపెట్టి తడి దుస్తుల్ని పిండుకోబోయిన శివుడికి విపరీతమైన ఆశ్చర్యాన్ని కలిగించింది ఆ ప్రవర్తన.

అందినట్టే అంది చేజారిపోయిన ఎరను చూసి ఆత్రత పడటంలేదు అది. గంతులు వేయటం లేదు. కనీసం కూర్చున్న చోటినుంచి ఇవతలి ఒడ్డుకు చేరుకోవటానికి ప్రయత్నించటమూ చేయటం లేదు. తాను ఎక్కడికీ పోలేదని తెలిసినట్లు ప్రశాంతంగా వుంది. ఎందుకని??

కిందపడేసిన మడ్డుకత్తిని తిరిగి తీసుకోవటానికి ముందుకు వంగితే తీవ్రమైన ఆలస్యం అయిపోతుందన్నట్లు ఒక్కసారిగా పక్కకు తిరిగి దగ్గర్లో వున్న ఒక మర్రిచెట్టుకేసి పరిగెత్తాడు శివుడు.

సగం దూరం మాత్రమే పోయాడతను.

గుండెలు జలదరించేటట్లు శబ్దం చేస్తూ ఎగిరి అతనిమీదికి దుమికింది పెద్దపులి.

మతిపోయినంత పని అయింది శివుడికి. అవతలి ఒడ్డుమీద కూర్చుని వున్న పిశాచం  అంత త్వరగా ఇవతలివైపుకు ఎలా వచ్చిందో తెలియలేదు అతనికి. ఒడ్డుమీద పడవేసిన మడ్డుకత్తిని తలచుకుని ఉసూరుమన్నది అతని ప్రాణం.

మీద పడిన పెద్దపులి పంజా దెబ్బకు కత్తిపెట్టి చీలినట్లు చీరుకుపోయింది అతని భుజం. చాపచుట్ట మాదిరి కిందపడిపోయాడు.

పంజాలను ఎత్తి అతని గుండెలమీద వేసి కిందికి అదుముతూ తల ఎత్తి భయంకరంగా గర్జించింది ఆ పులి. వెంటనే వినవచ్చింది మడుగు అవతలనుంచి ఇంకో గర్జన. గ్రామస్థులు అనుకుంటున్నట్లు ఒక పులి కాకుండా రెండు అడవిలోకి వచ్చాయని తెలిసిపోయింది శివుడికి.

❖ ❖ ❖

రెండు పులులు!

కుటిలమైన తెలివితేటల్ని అధికంగా చూపించే అడవి జంతువుల్లో ప్రథమ స్థానం గుంటనక్కలదైతే... రెండవ స్థానం పెద్దపులులదేనట!!

ఒకటిగా కనిపించి, జంటగా వేటాడటం ఎక్కడ నేర్చుకున్నాయో గాని, ఆ కుటిల విద్యలో ఆరితేరిపోయినట్లున్నాయి అవి.

చెరువుకు ఆవలి గట్టు వరకూ తరుముకు వచ్చి నీటిని చూసి భయపడినట్లు నటిస్తోంది మొదటిది. ఇవతలి ఒడ్డున సిద్ధంగా కూర్చుని వున్నది రెండవది. ఇప్పుడు తనమీదికి దూకి ప్రాణాలు తీయబోతున్నది.

చెరువులో దూకి ఆవలి ఒడ్డుకు చేరుకోగలిగితే ప్రాణాలు కాపాడుకోవచ్చని ఆశపడిన తన మూర్ఖత్వాన్ని తలచుకుని ఉసూరుమన్నాడు శివుడు.

వేటను పట్టుకోగలిగానన్న ఆనందంతో తలను పైకెత్తి పెద్దగా గర్జిస్తోంది ఆ పులి. గర్జించటాన్ని విరమించుకుని పంజాతో ఒక్క దెబ్బ కొడితే చాలు... రెండుగా విచ్చిపోతుంది తన వక్షస్థలం. చిటికెలో ముంచుకు వచ్చేస్తుంది చావు.

గుండెకాయ!! మనిషికే కాదు ఎవరికైనా ఏ జంతువుకైనా అతి ముఖ్యమైన అవయవం గుండెకాయ!

పొడుగాటి కత్తిని పట్టుకుని కవచ శిరస్త్రాణాలను ధరించి బాహాబాహీ భీకర యుద్ధం చెయ్యగల పరమ సాహసవంతుడు కూడా తన గుండెకు చిన్నదెబ్బ తగిలితే కళ్ళు తేలవేసి గింగిరాలు తిరుగుతూ నేలకూలిపోతాడు.

మదించిన ఏనుగులైనా సరే, కోరలతో అందరినీ భయపెట్టే సింహాలైనా సరే గుండెకు చిల్లుపడితే కుక్కిన పేనుల్లా నిశ్చేష్టితాలైపోతాయి.

యుద్ధం అంటూ తటస్థిస్తే పోరాటం అంటూ చెయ్యవలసి వస్తే ఎదుటి శత్రువు గుండెను గాయపరచటం నేర్చుకోవాలి. మన చూపు ఎప్పుడూ ఆ గుండెకాయ మీదనే వుండాలి.

పతంజలి శాస్త్రుల వారు వ్యాకరణ మీమాంస శాస్త్రాలను బోధిస్తున్న సమయంలో ఆ తలనొప్పిని భరించటం అసాధ్యమై, ఆయన చూడకుండా పఠన మందిరంలో నుంచి పలాయనం చిత్తగించేవాడు శివుడు. అంతఃపుర ఉద్యానవన ద్వారంలో అనునిత్యం కాపలా వుండే వృద్ధ భటుడి దగ్గర కూర్చుని అతను చెప్పే మాటల్ని ఆసక్తిగా ఆలకించేవాడు.

“అసలు మన మండలేశ్వరుడి సతీమణి చారులతాదేవి మన సాగరుల వారిని పెళ్ళిచేసుకోవటం ఎలా జరిగిందో తెలుసా? ఒకరోజు సాయం సమయంలో తన దగ్గరికి వచ్చి కూర్చున్న శివుడిని అడిగాడు ఆ వృద్ధ భటుడు.

“నాకేమీ తెలియదు. నీకు తెలిసిందేమిటో త్వరగా చెప్పు... ఆలస్యం అయితే నేను ఇటుగా వచ్చేసినట్టు అయ్యవారికి తెలిసిపోతుంది. వెదురు చువ్వ దెబ్బలకు నా వీపు వాచిపోతుంది” అన్నాడు శివుడు ఆ రోజున.

“ఇప్పుడు కాదు... చాలాకాలం క్రితం... జ్వలిత చక్రవర్తి దగ్గర సహాయ సేనాపతిగా పనిచేసేవాడు మన సాగరులవారు. ఒకరోజు చక్రవర్తితో కలిసి వేటకు వెళ్ళాడు. ఒక పొదచాటునుంచి మహావ్యాఘ్రం ఒకటి వారిమీదికి లంఘించింది. ఆ వ్యాఘ్రాన్ని చూసి చక్రవర్తి అధివసించి వున్న అశ్వం భయంతో చక్రవర్తిని కిందికి నెట్టి తను దూరంగా పారిపోయింది. కిందపడటంతో చక్రవర్తి చేతిలోని ఖడ్గం కూడా జారిపోయి ఆయన నిరాయుధుడైనాడు...” చెప్పటం మొదలుపెట్టాడు వృద్ధ భటుడు.

తర్కవ్యాకరణ పాఠాలను వినటమంటే తలనొొచ్చినట్లు అనుభూతిని పొందే శివుడికి అటువంటి విషయాలను వినటమంటే మహోత్సాహం. చెవులు రిక్కించి మరీ వింటాడు.

చక్రవర్తితో పాటుగా తనుకూడా కింద పడిపోయాడు మన సాగరులవారు. అయితే చక్రవర్తి మాదిరిగా తన కత్తిని మాత్రం పోగొట్టుకోలేదు. పడిపోయినవాడు తిరిగి పైకి లేవకుండానే పక్కకు వత్తిగిల్లి ఆ కత్తితో ఆ వ్యాఘ్రం గుండెల్లో పొడిచాడు.

“ఏనుగంత వున్న ఆ పులి ఒక్కసారిగా కళ్ళు తేలవేసి పీనుగ అయిపోయింది. సాగరులవారి సాహసానికి మెచ్చుకుని తనకు చెల్లెలి వరస అయిన చారులతాదేవితో వెంటనే పెళ్ళి జరిపించి ఇదిగో... ఈ సంపంగి

మండలానికి మండలాధిపతిగా నియమించాడు చక్రవర్తి" అరమూసిన కనులతో ఎప్పుడో జరిగిపోయిన సంఘటనల్ని వర్ణించి చెప్పాడు వృద్ధ భటుడు.

ముందుగా ఆలోచించకుండా తమ మీదికి దుమికిన పెద్దపులి గుండెల్ని అప్పటికప్పుడు గాయపరటం సాగరుల వారికి ఎలా సాధ్యపడిందో ఎంత ఆలోచించినా బోధపడలేదు శివుడికి ఆ రోజున.

ఇప్పుడు పంజాలతో తన గుండెల్ని అదిమి తలను పైకెత్తి గర్జన చేస్తున్న పెద్దపులిని చూడగానే తెలిసిపోయింది.

తనకు తెలియకుండానే చేతులతో నేలను తడిమాడు. అదృష్టం బాగుంది. అతని ఎడమచేతికి తగిలింది సన్నగా మూరెడు పొడుగున్న చందన వృక్షపు కొమ్మ. రెండో ఆలోచన లేకుండా దాన్ని వడిసి పట్టుకుని పిడిబాకు మాదిరి పైకి పొడిచాడు.

గర్జించటాన్ని ఆపి ఎడమవైపు పంజాను పైకి ఎత్తుతోంది పెద్దపులి బలంగా దెబ్బకొట్టటానికి.

పదునుమీద వున్న కత్తిమాదిరి సరిగ్గా దాని గుండెల్లో దిగబడింది శివుడు ప్రయోగించిన చందనపు కొమ్మ.

గావురుమని అరిచిందా క్రూరజంతువు. అతన్ని వదిలి అమాంతం వెనక్కి పల్టీ కొట్టింది. తిరిగి పైకి లేవలేకపోయింది. గావురు గావురుమనే అరుపు కాస్తా గొణుగుడుగా మారిపోయింది. క్రింది నించి లేచిన శివుడు క్రింద వున్న తన మడ్డుకత్తిని పట్టుకునే సమయానికి ఆ గొణుగుడు కూడా ఆగిపోయింది. ఏనుగు కంటే భీకర జంతువు కాస్తా ఎందుకూ పనికిరాని కళేబరమై కనిపించింది.

ముంచుకు వచ్చిన ప్రమాదం చిటికెలో తప్పిపోయిందన్న సంతోషంతో మైమరచిపోయి అక్కడే నిలబడి వుండలేదు శివుడు. అది ప్రాణాలు వదిలిందని నిర్ధారణ అయిన వెంటనే ఉడత మాదిరి ఒక చెట్టు మీదికి ఎగబ్రాకి, బలమైన ఒక కొమ్మను గట్టిగా పట్టుకుని కూర్చున్నాడు.

అతని ఊహ యదార్థమయింది. మరో పావుఘడియ తరువాత అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చింది అవతలి ఒడ్డుమీదనే ఆగిపోయిన మొదటి పులి. ప్రాణాలు కోల్పోయిన రెండవ పులిని చూసిన వెంటనే విపరీతమైన

భయం కలిగింది కాబోలు ఒక్కసారిగా పొదల్లోకి దుమికి దూరంగా పారిపోయింది.

❖ ❖ ❖

"అబ్బో... నువ్వు సామాన్యుడివి కాదు. గట్టిగా వంచితే పుటుక్కున విరిగిపోయే ఒక పుల్ల ముక్కతో పిశాచం వంటి ఈ పులిని చంపినవాడు ఎవరూ మామూలు మనిషి కాదు. మహా పోటుగాడు" గుండెలమీద చెయ్యి వేసుకుని ఆశ్చర్యం నిండిన కంఠంతో అన్నాడు గ్రామపెద్ద.

చనిపోయి చాలాసేపయిందని తెలుస్తూనే వున్నా నిశ్చలంగా పడివున్న పెద్ద పులి కళేబరం సమీపంలోకి పోయేందుకు కూడా ధైర్యం చాలలేదు అతనితోపాటు వచ్చిన వారందరికీ. తమవెంట తెచ్చిన పొడుగాటి కర్రలతో దాని తలను కాళ్ళను కదిలించి చూశారు.

కొట్టవచ్చినట్టు కనిపిస్తోంది దాని గుండెల్లోకి శివుడు దించిన చందనపు కొమ్మ. రక్తంతో తడిసి కొంచెం బెరుకును కలిగిస్తోంది.

"చందనం కాబట్టి మధ్యలో విరిగిపోకుండా కత్తి మాదిరిగా పనిచేసింది. అదే ఇంకో మారుజాతిది అయి వుంటే పట్టుకోకముందే విరిగిపోయి వుండేది" తల బరుక్కుంటూ చెప్పాడు వాళ్ళందరూ ఎవరిని వెతకటానికి వచ్చారో ఆ గ్రామస్థుల్లో ఒకతను.

"ఏది ఏమయినా ఈ బుడతడు మనకి మహా సహాయం చేశాడు. ఈ ప్రదేశానికి పట్టిన పీడను విరగడ చేసేశాడు. ఇతనికి మనం ఘనంగా ఆతిథ్యం ఇవ్వాలి. అతని తెగింపును గురించి మండలాధిపతుల వారికి వెంటనే తెలియచేయాలి" అన్నాడు గ్రామపెద్ద.

మండలాధిపతి పేరు బయటికి వచ్చేసరికి గతుక్కుమన్నాడు శివుడు. ముడుపుల గట్టు దగ్గర గడపవలసిన తాను ఆ గ్రామస్తుల దగ్గరకు వచ్చి వాళ్ళ ఆతిథ్యం స్వీకరిస్తూ హాయిగా వున్న విషయం తెలిస్తే సాగరులవారికి ఆగ్రహం అధికం అయిపోవచ్చు.

తప్పిపోయిన తమవారిని వెతకటానికి గ్రామస్థులందరినీ వెంటబెట్టుకుని వచ్చాడు గ్రామపెద్ద. చనిపోయిన పెద్దపులిని చూసి పట్టరాని సంతోషంతో పరవశించిపోతున్నాడు. అప్పటికప్పుడు ఎవరినో ఒకరిని నగరంలోకి పంపించినా ఆశ్చర్యపడాల్సిన అవసరం లేదు.

అతని సంతోషానికి వెంటనే అడ్డుకట్ట వేసి తీరాలి.

"తొందరపడకండి... ప్రమాదం ఇంకా పూర్తిగా తప్పిపోలేదు. దీని జోడీ ఒకటి తప్పించుకున్నది. అది ఈ చుట్టుపట్ల ఎక్కడో పొంచి కూర్చునే వుంటుంది" తడుముకోకుండా చెప్పాడు శివుడు. తాను చెరువులోకి దిగిన తర్వాత ఎదురైన అనుభవాన్ని వివరించాడు.

అప్పటివరకూ అత్యంత సంతోషంగా వున్న గ్రామస్థుల మొఖాల్లో వెంటనే ప్రత్యక్షం అయింది విపరీతమైన భయం.

"అమ్మయ్యో! జంట పులులా? ఒకటి తప్పించుకున్నదా? అయితే మన పుట్టి మునిగిపోయినట్టే. ఈసారి అది అడవిలో మాటు వేయటంతో ఆగదు. యేకంగా గ్రామం మీదికి వచ్చి పడుతుంది" తడి ఆరిపోయినట్టు అయిన కంఠంతో అన్నాడు వారిలో ఒకతను.

"వచ్చి పడడం ఏమిటి? అసలు ఈపాటికి వచ్చి బీభత్సం చేస్తూనే వుండి వుంటుంది. వెంటనే వెళ్ళిపోవాలి మనం" అన్నాడు మరొకతను.

శివుడి సాహసాన్ని గురించి మండలాధిపతికి తెలియచేయాలన్న మాటను మరిచిపోయాడు గ్రామపెద్ద. "పదండి. ఆలస్యం చేయకుండా అందరూ వెనక్కి నడవండి. ఇంకెప్పుడు ఎవరూ ఈ ఛాయలకు రాకూడదు" అంటూ తను కూడా సిద్ధం అయ్యాడు వెనక్కి వెళ్ళిపోవటానికి.

గ్రామంలోకి పోగానే, అంతవరకూ వాళ్ళు తనకు ఇచ్చిన ఆతిథ్యానికి కృతజ్ఞతలు తెలియచేసుకుని, ముడుపుల గట్టు దగ్గరకు వెళ్ళిపోవచ్చని సంతోషపడ్డాడు శివుడు. "పదండి... త్వరగా పదండి" అంటూ వారిని తొందరపెట్టి తను వెనుకగా అడుగులు వేయాలని అనుకున్నాడు.

అనుకోవటం అయితే అనుకున్నాడు గాని,రెండు అడుగులు కూడా వేయలేకపోయాడు అతను. అందుకు కారణం అంతకుముందు మొదటి పెద్దపులి పారిపోయిన దిక్కునుంచి భయంకరంగా ఘీంకారాలు వినిపించటం.

"అయ్య నాయనో.. ఇంతకు ముందు పెద్దపులి ఇప్పుడు ఏనుగులు... మన పని అయిపోయింది. మనం తిరిగి గ్రామంలోకి వెళ్ళలేము" విపరీతమైన భయంతో గజగజ వణికిపోతూ అన్నాడు ఒక గ్రామస్థుడు.

"పరిగెత్తండిరా... పరిగెత్తండి. అవి మన దగ్గరికి వచ్చేలోపల ప్రాణాలు దక్కించుకోవాలి... పరిగెత్తండి" బిగ్గరిగా అరిచి అందరినీ హెచ్చరించాడు గ్రామపెద్ద.

భయం అందరికీ నూతనశక్తిని ప్రసాదించినట్టు అతివేగంగా పరిగెత్తారు గ్రామస్తులు. అరనిమిషంలో ఆ ప్రదేశానికి దూరంగా వెళ్ళిపోయారు. ప్రాణం లేని పెద్దపులి కళేబరం దగ్గర ఒంటరిగా శివుడు ఒక్కడే మిగిలిపోయాడు.

గ్రామస్థులతో సరిసమానంగా పరిగెత్తలేక అలా ఆగిపోలేదు అతను. అదేపనిగా వినిపిస్తున్న ఘీంకారాలు అతనికి అంతకుముందు తను విని వున్నట్లే అనిపిస్తోంది.

నీటిమడుగు దగ్గర మొసళ్ళను దూరంగా తరమటానికి ప్రయత్నం చేస్తూ అదేమాదిరి గోల చేసింది మగ ఏనుగు.

అధికం అయిపోయింది శివుడి కుతూహలం. అది అతని భయాన్ని దూరం చేసి వేసింది. దూరంగా పోయిన గ్రామస్థుల గురించి మర్చిపోయి ఘీంకారాలు వినవస్తున్న వైపుకు పరిగెత్తాడతను.

సరిగ్గా రెండు వందల ధనువుల దూరం మాత్రమే పోయాడతను. చెట్ల మధ్యన వున్న చిన్న చదరపు స్థలంలో కనిపించిన దృశ్యాన్ని చూసి స్థాణువై పోయాడు.

తీవ్రంగా గాయపడి వుంది పారిపోయి వచ్చిన పెద్దపులి. కోరలు కనపడేలా నోటిని తెరిచి చెవులు చిల్లులు పడేటట్లు గర్జించటానికి ప్రయత్నం చేస్తోంది.

శబ్దం బయటికి రాకుండా దాని మెడమీద పాదం పెట్టి బలంగా అదుముతోంది అతనికి బాగా పరిచయం అయిన మగ ఏనుగు.

తొండాన్ని పైకి ఎత్తి పిచ్చిపిచ్చిగా ఘీంకారాలు చేస్తోంది పక్కనే వున్న ఆడ ఏనుగు.

చదరపు స్థలం దగ్గర ప్రత్యక్షం అయిన శివుడిని చూడగానే ఘీంకారాలు ఆపేసింది అది. వేగంగా అడుగులు వేస్తూ అతని దగ్గరికి వచ్చింది.

చలిగాలి వీచినట్లు జలదరించింది శివుడి శరీరం. తన పని అయిపోయిందని అనుకున్నాడు అతను. అన్నీ తెలిసిన పెద్ద పోటుగాడిలా సూటిగా వచ్చి వాటి కంట పడినందుకు తనను తానే నిందించుకుంటూ గిరుక్కున వెనక్కి తిరిగి వచ్చిన దారినే పరుగు తీయాలని కూడా అనుకున్నాడు.

అడుగు కదపకముందే అతన్ని సమీపించి తొండంతో అతని నడుమును చుట్టింది ఆడ ఏనుగు. చిన్నపిల్లల్ని పెద్దవాళ్ళు గాలిలోకి ఎత్తి తిరిగి కిందికి దించుతూ ఆనందించే పద్ధతిలో రెండుసార్లు పైకి కిందికి ఎత్తి చిన్నపాటి శబ్దం చేసింది.

ఆ శబ్దాన్ని వినగానే పెద్దపులిని వదిలి తానుకూడా వచ్చేసింది మగ ఏనుగు. బారెడు బారెడు పొడుగున్న తన దంతాలు శివుడికి తగలకుండా తల వంచి సున్నితంగా అతని ముఖాన్ని తలతో తడిమింది.

తన ప్రాణాలకు వచ్చిన భయం ఏమీ లేదని తెలిసిపోయింది శివుడికి. అవి తనను గుర్తుపట్టాయి. శత్రువు కాదని గ్రహించాయి.

ఆ మాట అనుకోగానే శాంతించింది అతన్ని కలవరపెట్టడం మొదలుపెట్టిన ఆరాటం. ఆరాటం అణిగిపోయిన వెంటనే అతని దృష్టి అడ్డదిడ్డంగా పడివున్న పెద్దపులి మీదికి మరలింది.

దానిలో ఇంకా ఏదో కదలిక వున్నట్టు అనిపించింది అతనికి. “ఒక్క నిమిషం ఆగండి. దాన్ని పూర్తిగా పరలోకానికి పంపించకపోతే ప్రమాదం” అంటూ ఆడ ఏనుగు తన నడుము చుట్టు చుట్టిన తొండాన్ని మృదువుగా వదిలించుకుని అటు పరిగెత్తాడు.

అలా పరిగెత్తాల్సిన అవసరం లేదని వెంటనే తెలిసిపోయింది అతనికి. అతని మాటలు తనకు అర్థం అయ్యాయో లేక అతని కదలికల వల్ల అతని ఆలోచన గ్రహింపుకు వచ్చిందో గాని, అతని కంటె వేగంగా కదిలి, పడిపోయి వున్న పులిని తన తొండంతో ఎత్తి గిరగిరా తిప్పి నేలకేసి కొట్టింది మగ ఏనుగు.

కీచుగా చిన్నశబ్దం చేసి ప్రాణాలు వదిలేసింది ఆ పెద్దపులి. తలను వ్రేలాడవేసి చలనం లేకుండా వుండిపోయింది.

❖ ❖ ❖

“... ఏమిటీ? ముడుపుల గట్టు దగ్గర వాడు కనిపించలేదా? సరిగ్గా చూశారా?” ఆశ్చర్యం, ఆందోళన నిండిన కంఠంతో అడిగాడు సాగరుడు.

“మండలేశ్వరుల వారు సరిగ్గా ఆలోచించటం లేదు. సరిగ్గా చూడటం ఏమిటి? వాళ్ళు వెళ్ళింది చూడటానికే” చిన్న కంఠంతో అన్నాడు మంత్రి మహేశ్వరుడు.

"అదికాదు మహేశ్వరా... ఆ గట్టు దగ్గర వున్న బండల్ని, పొదల్ని కూలంకషంగా శోధించి చూశారా అని నా భావం" తన మాటలకు అర్థాన్ని వివరించాడు సాగరుడు.

"అన్నీ చూశాము దేవరా... గట్టుమీదికి ఎక్కి కేకలు కూడా పెట్టాము. సమాధానం రాలేదు. కనీసం జాడలు కూడా..." అంటూ వున్నట్లుండి మాటల్ని ఆపాడు శివుడి కోసం ముడుపుల గట్టు దగ్గరికి పోయిన భటుల్లో ఒకతను.

"ఆపావేమిటి? పూర్తిగా చెప్పు... త్వరగా చెప్పు" గర్జించాడు సాగరులవారు.

"గట్టుకు దూరంగా పొదల మధ్యలో మాకు ఆరిపోయిన నెగడు ఒకటి కనిపించింది. పదిమందికి పైగా వున్న జనం ఎవరో అక్కడ ఒకటి రెండు రోజులు నివశించినట్టు అనిపించింది" చెప్పాడు ఆ భటుడు.

"మన వాళ్ళెవరయినా అడవిలో వేటకు వెళ్లివుంటారా?" వెంటనే మహేశ్వరుడిని అడిగాడు సాగరుడు.

తల అడ్డం తిప్పాడు మహేశ్వరుడు.

"పక్క మండలం నుంచి వచ్చిన పాంథులు ఎవరైనా అక్కడ విశ్రాంతి తీసుకోవడం జరిగి వుంటుంది" తనకు తనే సమాధానం చెప్పుకుంటున్నట్టు అన్నాడు సాగరుడు.

వెనక్కి తిరిగి పెద్దగా చప్పట్లు కొట్టాడు మహేశ్వరుడు. వెంటనే వచ్చి నమస్కారం చేశాడు ఆ మందిర ద్వారం దగ్గర నిలబడి వున్న భటుడు.

"కోట ద్వారం దగ్గరి కావలి భటుల నాయకుడిని వెంటనే రమ్మని చెప్పు. శివుడిని మనం ముడుపుల గట్టు దగ్గరికి పంపిన తర్వాత కొత్తగా నగరంలోకి వచ్చినవారి వివరాలు మాకు కావాలి" ఆజ్ఞ ఇచ్చాడు మహేశ్వరుడు.

"ఇప్పుడు ఏం చేయటం మహేశ్వరా?" నుదురు రుద్దుకుంటూ అడిగాడు సాగరుడు.

ముడుపుల గట్టు దగ్గర వుండాల్సిన శివుడు మటుమాయం అయిపోయాడని తన సతీమణికి తెలిస్తే పరిస్థితి ఎలా వుంటుందో అతని ఊహకి అందటంలేదు.

"మండలేశ్వరుల వారు అనవసరంగా హైరానా పడకండి. శివుడు ఎక్కడికీ పోడు. ముడుపుల గట్టుకు ఆవలి పక్కన రెండు మూడు గ్రామాలు వున్నాయి. వాటి దగ్గరికి భటుల్ని పంపించి..." అంటూ మొదలుపెట్టాడు మహేశ్వరుడు.

"రెండు గ్రామాల దగ్గరికీ పోయి వచ్చాము. ఎవరూ తమ దగ్గరికి రాలేదని గ్రామపెద్దలు చెప్పారు" అతని మాటలు పూర్తికాకముందే చెప్పాడు శివుడి కోసం పోయి వచ్చిన వారిలో రెండో భటుడు.

"మూడో గ్రామానికి ఎందుకు పోలేదు?" నొసలు ముడివేస్తూ కోపంగా అడిగాడు మహేశ్వరుడు.

"నెత్తురు రుచి మరిగిన పెద్దపులి ఒకటి ఆ గ్రామం సమీపంలో తిరుగు తున్నదని మేము వెళ్ళిన రెండు గ్రామాల్లోను చెప్పారు. మా దగ్గర వున్న ఆయుధాలు ఆ పులిని ఎదిరించటానికి సరిపోవని మేము వెనక్కి తగ్గాము" తల వంచుకుంటూ చెప్పాడు ఆ భటుడు.

"ప్రభూ... కోట ద్వార రక్షకుల నాయకుడు వచ్చారు" ద్వారం దగ్గిర్నించి ఒక అడుగు లోపలికి వేసి చిన్నగా చెప్పాడు కాపలా భటుడు.

బరువైన పాదరక్షలు టకటకమని చప్పుడు చేస్తుండగా లోపలికి వచ్చి సాగరులవారికి, మహేశ్వరుడికి నమస్కారం చేశాడు కోట ద్వారాన్ని రక్షించే భటుల నాయకుడు.

"మూడు రోజుల క్రితం పన్నెండుమంది వర్తకులు మన నగరంలోకి వచ్చారు. ప్రస్తుతం వాళ్ళు విపణి వీధిలోనే వున్న మన ధర్మసత్రంలో విడిది చేసి వున్నారు. రెండురోజుల క్రితం నలుగురు గ్రామస్థులు, నిన్న ఇద్దరు మాత్రమే నగరంలోకి వచ్చారు. రేపు కనీసం రెండు మూడొందల మంది రావచ్చును. ప్రతి నెలా పౌర్ణమి తిథి నాడు జరిగే సంత– ఏదో కారణం వల్ల రేపే జరుగుతుందని చాటింపు వేయబడింది" లోపలికి వస్తూనే వివరంగా చెప్పాడతను.

"ఆ వచ్చిన వారిలో ఎవరైనా ముడుపుల గట్టు దగ్గరికి పంపబడిన శివుడిని చూసి వుంటారేమో తెలుసుకో" ఆజ్ఞ ఇచ్చాడు మహేశ్వరుడు. అతన్ని వెళ్ళిపోవచ్చుని సైగ కూడా చేశాడు.

"పాతికమంది సైనికుల్ని పంపి ఆ మూడోగ్రామం దగ్గర కనిపించిన పెద్దపులికి..." అని మొదలుపెట్టి అర్థంతరంగా మాట ఆపేశాడు సాగరుడు. అతని మొఖం కొంచెం కళ తప్పడం మహేశ్వరుడికి కనిపించింది.

"మీరు దయచేసి అనవసరమైన ఊహలు చేయకండి... శివుడికి ఎటువంటి హాని జరిగివుండదు. అతను ఆ పెద్దపులికి కనిపించడం, అది అతన్ని ఆహారంగా చేసుకోవడం అన్నీ మీరు ఊహించుకోవద్దు" అంటూ అప్పటికప్పుడు ఒక నిర్ణయానికి వచ్చినట్టు తలవూపి "వాళ్ళు వీళ్ళు అనవసరం. నలుగురు సైనికుల్ని వెంటబెట్టుకుని నేనే స్వయంగా ఆ గ్రామం దగ్గరికి వెళ్ళి వస్తాను..." అన్నాడు.

కొద్దిగా తేటపడింది సాగరుల వారి వదనం. "వెంటనే చెయ్యి ఆ పని, ఈ సాయంత్రానికల్లా శివుడిని వెంటబెట్టుకు రావాలి" అంటూ అనుమతి ఇచ్చాడు.

గట్టు దగ్గరికి వెళ్ళివచ్చిన వారిని వెంటబెట్టుకుని మందిరంలో నుంచి బయటికి వెళ్ళిపోయాడు మహేశ్వరుడు.

సింహాసనం దిగి తానుకూడా అంతఃపురం కేసి కదలవలసిన సాగరుల వారు మాత్రం ఆ పని చేయటానికి ఓపిక లేనట్టు అలాగే కూర్చుండిపోయాడు.

తల్లిదండ్రి లేని అనాధలంటే అమితమైన ఆదరం చారులతాదేవికి. అసలు తల్లి ఎవరో తండ్రి ఎవరో ఎంతమాత్రము వివరాలు తెలియని శివుడంటే విపరీతమైన పక్షపాతం.

ఇప్పుడు వినవచ్చిన మాట ఆమె చెవులకు చేరితే... ఆ పైన ఊహించటానికి మనస్కరించలేదు సాగరుల వారికి. గాఢంగా నిట్టూర్చి ఆసనం మీదినుంచి లేవబోతుండగా అనుమతి కోరకుండానే లోపలికి పరిగెత్తుకు వచ్చాడు ద్వారం దగ్గర కావలి భటుడు.

"దేవరా! త్వరగా రావాలి. తమరు వెతికిస్తున్న శివుడికి సంబంధించిన సమాచారం అందింది" ఆయాసపడిపోతున్నట్టు ఒక్క గుక్కలో చెప్పాడు.

ఝల్లుమన్నది సాగరుడి శరీరం. ఎటువంటి సమాచారమైనా సభా మందిరంలోకి వచ్చి తనకు విన్నవించాలనే నియమాన్ని మరిచిపోయి, పెద్ద పెద్ద అడుగులతో బయటకు పోయాడు.

ముడుపుల గట్టు అవతల వున్న మూడో గ్రామం దగ్గరికి స్వయంగా బయలుదేరతానని చెప్పిన మహేశ్వరుడు ఆ భవనం వెలుపలే కనిపించాడు అతనికి ఒక గ్రామీణుడితో మాట్లాడుతూ.

"మనవాళ్ళు చెప్పిన పెద్దపులిని ఒక చందనపు కొమ్మతో పొడిచి ప్రాణాలు తీశాట్ట శివుడు. ఈ మనిషి ఆ మూడో గ్రామం నించి వాళ్ళ గ్రామపెద్ద పంపగా వచ్చాడు" మెరుస్తున్న కనులతో చెప్పాడు అతను.

సాగరుడి కనులు కూడా అదేమాదిరి మెరిశాయి. "ఏడి వాడు? ఎక్కడ వున్నాడు? కత్తులు, బరిశెలు వున్నా కూడా చంపలేని పులిని చెట్టుకొమ్మతో ఎలా చంపగలిగాడు?" ఆశ్చర్యంగా అడిగాడు.

"రెండో పులి మీదపడుతుందన్న భయంతో గ్రామానికి పారిపోయి వచ్చారట వాళ్ళందరూ. శివుడు కూడా ఎక్కడో ఏదో చెట్టుమీదికి ఎక్కి ప్రాణాలు కాపాడుకుంటూ వుంటాడని అనుకుంటున్నారు" అన్నాడు మహేశ్వరుడు. గ్రామస్థుడు చెప్పినదంతా వివరించాడు.

ఆ పైన క్షణకాలం కూడా ఆలస్యం చేయలేదు సాగరుడు. "మనవాళ్ళు పదిమందిని సిద్ధం చేయించు. అశ్వాలను తెప్పించు. నేనుకూడా వస్తున్నాను" అంటూ సభామందిరంలోకి పోయి సింహాసనం పక్కనే పెట్టిన తన ఖడ్గాన్ని వరతో సహా మడిచి బయటికి వచ్చాడు.

అశ్వాలు సైనికులు సిద్ధం అయ్యేసరికి పావుఘడియ కాలం పట్టింది. వారందరూ నగర ద్వారాలు దాటి అడవికేసి బయలుదేరటానికి మరో పావు ఘడియ అవసరం అయింది. ఈ లోపల కార్చిచ్చు మాదిరి నగరమంతా గుప్పుమన్నది ఆ వార్త.

❖ ❖ ❖

"చందనపు కొమ్మ? వేలెడంత లావుగానే వున్నదా? గట్టిగా వంచితే పుటుక్కున విరిగిపోయేటట్టు కనిపిస్తోందా?" ఆశ్చర్యంగా అడిగింది సాగరుల వారి సతీమణి చారులతాదేవి.

సభా భవనం దగ్గర మిగిలిపోయిన గ్రామస్తుడిని స్వయంగా వెంటబెట్టుకుని ఆమె ఎదుటికి తీసుకువచ్చింది ఒక పరిచారిక.

అడవిలో మాయం అయిపోయాడని అనుకున్న తమ సోదర గ్రామీణులు ఎలా రక్షించబడ్డారో సవివరంగా ఆమెకు చెప్పాడు ఆ గ్రామస్థుడు.

"ఆ పిల్లడు సామాన్యుడు కాదు తల్లీ... ఆ గుండెనిబ్బరం, ఆ తెగింపు మాటల్లో చెప్పటం కష్టం. వేలెడంత వున్నప్పుడే ఇంత తెగువ చూపినవాడు

పెరిగి పెద్దవాడయితే ఇంకెంత రాణిస్తాడో ఊహించటం కష్టం” అని కూడా అన్నాడు.

చిరునవ్వులమయమైపోయింది చారులతాదేవి వదనం. “ఇతనికి సుష్టుగా భోజనం పెట్టించండి. వాళ్ళ గ్రామానికంతటికీ సరిపడే పిండివంటలు బుట్టలో పెట్టి ఇవ్వండి. దారి ఖర్చులకు వంద వెండి నాణేలు ఇచ్చి పంపండి” అని ఆజ్ఞ ఇచ్చింది వెంటనే.

వంగి వంగి నమస్కారాలు చేస్తూ వెళ్ళిపోయాడు ఆ గ్రామస్థుడు.

“శివుడు నగరంలోకి తిరిగి రాగానే మా దగ్గరికి తీసుకురండి. మేము మాత్రమే మొదటిగా అతనితో మాట్లాడాలి. అర్థం అయిందా?” పరిచారికలకు చెప్పింది చారులతాదేవి.

❖ ❖ ❖

పగలంతా నడిచాయి ఏనుగులు. చీకటి పడిన వెంటనే ఒక పెద్ద నేరేడు చెట్టుదగ్గర ఆగాయి.

మగ ఏనుగు మీదనుంచి కిందికి దూకి బద్ధకంగా ఒళ్ళు విరుచుకున్నాడు శివుడు. చదరపు స్థలంలో చచ్చిపడిపోయిన పెద్దపులి దగ్గిర్నించి, గ్రామం వైపు వెళ్ళిపోవాలని అనుకున్నాడు అతను మొదట్లో.

అనుకోవడం వరకూ బాగానే అనుకోగలిగాడు. పొదలకేసి అడుగు వేసిన మరుక్షణం అతన్ని అడ్డుకున్నది ఆడ ఏనుగు. తొండంతో అతని నడుమును చుట్టి వెనక్కి లాగేసింది.

తమ గ్రామంకేసి వెళ్ళటం వాటికి ఇష్టం లేదని మాత్రమే అర్థం అయింది శివుడికి- అలా రెండుసార్లు జరిగిన తర్వాత.

“ఎందుకు నన్ను ఆపటం? నావల్ల ఇంకేదైనా సహాయం కావాలా? ఎటువంటి సహాయం కావాలి?” విసుగుపుట్టి వివరంగా అడిగాడు.

అమాంతం అతన్ని ఎత్తి తన తల దగ్గర కూర్చోబెట్టుకున్నది మగ ఏనుగు. ఆడ ఏనుగుతో కలిసి పొదల మధ్యగా అడవి మధ్యభాగంలోకి బయలుదేరింది.

అవి ఎక్కడికి తీసుకుపోతున్నాయో, ఎందుకు తీసుకుపోతున్నాయో ఎంత ఆలోచించినా అవగతం కాలేదు శివుడికి. మనిషిని చూసిన వెంటనే మీదికి వచ్చి పాదాలతో పాతాళానికి పంపించే ఆ అడవిజీవాలు తనకు ఎటువంటి

హాని తలపెట్టకపోగా పెంపుడు జంతువుల మాదిరి మచ్చికగా మెలగటం ఏమిటో కూడా తెలియటంలేదు అతనికి.

పగలంతా ఎక్కడా ఆగకుండా ప్రయాణం చెయ్యటం వల్ల విపరీతమైన బడలికతో పాటు ఆకలి కూడా అతన్ని బాధించటం మొదలుపెట్టింది.

"మీకు ఆహారం అవసరం లేదేమోగాని, నాకు మాత్రం కావాలి... నా కళ్ళు నీరసంతో గిర్రున తిరిగిపోతున్నాయి" తనవంకే చూస్తున్న ఆడ ఏనుగుతో చెప్పి, వున్నట్టుండి నేరేడు చెట్టుమీదికి ఎగబ్రాకాడు.

చీకట్లోనే తడిమి తడిమి నేరేడుపళ్ళు కోసుకున్నాడు. పండినవో, పచ్చిగా వున్నవో చూసుకుని నోటిలో పెట్టుకున్నాడు.

ఒక మోస్తరుగా కడుపు నిండగానే ముంచుకు వచ్చింది అతనికి నిద్ర. కిందికి దిగి వచ్చి చెట్టు మొదల్లోనే ముడుచుకు పడుకున్నాడు. తిరిగి కనులు విప్పేసరికి తొలి వెలుగులు ప్రత్యక్షం అవుతూ వుండటం కనిపించింది. మరోసారి అతని అనుమతితో నిమిత్తం లేకుండానే పొదల మధ్య పరుగులు మొదలుపెట్టాయి ఏనుగులు. సూర్యుడు రెండు బారల ఎత్తుకు ఎదుగుతున్న సమయంలో పెద్ద నీటిగుంట దగ్గర ఆగి అతన్ని కిందికి దించాయి.

భూకంపం వచ్చినట్టు బీభత్సంగా వుంది నీటిగుంట చుట్టు వున్న ప్రదేశం. చెట్లకొమ్మలు చెల్లాచెదురుగా విరిగిపోయి వున్నాయి. పొదలు మొదళ్ళకంటా నలిగి నాశనమై వున్నాయి. ఆ పొదల మధ్యలో శివుడికి అగుపించాయి పెద్ద పెద్ద గోతులు.

ఆ ప్రదేశం ఎందుకలా నాశనమై కనిపిస్తోందో ఆ గోతుల్ని చూసిన వెంటనే తెలిసిపోయింది శివుడికి.

సాగరులవారి గజశాలలో ప్రస్తుతం సాకబడుతున్న కొత్తఏనుగుల మందని కాపుకాసి పట్టుకున్న ప్రదేశం అదే.

నీరు తాగటానికి వచ్చే దార్లన్నిటిలోను గోతులు తవ్వి వాటిని బంధించారు. మోకులు కట్టి అతి బలవంతంగా నగరంలోకి మళ్ళించారు.

"మీ బాధను నేను అర్థం చేసుకున్నాను. కాని పట్టుబడిన ఏనుగుల్ని వదిలించే శక్తి నాకు లేదు. అటువంటి మాట నా నోట్లోనుంచి బయటికి వస్తే నాకు పిచ్చిపట్టిందని అంటారు. మళ్ళీ ఇంకో శిక్షను విధిస్తారు" అని ఆడ ఏనుగుకు చెపుతూ, చెపుతూ వున్నట్టుండి ఉలిక్కిపడ్డాడు అతను.

సాగరులవారి గజశాలలో ఒక మూలగా నిలబడి, ఆహారం కూడా తీసుకోకుండా తల్లికోసం అలమటిస్తోంది ఒక పిల్ల ఏనుగు. అది ఈ ఆడ ఏనుగు సంతానమే అయివుంటుందా?

అసహనంగా అటూ ఇటూ కదులుతున్న ఆడ ఏనుగును చూసినకొద్దీ తన అనుమానం యదార్థమేనేమో అనిపించటం మొదలుపెట్టింది అతనికి. అనిపించటమైతే అనిపించింది గాని, ఆ తరువాత చేయవలసింది ఏమిటో తెలియలేదు.

తనకు విధించబడిన శిక్ష పూర్తికాకముందే నగరంలోకి వెళ్ళటం నిషిద్ధం. ఎవరికీ కనిపించకుండా ఆ పని చేయవచ్చు. కాని గజశాలలో వున్న పిల్లఏనుగును బయటికి తీసుకురావటం అసాధ్యం. అసంభవం.

సాగరుల వారికి చెప్పి ఆయన అనుమతి తీసుకుంటే తప్ప జరిగేపని కాదు అది. పిల్ల ఏనుగును విడుదల చేయమని అడిగితే అందుకు ముందు పెద్ద ఏనుగుల్ని చూపించమంటారు. వాటిని చూపించిన వెంటనే గొలుసులతో బంధించి వాటిని కూడా గజశాలలోకి చేరుస్తారు.

రెండో కంటివాడికి తెలియకుండా జరిగిపోవాల్సిన పని అది. ఎలా??

అక్కడితో ఆగిపోయాయి శివుడి ఆలోచనలు. "బురదగుంటలో నుంచి నిన్ను బయటికి లాగానని చెప్పి, నన్ను ఒక మహావీరుడిగా భావించుకోకు. నేను చేయలేని పనులు ఈ ప్రపంచంలో చాలా వున్నాయి. దయచేసి నన్ను అర్థం చేసుకోవటానికి ప్రయత్నించు" ఆడ ఏనుగు తొండం మీద అరచేత్తో అదుముతూ అనునయంగా చెప్పాడు.

ఉన్నట్లుండి వెనక్కి జరిగిందా మూగజంతువు. తొండాన్ని గాలిలోకి ఎత్తి ఘీంకారాలు చేయటం మొదలుపెట్టింది.

ఆగ్రహంతోనో, ఆనందంతోనో చేస్తున్న శబ్దాలు కావు అవి. గుండెలోని ఆవేదనను బయటికి వెళ్ళగ్రక్కే దీనారావాలు. ఎంత బాధ వాటిల్లో ధ్వనిస్తోందంటే వాటిని వింటున్న శివుడి కళ్ళవెంట గిర్రున తిరిగాయి నీళ్ళు.

అప్పటికప్పుడు తనకు తెలియకుండానే ఒక పెద్ద నిర్ణయాన్ని తీసుకున్నాడు అతను. "చీకటి పడే సమయంలో నగరం దగ్గరికి పోయి ఏదో ఒకటి చేస్తాను. తల్లక్రిందులుగా నిలబడైనా సరే ఆ పిల్ల ఏనుగును బయటికి తీసుకు వచ్చి

నీకు చూపిస్తాను. నువ్వు అరుపుల్ని ఆపేయ్... భరించటం నాకు చేతకావటం లేదు" దాని దగ్గరికి జరిగి చిన్నకంఠంతో మృదువుగా చెప్పాడు.

చిత్రంగా అతని మాటలు తనకు సంతోషాన్ని కలిగించినట్టు తలను కదిలిస్తూ ఘీంకారాల్ని ఆపేసిందా ప్రాణి.

❖ ❖ ❖

తుమ్మిడి మడుగుకు ఆవలి ప్రక్కన పడివున్న వ్యాఘ్రాన్ని దాని గుండెల్ని గాయపరిచి ప్రాణాలు తీసిన ఆయుధాన్ని చూసి, ఆశ్చర్యంగా తల విదిలించాడు సాగరులవారు.

"గుర్తున్నదా ప్రభూ... గతంలో చక్రవర్తి మీదికి దుమికిన పులిని మీరు ఎలా గాయపరిచారో, సరిగ్గా అదే పద్ధతిలో పొడిచాడు శివుడు. ఒక్కటే తేడా..." తనుకూడా ఆశ్చర్యపడుతూ అన్నాడు మంత్రి మహేశ్వరుడు.

"ఏమిటది?" అడిగాడు సాగరులవారు.

"అప్పుడు మీరు ఉపయోగించింది పదునైన పటకా కత్తి. ఇప్పుడు శివుడు వాడినది కత్తి కాదు. ఒట్టి కర్రపుల్ల" రక్తంతో మలినమై వున్న చందనపు పుల్లని తన దగ్గర వున్న బరిశెతో కదిలిస్తూ చెప్పాడు మహేశ్వరుడు.

"ఆయుధాల్ని ఉపయోగించటం, ఆత్మరక్షణ చేసుకోవటం ఎలాగో మనం ఇంకా వాడికి నేర్పించలేదు. పిశాచం వంటి ఈ మెకాన్ని చూసి భయంతో బిగుసుకుపోకుండా వేగంగా ఆలోచించటం వాడికి ఎలా సాధ్యమైంది?" తనలో తను అనుకుంటున్నట్లు పైకే అన్నాడు సాగరులవారు.

"నేర్చుకుంటే వచ్చేవి కావు ప్రభూ, ఇటువంటి ఆలోచనలు. పుట్టుకతోనే రక్తంలో జీర్ణించుకుని వుండాలి. నా అంచనా ఏమిటంటే శివుడి తల్లితండ్రులు ఎవరో గాని, ఆయుధాల్ని ఉపయోగించటంలో నిష్ణాతులు అయివుంటారు. అంతకుమించి చాలా తెంపరితనం కలిగినవారై వుంటారు. ఆ పోలికలే వీడికి వచ్చివుంటాయి" చెప్పాడు మహేశ్వరుడు.

సాగరుల వారు ఆ మాటలకు సమాధానం ఇవ్వకముందే పరుగు పరుగున అక్కడికి వచ్చారు పొదల్లోకి పోయిన భటులు మరో నలుగురు.

"రెండోపెద్దపులి ఇక్కడికి దగ్గర్లోనే పడిపోయింది ప్రభూ... బండలతో బాది,బరువైన పాదాలతో అదిమినట్టు ఛిన్నాభిన్నం అయిపోయి వుంది దాని శరీరం.." వస్తూనే ఊపిరి తీసుకోవటానికి కూడా ఆగకుండా గబగబా చెప్పారు.

ఆశ్చర్యం ఇనుమడిస్తుండగా మహేశ్వరుడికేసి చూశాడు సాగరులవారు.

"ఒక పనిని పూర్తిచేసి రెండో పనిని వదిలివేసేతత్వం కాదు శివుడిది. దాన్ని ఎలా మట్టుబెట్టగలిగాడో చూసి తీరాలి. పదండి'' అన్నాడు మహేశ్వరుడు.

వేగంగా అడుగులు వేస్తూ అవతలిగా వున్న చదరపు స్థలం దగ్గరికి పోయారు వారిద్దరూ.

"ఇది మాత్రం శివుడి పని కాదు ప్రభూ! ఏనుగుల పని. ఇవిగో వాటి అడుగుజాడలు" ఆ ప్రదేశంలో అడుగుపెట్టిన వెంటనే చుట్టూ చూసి తన అభిప్రాయాన్ని తెలియచేశాడు మంత్రి మహేశ్వరుడు.

"ఇవి... ఈ ఏనుగులేమైనా శివుడికి అపకారం చేసి వుంటాయా?" తన మనసులోని అనుమానాన్ని వెంటనే బహిర్గతం చేశాడు సాగరులవారు.

"అవకాశం లేదు ప్రభూ... చెప్పాపెట్టకుండా వచ్చిపడే భూతంలాంటి పెద్దపులినే మట్టుబెట్టినవాడు... గ్రామస్తులందరితో కలిసి ఈ ఏనుగుల సందడిని తనుకూడా విన్నట్టు మనకు తెలిసింది. ముందు జాగ్రత్తలు చాలా తీసుకునే వుంటాడు" నమ్మకంగా చెప్పాడు మహేశ్వరుడు.

"అలా జరిగివుంటే మరి వాడు గ్రామస్థులతో పాటు వెనక్కి వచ్చేయాలి కదా... ఎందుకు రాలేదు? ఏమైపోయినట్టు?" విసుగు నిండిన కంఠంతో అడిగాడు సాగరులవారు.

"మనం నగరానికి తిరిగిపోయి, మరో పాతికమంది భటుల్ని పంపిద్దాం. అడవినంతా గాలించమని చెపుదాం. ఒకవేళ శిక్షా కాలం పూర్తి అయిపోయిందనుకుని వాడు నగరంకేసి వెళ్ళి వుండవచ్చు" అన్నాడు మహేశ్వరుడు.

మరో పదినిమిషాలు పట్టింది సాగరుల వారికి ఒక నిర్ణయానికి రావటానికి. నగరంలోకి వెళ్ళిన వెంటనే తన సతీమణికి చెప్పవలసిన మాటల్ని అప్పటినించే సిద్ధం చేసుకుంటూ తల వూపాడాయన.

తుమ్మిడి మడుగుకు ఆవలి పక్కన వదిలిన అశ్వాలను తీసుకువచ్చి వారి ఎదుట నిలబెట్టారు భటులు. వాటిని అధిరోహించి నగరంకేసి ప్రయాణం అయ్యారు వారిద్దరూ.

❖ ❖ ❖

సంపంగి నగర ద్వారాలకు మూడు వందల ధనువుల దూరంలో వుంటుంది పెద్ద చెట్లతోపు. తన ఏనుగులు రెండింటినీ ఆ తోపులో ఆపేశాడు శివుడు.

“నగర ద్వారం దగ్గర వుండే భటులు గాని, లోపలికి బయటికి తిరుగాడే జనం గాని మిమ్మల్ని గమనిస్తే కొంపలు అంటుకుంటాయి. ఇనుప గొలుసుల్ని, పెద్ద పెద్ద వలల్ని పట్టుకుని వచ్చేస్తారు. తీసుకుపోయి గజశాలలో బంధిస్తారు. ఎట్టి పరిస్థితుల్లో మీరు ఈ చెట్లను దాటి ముందుకు రాకూడదు” అప్పటివరకు తను మాట్లాడిన ప్రతిమాటను అవి అర్థం చేసుకోగలుగుతున్నాయన్న నమ్మకంతో చాలా గట్టిగా హెచ్చరించాడు.

అర్థం అయినట్లే ప్రవర్తించాయి ఆ రెండు. అతన్ని అనుసరించే ప్రయత్నాన్ని విరమించుకొంటున్నట్లు వెనక్కి జరిగి స్థిమితంగా నిలుచున్నాయి.

గుండెల మీదినుంచి కొండంత బరువు దిగిపోయినట్టు తేలికగా నిట్టూర్చి తోపులోనుంచి బయటికి వచ్చాడు శివుడు.

హడావుడి చాలా అధికంగా కనిపించింది అతనికి నగర ద్వారాల దగ్గర. చీకట్లుదట్టం అయిన వెంటనే గాలికూడా చొరబడటానికి వీలు లేనంత గట్టిగా మూసుకుంటాయి అవి. తిరిగి తెరుచుకోవాలంటే సూర్యోదయం అవ్వాల్సిందే.

బయటి గ్రామాల నుంచి వచ్చినవాళ్ళు ఏదో ఒక పనిమీద నగరంలోనుంచి వెలుపలికి వచ్చినవాళ్ళు ఎవరైనా సరే– ఆ తలుపులు మూసుకోకముందే తమ తమ నెలవులకు వెళ్ళిపోవాలి. అలా వెళ్ళలేకపోతే తిరిగి అవి తెరుచుకునేంత వరకూ ఎక్కడ వున్నవాళ్ళు అక్కడే ఆగిపోవాలి.

బరశెలు పట్టుకుని శిలావిగ్రహాల మాదిరి ద్వారాలకు అటూ ఇటూ నిలబడివుంటారు భటులు. అనుమానం కలిగిందంటే పెడరెక్కలు విరిచి కట్టి ముందు కారాగారానికి, ఆ తరువాత సాగరుల వారి దగ్గరికి తీసుకుపోతారు.

వారందరి కంటపడి లేనిపోని బాధల్ని నెత్తిమీదికి తెచ్చుకోవాలన్న కోరిక లేకపోవటం వల్ల ఆ ద్వారాల సమీపంలోకి కూడా పోలేదు శివుడు. చెట్ల తోపునకు ఎడమ ప్రక్కన చిన్న పల్లపు ప్రదేశంలో వుండే ఒక గణపతి ఆలయం దగ్గరికి నడిచాడు.

పెద్ద తొండంతో, లావుపాటి కాళ్ళు చేతులతో వేదిక వంటి పెద్ద రాతిదిమ్మమీద కూర్చోపెట్టి వుంటుంది ఆ విగ్రహం.

ఆలయం ఎదుటికి పోయిన వెంటనే శివుడికి వచ్చింది ఒక అనుమానం- చాటునుంచి తనను ఎవరో గమనిస్తున్నట్టు. అడవిలో వున్నప్పుడు కూడా వచ్చింది అటువంటి అనుమానమే అంతకుముందు.

నగర ద్వారాలు మూసుకోకముందే ఆలయంలో వున్న వినాయకుడి దర్శనం చేసుకుని, వెంటనే వెనక్కి వెళ్ళిపోవాలన్న కోరిక వున్నవాడిలా కొంచెం హడావుడిగా అటూ ఇటూ చూశాడు అతను.

ఎంత నిశితంగా చూసినా ఎవరూ కనిపించకపోయేసరికి, ఏదో భ్రాంతి కారణంగా అలా అనిపిస్తోందని సరిపెట్టుకుని లోపలికి పోయాడు.

సంపంగి నగరంలో నివశించే ప్రజలెవరికీ తెలియదు ఆ ఆలయంలో నిక్షిప్తమై వున్న ఒక పెద్ద రహస్యం. ప్రజలకే కాదు... సైనికులకు, భటులకు సాగరులవారి పరివారంలో వుండేవారికి కూడా తెలియదు.

సాగరుల వారికి, వారి సతీమణికి, మంత్రి మహేశ్వరుడికి, ఆయన కుటుంబానికి మాత్రమే తెలుసు.

అత్యంత ప్రమాదాన్ని కలిగించే పరిస్థితులు ఏవైనా నగరాన్ని చుట్టు ముట్టినప్పుడు రాజకుటుంబంతో పాటు మంత్రి కుటుంబం కూడా సురక్షితంగా బయటపడేందుకు నిర్దేశించబడిన రహస్యం అది.

వినాయకుడంటే విపరీతమైన భక్తితత్పరత కలిగి వున్నట్టు రెండుచేతులూ జోడించి నమస్కారాల మీద నమస్కారాలు పెడుతూ ఆలయంలోకి పోయాడు శివుడు. కుదురుగా కూర్చుని కనిపిస్తున్న విగ్రహం దగ్గరికి పోయిన వెంటనే పొడుగ్గా ఒక పక్కకు వంపు తిరిగివున్న వినాయకుడి తొండాన్ని పట్టుకుని బలంగా రెండో పక్కకు తిప్పాడు.

మండలాధిపతి సాగరులవారే స్వయంగా, మంత్రి మహేశ్వరుడిని వెంట బెట్టుకుని, రెండు మూడు మాసాలకు ఒకసారి అక్కడికి వస్తారు. ఒంటరిగా... ఎవరూ చూడకుండా వెంట తీసుకువచ్చిన కందెనను తొండానికి పట్టిస్తారు.

క్రమం తప్పకుండా పట్టించుతూ వుండటం వల్ల అనవసరమైన శబ్దాలు ఏవీ బయటికి వినిపించవు. తొండం పక్కకు జరిగిన వెంటనే వినాయకుడి

విగ్రహం వెనుక భాగంలో వున్న ఒక పెద్ద సొరంగ ద్వారం నిశ్శబ్దంగా తెరుచుకుంటుంది.

పాము మాదిరి మెలికలు తిరుగుతూ అది నగరంలో గజశాలకు కొంచెం అవతలగా వున్న ఇంకో ఆలయంలోకి దారిని చూపిస్తుంది.

ఒకసారి మండలాధిపతి వంటశాలలో చేయబడిన తీపి పదార్థాలను దొంగతనంగా ఆరగిస్తూ అక్కడి కాపలా వాళ్ళు వెంటపడేసరికి, తప్పించుకోవటం కోసం ఆ గుడిలోనే తలదాచుకున్నాడు శివుడు పోయిన ఏడు పుష్యమాసంలో. అప్పుడు తెలిసింది ఆ సొరంగ మార్గాన్ని గురించిన రహస్యం. అప్పుడు అది తనకు అనవసరమని అనిపించినా, ఇప్పుడు మాత్రం మహా ఉపయోగకరంగా మారింది.

చప్పుడు చేయకుండా సొరంగంలోకి దిగి, వేగంగా అడుగులు వేశాడు అతను. కన్ను పొడుచుకున్నా కనిపించని కటిక చీకటి చుట్టూ వున్నా అంతకు ముందు రెండుసార్లు ఆ మార్గంలో తిరిగి వుండటం వల్ల మందగించలేదు అతని వేగం. సరిగ్గా పావు ఘడియ తర్వాత గజశాలకు సమీపంలో వున్న గదిలో నుంచి బయటికి వచ్చాడు.

నిశ్శబ్దంగా, నిర్మానుష్యంగా వుండాలి అతని అంచనా ప్రకారం ఆ ప్రదేశం. అందుకు విరుద్ధంగా అరుపులతో, కేకలతో అటూ ఇటూ హడావుడిగా తిరుగుతున్న జనంతో చాలా రద్దీగా కనిపించింది.

❖ ❖ ❖

అవసరం అంటూ వస్తే పటకా కత్తిని పట్టుకుని పదిమంది శత్రువులనైనా సరే నిర్భయంగా ఎదిరించగల ధీరవనిత– మండలాధిపతుల వారి సతీమణి. ముడుపుల గట్టు దగ్గర వుండవలసిన శివుడు ఎటుపోయాడో తెలియటం లేదన్న మాటను వినగానే భీరువు మాదిరి కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

"చిన్నపిల్లలు నేరం చేస్తే శిక్షించే పద్ధతులు చాలా సున్నితంగా వుంటాయి. కరడుగట్టిన దుర్మార్గుడిని పంపించినట్టు మీరు వాడిని అడవిలోకి పంపించారు. అన్యాయం చేశారు..." తుమ్మిడి మడుగు దగ్గర్నించి తిరిగివచ్చి జరిగిందేమిటో చెప్పిన సాగరులవారిని మొఖంమీదే నిందించింది ఆమె.

"కరడు గట్టిన దుర్మార్గుడు కాడు వాడు. కరుడు గట్టిన అల్లరివాడు. ఆ పెద్దపులిని చూస్తే మిగిలిన పిల్లలయితే కళ్ళు తిరిగి కిందపడిపోతారు. వాడు

దానినే కిందపడవేసి ప్రాణాలు తీశాడు. అంత తెగింపు వున్నవాడిని అడవిలోకి పంపించటం తప్పు ఎలా అవుతుంది?" అనునయంగా అడిగాడు సాగరుడు.

"మీరు ఎన్ని చెప్పినా సరే... మీరు చేసింది మంచిగా లేదు..." ముక్కును ఎగబీలుస్తూ కోపంగా అన్నది ఆమె.

"ఆ మాట నాకు కూడా అనిపిస్తోంది... అందుకే నగరంలోకి రాగానే పాతికమంది భటుల్ని అడవిలోకి పంపించాను. రేపు ఉదయానికల్లా వాడిని వెతికి వెంటబెట్టుకు రమ్మని ఆజ్ఞ ఇచ్చాను. నువ్వు కలత చెందాల్సిన అవసరం లేదు. వాడికి ఏమీ కాదు. మన మహేశ్వరుడు చెపుతున్న మాటల్ని బట్టి చూస్తే, వాడు క్షేమంగానే వుండివుంటాడు" మరింత మృదువుగా చెప్పాడు సాగరుడు.

"నాకు మాటలు అవసరం లేదు. నేను ప్రత్యక్షంగా వాడిని చూస్తే తప్ప ఏమీ నమ్మను..." ఖండితంగా తన నిర్ణయాన్ని వినిపించింది ఆమె. అక్కడితో ఆ సంభాషణ అంతం అయిపోయినట్టు చిన్నగా తల విదిలించి తన మందిరంలోకి వెళ్ళిపోయింది.

తను చెప్పినట్టు మరునాటి ఉదయానికల్లా శివుడిని అడవిలోనుంచి తీసుకు రాకపోతే పరిస్థితి ఎలా వుంటుందో సాగరులవారి ఊహకి అందలేదు.

అయితే ఆ విషయాన్ని గురించి అధికంగా ఆలోచించే అవకాశం అతనికి లభించలేదు.

"ప్రభూ... నగర ద్వారం దగ్గర వుండే భటులకు నాయకుడు మీ దర్శనానికి వచ్చాడు..." అంటూ చెప్పాడు మందిర ద్వారం దగ్గరి కాపలా భటుడు.

నడుముకు వేలాడుతున్న ఖడ్గాన్ని ఒక ఆసనం మీదికి విసిరి, ఆ మందిరంలో నుంచి బయటికి పోయాడు సాగరుడు.

"పౌర్ణమినాడు జరగవలసిన సంత రేపటికి మార్చటం వల్ల, ఆ సంగతి ఎక్కువమందికి తెలియదనీ, ఎప్పుడూ వచ్చే వ్యాపారవేత్తల్లో సగంమంది కూడా రారని అనుకున్నాను నేను. నా అంచనా తప్పింది ప్రభూ... మామూలు కంటే రెట్టింపు మంది వచ్చారు. నగర ద్వారం వెలుపల దగ్గర దగ్గరగా మూడువందల శకటాలు నిలబడిపోయి వున్నాయి" అంటూ చెప్పాడు మందిరం వెలుపల నిలబడి వున్న ఆ భటుల నాయకుడు.

"అందరూ లోపలికి వచ్చేదాకా ద్వారాల్ని తెరిచి వుంచండి. కాపలా మాత్రం కట్టుదిట్టంగా వుండాలి" అన్నాడు సాగరులవారు.

"చిత్తం ప్రభూ... చీకటి సమయంలో లోపలికి వచ్చిన వారు తాము ఎక్కడ ఆగాలో, ఎక్కడ తమ శకటాల్ని నిలుపుకోవాలో తెలియకపోవటం వల్ల తొక్కిసలాటలు జరగవచ్చు. ఈ మాట చెప్పటానికి వచ్చాను నేను" అన్నాడు నగర ద్వారాల దగ్గర వుండే భటులకు నాయకుడు.

"మహేశ్వరుల వారికి చెప్పి సరయిన ఏర్పాట్లు చేయిస్తాను. నువ్వు వెళ్ళవచ్చు" అన్నాడు సాగరులవారు.

తల వంచి అభివాదం చేసి వెనక్కి వెళ్ళిపోయాడు ఆ దళపతి. తనుకూడా వెనుతిరిగి మందిరంలోకి అడుగుపెట్టాడు సాగరులవారు.

పగలంతా అడవిలో ప్రయాణం చేసి వుండడం వల్ల కొద్దిపాటి బడలిక ఆవరించుకుని వున్నది ఆయనని. ఆ పైన తన సతీమణి అలగటాన్ని చూసేసరికి మనస్సు కొంచెంగా వికలం కూడా అయింది.

మహేశ్వరుడికి వెంటనే వర్తమానం పంపి జాగ్రత్తలు చెప్పాలని అనుకుని కూడా ఎందుకనో బద్ధకించాడు. తీవ్రమైన గందరగోళానికి అది కారణం అవుతుందని ఆ సమయంలో ఆయన అనుకోలేదు.

❖ ❖ ❖

జనం... జనం...ఎక్కడ చూసినా విపరీతమైన జనం... ఇసుక వేస్తే రాలనంతగా కిక్కిరిసిపోయి వుంది గజశాలను ఆనుకుని వున్న వీధి.

ఒకదాని వెనుక ఒకటిగా నగర ద్వారాల్ని దాటి వచ్చిన శకటాలు ఒకేసారి సంత జరిగే ప్రదేశాన్ని చేరుకోవాలన్న తొందరలో ఒకదానికి మరొకటి అడ్డుపడి, ఎక్కడివక్కడ ఆగిపోతున్నాయి.

చీకటిపడిన తర్వాత నిర్మానుష్యంగా నిశ్శబ్దంగా మారిపోయే నగర వీధులు అలా గందరగోళంగా తయారవటం– పుట్టి బుద్ధెరిగిన తర్వాత శివుడు ఎప్పుడూ చూసి వుండలేదు.

"సంత జరిగేరోజును మార్చాలంటే ముందుగానే నిర్ణయం తీసుకోవాలి. నెమ్మదిగా అందరికీ నచ్చచెప్పాలి... ఎవరికీ తెలియకుండా ఒక్కసారిగా నిర్ణయం తీసేసుకుని, అప్పటికప్పుడు ఏర్పాటు చేస్తే పరిస్థితులు ఇలాగే

తయారవుతాయి..." పెద్ద కంఠంతో తన అసంతృప్తిని వెల్లడిస్తున్న ఒక వ్యాపారి వెనక నిలబడి ఆ మాటల్ని శ్రద్ధగా విన్నాడు శివుడు.

ఆ హడావుడికి కారణం ఏమిటో తెలిసిన వెంటనే అతని పెదవులమీద ప్రత్యక్షం అయిందొక చిరునవ్వు.

తాను ఎదురుచూడని విధంగా వచ్చిపడిన అవకాశం ఇది. మంత్రి మహేశ్వరుడికి కొద్దిగాకూడా నచ్చవు అటువంటి గందరగోళాలు. భటుల్ని పెద్ద సంఖ్యలో పంపించి వెంటనే సర్దుబాటు చేసేస్తాడు.

ఆ పని జరిగేలోపుగా తాను వచ్చిన పని పూర్తి చేసుకుంటే ఎలా వుంటుంది?

కిటకిటలాడుతున్న జనం మధ్యలో నుంచి సాధ్యమైనంత వేగంగా గజశాల దగ్గరికి పోయాడు అతను.

ఎప్పటి మాదిరిగానే కనిపించారు నలుగురు భటులు. వాళ్ళను ఏమార్చితే తప్ప లోపలికి పోవటం కుదరదు. అయితే అనుకున్నంత తేలిక కాదు ఆ పని. మిన్ను విరిగి మీద పడినా నిలబడిన ప్రదేశంలో నుంచి ఇవతలికి రారు వాళ్ళు. గజశాల ద్వారాన్ని రక్షించటం తప్ప వేరే పనేమీ వుండదు వాళ్ళకి. తను లోపలికి పోవాలంటే వాళ్ళు ఖచ్చితంగా అక్కడినించి ఇవతలికి వచ్చేయాలి. ఎలా?

మొఖంమీదికి పడుతున్న జుట్టును వెనక్కి నెట్టుకుంటూ తీవ్రంగా ఆలోచించాడు శివుడు. ఎంత ఆలోచించినా ఎటువంటి ఉపాయము తట్టటం లేదని చిరాకుపడబోతుండగా ఝల్లుమన్నది శరీరం.

అనుకోని విధంగా అతని మనస్సులో అడుగుపెట్టిన ఆలోచన ఆ పరిస్థితిని కల్పించింది. తలుచుకున్న కొద్దీ అధికం అయిపోవటం మొదలుపెట్టింది ఆత్రుత.

గజశాలకు అవతలగా వుంటుంది నాలుగు వీధులు కలిసే కూడలి ఒకటి. దాని మధ్య పాతి వుంటుంది లావుపాటి ఇనుప స్తంభం. ఆ స్తంభానికి వ్రేలాడుతూ వుంటుంది అతి పెద్దదయిన గంట ఒకటి.

అత్యవసరమైనప్పుడు మాత్రమే మ్రోగించబడుతుంది అది. ఆ మ్రోతను వినగానే ఉలిక్కిపడుతుంది నగరం. ఏదో పెద్ద ప్రమాదం ముంచుకు వచ్చిందని

తెలిసిపోతుంది. ఒక్క సైనికులే కాదు, నగరవాసులు కూడా కర్రలు, కత్తులు పట్టుకుని ఆ కూడలి దగ్గరికి పరిగెత్తుకు వస్తారు.

అసలే గందరగోళంతో నిండివున్న వీధులన్నీ మరింతగా జనంతో నిండిపోతాయి. ఏమి జరిగిందో అందరికీ అర్థం అయ్యేలోపల నిశ్చింతగా పూర్తి అయిపోతుంది తన పని...

అడ్డం వచ్చిన వారిని నేర్పుగా తప్పించుకుంటూ గంట వ్రేలాడుతూ వుండే కూడలివైపు కదిలాడు శివుడు.

గంటను మోగించిన వాళ్ళు కారణం లేకుండా మోగించారని తెలిస్తే అమితమైన కోపం వచ్చేస్తుంది సాగరుల వారికి. ఆ కోపంలో ఏం చేస్తారో ఎటువంటి శిక్షను ప్రకటిస్తారో ఎవరికీ తెలియదు.

ఆ మాట మనసులో మెదిలిన వెంటనే మందగించింది శివుడి అడుగుల వేగం. అంతలోనే అతని కనుల ముందుగా మెదిలింది తీవ్రమైన ఆవేదనతో తల్లడిల్లిపోతున్న ఆడ ఏనుగు.

మాట ఇచ్చాడు తను... మంచికో చెడుకో ఆ మూగజంతువు బాధను దూరం చేయటానికి మనస్ఫూర్తిగా నిర్ణయించుకుని, నగరంలోకి వచ్చాడు. ఇంత దూరం వచ్చిన తర్వాత వెనుకంజ వేయటం సమంజసం కాదు. గజశాలలోకి వెళ్ళితీరవలసిందే. ఆ పిల్ల ఏనుగును బయటికి తీసుకుపోయి ఆడ ఏనుగుకు చూపించవలసిందే.

మరింత వేగంగా అడుగులు వేసి కూడలిని చేరుకున్నాడు అతను. సూటిగా స్తంభం దగ్గరికి పోయి గంటకు కట్టి వున్న మోకును పట్టుకుని బలంగా లాగటం మొదలుపెట్టాడు.

గుండెలు జలదరించే స్థాయిలో మ్రోతలు చేయటం మొదలుపెట్టింది గంట. విన్న వారందరి గుండెల్లోను ఆ శబ్దం ఒక విధమైన గుబులును రేపి, చెమటలు పట్టించటం ప్రారంభించింది.

మొదటిసారి మోగినప్పుడే చటుక్కున ఆగిపోయాయి వీధుల్లోని శబ్దాలు. రెండవ మ్రోతను విన్నవెంటనే మొదలయింది కంగారుపడటం.

"ఏయ్... కుర్రాడా... ఎవరు నువ్వు? గంట ఎందుకు మోగిస్తున్నావ్?" బిగ్గరిగా అరిచి అడిగాడు కూడలిలో వున్న జనంలో నుంచి ఒక మనిషి శివుడిని.

"ప్రమాదం... ప్రమాదం... ప్రమాదం..." బిగ్గరిగా అరిచాడు శివుడు. మరో రెండుసార్లు మాత్రమే మోగించి జనంలోకి పరిగెత్తాడు.

కూడలిని దాటి పాతిక అడుగుల దూరం కూడా పోకముందే అతను కోరుకున్న మార్పు వీధుల్లో అతనికి కనిపించింది.

టకటకా తెరుచుకోసాగాయి మూసి వున్న ఇళ్ళ తలుపులు. కర్రల్ని, ఇతర ఆయుధాల్ని పట్టుకుని కూడలికేసి పరిగెత్తటం మొదలుపెట్టారు నగర వాసులు.

నగర వాసులే కాదు... ఎక్కడెక్కడో వున్న భటులు, సైనికులు, కాపలా జనం అందరూ కట్ట కట్టుకుని కదలసాగారు అటుకేసి.

గజశాల ద్వారం దగ్గర వున్నవాళ్ళు కూడా కదలటాన్ని కనులారా చూసిన వెంటనే క్షణికంపాటు కూడా ఆలస్యం చేయకుండా లోపలికి దూరాడు శివుడు.

గంట మ్రోత బంధింపబడి వున్న ఏనుగుల్ని కూడా చెదరగొట్టినట్లుంది. తొండాలను పైకెత్తి భీకరంగా ఘీంకారాలు చేస్తున్నాయి అవి.

వాటి పాదాలకు గాని, తొండాలకు గాని అందకుండా అతివేగంగా తను అంతకుముందు పిల్లఏనుగును చూసిన మూలలోకి పోయాడు శివుడు. దాని పాదాలకు చుట్టి వున్న గొలుసుల్ని చకచకా విప్పి దాని తలను మృదువుగా నిమిరాడు.

నీరసం అధికమైపోయి గట్టిగా తడితే ఒక పక్కకు పడిపోయేటట్లు కనిపిస్తోంది అది. దీనంగా శబ్దం చేసి అతని మొఖంలోకి చూసింది.

"మీ అమ్మే అయివుంటుంది. నీ కోసం చెట్లతోపులో ఎదురు చూస్తోంది. మనం వెంటనే వెళ్ళిపోవాలి..." అంటూ దాని తొండాన్ని పట్టుకుని ముందుకు లాగాడు శివుడు.

దాని పాదాలకు బిగించి వున్న గొలుసులు తొలగించిన వెంటనే విముక్తి లభించబోతున్నదని దానికి తెలిసింది కాబోలు... ఆలస్యం చేయకుండా కదిలిందా గున్న. తూలుకుంటూ అతన్ని అనుసరించింది.

❖ ❖ ❖

మూసేయండి- నగర ద్వారాన్ని వెంటనే మూసేయండి. ధనుర్ధారులు పదిమంది వెంటనే కోటగోడల మీదికి వెళ్ళండి... అనుమానంగా కనిపించిన వారందరినీ బాణాలతో నిస్సంకోచంగా పడగొట్టేయండి. వెళ్ళండి... వీధుల్ని

కూడా జాగ్రత్తగా పరీక్షించండి” పెద్ద కంఠంతో ఆజ్ఞ ఇచ్చాడు మంత్రి మహేశ్వరుడు.

ప్రయాణపు బడలిక తీరేవరకూ వెచ్చటి నీటితో స్నానం చేసి, అప్పుడే భోజనం చేయటానికి ఉద్యుక్తుడవుతున్నాడతను. గంట మ్రోతను వినగానే ఆ పనిని మరిచిపోయి భవనం వెలుపలికి పరిగెత్తుకు వచ్చాడు.

సరిగ్గా అప్పుడే తన అశ్వాన్ని అధిరోహించి అక్కడికి వచ్చాడు మండలాధిపతి సాగరులవారు.

“మీరు ఇక్కడే వుండండి ప్రభూ... నేను కూడలి దగ్గరికి పోయి వస్తాను” ఒక భటుడు తీసుకువచ్చిన తన అశ్వం మీదికి దుముకుతూ చెప్పాడు మహేశ్వరుడు.

“ఎందుకు మోగింది అది? కారణం ఏమై వుంటుంది??” అతని మాటలు తనకు వినబడనట్లు తన అశ్వాన్ని కూడా ముందుకు దూకిస్తూ అడిగాడు సాగరుడు.

“సైన్యాధిపతి ఈపాటికి అక్కడికి వెళ్ళి వుంటాడు. విషయం ఏమిటో అతనే మనకి చెపుతాడు...” ఆగిపొమ్మని చెప్పినా వినిపించుకోకుండా తన వెంట రావటాన్ని గమనించనట్లు నటిస్తూ అన్నాడు మహేశ్వరుడు.

కిటకిటలాడిపోతున్న వీధుల్ని అధిగమించి వారిద్దరూ కూడలిని చేరుకోవటానికి పావుఘడియకు పైనే పట్టింది. అప్పటికి కొద్దిగా శాంతించింది పెచ్చరిల్లిన గందరగోళం.

“ఎందుకు? ఎందుకు జరిగింది ఇలా?” తమను చూడగానే పరుగు పరుగున ఎదురువచ్చిన సేనాధిపతిని అడిగాడు మహేశ్వరుడు.

“విచారణ మొదలయింది... ఎవరో కుర్రవాడు తాడును బలంగా లాగాడట... వాడు ఎవరో ఎక్కడికి పోయాడో తెలుసుకునే ప్రయత్నం జరుగుతోంది” చెప్పాడు సేనాపతి.

ఉలిక్కిపడినట్లు మహేశ్వరుడివంక చూశాడు సాగరులవారు.

“అసంభవం ప్రభూ... అశ్వాలమీద ప్రయాణం చేస్తేనే మనకి చాలా సమయం పట్టింది అడవిలోంచి బయటికి రావటానికి. కాలినడకన వచ్చేవారికి అందుకు రెట్టింపు సమయం కావాలి... మీ ఊహ నిజం కాదు” అన్నాడు ఆయన మనస్సులోని మాట ఏమిటో తనకి తెలిసిపోయినట్లు.

గంభీరంగా తల ఊపాడు సాగరుల వారు. ఈ పని చేసింది ఎవరైనా సరే క్షమించరాని నేరం చేసినట్లే... నగర రక్షణ కోసం చేసిన ఏర్పాట్లను నవ్వులాటగా మార్చటం నేను సహించను. వెంటనే బంధించి నా ఎదుటికి తీసుకురావాలి" ఖచ్చితమైన ఆజ్ఞను ఇచ్చాడు.

తలను వంచి అభివాదం చేశాడు సేనాపతి. వెనక్కి తిరిగి గుంపులు గుంపులుగా నిలువబడిన జనంలోంచి నగర ద్వారం దగ్గరికి పరుగు మొదలు పెట్టబోయాడు.

"గంట మోగించిన కుర్రవాడు ఇక్కడనే ఈ చుట్టుపట్లే ఎక్కడో వుండి వుంటాడు. నగర ద్వారం దగ్గరికి పోవటం దేనికి?" ధైర్యం చేసి అడిగాడు అతని వెనుకే బయలుదేరిన ఇంకో దళపతి.

"ఇటువంటి పాడుపనిని కారణం లేకుండా ఎవరూ చేయరు. పట్టుబడితే తల ఎగిరిపోయే నేరం ఇది. వాడు తప్పకుండా నగరాన్ని వదిలి పారిపోవటానికే చూస్తాడు..." అన్నాడు సేనాపతి.

❖ ❖ ❖

గజశాల దగ్గర్నించి నగర ద్వారాల దగ్గరికి చేరుకునే లోపల మూడుసార్లు వెనక కాళ్ళ మీదే చతికిలపడిపోయింది పిల్ల ఏనుగు.

విపరీతమైన ఆందోళనతో స్నానం చేసినట్లు తడిసిపోయింది చెమటలతో శివుడి శరీరం. "ఆలస్యం అయితే నీకే కాదు, నాకు కూడా ప్రమాదమే. ఏదో ఒక విధంగా ఓపిక తెచ్చుకో" అని బ్రతిమాలి అది కూలబడిన ప్రతిసారి బలవంతంగా పైకి లేపి ముందుకు నడిపించాడు.

ద్వారంలో నుంచి వృషభ శకటాలు లోపలికి వస్తూ వస్తూ వుండగా మోగటం మొదలుపెట్టింది గంట... ఎక్కడి శకటం అక్కడే ఆగిపోయింది. శకటాల యజమానుల దగ్గర్నించి, కాపలా భటుల వరకూ అందరి చూపులూ గంట వుండే దిశవైపే కేంద్రీకరించబడి వున్నాయి.

అడుగు అడుగు చొప్పున పిల్ల ఏనుగును శకటాల ప్రక్కనుంచి ద్వారం దగ్గరికి తీసుకుపోయాడు శివుడు. గంటను మ్రోగించి అందరినీ హడల గొట్టాలనే ఆలోచన నిజంగా చాలా అద్భుతమని తనను తాను అభినందించుకో బోతుండగా... "మూయండి... ద్వారాల్ని మూసేయండి" అంటూ వినవచ్చింది ఒక కంఠం.

గుండెల్లో పెద్ద బండరాయి పడిన అనుభూతి శివుడిని ఆవరించుకున్నది నగర ద్వారాల్ని మూసివేయమని ఇవ్వబడిన ఆజ్ఞను వినగానే.

"లాగండి... బళ్ళను ముందుకు లాగండి" అని కేకలు పెడుతూ తలుపుల దగ్గరికి వచ్చారు నలుగురు భటులు.

సరిగ్గా ద్వారం మధ్యలో నిలబడిపోయి వున్నాయి రెండు శకటాలు. నగరంలో నివశిస్తున్న వారు పెంచుకునే పశువుల కోసం ఎండుగడ్డి మోపులు చాలా ఎత్తుగా పేర్చి వున్నాయి వాటిమీద.

ఆ గడ్డికి నిప్పు అంటుకుంటే లేనిపోని రగడ వెంటనే మొదలు అవుతుం దన్న భయంతో, కాగడాల్ని వాటికి దగ్గరిగా తీసుకురావటం లేదు రాజభటులు.

ఆ విషయాన్ని తనకు అనుకూలంగా మలుచుకోవాలని శివుడి కోరిక. "కదులు... త్వరగా కదులు... ఆలస్యం చేస్తే నీకు మళ్ళీ గజశాల... నాకు చెరసాల... కదులు..." అని చిన్న కంఠంతో గున్న ఏనుగును హెచ్చరిస్తూ మరి కొంచెం వేగంగా నడిపించాడు దానిని.

దట్టమైన చీకట్ల మూలకంగా అతని గుట్టు అంతవరకూ రట్టు కాలేదు. ఎవరి గొడవల్లో వారుండిపోవటం వల్ల అతను బలవంతంగా నడిపిస్తున్న ఏనుగుపిల్లను గురించి పట్టించుకోలేదు ఎవరూ.

అయితే ద్వారాలను దాటి నాలుగే నాలుగు అడుగులు వేస్తున్న సమయంలో "ఏయ్... ఎవరు నువ్వు? ఎక్కడిది నీకు ఆ గున్న ఏనుగు?" అని నిష్కర్షగా అడగనే అడిగాడు శకటాల్ని వెనుకనుంచి ముందుకు నెట్టించేందుకు వచ్చిన భటుడు ఒకతను.

అదిరిపడి నోరు వెళ్ళబెట్టాడు శివుడు.

"కాగడా... కాగడాని వెంటనే ఇక్కడికి తీసుకురండి... కాగడా..." ఒక చేత్తో శివుడి గుండెల్ని అదిమి వెనక్కి నెడుతూ బిగ్గరగా తన సహచరుల్ని పిలిచాడు ఆ భటుడు.

ఆలస్యం చేస్తే అంతవరకూ తాను పడిన కష్టం అంతా మట్టి కొట్టుకుపోతుందని తెలిసిపోయింది శివుడికి. కాగడా వెలుగులో తన మొఖాన్ని చాలా స్పష్టంగా చూడటం జరుగుతుంది. గుర్తుపట్టటం కూడా వెంటనే జరిగిపోతుంది. ఆ పని జరిగేవరకూ ఆగటం దేనికి?

ఆ మాట మనసులో మెదిలిన వెంటనే తనకు తెలియకుండానే చాలా వేగంగా కదిలాడు శివుడు. ఒక చేత్తో తనను వెనక్కి నెడుతున్న ఆ భటుడి చేతిని అవతలకు నెట్టాడు. రెండవ చేత్తో చాలా బలంగా అతని మొఖంమీద చరిచాడు.

ప్రాణాలు తీసేంతటి దెబ్బ ఏమీకాదు అది. కాని అతి సున్నితంగా వుండే కనులమీదా, నాశికమీదా పడటంతో ఉక్కిరిబిక్కిరి అయిపోయాడు ఆ భటుడు. తన చేతులతో మొఖాన్ని అదుముకుంటూ పక్కకు తిరిగాడు.

ఇంకో నెట్టు నెట్టాడు శివుడు. రెండు చేతుల్ని అతని వెన్నుమీద వేసి బలంగా తోశాడు.

బోర్లాపడిపోయాడు ఆ భటుడు. ఆ పడటంలో అతని మొఖం దగ్గరగా వున్న గడ్డి బండి అంచుకు పొడుచుకుని ఖంగుమని శబ్దం చేసింది. చిన్న మూలుగు ఒకటి వెలువడింది అతని నోటినుంచి. స్పృహ కోల్పోయి కదలిక లేకుండా వుండిపోయాడు నేలమీద.

చిమ్మచీకటి కారణంగా వెంటనే చూడలేదు ఎవరూ. చూడటానికి పది క్షణికాలు పట్టింది. వెంటనే పెద్ద పెద్దగా కేకలు పెడుతూ అతని దగ్గరికి చేరుకున్నారు కొందరు శకట చోదకులు. కాగడాల్ని గడ్డి బళ్ళకు దూరంగా పెట్టి పట్టుకుంటూ పరుగు పరుగున వచ్చారు ఇద్దరు భటులు.

ఆ కాస్త వ్యవధిలోను ఆ గందరగోళానికి చాలా దూరంగా వెళ్లిపోయాడు శివుడు. ఇంకోసారి వెనుక కాళ్ళమీద చతికిలబడి పోబోతున్న ఏనుగు పిల్లను సముదాయిస్తూ వేగంగా చెట్లతోపుకేసి లాక్కుపోయాడు.

❖ ❖ ❖

"ఎందుకు? ఎందుకు జరిగింది ఇలా? ఎవడు చేశాడు ఈ పని?" విపరీతమైన కోపంతో మొఖం ఎర్రబడిపోతుండగా అడిగాడు సాగరులవారు.

"గంట మోగటం ఒక్కటే కాదు ప్రభూ... ఇంకో దారుణకృత్యం కూడా జరిగిపోయింది" చిన్నకంఠంతో చెప్పాడు మంత్రి మహేశ్వరుడు.

"ఏమిటది?" ప్రశ్నించాడు సాగరుల వారు.

"ప్రమాదగంట మోతను వినగానే అందరితోపాటు మన గజశాల దగ్గర కాపలా వుండే భటులు కూడా గంట దగ్గరికి పరిగెత్తుకు వచ్చారు" అన్నాడు మహేశ్వరుడు.

''అందులో దారుణం ఏముంది?'' కోపం కాస్తా ఆశ్చర్యంగా మారిపోతుండగా అడిగాడు సాగరుడు.

“వాళ్ళు ఇటు రాగానే ఎవరో గజశాలలో ప్రవేశించి, మనం పెద్ద ఏనుగులతో పాటుగా పట్టుకు వచ్చిన పిల్ల ఏనుగును తమ వెంట తీసుకుపోయారు.”

“తిండి తినకుండా నిరాహారదీక్ష చేస్తున్న ఆ గున్న కొద్దిరోజుల్లో కాలధర్మం చెందుతుందని కదా గజశాల నిర్వాహకుడు మనకి చెప్పింది! రోజులు దగ్గరపడిన ఆ పిల్లను ఏం చేసుకుంటారు తీసుకుపోయి? అసలు ఆ పని చేసింది ఎవరో నీ ఊహకు ఏమైనా అందిందా?” మరింత ఆశ్చర్యంగా అడిగాడు సాగరులవారు.

“అందింది ప్రభూ... ఆ పిల్లను నగర ద్వారాల దగ్గర గడ్డిబళ్ళను క్రమబద్ధం చేస్తున్న మన భటుడు ఒకతను చూసి గుర్తుపట్టాడు.”

“వెంటనే బయటపెట్టు దాన్ని తీసుకుపోయింది ఎవరో... నడివీధిలో నిలబెట్టి కొరడాలతో కొట్టించి...” అంటూ మహేశ్వరుడి మొఖంలోని భావాల్ని గమనించి చటుక్కున మాటల్ని ఆపేశాడు సాగరుడు. “ఏమిటి మహేశ్వరా... ఏమిటీ నీ సందేహం?” అని అడిగాడు.

“ఏనుగుపిల్ల సంగతిని కొద్దిసేపు పక్కన పెట్టండి ప్రభూ! కూడలిలో ప్రమాద గంటను మోగించిన మనిషి ఆనుపానులు కూడా మనకి తెలిశాయి” అన్నాడు అతను.

మరోసారి ఆగ్రహం సాగరుల వారిని ఆవరించుకున్నది. “చెప్పు... ఆ పని చేసింది ఎవరు?” అని గర్జించాడు.

“ఒక కుర్రవాడు తాడుతో పట్టుకుని లాగటాన్ని చూశాడు ఒక పౌరుడు. ప్రమాదం ముంచుకు వస్తోందని అరవటం కూడా విన్నాడు. సరిగ్గా అటువంటి కుర్రవాడే పిల్ల ఏనుగుతో నగర ద్వారాల్ని దాటి ఆవలికి పోయాడు...” చెప్పాడు నెమ్మదిగా మహేశ్వరుడు.

తను వింటున్నది ఏమిటో సరిగ్గా అర్థం కానట్లు చాలా అయోమయంగా చూశాడు సాగరులవారు.

"వాడేనంటావా మహేశ్వరా... ఎక్కడో నట్టడివిలో దారి తెన్నూ తెలియక తల్లడిల్లిపోతూ వుండవలసిన ఆ దుడుకు పిల్లాడు నగరంలోకి వచ్చి ఈ గొడవలన్నిటికీ కారకుడు అయ్యాడంటావా?" అని అడిగాడు చాలా చిన్న కంఠంతో.

"మనకి లభించిన ఆధారాలన్నీ అలాగే ఎత్తి చూపిస్తున్నాయి. నగర ద్వారం దగ్గర వున్నవాళ్ళకి కనిపించకుండా నగరంలోకి రాగల వాళ్ళు మీరు నేను మాత్రమే అనుకుంటూ వచ్చాను ఇంతవరకూ. ఇప్పుడు ఆ రహస్యం వాడికి కూడా తెలిసిపోయిందని నాకు అనిపిస్తోంది."

"ఎందుకు? ఎందుకు చేసి వుంటాడు ఈ పనులు? ఇవి చేయటం వల్ల వాడికి ఏమిటి ఉపయోగం?"

"వాడు మనకి దొరికితే గాని ఈ ప్రశ్నలకి సమాధానం లభించదు ప్రభూ."

రెండు క్షణికాల పాటు మౌనంగా వుండిపోయాడు సాగరులవారు. ఉన్నట్లుండి ఎరుపురంగుకు మారిపోయాయి ఆయన కనులు. మొఖంలో ప్రత్యక్షం అయింది తీవ్రమైన ఆగ్రహం.

"వందమంది భటుల్ని వెంటనే పంపి, వాడు ఎక్కడ వున్నా పెడరెక్కలు విరిచి పట్టుకు రమ్మనమని ఆజ్ఞాపించు. చిన్నపిల్లాడని ఉపేక్షిస్తుంటే వాడు చిన్నపనుల్ని వదిలి చాలా పెద్ద పనులు మొదలుపెట్టాడు. అకారణంగా ప్రమాద గంటను మోగించటం క్షమార్హం కాదు. గజశాలలోని జీవాల్ని అనుమతి లేకుండా అవతలికి తీసుకోపోవటం సామాన్యమైన నేరం కాదు. శిక్ష చాలా పెద్దది పడవలసిందే" ఖంగుమంటున్న కంఠంతో ఆజ్ఞ ఇచ్చాడు.

ఎప్పుడు ఎటువంటి మాట మాట్లాడినా వెంటనే తలవూపి, తక్షణమే అమలుపర్చటానికి బయలుదేరే మహేశ్వరుడు ఆ సమయంలో మాత్రం ఎందుకనో కొంచెం తటపటాయించాడు.

"ఏమిటి నీ సందేహం?" గర్జించాడు సాగరులవారు.

"నవ్వులాటలకు తావులేని వ్యవహారాలు ఇవి... అంతఃపురంలోని వారు కల్పించుకుంటే నలుగురిలోను నగుబాటు అయిపోతుంది. మీరు దయచేసి ఆ విషయంమీద దృష్టిని పెట్టండి" అని చెప్పి వెంటనే అక్కడినించి వెళ్ళిపోయాడు అతను.

అంతఃపురం ప్రసక్తి వచ్చిన వెంటనే అణిగిపోతుంది సామాన్యంగా సాగరుల వారి కోపం. ఈసారి మాత్రం అలా జరగలేదు. కొంచెంగా కూడా చల్లారలేదు కోపం.

❖ ❖ ❖

తనను నగర ద్వారం దగ్గర ఎవరూ గుర్తుపట్టలేదని సంతోషించలేదు శివుడు... మంత్రి మహేశ్వరుడు ఎటువంటి మేధావో అతనికి బాగా తెలుసు.

"నామీద సదభిప్రాయం ఆయనకి లేదు. ఏదో ఒక విధంగా జరిగింది ఏమిటో, ఎవరి మూలకంగా జరిగిందో తప్పకుండా కనిపెట్టి, భటుల్ని పంపకం చేస్తాడు. వాళ్ళు నాకోసం వచ్చేలోపల సమస్య తీరిపోవాలి. త్వరగా నడువ్..." అని గున్న ఏనుగును హెచ్చరించి, దాన్ని బలవంతంగా చెట్ల తోపులోకి తీసుకుపోయాడు.

అంతకుముందు అతను చూస్తుండగా ఏ చెట్టు క్రిందికి పోయి నిలుచున్నాయో అదే చెట్టు క్రింద వున్నాయి పెద్ద ఏనుగులు రెండూ.

పిల్ల ఏనుగుతో వచ్చిన శివుడిని చూడగానే తొండాలను గాలిలోకి ఎత్తి బీభత్సంగా ఘీంకరించాయి.

"అయ్యబాబోయ్... అరవకండి... భటులు వింటే ఇప్పటికిప్పుడే వచ్చి నన్ను, నాతోపాటు మిమ్మల్ని బంధించి తీసుకుపోతారు" విపరీతమైన భయంతో పెద్దగా హెచ్చరించాడు శివుడు.

అతని మాటల్ని అసలు అవి లెక్కచెయ్యలేదు. నేలను దడదడలాడిస్తూ పరిగెత్తుకు వచ్చి తన తొండంతో గున్న ఏనుగును గట్టిగా కౌగలించు కుంటున్నట్టు దగ్గరికి తీసుకున్నది ఆడ ఏనుగు. అప్పటికప్పుడు తన పొదుగుకు దగ్గరగా దాని తలను తొండంతో నెట్టింది.

ఆకలికి అలమటించే చిన్నపిల్లలు తల్లిరొమ్మును ఎంత ఆబగా పట్టుకుంటారో అంతే ఆత్రంగా పాలు తాగడం మొదలుపెట్టింది గున్న.

దాన్ని, దాని తల్లిని చూసి తాను ఎంతగానో పరవశించిపోతున్నట్టు ఘీంకారాలు మొదలుపెట్టింది మగ ఏనుగు.

సద్దు చేయకుండా ఆపటం తన శక్తికి మించిన పని అని తెలిసిపోయింది శివుడికి.

"వెళ్ళిపొండి... వెంటనే అడవిలోకి వెళ్లిపోండి. ఇక్కడే వుంటే మీకు ప్రమాదం తప్పదు. వెళ్ళిపొండి" అని హెచ్చరిస్తూ మగ ఏనుగును అవతలికి నెట్టే ప్రయత్నం చేశాడు.

చేయగా చేయగా కొద్దిసేపటి తర్వాత ఫలించింది అతని ప్రయత్నం. సన్నగా శబ్దంచేసి వెనక్కి తిరిగింది మగ ఏనుగు. కడుపు నిండింది కాబోలు- పొదుగును వదిలి తలను ఇవతలికి పెట్టింది గున్న ఏనుగు.

తొండంతో దాన్ని మగ ఏనుగు వెళుతున్న దారిలోకి నెట్టి తనుకూడా బయలుదేరింది ఆడ ఏనుగు.

తన బిడ్డను కలుసుకున్న తర్వాత ఒక్కసారి కూడా అది తనవంక చూడలేదని శివుడికి తెలిసి వచ్చేలోపల చెట్ల తోపులోనుంచి అవి అడవిదారిలోకి వెళ్ళిపోయాయి.

కారణం తెలియలేదుగాని, ఎందుకనో కొద్దిగా బరువెక్కాయి శివుడి గుండెలు.

'నోరు లేని జీవాలు అవి. నోళ్ళు వుండివుంటే తప్పకుండా వీడ్కోలు చెప్పివుండేవి. మనం అనవసరంగా బాధపడకూడదు' తనకు తానే సర్ది చెప్పుకుంటూ వెనక్కి తిరిగాడు.

వెంటనే- అలా వెనక్కి తిరిగిన వెంటనే కలిగింది అతనికి తనను ఎవరో గుచ్చిగుచ్చి చూస్తున్న అనుభూతి.

అంతకుముందు మాదిరి ఆ అనుభూతి కలగటానికి కారణాన్ని అన్వేషించే ప్రయత్నం చేయలేదతను.

'మహేశ్వరుడు పంపివుంటాడు భటుల్ని. నగర ద్వారం దగ్గర తమ సహచరుడి వంటిమీద చెయ్యి వేసినందుకు ప్రతిగా బరిశెల్ని తిరగవేసి మన నడుముమీద కనీసం నాలుగు దెబ్బలైనా వేయకుండా ఊరుకోరు... వాళ్ళకి పట్టుబడకూడదు. మనంతట మనంగా వెళ్ళి సాగరుల వారి ఎదుట నిలబడటం చాలా ఉత్తమం" అనుకుంటూ లేడిపిల్ల మాదిరి చెట్లతోపు పక్కభాగంలోకి పరిగెత్తాడు.

అతను అటుపోవటం, బరిశెలు పట్టుకున్న భటులు కొంతమంది చెట్లతోపులోకి రావడం ఒకేసారి జరిగింది.

❖ ❖ ❖

అదేపనిగా ఎక్కడా ఆగకుండా ప్రయాణం చేస్తూ రావటం వల్ల పూర్తిగా అలసిపోయాయి ఆ దృఢకాయుల అశ్వాలు.

"మనం చాలా ఆలస్యంగా వచ్చాము. ఈపాటికి నగర ద్వారాలు మూతబడి వుంటాయి. తెల్లవారే వరకూ ఇక్కడే గడపాలి" అని మిగిలిన వారికి చెపుతూ తన వాహనంమీది నించి దిగి దారిపక్కనే వున్న ఒక మట్టి దిబ్బ మీదికి పోయాడు వారందరికీ నాయకత్వం వహిస్తున్నట్టున్న వ్యక్తి.

పోయిన వెంటనే కనిపించిన దృశ్యాన్ని చూసి కంగారుపడుతున్నట్టు మిగిలినవారిని కూడా దిబ్బమీదికి పిలిచాడు.

ఒకరి తర్వాత ఒకరుగా అతని పక్కకు వెళ్ళి నోళ్ళు వెళ్లబెట్టారు వారందరూ.

మూడు వందల ధనువుల దూరంలోకి కనిపిస్తున్నాయి సంపంగి నగర ద్వారాలు. నాయకుడు చెప్పినట్లు మూతబడి వున్నాయి.

నిర్మానుష్యంగా వుండవలసిన నగర వెలుపలి భాగం– వృషభ శకటాల తోను రకరకాల వస్తువుల్ని అమ్ముకుని జీవనం సాగించే సంచార వ్యాపారస్థులతోను కిటకిటలాడిపోతోంది.

భగభగలాడుతున్న కాగడాల్ని పట్టుకుని, అశ్వాలమీద అటు ఇటూ పరుగులు తీస్తున్నారు సంపంగి నగర రాజభటులు.

తదేక దీక్షగా ఆ దృశ్యాన్ని చూసి, చిన్నగా చిటికెలు వేశాడు దృఢకాయుల నాయకుడు.

"నగరంలో ఏదో గొడవ ఖచ్చితంగా జరిగింది. అందుకే బయటికి వచ్చారు భటులు. ఆ గొడవకు కారణమైన వారిని వెతుకుతున్నారు" తను ఊహించిన దాన్ని మిగిలినవారికి వివరించి చెప్పాడు.

"ఈ సమయంలో మనం నగరంలోకి పోవటం ప్రమాదకరమేమో బాగా ఆలోచించాలి" ఉన్నట్లుండి అన్నాడు మిగలినవారిలో ఒకతను.

"మనం ఎవరిమో ఎవరికీ తెలియదు. గట్టిగా అడిగితే శ్రావస్తి నగరంనించి వచ్చామని, కనకయ్య శ్రేష్ఠిగారి అనుచరులమని చెప్పవచ్చు. శ్రేష్ఠిగారి అనుచరులమని చెప్పిన తర్వాత మండలాధిపతి కూడా మనల్ని ఏమీ చెయ్యలేడుగాని..." అంటూ మాటల్ని ఆపాడు నాయకుడు.

"ఏమిటి నీ అనుమానం?" అని అడిగాడు అంతకుముందు మాట్లాడిన మనిషి.

"మనమీదికి మిన్నాగుల్ని పంపకం చేసిన బుడతడి ఆచూకీ గురించి ప్రశ్నలు వేయటం మాత్రం కుదరదు. ఇంతమంది భటులు పట్టుదలగా పరికిస్తుండగా మనకి ఎవరూ సరైన సమాధానం చెప్పరు" సాలోచనగా తన మాటల్ని పూర్తిచేశాడు నాయకుడు.

"అయితే ఇప్పుడు మనం చేయాల్సింది ఏమిటి? నగరంలో సందడి సర్దుబాటు అయ్యేంతవరకు మాట్లాడకుండా కూర్చోవాల్సిందేనా?" అడిగాడు ఆ అనుచరుడు.

"ఆ బుడతడు ఎవరో... మన శ్రేష్ఠిగారు చేస్తున్న వ్యాపారాల గురించి అతనికి ఎలా తెలిసిందో వెంటనే విచారించి, అతన్ని అంతం చేయకపోతే కనకయ్య శ్రేష్ఠి మనల్ని బ్రతకనీయడు. వంద నాణేలను దారి ఖర్చుల క్రింద ఇచ్చిన తర్వాత మళ్ళీ మూడుసార్లు హెచ్చరికలు చేశాడు" అన్నాడు మరో అనుచరుడు.

పదినిమిషాలపాటు దీర్ఘంగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చినట్టు తలవూపాడు నాయకుడు. "నగరంలోకి పోయే పనిని ఈ సందడి తగ్గిన తర్వాత పెట్టుకుందాం. ఈ లోపల ఈ చుట్టుపట్ల వున్న గ్రామాల్లో తిరిగి విచారిద్దాం. ఎవరో ఒకరు ఏదో ఒక మాట మనకి చెప్పకపోరు" అన్నాడు.

"మన అశ్వాలు అలసిపోయి వున్నాయి. కదలటం కష్టం" వెంటనే ఒక అభ్యంతరాన్ని వెల్లడించాడు మరో అనుచరుడు.

"నడిపించుకు పోదాం... బంగరు బయలు ప్రదేశంలో నిలబడటం కంటే ఏదో ఒక పని చేస్తూ కాలక్షేపం చేయటం ఉత్తమం..." అంటూ మాటల్ని మరోసారి ఆపాడు నాయకుడు.

అధికం అయిపోయింది అతని అనుచరుల కుతూహలం. "చెప్పు... త్వరగా చెప్పు" అంటూ తొందరపెట్టారు.

పెద్దగా నవ్వి చిన్నగా కన్నుగీటాడు నాయకుడు. "సంపంగి నగరం చుట్టుపట్ల వుండే గ్రామాల్లో పడుచు పిల్లల అందాలు అమోఘంగా వుంటాయని పెద్ద పేరు. పనికి పని... కాలక్షేపానికి కాలక్షేపం" అన్నాడు.

నవ్వులమయమై పోయాయి మిగిలిన వారి మొఖాలు. "అయితే ఆలస్యం దేనికి? నడిపించండి గుర్రాల్ని..." అంటూ గుంపుగా మట్టిదిబ్బ మీదినించి దిగి తమ వాహనాల దగ్గరికి పోయారు.

❖ ❖ ❖

చెట్లతోపుకు అవతల పల్లపు ప్రదేశంలో వున్న గణపతి ఆలయం దగ్గరికి పోయి గబుక్కున లోపలికి దూరాడు శివుడు.

గణపతి విగ్రహం వెనుక వుండే రహస్య ద్వారాన్ని తెరిచే వ్యవధి మాత్రం అతనికి లభించలేదు.

అతను ఆలయాన్ని సమీపిస్తున్న సమయంలోనే పదిమంది దృఢకాయులు తమ అశ్వాలను నడిపించుకుంటూ రావటాన్ని చూశాడు అతను. వారికి కనిపించకుండా లోపలికి గెంతి విగ్రహం చాటున ఒదిగి నిలబడ్డాడు.

ఆలయం ముందుకు వచ్చారు దృఢకాయులు. అదే సమయంలో చెట్లతోపులో నుంచి తన అశ్వాన్ని వేగంగా పరిగెత్తిస్తూ అక్కడికి చేరుకున్నాడు ఒక రాజ భటుడు. తన చేతిలో వున్న కాగడా వెలుగులో ఆ దృఢకాయుల మొఖాన్ని పరీక్షగా చూస్తూ "ఎవరు మీరు?" అని ప్రశ్నించాడు.

వినయంగా నిలబడి అతనికి నమస్కారం చేశాడు అందరికంటె ముందున్న దృఢకాయుల నాయకుడు.

"అయ్యా! మాది శ్రావస్తి నగరం. మా నగర శ్రేష్ఠుడైన కనకయ్య శ్రేష్ఠిగారి దగ్గర పనిచేస్తూ వుంటాము. దారిలో మా అశ్వాలు అలసిపోవటం వల్ల ఆలస్యంగా వచ్చాము. నగర ద్వారాలు మూసివేసి వుండటంవల్ల..." అని అంటూ వుండగానే తనకు అంతా అర్థం అయినట్లు సానుభూతిగా తలవూపాడు కాగడా పట్టుకున్న భటుడు.

"రేపు సంత కారణంగా, తొలి వెలుగులు వస్తూ వుండగానే నగర ద్వారాలు తెరువబడతాయి. అంతవరకూ కావాలని అనుకుంటే మీరు ఈ గుడిదగ్గరే బస చేయవచ్చు" అంటూ తన అశ్వాన్ని ముందుకు కదిలించాడు.

దృఢకాయుల నాయకుడి నోటివెంట కనకయ్య శ్రేష్ఠి పేరు బయటికి వచ్చిన వెంటనే ఝల్లుమన్నది గణపతి విగ్రహం వెనుక ఒదిగి వున్న శివుడి శరీరం. భటుడు పట్టుకున్న కాగడా వెలుగులో వారందరి వదనాలను వీక్షించిన వెంటనే ప్రారంభం అయింది అదోరకమైన గుబులు.

తమ అడవిలోని ఏనుగుల్ని వేటాడటానికి వచ్చి తను మిన్నాగుల్ని రెచ్చగొట్టడం వల్ల వెనక్కి పారిపోయిన దుండగులు వాళ్ళే.

పట్టిన పట్టు వదలకుండా మళ్ళీ ప్రత్యక్షం అయ్యారంటే... అది ఏనుగుల కోసమే అయి వుంటుంది.

చచ్చి చెడీ తన ప్రాణాలమీదికి తెచ్చుకుని కాపాడటం జరిగింది ఆ రెండు ఏనుగుల్ని. ఇప్పుడు ఏ మాత్రం ఏమరుపాటుగా వున్నా అవి ఈ దుర్మార్గుల చేతుల్లో హతమారిపోతాయి.

రాజభటుల కంట పడకుండా రహస్య మార్గం గుండా నగరంలోకి పోయి తనంతట తానుగా సాగరుల వారి ఎదుట పడాలన్న మాటను వెంటనే మర్చిపోయాడు అతను.

ముందుగా ఈ హంతకముఠా అంతు చూడాలి. ఆ తర్వాతనే తను సాగరులవారి ఎదుటికి వెళ్ళాలి...

గణపతి విగ్రహం వెనుక వుండే రహస్య మార్గాన్ని తెరిచి సొరంగంలోకి పోవాలనే నిశ్చయాన్ని వెంటనే వదులుకుని గుడి ఎదురుగా నిలబడి వున్న దృఢకాయుల్నే గమనించటం మొదలుపెట్టాడు అతను.

తమను ప్రశ్నించిన భటుడు దూరంగా వెళ్ళిపోయేదాకా ఆగి, మళ్ళీ తమ నడకను మొదలుపెట్టారు దృఢకాయులు.

"ఇక్కడికి సరిగ్గా రెండు యోజనాల దూరంలో ఒక గ్రామం వుంది. తాము పండించిన కాయగూరల్ని సంతలో విక్రయించేందుకు మగవాళ్ళందరూ నగర ద్వారం దగ్గరికి వచ్చి వుంటారు. గ్రామంలో ఆడవాళ్ళు, పిల్లలు మాత్రమే మిగిలి వుంటారు. మనం అనుకుంటున్న పని చాలా తేలికగా పూర్తి అయిపోతుంది" నవ్వుతూ తనవారికి చెప్పాడు నాయకుడు.

కాగడాలు పట్టుకున్న భటులు మళ్ళీ ప్రత్యక్షం అయితే, దాక్కోవటానికి సరైన ప్రదేశాలు ఎక్కడెక్కడ వున్నాయో చూసుకుంటూ దృఢకాయుల వెనక అడుగులు వేశాడు శివుడు.

రెండవ ఝాము గడిచిపోయి మూడవ ఝాము మొదలవుతున్న సమయంలో అతని దృష్టిపథంలోకి వచ్చింది దృఢకాయులు ఎంచి పెట్టుకున్న గ్రామం.

❖ ❖ ❖

అశ్వాలను గ్రామం వెలుపల ఒక పెద్ద మర్రిచెట్టు క్రింద వదిలారు దృఢకాయులు. దట్టంగా తలలకు చుట్టుకున్న తలపాగాలను వదులు చేసుకుని వాటి చెంగులతో మొఖాలు కనిపించకుండా మరుగు పరుచుకున్నారు.

"ఎవరికి కావాల్సిన ఇంటిని వాళ్ళు ఎంచుకోండి. ఒకేసారి తలుపులు తట్టాలి. తలుపులు తెరుచుకోగానే లోపలికి దూరి కంటికి నదురుగా కనిపించిన పడుచుల్ని పట్టుకోవాలి..." అందరికీ చెప్పాడు నాయకుడు.

"ముసలి ముతకా కూడా వుంటారు ఇళ్ళల్లో. ఎదురు తిరుగుతారు. అరిచి కేకలు పెడతారు గ్రామం అంతా మేల్కొంటుంది" తన సందేహాన్ని బయట పెట్టాడు ఒక అనుచరుడు.

"ఎదురు తిరిగి వెంటపడటానికి మగవాళ్ళు చాలా తక్కువమంది వుంటారు. పడుచుల్ని పట్టుకున్న వాళ్ళందరూ పరిగెత్తుకుంటూ ఇక్కడికి వచ్చేయండి. మన అశ్వాలకు అలసట తీరింది. అందరినీ అశ్వాలమీద వేసుకొని అడవిలోకి పరిగెత్తుదాం. అప్పుడు మనల్ని ఎవరూ ఏమీ చేయలేరు" అంటూ ముందుకు అడుగు వేశాడు దృఢకాయుల నాయకుడు.

పది అడుగుల దూరంలో ఒక పెద్ద ముళ్ళపొద చాటున నిలబడి ఆ మాటల్ని వింటున్న శివుడి శరీరం కారం రాసినట్లు చిమచిమలాడింది ఒక్కసారిగా.

నరరూప రాక్షసుల వంటి ఆ దుర్మార్గులు చేయదలుచుకున్న పనేమిటో తెలిసేసరికి దాహం వేస్తున్నట్టు ఎండుకుపోయింది అతని గొంతు.

గ్రామంలోకి అడుగుపెట్టకూడదు వాళ్ళు. అడుగు పెడితే సర్వనాశనం జరిగిపోతుంది. ఆ పని జరగకముందు అడ్డుకోవాలి.

తాను ఒక్కడే– వాళ్ళు పదిమంది అనే మాటను మరిచిపోయాడతను ఆ సమయంలో.

దృఢకాయులు గ్రామంలో వున్న మొట్టమొదటి ఇంటికి దగ్గరిగా పోతూ వున్న సమయంలో పొదచాటునుంచి ఇవతలికి వచ్చి మర్రిచెట్టు క్రింద వున్న అశ్వాలను సమీపించాడు.

దృఢకాయుల నాయకుడు చెప్పినట్లు వాటి అలసట అణిగిపోయింది. చురుకుగా తలలు తిప్పి అతనివంక చూశాయి అవన్నీ.

"మీ యజమానులు తిరిగి వచ్చేంతవరకూ కదలకుండా నిలబడవలసిన అవసరం మీకు లేదు. మీరు కూడా కాస్సేపు అటూ యిటూ తిరిగిరావటం బాగుంటుంది" అంటూ కిందికి వాలి వున్న చెట్టుకొమ్మలకు బిగించిన వాటి కళ్ళేలను ఊడతీశాడు. సన్నగా పొడుగ్గా వున్న ఒక కొమ్మను విరిచి, వెదురుచువ్వ మాదిరిగా గాలిలోకి ఝుళిపించాడు.

ఝుళిపిస్తూ వుండగానే వచ్చింది మళ్ళీ అతనికి అనుమానం. చాటునుంచి ఎవరో తనను తదేకదీక్షతో చూస్తున్నట్లు.

గ్రామంలోకి పోతున్న దృఢకాయుల్లో ఎవరో ఒకరు వెనక్కి వచ్చారేమోనన్న అనుమానం కూడా కలిగింది.

పది క్షణికాల పాటు చూసినా ఎవరూ కనిపించకపోయేసరికి ఆ అనుమానాల్ని మనసులో నుంచి నెట్టివేసి చేతిలో వున్న కొమ్మతో అశ్వాల నడుముల మీద బలంగా కొట్టడం మొదలుపెట్టాడు.

బాధను భరించటం అసాధ్యమైపోయింది కాబోలు ముందుకాళ్ళను గాలిలోకి ఎత్తి వికృతంగా సకిలించాయి కొన్ని అశ్వాలు.

ఆ శబ్దాన్ని ఆలకించిన దృఢకాయులు వెంటనే వెనక్కి వస్తారని తెలుసు శివుడికి. అందుకే మరింత వేగంగా కొనసాగించాడు తన మర్ధనా కార్యక్రమాన్ని. "పొండి... పారిపొండి. పొండి" అని హెచ్చరిస్తూ ఇష్టం వచ్చినట్లు వాటిని కొమ్మతో ప్రహరించాడు.

ఒకదాని వెనుక ఒకటిగా పరుగు మొదలుపెట్టాయి అశ్వాలు. పిచ్చిపిచ్చిగా సకిలిస్తూ పొదల్లోకి పరిగెత్తి మాయం అయిపోయాయి.

శివుడి ఊహ యదార్ధం అయింది. తమకు నచ్చిన ఇళ్ళను ఎంపిక చేసుకుని నిశ్శబ్దంగా తలుపుల దగ్గరికి పోబోతున్న దృఢకాయులందరూ పరుగు పరుగున వచ్చేశారు మర్రిచెట్టు దగ్గరికి.

అల్లంత దూరంలో వుండగానే వారికి కనిపించకుండా మళ్ళీ ముళ్ళపొదల చాటుకు వెళ్ళిపోయాడు శివుడు. ఒట్టిగా వెళ్ళలేదతను.

"దొంగలు... దొంగలు... గ్రామాన్ని దోచుకోవటానికి వచ్చారు. రండి... అందరూ బయటికి రండి... దొంగలు..." అని అతి బిగ్గరగా అరుస్తూ పోయాడు.

చెట్టుక్రింద వుండాల్సిన తమ అశ్వాలు అగుపించకపోవటంతో అదిరిపడి అటూ ఇటూ చూస్తున్న దృఢకాయుల గుండెలు గుభిల్లుమన్నాయి ఆ అరుపుల్ని వినేసరికి.

"అదే కంఠం... మనమీదికి మిన్నాగుల్ని ఉసికొల్పిన కంఠమే అది. వెతకండి... వాడిని పట్టుకోండి" అని హెచ్చరిస్తూ అరుపులు వినబడిన దిశలోకి పరిగెత్తాడు దృఢకాయుల నాయకుడు.

తమ దట్టీలో దాచుకుని వున్న ఆయుధాల్ని బయటికి తీస్తూ అతన్ని అనుసరించబోయి అదిరిపడ్డారు మిగిలినవారు.

గాఢనిద్రలు పోతున్నారనుకున్న గ్రామస్తులు ఒకేసారి నిద్రలు లేచారు కాబోలు... నూనెదీపాల వెలుగుతో కాంతివంతం అయింది గ్రామంలో వున్న ఒకే ఒక వీధి.

ఉన్నట్లుండి వెలిగించబడ్డాయి కొన్ని కాగడాలు. కర్రలు, బరిశెలు పట్టుకున్న స్త్రీ జనం ఒకరి తరువాత ఒకరుగా వీధిలో ప్రత్యక్షం అవసాగారు.

"రండి... మర్రిచెట్టు దగ్గరికి రండి... దొంగలు ఇక్కడే వున్నారు. రండి రండి" పొదల్లో నుంచి మరోసారి ఇంకా దగ్గరికి వినవచ్చింది శివుడి కంఠం.

గుంపుగా కదిలారు వీధిలోకి వచ్చిన ఆడవాళ్ళు అందరూ. వాళ్ళు మర్రిచెట్టు దగ్గరికి వచ్చేవరకూ తాము అక్కడే వుంటే ఏం జరుగుతుందో తెలిసిపోయింది దృఢకాయులందరికీ. కూడబలుక్కున్నట్టు ఒకేసారి కదిలి పొదల్లోకి పరుగులు తీశారు తాము కూడా.

పది క్షణాలు ఆలస్యంగా చెట్టుక్రిందికి చేరుకున్నారు ఆయుధాలు పట్టుకున్న స్త్రీలు అందరూ.

తన గొంతును గుర్తుపట్టి దృఢకాయులు తనను పట్టుకోవటానికి పొదల్లోకి వచ్చే అవకాశం వుందని శివుడికి తెలుసు. అవసరంఅయితే వారికి దొరకకుండా దూరంగా పారిపోవడానికి సిద్ధపడే గ్రామస్థుల్ని ఉద్దేశించి బిగ్గరగా అరిచాడు.

ఆయుధాలు ధరించి కాగడాలతో సహా మర్రిచెట్టు దగ్గరికి వస్తున్న వారిని చూసి దృఢకాయులు దారుణమైన భయానికి గురి అవుతారని మాత్రం అనుకోలేదతడు.

"ఆగండిరా పిరికిదద్దమ్మల్లారా... కాస్తంత ఆగి మీ గొప్పతనం ఏమిటో ఆ ఆడవాళ్ళకి చూపించండిరా..." అని వెక్కిరించబోయి, ఆఖరి క్షణంలో ఆ మాటల్ని మింగేశాడు.

ఆవేశానికి లోనై దృఢకాయులు వెంటనే వెనక్కి వస్తారో, రారో తెలియదు గాని, మర్రిచెట్టు దగ్గరికి వచ్చేసిన ఆడవాళ్ళు మాత్రం ఖచ్చితంగా పరిగెత్తుకు వస్తారు తన దగ్గరికి. తనను కూడా ఆ దుండగుల్లో ఒకడిగా తలచి, దేహశుద్ధి చేసినా చేస్తారు. గట్టిగా మాట్లాడితే ప్రాణాలు తీసి మర్రిచెట్టు కొమ్మలకి వేలాడదీస్తారు. ఆ పని జరిగేంతవరకూ అక్కడ ఆగటం అవసరమా??

నిలుచున్న ప్రదేశంలో నుంచి నెమ్మదిగా వెనక్కి జరిగాడు అతను. నిశ్శబ్దంగా పది అడుగులు వేసి ఒక్కసారిగా పరుగు అందుకుని, రెండే రెండు నిమిషాలలో మూడు వందల ధనువులు దూరం వెళ్ళిపోయాడు.

❖ ❖ ❖

"నేను నమ్మనుగాక నమ్మను... శివుడు అల్లరిపిల్లవాడే కావచ్చు. దుందుడుకు పనులు చేసి మీకు తీవ్రమైన తలనొప్పిని కలిగిస్తూ వుండి వుండవచ్చు. అకారణంగా ప్రమాదగంటను మోగించి అల్లకల్లోలం సృష్టిస్తాడని మాత్రం నేను అనుకోవటం లేదు. వాడే గనుక ఆ ఏనుగుపిల్లను నగరంలో నుంచి బయటికి తీసుకుపోయిన మాట వాస్తవం అయితే అందుకు ఏదో బలమైన కారణం వుండే వుంటుంది. ముందుగా అదేమిటో తెలుసుకోండి. ఆ తర్వాత వాడిని ద్రోహిగా నిర్ణయించండి" ఖచ్చితమైన కంఠంతో చాలా గట్టిగా వాదించింది సాగరులవారి సతీమణి చారులతాదేవి.

కిటకిటలాడిపోతున్నది సాగరుల వారి సభా భవనం. సామాన్యంగా పొద్దుపొడిచిన రెండు ఘడియలకు మొదలవుతాయి సభా కార్యక్రమాలు. ఆ రోజున మాత్రం పొద్దు పొడిచీ పొడవగానే సభకు విచ్చేశారు సాగరుల వారు.

శివుడిని వెతకటానికి ప్రయత్నం చేసి వట్టి చేతులతో నగరంలోకి తిరిగి వచ్చిన భటులతో పాటు సేనాపతి, నగరమంతా పర్యటించి శాంతి భద్రతలకు ఎటువంటి ముప్పు వాటిల్లకుండా ఏర్పాట్లను పర్యవేక్షించిన మంత్రి మహేశ్వరుడు, నగరంలోని ప్రజలందరికీ నాయకత్వం వహించే పదిమంది వృద్ధులు,

సభలో ఏం జరుగుతుందో తెలుసుకోవాలన్న కుతూహలంతో గుంపులు గుంపులుగా వచ్చిన నగరవాసులు... కిటకిటలాడిపోతున్నది ఆ ప్రదేశం.

"దేవర వారి సతీమణి చేస్తున్న వాదనలో కొంత నిజం లేకపోలేదు ప్రభూ... చేతలను బట్టి ఈ దుర్మార్గాలన్నిటినీ చేసింది శివుడేనని అనుకోవటం తప్పు, చేస్తుండగా అతన్ని చూసి గుర్తుపట్టినవారు ఎవరూ లేరు" చారులతాదేవి మాట్లాడిన వెంటనే తానుకూడా తన అభిప్రాయాన్ని వెల్లడించాడు మంత్రి మహేశ్వరుడు.

"నగర ద్వారాల దగ్గర ఏనుగు గున్నతో వెలుపలికి పోయినప్పుడు ఎదిరించిన భటుడు ఎవరు?" అడిగాడు సాగరులవారు.

గుంపుగా నిలుచుని వున్న భటుల మధ్యలో నుంచి నుదుటికి పెద్ద పలాస్త్రి పట్టీని అంటించుకుని వున్న భటుడు ఒకతను వెంటనే ఇవతలికి వచ్చి నిలబడ్డాడు.

'అరచేత్తో నా మొఖం మీద చరిచాడు ఆ బాలకుడు. నా కళ్ళు బైర్లు క్రమ్మాయి. బలంగా వెనక్కి నెట్టాడు. గడ్డి బండి చివరి భాగం బలంగా పొడుచుకోవటం వల్ల నా మొఖం గాయపడింది' ఇవతలికి వచ్చి నిలబడిన వెంటనే విన్నవించుకున్నాడు అతను.

"అంటే నువ్వు అతన్ని గుర్తుపట్టలేదు. అంతేనా?" వెంటనే అడిగాడు మంత్రి మహేశ్వరుడు.

"కాగడా కోసం అరిచాను... పక్కన వున్నది గడ్డిబండి కావటం వల్ల ఒకింత ఆలస్యం అయింది కాగడాలు రావటానికి. ఆ లోపల వాడు మటుమాయం అయిపోయాడు" చెప్పాడు భటుడు.

"కాగడాలు వచ్చేలోపల వేగంగా అవతలికి పోగల సామర్థ్యం శివుడికి తప్ప మన నగరంలో మరే బాలకుడికి లేదు ప్రభూ. ఈ దుశ్చర్యకు కారణం వాడే అని భావించటం అందుకే జరిగింది" ఓరకంట చారులతాదేవి వంక చూస్తూ చెప్పాడు మహేశ్వరుడు.

"నగరంలోని బాలకులందర్నీ మంత్రి మహేశ్వరుల వారు పరీక్షించి చూశారా? వారు ఎంత వేగంగా కదలగలరో ఒక నిర్ణయానికి వచ్చారా?" అడగనే అడిగింది ఆమె.

సింహాసనం మీద కూర్చుని వున్న సాగరులవారికి తీవ్రమైన చికాకు కలిగిన మాట వాస్తవం.

"అది కాదు దేవీ... విచారణ మొదలయింది కదా... వివరాలు ఒకటొకటిగా వెలుపలికి వస్తున్నాయి కదా..." అంటూ ఆమెను సముదా యించటానికి ప్రయత్నించాడు.

"వివరాలు ఒకటొకటిగా వెలుపలికి వస్తున్న ఛాయలు నాకు కనిపించటం లేదు. ఆందోళనకు కారణాన్ని తెలుసుకోలేక అందరూ కలిసి ఆ నిందను శివుడి మీదకు నెట్టివేసే ప్రయత్నం మాత్రమే అగుపిస్తోంది" నిశ్చయంగా చెప్పింది ఆమె.

"గజశాల... గజశాల నిర్వాహకుడిని రమ్మని చెప్పండి ప్రభూ..." వెంటనే తను కల్పించుకుంటూ అన్నాడు మహేశ్వరుడు.

భటులందరికీ దూరంగా ఒక ఆసనం మీద కూర్చుని వున్న గజశాల నిర్వాహకుడు వెంటనే లేచి సాగరులవారి ఎదుటికి వచ్చాడు.

ప్రమాదగంట మ్రోగిన వెంటనే మా కాపలా భటులు ఆ గంట దగ్గరికి పరిగెత్తినది నిజం. గజశాలకు ఆ సమయంలో ఎటువంటి రక్షణ లేదు. ఎవరైనా లోపలికి ప్రవేశించాలని అనుకుంటే అడ్డుకునేవారు కూడా లేరు. అయితే..." అంటూ మాటల్ని ఆపాడు అతను.

"చెప్పు... నీకు తెలిసింది నిర్భయంగా చెప్పు" ప్రోత్సహించాడు మంత్రి మహేశ్వరుడు.

"లోపల వున్న ఏనుగులేవీ శిక్షణ పొందినవి కాకపోవటం వల్ల, తమదగ్గరికి వచ్చినవారు శత్రువులో స్నేహితులో తెలుసుకునే స్థితిలో లేవు. ప్రమాదగంట మోగిన వెంటనే చెలరేగిన గందరగోళాన్ని గమనించి అవికూడా కంగారుగా కాళ్ళు తొక్కుకోవటం మొదలుపెట్టాయి. వాటిని శాంతింపచేయటానికి మేము చాలాసేపు శ్రమ పడవలసి వచ్చింది. గున్న ఏనుగును బయటికి తీసుకుపోయిన వారిని మాత్రం మేము ఎవరం చూడలేదు. నగర ద్వారాల దగ్గర ఎవరో కుర్రవాడు దానిని అవతలికి నడిపించుకుపోయాడని నలుగురి నోటా వినటమే తప్ప మేము వాడిని చూడలేదు" స్థిరమైన కంఠంతో తనకు తెలిసింది చెప్పాడు అతను.

"ఎవరిని కదిలించినా ఎవడో కుర్రవాడు అనే మాట తప్ప మరొకటి మాకు వినిపించటం లేదు. ఈ విషయంలో మాకు మరిన్ని వివరాలు అవసరం. ఇప్పటి కిప్పుడు ఒక నిర్ణయానికి రావటం కష్టం" అంటూ వున్నట్లుండి మాటల్ని ఆపి సభా భవనం ముందు భాగంలోకి చూశాడు సాగరులవారు.

అడ్డుకోబోయిన ద్వారరక్షకుల్ని మొండిగా అవతలికి నెడుతూ, దురుసుగా లోపలికి వస్తున్నారు కొంతమంది స్త్రీలు తమ పురుషులతో కలిసి.

"ఎవరు మీరు? ఏమిటి ఈ దురుసుతనం? సభ జరుగుతుండగా ఇలా రావడం మర్యాదకాదు. వెంటనే వెళ్ళిపొండి బయటికి." ఒకింత కోపంగా వారిని ఆజ్ఞాపించబోయిన మహేశ్వరుడిని గురించి అసలు పట్టించుకోలేదు వారెవరూ.

"మండలాధిపతుల వారికి నమస్కారం. గత రాత్రి మా గ్రామంమీద దోపిడీ దొంగల దాడి జరిగింది ప్రభూ! సరయిన సమయంలో ఎవరో బిగ్గరగా అరిచి హెచ్చరించటం వల్ల ఘోర ప్రమాదం తప్పిపోయింది. తమ చల్లని పరిపాలనలో ఇటువంటి దారుణం జరగటం ఇదే ప్రథమం. తమకు వెంటనే మనవి చేసుకోవటానికి వచ్చాము" నమస్కారాలు చేస్తూ పెద్ద కంఠంతో సాగరులవారికి చెప్పాడు వారిలో ఒక వృద్ధుడు.

"దోపిడీ దొంగల దాడి జరిగిందా? గ్రామంలోని మగవాళ్ళందరూ ఏం చేస్తున్నారు? మధిర తాగి మత్తుగా పడిపోయి వున్నారా?" వెక్కిరింపుగా అడిగాడు మంత్రి మహేశ్వరుడు.

"మధిర తాగి మత్తుగా పడిపోలేదు. మేము పండించిన కాయగూరల్ని విక్రయించటం కోసం సంతకు వచ్చాము. మేము గ్రామంలో లేమనే సంగతిని తెలుసుకున్న తర్వాతనే ఆ దోపిడీ ప్రయత్నం జరిగిందని మా అనుమానం" గంభీరంగా అన్నాడు ఆ గ్రామస్థుల్లో ఒకతను.

"దోపిడీ దొంగల గురించి అరిచి అందరినీ హెచ్చరించింది ఎవరు?" ఆశ్చర్యంగా అడిగాడు మహేశ్వరుడు.

"ఎవరో మాకు తెలియదు సామి... గొంతు మాత్రం చాలా చిన్నపిల్లవాడిది. పెద్దవాళ్ళ కరుకుదనం అందులో లేదు. ఆందోళన మాత్రం వుంది" వెంటనే చెప్పింది ఆ గుంపులో వున్న ఒక మధ్యవయస్కురాలు.

“ఆ గొంతు పెద్దవాళ్ళది కాదని నువ్వు ఎలా చెప్పగలవు?” అడిగాడు మహేశ్వరుడు.

“ఇంత వయసు వచ్చిన తర్వాత కూడా గొంతుల్లో తేడాను గుర్తుపట్టటం కష్టమా? నేనే స్వయంగా విన్నాను. విన్న తరువాత మా వాళ్ళందర్నీ కేకలు పెట్టి నిద్రలు లేపాను”అని అతనికి చెప్పి సాగరుల వారికేసి తిరిగింది ఆమె.

“ఒకసారి కాదు మారాజా... రెండుసార్లు వినబడింది అది. రెండోసారి ఆ దొంగలు మర్రిచెట్టు దగ్గర వున్నట్టు మమ్మల్ని అటుకేసి రమ్మని అరిచింది. అది ఖచ్చితంగా ఎవరో కుర్రవాడి కంఠమే. పెద్దవాళ్ళది కాదు” అని వెల్లడించింది.

“దోపిడీ దొంగల బారినుంచి మిమ్మల్ని కాపాడిన ఆ అగంతక పిల్లాడు ఆ తర్వాత మీకు కనిపించలేదా?” అడిగాడు మహేశ్వరుడు.

“మేము మర్రిచెట్టు దగ్గరికి పోయిన తర్వాత చుట్టూ వున్న పొదలన్నిటినీ వెతికాము. ఎవరూ కనిపించలేదు” చెప్పింది ఆమె.

“మీకు ఎంతో సహాయం చేసిన ఆ అగంతక పిల్లడు ఆ తర్వాత మీకు ఎందుకని కనిపించలేదు?” మళ్ళీ అడిగాడు మహేశ్వరుడు.

“మంత్రిగారి మాటలు విడ్డూరంగా వున్నాయి. కనిపిస్తే తమ దగ్గర వున్న ఆయుధాలతో అతని భరతం పట్టి వుండేవాళ్ళు వీళ్ళు. తనకు తాను పరిచయం చేసుకునే లోపల అతని వళ్ళు హూనం అయిపోయి వుండేది” సన్నగా ఎత్తిపొడిచింది చారులతాదేవి.

“నిజం తల్లీ... నిద్రలు చెడిపోయిన చిరాకు... దొంగలొచ్చి పడ్డారన్న భయం... అతను మాట్లాడేదాకా ఆగేవాళ్ళం కాదు. కనిపించిన వెంటనే చావకొట్టి చెవులు మూసి వుండేవాళ్ళం” అన్నది ఆ మధ్యవయస్కురాలు.

“ఈ పరిణామానికి అర్థం ఏమిటి మహేశ్వరా?” అడిగారు సాగరులవారు.

“నగరంలోని అల్లకల్లోలానికి ఒక కుర్రవాడు కారణం అయినట్టే ఈ గ్రామీణుల సంరక్షణకు కూడా ఒక కుర్రవాడు కారణం అయినాడు” సాలోచనగా చెప్పాడు మహేశ్వరుడు.

“ఆ పని చేసింది మన శివుడే అని ఎందుకు అనుకోకూడదు?” వెంటనే అందుకుని అడిగింది చారులతాదేవి.

అధికం అయిపోయింది సాగరులవారి చికాకు. “ఎన్ని మాటలు మాట్లాడినా అసలు సమస్య అలాగే వుండిపోతోంది. విచారణను రేపటి ఉదయం తిరిగి కొనసాగిద్దాం. సభ నేటికి సమాప్తం” మహేశ్వరుడిని అడగకుండానే తన నిర్ణయాన్ని ప్రకటించి సింహాసనం మీదినించి లేచాడు.

ఆయనతో పాటు లేచి నిలుచున్నారు సభలోని వారందరూ. నమస్కారాలు చేస్తూ ఒకరి తర్వాత ఒకరుగా వెలుపలికి బయలుదేరారు.

“మీ గ్రామం మీదికి వచ్చిన వారెవరో తెలుసుకుని తగిన చర్యలు తీసుకుంటాము. మీరు నిర్భయంగా మీ నెలవులకు వెళ్ళిపొండి” కదలకుండా నిలబడిన గ్రామీణులకు చెప్పాడు మహేశ్వరుడు.

❖ ❖ ❖

దారి తప్పాడు శివుడు. హడావుడిగా పరిగెత్తటంలో సంపంగి నగరం కేసి పోవాల్సినవాడు కాస్తా అడవిమధ్య భాగంలోకి వెళ్ళిపోయాడు.

తూర్పు దిక్కున తొలి వెలుగులు ప్రత్యక్షం అవుతున్న సమయంలో తెలిసివచ్చింది అతనికి ఆ విషయం.

తెలిసిన వెంటనే నడకను ఆపి, దగ్గర్లో వున్న ఒక పెద్ద చెట్టు మీదికి పాకి చిటారు కొమ్మల్ని చేరుకున్నాడు.

“అడవిలో సంచరించటం ఒక మహావిద్య. చుట్టూ ఎత్తయిన చెట్లు, దట్టమైన పొదలు వున్నప్పుడు ఒక్కోసారి మనకి ఏది ఏ దిక్కో, సూర్యుడు ఎటునుంచి ఎటుగా ప్రయాణం చేస్తున్నాడో తెలియకుండా పోవచ్చు. ఆ సమయంలో మీరందరూ ఏమి చేస్తారు?” అటవీ సంచారాన్ని గురించి బోధించటానికి ఒకసారి సేనాధిపతిని ఆహ్వానించినప్పుడు పక్కన నిలబడి ఆసక్తిగా వింటున్న పిల్లలందరినీ అడిగాడు సేనాపతి.

రాజభవనాన్ని గురించి, రాజభవనంలో వుండే వంటశాల గురించి వెనుక వున్న ఉద్యానవనాన్ని గురించి తప్ప వేరే ప్రదేశాన్ని గురించి తెలియకపోవటం వల్ల సమాధానం చెప్పలేకపోయారు పిల్లలు.

“ఏరా శివుడు…నీకు కూడా తెలియదా?” వెనుక వరుసలో వున్న శివుడి వంక ప్రత్యేకంగా చూస్తూ అడిగాడు సేనాపతి.

పిల్లలంటే మహా విసుగు ఆ పెద్దమనిషికి. అందులోను శివుడంటే కొద్దిపాటి కోపం కూడా. తాను ఎటువంటి సమాధానాన్ని చెప్పినా వెంటనే దాన్ని ఖండించి అందరిముందు తెలివిలేనివాడిగా చిత్రీకరిస్తాడు అతను. నోరు తెరిచి వెక్కిరింతలపాలు అవటం కంటే, అందరితోపాటు తల వంచుకు నిలబడితే బాగుంటుంది కదా...

తలను వంచుకున్నాడు శివుడు.

"తెల్లవారిన దగ్గర్నించీ నగరం వెలుపలికి పోయి లేనిపోని గొడవలన్నీ నెత్తిమీదికి తెచ్చుకునే నీకు ఈ మాత్రం కూడా తెలియదా? మట్టి మొఖమా" అంటూ అయ్యవారి దగ్గర వున్న వెదురు చువ్వను తీసుకుని, శివుడి వీపుమీద బలంగా కొట్టాడు సేనాపతి.

"దగ్గర్లో వున్న ఏదో ఒక ఎత్తయిన ప్రదేశంలోకి పోయి చుట్టూ చూడాలి... దారి దానంతట అదే కనిపిస్తుంది" మరో దెబ్బ వంటిమీద పడకముందే విధిలేని పరిస్థితిలో నోరువిప్పి సమాధానం ఇచ్చాడు శివుడు.

"ఏడిచావ్ వెధవా... ఎత్తయిన చెట్లమీదికి ఎగబ్రాకటం అలవాటయి అవే మాటలు నీ నోటివెంట వచ్చేస్తున్నాయి. చిన్నపిల్లలు కాబట్టి మీరు ఏమీ చేయకూడదు. పెద్దవాళ్ళు మీకోసం వెతుక్కుంటూ వచ్చేంతవరకు ఎక్కడ వారక్కడ ఆగిపోయి మధ్య మధ్యలో బిగ్గరగా కేకలు పెడుతూ వుండాలి అంతే" అన్నాడు సేనాపతి.

దట్టమైన అడవిలో క్రూరమృగాలు వుంటాయని, భయంకరమైన శబ్దాలు చేస్తే అవి వెంటనే వచ్చి మీద పడతాయని ఇంతకుముందు ఎప్పుడో ఒకసారి ఆయనే చెప్పిన మాటల్ని కూడా గుర్తుచేయలేదు శివుడు. బాధను భరిస్తూ మౌనంగా వుండిపోయాడు అప్పుడు.

ఇప్పుడు మాత్రం ఆ రోజున సేనాపతి చెప్పినట్లు అరవటం గాని, కేకలు పెట్టటంగాని చేయకుండా చిటారు కొమ్మల్లో నిలబడి చుట్టూ చూశాడు.

దిక్కులయితే తెలిశాయి. కాని తాను ఎక్కడ వున్నాడో, తమ నగరాన్ని చేరుకోవటానికి ఎటునుంచి ప్రయాణించాలో అర్థం కాలేదు.

దారి తెలియకపోవటం వల్ల తనకు ఏదో ప్రమాదం వాటిల్లుతుందన్న భయంకలగలేదు అతనికి. నగరానికి చేరుకోవటం ఆలస్యం అయిన కొద్దీ

తనమీద అనుమానాలు చాలా అధికం అయిపోతాయి. తాను చేసిన పనుల్ని సమర్థించుకోవటం కష్టతరమైపోతుంది. నేరస్థుడిగానే మిగిలిపోవటం జరుగుతుంది.

అది జరగకుండా వుండాలంటే సాధ్యమైనంత వేగంగా తాను వెనక్కి వెళ్ళిపోవాలి.

రకరకాల ఆలోచనలతో సతమతం అయిపోతూ, అటూ ఇటూ చూస్తున్న శివుడికి ఎక్కడో దూరంలో వున్న ఒక చెట్లగుంపులో నుంచి పైకి చూస్తూ కనిపించింది ఒక సన్నపాటి ధూమస్తంభం.

చెట్లక్రింద ఎవరైనా చితుకుల మంట వేసినప్పుడు అలాగే వస్తుందట దట్టంగా వుండే పొగ.

అడవిలో ఎలా సంచరించాలో అతనికి సేనాపతి నేర్పించలేదు. ఉద్యానవన ద్వారం దగ్గర కాపలా వుండే వృద్ధ భటుడు వివరంగా చెప్పాడు.

"పొగ రెండు రకాలుగా వుంటుంది. ఎండిపోయిన చెట్టుకొమ్మలు ఒకదానితో ఒకటి రాసుకోవటం వల్ల వేడిపుట్టి, నిప్పు తయారవుతుంది. గాలి గట్టిగా వుంటే అది కార్చిచ్చుగా మారి అడవినంతా దహించివేస్తుంది. అప్పుడు కనిపించే పొగ అందంగా వుండదు. కారు నలుపుగా వుంటుంది. తెరలు తెరలుగా గాలిలోకి లేస్తూ వుంటుంది. అది కనిపిస్తే మాత్రం వెంటనే కాళ్ళకు బుద్ధి చెప్పటం చాలా మంచిది. ఏదైనా నీటిమడుగును ఎంచుకుని అందులో మునిగి కూర్చోవటం ఇంకా మంచిది" అన్నాడతను ఒకసారి మాటల మధ్యలో.

"మరి రెండోరకం పొగ ఎలా వుంటుంది?" అడిగాడు శివుడు.

"చితుకుల మంట వేసినప్పుడు సన్నగా శకలాలుగా సూటిగా గాలిలోకి లేచి దానంతట అది చెదిరిపోతూ వుంటుంది. మనుష్యులు వేస్తేనే అటువంటిది మీకు అడవిలో కనిపిస్తుంది. అప్పుడు నువ్వు ధైర్యంగా అక్కడికి పోవచ్చు."

చిటారు కొమ్మల్లో నిలబడి వున్న శివుడి చెవుల్లో ఢంకా దెబ్బల మాదిరి మార్మోగాయి అప్పుడెప్పుడో వృద్ధభటుడు చెప్పిన ఆ మాటలు.

ఆలస్యం చేయలేదతను. గబగబా క్రిందికి జారాడు. పరుగులాంటి నడకతో ఆ పొగ కనిపించిన దిశలోకి పోయాడు.

అర్ధఘడియకు పైగా పట్టింది అతనికి- ఆ చెట్ల గుంపును చేరుకోవటానికి. చేరుకున్న వెంటనే తాను అడవిలో దారితప్పినట్లు తెలియచేయటానికి నోరు తెరవబోయి ఆఖరి క్షణంలో ఠక్కున మూసేసుకున్నాడు.

చితుకుల మంట వేస్తే సన్నపాటి పొగ స్తంభం మాదిరి గాలిలోకి లేస్తుందన్న మాట నిజమే అయింది. ఎదురుగా పెద్ద కుంకుడు చెట్టుక్రింద భగభగలాడుతూ కనిపిస్తోంది చితుకలమంట.

"లావుగా మదించి వున్నట్టు కనిపించే నాలుగు కుందేళ్ళను పొడుగాటి చెట్టుకొమ్మలకు బంధించి ఆ మంటమీద కాలుస్తున్నారు పదిమంది అగంతకులు.

వారికి పది అంగల దూరంలో చేతులు కట్టుకుని వినయంగా నిలబడి వున్నారు శ్రావస్తినగరం నుంచి ఏనుగుల్ని వేటాడటానికి వచ్చిన దృఢకాయులు.

❖ ❖ ❖

సంపంగి నగరం మధ్యభాగంలో వున్న శక్తి ఆలయం ముందు అశ్వశకటం నుంచి దిగింది సాగరులవారి సతీమణి చారులతాదేవి.

ఎప్పుడో ఏవైనా ప్రత్యేకమైన ఉత్సవాలు జరిగే సమయంలో తప్ప, మిగిలిన రోజుల్లో అటుకేసి రాని ఆమె వున్నట్టుండి ప్రత్యక్షం అయ్యేసరికి చాలా హడావుడి పడిపోయారు ఆలయంలోని అర్చకులు.

"తల్లీ! కొద్దిసేపు మండపంలో విశ్రమించండి. అమ్మవారికి అలంకరణలు చేసి ప్రత్యేకమైన పూజలు చేస్తాము" వడివడిగా దగ్గరికి వచ్చి వినయంగా మనవి చేసుకున్నాడు ప్రధాన అర్చకుడు.

"మా కోసం అమ్మవారికి ప్రత్యేకమైన అలంకరణలు చేయాల్సిన అవసరం లేదు. వెంటనే పూజ మొదలుపెట్టండి" అంటూ తన చెలికత్తెల దగ్గర వున్న పూజ సామాన్లని అతనికి ఇప్పించింది ఆమె.

పరుగు పరుగున గర్భగుడిలోకి పోయి తానే స్వయంగా పూజ మొదలుపెట్టాడు ప్రధాన అర్చకుడు.

"తల్లీ! మీకు తెలియంది కాదు. కనులు మూసుకుని మీ కోరికను మనసులోనే అంబకు మనవి చేసుకోండి... వెంటనే నెరవేరుతుంది" అన్నాడు గర్భగుడి వెలుపలే నిలబడిపోయిన అర్చకుల్లో ఒకతను.

"నా కోరిక ఏమిటో తల్లికి బాగా తెలుసు. నేను వచ్చింది వేరే పనిమీద. పూజ చేయించి కోరికలు కోరుకోవటానికి కాదు" అన్నది చారులతాదేవి.

పెద్దకంఠంతో మంత్రాలను సాగదీసి సాగదీసి చదువుతున్న తమ ప్రధాన అర్చకుడి వంక, ఆమెవంకా మార్చి మార్చి ఆశ్చర్యంగా చూశాడు ఆ అర్చకుడు.

"ఈ ఆలయాన్ని ఆశ్రయించుకుని ఎవరో సోది చెప్పేవాళ్ళు బతుకు తున్నారట కదా... ఎవరు వాళ్ళు?" ఆలయంలోని విగ్రహానికి నమస్కరిస్తూనే అర్చకుడిని అడిగింది చారులతాదేవి.

"ఓ... ఎరుకలసాని బసివి గురించా? ఆలయం వెనుక భాగంలో వున్న మండపంలోనే కూర్చుని వుంటుంది. పూజ పూర్తి అయిన తర్వాత వెళ్ళి కలుసుకోవచ్చు" అంటున్న ఆ అర్చకుడి వంక తీవ్రంగా చూశారు అతని సహచరులు.

"మండలాధిపతుల వారి సతీమణి స్వయంగా ఆలయం దగ్గరికి రావడమే చాలా గొప్ప విషయం. బసివిని వచ్చి దర్శనం చేసుకోమని చెప్పాలి. బసివి దగ్గరికి తల్లిగారు వెళ్ళటం ఏమిటి?" కోపంగా అడిగారు.

"అవసరం నాది.. మీరు అనవసరంగా కంగారుపడకండి. నేనే వెళ్ళి మాట్లాడతాను" అంటూ వారి ప్రసంగాన్ని అడ్డుకున్నది చారులతాదేవి.

పూజను పూర్తిచేసి హారతి పళ్ళెరంతో గర్భగుడిలో నుంచి బయటికి వచ్చిన ప్రధాన అర్చకులకు, హారతి పళ్ళెరానికి నమస్కరించి, గుడిలోనుంచి బయటికి వచ్చిందామె.

తనను గురించి అర్చకులు మాట్లాడిన మాటలు తనకు తెలిసిపోయినట్లు తనంతట తానే ఆమెకు ఎదురువచ్చింది బసివి.

"మండలాధిపతుల వారి సతీమణి నిన్ను కలుసుకోవటం కోసమే వస్తున్నారు" అంటూ చెప్పబోయాడు చారులతాదేవి వెనుకే వస్తున్న అర్చక స్వాముల్లో ఒకతను.

"పేదలన్నా, నిరుపేదలన్నా తల్లీతండ్రీ లేని అనాథలన్నా తన కడుపులో వున్నది తీసి చేతుల్లో పెట్టే చల్లని తల్లి. తాను ఎందుకు వచ్చిందో నాకు తెలియకుండా ఎందుకు వుంటుంది?" కోరగా సమాధానం ఇచ్చింది బసివి ఆ అర్చకుడికి.

"బసివీ! నీతో మాట్లాడాలి..." అంటూ మొదలుపెట్టబోయిన చారులతా దేవిని చిరునవ్వుతో చేయెత్తి ఆపేసింది.

"కారణం లేకుండా మబ్బులు కమ్మవు తల్లీ... కమ్మిన మబ్బులు మనకి కావల్సిన చోటులో కురియవు. జరిగేవన్నీ మంచికే. బెంగ నీకు అనవసరం తల్లీ... త్వరలోనే నీకు కావల్సిన మాట నీ చెవిన పడుతుంది. అప్పటిదాకా కష్టమైనా నష్టమైనా ఓర్పుగా వుండాల్సిందే" అన్నది.

"అదికాదు బసివీ... మా దగ్గర పెరిగి పెద్దవాడవుతున్న..." అని మళ్ళీ రెట్టించి అడగబోయింది చారులతాదేవి.

"శివయ్య... బొజ్జగణపతి లాంటి శివయ్య... వస్తాడు తల్లీ... తప్పకుండా వస్తాడు... కలత వద్దు" అని చెప్పి గిరుక్కున వెనుతిరిగి తాను కూర్చునే మండపం దగ్గరికి వెళ్ళిపోయింది బసివి.

"ఏదో అడిగినదానికి అనుకూలంగా రెండు మూడు మంచిమాటలు చెపుతూ వుంటుందనీ, వచ్చినవారికి మనశ్శాంతిని కలిగిస్తుందనీ తనని ఈ ఆలయంలో తిరుగనిస్తున్నాము... తమరిని అవమానిస్తుందని అనుకోలేదు. భటులకు చెప్పి బయటికి పంపించివేయమని ఆజ్ఞ ఇవ్వండి తల్లీ..." కోపంగా అన్నాడు ఒక అర్చకుడు.

కనుబొమ్మలు ముడిచి తీవ్రంగా ఒక చూపు చూసింది చారులతాదేవి.

నోటిని వెంటనే అదుముకుని తలవంచుకున్నాడు అర్చకస్వామి. "బసివికి మూడువారాల స్వయంపాకం వెంటనే ఇచ్చిరండి... కొత్తచీరె కూడా పట్టుకు వెళ్ళండి" తన చెలికత్తెలకు చెప్పింది ఆమె.

"అటువంటి ఆజ్ఞ ఇవ్వబడుతుందని ముందుగానే ఊహించి అందుకు తగిన ఏర్పాట్లతో వచ్చారు ఆమె చెలికత్తెలు. ఆమె చెప్పినవన్నీ తీసుకుని బసివి దగ్గరికి వెళ్ళింది ఒక చెలికత్తె.

పూజలు చేయించినందుకు తమను ఆశీర్వదించినందుకు దక్షిణ క్రింద పది వెండి నాణేల చొప్పున అర్చక స్వాములందరికీ ఇప్పించి, ఆలయం ఎదుట సిద్ధంగా వున్న తమ అశ్వశకటంలో కూర్చున్నది చారులతాదేవి.

❖ ❖ ❖

"తన పరిపాలనలో వున్న మండలాలన్నింటిలోను సంపంగి మండలం అంటే మహాప్రేమ జ్వలిత చక్రవర్తికి. అందుకు కారణం ఏమిటో మీకు తెలుసా?" చితుకుల మంటమీద పెట్టిన కుందేళ్ళు సరిగా కాలుతున్నాయో లేదో పరిశీలించి చూస్తూ చేతులు కట్టుకొని వున్న దృఢకాయుల్ని అడిగాడు ఒక అగంతకుడు.

"తన చెల్లెల్ని ఈ మండలాధిపతికి ఇచ్చి వివాహం చేశాడు. అందుకే అమితమైన అభిమానం" తడుముకోకుండా చెప్పాడు దృఢకాయుల నాయకుడు.

కంటికి కనిపించనంత వేగంతో లేచి నిలుచున్నాడు ప్రశ్నించిన అగంతకుడు. చేతిని జాచి బలంగా కొట్టాడు అతని చెంపమీద.

బిగ్గరగా అరవబోయి, అరిస్తే మరో దెబ్బపడుతుందన్న భయంతో పక్కకు వంగి, వెంటనే సర్దుకున్నాడు దృఢకాయుల నాయకుడు. "ఎందుకు కొట్టారు? నాకు తెలిసినమాట చెప్పాను. అంతే" చెంపను తడుముకుంటూ దీనంగా అన్నాడు.

"జ్వలిత సామ్రాజ్యంలో వున్న మండలాల్లో కంటే ఈ సంపంగి మండలం లోనే గజదళం హెచ్చుగా వుంటుంది.ఏదైనా యుద్ధం అంటూ వస్తే ఈ గజాలన్నిటినీ తీసుకుని చక్రవర్తికి సాయంగా వెళతాడు మండలాధిపతి సాగరుడు" తాను వినదలుచుకున్న సమాధానాన్ని తానే చెప్పాడు ఆ అగంతకుడు.

లావుపాటి మొదలు కలిగివున్న ఒక చెట్టుచాటున నిలబడి శ్రద్ధగా ఆ మాటల్ని వింటున్న శివుడి ఒళ్ళు ఝల్లుమన్నది ఒక్కసారిగా. నరరూప రాక్షసుల వంటి ఆ దృఢకాయులు అలా బెదురు బెదురుగా నిలుచుని వున్నారంటే... వారిని ప్రశ్నలు వేస్తున్న ఆగంతకులు వారికంటే గొప్పవాళ్ళయి వుంటారు.

వాళ్ళు ఎవరో, ఎక్కడినుంచి వచ్చారో, ఎందుకు అటువంటి మాటలు మాట్లాడుతున్నారో ఎలా తెలుస్తుంది తనకి?

శివుడి మనసులోని సందేహాలకు సమాధానం లభించకముందే వున్నట్టుండి వేరే మలుపు తిరిగింది చితుకులమంట దగ్గర సంభాషణ.

"సాగరుడి దగ్గర వున్న ఏనుగులన్నింటినీ సంహరించగలిగితే అతను చక్రవర్తికి సహాయం చేయలేడు. అవునా కాదా?" అడుగుతున్నాడు దృఢకాయుల నాయకుడిని కొట్టిన ఆగంతకుడు.

అసలే భయంతో వణికిపోతున్న దృఢకాయుల వదనాలు మరింత తెల్లగా పాలిపోయాయి శరీరాల్లోని రక్తమంతా హరించుకుపోయినట్లు.

"అయ్యో... ఏదో పొట్టకూటికోసం అడవిలో వుండే ఏనుగుల్ని పట్టుకొని వాటి దంతాలను సేకరించటమే వృత్తిగా పెట్టుకున్నాము. సైన్యాలు, యుద్ధాలు, చంపటాలు నరకటాలు మాకు చేతకావు" దీనంగా అన్నాడు వారి నాయకుడు.

"ఆ పనులు చేయటం మాకు చేతొచ్చు. జ్వలిత సామ్రాజ్యం మీద యుద్ధం ప్రకటించటమే మా చక్రవర్తి శిఖావంతుడి ఆశయం. అందుకు ముందుగా ఈ సంపంగి నగరంలోని గజదళాన్ని నాశనం చేయాలి..."

చితుకుల మంటమీది కుందేళ్ళలో ఒకదాన్ని ఇవతలికి తీసి, తన దగ్గర వున్న చిన్నబాకుతో చిన్న చిన్న ముక్కలుగా కోస్తూ చెప్పాడు ఆ ఆగంతకుడు.

శిఖావంతుడనే పేరు చెవుల బడేసరికి చలిగాలి వీచినట్లు జలదరించింది చెట్టుచాటున వున్న శివుడి శరీరం.

జ్వలిత సామ్రాజ్యానికి, శిఖావంతుడి సామ్రాజ్యానికి మొదటినించీ సఖ్యత లేదు. ఏ మాత్రం అవకాశం దొరికినా ఒకరినొకరు జయించటానికే ప్రయత్నాలు చేస్తూ వుంటారు.

ఆ ఆగంతకుడు చెపుతున్నట్లు శిఖావంతుడు తెగించి యుద్ధానికి రాకపోవటానికి కారణం... సంపంగి నగరానికి వున్న గజబలమే... ఏనుగుల్ని నడపటంలోను, వాటితో యుద్ధం చేయించటంలోను సాగరుల వారు మహా మేధావి.

యుద్ధరంగంలో నిలువబడి ఆయన గట్టిగా ఒక ఆజ్ఞ ఇస్తే చాలు, కదం తొక్కుతూ కదిలి, శత్రువుల మీద కలబడతాయి సంపంగి నగర గజ సైన్యంలోని ఏనుగులు. దొరికినవారిని దొరికినట్లు తొండాలతో విసిరికొట్టి, పాదాలతో మట్టగించి మట్టిలో కలిపేస్తాయి.

ఎన్నెన్నోమార్లు యుద్ధానికి వచ్చి, చావుతప్పి కన్ను లొట్టపోయినట్లు కుంటుకుంటూ వెనక్కి పారిపోయిన శిఖావంతుడికి ఇంతకాలం తరువాత వచ్చింది సరైన ఆలోచన.

నిజమే... సంపంగి నగర గజదళాన్ని మట్టుబెట్టగలిగితే జ్వలిత సామ్రాజ్యాన్ని తేలికగా చేజిక్కించుకోవచ్చు.

అప్పటికప్పుడు చెట్టుచాటునుంచి వెనక్కి జరిగి, అతివేగంగా నగరంకేసి బయలుదేరాలన్న కోరిక వెంటనే అడుగుపెట్టింది శివుడి హృదయంలోకి. నగరాన్ని చేరుకోగానే సూటిగా సాగరులవారి దగ్గరికి పోయి, ఈ శిఖావంతుడి అనుచరుల ఆగమనాన్ని గురించి, వారి ఆలోచనల గురించి పూసగుచ్చినట్లు వివరించి చెప్పాలని కూడా అనిపించింది.

తనకు తెలియకుండానే రెండు అడుగులు వెనక్కి జరిగాడు అతను. మూడో అడుగు అవతలికి వేయకముందే వచ్చింది ఆ అనుమానం... తనను ఎవరో చాటునుంచి పరిశీలనగా చూస్తున్నట్టు.

తల తిప్పి చుట్టూ చూశాడు... చెట్లచాటుగా పొదల మాటునా ఎవరైనా నక్కి వున్నారేమోనని శ్రద్ధగా పరికించాడు.

కుంకుడుచెట్టు క్రింద కూర్చుని వున్న ఆగంతకులు– వారికి ఎదురుగా చేతులు కట్టుకుని నిలబడి వున్న దృఢకాయులు తప్ప వేరెవరూ కనిపించలేదు అతనికి.

'నీడల్ని చూసి భయపడటం నాకు చాలా ఎక్కువైపోయింది. ఈ మధ్య ఎవరో ఒకరు వెంటపడి తరుముతూ వుండటం వల్ల అలా భ్రమ కలుగుతోంది. అంతకుమించి మరేమీలేదు' తనలో తను అనుకుంటూ సరిపెట్టుకున్నాడు.

అతను అక్కడ వున్నట్టు తెలియకపోవడం వల్ల ఎటువంటి సందేహాలు లేకుండా నిరభ్యంతరంగా మాట్లాడుకుంటూనే వున్నారు ఎదుట వున్న వారందరూ.

"ఇప్పుడు ప్రయాణం అయితే రేపు ఉదయానికల్లా మీరు నగర ద్వారాల దగ్గరికి వెళ్ళిపోతారు. శ్రావస్తి నగరం నుంచి కనకయ్య శ్రేష్ఠి పంపగా వచ్చినట్లు భటులకు చెప్పండి. మీ శ్రేష్ఠి ఈ నగరంలో పట్టుబట్టల దుకాణం ఒకటి ప్రారంభించనున్నట్టు, అందుకు అనువైన స్థలాన్ని ఎంపిక చేయటం కోసం మిమ్మల్ని పంపించినట్లు వివరించండి. కనకయ్య శ్రేష్ఠి పేరువింటే, ఇంక మీ గురించి వాళ్ళు పట్టించుకోరు..." అంటూ కుంకుడు చెట్టు మొదట్లో పడవేసి వుంచిన ఒక చిన్న మూటలోనుంచి, జానెడు పొడుగున్న వెదురుగొట్టాన్ని తీసి దృఢకాయులకు చూపించాడు ఆగంతకుల నాయకుడు.

ఎర్రటి లక్కతో రెండు పక్కలా గాలికూడా చొరబడలేనంత గట్టిగా మూసి వుంది ఆ వెదురుగొట్టం.

సాగరుల వారి ఆస్థాన వైద్యుడు విరూపాక్షుడి దగ్గర అంతకుముందు అనేకమార్లు చూసి వున్నాడు శివుడు అటువంటి వెదురు గొట్టాలను.

"చేతులతో ముట్టుకోకూడని విష పాషాణ మూలికల్ని నిలువ చేయటానికి ఉపయోగపడతాయి ఈ గొట్టాలు" సాగరుల వారి దగ్గర పెరుగుతున్న అనాథ బాలురలో ఒకతను తీవ్రమైన జ్వరంతో బాధపడుతున్నప్పుడు వైద్యం చేయటానికి వచ్చి తన మూలికల మూటల్ని, మందుల పెట్టెని కుతూహలంగా చూస్తున్న శివుడికి చెప్పాడాయన ఒకసారి.

బాగా గుర్తుండిపోయిందా మాట శివుడికి. ఇప్పుడు ఆగంతకుల నాయకుడు మూటలో నుంచి బయటికి తీసేసరికి వెంటనే గుర్తుకు వచ్చింది.

"ఒక్క చుక్క... ఈ గొట్టంలో వున్న ద్రవంలోనుంచి ఒక్క చుక్కని మీరు ఏనుగులు ఆరగించే ఆహారంలో కలిపినా, లేక అవి త్రాగేనీటిలోకి వదిలినా, మరునిముషంలో కళ్ళు తేలవేసి కాటికి ప్రయాణం కడతాయి కనీసం పది. గొట్టంలో వున్న ద్రవాన్ని మొత్తం కలిపితే చిటికెలో చచ్చిపోతాయి గజశాలలో వున్న ఏనుగులన్నీ" కనులు పెద్దవిచేసి చూస్తున్న దృఢకాయుల నాయకుడికి చెపుతున్నాడు ఆగంతకుల నాయకుడు.

"ఉట్టి పుణ్యానికి మీరు ఈ పని చేయవలసిన అవసరంలేదు. మీ కష్టానికి తగిన ప్రతిఫలం ఇస్తాము" అంటూ ఏ మూటలో నుంచి వెదురు గొట్టాన్ని బయటికి తీశాడో, అదే మూటలో నుంచి బరువైన నాణేల మూటని కూడా ఒకదాన్ని తీసి ముందుకు విసిరాడు.

ఖంగుమని శబ్దం చేసిందా మూట నేలమీద పడి... అందులో వున్నవన్నీ బంగారు నాణేలని వెంటనే తెలిసిపోయింది శివుడికి.

భయం భయంగా చూస్తూ నిలబడి వున్న దృఢకాయుల మొఖాల్లో వెంటనే ప్రత్యక్షం అయింది సంతోషం.

"చావుకి భయపడకుండా అడవుల వెంట పడి ఏనుగుల్ని వెతికే పనిలో ఏనాడూ ఇంత ధనాన్ని మేము సంపాదించలేదు. మీరు చెప్పినట్టే తప్పకుండా చేస్తాము. నగరంలోకి పోయి వీలుదొరికిన వెంటనే గజశాలమీద దాడి చేస్తాము" గబుక్కున ముందుకు వంగి, నాణేల మూటని తీసుకుంటూ ఆనందంగా చెప్పాడు వారి నాయకుడు.

సుప్రసన్నంగా మారిపోయింది ఆగంతకుడి వదనం. “మేము ఈ అడవి సరిహద్దుల్లోనే మీకోసం వేచి చూస్తూ వుంటాము. మీరు పని పూర్తిచేసిన వెంటనే మా ప్రభువులకు చెప్పి మరిన్ని బహుమతులు ఇప్పిస్తాము. ధైర్యంగా వెళ్ళి, విజయం సాధించుకు రండి” అన్నాడు.

అతను విసిరిన నాణేల మూటని, వెదురుగొట్టాన్ని దుస్తుల్లో భద్రపరచుకుని, అప్పటికప్పుడు నగరంకేసి బయలుదేరవలసిన దృఢకాయులు, ఆ పని చేయకపోగా నిలబడిన ప్రదేశంలోనే నేలమీద చతికిలబడ్డారు.

వాళ్ళు ప్రయాణం ప్రారంభించిన వెంటనే, తనుకూడా వారివెనుకే అడుగు వేయవచ్చని ఆశపడిన శివుడికి వెంటనే కలిగింది నిరాశ.

“ఎప్పుడో నిన్ననగా ఆరగించిన ఆహారం. రాత్రంతా నడుస్తూనే వుండడం వల్ల నిద్రలేదు. నీరసం ముంచుకు వస్తోంది. కొద్దిగా ఆహారం తీసుకుని ఒక ఘడియపాటు విశ్రమించిన తర్వాత ప్రయాణం అవుతాము” ఆగంతకుల నాయకుడికి చెప్పాడు దృఢకాయుల నాయకుడు.

రెండో ఆలోచన లేకుండా తాము మంటలమీద కాలుస్తున్న కుందేళ్ళన్నిటినీ వారిముందు పెట్టమని తనవారికి సూచించాడు ఆగంతకుల నాయకుడు.

“మరోసారి పొదల్లోకి పోయి మరికొన్ని జీవాలను వేటాడి తీసుకురండి మనకోసం” అని కూడా అన్నాడు.

ఆలస్యం చేస్తే తాను అక్కడ దాగుకుని వున్నట్టు వారికి తెలిసిపోతుందని అర్థమై, వేగంగా వెనక్కి కదిలాడు శివుడు. పది అడుగులు వెనక్కి జరిగి, అడ్డం వచ్చిన ఒక పొదమీదినుంచి అమాంతం అవతలికి దూకాడు.

దూకుతూ వుండగానే కనిపించింది అతనికి ఒక ఆకారం. ఒక పెద్ద బండరాయి దగ్గర నిలబడి అతనివంకే చూస్తోంది. అతను అంత వేగంగా వెనక్కి వస్తాడని ఊహించలేదు కాబోలు... కాస్తంత నెమ్మదిగా కదిలింది.

“ఎవరు? ఎవరు నువ్వు? ఏం చేస్తున్నావ్ ఇక్కడ?” పెద్దగా ప్రశ్నించబోయి తన కంఠం వెనుక వున్న వారికి వినబడుతుందన్న భయంతో ఆ మాటల్ని తనలోనే అదిమేసుకున్నాడు శివుడు.

పొదమీదినించి అవతలి పక్కకు దూకుతుండగా కనిపించింది ఆ ఆకారం... అవతలి పక్కన నేలను తాకి నిటారుగా నిలబడే సమయానికి మటుమాయం అయిపోయింది.

"నిన్న ఆ దృఢకాయులు ఇవాళ ఈ ఆగంతకులు. ఇప్పుడు ఈ ఆకారం... నిమిష నిముషానికి అధికం అయిపోతోంది గందరగోళం. వీళ్ళందరూ ఎవరో ఎందుకు ఒకేసారి నగరంమీద కక్ష కట్టారో ఏమిటో" తనలో తను అనుకుంటూ ముందుకు నడిచి, అంతకుముందే కనిపించిన ఆకారం, ఏ బండచాటుకు తప్పుకున్నదో అదే బండ దగ్గర తల దాచుకున్నాడు అతను.

❖ ❖ ❖

ఆరు మూరల పొడవున్న బరిశెను బిగించి పట్టుకుని నగరానికి ఆనుకుని వుండే పూతోట దగ్గర కాపలా కాస్తున్నాడు ఒక భటుడు.

జ్వలిత సామ్రాజ్యానికి రాజధాని నగరమైన జయంతిపురానికి, కొంచెం దూరంలో వుంటాయి ఎర్రటికొండ గుట్టలు. వాటికి ఆవల వున్న ప్రదేశమంతా జ్వలిత రాజ్యానికి పరమశత్రువైన శిఖావంతుడి పరిపాలనలో వుంటుంది.

వీలు చిక్కినప్పుడల్లా కొండగుట్టల్ని దాటి జ్వలిత రాజ్యంలోని గ్రామాల మీద దాడులు చేయటం, చేతులకు అందిన ధన ధాన్యాదుల్ని తీసుకుని గుట్టల్లోకి పారిపోవటం శిఖావంతుడి సైన్యానికి బాగా అలవాటు.

బరిశెను పట్టుకుని నిలబడిన భటుడి కళ్ళకు చాలా స్పష్టంగా కనిపిస్తూ వుంటుంది ఆ గుట్టల మధ్యలో సహజసిద్ధంగా ఏర్పడి వున్న ఒక రహదారి, దానివంకే చూస్తూ వుండటం, తమ రాజ్యానికి సంబంధించని వారెవరైనా ఆ దారిలో కనిపిస్తే వెంటనే చక్రవర్తికి సమాచారం అందించటం ఆ భటుడి బాధ్యత.

ఉదయం వేళలో వచ్చి సూర్యుడు పడమటి దిశకు మరలే సమయం వరకు నిలబడి వుంటాడతను అక్కడ. ఆ తరువాత మరో భటుడు వస్తాడు. అతని తర్వాత మరొకరు.

ఆరోజు సూర్యుడు రెండు బారల దూరం ఆకాశంలో ప్రయాణిస్తున్న సమయంలో రాతిస్తంభం మాదిరిగా నిలబడి వున్న భటుడి చెవులకు వినబడింది ఒక విచిత్రమైన మోత.

మనిషి చేస్తున్న చప్పుడు కాదు అది. పశు పక్ష్యాదుల వల్ల కూడా ఉత్పన్నమైంది అంతకన్నా కాదు.

వెయ్యి తేనెటీగలు ఒకేసారి తమ పట్టులో నుంచి బయటికి వచ్చి గుంపుగా ప్రయాణం మొదలుపెట్టినట్టు వస్తోంది గంభీరమైన ఒక ఝుంకారం.

గుట్టల్లో కనిపించే కారు తేనెటీగల గుంపు ఏదో పూతోట దగ్గరికి వస్తున్నట్టు అనిపించింది అతనికి. వెంటనే సురక్షితమైన ప్రదేశంలోకి వెళ్ళి తలను దాచుకోకపోతే అవి తనను చుట్టుముట్టి ప్రాణాలు తీసివేస్తాయని కూడా అనిపించింది.

చేతుల్లో వున్న బరిశెను దగ్గర్లో వున్న ఒక బండరాయిదగ్గర వుంచి, తలకు చుట్టుకుని వున్న తలపాగను ఊడతీసి, ముసుగులా మొఖంమీద కప్పుకుంటూ దూరంలో వున్న ఒక  చెట్టు దగ్గరికి పరిగెత్తబోయాడు అతను.

పరుగు మొదలుపెడుతూ వుండగానే, కనుచివరల నుంచి అతనికి కనిపించింది నిమ్మఫలమంత పరిమాణంలో వున్న ఒక మట్టి వుండ. ఊహించటానికి వీలు కానంత వేగంతో వచ్చి ఠప్పున అతని గుండెలకు తగిలిందది.

పిడికిలి బిగించి బలమైన వ్యక్తి ఎవరో తన గుండెలమీద మోదినట్లు విపరీతమైన బాధతో విలవిలలాడిపోయాడు అతను. మొదలు నరికిన చెట్టు మాదిరి విరుచుకు పడిపోయాడు. తల నేలకు పొదుచుకు పోవటంతో కళ్ళముందు ప్రత్యక్షం అయ్యాయి రంగు రంగుల నక్షత్రాలు. అతనికి తెలియకుండానే తప్పిపోయింది స్పృహ... తల వ్రేలాడబడిపోయింది.

ఆ సంగతి తనకు బాగా తెలిసినట్లు అతివేగంగా పరిగెత్తుకు వచ్చింది అక్కడికి జ్వలిత సామ్రాజ్యానికి చక్రవర్తి అయిన మహాబలుడి ఏకైక కుమార్తె జ్వాల.

సన్నపాటి చర్మపు తాళ్ళతో అల్లబడిన వడిశెల ఒకటి వున్నది ఆమె చేతుల్లో.

“వడిశెలలో రాయిని కట్టి వేగంగా తిప్పితే తేనెటీగల గుంపు ఆహారానికి బయలుదేరినట్లుగా శబ్దం వస్తుందని తెలియని ఇటువంటి తెలివితక్కువవారిని మా తండ్రిగారు సైన్యంలోకి ఎందుకు చేర్చుకుంటారో నాకు అర్థం కావటంలేదు” తెలివితప్పి పడిపోయిన భటుడికేసి చూస్తూ అన్నదామె.

ఆమె వెనుకే వచ్చారు నలుగురు స్నేహితురాళ్ళు. “పాపం, దెబ్బ చాలా బలంగా తగిలినట్లు కనిపిస్తోంది. వెంటనే ఏదో ఒకటి చేయకపోతే చాలా ప్రమాదంగా మారవచ్చు” భయం భయంగా చూస్తూ అన్నది వారిలో ఒకామె.

“గుండెలకు గురి చూడలేదు. జానెడు పక్కగా తగిలేటట్లు విసిరాను. నెప్పి ఎక్కువగా వుంటుంది గాని ప్రాణాలకు వచ్చే ప్రమాదం ఏదీ వుండదు”

అంటూ ముందుకు వంగి, భటుడి చేతుల్లోనించి జారి కిందపడిన తలపాగాని తీసుకున్నది జ్వాల.

"శత్రువుల రాకను ముందుగానే పసికట్టేందుకు ఎటువంటి వీరుల్ని కాపలాగా నిలబెడుతున్నారో మా తండ్రిగారికి తెలియాలి. ఇప్పుడు నేను చేసిన ఈ పనిని గురించి మీరు ఎవరికీ చెప్పకండి... చెపితే నేను ఏం చేస్తానో మీకు తెలుసుకదా!" అన్నది స్నేహితురాళ్ళతో.

భయంగా చూస్తూనే తలలు వూపారు వాళ్ళు. కోపం రానంతవరకూ మహా మంచిది ఆమె. కోపం వస్తే మటుకు రాక్షసిగా మారిపోతుంది. తాను ఎల్లప్పుడు దగ్గర వుంచుకునే ఆ వడిశెలను గిరగిరా తిప్పి రాళ్ళవర్షం కురిపిస్తుంది.

"చెమట కంపు కొట్టే ఆ తలపాగాని తీసుకోవటం దేనికి?" వున్నట్లుండి అడిగింది ఒక స్నేహితురాలు.

"తలపాగా లేకుండా సైనికులు ఎవరూ తమ విధుల్లోకి రాకూడదు. దళపతులు గనుక ఇప్పుడు ఇతన్ని చూడటం జరిగితే, రకరకాల ప్రశ్నలు వేస్తారు. ఇతను చేసిన తప్పు యేమిటో కనిపెట్టేస్తారు" వచ్చిన దారినే వెనక్కి నడుస్తూ చెప్పింది జ్వాల.

"ఏం తప్పు చేశాడు? శిలావిగ్రహం మాదిరిగా నిలుచునే వున్నాడు కదా... బండల దగ్గర కూర్చుని నిద్రపోవటం లేదు కదా..." అన్నది వెంటనే మరో స్నేహితురాలు.

"నిలబడి వుంటే సరిపోతుందా? చుట్టూ ఏం జరుగుతుందో గమనించు కోవాల్సిన అవసరం లేదా? పావుఘడియ పాటు దగ్గర్లోనే నిలబడి వున్న మనల్ని ఇతను గమనించలేదు. రేపు శత్రువులెవరయినా వచ్చినా కూడా ఇలాగే మొద్దుమాదిరి దిక్కులు చూస్తూ వుంటాడు" కోపంగా చెప్పింది జ్వాల.

"నీ పిచ్చిగాని, ఇటువంటి విషయాలన్నీ చూసుకోవటానికి మంత్రులు వున్నారు. దళపతులు వున్నారు. వారెవరికీ లేని బాధ నీకు ఒక్కదానికే ఎందుకు?" ధైర్యం చేసి కసిగా అడిగింది మరో స్నేహితురాలు.

"మా తండ్రిగారి తర్వాత ఈ సామ్రాజ్యానికి కాబోయే మహారాణిని నేనే. నా రాజ్యం మంచి చెడులు చూసుకోవాల్సిన బాధ్యత నాకు వుంది. ఇంక మీరెవరూ మాట్లాడకండి" అంటూ పూతోటలోకి దారితీసింది జ్వాల.

ఆపైన మరొక్కమాట కూడా మాట్లాడకుండా ఆమెను అనుసరించారు ఆ స్నేహితురాళ్ళు.

❖ ❖ ❖

అడుగులో అడుగు వేస్తూ చిన్నపాటి శబ్దం కూడా చేయకుండా పొదల మధ్యకు వచ్చారు నలుగురు ఆగంతకులు. ఇద్దరి దగ్గర పదునైన బాకులు, కత్తులు వున్నాయి. వంద అడుగుల దూరంలో నిలుచుని వున్న జంతువుని సైతం చటుక్కున పడగొట్టగల విల్లంబులు వున్నాయి మిగిలిన ఇద్దరి దగ్గరా.

తను నిలబడి వున్న బండ దగ్గిర్నించి కదిలితే వారికి తెలిసిపోతుందన్న భయంతో ఎలా వున్నవాడు అలాగే విగ్రహం మాదిరి బిగుసుకుపోయాడు శివుడు.

సరిగ్గా ఆ బండకు పది అడుగుల దూరంలో నిలబడి కనులు చిట్లించాడు ఒక ఆగంతకుడు.

"ఏమిటిరా? ఏదైనా కనిపించిందా?" అతిచిన్నగా అడిగాడు అతని సహచరుల్లో ఒకతను.

"కనిపించడం కాదు... చెమట వాసన వస్తోంది. ఎవరో ఈ ప్రదేశంలో నిలబడినట్లు అనిపిస్తోంది" కనులు చిట్లించటాన్ని ఆపి, గాలిని వాసన చూస్తూ అన్నాడు ఆగంతకుడు.

ఎండుకు పోయినట్లు అయింది శివుడి గొంతు. అడవి పొదల్లో పడి అదేపనిగా చక్కర్లు కొట్టటం వలన తన శరీరమంతా మలినపడి, నిజంగానే చెమట వాసన వేస్తోంది.

వేటాడటంలో చాలా నిపుణులు కాబోలు వాళ్ళు. చిటికెలో కనిపెట్టేశారు. ఇప్పుడు ఏం చేస్తే వాళ్ళకి కనిపించకుండా తప్పించుకోగలడు??

చాలా తీవ్రంగా ఆలోచించాడు శివుడు. ఎంత ఆలోచించినా సరైన మార్గం కనిపించకపోవటంతో వాళ్ళని ఏదో ఒక విధంగా మభ్యపెట్టి కాళ్ళకు బుద్ధి చెప్పటమే మంచిదనే నిర్ణయానికి వచ్చాడు. నిశ్శబ్దంగా కిందికి వంగి, పాదాల దగ్గర కనిపించిన రెండు లావుపాటి పలుకురాళ్ళని చేతుల్లోకి తీసుకున్నాడు.

ఆ రాళ్ళను విల్లంబులు పట్టుకున్న వారిమీదికి విసిరి, వాళ్ళు ఆశ్చర్య పడుతున్న సమయంలో పాదాలకు బుద్ధి చెప్పాలని అతని ఆలోచన. అయితే

అది కార్యరూపంలోకి మారకముందే... నలభై అడుగుల దూరంలో వున్న పొదలమధ్యలో నుంచి చిన్నగా కిక్కరిస్తూ ఇవతలికి వచ్చింది ఒక ఆడ నెమలి.

వంటరిగా రాలేదది. అంతకుముందే నాలుగైదు రోజుల క్రితం గుడ్లని పొదిగి పిల్లల్ని చేసినట్లుంది. తడబడుతున్న అడుగులతో నడిచే నాలుగు పిల్లల్ని వెంటబెట్టుకుని మరీ వచ్చింది.

నేలమీది ఎండుటాకుల్ని ముక్కుతో విదిలించి, వాటిక్రింద దాగుకుని వుండే పురుగుల్ని ఎలా పట్టుకోవాలో ఆ పిల్లలకు నేర్పుతోంది అది.

తను ఎంతటి ప్రమాద పరిస్థితిలో చిక్కుకుని వున్నాడో తెలిసికూడా ఆ ఆడపక్షి వంక ఆర్తిగా చూడకుండా వుండలేకపోయాడు శివుడు.

"కొట్టండి... వెంటనే పడగొట్టండి..." వినవచ్చింది అతనికి ఆగంతకుల్లో ఒకతను విల్లంబులు పట్టుకున్నవారికి చేసిన హెచ్చరిక.

తను ఏం చేస్తున్నాడో తనకే తెలియనంత కోపం వెంటనే ఆవరించుకున్నది శివుడిని. వెనుకా ముందు ఆలోచించుకోకుండా గిరుక్కున పక్కకు తిరిగి, బలంగా విసిరాడు తను పట్టుకున్న రాళ్ళల్లో ఒకదాన్ని.

గింగిరాలు తిరుగుతూ పోయి విల్లంబులు పట్టుకున్నవారిలో ఒకతని నుదుటికి తగిలిందది. రెండో రాయిని కూడా బలంగా విసిరి, ఒక్కగంతులో వారికి ఎదురుపోయాడు.

నరమానవుడు ఎవరూ కనిపించడని అనుకునే ఆ నట్టడివిలో అనుకోని విధంగా ప్రత్యక్షం అయిన అతన్ని చూసి, విపరీతమైన ఆశ్చర్యానికి గురి అయ్యారు మిగిలిన ఆగంతకులు.

వారు ఆ ఆశ్చర్యాన్నించి తేరుకోకముందే రాక్షసుడి మాదిరి వారిమీదికి ఎగబడి పిడికిళ్ళతో ఇద్దరి గుండెలమీద బలంగా మోదాడు శివుడు.

అప్పుడు... అలా వారి గుండెలమీద కొడుతున్నప్పుడు వదిలిపోయింది అతన్ని ఆవరించుకుని వున్న ఆగ్రహం.

మదించిన ఏనుగుల మాదిరి వున్నారు వాళ్ళు. పదునైన ఆయుధాలతో ఎదిరిస్తే తప్ప వారిని జయించటం కష్టం. తన అదృష్టం బాగుండబట్టి మొదటిసారిగా విసిరిన రాయిదెబ్బకు తల్లక్రిందులు అయిపోయాడు వారిలో ఒకతను.

రెండవ రాయి మాత్రం ఎటువంటి ప్రభావం చూపలేకపోయింది. దాని దెబ్బను చాలా తేలికగా తీసుకుని, పిశాచం మాదిరి చూస్తున్నాడు రెండో విలుకాడు. ఆలస్యం చేస్తే తన ప్రాణాలకు పెనుప్రమాదం తప్పదు.

అప్పటికప్పుడు వెనక్కి తిరిగి కుందేలు పిల్లలా వేగంగా పొదల్లోకి పారిపోవాలనే అనుకున్నాడు అతను. కాని, తాను అవతలికి పోయిన వెంటనే మళ్ళీ ఆ ఆడనెమలి వెనుక పడతారు వాళ్ళు. దాని పిల్లల్ని తల్లిలేని అనాధలుగా మార్చివేస్తారు.

పారిపోవాలనే మాటను వదిలేశాడు అతను. పళ్లు బిగించి పిడికిళ్ళను ప్రయోగించటాన్ని కొనసాగించాడు.

పళ్ళు పటపటమని కొరుకుతూ తన దగ్గర వున్న పదునైన ఆయుధాన్ని ఎత్తి అతని తలమీద మోదబోయాడు ఒక ఆగంతకుడు.

అది తగిలితే తన తల అప్పటికప్పుడు రెండుగా విచ్చిపోతుందని తెలుస్తూనే వున్నది శివుడికి. అయినా సరే అవతలికి పడలేదు అతని పాదాలు.

పదునైన ఆ ఆయుధం అతని తలను సమీపిస్తున్న ఆఖరి క్షణంలో ఎక్కడినించో రివ్వుమంటూ దూసుకు వచ్చిందొక పెద్ద బాణం. ఆ ఆయుధాన్ని పట్టుకున్న ఆగంతకుడి గుండెల్లో దిగబడింది.

అదిరిపడి వెర్రిగా చూస్తూ అప్పటికప్పుడు వెల్లకిల్లా పడిపోయాడు ఆ వ్యక్తి. అది చూసి ఆవలికి దూకబోయిన మిగిలిన ఇద్దరి గుండెలమీదికి దూసుకు వచ్చాయి మరో రెండు బాణాలు.

కన్ను మూసి కన్ను తెరిచేటంతలో జరిగిపోయింది అది. పిడికిళ్ళతో వారిని ఎదిరించే ప్రయత్నం చేస్తున్న శివుడు నిర్ఘాంతపడి నిలిచిపోయాడు.

ఎవరు? ఎవరా బాణాల్ని వదిలింది?

ఆ ప్రశ్నలు మనసులో మెదులుతూ వుండగానే, గుర్తుకు వచ్చింది అతనికి పిల్లలతో వచ్చిన ఆడ నెమలి.

ఆ గడబిడను గమనించి అది దూరంగా పారిపోయి వుంటుందనే అనుకుంటూ అది ఏ పొదలోనుంచి బయటికి వచ్చిందో ఆ పొదకేసి చూశాడు అతను.

చూసిన వెంటనే దారుణమైన బాధతో తల్లడిల్లిపోయింది అతని గుండె. అతను విసిరిన రెండో రాయిని తప్పించుకుంటూనే బాణాన్ని వదిలాడు కాబోలు రెండో విలుకాడు. అడ్డదిడ్డంగా పడిపోయి వుంది ఆ నెమలి.

ఆహారాన్ని సంపాదించుకోవటం ఎలాగో తమకు నేర్పుతున్న తమ తల్లి వున్నట్లుండి ఎందుకు పడిపోయిందో తెలియక బిత్తరచూపులు చూస్తూ నిలబడి వున్నాయి పిల్లలు.

జలజలా శివుడి బుగ్గలమీదికి వచ్చేశాయి కన్నీళ్ళు. 'ప్రయత్నం చేశాను. నిన్ను రక్షించే ప్రయత్నం మనస్ఫూర్తిగా చేశాను. కాని ప్రయోజనం లేకపోయింది' తనలో తాను అనుకుంటూ పది అంగల్లో పడిపోయిన నెమలి దగ్గరికి పోయాడు.

వేగంగా వచ్చి శరీరంలో దిగబడిన బాణం దెబ్బకు ఎప్పుడో ప్రాణాలు వదిలేసి వుంటుందని అనుకుంటున్న అతనికి ఒళ్ళు జలదరించింది ఒక్కసారిగా.

ప్రాణాలు కోల్పోలేదు అది... గుండెల్లో దిగబడవలసిన బాణం దాని రెక్కలోనుంచి దూసుకుపోయి నేలలో దిగబడి వుంది.

రెక్కను కదిలించటం చేతకాక అడ్డదిడ్డంగా పడివుంది అది. బాధ చాలా తీవ్రంగా వుంది కాబోలు... కళ్ళను గిరగిరా తిప్పుతోంది. పరిగెత్తుకుంటూ వచ్చిన శివుడిని చూసి శత్రువుగానే భావించి గిలగిలా కొట్టుకోవటం మొదలుపెట్టింది.

"వద్దు... నువ్వు కదలవద్దు. నీకు నేను అపకారం చెయ్యటానికి రాలేదు. రెక్కలో దిగబడిన బాణాన్ని లాగేస్తాను. బాధ తగ్గుతుంది. ఎత్తులకు ఎగిరే పక్షివి కాదు కాబట్టి ఇప్పటికిప్పుడు నీకు వచ్చిన నష్టం ఏమీ వుండదు... నీ పిల్లలు పెరిగి పెద్దవయ్యే లోపల నీ రెక్క బాగుపడిపోతుంది" మృదువుగా దానికి చెపుతూ నేలకు ఆనుకున్న దాని తలను ఆప్యాయంగా తడిమాడు శివుడు.

పది క్షణికాల పాటు అతన్నించి దూరంగా జరగటానికి ప్రయత్నం చేసిందా పక్షి. ఓపిక హరించుకుపోతూ వుండటం వల్ల కొంచెం, అతని మాటలు తన భయాన్ని ఉపశమింపచేస్తూ వుండటం వల్ల మరికొంచెం తన కదలికల్ని ఆపేసింది.

తనను చూడగానే పొదల్లోకి పరిగెత్తి దట్టమైన ఆకుల మధ్యనించి తొంగి తొంగి చూస్తున్న దాని పిల్లల వంక చిరునవ్వుతో చూశాడు శివుడు.

"పది నిమిషాలు ఆగండి... మీ తల్లి మీదగ్గరికి వచ్చేస్తుంది" అంటూ వున్నట్టుండి నెమలి రెక్కలో దిగబడిన బాణాన్ని మధ్యలోకి విరిచేసి రెక్కను ఇవతలికి లాగేశాడు.

ఎర్రటి రక్తం వెల్లువలా బయటికి వస్తూ వుండడంతో అరిచేత్తో అదిమి పట్టుకున్నాడు.

బాణం బాధనించి విముక్తి లభించగానే బాగా వున్న రెక్కను అల్లల్లాడించి అవతలికి పారిపోయే ప్రయత్నం చేయవలసిన ఆ పక్షి అటువంటి పని ఏదీ చేయలేదు. తలను పక్కకు తిప్పి అతనివంకే చూస్తూ కదలకుండా వుండి పోయింది.

"ఇటువంటి గాయాలకు ఒక బ్రహ్మాండమైన మందు వుంది. ఒకసారి నేను సువర్ణానది ఒడ్డున బండరాళ్ళమీద పడినప్పుడు నా మోకాళ్ళు దోక్కుపోయి నెత్తురు వరదలుగా కారింది. మా వైద్యశిఖామణి విరూపాక్షుల వారు అటుగా వస్తూ నన్ను చూసి, ఆ మందే ఉపయోగించారు. అది ఇక్కడే ఎక్కడో తప్పకుండా వుండి వుంటుంది" అంటూ లేచి ఆ చుట్టుపట్ల పది అంగల దూరంలో వున్న పొదల దగ్గర వెతికాడు.

రెండు నిమిషాలు కూడా గడవకముందే అతనికి కనిపించింది నేలకు జానెడు ఎత్తున ఎదిగి వున్న ఒక చిన్నమొక్క.

"ఇదే... ఈ మొక్క ఆకుల్నే తుంచి నా గాయాలమీద పసరును పిండారు" అంటూ ఆ మొక్క ఆకుల్ని చేతుల్లో నలిపి నెమలి రెక్కమీద పసరు పడేటట్లు పిండాడు.

బొటబొటా కారుతున్న రక్తం కాస్తా చేతులతో అదిమి పట్టుకున్నట్టు వెంటనే కారటం ఆగిపోయింది.

మరో రెండు నిమిషాలు ఓపికగా చూసి తల ఊపాడు శివుడు. "నీకు నయమైపోయింది. నీ పిల్లలతో వెళ్ళిపో... గాయం పూర్తిగా తగ్గేవరకూ ఎవరికంటా పడబోకు" అంటూ నెమలిని పైకి ఎత్తి దాని పిల్లలు దాగుకుని వున్న పొదకేసి నెట్టాడు.

దెబ్బతిన్న రెక్కను కొద్దిగా కిందికి జార్చి నెమ్మదిగా నడిచింది నెమలి. పొదలోకి పోయి మాయం అయిపోయింది.

నెత్తురుతో మలినమైన చేతుల్ని నేలమీద మట్టితో శుభ్రపరుచుకుంటూ వెనక్కి తిరిగి, వెల్లకిలా పడిపోయి వున్న ఆగంతకుల దగ్గరికి వచ్చాడు శివుడు.

గుండెల్లో బాణాలు దిగబడిన ముగ్గురూ ఎప్పుడో ప్రాణాలు వదిలేశారు. అతను విసిరిన పలుకురాయి దెబ్బకు కళ్ళు తేలవేసిన ఆగంతకుడు మాత్రం బరువుగా ఊపిరి పీలుస్తున్నాడు.

అత్యవసర సమయంలో బాణప్రయోగం చేసి తన ప్రాణాలు కాపాడింది ఎవరో ఎంత ఆలోచించినా అవగతం కాలేదు శివుడికి. అంత గొప్ప సహాయం చేసినవారు ఆ తరువాత తనకు కనిపించకపోవడం ఏమిటో కూడా తెలియలేదు.

బరువుగా ఊపిరి పీలుస్తున్న ఆగంతకుడు ఉన్నట్టుండి కదలటంతో ఉలిక్కిపడి తన ఆలోచనల్లో నుంచి బయటపడ్డాడు అతను.

“రండి... రండి... త్వరగా రండి... వచ్చి వెంటనే రక్షించండి” చెవులు చిల్లులు పడేటట్లు చాలా బిగ్గరిగా అరిచి, ఆ ప్రదేశానికి దూరంగా పరిగెత్తాడు.

❖ ❖ ❖

ఆగంతకుల నాయకుడు తమకు ఇచ్చిన కుందేళ్ళను హాయిగా ఆరగించి, కుంకుడు చెట్టుకు పది అంగల దూరంలో వత్తుగా పెరిగి వున్న పచ్చికమీద విశ్రాంతిగా పడుకొని వున్నారు దృఢకాయులు.

“పోటుగాళ్ళ మాదిరి పోయారు నలుగురు. ఏదో ఒక వేట తప్పకుండా కనపడే వుంటుంది. తీసుకురావటానికి ఇంత ఆలస్యం దేనికి?” ఆకలి అధికం అయిపోతున్నది కాబోలు అసహనంగా అంటున్నాడు ఆగంతకుల నాయకుడు.

అదే సమయంలో చెవులు చిల్లులు పడే శృతిలో వినవచ్చింది ఆ అరుపు. “రండి... రండి... రక్షించండి” అంటూ.

అదిరిపడి లేచి నిలబడ్డారు ఆగంతకులు అందరూ. వారే కాదు విశ్రాంతిగా పడుకుని వున్న దృఢకాయులు కూడా ఉలిక్కిపడి లేచి, ఒకరి మొఖాలు ఒకరు చూసుకున్నారు.

"అదే కంఠం... నగరం వెలుపల వున్న గ్రామం దగ్గర మా గురించి గ్రామస్థుల్ని హెచ్చరించిన కంఠమే. అదే..." ఆశ్చర్యంగా అన్నాడు దృఢకాయుల నాయకుడు.

"ఎవరి కంఠమో ఏమిటో తర్వాత తేల్చుకుందాం... ముందు ఆ అరుపుకు కారణం ఏమిటో తెలుసుకోవాలి. పదండి అందరూ..." అంటూ క్రింద పెట్టి వున్న తన ఆయుధాన్ని తీసుకుని పొదలలోకి పరుగు తీశాడు ఆగంతకుల నాయకుడు. అతన్ని అనుసరించారు అతని అనుచరులు. వారి వెనుకే పరిగెత్తారు దృఢకాయులు.

ఎంతోదూరం పోవాల్సిన అవసరం లేకుండానే కనిపించారు వారందరికీ విగతజీవులైన ఆగంతకులు. పలుగురాయి దెబ్బకు కళ్ళు తేలవేసిన మనిషి మాత్రం బరువుగా ఊపిరి పీలుస్తూ లేచి కూర్చోవటానికి ప్రయత్నిస్తున్నాడు.

"ఏమిటిరా ఇది? ఏమయింది మీకు? ఎవరు ఈ బాణాలతో కొట్టింది?" ప్రాణాలు కోల్పోయిన వారి శరీరాల్లో దిగబడిన బాణాల వంక ఆశ్చర్యంగా చూస్తూ అతన్ని అడిగాడు అగంతకుల నాయకుడు.

"శత్రువులు... శత్రువులు మమ్మల్ని చుట్టుముట్టారు. శత్రువులు..." హీనస్వరంతో చెప్పి మరోసారి కిందపడిపోయాడు పైకి లేవటానికి ప్రయత్నిస్తున్న ఆగంతకుడు.

"వెతకండి... ఈ ప్రదేశాన్నంతా జల్లెడ వేసి చూడండి" వెంటనే తనవారికి ఆజ్ఞ ఇచ్చాడు ఆగంతకుల నాయకుడు.

ఒక్క పొదను కూడా వదలిపెట్టకుండా వంద ధనువుల చదరంలో వున్న ప్రదేశాలన్నిటినీ క్షుణ్ణంగా పరిశీలించి వట్టిచేతులతో వెనక్కి వచ్చారు వాళ్ళు.

"నగర ద్వారాలకు దగ్గరగా వున్న గ్రామంలో కూడా మాకు ఇలాంటి పరిస్థితే ఎదురైంది. కంటికి కనిపించకుండా మమ్మల్ని దెబ్బకొట్టారు ఎవరో. మొఖాన్ని చూపించకుండా కేవలం అరుపులతో గ్రామంలో వున్న వారందర్ని మా మీదికి ఉసికొల్పారు" తమకు జరిగిన పరాభవాన్ని గుర్తుచేసుకుంటూ మరోసారి పెద్దగా చెప్పాడు దృఢకాయుల నాయకుడు.

"ఇప్పుడు మనం చేయాల్సింది ఏమిటి?" మౌనంగా నిలబడి వున్న తమ నాయకుడిని అడిగాడు ఒక ఆగంతకుడు.

"ముందుగా ప్రాణాలు వదిలిన వారిని పాతిపెట్టాలి. ఆలస్యం అయితే క్రూరజంతువులు ఈ వాసనను పసిగట్టి ఇటుగా వచ్చేయవచ్చు" అన్నాడు నాయకుడు.

అలా చేయటానికి అవసరమైన సాధనాలు వారి దగ్గర లేవు. అయినా సరే ఆగకుండా తమ దగ్గర వున్న కత్తులనే పలుగుల మాదిరి ఉపయోగించి పెద్ద గోతిని తవ్వారు వాళ్ళు. విగతజీవులైన ముగ్గుర్ని అందులో పడుకోబెట్టి మట్టితో కప్పెట్టారు.

"మనవాళ్ళ మరణానికి కారకులైన వారెవరో కనిపెట్టి ఇంతకింత పగ తీర్చుకోవాలి. వాళ్ళని ఖండఖండాలుగా నరికి కాకులకు గద్దలకు ఆహారంగా వెయ్యాలి" ఆవేశంగా అన్నాడు ఒక అనుచరుడు.

"ముందు మనం ఎందుకు ఈ పరిసరాల్లోకి వచ్చామో ఆ పని విజయవంతం అవ్వాలి. అది జరగకుండా వెనక్కి వెళ్ళితే శిఖావంతులు వారు మనల్నే నరికి పక్షులకు ఆహారంగా వేయగలరు" అన్నాడు ఇంకో ఆగంతకుడు.

దృఢకాయులకేసి తిరిగాడు వారి నాయకుడు. "ఎంత త్వరగా వీలయితే అంత త్వరగా మీకు చెప్పిన పని పూర్తి అయిపోవాలి. సంపంగి నగరంలో ఒక్క ఏనుగు కూడా ప్రాణాలతో వుండటానికి వీలులేదు. అర్థం అయిందా?" అని అన్నాడు.

అతను తమకు ఇచ్చిన వెదురు గొట్టాన్ని బంగారు నాణేల మూటని తడుముకుంటూ తల వూపాడు దృఢకాయల నాయకుడు.

"నగరంలోని పరిస్థితిని ఆకళింపు చేసుకోవటానికి నాలుగైదు రోజుల వ్యవధి అవసరం అవుతుంది. ఆ తరువాతనే మీ పని పూర్తిచేయటం సాధ్యమవుతుంది. ఎంతకాదని అనుకున్నా మాకు ఒక వారం రోజుల సమయం కావాల్సిందే" అని అన్నాడు.

"మేము అడవి అంచుల్లో మీకోసం వేచి చూస్తూ వుంటాము. మాట తప్పి మీరు పారిపోదలుచుకుంటే మాత్రం అది సాధ్యపడే పని కాదని గుర్తుపెట్టుకోండి. మిమ్మల్ని మీతోపాటు మీ యజమాని కనకయ్య శ్రేష్ఠిని వెతికి వెతికి మట్టుపెట్టేస్తాము" కరుకుగా అన్నాడు ఆగంతకుల నాయకుడు.

కనకయ్య శ్రేష్ఠి పేరును వినగానే వెలాతెలా పోయాయి దృఢకాయుల మొఖాలు. తాము ఆ నగరం దగ్గరికి ఎందుకు వచ్చారో ఆ వచ్చిన పనిని వదిలివేసి కొంగ్రొత్త పనుల్లో తలమున్కలు అవుతున్నట్లు తెలిస్తే ఆ ఆగంతకుల కంటే ముందుగానే తమను యమపురికి పంపించే ఏర్పాట్లు చేసేస్తాడు శ్రేష్ఠి.

"అవసరం లేదు... మీరు మామీద అపనమ్మకాన్ని పెంచుకోవాల్సిన అవసరం ఎంత మాత్రము లేదు. మాట ఇచ్చిన తర్వాత మడమ తిప్పే అలవాటు మాకు లేదు" అని చెప్పి తన అనుచరులకేసి తిరిగాడు దృఢకాయుల నాయకుడు.

"పదండి పోదాం... నగరంలోకి వెళ్ళిన తర్వాత మాట్లాడుకుందాము" అని అన్నాడు. మట్టితో కప్పెట్టబడిన ఆగంతకుల మొఖాలను తీవ్రంగా గాయపడిన నాలుగో మనిషి పరిస్థితిని మరీ మరీ గుర్తుచేసుకుంటూ నడక మొదలుపెట్టారు అందరూ.

మూడు వందల ధనువుల దూరం వెళ్ళిన తర్వాత ఒక పెద్ద చెట్టుచాటు నుంచి నిశ్శబ్దంగా తమను అనుసరించటం మొదలుపెట్టిన శివుడిని మాత్రం వారెవరూ గమనించలేదు.

❖ ❖ ❖

చీకట్లు సంపంగి నగరాన్ని చుట్టుముట్టబోతున్న సమయంలో పూర్తి అయిపోయింది సంత.

"ఇప్పటికి ఇరువది నాలుగు సంవత్సరాల నించీ ఈ సంతకు నేను వస్తున్నాను. ఇంతకుముందు ఎన్నడూ నగరంలో ఇంత అలజడిని చూడలేదు. రాజభటులు నా శకటాల్ని నిలబెట్టి కిందినించి పైదాకా పరీక్షించటం ఇదే ప్రథమం" తమ శకటం మీద వేసుకు వచ్చిన సరుకునంతా అమ్ముకుని ఖాళీ శకటంతో నగర ద్వారం దగ్గరికి చేరుకున్న వ్యాపారస్థుడు ఒకతను బాధగా చెప్పుకున్నాడు తన పక్కనే వున్న మరో వ్యాపారస్థుడితో.

నగరంలోకి వచ్చే శకటాలనే కాదు... వట్టిగా బయటికి పోతున్న వాటిని కూడా కూలంకషంగా పరిశీలించిన తర్వాతనే కదలనిస్తున్నారు నగర ద్వారాల దగ్గర కావలి భటులు.

"ఇదంతా ఈ భటుల చేతగానితనం. ప్రమాద ఘంటికను మోగించిన దుండగీడు ఎవరో గాని, ఇప్పటిదాకా నగరంలోనే తలదాచుకుని, ఇప్పుడు

మనతోపాటు అవతలికి జారుకుంటాడేమోనని వాళ్ళ అనుమానం" అన్నాడు ఆ వ్యాపారి.

"వీళ్ళ పిచ్చిగాని వాడు ఎవడో ఎప్పుడో వెళ్ళిపోయి వుంటాడు. దొంగలు పడ్డ ఆరు మాసాలకు శునకాలు మొరిగాయనే సామెత అక్షరాలా నిజం." వెక్కిరింపుగా అన్నాడు మొదటి వ్యాపారి.

తానెవరో ఎవరికీ తెలియకుండా తలపాగా అంచుతో మొఖాన్ని మరుగు పరుచుకుని, ఒక పక్కగా నిలుచుని వున్న మండలాధిపతి సాగరుల వారికి చురుక్కున పొడుచుకున్నాయి వారి మాటలు.

ఆయనకు కొంచెం వెనుకగా నిలబడి వున్నాడు మంత్రి మహేశ్వరుడు. "ఆగండి ప్రభూ... తొందరపడకండి... ఆగండి" అంటూ ఆయన్ని శాంతింప చేయటానికి ప్రయత్నం చేశాడు.

విఫలం అయిపోయింది అది. విసవిసా నడుస్తూ ద్వారాల దగ్గర రాకపోకల్ని పర్యవేక్షిస్తున్న భటుల దగ్గరికి పోయాడాయన.

"ఆగు... అక్కడే ఆగు... ఎక్కడికిపోతున్నావ్? ఎవరివి నువ్వు?" వేగంగా వచ్చిన ఆయన గుండెలమీద చెయ్యివేసి వెనక్కి నెట్టటానికి ప్రయత్నిస్తూ దురుసుగా అన్నాడు ఆ భటుల నాయకుడు.

"ప్రభూ... వద్దు... ఆవేశం వద్దు" కొంచెం బిగ్గరగానే అరిచాడు వెనకే పరిగెత్తుకు వచ్చిన మహేశ్వరుడు.

ఒకచేత్తో తమ వదనాన్ని కనిపించకుండా చేస్తున్న తలపాగా అంచును తొలగిస్తూ రెండవ చేత్తో ఆ భటుల నాయకుడి మొఖంమీద బలంగా చరిచాడు సాగరులవారు.

సామాన్యమైంది కాదు ఆయన బలం... గావురుమని అరిచే వ్యవధి కూడా లభించలేదు భటుల నాయకుడికి. రాక్షస హస్తం ఏదో లాగిపెట్టి కొట్టినట్లు వెనక్కి తూలి వెల్లకిలా పడిపోయాడు.

పడిపోతూ వుండగానే తెలిసిపోయింది అతనికి తనకు ఆ గతి పట్టిన కారణం. "క్షమించాలి ప్రభూ... తమరని అనుకోలేదు. నన్ను దయచేసి క్షమించాలి" పెదవుల చివర్లనుంచి వెలువడుతున్న రక్తపుధారల్ని అరిచేతులతో అదుముకుంటూ దీనంగా అన్నాడు.

మారువేషంలో వచ్చిన తనను అతను గుర్తుపట్టకపోవటం సహజమేనన్న స్పృహ అప్పటికి వచ్చింది సాగరులవారికి.

"నువ్వే నన్ను క్షమించాలి. నేనే తొందరపడ్డాను" అనునయంగా అంటూ క్రింద పడివున్న అతనికి చేతిని అందించి పైకి లేపాడు. దుస్తులకు అంటిన మట్టిని తనే స్వయంగా దులుపుతూ దెబ్బ గట్టిగా తగిలినట్లుంది... రాజవైద్యుల దగ్గరికి వెళ్ళి చికిత్స చేయించుకో" అని కూడా అన్నారు.

"అత్తమీద కోపం దుత్తమీద చూపించటమంటే ఇదే ప్రభూ... మనం ఇచ్చిన ఆజ్ఞలనే తు.చ. తప్పకుండా ఆచరణలో పెడుతున్నారు వాళ్ళు. ఎవరో ఏదో మాట్లాడారని మనమీద మనమే కోపగించుకోవటం పద్ధతిగా వుండదు" వెనుకనుంచి మహేశ్వరుడు మెత్తగా మందలించటంతో మరింత సిగ్గు సాగరుల వారిని ఆవరించుకుంది.

"పరిశీలనలు పరీక్షలు అంతటితో ఆపేయండి. ఇక చాలు" ఖంగు మంటున్న కంఠంతో ఆజ్ఞ ఇచ్చాడు.

ద్వారం దగ్గరికి వచ్చిన ప్రతి శకటాన్ని ప్రతి మనిషిని తదేక దీక్షగా చూస్తున్న రాజభటులకు గుండెలమీద నించి కొండంత బరువు దిగిపోయినట్లు అనిపించింది.

క్షణం కూడా ఆలస్యం చేయలేదు వాళ్ళు. తమ దట్టీల్లో వున్న కొమ్ముబూరాలను బయటికి తీసి పెద్దగా ఊదారు.

ఆ శబ్దం చెవుల పడిన వెంటనే కదలిక వచ్చింది ఆ ప్రదేశంలో. చకచకా నడవటం మొదలుపెట్టాయి శకటాలు. పెద్ద పెద్ద అడుగులు వేస్తూ నడిచారు జనం. పదే పది నిమిషాల్లో పలుచబడిపోయింది హడావుడి. మరో పది నిమిషాల తరువాత పూర్తిగా మందగించిపోయాయి రాకపోకలు.

అప్పటికి పూర్తిగా వచ్చేశాయి చీకట్లు. చిటుకు చిటుకున వెలగటం మొదలుపెట్టాయి కాగడాలు. ఆ వెలుగులో బార్లా తెరచి వున్న ద్వారాలను తను దగ్గరే వుండి పూర్తిగా మూయించారు సాగరులవారు.

❖ ❖ ❖

భోజనశాలలో పరిచారికలు పరిచిన పెద్దపీటమీద కూర్చుని ద్వారం దగ్గర నిలబడి వున్న ఒక సేవకుడిని పిలిచింది జ్వలిత సామ్రాజ్యానికి యువరాణి అయినటువంటి జ్వాల.

"నాకు ఆకలి చాలా అధికం అయిపోతోంది. తండ్రిగారు ఇంకా రాలేదు. ఎక్కడ వున్నారో ఏం చేస్తున్నారో ఒకసారి చూసి రావటం బాగుంటుంది" అని చెప్పింది.

తలవంచి నమస్కారం చేసి వెంటనే వెలుపలికి వెళ్ళిపోయారు ఆ సేవకులు. వెళ్ళిన పదో క్షణికంలో వేగంగా తిరిగివచ్చారు.

"తల్లీ... ప్రభువులు ఆలోచనా మందిరంలో వున్నారట. రావటానికి ఇంకా ఆలస్యం అవుతుందిట. తమరిని భోజనం ముగించుకోమని మనవి..." అని చెప్పాడు.

ముడివడ్డాయి జ్వాల కనుబొమ్మలు. "ఆహారం తీసుకోకుండా ఆలోచించవలసిన అత్యవసర పరిస్థితులు మనకేమీ లేవు. ఎందుకు ఆలస్యం అవుతుందో నేనే స్వయంగా వెళ్ళి తెలుసుకుంటాను" అంటూ పీటమీదనించి లేచింది.

"అయ్యయ్యో... తప్పు తల్లీ... ఒకసారి భోజనానికి కూర్చున్న తర్వాత మధ్యలో లేవకూడదు. మీరు కూర్చోండి" అంటూ వారించబోయింది ఒక పరిచారిక.

వినిపించుకోలేదు జ్వాల. విసవిసా అడుగులు వేస్తూ ఆ భవనం ముందు భాగంలో వున్న ఆలోచనామందిరం దగ్గరికి పోయింది.

ఉన్నతమైన ఆసనంమీద కూర్చుని వున్నాడు జ్వలిత చక్రవర్తి మహాబలుడు. తెల్లగా మెరిసిపోయిన మీసాలను దువ్వుకుంటూ తన ఎదుట నిలబడివున్న మంత్రి మాటల్ని వింటున్నాడు.

మంత్రికి కొంచెం వెనుకగా నిలబడివున్నాడు ఒక దళపతి. అతన్ని చూడగానే సంకెళ్ళు పడినట్లు వాటంతట అవే ఆగిపోయాయి జ్వాల పాదాలు.

ఎర్రకొండల్లో సహజసిద్ధంగా ఏర్పడి వున్న రహదారిమీద నించి శత్రువులు ఎవరూ నగరం వైపు రాకుండా కాపలా కాయించవలసిన దళపతుల్లో అతను ఒకడు. ఆరోజు ఉదయం తను వడిశెలతో కొట్టిన భటుడికి అతనే నాయకుడు. ఎక్కడో నగరం వెలుపల వుండవలసిన అతను ఆ సమయంలో అక్కడికి ఎందుకు వచ్చాడు??

మంత్రి చెపుతున్న మాటల్ని శ్రద్ధగా వింటున్న చక్రవర్తి మొఖం ఒక్కసారిగా ఎర్రబడిపోవటం కూడా కనిపించింది జ్వాలకి. ఎంత వేగంగా అక్కడికి వచ్చిందో అంతే వేగంగా వెనక్కి వెళ్ళిపోవటం చాలా మంచిదని వెంటనే అనిపించింది.

"తన మన బేధాలు మా పరిపాలనలో లేవు. తప్పు చేసింది ఎవరైనా సరే శిక్షలు విధించవలసిందే... వెంటనే పిలిపించండి. వెళ్ళండి" కోపంగా ఆజ్ఞ ఇచ్చాడు చక్రవర్తి మహాబలుడు.

వెంటనే వెనుతిరిగి ద్వారం దగ్గరికి వచ్చాడు మంత్రి. ద్వారం వెలుపలే నిలబడి వున్న జ్వాలను చూసి ఒకింత ఆశ్చర్యపోయాడు.

"ఎవరిని వెంటనే పిలిపించమని అంటున్నారు మంత్రిగారు?" తియ్యటి కంఠంతో అమాయకంగా అడిగింది ఆమె.

తన ఆశ్చర్యాన్ని వెంటనే అదుముకుని, "తమరినే తల్లీ... ఇప్పుడు చక్రవర్తి ఎదుట నిలబడవలసింది తమరే..." అన్నాడు మంత్రి.

ఒక్కక్షణంపాటు తటపటాయించి ముందుకు కదిలింది జ్వాల. మందిరంలోకి పోయి "నన్ను పిలవనంపిన కారణం ఏమిటి నాన్నగారూ?" అని చక్రవర్తిని అడిగింది.

'ప్రవేశపెట్టండి ఆ భటుడిని'.... అన్నాడు చక్రవర్తి.

వెంటనే మందిరంలో వున్న ఒక పెద్ద స్తంభం చాటునుంచి ఇవతలకు వచ్చాడు ఆరోజు ఉదయం వడిశెల దెబ్బ తిన్న భటుడు.

"ఇతన్ని నువ్వు వడిశెలతో కొట్టావా?" సూటిగా అడిగాడు చక్రవర్తి.

"కొట్టాను" సమాధానం ఇచ్చింది జ్వాల.

"ఎందుకు?" అడిగాడు చక్రవర్తి.

"కాపలా కాయటం ఇతనికి చేతకాదు. మట్టిబొమ్మ మాదిరి నిలబడి ఊరికే దిక్కులు చూడటం తప్ప ఇంకేమీ చేయడం లేదు. దగ్గర్లోనే నిలబడి వున్న నన్ను అస్సలు గమనించనే లేదు" ధైర్యంగా చెప్పింది జ్వాల.

రెండు క్షణికాల పాటు మౌనంగా వుండి ఉన్నట్లుండి చేయి వూపాడు చక్రవర్తి. "మీరందరూ వెళ్లిపొండి... ఈ నేరస్థురాలిని నేను విచారిస్తాను" అని అన్నాడు.

ఒకరి తర్వాత ఒకరుగా ఆ మందిరాన్ని విడిచి వెళ్ళిపోయారు అందరూ... దెబ్బతిన్న భటుడితో సహా.

"నువ్వు చేసింది చాలా తప్పు. యువరాణి స్వయంగా వచ్చి తమ కదలికల్ని గమనిస్తోందని తెలిస్తే కాపలా భటులందరికీ ఒక విధమైన బద్ధకం ఏర్పడుతుంది. చాటుమాటుగా నిలబడి తమను పరీక్షించేది యువరాణే అనుకుంటారు. నీ గురించి పట్టించుకోకుండా వుండటానికి అలవాటుపడి, నిజంగా శత్రువులు వచ్చి నిలబడినా అది నువ్వనే భావిస్తారు. అప్పుడు జరిగేది ఏమిటో ఆలోచించు" చిన్నగా చెప్పాడు చక్రవర్తి.

తనను పెద్ద నేరస్థురాలిగా భావించి ఆయన గనుక ఏదైనా నీతివాక్యాలు మొదలుపెడితే తాను చేసిన పనిని సమర్థించుకోవటానికి సిద్ధపడుతున్న జ్వాల మాటలు... ఆమె నోటిలోనే ఆగిపోయాయి.

చక్రవర్తి మాటల్లోని యదార్థం అవగతమవటమే అందుకు కారణం. "నిజమే నాన్నగారూ... సూటిగా ఎదుటికి పోకుండా చాటుగా నిలబడటం ముమ్మాటికీ తప్పే..." అంటూ వెంటనే తన తప్పును ఒప్పుకున్నది.

"అయితే నీకు శిక్ష విధించవలసిందే..." అంటూ తీవ్రంగా ఆలోచించటం మొదలుపెట్టాడు చక్రవర్తి.

"దెబ్బతిన్న భటుడికి నన్నే స్వయంగా దెబ్బ తగ్గిపోయేదాకా సేవలు చేయమంటారా?" అడిగింది జ్వాల.

"నీ చేత సేవలు చేయించుకునేంతటి వెర్రివాళ్ళు మన దగ్గర ఎవరూ లేరు... నువ్వు వెంటనే సంపంగి నగరానికి ప్రయాణం కట్టు. నా సోదరి చారులత దగ్గర రాచమర్యాదలు అభ్యాసనం చెయ్యి" ఉన్నట్లుండి శిక్షను ప్రకటించాడు చక్రవర్తి.

నవ్వులమయమైపోయింది జ్వాల వదనం. చారులతాదేవి దగ్గరికి పోవటం అంటే అదొక వరం. అంతకుముందు ఎన్నిమార్లు వేడుకున్నా అందుకు అంగీకరించని చక్రవర్తి ఇప్పుడు అడగకుండానే శిక్ష పేరుతో ఆ వరదానం చేస్తున్నారు.

"అధికంగా సంతోషపడిపోకు. అక్కడ సాగరుడు పెంచి పెద్ద చేస్తున్న అనాథ బాలబాలికలు చాలామంది వున్నారు. వారికి విద్యాదానం చేసే

అయ్యవారు మహా నిరంకుశుడు. నిన్ను చూడగానే చారులత తప్పకుండా ఆయన దగ్గర శిష్యరికం చేయిస్తుంది" అన్నాడు చక్రవర్తి.

"నేర్చుకుంటాను నాన్నగారూ... ఇక్కడ నేను చదవని చదువులు ఏమైనా మిగిలివున్నాయని అత్తయ్య భావిస్తే అలాగే తప్పకుండా ఆ అయ్యవారి దగ్గర చదువుకుంటాను" నమ్మకంగా చెప్పింది జ్వాల.

"నీ చెలికత్తెల్ని కూడా తీసుకువెళ్ళు. నీ దుస్తులు, ఆట వస్తువులు, దంతపు బొమ్మలు అన్నింటినీ వెంటబెట్టుకు వెళ్ళు... తిరిగి నువ్వు ఎప్పుడు రావాలో నేను చారులత ద్వారా తెలుసుకుని వర్తమానం పంపిస్తాను. రేపు ఉదయమే నీ ప్రయాణం..." అంటూ ఆసనం మీది నించి లేచాడు.

"ఆకలి అధికంగా వుంది. వెంటనే వడ్డన ప్రారంభించమని చెప్పు. నేను రెండు నిమిషాల్లో వస్తాను" అని కూడా కూతురికి చెప్పాడు.

జ్వాల ఆ మందిరంలో నుంచి ఆవలికి వెళ్ళిపోగానే అంతవరకూ వెలుపల దూరంగా నిలబడిన మంత్రి చక్రవర్తి దగ్గరికి వచ్చాడు. ఆయన తీసుకున్న నిర్ణయాన్ని విని సంతోషంగా తల వూపాడు.

"చక్కటి నిర్ణయం ప్రభూ. చిన్నతనపు అల్లరిని వదిలి బాధ్యతగా వ్యవహరించటం యువరాణి నేర్చుకోవాలి. మీకు దూరంగా కొంతకాలం గడిపితే తప్ప అది అలవడే విషయం కాదు" అన్నాడు.

"అంటే... మీ ఉద్దేశ్యం ఏమిటి?" చిరుకోపంతో అడిగాడు చక్రవర్తి.

మాటలతో సమాధానం ఇవ్వలేదు మంత్రి. చిరునవ్వు నవ్వాడు. తను కూడా నవ్వేశాడు చక్రవర్తి. "తల్లి లేని బిడ్డ అని భావించి గారాబంగా పెంచటం నిజంగా తప్పే... ఆ తప్పును సరిచేసుకోవాలి. అందుకే ఈ నిర్ణయం" అంటూ "ఈరోజు మీరు కూడా మాతోపాటు భోజనం చేద్దురుగాని. భోజనశాలకు పోదాం పదండి" అంటూ అటుకేసి దారితీశాడు.

ఆలోచనా మందిరం దగ్గర వున్న భటుడిని పిలిచి, మరునాడు జ్వాల సంపంగి నగరానికి ప్రయాణం అవుతున్న సందర్భంలో చేయవలసిన ఏర్పాట్లను గురించి చెపుతూ ఆయన్ను అనుసరించాడు మంత్రి.

❖ ❖ ❖

బయలుదేరిన క్షణం నుంచీ ఎక్కడా ఆగకుండా ప్రయాణం చేసి రాత్రి మూడవ ఝాము గడిచిపోయే సమయంలో సంపంగి నగర ద్వారాల్ని చేరుకున్నారు దృఢకాయులు.

ఓపిక హరించిపోతున్నా, నిద్ర ముంచుకు వస్తున్నా లెక్కచేయకుండా వారిని అనుసరించి వచ్చిన శివుడు వెంటనే తనదారిని మార్చుకుని వినాయకుడి గుడి దగ్గరికి పోయాడు. విగ్రహం వెనుక వున్న సొరంగ మార్గంలో నుంచి నగరంలోకి అడుగుపెట్టాడు.

సూటిగా సాగరుల వారి దగ్గరికి పోవాలని అతని కోరిక. అయితే ఏనుగు గున్నని నగర ద్వారాలు దాటించిన దగ్గర్నించీ సరైన ఆహారం తీసుకోకపోవటం వల్ల విపరీతమైన ఆకలి, దానివల్ల వచ్చే నీరసం అతన్ని బాధపెట్టడం మొదలుపెట్టాయి.

గజశాల దగ్గర చాలా మెలకువగా నిలబడి వున్న భటుల్ని చూసి తృప్తిగా తలవూపుకుని, సూటిగా రాజమందిరాల దగ్గరికి పోయాడు అతను.

ఒక పక్కగా వుంటుంది వంటశాల... నాలుగు అంతస్తులు కలిగినటువంటి మహాభవనం అది. దాన్ని ఆనుకుని చాలా ఎత్తుగా ఎదిగి కనిపిస్తుంది ఒకపెద్ద మామిడి చెట్టు.

తనను ఎవరూ గమనించటం లేదని నిశ్చయపరుచుకుని ఆ చెట్టుమీదికి ఎగబ్రాకాడు శివుడు.

రెండో అంతస్థులోని ఒక గవాక్షం దగ్గరికి పోతున్న పెద్ద కొమ్మను పట్టుకుని పిల్లిమాదిరిగా గవాక్షపు అంచును చేరుకున్నాడు.

వంటలు చేసేటప్పుడు వెలువడే వాసనలు భవనంలోనే వుండకుండా బయటికి పోవటం కోసం ప్రత్యేకంగా నిర్మించబడిన కిటికీ అది. చాలా పెద్దగా వుంటుంది. అడ్డుకోవటానికి ఇనుప చువ్వలు ఏమీ వుండవు.

కొమ్మమీదినించి కిటికీ అంచుమీదికి చేరుకుంటున్న సమయంలో అంతకుముందు అనేకమార్లు కలిగిన అనుభూతి మరోసారి కలిగింది అతనికి– తనను ఎవరో గట్టిగా గమనిస్తున్నట్టు.

ఊపిరి బిగపట్టి చుట్టూ చూశాడు శివుడు. అనుమానించదగ్గ అంశం ఏదీ తన దృష్టికి రాకపోవటంతో చప్పుడు చేయకుండా కిటికీని వదిలి, భవనంలోకి ప్రవేశించాడు.

రాజమందిరాల్లో పనులు చేసే పనివాళ్ళందరికీ వంటలు చేయబడే అంతస్థు అది. ఆరోజున అందరూ ఆరగించగా మిగిలిపోయిన పదార్థాలన్నిటినీ మూడు పెద్ద పెద్ద గిన్నెల్లో సర్దిపెట్టారు వంటవాళ్ళు.

ఉదయం వేళలో అన్నార్తులు ఎవరైనా వస్తే వారికి ఇవ్వబడతాయి అవి. ఎవరూ రాని పక్షంలో సూటిగా గజశాలకు పంపబడతాయి.

రెండు జానల వెడల్పు వున్న ఒక పళ్ళెరాన్ని వెతికి ఒక గిన్నెలో వున్న పదార్థాలను ఆ పళ్ళెరంలో పెట్టుకున్నాడు శివుడు.

గబగబా ఆరగించి, తన ఉనికి ఎవరికీ తెలియకముందే అక్కడినించి వెళ్ళిపోవాలని అతని ఆశయం.

మొదటి ముద్దని నోటిలో పెట్టుకోబోతుండగా ఈసారి మరింత గట్టిగా వచ్చేసింది సందేహం. అక్కడే వుంటే తను పట్టుబడిపోవటం తప్పనిసరి అని తెలిసిపోయింది.

ఎందుకలా అనిపించిందో, అలా అనిపించటానికి కారణం ఏమిటో అతనికి తెలియదు. తెలిసిందల్లా ఒక్కటే... వెళ్ళిపోవాలి అక్కడినించి.

నోటిలో పెట్టుకోబోయిన ముద్దని తిరిగి పళ్ళెరంలో పడవేసి, శబ్దం కాకుండా ఆ పళ్ళెరాన్ని పక్కనే వున్న ఒక చెక్కబల్లమీద పెట్టేశాడు. అడుగులు ఎత్తి ఎత్తి వేస్తూ ఏ కిటికీలో నుంచి లోపలికివచ్చాడో అదే కిటికీ దగ్గరికి చేరుకున్నాడు.

సరిగ్గా అదే సమయంలో "దొంగ... దొంగ... పట్టుకోండి... పట్టుకోండి" అంటూ వినవచ్చింది ఒక కంఠం.

అది ఎవరిదో తెలియలేదు శివుడికి. తనను ఎక్కడినించి చూశారో, ఎలాచూశారో అంతకన్నా అర్థం కాలేదు.

నిశ్శబ్దంగా సంచరించాలన్న మాటను గాలికి వదిలేసి, ఎగిరి దూకాడు కిటికీ అంచుమీదికి. అవతలి పక్కన వున్న మామిడి కొమ్మని పట్టుకొని బరబరా అవతలికి పోబోతుండగా గింగిరాలు తిరుగుతూ వచ్చి అతని తలకి తగిలిందొక చిన్న చెట్టుకొమ్మ.

చెట్టుక్రింద నిలబడి అతని చర్యలను గమనించిన వారెవరో దాన్ని విసిరి నట్టున్నారు. బాధతో జివ్వుమన్నాయి అతని నరాలు. అతనికి తెలియకుండానే పట్టుకున్న కొమ్మని వదిలేశాయి చేతులు.

అంత ఎత్తునుంచి కిందపడటం అంటే, తల పగిలి ప్రాణాలు పోగొట్టుకోవటమే అని తెలుస్తూనే వున్నది అతనికి. పడిపోకుండా వుండటం మాత్రం సాధ్యపడలేదు.

అతివేగంగా కిందికి జారిపోయి నేలను గుద్దుకోబోతున్న సమయంలో లాఘవంగా అతన్ని పట్టుకుని, కిందపడిపోకుండా ఆపాయి రెండు చేతులు.

అవి ఎవరివో, అంత ఎత్తునుంచి పడిపోతున్న తనని ఎలా ఆపగలిగాయో తెలుసుకోవాలని అనుకుంటూ వుండగానే తప్పిపోయింది తెలివి. కనులు తేలవేసి అచేతనంగా వుండిపోయాడు ఆ చేతుల్లో.

❖ ❖ ❖

శయన మందిరంలో గాఢనిద్రలో వున్న చారులతాదేవికి, మందిరపు తలుపులు సున్నితంగా తడుతున్న సవ్వడికి వెంటనే మెలకువ వచ్చింది. పక్కనే వున్న సాగరులవారికి నిద్రాభంగం కాకుండా వెంటనే ద్వారం దగ్గరికి వచ్చిందామె.

"అత్యవసరమైన వర్తమానం వినిపించాలి. తలుపు తీయండి తల్లీ... నిద్ర చెడగొట్టినందుకు నన్ను క్షమించండి" అంటూ అవతలి పక్కనుంచి వినవచ్చింది ఆమె ప్రధాన పరిచారిక గొంతు.

నిద్రమత్తు వదలని కనుల్ని చీరచెంగుతో వత్తుకుంటూ తలుపులు తెరచి ప్రశ్నార్థకంగా చూసింది చారులతాదేవి.

"జయంతిపురం నుంచి వార్తలను చేరవేసే పావురం వచ్చింది తల్లీ... చక్రవర్తి స్వయంగా లిఖించిన వర్తమానం ఏదో దాని కాలికి కట్టి వుంది" వెంటనే చెప్పింది పరిచారిక.

చిటికెలో మటుమాయం అయిపోయింది చారులతాదేవిని ఆవరించుకుని వున్న నిద్రమత్తు. వేగంగా అడుగులు వేస్తూ కొంచెం అవతలగా వున్న ఇంకో మందిరంలోకి వెళ్ళింది ఆమె.

చీకటిని లెక్కచేయకుండా బహు యోజనాల దూరం నుంచి ఎగురుకుంటూ వచ్చిన ఒక పావురానికి సేద తీరేందుకు ఏవేవో సేవలు చేస్తున్నారు మరో ఇద్దరు పరిచారికలు. ఆమెని చూడగానే ఆ పావురం కాలికి కట్టి వున్న చిన్న వస్త్రపు ముక్కని తీసి ఆమెకు అందించారు.

జ్వలిత సామ్రాజ్య చక్రవర్తి మహాబలుడి రాజముద్రిక అద్దబడి వుంది ఆ వస్త్రపు ముక్కమీద.

రెండు చేతులతోను పట్టుకుని కనులకు అద్దుకున్నది చారులతాదేవి. "నా పుట్టినింటి నించి వర్తమానాలు వచ్చి చాలా రోజులయిందన్న బాధ ఉపశమించింది. నాకు చాలా సంతోషంగా వున్నది" అంటూ రాజముద్రిక క్రింద వ్రాయబడి వున్న అక్షరాలను చదివింది.

చదువుతూ వుండగానే నవ్వులమయమైపోయింది ఆమె వదనం. "ఆ శుభవర్తమానం ఏమిటో మేమూ వినవచ్చా తల్లీ?" అడిగింది ప్రధాన పరిచారిక.

"జ్వలిత సామ్రాజ్యానికి కాబోయే మహారాణి, నా సోదరుడి కుమార్తె జ్వాల కొద్దిరోజులు మనతో గడిపేందుకు ఇక్కడికి వస్తోందిట. అయ్యవారి దగ్గరికి పంపించి సకల మర్యాదలు నేర్పించవలసిందిగా చక్రవర్తి ఆదేశం" ఉత్సాహంగా చెప్పింది చారులతాదేవి.

"సంతోషం తల్లీ. యువరాణికి సేవలు చేసుకోగల భాగ్యం మాకు లభించబోతున్నందుకు చాలా సంతోషంగా వుంది. ఇప్పుడు మీకు నేను ఇంకో వార్త వినిపించాలి. ఇది కొంచెం దుర్వార్తే... దేవిగారు కోపం చేయకుండా సావధానంగా ఆలకించాలి..'' మొదట ఉత్సాహంగా మొదలుపెట్టినా ఆఖర్లో ఆగి ఆగి నిరుత్సాహంగా చెప్పింది ప్రధాన పరిచారిక.

"ఏమిటి ఆ దుర్వార్త?" ఆశ్చర్యంగా అడిగింది చారులతాదేవి.

"పిల్లి మాదిరిగా మన వంటశాలలో ప్రవేశించి ఆహారాన్ని దొంగిలించ బోతూ శివుడు పట్టుబడ్డాడు" తల దించుకుంటూ చెప్పింది పరిచారిక.

ముడివడ్డాయి చారులతాదేవి కనుబొమ్మలు. ''ఏమిటి నువ్వు మాట్లాడుతున్నది? శివుడు పట్టుబడడం ఏమిటి?" విసురుగా అడిగింది.

వంటశాల వెలుపల మామిడి చెట్టు కొమ్మమీదినించి శివుడు కిందపడటం వరకూ తనకు తెలిసినదేమిటో చెప్పింది ఆ పరిచారిక.

"ఏడి వాడు? ఇప్పుడు ఎక్కడ వున్నాడు?" అడిగింది చారులతాదేవి.

"వైద్యులవారు వచ్చి తెలివి తెప్పించడానికి ఏదో ఔషధాన్ని ఇస్తున్నారు" అంటూ ఆ భవనానికి కొంచెం ఆవలగా వున్న మరో భవనం వంక చూపించింది పరిచారిక.

క్షణం కూడా ఆలస్యం చేయలేదు చారులతాదేవి. విసవిసా అడుగులు వేస్తూ అటుకేసి బయలుదేరింది. భగభగమని వెలుగుతున్న రెండు కాగడాలను పట్టుకుని పరుగులాంటి నడకతో ఆమెను అనుసరించారు అక్కడ వున్న పరిచారికలు అందరూ.

"తల్లీ... ఇప్పుడు మీరు శివుడిని చూడద్దు. సాగరుల వారు నిద్రలేచిన తర్వాత వారికి చెప్పాలి" అంటూ ఆ భవనం ఎదుటే నిలబడి వున్న మంత్రి మహేశ్వరుడు వెంటనే ఆమెను అడ్డుకున్నాడు.

"వాడు... వాడి ఆరోగ్యం ఎలా వుంది?" అడిగింది ఆమె.

"సరయిన తిండి తినకుండా, అదేపనిగా శ్రమపడటంవల్ల బాగా నీరసించిపోయాడు. తెలివి వచ్చింది. ద్రవ పదార్థాలను తాగించమని చెప్పాను. ఇంకో ఘడియ తరువాత లేచి కూర్చుంటాడు" అన్నాడు అప్పుడే భవనంలో నుంచి బయటికి వస్తున్న వైద్యుడు.

"నేను వాడికి ఎటువంటి అసౌకర్యం కలిగించకుండా ఒకే ఒకసారి చూసి వెంటనే వచ్చేస్తాను. వీలుపడదంటారా?" అడిగింది చారులతాదేవి.

వైద్యుడు సమాధానం చెప్పకముందే కల్పించుకున్నాడు మంత్రి మహేశ్వరుడు. "వీలుపడదు తల్లీ... ఎట్టి పరిస్థితుల్లోను మీరు వాడిని చూడటానికి వీలుపడదు. ముందుగా చూడవలసింది, మాట్లాడవలసింది సాగరులవారు మాత్రమే" ఖచ్చితమైన కంఠంతో నిష్కర్షగా చెప్పాడు.

అతను అంత గట్టిగా మాట్లాడటం సాధారణంగా జరగదు. అలా మాట్లాడి వుంటే అందుకు ఏదో కారణం తప్పకుండా వుండే వుంటుంది.

"సరే... నేను నా నిర్ణయాన్ని మార్చుకుంటున్నాను. సాగరుల వారు వచ్చి వెళ్ళిన తర్వాతనే వాడితో మాట్లాడతాను" అంటూ ఆ మందిరం ఎదుట వున్న ఒక అశోకవృక్షం కిందికి పోయి నిలబడింది ఆమె.

"ఒకసారి చూడనిస్తే ఇప్పుడు వచ్చే నష్టం ఏముంటుంది? సామాన్యుల మాదిరి దేవిగారు ఆ చెట్టుకింద నిలబడటం బాగోలేదు కదా..." చిన్నకంఠంతో మహేశ్వరుడితో అన్నాడు వైద్యశిఖామణి విరూపాక్షుడు.

"నీకు అన్నీ తెలుసు. మళ్ళీ నాచేత చెప్పించే ప్రయత్నం చేయకు. సాగరుల వారు వచ్చిన తర్వాతనే దేవిగారు వాడి దగ్గరికి వెళ్ళేది... అంతే!" మరింత ఖచ్చితంగా చెప్పాడు మహేశ్వరుడు.

రాజదర్శనం కోసం వచ్చి ఎదురుచూపులు చూసే ఒక సామాన్య స్త్రీ మాదిరి చెట్టుకింద నిలబడి వున్న చారులతాదేవి వంక ఒకసారి చూసి గాఢంగా నిట్టూర్చాడు వైద్యశిఖామణి విరూపాక్షుడు.

తల్లడిల్లిపోతున్నది ఆమె తల్లి మనస్సు. శివుడు చేశాడని అందరూ అనుకుంటున్న తప్పొప్పులను గురించి ఆమె ఆలోచించటం లేదు. వాడి ఆరోగ్య విషయం చుట్టూనే పరిభ్రమిస్తున్నాయి ఆమె ఆలోచనలు.

"సాగరుల వారికి వర్తమానం వెళ్ళిందా? వారు వెంటనే వస్తున్నారా? ఉన్నట్లుండి మహేశ్వరుడికేసి తిరుగుతూ అడిగాడు అతను.

"వస్తున్నారో లేదో నాకు తెలియదు. వర్తమానం వెళ్ళటం అయితే వెళ్ళింది. వారు తమంతట తాము నిద్ర లేచేంతవరకు ఎదుటపడే ధైర్యం ఎవరికీ వుండదు. ఆలస్యం కావచ్చు" చెప్పాడు మహేశ్వరుడు.

నుదురు రుద్దుకుంటూ తీవ్రంగా ఆలోచిస్తున్నట్టు మొఖం పెట్టాడు విరూపాక్షుడు.

"ఏమిటి మీ సంశయం?" ఆశ్చర్యంగా అడిగాడు మహేశ్వరుడు.

"స్పృహ తెలిసిన క్షణం నుంచీ శివుడు ఎందుకనో విపరీతంగా భయపడుతున్నాడు. నన్ను చూసినా, మిమ్మల్ని చూసినా వాడి నాడి వేగంగా కొట్టుకుంటోంది. ధైర్యం చెప్పేవాళ్ళు దగ్గర లేకపోతే తిరిగి మైకంలో మునిగిపోతాడని అనుమానంగా వున్నది" చెప్పాడు విరూపాక్షుడు.

"అయితే ఇప్పుడు ఏం చెయ్యాలి?" అడిగాడు మహేశ్వరుడు.

"సాగరులవారు వచ్చేలోపల ఒకసారి దేవిగారిని వాడి దగ్గరికి పోనిస్తే అంతా సర్దుకుంటుంది. నా అభిప్రాయం నేను చెప్పాను. ఇక మీ ఇష్టం" నిష్కర్షగా అన్నాడు విరూపాక్షుడు.

విపరీతమైన కోపం, నవ్వు రెండూ ఒకేసారి వచ్చేశాయి మహేశ్వరుడికి. ఆ మాటల్లో యదార్థం ఇసుమంత కూడా లేదని తెలుస్తూనే వున్నది. శివుడంటే అభిమానం ఒక్క చారులతాదేవికి మాత్రమే కాదు... విరూపాక్షుడికి కూడా వున్నది.

సాగరులవారు వచ్చి ఆగ్రహంతో అరిచి కేకలు పెట్టేలోపల ఒక్కసారి ఆమెను శివుడితో మాట్లాడనిస్తే ఆ తరువాత జరగబోయే పరిణామాల తీవ్రత తగ్గిపోతుంది. బెదురుచూపులు చూస్తున్న శివుడు ధైర్యం పుంజుకుంటాడు.

లోపల వున్న శివుడు నిజంగానే ఏదో పెద్ద పెను ప్రమాదంలో చిక్కుపడి వున్నట్టు మొఖం పెడుతున్న విరూపాక్షుడి వంక చూస్తూ పెదవులమీదికి దూసుకు వస్తున్న నవ్వును అతి బలవంతంగా అదుముకున్నాడు మహేశ్వరుడు.

"ఆకతాయి పనులు కాదు శివుడు చేసింది. నగర సంరక్షణకు ఏర్పాటు చేయబడిన పద్ధతుల్ని అగౌరవపరిచాడు. గజశాలలోని గున్న ఏనుగును అనుమతి లేకుండా..." అంటూ పరిస్థితిని వివరించబోయాడు అతనికి.

"సాక్ష్యం ఏది? నేర నిరూపణ ఎక్కడ? తప్పు చేశాడని మనకి మనంగా ఒక నిర్ణయానికి రావటం ధర్మమా?" అడగనే అడిగాడు విరూపాక్షుడు.

మరొక్కమాట గట్టిగా మాట్లాడితే శివుడి తరపున ఇతనే పెద్ద వాదన ప్రారంభించవచ్చునని అర్థమై గబగబా తలవూపాడు మహేశ్వరుడు. అశోక వృక్షం దగ్గరికి పోయి "తల్లీ! మీరు త్వరగా వెళ్ళి గబగబా చూసి వెంటనే వెలుపలికి వచ్చేయండి. సాగరులవారు ఏ క్షణంలోనైనా రావచ్చు" అన్నాడు.

తనను అంతసేపు ఆ చెట్టుక్రింద నిలబెట్టినందుకు కోపం తెచ్చుకోలేదు చారులతాదేవి. "తప్పకుండా... ఇలా వెళ్ళి అలా వచ్చేస్తాను" అంటూ తన పరిచారిక వెంట వస్తుండగా భవనంలోకి వెళ్ళింది.

❖ ❖ ❖

ఎనిమిది మందసాల నిండుగా తన దుస్తుల్ని దగ్గర వుండి సర్దించింది యువరాణి జ్వాల. రెండు మందసాల్లో తన ఆటవస్తువుల్ని, ఒక మందసంలో అందమైన దంతపు బొమ్మల్ని పెట్టించింది.

తూర్పుదిక్కున వేగుచుక్క ప్రత్యక్షం అవుతుండగా ఆమె మందిరం ఎదుటికి వచ్చి నిలబడ్డాయి రెండు అశ్వశకటాలు. మందసాలన్నింటినీ ఒక శకటంలో పెట్టించి రెండో శకటంలో తను ఇద్దరు చెలికత్తెలతో సహా కూర్చున్నది ఆమె.

"అక్కడికి చేరుకోగానే మాకు వర్తమానం పంపాలి. పావురాల్ని తీసుకు పోతున్నావా?" అడిగాడు ఆమెను సాగనంపడానికి స్వయంగా వచ్చి నిలబడి వున్న చక్రవర్తి.

"అవసరం లేదు నాన్నగారు... అత్తయ్య దగ్గర మొత్తం ఎనిమిది పావురాలున్నాయి. వాటితో మీకు వర్తమానాలు పంపిస్తాను" చెప్పిందామె.

"నీకు అవసరమైనవన్నీ సర్దుకున్నావా?" మరో ప్రశ్న వేశాడు చక్రవర్తి.

"ప్రభూ... మీరు యువరాణిని కేవలం కొద్దిరోజులు గడపటానికి మాత్రమే మీ సోదరి దగ్గరికి పంపిస్తున్నారు. పెళ్ళిచేసి అత్తవారింటికి కాదు" చిన్నగా వెనకనుంచి హెచ్చరించాడు మంత్రి గుణధాముడు.

అతనివంక కోరగా చూడబోయి ఆ మాటల్లోని యదార్థం అవగతమై చిన్నగా నవ్వేశాడు చక్రవర్తి.

"పుట్టి పెరిగిన తర్వాత నా తల్లిని దూరంగా పంపించటం ఇదే మొదటిసారి. ఎందుకనో మనసు బరువుగా వుంది" చెప్పాడు చిన్న కంఠంతో.

"ఒక బిడ్డ... బిడ్డ కాదు. ఒక కన్ను కన్ను కాదు అనే సామెత వట్టిది కాదు ప్రభూ... పరమ సత్యం... మన పంచప్రాణాలన్నీ ఆ బిడ్డమీదనే ఆధారపడి వుంటాయి. కన్ను విషయంలో కూడా అంతే. చిన్న నలుసు పడినా తల్లడిల్లిపోతాము" ఓదార్పుగా అన్నాడు గుణధాముడు.

అశ్వ శకటాల్ని అనుసరించే భటులందరినీ దగ్గరికి పిలిచాడు చక్రవర్తి.
"యువరాణీవారిని క్షేమంగా చేర్చే బాధ్యత మాది. మీరు సందేహించవలసిన అవసరం లేదు" వెంటనే చెప్పాడు ఆ భటుల్ని దగ్గర వుండి ఎంపికచేసి తీసుకువచ్చిన సేనాపతి.

"వెళ్లి వస్తాను నాన్నగారూ... మీరు జాగ్రత్త. వేళకు ఆహారం మర్చిపోకుండా తీసుకోండి" శకటంలో నుంచి తలను బయటికి పెడుతూ చెప్పింది యువరాణి.

మంత్రి గుణధాముడు చేయి ఊపగానే చకచకా కదిలాయి శకటాలు. అరనిమిషంలో ఆ ప్రదేశాన్ని వదిలి నగర ద్వారాల వైపు వెళ్ళిపోయాయి.

అలాగే చూస్తూ నిలబడిపోయిన చక్రవర్తి చేయిని చనువుగా పట్టుకుని సభాభవనం వైపు తీసుకుపోయాడు గుణధాముడు.

❖ ❖ ❖

"నాదేరా తప్పు... అసలు నిన్ను చకోర పుష్పాలు తెచ్చిపెట్టమని అడగకుండా వుండాల్సింది. నీ కష్టాలన్నీ అప్పటినుంచే అధికం అయిపోయాయి" నీరసంగా పడుకుని వున్న శివుడి తలమీద చెయ్యివేసి నిమురుతూ అన్నది చారులతాదేవి.

"అమ్మా... అదేమీ కాదు గాని, నేను వెంటనే ప్రభువుల వారితో మాట్లాడాలి. చాలా ముఖ్యమైన విషయం" తడి ఆరిపోతున్న పెదవుల్ని నాలుకతో తడి చేసుకుంటూ అన్నాడు శివుడు.

"ప్రభువులు వచ్చారంటే నీ వీపు వాచిపోతుంది. అదేమిటో నాతో చెప్పు" అన్నది ఆమె.

ఒక్క క్షణం కూడా ఆలస్యం చేయలేదు శివుడు. చటుక్కున లేచి కూర్చున్నాడు. ఆమె వారిస్తున్నా వినిపించుకోకుండా-

"తల్లీ... వెంటనే మన గజశాలకు రక్షణను రెట్టింపు చేయాలి..." అంటూ అడవిలో తాను విన్న విషయాలన్నిటినీ వరుసపెట్టి ఆమె చెవిన వేశాడు.

చారులతాదేవి ఆశ్చర్యానికి అంతు అనేది లేకుండా పోయింది. "నిజమా? నిజంగానే అటువంటి ప్రయత్నం జరగబోతోందా?" రెట్టించి అడిగింది.

ఇంకోసారి చెప్పాడు శివుడు. గజశాలమీద కన్ను వేయటానికి వచ్చిన దృఢకాయులు ఎంతమందో, వాళ్ళు ఎలా వుంటారో పోలికలతో సహా వివరించాడు.

"మంత్రిగారూ..." ఖంగుమంటున్న కంఠంతో పిలిచింది చారులతాదేవి.

భవన ద్వారం దగ్గరే నిలబడి వున్న మహేశ్వరుడు రెండు అంగల్లో వచ్చి ఆమె ఎదుట నిలుచున్నాడు.

"శివుడు చెప్పింది విన్నారు కదా... వెంటనే..." అంటూ మొదలుపెట్ట బోయిన ఆమెను మధ్యలోనే ఆపేశాడు అతను.

"భటుల్ని పంపటం అయిపోయింది తల్లీ. ఈ క్షణం నుంచీ గజశాలలోకి నేను మీరు ప్రభువులవారు తప్ప మరెవ్వరూ అడుగుపెట్టలేరు. లోపల వున్నవాళ్ళు ఎవరూ తిరిగి మనము ఆజ్ఞ ఇచ్చేటంత వరకూ వెలుపలికి రాలేరు. ద్వారాల్ని మూసి తాళాలు వేయిస్తున్నాను" అని చెప్పాడు.

"మరి ఆ దృఢకాయుల సంగతి?" అడిగింది ఆమె.

"ఈ రోజున నగర ద్వారాలు ఇప్పుడే తెరవబడతాయి. అక్కడికి కూడా భటులు వెళ్ళారు. వీడు చెప్పిన పోలికలున్న వారందర్నీ బంధించి తీసుకువస్తారు" అన్నాడు అతను.

తృప్తిగా తలవూపింది చారులతాదేవి. "ఇక ఇప్పుడు మీరు... మీ సాగరుల వారు మీ ఇష్టం వచ్చినట్లు విచారణలు జరుపుకోండి. మా శివుడు గనుక కల్పించుకుని వుండకపోయినట్లయితే మీరు మీ గజదళం ఏమైపోయి వుండేదో గుర్తుపెట్టుకుని మరీ విచారించండి" అంటూ శివుడు కేసి తిరిగి మరోసారి అతని తలను నిమిరింది.

"నువ్వు ధైర్యంగా వుండు. నీకు భయం అనవసరం" అని చెప్పి చెలికత్తెతో సహా భవనంలో నుంచి బయటకు వెళ్ళిపోయింది.

అర నిమిషం తరువాత ఆదరాబాదరాగా వచ్చారు సాగరులవారు. వస్తూనే "విచారణ మొదలుపెట్టి సాక్ష్యుల్ని వెంటనే ప్రవేశపెట్టండి. ఇవాల్టితో వీడి ఆగడాలు ఆగిపోవాలి" అని గర్జించాడు.

"ఒక్క నిమిషం ఆగండి ప్రభూ... అసలు జరిగింది ఏమిటో మీకు పూర్తిగా తెలియదు" అని కొంచెంగా వారించబోయాడు మహేశ్వరుడు.

"నోరు మూసుకుని నేను చెప్పింది చేయండి. అన్ని విషయాలు వాటంతట అవే తెలిసి వస్తాయి. వెళ్ళండి" మరోసారి గర్జించాడు సాగరులవారు.

మంచం మీదినించి దిగి భయం భయంగా చూస్తూ నిలబడిన శివుడిని తిరిగి పడుకోబెట్టబోయిన వైద్యశిఖామణి విరూపాక్షుడి మీద కూడా విరుచుకు పడ్డాడాయన.

"మీరు ఎవరూ వాడిని వెనకేసుకు రావద్దు. పాడుపనులు చేసి శిక్ష తప్పించుకోవటం కోసం ఇప్పుడు వాడు నీరసం నటిస్తున్నాడు. అవతలికి వెళ్ళిపొండి" అని కసురుకున్నాడు.

చారులతాదేవి అక్కడికి వచ్చి వెళ్ళిన సంగతిని ఆయన చెవిన వేస్తే ఆ కోపం కొంచెంగా నయినా తగ్గుతుందన్న భావనతో ఆ మాట చెప్పబోయాడు విరూపాక్షుడు.

"నేను ఎవరి మాటలు వినదలుచుకోలేదు. విచారణ మొదలు కావల్సిందే" ఖంగుమంటున్న కంఠంతో చెప్పి వడివడిగా సభా భవనం దగ్గరికి వెళ్ళిపోయాడు సాగరులవారు.

"ఆత్రం వచ్చినా ఆగ్రహం వచ్చినా ఆగటం అసాధ్యమైపోతుంది ప్రభువుల వారికి. ఇదే అలవాటుగా పరిణమిస్తే రక్తపోటు, మధుమేహం అన్నీ ఒక దానివెనుక ఒకటిగా వచ్చేస్తాయి. కాస్తంత శాంతంగా వుండమని చెప్పండి" మహేశ్వరుడితో అన్నాడు విరూపాక్షుడు.

"చెప్పేదేదో మీరే చెప్పండి. ఈ సమయంలో నేను ఏదైనా వ్యతిరేకంగా మాట్లాడితే ఆ వ్యాధులన్నీ మాకే వస్తాయి..." అన్నాడు మహేశ్వరుడు.

❖ ❖ ❖

"వీడే... ప్రమాద ఘంటికను మోగించింది ఈ పిల్లవాడే... ప్రమాదం ముంచుకు వస్తోందని అరిచింది కూడా వీడే" సూర్యోదయమైన అర్థఘడియకు సభా భవనంలోకి వచ్చి అప్పుడే అక్కడికి తీసుకురాబడిన శివుడిని చూడగానే బిగ్గరగా అరిచి చెప్పాడు అతను ప్రమాద ఘంటికను మోగిస్తుండగా చూసిన నగర పౌరుడు.

"ఇతగాడే నా మొఖంమీద చరిచి నన్ను క్రింద పడదోసింది. ఏనుగు గున్నని బయటికి తీసుకుపోయింది ఇతనే" తడుముకోకుండా చెప్పాడు ఇంకా మొఖంమీది కట్టును వూడదీయించుకోని రాజభటుడు.

సాగరుల వారి ఆగ్రహం అవధులు దాటిపోతున్నట్టు అర్థమైంది మహేశ్వరుడికి. ఆయన అనుమతి కోసం ఆగకుండానే సాక్షులు ఇద్దరినీ భవనం వెలుపలికి పంపించివేసి "ప్రభూ... ఆ తర్వాత జరిగిందేమిటో మీరు ఆలకించాలి..." అంటూ సముదాయించబోయాడు.

"అనుమతి లేకుండా ఘంటికను మోగించి, అనుమతి లేకుండానే గజశాలలోని గున్నని అవతలికి తరలించి రాజద్రోహం చేశాడు వాడు. ముందు అందుకు శిక్ష పడాలి" ఎర్రబడిన కనులతో క్రూరంగా శివుడికేసి చూశాడు సాగరులవారు.

"తల్లి తండ్రి లేని వాడివని నీమీద ఎంతో కరుణ చూపించాము. నువ్వు ఆ భావాన్ని మా చేతకానితనంగా భావించి హద్దులు మీరి ప్రవర్తించావు. మూడురోజుల పాటు తిండితిప్పలు లేకుండా నగరం వెలుపల చంద్రుడి గుట్టమీద నిన్ను స్తంభానికి కట్టి వుంచుతాము. చేసిన తప్పుల్ని తలుచుకుని నువ్వు పశ్చాత్తాపపడాలి. తిరిగి అటువంటి అపరాధాలు చేయకూడదు" అంటూ శిక్షను ప్రకటించాడు.

"ప్రభూ... దయచేసి నా మాటను కొంచెం ఆలకించండి" గట్టిగా అరిచినట్టు పెద్దగా మాట్లాడాడు మహేశ్వరుడు.

శాంతించలేదు సాగరుల వారి ఆగ్రహం. "మా కర్ణేంద్రియాలు సరిగానే పని చేస్తున్నాయి. మీరు గొంతు చించుకోవలసిన అవసరం లేదు. చెప్పండి" కోపంగానే అన్నాడు.

దగ్గరికి పోయి శివుడు చారులతాదేవికి చెప్పినవన్నీ తిరిగి సవివరంగా ఆయన చెవిలో ఊదాడు మహేశ్వరుడు.

"మిమ్మల్ని కలుసుకుని, మీతో చెప్పటం కోసమే రహస్యమార్గం గుండా నగరంలోకి వచ్చాడు వాడు. ఆకలి అధికం అవటం వల్ల వంటశాలలోకి దూరి పట్టుబడిపోయాడు" అని ముగించాడు.

"వాడిని చూసి మనకి పట్టించింది ఎవరు?" అడిగాడు సాగరులవారు.

"వంట పాత్రలను శుభ్రం చేసే పనిమనిషి వాడిని చూసి కేకలు పెట్టింది. కిటికీలోంచి చెట్టుకొమ్మ మీదికి దూకుతుండగా చిన్న కట్టెపేడును విసిరింది. అది తగిలి వీడు కిందపడిపోయాడు" చెప్పాడు మహేశ్వరుడు.

"చెట్టుకొమ్మమీది నుంచి పడినా వీడికి పెద్దగా దెబ్బలు తగిలినట్లు కనిపించటంలేదు. ఎందుకిలా?" అడిగారు సాగరులవారు.

పడిపోతున్న తనను ఎవరో గాలిలో వుండగానే పట్టుకుని, అతి నెమ్మదిగా నేలమీదికి దించినట్టు శివుడికి తెలుసు. ఆ పని చేసింది ఎవరో మాత్రం అతనికి అవగతం కావటం లేదు. ఆ విషయాన్నీ సాగరుల వారికి చెప్పాలో వద్దో అతను నిర్ణయించుకోకముందే-

"ఇక ఈ విషయంలో వాద ప్రతివాదనలు అనవసరం. వాడు వట్టి దుడుకుపిండం. వీడు చేసేవి అన్నీ దుర్మార్గపు పనులే. ఇంతకుముందు వీడి అయ్యవారు చెప్పినట్లు, కాకతాళీయంగా ఏదో కొంత మంచి జరుగుతున్నా ఆ మంచికి ముందు మాత్రం మనకే మహా శిరోభారం తప్పటంలేదు. తీసుకుపోయి శిక్షను అమలుచేయండి" అంటూ సింహాసనం మీదినుంచి లేచాడు సాగరులవారు.

సభా భవనంలో నుంచి పూర్తిగా వెలుపలికి పోకముందే ఆదరాబాదరాగా ఎదురువచ్చింది చారులతాదేవి.

"కల్పించుకోవద్దు దేవీ... ఈ విషయంలో నువ్వు జోక్యం చేసుకోవద్దు. మా నిర్ణయానికి తిరుగులేదు. అంతే" ఖచ్చితమైన కంఠంతో చెప్పి ఆమె సమాధానానికి ఎదురుచూడకుండా ముందుకు వెళ్ళిపోయాడు సాగరులవారు.

తల వంచుకు నిలబడి వున్న శివుడివంక చూడగానే చెమ్మగిల్లాయి చారులతదేవి కనులు.

"అరేయ్ శివుడూ... అసలు నువ్వు ఆ ఏనుగు గున్నని ఎందుకు బయటికి తీసుకుపోయావు?" ఆమె హృదయంలోని ఆవేదనని గమనించి చిన్నగా శివుడిని అడిగాడు వైద్యశిఖామణి విరూపాక్షుడు.

"అడవిలో ఆ గున్న తల్లి ఎంతో బాధపడుతోంది. గున్న కూడా తల్లికోసం బెంగ పెట్టుకుంది. చూడలేకపోయాను. ప్రభువులకు చెప్పినా కూడా వినిపించుకోలేదు. నేను ఘంటికను మోగించి, కలకలం రేపి ఆ సందడి మధ్య గున్నని బయటికి తీసుకుపోయాను" వంచిన తల ఎత్తకుండా చెప్పాడు శివుడు.

"ఇప్పుడు ఆ పిల్ల ఎక్కడ వున్నది?" అడిగాడు మహేశ్వరుడు.

"దాని తల్లికి అప్పగించాను. అడవిలోకి తీసుకుపోయింది. నేను వెనక్కి వస్తుంటే ఆ దృఢకాయులు కనిపించారు. వాళ్లు కొంకిణి గ్రామంలో గొడవ చేయాలని అనుకోవటం వినిపించి వారి వెనుకే వెళ్ళాను" అంటూ జరిగింది చెప్పాడు శివుడు.

చెమరుస్తున్న కళ్ళతో శ్రద్ధగా వింటున్న చారులతాదేవి చప్రున తల ఎత్తి తీక్షణంగా చూసింది మహేశ్వరుడి వంక.

"పదిమందికి పైగా గూఢచారులున్నారు మన నగరంలో. గూఢచర్యంలో జ్వలిత సామ్రాజ్యం మొత్తంమీద సాటిలేని మేటిగా పేరుపొందిన వాసుదేవుడు మన నగరం వాడే. వారెవరూ చేయలేని పనుల్ని వారెవరూ తెలుసుకోలేని రహస్యాల్ని వీడు తెలుసుకున్నాడు. తెలుసుకోవటమే కాదు... వాటికి విరుగుడు చర్యల్ని కూడా చేపట్టి చూపించాడు. మెచ్చి బహుమానాలు ఇవ్వవలసింది పోయి నగరం వెలుపల కొరత వేయిస్తారా? మీరు న్యాయాధిపతులా?" కణకణమంటున్న కంఠంతో వేగంగా అడిగింది.

"నన్ను క్షమించాలి తల్లీ... సాగరుల వారి ఆజ్ఞల్ని కాదనే శక్తి నాకులేదు. వాడు వట్టి దుడుకు పిండమనే భావన వారిలో బలంగా పాతుకుపోయింది" తలవంచుకుని చెప్పాడు మహేశ్వరుడు.

మరోసారి తీక్షణంగా చూసి, గిరుక్కున వెనుతిరిగి వెళ్ళిపోయింది చారులతాదేవి.

❖ ❖ ❖

సూర్యుడు నడిమింటిని చేరుకుంటున్న సమయంలో శ్రావస్తి నగర పొలిమేరను దాటి సంపంగి నగరం చుట్టూ వుండే అడవి మొదట్లోకి చేరుకున్నది యువరాణి జ్వాల కూర్చుని వున్న అశ్వ శకటం. దానివెనకే వచ్చింది ఆమె వెంట తెచ్చుకుంటున్న మందసాలను మోస్తున్న బండి.

వెడల్పుగా విస్తరించి వున్న ఒక పెద్ద జువ్విచెట్టు దగ్గర ఆ శకటాలను ఆపించారు ముందు కాపలాగా వస్తున్న భటులు.

"వంటలు చేసుకుని భోజనాలు ముగించుకుని తిరిగి ప్రయాణం మొదలుపెడితే చీకటిపడే సమయానికి సగం దూరం వెళ్ళిపోతాము. " కిందికి దిగి చుట్టూ చూస్తున్న జ్వాలకి చెప్పాడు ఒక భటుడు.

"గాలిలో ఎగిరేందుకు రెక్కలే గనుక వుండివుంటే ఇప్పటికిప్పుడు మా అత్తయ్య దగ్గరికి వెళ్ళిపోవచ్చనిపిస్తోంది నాకు. గతుకుల దారిలో ప్రయాణం మహా రోతగా వున్నది" అన్నది జ్వాల.

"అడవిదారి ఇంకా కొంచెం అసహ్యంగా వుంటుంది తల్లీ... ఓర్చుకోక తప్పదు" నవ్వుతూ చెప్పి, రెండో బండిలో వున్న వంటపాత్రలను కిందికి దింపించి వంటలు చేయించే పనిలో నిమగ్నమైపోయాడు ఆ భటుడు.

తన చెలికత్తెలను అతనికి సహాయం చేసేందుకు పంపించి, తాను వంటరిగా చుట్టూ వున్న పరిసరాల్ని పరిశీలించేందుకు బయలుదేరింది జ్వాల.

"దూరంగా పోకండి యువరాణీ... క్రూర జంతువులుంటాయి. విషపు జీవులు కూడా చాలా అధికం..." పెద్దగా అరిచి ఆమెను హెచ్చరించాడు ఆ భటుడు.

ఆ మాటలు తనకు వినబడనట్లు నటిస్తూ ముందుకు ముందుకు వెళ్ళిపోయింది జ్వాల. వున్నట్లుండి ఒక చల్లటి గాలితెమ్మెర ఆమె మొఖానికి తగిలి ఎంతో హాయిగా అనిపించింది.

అద్భుతమైన సువాసనల్ని మోసుకు వచ్చింది తెమ్మెర. రెండుసార్లు ఆ వాసనను గమనించగానే తెలిసిపోయిందామెకు... దగ్గర్లోనే ఎక్కడో చకోర పుష్పాలు కనిపిస్తాయని.

ఎంత వద్దని అనుకున్నా ఆగకుండా, ఆ సువాసనలు వస్తున్న వైపే కదిలాయి ఆమె పాదాలు. రెండువందల ధనువుల దూరం కూడా పోకముందే

ఆమెకు అగుపించారు పెద్దచెట్టుక్రింద కూర్చుని వున్న ఆగంతకులు కొంతమంది.

"ఎవరు నువ్వు? కాకులు కూడా దూరలేని ఈ కారడవిలో వంటరిగా తిరుగుతున్నావేమిటి? ఎక్కడినించి వచ్చావు? ఎక్కడికి పోతున్నావు?" ఆమె వారిని చూసిన సమయంలోనే వాళ్ళుకూడా ఆమెను గమనించారు కాబోలు... వెంటనే లేచి ఎదురువస్తూ అడిగాడు ఒక ఆగంతకుడు.

"నేను ఎవరినో తర్వాత చెపుతాను. ముందుగా మీరెవరో చెప్పండి? ఏం చేస్తున్నారు ఇక్కడ?" ఠక్కున ఎదురు ప్రశ్న వేసింది జ్వాల.

"చకోర పుష్పాల కోసం వచ్చాము. వాటినిండా పాములుండే సరికి ఏం చెయ్యాలో తెలియక ఇక్కడ కూర్చున్నాము" తడుముకోకుండా చెప్పాడు ఆ ఆగంతకుడు.

మనసుకు ఎంతో ఆహ్లాదాన్ని పంచే చకోర పుష్పాల దగ్గర విషపు జీవులు వుంటాయని అప్పుడు గుర్తుకు వచ్చింది జ్వాలకి. ఆ విషయాన్ని మరచిపోయి తాను వంటరిగా అటుకేసి రావడం తప్పనికూడా అర్థం అయింది. అయినా వెంటనే వెనక్కి తిరిగింది ఆమె.

"ఏయ్... ఆగు... మా ప్రశ్నలకు సమాధానం చెప్పకుండా వెళ్ళిపోతే మేము ఊరుకోము" అంటూ వేగంగా కదిలి ఆమె దారికి అడ్డంగా నిలబడ్డాడు ఆ ఆగంతకుడు.

కోపంతో ఎరుపెక్కాయి జ్వాల కనులు. పళ్ళు బిగించి, చాచిపెట్టి అతని చెంపమీద కొట్టిందామె.

"జ్వలిత చక్రవర్తి మహాబలుడి కుమార్తెను నేను. జ్వలిత సామ్రాజ్యానికి కాబోయే మహారాణిని. నా దారినే అడ్డుకుంటావా? ఎంత ధైర్యం నీకు?" అంటూ మళ్ళీ ముందుకు అడుగు వేయబోయింది.

ఛెళ్ళుమన్న చెంపను అదుముకుంటూ బొమ్మలా నిలబడిపోయిన ఆగంతకుడిలో వెంటనే వచ్చింది చలనం.

"రండి... అందరూ రండి... ఈ అమ్మాయి జ్వలిత దేశపు యువరాణిట. నిజమో కాదో తేల్చుకుందాం..." అంటూ చేతుల్ని వెడల్పుగా జాచి మళ్ళీ జ్వాలని అడ్డుకున్నాడు.

చెట్టుక్రింద కూర్చుని వున్న ఆగంతకులు అందరూ చటుక్కున లేచి నిలబడటాన్ని కనుచివరల నుంచి చూస్తూ మరోసారి తనను అడ్డుకుంటున్న ఆగంతకుడి మీదికి పిడికిళ్ళను విసిరింది జ్వాల.

ఈసారి ఆమె చేతుల్ని వెంటనే అడ్డుకున్నాడు అతను. "రండి... త్వరగా రండి" అంటూ తనవారిని మరోసారి హెచ్చరించాడు.

త్వరపడకపోతే ప్రమాదం వున్నదని తెలిసిపోయింది జ్వాలకి. కంటికి కనిపించనంత వేగంతో తన దుస్తుల్లో దాచుకుని వున్న ఒక పచ్చల బాకును బయటికి లాగి ఆ ఆగంతకుడి మొఖంమీద బలంగా ఒక పోటు పొడిచింది.

బాధతో విలవిలలాడిపోతున్నా, చిన్నపాటి శబ్దంకూడా చేయలేదతను. పట్టుదలగా పళ్ళు బిగించి ఒక చేత్తో ఆమె చేతుల్లోని బాకును ఎగరగొట్టేశాడు. రెండవ చేత్తో ఆమె జుట్టును పట్టుకోబోయాడు.

వేగంగా వచ్చేశారు అతని సహచరులు. చుట్టూ గుమికూడి వెనుకనుంచి ఆమె చేతుల్ని విరిచిపట్టుకోబోయారు.

అంతవరకూ ఎంతో ధైర్యంగా వున్న జ్వాలని ఒక్కసారిగా అధైర్యం ఆవరించుకుంది. ఆగంతకుల్ని చూసిన వెంటనే బిగ్గరగా అరిచి తమ భటుల్ని పిలవటమో, లేక తానే వెనక్కి వెళ్ళిపోవటమో చెయ్యకుండా నిశ్శబ్దంగా వుండిపోవటం తప్పని తెలిసివచ్చింది.

ఆ తప్పును దిద్దుకునే అవకాశం కూడా ఆమె చెయ్యి దాటిపోయింది. "ఇంత అందమైన అమ్మాయి వంటరిగా రాదు. వెంట ఎవరో ఒకరు వచ్చే వుంటారు. అరిచిందంటే వాళ్ళకు వినబడుతుంది. నోటిని అదిమేయండి" అంటూ తనే ఆ పని చేయటానికి సిద్ధం అయ్యాడు బాకు దెబ్బను భరించిన ఆగంతకుడు.

తన నోటిని అదమబోయిన అతని చేతిని గట్టిగా కొరికింది జ్వాల. అదిరిపడి అతను చేతిని వెనక్కి తీసుకోగానే ఎడమపాదంతో అతని మోకాలి మీద బలంగా ఒక దెబ్బ కొట్టింది.

మోకాలు విరిగిపోయినంత బాధతో అతను నేలమీదికి వాలిపోవటాన్ని చూసి ఒక్క క్షణికంపాటు నిశ్చేష్టులైనారు అతని అనుచరులు.

ఆ ఒక్క క్షణికంలోనే మరో వ్యక్తిని బలంగా అవతలికి నెట్టి ఒక్కసారిగా పరుగు మొదలుపెట్టింది జ్వాల.

పరిగెత్తుతూనే “భటులారా... ప్రమాదం... రండి... త్వరగా రండి” అంటూ బిగ్గరగా కేకలు పెట్టింది.

తన కేకలు తనవారికి వినిపించాయో లేదో ఆమెకు తెలియలేదు. తెలుసుకునేందుకు వ్యవధి కూడా ఆమెకు లభించలేదు.

“పట్టుకోండి... పారిపోనీయకండి” అని ఒకరికొకరు హెచ్చరించుకుంటూ ఆమెవెంట పడ్డారు ఆగంతకులు అందరూ... మోకాలుదెబ్బతిన్న వారి నాయకుడితో సహా.

వారికి పట్టుబడకుండా వుండటంకోసం మరింత వేగంగా పరిగెత్తింది జ్వాల. తనకు ఆ దుస్థితి దాపురించటానికి కారణమైన చకోర వృక్షాలు ఒక పక్కగా కనిపించినా ఆగలేదు. ఆ తరువాత మరో రెండువందల ధనువుల దూరం పోయిన తర్వాత దారికి అడ్డుగా ప్రత్యక్షమైంది అతివేగంగా ప్రవహించే సువర్ణా నది.

ఆగలేదు జ్వాల. ఆలోచించుకోలేదు. అమాంతంగా గాలిలోకి ఎగిరి ఒక్కసారిగా నీటిలోకి దూకింది.

పదే పది క్షణికాల్లో ఆ ప్రదేశంలోకి వచ్చేశారు ఆగంతకులు అందరూ. అప్పటికే ఇరవై నాలుగు విండ్ల దూరం వెళ్ళిపోయింది జ్వాల. వారందరూ చూస్తూ వుండగానే నీటిలో మునిగి అదృశ్యం అయిపోయింది.

❖ ❖ ❖

ఝల్లుమన్నది సాగరుల వారి శరీరం. గుండెలు వేగంగా కొట్టుకోవడం మొదలుపెట్టాయి. “ఎప్పుడు జరిగింది ఇది? ఎలా జరిగింది? ఏం చేస్తున్నారు మీరందరూ?” బిగ్గరిగా అరుస్తున్నట్లు అడిగాడు.

అంతకుముందు రోజు మధ్యాహ్నం నుండి, చీకటి పడిన తర్వాత కూడా ఎక్కడా ఆగకుండా ఆ రోజు ఉదయానికి నగరంలోకి వచ్చిన భటుడు నిస్పృహ గా తల విదిలించి అడవిలో జరిగినదంతా వివరంగా చెప్పాడు మరోసారి.

“పరిసరాల్ని పరికించటానికి పోయింది యువరాణి... ప్రమాదం ప్రమాదమని కేక వినపడింది. పోయి వెతికాము... ఎక్కడా కనిపించలేదు... మా వాళ్ళందరూ ఇంకా వెతుకుతూనే వున్నారు. విషయం మీకు తెలియ చేసేందుకు నన్ను పంపించారు.”

కళ్ళు గిర్రున తిరిగి కిందపడిపోతున్న అనుభూతి సాగరుల వారికి కలిగింది. సింహాసనాన్ని గట్టిగా పట్టుకుంటూ మహేశ్వరుడి కేసి చూశాడు ఆయన.

ఆజ్ఞల కోసం ఎదురుచూడకుండా చకచకా ఏర్పాట్లు చేసేస్తున్నాడు మంత్రి మహేశ్వరుడు. "వందమంది భటులు అడవిలోకివెళ్ళి జట్లు జట్లుగా అన్ని దిక్కులను గాలించండి. ఇంకో వందమంది అడవిలోని గ్రామాల ప్రజలందరినీ హెచ్చరించండి. రేపు సాయం సమయంలోగా యువరాణీ వారి జాడలు మనకు తెలిసి తీరాలి."

క్షణం కూడా ఆలస్యం చేయకుండా కదిలారు భటులు అందరూ. వేగంగా పరిగెత్తే అశ్వాల మీద అడవికేసి దూసుకుపోయారు.

"జాడలు కనిపిస్తాయంటావా మహేశ్వరా? యువరాణిని తిరిగి క్షేమంగా చూడగలమంటావా?" దిగులు నిండిన కంఠంతో మహేశ్వరుడిని అడిగాడు సాగరులవారు.

"ప్రయత్నిద్దాం ప్రభూ... ప్రయత్నం చేద్దాం... పనిచేయటం మొదలు పెట్టీ పెట్టగానే ఫలితంకోసం ఎదురు చూడటం తప్పుకదా?" అన్నాడు మహేశ్వరుడు.

యువరాణి కనిపించటం లేదనే మాటను వినగానే చక్రవర్తి మొఖంలో ఎటువంటి మార్పులు వస్తాయో ఊహించటానికి ప్రయత్నం చేశారు సాగరుల వారు. ఫలించలేదు ఆ ప్రయత్నం.

"నాకు చాలా భయంగా వుంది మహేశ్వరా... ఈ సంఘటన కారణంగా ఎటువంటి ఇబ్బందులు వచ్చిపడతాయో అర్థం కావటంలేదు" నీరసంగా చెప్పాడు.

"అనవసరమైన ఊహలు చేయవద్దు ప్రభూ... ముందు మీరు అంతఃపురానికి దయచేసి దేవిగారికి చెప్పండి. ఆమెను సముదాయించండి. ఆ తర్వాత చేయవలసిన పనిని గురించి చెప్పాడు మహేశ్వరుడు. అంతటితో ఆగలేదతను. "విరూపాక్షుడికి కూడా వర్తమానం పంపించండి... యువరాణి అంటే దేవిగారికి వల్లమాలిన అభిమానం. ఈ విషయాన్ని ఆమె తట్టుకోలేకపోవచ్చు. వైద్య సహాయం అవసరం కావచ్చు" అనికూడా అన్నాడు.

"ఆ పనేదో నువ్వే చేయి. మాకు మనసంతా గందరగోళంగా వున్నది" అంటూ సింహాసనం మీద నుంచి లేచారు సాగరులవారు.

సరిగ్గా అదే సమయంలో సభా భవన ద్వారం దగ్గర ప్రత్యక్షం అయ్యారు ఇద్దరు భటులు. "ప్రభూ! ప్రచోదనగరం నుంచి ఒక మనిషి వచ్చి తమ దర్శనాన్ని ఆపేక్షిస్తున్నారు" నిలబడిన ప్రదేశంలో నుంచి కదలకుండా తలలు వంచి నమస్కరించిన తర్వాత చెప్పారు.

అన్యమనస్కంగా తల ఊపబోయి నిప్పులమీద కాలు వేసినట్లు ఉలిక్కి పడ్డాడు సాగరులవారు.

"ప్రచోదనగరమా? ప్రచోద నగరమేనా? మీరు సరిగ్గా వినిపించు కున్నారా?" రెట్టించి అడిగాడు.

"వినిపించుకున్నాము ప్రభూ! ఆ మనిషి మరెవరో కాదు... మన గూఢచారి శుశ్రుతుడు" మరింత వినయంగా చెప్పారు వాళ్ళు.

అంతఃపురం కేసి బయలుదేరబోతున్న సాగరుల వారు వెంటనే ఆ ప్రయత్నాని విరమించుకుని, తిరిగి సింహాసనం మీద కూర్చుంటూ మహేశ్వరుడి కేసి చూశాడు.

"శుశ్రుతుడు అత్యవసరంగా మీ దర్శనం అడిగాడంటే అందుకు ఏదో బలమైన కారణం వుండే వుంటుంది. వెంటనే పిలిపించండి" అన్నాడు మహేశ్వరుడు.

తల వూపాడు సాగరులవారు. ఆ మనిషిని వెంటనే ప్రవేశపెట్టమన్నట్టు చేతిని కూడా ఆడించాడు.

గిరుక్కున వెనుతిరిగి ద్వారం వెలుపలికి వెళ్ళిపోయారు ఆ భటులు. అర నిమిషం తరువాత సన్నగా బక్కపలుచగా వున్న ఒక పొడుగాటి మనిషిని లోపలికి పంపించారు.

చాలాదూరం నించి అదేపనిగా ప్రయాణం చేసి వస్తున్నట్టు అలసటతో నిండి వుంది అతని మొఖం. దుమ్ము ధూళితో మలినపడి వున్నాయి దుస్తులు.

"మంచినీరు తీసుకువచ్చి దాహం తీర్చండి. కడుపులో దండిగా వుండటం కోసం మరగకాచిన గోక్షీరాన్ని తెచ్చి ఇవ్వండి. ఆహారం తీసుకుని చాలారోజులు అయినట్లు కనిపిస్తోంది ఇతని వాలకం" అతన్ని చూసిన వెంటనే భటులకు ఆజ్ఞ ఇచ్చాడు మహేశ్వరుడు.

కృతజ్ఞత నిండిన కనులతో అతనివంక చూసి చిరునవ్వు నవ్వాడు ఆ మనిషి. "మీ అంచనా నూటికి నూరుపాళ్ళు నిజం. ప్రచోద నగరం విడిచిపెట్టిన క్షణం నుంచీ నేను ఆహారం తీసుకోలేదు. నీరు కూడా సరిగ్గా తాగలేదు. ఎంత త్వరగా సాగరులవారి దర్శనం చేసుకోగలిగితే అంత మంచిదన్న ఉద్దేశ్యంతో ప్రయాణం చేస్తూ వచ్చాను" అంటూ క్షణికం పాటు ఆగి, "ఇక్కడికి వచ్చిన తర్వాత తెలిసింది యువరాణి వారిని గురించి…" అని ముగించాడు మాటల్ని.

పెద్ద పాత్రనిండా చల్లని నీటిని, మరో పాత్ర నిండుగా వెచ్చటి గోక్షీరాన్ని తీసుకువచ్చి అతనికి అందించారు సభా భవనంలోనే నిలబడివుండే సేవకులు.

నీటిని తాగి, క్షీరాన్ని సేవించేదాకా ఆగి "ఇప్పుడు చెప్పు" అంటూ అతన్ని ప్రోత్సహించాడు మహేశ్వరుడు.

ప్రచోద నగరం అంటే జ్వలిత సామ్రాజ్యానికి పరమశత్రువైన శిఖావంతుడికి రెండవ రాజధాని వంటిది. సంవత్సరంలో ఆరేడు మాసాలు ఆ నగరంలోనే నివశిస్తూ వుంటాడు శిఖావంతుడు. తన శత్రువులను ఎలా నాశనం చెయ్యాలో, వారిమీద పగ తీర్చుకోవటానికి ఎటువంటి పథకాలు రచించాలో అన్నీ ఆ నగరంలో వుండగానే ఆలోచిస్తూ వుంటాడు.

"చాలా త్వరలోనే శిఖావంతుడు మన రాజ్యంమీద దండయాత్ర మొదలు పెడతాడు. సైన్య సమీకరణ పూర్తి అయింది. సైన్యానికి కావల్సిన ఆహార పదార్థాలు సంబారాలు అన్నీ సేకరించి సిద్ధంగా వుంచబడ్డాయి" సాగరుల వారికి చెప్పాడు శుశ్రుతుడు.

"ఎప్పుడు ప్రారంభం చేస్తాడో ఖచ్చితంగా తెలిసిందా?" అడిగాడు సాగరుల వారు.

"అది ఎవరికీ తెలియలేదు… అతనికి ఒక్కడికే తప్ప. కాని ఆ దండయాత్ర మొదలుపెట్టే లోపల ఒక మహాకార్యాన్ని పూర్తిచేయాలని అతను వాంఛిస్తున్నాడు" అన్నాడు శుశ్రుతుడు.

"ఏమిటా మహాకార్యం?" ఆశ్చర్యంగా అడిగాడు సాగరుల వారు. ఆయన భయం ఆయనది… అడవిలో యువరాణి కనిపించకుండా పోవడమే ఆ మహాకార్యమా? అతను పన్నిన పన్నాగం కారణంగానే యువరాణి అదృశ్యమయిందా?

ఆ మాట మనస్సులో మెదిలిన వెంటనే రెట్టింపు అయింది ఆయన హృదయంలోని బాధ.

లేక లేక కలిగిన సంతానం... పుట్టీ పుట్టగానే తల్లిని కోల్పోయిన యువరాణి అంటే చక్రవర్తికి ఆరోప్రాణం. ఆమె కనిపించకుండా పోయిందంటే నిశ్చేష్టుడై పోతాడాయన. గుంటనక్క కంటె వెయ్యిరెట్లు తెలివైన శిఖావంతుడి దౌర్జన్యాలను సమర్థవంతంగా ఎదుర్కోలేడు.

సాగరుల వారి అంతరంగంలోని ఆవేదన ఏమిటో తనకు అర్థం అయినట్లు సానుభూతిగా తలవూపి "మీరు అనుకుంటున్నది కానే కాదు ప్రభూ... యువరాణి అంతరార్థం కేవలం యాదృచ్ఛికం మాత్రమే. అది శిఖావంతుడి పని కాదు. అతని పని ఏమిటంటే..." అంటూ మాటల్ని ఆపాడు శుశ్రుతుడు.

విసుగు వచ్చేసింది మహేశ్వరుడికి. "నీటి చెలమలో నీరు ఊరినట్లు ఆగి ఆగి మట్లాడటం నీకు శుభస్కరం కాదు... చెప్పదలచుకున్నది ఏమిటో త్వరగా బయల్పరచు. ఆలస్యం వద్దు" కసురుకుంటున్నట్టు వేగంగా అన్నాడు.

"చక్రవర్తి బలగాలకు అమోఘమైన రక్షణ కల్పించే సంపంగి నగర గజ దళాన్ని నాశనం చేయటమే శిఖావంతుడి లక్ష్యం...తాను దండయాత్ర మొదలు పెట్టే లోపలే ఇక్కడ వున్న ఏనుగులన్నిటినీ నాశనం చేయాలని సంకల్పించాడు. తనకు అతి నమ్మకస్తులయిన ఆగంతకులను కొందరిని ఇక్కడికి పంపకం చేశాడు. ఈ మాట తెలిసిన వెంటనే నేను ఆలస్యం చేయకుండా ఆఘమేఘాలమీద వచ్చేశాను" అంటూ పూర్తిచేశాడు మాటల్ని శుశ్రుతుడు.

నోరు తెరుచుకుని చూశాడు మహేశ్వరుడు. చాలా దారుణమైన బాధలో వున్న సాగరుల వారైతే అంత పెద్ద బాధను మరచిపోయినట్లు చిన్నగా నవ్వేశాడు.

తను తీసుకువచ్చిన సమాచారాన్ని విన్న వెంటనే తీవ్రమైన ఆందోళనకు గురి అవుతారని, అప్పటికప్పుడు సైనికులందరినీ పిలిచి తీవ్రాతి తీవ్రమైన ఆజ్ఞలు జారీ చేస్తారని అనుకున్నాడు శుశ్రుతుడు. అటువంటి పని ఏమీ జరుగకపోగా తాను చెప్పింది తనకు ముందే తెలిసినట్లు-

"విన్నారు కదా ప్రభూ... దేవిగారు నెత్తి బాదుకుని ముందుగానే చెప్పారు. మీరు వినిపించుకోలేదు" సాగరులవారితో అన్నాడు మహేశ్వరుడు.

"నేను తొందర పడ్డానంటావా?" అడిగాడు సాగరులవారు.

"నిస్సందేహంగా..." తడుముకోకుండా అన్నాడు మహేశ్వరుడు.

"మరి వాడు ప్రమాద ఘంటికను మోగించి ఏనుగు గున్నని బయటికి తరలించటం?" ప్రశ్నించాడు సాగరులవారు.

"మమ్మాటికీ అపరాధమే... అయితే వాటిని ఎందుకు చేయవలసి వచ్చిందో తెలుసుకున్న తర్వాత మాత్రమే ఆ అపరాధాల తీవ్రతను మనం అంచనా వెయ్యాలి. ఆ విషయంలో తప్పటడుగు వేశాము. దేవిగారు చెపుతూనే వున్నారు. అయినా వినిపించుకోలేదు మనం" అన్నాడు మహేశ్వరుడు.

తను కూడా శాంతించమని, శాంతంగా ఆలోచించమని సాగరుల వారికి చెప్పిన మాటల్ని తిరిగి గుర్తు చేయలేదతను. అసలు శివుడికి శిక్ష విధించమని సూచించింది తనే అన్నట్లు మొఖం పెట్టాడు.

కొద్దిగా ఉపశమించింది సాగరుల వారి అంతర్మథనం. "ఏది ఏమయినా పాపం వాడిపట్ల మనం నిరంకుశంగా ప్రవర్తించాము. చంద్రుడి గుట్టమీద మండుటెండలో మలమలమాడుతూ, తిండికోసం అలమటిస్తూ వుండి వుంటాడు. ముందు వాడిని వెంటనే నగరంలోకి తీసుకురావాలి" అన్నారాయన.

అటువంటి మాటల్ని రెండవసారి చెప్పించుకునే అలవాటు మహేశ్వరుడికి లేదు. రెండోమాట మాట్లాడకముందే గిరుక్కున వెనుతిరిగి, సభాభవనం వెలుపలికి పోయాడు.

భవన ద్వారానికి పాతిక అడుగుల దూరంలో నిలబడి అతి శ్రద్ధగా గమనిస్తోంది లోపల జరుగుతున్న విషయాలను చారులతాదేవి గారి పరిచారిక ఒకర్తె.

"దేవిగారు ఎక్కడ?" చూసినవెంటనే అడిగాడు మహేశ్వరుడు.

"అంతఃపురంలో..." ముక్తసరిగా చెప్పిందామె.

"నువ్వేం చేస్తున్నావిక్కడ?" నొసలు ముడిచి చూస్తూ అడిగాడతను.

"దేవిగారు నిలబడమని చెప్పారు. నిలబడ్డాను."

ఆ పైన ఆమె నోటివెంట మరొక్కమాట కూడా వెలువడాల్సిన అవసరం లేకుండానే సర్వం అవగతమైపోయింది మహేశ్వరుడికి.

అంతఃపురంలో లేరు చారులతాదేవి. తన పరిచారికలను కొందరిని వెంటబెట్టుకుని సాగరుల వారి అనుమతి తీసుకోకుండానే ఎక్కడికో పోయింది. సాగరుల వారు అంతఃపురంలోకి విజయం చేయాలని అనుకున్నా, తమతో మాట్లాడాలన్న కోరికను వెలిబుచ్చినా, వెంటనే తమకు వర్తమానం అందించడం కోసం ఆ పరిచారికను అక్కడ కాపలాగా నిలబెట్టింది.

అంతదూరం ఆలోచించగలిగిన మహేశ్వరుడికి ఆమె అంతఃపురాన్ని వదిలి ఎక్కడికి వెళ్ళిందో ఊహించటం ఏమంత కష్టం కాలేదు. తనలో తను నవ్వుకుంటూ, తను చేసిన సైగను చూసి ఒక భటుడు తన దగ్గరికి తీసుకు వచ్చిన అశ్వం మీదికి ఎగిరాడు అతను. కాలి మడమలతో దాని శరీరాన్ని అదిమి, వేగంగా పరుగులు తీయించాడు.

❖ ❖ ❖

"... మీరు వెంటనే ముందు జాగ్రత్తలు తీసుకోవాలి ప్రభూ..." అర్థాంతరంగా వెళ్ళిపోయిన మహేశ్వరుడు ఎందుకలా చేశాడో అర్థంకాక సాగరులవారి వంక అయోమయంగా చూస్తూ అన్నాడు శుశ్రుతుడు.

"అలాగే... నువ్వు ఒక పని చెయ్యి. గజశాల దగ్గరికి పోయి, వెంటనే ఈ మాటల్ని అక్కడి నిర్వాహకుడికి వినిపించి, ఏ ఏ జాగ్రత్తలు తీసుకోవాలో అతనికి సూచించు" అన్నాడు సాగరులవారు.

"చిత్తం... తమరు నా మీద చూపించిన నమ్మకాన్ని వమ్ము చేయను. నా తెలివినంతా ఉపయోగించి అతనికి సహాయం చేస్తాను" అంటూ తనుకూడా బయటికి పరిగెత్తాడు శుశ్రుతుడు.

ఆ తరువాత నెమ్మదిగా వెలుపలికి వచ్చాడు సాగరుల వారు. వెలుపల నిలబడి వున్న పరిచారికను చూసీ చూడగానే చిన్ననవ్వు ఒకటి పరిగెత్తుకుంటూ వచ్చింది ఆయన పెదవుల మీదికి.

మహేశ్వరుడి మాదిరిగా దగ్గరికి పోయి మాట్లాడడం గాని, తన దగ్గరికి పిలిచి ప్రశ్నించటం గాని ఆయన చేయలేదు. భటులకు సైగచేసి, తన అశ్వాన్ని రప్పించుకున్నాడు. దాన్ని అధిరోహించి నగర ద్వారాల వైపుగా పోనిచ్చాడు.

❖ ❖ ❖

"ఎవరివి నువ్వు? ఎందుకు వచ్చావు? ఏమిటి పని?'' గజశాల ముఖద్వారం దగ్గర నిలబడి మూసి వున్న తలుపుల్ని అరచేత్తో తట్టిన శుశ్రుతుడిని అడిగింది ఒక కంఠం.

గజశాల నిర్వాహకుడి కంఠమే అదని వెంటనే గుర్తుపట్టి తానెవరో చెప్పుకున్నాడు శుశ్రుతుడు. ఎందుకు వచ్చిందీ వివరించాడు.

"నువ్వు తెలుసుకున్నది బ్రహ్మరహస్యమేమీ కాదు. మాకు ఎప్పుడో తెలిసింది. ప్రభువులు స్వయంగా వస్తే తప్ప తలుపులు తెరుచుకోవు. మా జాగ్రత్తల్లో మేమున్నాము. నువ్వు అనవసరంగా ఆవేదన చెందకు. వెళ్ళి విశ్రాంతి తీసుకో'' నిర్మొహమాటంగా అతనికి వివరించాడు గజశాల నిర్వాహకుడు.

"ఎలా తెలిసింది? ఎవరికీ తెలియదని అనుకున్న ఈ మాట నాకు కాకుండా ఇంకెవరికి తెలిసింది?" ఆశ్చర్యంగా అడిగాడు శుశ్రుతుడు.

"మా సాగరులవారి దగ్గర పెరిగి పెద్దవాడవుతున్న శివుడు ఎప్పుడో మాకు చెప్పేశాడు. ఆ దారుణం చెయ్యటానికి వచ్చిన వారిని కూడా అతను గమనించి పోలికలతో సహా వివరించాడు. నిన్నటినుంచీ నగరంలో సోదాలు జరుపుతున్నారు భటులు... త్వరలోనే వారిని పట్టుకుంటారు" చెప్పాడు గజశాల నిర్వాహకుడు.

గుండెలమీదినించి కొండంత బరువు దిగిపోయినట్లు తేలికగా నిట్టూర్చాడు శుశ్రుతుడు. ఆనందంగా వెనుతిరిగి గూఢచారులు విశ్రాంతి తీసుకోవటం కోసం ప్రత్యేకించబడిన భవనం దగ్గరికి వెళ్ళిపోవాలి. కాని అలా జరగలేదు.

ఎందుకనో కాంతివిహీనం అయింది అతని వదనం. టఅన్నీ తెలిసి కూడా నన్ను అటూ యిటూ పరుగులు పెట్టించారు. వెర్రివాడిని చేశారు. ఇదిచాలా అవమానం. భరించటం అసాధ్యం...' తనలో తను గొణుగుకుంటూ నెమ్మదిగా వెనుతిరిగాడు.

పది ధనువుల దూరం పోయిన తర్వాత నెమ్మదిగా అతన్ని అనుసరించటం మొదలుపెట్టారు గజశాలకు దగ్గర్లోనే వేయించి ఉప్పు కారం జల్లిన బటాణీలను అమ్ముకునే ఇద్దరు చిల్లర వర్తకులు.

❖ ❖ ❖

నగర ద్వారాలకు సరిగ్గా రెండు క్రోసుల దూరంలో వుంటుంది రెండు తాడి చెట్లంత ఎత్తుండే చంద్రుడి గుట్ట. చిన్నపాటి గడ్డిమొక్కలు కూడా కనిపించవు దానిమీద. గుట్ట మొత్తం పెద్ద పెద్ద రాతిబండలు పరుచుకుని వుంటాయి.

సూర్యకిరణాలు పడిన వెంటనే వేడెక్కడం మొదలుపెట్టి, మధ్యాహ్నా వేళకల్లా దారుణమైన సెగలు పొగల్ని వెలువరించడం ఆరంభిస్తాయి ఆ బండలు. పది నిమిషాల కంటే అధిక సమయం ఆ ప్రదేశంలో నిలబడడం అసాధ్యమైపోతుంది ఎవరికైనా.

అటువంటి బండల మధ్యన ఎత్తుగా ధ్వజస్తంభం మాదిరి పెరిగివుంది ఒకే నింబవృక్షం. ఆకులు చిన్నవే అయినా కొద్దిపాటి చల్లదనాన్ని, నీడను ఇస్తూ వుంటాయి దానిక్రింద నిలబడిన వారికి. ఆ వృక్షానికి రెండు విండ్ల దూరంలో మూడు నిలువుల ఎత్తున ఎదిగి కనిపిస్తూ వుంటాయి పాముల పుట్టలు.

పగటి సమయంలో సూర్యతాపానికి భయపడి తమ నెలవుల్ని వదిలి బయటికి రావు అందులో నివశించే విషపు పురుగులు. వచ్చినా నింబవృక్షపు నీడలో చుట్టలు చుట్టుకుని పడుకుంటాయేగాని, బండలమీదికి గాని, వాటి మధ్యలోకి గాని పొరపాటున కూడా పోవు.

అటువంటి భయంకరమైన వాతావరణంలో ఆ నింబ వృక్షానికి అంట గట్టబడి వున్నాడు శివుడు. చేతుల్ని వెనక్కి విరిచికట్టారు. పాదాలు కదలకుండా పెద్ద పెద్ద తాళ్ళతో బంధించారు.

తాను నగర ద్వారాల్ని అధిగమించి, ఆ గుట్టదగ్గరికి చేరుకునే సమయానికి శివుడి పని అయిపోయి వుంటుందనే భయపడింది చారులతాదేవి. పుట్టల్లోని విషపు జీవులు బయటికి వచ్చి అతన్ని కసితీరా కాటువేసి చంపటమో, ఆకలి దాహాలకు తట్టుకోలేక అతను కళ్ళు తేలవేసి ప్రాణాలు వదిలివుండడమో తప్పకుండా జరిగి వుంటుందన్న ఆలోచన ఆమెను తీవ్రంగా బాధపెట్టటం మొదలుపెట్టింది.

"శివుడికి ఏమీ కాదు తల్లీ... వాడు మామూలు మనిషి కాదు. గట్టిగా ఒక కర్రను పట్టుకుని ఊపితే దూరంగా పారిపోయే పాములు వాడిని ఏమీ

చేయలేవు... మీరు అనవసరంగా బాధపడకండి” ఆమెకు ధైర్యం చెప్పింది ఒక పరిచారిక.

“వెళుతున్నాము కదా తల్లీ... మీరే చూస్తారుగా ఆందోళన వద్దు” అన్నది రెండో పరిచారిక.

గుట్ట ముందు అశ్వశకటాన్ని ఆపించి క్రిందికి దిగింది చారులతాదేవి. పెద్ద పెద్ద అడుగులు వేస్తూ గుట్ట పైభాగంలోకి బయలుదేరింది.

మూడు నిలువుల ఎత్తున్న రెండు పెద్ద పెద్ద బండల్ని దాటి ఆవలికి పోయిన తర్వాత కనిపిస్తుంది గుట్టమీద వేపచెట్టు.

గుబగుబలాడుతున్న గుండెల్ని చిక్కబట్టుకుని ఆ బండల మధ్యలో నుంచే ముందుకు చూసింది ఆమె.

భయం కాదు ఆమెకు కలిగింది ఆశ్చర్యం. నడవాలన్న ఆలోచనను మరిచిపోయి పోతపోసిన విగ్రహంలా ఆ బండరాళ్ళ మధ్యనే నిలువబడి పోయింది.

“ఏమయింది తల్లీ... ఏమి జరిగింది?” ఆశ్చర్యం, ఆందోళన కలగలసిన కంఠంతో అడుగుతూ ఆమె భుజాలమీద నుంచి గుట్టమీద చెట్టువంక చూసి నిశ్చేష్టులైపోయారు పరిచారికలు కూడా.

చెట్టు మొదలుకు భటులు అంటకట్టినప్పుడు ఎలా వున్నాడో వీసమంత తేడా కూడా లేకుండా అలాగే నిలువబడి వున్నాడు శివుడు.

ఎండ వేడిమిని తట్టుకోలేక పుట్టల్లో నుంచి బయటికి వస్తున్నాయి పెద్ద పెద్ద పాములు. అయితే అవి చెట్టునీడలోకి రావడం చేతకాక తిరిగి పుట్టల్లోకి పారిపోతున్నాయి.

ఎందుకంటే తొండాలను గాలిలోకి ఎత్తి తమ పాదాలతో వాటిని పాతాళ లోకంలోకి పంపించేయటానికి సిద్ధంగా చెట్టు దగ్గర నిలబడి వున్నాయి మూడు ఏనుగులు.

బారెడు బారెడు దంతాలతో భయంకరంగా కనిపిస్తోంది మగ ఏనుగు. ఎర్రటి కళ్ళతో దానికంటె బీభత్సంగా వుంది ఆడ ఏనుగు. ఆ రెండింటి మధ్యకు నిలబడి తను కూడా పాముల్ని అణగదొక్కటానికి ఉత్సాహపడుతోంది గున్న ఏనుగు.

"మీరు చేసిన సాయం చాలు... భటులు ఎవరైనా వచ్చి మిమ్మల్ని చూస్తే తిరిగి వలలతో బంధించే ప్రయత్నం చేస్తారు. వెళ్ళిపొండి... నాకేమీ కాదు. నేను క్షేమంగానే వుంటాను" అంటూ వాటిని గుట్టమీదినించి పంపించేయటానికి విఫలయత్నం చేస్తున్నాడు శివుడు.

దగ్గరికి రాబోయిన ఒక పాము తలమీద చటుక్కున పాదం మోపి చితక తొక్కేసింది గున్న ఏనుగు. తన తల్లిదండ్రులు అంతవరకూ చేయలేని పనిని తాను చేయగలిగినందుకు గర్వపడుతున్నట్లుగా చిన్న ఘీంకారం చేసింది.

సరిగ్గా అదే సమయంలో తలను పక్కకు తిప్పి బండరాళ్ళ మధ్యన నిలబడి పోయిన చారులతాదేవిని చూసింది మగ ఏనుగు. చూసిన వెంటనే ఆగ్రహం అధికం అయిపోతున్నట్లు దారుణమైన శబ్దాలు చేస్తూ ఆమెకేసి కదిలింది.

అప్పుడు తనుకూడా గమనించాడు ఆమెను శివుడు. "ఆగు... ఆగిపో. ఆమె ఎవరనుకుంటున్నావు? మా అమ్మ... నాకు తల్లి... ఆగిపో" బిగ్గరిగా అరిచాడు.

ప్రత్యేకంగా శిక్షణ ఇచ్చి కొన్ని ప్రత్యేకమైన శబ్దాలను అలవాటు చేస్తే తప్ప మనిషి మాటను ఏనుగులు లక్ష్యపెట్టవని చారులతాదేవికి తెలుసు. కాని ఐరావతం వంటి ఆ ఏనుగు కాళ్ళకు బంధాలు పడిపోయినట్లు ఆగింది శివుడు అరిచిన అరుపును వినగానే.

"ఈ దరిద్రపు గొట్టు గుట్టమీదికి మీరు ఎందుకు వచ్చారు తల్లీ... ఈ ఏనుగులు వుండబట్టి సరిపోయింది గాని, ఏదో ఒక పాము తప్పకుండా మీ పైకి పడగను విసిరి వుండేది..." మొఖంమీది చెమట బిందువుల్ని తుడుచుకోవటానికి చేతులు బంధించి వుండటం వల్ల తలను విదిలిస్తూ అడిగాడు ఆమెను శివుడు.

"వాడి కట్లు ఊడదీయండి... త్వరగా" తన పరిచారికలకు ఆజ్ఞ ఇచ్చింది చారులతాదేవి.

క్రూరంగా చూస్తూ బొమ్మల్లా నిలబడి వున్న ఏనుగుల్ని కనుచివర్ల నుంచి గమనించుకుంటూ వేగంగా శివుడి దగ్గరికి పోయి చిటికెలో అతని బంధనాల్ని సడలించారు వాళ్ళు. తమ వెంట తీసుకువచ్చిన బుట్టలో నుంచి ఒక సొరకాయ బుర్రను అతనికి అందించారు.

తీసుకోవటమైతే తీసుకున్నాడు గాని, అందులోని నీటిని తాగి దాహాన్ని తీర్చుకునే ప్రయత్నం మాత్రం వెంటనే చేయలేదు శివుడు.

“తల్లీ... నిరాహార శిక్షను సాగరులవారు విధించారు...” అంటూ మొదలుపెట్టగానే కోపంగా చూసింది చారులతాదేవి.

“సాగరుల వారి సతీమణిని నేను ఆజ్ఞాపిస్తున్నాను. దాహం తీర్చుకో. నీకు ఇష్టమయిన తీపి వంటకాలు బుట్టలో వున్నాయి. ఆరగించి ఆకలిని అణచుకో” అన్నది.

గబగబా నీటిని తాగాడు శివుడు. బుట్టలో నుంచి పరిచారికలు తీసి ఇచ్చిన ఒక సుమధుర పదార్థాన్ని తను ఆరగించేందుకు ముందుగా కొద్దిగా తీసి చేయిని ఒక పక్కకు జాచాడు.

గునగునా కదిలి అతని దగ్గరికి వచ్చింది ఏనుగు గున్న. తొండంతో దాన్ని తీసుకుని నోటిలో పెట్టుకుంది. ఆ రుచి అత్యద్భుతమన్నట్టు చిన్నగా ఘీంకరించింది.

వెంటనే కదిలి శివుడి దగ్గరికి వచ్చి, తమ తొండాలను కూడా ముందుకు జాచాయి పెద్ద ఏనుగులు.

తను చూస్తున్నది కలో నిజమో అర్థం కాకుండా పోయింది చారులతాదేవికి. మనసులున్న మనుష్యుల మాదిరి ప్రవర్తిస్తున్న ఆ మూగ జీవాలను చూసినకొద్దీ ముచ్చట కలగసాగింది ఆమెకు.

“ఇవి ఎప్పటినుంచీ ఇక్కడ వున్నాయిరా శివుడు?” అతన్ని అడిగింది ఆమె. కొన్ని పదార్థాలను ఏనుగులకు పెట్టి, కొన్నింటిని అదే చేత్తో తను నోటిలో పెట్టుకుంటూ “నిన్నటి ఉదయం నించీ ఇవి నాకు కాపలా కాస్తూనే వున్నాయి. అవతలికి పొమ్మని ఎంత అరిచినా ఆలకించటం లేదు” అని చెప్పాడు.

అతను తప్పించిన ఏనుగు పిల్ల అదేనని ప్రత్యేకంగా పనికట్టుకు చెప్పాల్సిన అవసరం లేకుండానే తెలిసిపోయింది చారులతాదేవికి.

“అరేయ్ శివుడు... నువ్వు ఇక్కడ వుంటే చీటికి మాటికి ఏదో ఒక తప్పిదం చేసి దొరికిపోతూ వుంటావు. ఇటువంటి శిక్షల్ని అనుభవిస్తూనే వుంటావు. నీకు కావల్సిన ధనం యిస్తాను. ఈ నగరాన్ని విడిచి వెళ్ళిపో.

మంచి నగరంలో నీ గురించి ఎవరూ పట్టించుకోని ప్రదేశంలో సుఖంగా బతుకు...'' అన్నది ఆమె చెమ్మగిల్లిన కనుల్ని పమిటి అంచుతో తుడుచుకుంటూ.

పరిచారికలు అందిస్తున్న పదార్థాలను ఆరగిస్తూనే తల అడ్డం తిప్పాడు శివుడు. "నా చోటు ఇక్కడే.... నా శ్రేయస్సును కోరుకునే మిమ్మల్నందర్నీ వదిలి నేను ఎక్కడికీ వెళ్ళను" ఖచ్చితమైన కంఠంతో చెప్పాడు.

"ఇక్కడే వుంటే నీ బతుకు ఇంకా దుర్భరం అవుతుందిరా" అన్నది చారులతాదేవి.

"ఏమీ కాదు. సాగరులవారు మొదట కోపగించినా ఆ తరువాత ఎంతో ప్రేమ చూపిస్తారు... రేపు వచ్చే పౌర్ణమినాడు మా విద్యలన్నిటినీ పరీక్షించి వృత్తివిద్యలు నేర్పించే ప్రయత్నం జరుగుతుంది. ఈ సమయంలో నేను కనిపించకుండా పోవటం ఎలా సాధ్యం?" అన్నాడు శివుడు.

"నువ్వు ఏ విద్య నేర్చుకోవాలని అనుకుంటున్నావు?" వినోదంగా చూస్తూ అడిగింది ఆమె.

"సైన్యంలో చేరతాను తల్లీ... గజసైన్యానికి నాయకుడిని అవటమే నా లక్ష్యం. యుద్ధ గజాలను నడిపించటంలో సాగరుల వారి మాదిరిగా నేర్పు సంపాదించుకోవాలి. వారి మాదిరిగా పేరు తెచ్చుకోవాలి" అన్నాడు శివుడు.

తన పరిచారికల వంక ప్రశ్నార్థకంగా చూసింది చారులతాదేవి.

"కష్టం తల్లీ... సైన్యాధ్యక్షుడు ఒప్పుకోడు... శివుడిమీద అతనికి సదభిప్రాయం ఇసుమంత కూడా లేదు" వెంటనే చెప్పింది ఒక పరిచారిక.

"పరీక్షిస్తున్నప్పుడు ప్రజ్ఞ చూపిస్తే ఒప్పుకోక ఏం చేస్తాడు? దేవిగారి అభిప్రాయానికి విలువ ఇవ్వకుండా వుండగలడా?" కోపంగా అన్నది రెండో పరిచారిక.

"పరీక్షలు ప్రారంభం అయినప్పుడు చూద్దాము. ఇప్పటినించే ఆలోచనలు అనవసరం." అంటూ శివుడుకేసి చూసింది చారులతాదేవి. "నగరంలోకి పోదాం. నీ ఏనుగుల్ని పంపించివేయి" అని చెప్పింది.

సభా భవనంలో సాగరుల వారి కోపం ఎటువంటి స్థాయిలో వున్నదో చూసి వుండడం వల్ల వెంటనే కదలటానికి తటపటాయించాడు శివుడు.

"రెండు రోజులు పూర్తి అయిపోయినట్లే తల్లీ! మరొక్కరోజు మాత్రమే మిగిలి వున్నది. పూర్తి చేసుకుంటే ఎటువంటి గొడవా వుండదు. నాకు ఈ ఏనుగుల రక్షణ వుండనే వున్నది కదా" అన్నాడు.

ఆలోచనలో పడింది చారులతాదేవి.

"శివుడి మాటల్లో యదార్థం వున్నది తల్లీ! వేళపట్టున ఆహారం ఎలాగూ మనం అందించగలం. ఆత్రుత అవసరం లేదు" అన్నది ఒక పరిచారిక.

చారులతాదేవి సమాధానం చెప్పకముందే ఉన్నట్టుండి భయంకరంగా ఘీంకారం చేసింది నిశ్చలంగా నిలబడి వున్న మగ ఏనుగు. తొండాన్ని గాలిలోకి ఎత్తి వేగంగా బండలకేసి కదిలింది.

❖ ❖ ❖

"ఆగండి ప్రభూ... అది మదించిన గజం... మహోగ్రంగా కనిపిస్తోంది. మనం ప్రమాదంలో చిక్కుబడతాము" అని మహేశ్వరుడు హెచ్చరించిన వెంటనే గుట్ట ఎక్కటాన్ని ఆపాడు సాగరులవారు.

"దేవిగారు వచ్చిన అశ్వశకటం క్రిందనే వున్నది. తప్పకుండా ఆమె గుట్టమీదికే వచ్చి వుంటుంది. ఈ ఏనుగు ఆమెకు ఏదైనా హాని తలపెట్టి వుంటుందా?" అని అడిగాడు.

"ఆ సంగతి తర్వాత ఆలోచిద్దాము. ముందు మనం ఈ ప్రమాదాన్ని తప్పించుకోవాలి. గుట్ట దిగటం కంటే వేరే మార్గం లేదు" అన్నాడు మహేశ్వరుడు.

గుండెలు జలదరించే ఘీంకారాలు చేస్తూ రాబోయిన ఏనుగు, గుట్ట పైభాగంలో వేపచెట్టుకు అడ్డంగా వున్న బండల దగ్గరే ఎవరో ఆపినట్లు ఆగిపోయింది.

దాని వెనుకే వచ్చి నిలబడిన ఇంకో ఆడ ఏనుగును, దాని వెనకాలే నిలబడిన పిల్ల ఏనుగును చూసి విపరీతమైన ఆశ్చర్యానికి గురి అయ్యాడు మహేశ్వరుడు.

"అదే... ఆ పిల్లనే శివుడు మన గజశాలలో నుంచి నగరం వెలుపలికి తరలించాడు. పెద్దవి రెండూ దాని తల్లిదండ్రులు అయివుంటాయి" అన్నాడు.

గజశాస్త్రం పూర్తిగా తెలిసినవాడు సాగరుడు. వాటి లక్షణాలను, వాటి క్రోధాన్ని, వాటి విశ్వాసాన్ని కాచివడబోసిన యోధుడు.

"శివుడి విషయంలో నా తెలివితేటలు చిల్లిగవ్వకు కూడా సరిపోవని అనిపిస్తోంది. ఇవి వాడికి కాపలా కాయటానికి వచ్చాయి. సందేహం లేదు. ఇప్పుడు మనం వాటిని దాటి వాడి దగ్గరికి పోవటం ఎలా?" అన్నాడు.

"శివుడు... ఒరేయ్ శివుడు" బిగ్గరగా అరిచాడు మంత్రి మహేశ్వరుడు. సమాధానం శివుడి దగ్గర్నించి రాలేదు. బండల దగ్గరికి వచ్చిన ఏనుగులు మాత్రం వెంటనే వెనక్కి తిరిగాయి.

అడ్డుగా వున్న బండలమీది నించి ఎగిరెగిరి దూకుతూ అతివేగంగా గుట్ట పైభాగాన్ని చేరుకున్నారు సాగరులవారు. నింబవృక్షం దగ్గర వున్న తన సతీమణిని, ఆమె చెలికత్తెలను, బంధనాల నుండి విముక్తి పొంది వున్న శివుడిని చూసి ఆశ్చర్యపోలేదాయన.

బారెడు బారెడు దంతాలు కలిగివున్న మహాగజాన్ని మచ్చిక చేసుకోవటం అంటే మాటలు కాదు. ఎంతెంతో అనుభవం కలిగివున్న గజ శిక్షకులు ఒకటి రెండు సంవత్సరాల పాటు అవిశ్రాంతంగా ప్రయత్నం చేస్తే తప్ప సాధ్యపడే విషయం కాదు అది.

మహా గజాల్లోకెల్లా మహా మహా గజం మాదిరి కనిపిస్తోంది ఇప్పుడు అక్కడ నిలబడి వున్న ఏనుగు. శివుడికి ఎలా మచ్చిక అయింది?

ఆ ఏనుగునే కాదు, దాని పక్కనే నిలువబడి వున్న ఆడ ఏనుగును చూసిన కొద్దీ అధికమైపోసాగింది ఆయనలో అడుగుపెట్టిన కుతూహలం.

"ఎలా? ఎలా వాటిని నీ దారిలోకి తెచ్చుకోగలిగావు?" శివుడికి తను విధించిన శిక్షను గురించి మర్చిపోయినట్లు అడిగాడాయన.

శివుడు సమాధానం చెప్పకముందే కల్పించుకున్నది చారులతాదేవి. "మీరు మీ యుద్ధగజాల్ని ఎలా నడిపిస్తారోనని అడిగితే ఆ రహస్యాన్ని ఎవరికైనా చెపుతారా? మీ యుద్ధతంత్రాలను అందరితోను చర్చిస్తారా?" చురచురా చూస్తూ అడిగింది.

ఆ మాటలతో వెంటనే తన కుతూహలాన్ని అణిచి వేసుకున్నాడు సాగరుల వారు. "శివుడి విషయంలో నేను తొందరపడ్డాను దేవీ... వీడు చేసే అల్లరి

పనుల ఆఖరిలో ఏదో ఒక పరమార్థం వుండే వుంటుందని తెలిసికూడా ఆవేశానికి లొంగిపోయాను" నిరభ్యంతరంగా ఒప్పుకున్నాడు.

"తప్పయిపోయిందని వట్టిగా అంగీకరించినందువల్ల ఏమిటి ఉపయోగం? ఛళ్లుమనేటట్లు చెంపదెబ్బ కొట్టి ఆ తర్వాత పొరపాటయిపోయిందని అన్నంత మాత్రాన ఆ దెబ్బవల్ల కలిగిన నొప్పి మాయం అవుతుందా?" కోపంగా చూస్తూనే వేగంగా అడిగింది ఆమె.

"పొరపాటు జరిగిపోయిందని ఒప్పుకున్న తర్వాత ఇంకా వాదించటం దేనికి తల్లీ? వదిలేయండి. గతాన్ని వదిలి ఇకముందు జరగవలసిన దేమిటో చూడండి" సాగరుల వారు సమాధానం చెప్పకముందే తాను కల్పించుకున్నాడు ఆయన వెనుకే వచ్చిన మహేశ్వరుడు.

"ఈ క్షణం నుంచీ వీడి విషయంలో ప్రభువుల వారు జోక్యం చేసుకోకూడదు. వీడిని శిక్షించాలన్నా, మెచ్చుకోవాలన్నా ముందు మా అనుమతి తీసుకోవాల్సిందే. మేము అంగీకరిస్తేనే వీడిని గురించి వారు ఆలోచించాలి. వీడి విషయంలో ఇకనుంచీ పూర్తి బాధ్యత మాకే వుంటుంది. సమ్మతమేనా?" అడిగింది చారులతాదేవి.

సాగరులవారి తర్వాత అంతటి అధికారాలు కలిగిన ఆమె నిర్మొహమాటంగా మాట్లాడిన ఆ మాటల్ని వినేసరికి, మహేశ్వరుడికి కూడా కొంచెం విచిత్రమనిపించిన మాట వాస్తవం.

ఆమె చెపుతున్న దాని ప్రకారం అందుకు అంగీకరిస్తే ఇకనుంచీ శివుడి విషయంలో ఎవరూ జోక్యం చేసుకోవటానికి వీలు లేదు. ప్రమాద ఘంటికను మోగించటం, ఏనుగు గున్నను అనుమతి లేకుండా గజశాల నుంచి బయటికి తీసుకుపోవటం వంటి పనుల్నే కాదు, వాటిని మించిన నేర కృత్యాలు కావించినా, అతన్ని విచారించే అధికారం గాని, శిక్షను విధించే అవకాశం గాని ఎవరికీ వుండవు– ఒక్క చారులతాదేవి గారికి మాత్రమే వుంటాయి.

ఆ తల్లి మనసు పొరపాటున కూడా వాడిని శిక్షించటానికి అంగీకరించదు. ఎంతటి దారుణాన్ని చేసినా సరే, కడుపులో పెట్టుకుని కాపాడుతుంది.

మహేశ్వరుడి మనస్సులో మెదులుతున్న మాటలే, సాగరుల వారి అంతరంగంలో కూడా ప్రవేశిస్తున్నట్టు గమనించి మరింత కోపంగా చూసింది చారులతాదేవి.

చిన్నపిల్లాడన్న కనికరం కూడా లేకుండా వీడికి విధించిన ఈ శిక్షను గురించి నేను సభలో అందరిముందు మాట్లాడకుండా వుండాలంటే మీరు ఈ నియమానికి ఒప్పుకుని తీరాలి.. ఏమంటారు?" దురుసుగా అడిగింది.

చూసి రమ్మంటే కాల్చి వచ్చే మనస్తత్వం కలిగిన శివుడి ఎదురుగానే అటువంటి చర్చ కొనసాగటం మహేశ్వరుడికి నచ్చలేదు.

"ఈ మాటలన్నీ మనం నగరంలోకి పోయిన తర్వాత మాట్లాడుకోవచ్చు. ముందుగా మనం ఇక్కడినించి వెళ్ళిపోవాలి. అవతల ఈ శివుడికి సంబంధించిన మాటల కంటే ముఖ్యమైన మరో విషయం మనకోసం ఎదురు చూస్తోంది" సముదాయిస్తున్నట్లు సున్నితంగా చెప్పాడు సాగరుడు.

"ఏమిటది?" కోరగా అడిగింది చారులతాదేవి.

"మీ మేనకోడలు జ్వాల మన సరిహద్దుల్లోకి అడుగుపెట్టిన వెంటనే అడవిలో అదృశ్యమయింది. వివరాలు ఏమీ తెలియలేదు. మనం వెంటనే ఏదో ఒకటి చేయాలి" సూటిగా అసలు విషయాన్ని ఆమె చెవిన వేసేశాడు అతను.

మాటకు మాటగా సమాధానం చెపుతూ వస్తున్న చారులతాదేవి నిర్విణ్ణురాలై పోయింది ఒక్కసారిగా. మొఖం కళ తప్పింది.

"సైనికుల్ని పంపించాము దేవీ... అడవి గ్రామాలన్నిటికీ వర్తమానం అందించాము. జల్లెడ పడుతూ వుండి వుంటారు అందరూ అరణ్యాన్ని. ఇంకా కొద్దిసేపట్లో యువరాణి జాడలు తప్పకుండా తెలిసిపోతాయి..." గబగబా అన్నాడు సాగరులవారు.

దారుణమైన బాధ చారులతాదేవిని అపాదమస్తకం ఆవరించుకున్నట్లు స్పష్టంగా తెలిసిపోతోంది ఆమె మొఖంలోని భావాలను బట్టి. తట్టుకోవటం అసాధ్యమై ఆమె నేలమీద చతికిలబడబోయినా, లేక ముందుకో వెనక్కో తూలినా పట్టుకుని ధైర్యం చెప్పటానికి సిద్ధంగా నిలబడ్డాడు సాగరులవారు.

అయితే అటువంటిది ఏదీ జరగలేదక్కడ. గుండెల నిండుగా గాలి పీల్చుకుంటున్నట్టు దీర్ఘంగా నిశ్వాసించింది ఆమె. "శివుడి శిక్షను రద్దు పరచినట్లేనా?" అని అడిగింది.

"తల్లీ! మనం నగరంలోకి వెళ్ళిన తర్వాత..." అంటూ ఆ అంశాన్ని అవతలికి నెట్టే ప్రయత్నం చేశాడు మహేశ్వరుడు.

"తర్వాత గిర్వాత కాదు. నాకు సరైన సమాధానం కావాలి. శిక్ష రద్దు అయిందా లేదా?" మళ్ళీ అడిగింది ఆమె.

"అయింది దేవీ. అసలితడికి శిక్ష విధించటమే పెద్ద పొరపాటు అని నేను భావిస్తున్నాను" మహేశ్వరుడి కంటే ముందుగా చెప్పాడు సాగరుల వారు.

వెంటనే శివుడి కేసి తిరిగింది చారులతాదేవి.

"ఒరేయ్ శివుడు... అడవిలోకి పోయి యువరాణిని వెతకటం నీకు సాధ్యపడుతుందా?" అని అడిగింది.

"తల్లీ... వాడు చిన్నవాడు. అడవి చాలా పెద్దది. అడవీ సంచారం అంటే మాటలు కాదు... ఎంతో తెలివితేటలు కలిగివుండాలి. ఒకవేళ శత్రువులు ఎవరైనా ఎదురుపడితే యుద్ధం చేయగల శక్తిసామర్థ్యాలు వుండాలి. వాడికి అవేమీ లేవు... దయచేసి మీరు కాస్త శాంతంగా ఆలోచించండి" అంటూ వెంటనే అభ్యర్థించాడు మహేశ్వరుడు.

మొండిగా తల అడ్డం తిప్పిందామె. "వీడి శక్తిమీద మాకు పూర్తి విశ్వాసం వుంది" అని అతనికి చెప్పి "ఏరా! వెళ్ళి రాగలవా?" అని మరోసారి అడిగింది శివుడిని.

సాగరుల వారు ఎదురుగా వుండగా నోరు విప్పి మాట్లాడే సాహసం చెయ్యదలచుకోలేదు శివుడు. "అడవిలో దారులు నాకు పూర్తిగా తెలియవు తల్లీ... అయినా సరే నా ప్రయత్నం నేను చేస్తాను. కాని నాది ఒక చిన్న విన్నపం" అన్నాడు అతను వెంటనే.

"చెప్పు... ఏమిటది?" సాగరుల వారు కల్పించుకొనే అవకాశం ఇవ్వకుండా అడిగింది చారులతాదేవి.

"అడవిలో వున్న ఏనుగులన్నిటినీ పట్టుకు వచ్చిన మన భటులకు ఈ రెండు ఏనుగులు కనిపించలేదు... ఇప్పుడు ప్రభువులు వాటిని చూశారు. తిరిగి భటుల్ని పంపి బంధించే ప్రయత్నం చేయకూడదని నా మనవి. వాటి మానాన వాటిని అడవిలో తిరగనివ్వవలసిందిగా నా అభ్యర్థన" అన్నాడు శివుడు.

ఐరావతానికి రెండింతలు పెద్దగా వున్నట్లు కనిపిస్తున్న మగ ఏనుగువంక చూసి, గాఢంగా నిట్టూర్చాడు సాగరులవారు.

అటువంటి జీవం తమ గజదళంలో వుంటే తాను యుద్ధం చేయవలసిన అవసరమే వుండదు. దాన్ని చూసీ చూడగానే చెల్లాచెదురైపోతుంది విరోధి సైన్యం. విజయం చిటికెలో తమ హస్తగతం అవుతుంది.

అటువంటి జంతువును చూస్తూ చూస్తూ ఊరికే వదిలిపెట్టడం... కనులు చిట్లించి ఆయన వంకే చూస్తోంది చారులతాదేవి. ఆయన ఎలా ఆలోచిస్తాడో, ఎటువంటి ఆలోచనలు చేస్తాడో ఆమెకు బాగా తెలుసు. "నీ అభ్యర్థనను మేము అంగీకరిస్తున్నాము రా... నీ అంతట నువ్వు వప్పుకునే దాకా ప్రభువులు ఈ జీవాల జోలికి రారు. ఎవరినీ పోనీయరు. అందుకు నాది బాధ్యత... నీకు సంతోషమేనా?" అని తనే చెప్పింది శివుడికి.

కలువపువ్వు మాదిరి విప్పారింది శివుడి ముఖం... ఒక్కమాట కూడా మాట్లాడలేదతను. ఆమె అక్కడికి వస్తూ వస్తూ పరిచారికలతో మోయించి తీసుకువచ్చిన ఫలహారాల బుట్టలో ఇంకా మిగిలివున్న తీపి పదార్థాలలో నుంచి కొన్నింటిని తీసి తన దట్టీలో మూట కట్టుకున్నాడు.

"వెళ్ళి వస్తాను తల్లీ... యువరాణీవారు కనిపించేదాకా అడవిలో తిరుగుతాను" అంటూ వేగంగా రెండు అడుగులు వేసి, మగ ఏనుగు దగ్గరికి పోయి చేతుల్ని జాచాడు.

సుశిక్షతమైన యుద్ధగజం మాదిరి తొండాన్ని అతని నడుముచుట్టూచుట్టి తన కుంభస్తలం వెనుక కూర్చోబెట్టుకున్నది ఆ మహాగజం.

"పదండి... అడవిలోకి పదండి..." మడమలతో దాని శరీరాన్ని మృదువుగా స్పృశిస్తూ చెప్పాడు శివుడు.

చంద్రుడి గట్టుకు రెండో ప్రక్కనుంచి మొదలయ్యే ముళ్ళపొదలకేసి పరుగులు తీస్తున్నట్టు నడిచింది మగ ఏనుగు. వెనుకగా కదిలింది గున్న. దాన్ని దగ్గరిగా అనుసరించింది ఆడ ఏనుగు. చూస్తూ చూస్తూ వుండగానే గుట్ట దిగి మళ్ళీ పొదల్లోకి పోయి మాయం అయిపోయాయి ఆ మూడు.

"నేను స్వయంగా నా కళ్ళతో చూస్తున్నాను కాబట్టి నమ్మవలసి వస్తోంది. ఇదే ఇంకొకరు ఇలా జరిగిందని చెపితే పొరపాటున కూడా నమ్మివుండేవాడిని

కాదు. ఈ శివుడికి ఏవో మాయలు మంత్రాలు వచ్చి వుంటాయి. లేకపోతే ఈ మదగజాల్ని స్వాధీన పరుచుకోవడం అసంభవం" తనలో తను అనుకుంటున్నట్టు పైకే అన్నాడు సాగరులవారు.

"వాడిని కన్నతల్లిదండ్రులు ఎవరో గాని , గజసైన్యంలో ఆరితేరిన శిక్షకులై వుండి వుంటారు. ఆ లక్షణాలే వీడికి వచ్చివుంటాయి... లేకపోతే ఇటువంటి నేర్పు నేర్చుకుంటే రాదు" తన అభిప్రాయాల్ని వెంటనే తెలియచేశాడు మహేశ్వరుడు.

ఆ మాటలు వేటినీ వినిపించుకోలేదు చారులతాదేవి... "మనం నగరంలోకి పోగానే ఎరుకలసాని బసివిని పిలిపించి మాట్లాడాలి. శివుడిని గురించి చెప్పినట్లే యువరాణిని గురించి కూడా చెపుతుందేమో చూడాలి" తన పరిచారికలతో చెపుతూ గుట్ట దిగడం మొదలుపెట్టిందామె.

ఏనుగులు నింబవృక్షం దగ్గిర్నించి కదిలి అవతలికి పోగానే పుట్టల్లో వున్న పాములు కొన్ని తలల్ని బయటపెట్టడం మహేశ్వరుడికి కనిపించింది.

"ఇంకా కొద్దిసేపు ఇక్కడే వుంటే అవి మనమీద దండయాత్రకి తప్పకుండా వస్తాయి. వెళ్ళిపోదాం ప్రభూ..." అంటూ సాగరులవారిని హెచ్చరించాడు.

తను కూడా ఆ పాముల్ని గమనించటం వల్ల ఆలస్యం చేయలేదు ఆయన గబగబా నడిచాడు గుట్ట క్రిందికి.

❖ ❖ ❖

విశ్రాంతి మందిరంలో కుదురుగా కూర్చోలేకపోయాడు గూఢచారి శుశ్రుతుడు. మెత్తటి తూలికాతల్పం వుంది ఆ మందిరంలో. దానిమీద మేను వాల్చిన మరుక్షణికంలో తన్నుకుంటూ వచ్చేస్తుంది గాఢమైన నిద్ర.

శుశ్రుతుడికి మాత్రం రాలేదు అది.

"చచ్చీచెడి ప్రాణాలకు తెగించి ఒక మహా రహస్యాన్ని కనిపెట్టి, విశ్రాంతి కూడా తీసుకోకుండా ఆఘమేఘాల మీద నగరంలోకి వచ్చాను. ఆ శ్రమ అంతా ఎందుకూ పనికిరాకుండా పోయింది. ఆ రహస్యం తమకు తెలిసినట్టు ముందుగా ఒక్కమాట కూడా చెప్పకుండా గజశాల దగ్గరికి తరిమారు... నెలవారీ భత్యం కోసం గజశాలలోని ఏనుగులకు సేవ చేసుకునే ఒక సామాన్యమైన నిర్వాహకుడి దృష్టిలో నన్నొక పనికిమాలిన వాడి మాదిరిగా

చిత్రించారు. తలుపులు తెరిచి లోపలికి ఆహ్వానించకుండా వెనక్కి పంపించేయటం... అవమానం భరించటం దుస్సాహం...' ఒకే మాటను పదే పదే వల్లెవేసుకుంటూ పిచ్చిపట్టినవాడిలా మందిర ద్వారం ఎదుట వున్న ఒక వృక్షం క్రింద పచార్లు చేయటం మొదలుపెట్టాడు.

అతను ఆ మందిరం దగ్గరికి వచ్చిన అర్థఘడియ తరువాత అతినెమ్మదిగా అతన్ని సమీపించారు ఇద్దరు దృఢకాయులు.

"ఎవరు మీరు? ఎందుకు వచ్చారు?" కోపంగా అడిగాడు శుశ్రుతుడు.

తమ దగ్గర వున్న పెద్ద పెద్ద సత్తుపళ్ళెరాల్లోని బఠాణీ గింజల్ని అతనికి చూపించారు వాళ్ళు.

"నేతిలో వేయించి నిండా ఉప్పుకారం జల్లాము. మహారుచిగా వుంటాయి" అన్నాడు వారిలో ఒకడు.

"నాకు అవసరం లేదు. మీరు వెళ్ళిపొండి" విసురుగా అన్నాడు శుశ్రుతుడు.

"అవసరం కోసం ఆరగించే పదార్థం కాదు ఇది. కాలక్షేపం కోసం ఒకటొకటిగా నోటిలో వేసుకునేవి. ఏదైనా విషయాన్ని గురించి తీవ్రంగా ఆలోచించేటప్పుడు వాటిని తప్పనిసరిగా దగ్గర వుంచుకోవాలి. శుశ్రుతుల వారికి తెలియంది కాదు" నవ్వుతూ అన్నాడు రెండో వ్యక్తి.

చెంపమీద కొట్టినట్టు తలతిప్పి చురుకుగా చూశాడు అతను వారి వంక. "ఎవరు మీరు? నేనెవరినో మీకు ఎలా తెలుసు?" అడిగాడు.

"శుశ్రుతుల వారంటే మా శ్రావస్తి నగరంలో అందరికీ తెలుసు. వ్యాపారం చేసుకోవటానికి మాకు పెట్టుబడిని సమకూర్చే కనకయ్య శ్రేష్ఠిగారి నోటివెంట మీ పేరు చాలాసార్లు విని వున్నాము. ఈ రోజున గజశాల దగ్గర ప్రత్యక్షంగా మిమ్మల్ని చూశాము" అన్నాడు మొదటి మనిషి.

శ్రావస్తి నగరం... కనకయ్య శ్రేష్ఠి పేర్లు వినేసరికి మటుమాయం అయిపోయింది శుశ్రుతుడి వదనం మీది చిరాకు.

"ఎక్కడో వున్న ఆ నగరం నుంచి మీరు ఈ మారుమూల నగరానికి వచ్చిన కారణం ఏమిటి?" సూటిగా అడిగాడు.

"వ్యాపారం చేసి బ్రతికేవాళ్ళకి ఒక నగరం ఒక పట్టణమనే భావనలు వుండకూడదు స్వామీ... దేశమంతా కలియతిరుగుతూ వుంటాము. ఎక్కడ

ఏ వస్తువుకు హెచ్చులాభాలు వస్తాయో గమనించి మా శ్రేష్ఠిగారికి తెలియ చేయటమే మా పని. ఒక విధంగా చూస్తే మేము కూడా గూఢచారులమే... వర్తక గూఢచారులం...” నవ్వుతూ చెప్పాడు రెండో వ్యక్తి.

మరింత ప్రసన్నుడైపోయాడు శుశ్రుతుడు. కనకయ్య శ్రేష్ఠి అంటే ఎంతటి పరపతి గలవాడో తెలుసు అతనికి. అవసరం అయితే అనుమతి కూడా తీసుకోకుండా సూటిగా చక్రవర్తి దగ్గరికి పోయి రాగలవాడని పెద్ద పేరు.

అటువంటి ప్రముఖుడు తనని గురించి మాట్లాడాడంటే మామూలు విషయమా అది? ఆ మాట మనసులో మెదులుతూ వుండగానే అతనికి వచ్చింది ఇంకో అనుమానం.

గజశాల దగ్గర తనను లోపలికి రానీయకపోవటాన్ని వాళ్లు గట్టిగా గమనించి వుంటే... అంతకంటే అవమానం మరొకటి వుండదు.

గమనించారా??

అతని మనస్సులోని మాటలు తమకు అవగతం అవుతున్నట్లు ఓరకళ్ళతో ఒకరి వంక ఒకరు చూసుకున్నారు ఆ వ్యక్తులు ఇద్దరూ. కనిపించీ కనిపించకుండా తలవూపాడు ఒకతను.

“మా శ్రేష్ఠిగారి మన్ననలు పొందిన మీకు గజశాల వద్ద ఎంతో మర్యాద జరుగుతుందని ఊహించాము. కాని అక్కడ జరిగింది చూసేసరికి మీకు ఎలా అనిపించిందో గాని, మాకు మాత్రం పీకల నిండుగా కోపం వచ్చేసింది. గూఢచార విద్యలో ఆరితేరిన శుశ్రుతుల వారి ఎడల ప్రవర్తించాల్సిన పద్ధతి అదికాదని అనిపించింది” చల్లగా అన్నాడు రెండో వ్యక్తి.

ఎదుటి మనిషి పెదవులు విచ్చకుండానే అతని మనసులోని ఆలోచనలు ఎటువంటివో తెలుసుకునే శక్తి గూఢచారులకు వుంటుంది. ఆ అంశంలో ప్రత్యేకమైన శిక్షణ ఇవ్వబడుతుంది వారికి.

పిలవని పేరంటం మాదిరి విశ్రాంతి మందిరందాకా వచ్చిన ఆ బటాణీల వర్తకుల విషయంలో మాత్రం అలా గమనించలేకపోయాడు శుశ్రుతుడు. తనకు ఏదో పెద్ద అవమానం జరిగిపోయిందని అతను భావిస్తూ వుండడమే అందుకు కారణం. దారుణమైన బాధను కలిగించే కాలిన గాయంమీద నవనీతం పూసినట్లు అతి చల్లగా అనిపించాయి అతనికి వారి మాటలు.

''రాచరికపు సేవలో ఇటువంటివన్నీ సాధారణమే... ఎప్పుడు మెచ్చుకుంటారో ఎప్పుడు చీదరించుకుంటారో చెప్పటం చాలా కష్టం" తనకు తాను సమాధానం చెప్పుకుంటున్నట్లు అన్నాడు అతను.

"అతి సామాన్యమైనటువంటి సేవకులకు వర్తించే మాట. మీవంటి అసాధారణ ప్రజ్ఞావంతులకు మాత్రం కాదు" వెంటనే అన్నాడు మొదటి మనిషి.

"ఆరితేరిన గూఢచారులు మీరు. ఒకళ్ళు మిమ్మల్ని లోనికి ఆహ్వానించవలసిన అవసరమే లేదు. తలుచుకుంటే రెండోకంటికి తెలియకుండా లోపలికి పోయి లోపల వున్నవారిని ఆశ్చర్యంలో ముంచెత్త గలరు" అన్నాడు రెండో మనిషి.

యథాలాపంగా వారి పలుకుల్ని ఆలకిస్తున్న శుశ్రుతుడి ఒళ్ళు ఝల్లుమన్నది ఒక్కసారిగా. "ఏం మాట్లాడుతున్నావు నువ్వు?" ఆశ్చర్యంగా అడిగాడు.

"ఆశ్చర్యం దేనికి స్వామీ? అసలు మీరు గజశాల దగ్గరికి వచ్చింది దేనికి?" అడిగాడు మొదటిమనిషి.

"శత్రువులు గజశాల మీద దాడి చేయకుండా రక్షణ ఏర్పాట్లను గురించి మాట్లాడటానికి..." శత్రువులు ఎవరో బయటపెట్టలేదు శుశ్రుతుడు.

ఒకరివంక ఒకరు చూసుకుని అతి బలవంతంగా తమ నవ్వుల్ని మరుగుపరచుకున్నారు ఆ మనుషులు.

"అంతటి ముఖ్యమైన పనిమీద వచ్చిన మిమ్మల్ని లోపలికి రానీయలేదంటే... గజశాల నిర్వాహకుడు ముందు జాగ్రత్తలు చాలా తీసుకుంటున్నట్లే లెక్క. తమ జాగ్రత్తలో తాము వున్నట్లే... అవును కదా?" అడిగాడు ఒకతను.

అసలు ఆ సంభాషణ ఎందుకు మొదలయిందో, ఎక్కడినించి ఎక్కడికి పోతున్నదో తెలియకుండా పోయింది శుశ్రుతుడికి. అతనికి తెలుస్తున్నది ఒక్కటే... తన మనసులోని బాధను పంచుకునేందుకు, తనెవరో తెలిసినవారు దొరికారు... వారితో పంచుకోవటంలో తప్పు ఏమీ లేదనే భావనతో, ఆ మనిషి మాటలకు గబగబా తలవూపాడు.

"అన్ని జాగ్రత్తలు తీసుకున్నా ఏమీ ఉపయోగం వుండదని, శత్రువులు గజశాలలోకి ప్రవేశించటం చాలా తేలిక అనీ మీరు నిరూపించగలిగితే ఏమౌతుందో కొంచెం ఆలోచించండి" అన్నాడు రెండో మనిషి.

ఆలోచించవలసిన అవసరం శుశ్రుతుడికి లేకుండా పోయింది. ఈగ కూడా జొరబడలేనంత కట్టుదిట్టం చేయబడిన ఆ ప్రదేశంలోకి అనుమతి లేకుండా ఎవరైనా అడుగుపెట్టగలిగితే...

ఉన్నట్లుండి ఉప్పొంగిపోయింది అతని మనస్సు. అసలు అటువంటి పని జరగటానికి వీలు వున్నదో లేదో తెలుసుకోవటంకోసమే సాగరుల వారు తనకు ఏమీ చెప్పకుండా అక్కడికి పంపించి వుంటారు. ఆయన మాటల్లోని మర్మాన్ని తెలుసుకోలేక తను అనవసరంగా మథనపడిపోతున్నాడు.

చిమ్మచీకటి సమయంలో రెండు కాగడాలు వెలిగించినట్లు ఒక్కసారిగా కాంతివంతం అయింది అతని మనసు.

"పరిచయం లేకపోయినా ఆప్తుల మాదిరి వచ్చి, నా కర్తవ్యాన్ని నాకు గుర్తు చేశారు. మీ మేలు మరచిపోను. మిమ్మల్ని నేను బాగా గుర్తుపెట్టుకుంటాను" కృతజ్ఞతాపూర్వకంగా చూస్తూ వారికి చెప్పాడు తనంతట తనే తన దుస్తుల్లో నుంచి ఒక వెండి నాణేన్ని తీసి, వారి దగ్గర వున్న బటాణీలను తీసుకున్నాడు.

"ఎంతటి తెలివితేటలున్నా ఎప్పుడో ఒకప్పుడు ఎవరైనా సరే ఎంతో కొంత తడబాటుకు గురి అవటం చాలా సహజం. తెల్లారి లేచిన దగ్గర్నించీ రకరకాల జనాలతో వ్యాపారం చేస్తూ వుండటం వల్ల, ఎవరి మనస్సులో ఏముందో మాకు వెంటనే తెలిసిపోతుంది. మీరు మీ కర్తవ్యాన్ని నిర్వహించి, మీ శక్తిని ఇంకోసారి పూర్తిగా నిరూపించుకోవటానికి కావాలంటే మేము సహాయపడగలం. నిన్నటినించీ మేము గజశాల దగ్గరే వ్యాపారం చేస్తూ వుండటం వల్ల, గజశాల ఆనుపానులు మాకు కొద్దిగా అవగతమయ్యాయి" అన్నాడు మొదటి మనిషి.

బటాణీ గింజలను నోటిలో వేసుకుంటూ సాలోచనగా తలవూపాడు శుశ్రుతుడు. "ఈరోజు సాయం సమయంలో నేను అక్కడికి వస్తాను. చీకటి పడిన తర్వాత లోపలికి ఎలా వెళ్లాలో ఆలోచిస్తాను" అన్నాడు.

తలలు వంచి నమస్కారం చేసి ఆ ప్రదేశంలో నుంచి ఇవతలికి వచ్చేశారు ఆ వ్యాపారస్తులు ఇద్దరూ. పాతిక అడుగుల దూరం పోయిన తర్వాత వారిద్దరి దగ్గరికి వచ్చారు మరికొంతమంది వ్యాపారస్థులు.

"శుశ్రుతుడు స్వార్థపరుడు... తన గొప్పతనాన్ని ప్రదర్శించుకునేందుకు ఏదో ఒకవిధంగా గజశాలలోకి ప్రవేశిస్తాడు. అతని వెనుకే మనం కూడా వెళ్ళగలిగితే మన పని పూర్తి అయిపోతుంది" వారికి చెప్పాడు శుశ్రుతుడితో మాట్లాడినవారిలో ఒకతను.

"మరి ఆ బాలుడి సంగతేమిటి? అతన్ని వధించకుండా ఆలస్యం చేస్తే మన శ్రేష్ఠి మన తలల్ని నరికిస్తాడు గదా!" అన్నాడు ఆ మనుషుల్లో ఒకతను.

"గజశాలలో జరిగే గజమేధం నగరాన్ని అల్లకల్లోలం చేసేస్తుంది. ఆ గడబిడలో మనం వాడి అంతు చూడవచ్చు" అన్నాడు శుశ్రుతుడితో మాట్లాడిన వారిలో రెండో మనిషి.

"వాడు నగరంలో లేడు... చంద్రుడిగుట్టమీదికి తీసుకుపోబడ్డాడు. అక్కడ ఒంటరిగా వుంటాడు... చంపడం చాలా తేలిక" అన్నాడు కొత్తగా వచ్చి చేరిన వారిలో మనిషి.

"నగర ద్వారాల దగ్గర నిఘా చాలా అధికం... తేడా వస్తే అందరము హతమారిపోతాము. వాడికోసం ఆ గుట్ట దగ్గరికి పోయి, గజశాలలోని ఏనుగుల కోసం మళ్ళీ నగరంలోకి వచ్చి... ఒకటికి రెండుసార్లు నగర ద్వార రక్షకుల కంట పడకూడదు. ముందు ఇక్కడ పని... తర్వాత వాడి పని..." ఖచ్చితమైన కంఠంతో చెప్పాడు బటాణీ వ్యాపారస్తుల్లో రెండో మనిషి.

చంద్రుడి గుట్ట మీద జరిగినవేమీ వారికి తెలియదు. తమకు కావల్సిన శివుడు గుట్ట దిగి అడవిలోకి వెళ్ళిపోయిన విషయం కూడా వారికి తెలిసే అవకాశం లేదు.

❖ ❖ ❖

సంపంగి నగరం పక్కనుంచి ప్రవహించే సువర్ణానదిని గురించి పూర్తి వివరాలు జ్వాలకు తెలుసు.

ఉరుకులు పరుగులు పెడుతూ వుంటుంది అది. మధ్య మధ్యలో కాస్తంత ప్రశాంతంగా ప్రవహించినా ఎక్కువ భాగం వేగవంతంగానే వుంటుంది. ఈత తెలిసిన వారికి ఎటువంటి ప్రమాదమూ లేకపోయినా, ఆ నదిలో నివశించే మొసళ్ళు మాత్రం ఎవరినీ వదిలిపెట్టవు.

తనను పట్టుకోవటానికి వస్తున్న ఆగంతకుల నుంచి తప్పించుకోవటానికి, వేరే దారి లేకపోవటం మూలానా ఆ నదిలోకి దూకింది ఆమె. దూకిన వెంటనే బలంగా బారలు వేసి ఇరువది నాలుగు విండ్ల దూరం వెళ్ళిపోయింది.

నీటి పైభాగంలో కనిపిస్తున్నంతసేపు ఆగంతకుల వల్ల తనకు ప్రమాదం వున్నదని ఆమెకు తెలుసు. అడవిలో సంచరించే వారెవరయినా తమవెంట ఒకటో రెండో ధనుస్సులను, బలమైన బాణాలను తప్పకుండా తెచ్చుకుంటారు.

తనను వెంటాడుతున్న వారి దగ్గర కూడా అటువంటివి వుండివుంటే అంతే సంగతులు అయిపోతుంది తన పని...

ఆ మాట మనసులో మెదిలిన వెంటనే గబుక్కున నీటిలో మునిగింది ఆమె. ఊపిరి బిగపట్టి చేపమాదిరి వేగంగా ముందుకు దూసుకుపోయింది.

ఊపిరి తీసుకోకపోతే ప్రాణాలు పోగొట్టుకోవటం తథ్యమని అనిపిస్తున్న సమయంలో తలను పైకెత్తి నీటి పైభాగం మీదికి వచ్చింది.

అప్రయత్నంగా వెతికాయి ఆమె కళ్ళు,తనను వెంటాడిన ఆగంతకులకోసం.

వాళ్ళు కనిపించే లోపల, వెడల్పుగా నోటిని తెరిచి, వేగంగా వస్తున్న ఒక మకరి కనిపించేసరికి విపరీతమైన భయం ఆమెను ఆవరించుకున్నది. ఆలస్యం చేస్తే అది తనను అప్పుడాన్ని మింగినట్లు మింగేస్తుందని అర్థమై శరీరంలోని శక్తినంతా చేతుల్లోకి తెచ్చుకుంటూ బారలు వేసిందామె.

రెండే రెండు క్షణికాల్లో అవతలి ఒడ్డుకు చేరుకుని, ఆదరా బాదరగా నేలమీదికి వెళ్ళిపోయింది. గట్టి నేలమీద అడుగుపెడుతుండగా తెలిసి వచ్చింది ఆమెకు. మరొక్క క్షణికం పాటు గనుక తాను నీటిలో వుండివుంటే ఆ మకరికి ఆహారంగా మారిపోయేదని.

వెడల్పుగా తెరిచిన నోటిని ఠక్కున మూసి, గబగబా తానుకూడా ఒడ్డుమీదికి ఎక్కింది ఆ మొసలి.

ఒడ్డుమీద నిలబడి ఆవలివైపున వున్న ఆగంతకులు ఏం చేస్తున్నారో చూడాలని అనుకుంటున్నది జ్వాల. అత్యవసరంగా ఆ ఆలోచనను విరమించుకుని, ఒడ్డుకు దూరంగా పరిగెత్తింది.

ఆమె గనుక ఎక్కడయినా ఆగితే ఆహారంగా చేసుకోవటం కోసం పట్టుదలగా పది విండ్ల దూరం అనుసరించింది మొసలి. ఆమె ఆగకుండా

ఇంకా ఇంకా ముందుకు వెళ్ళిపోతూ వుండటాన్ని చూసి నిరాశగా వెనుతిరిగి మళ్ళీ నీటిలోకి ప్రవేశించింది.

విపరీతమైన ఆయాసం కళ్ళను బైర్లు క్రమ్మించే వరకూ పరిగెత్తి ఒక పెద్ద చెట్టుక్రింద ఆగిపోయింది జ్వాల.

మొసళ్ళకు బలం అవి నీటిలో వున్నప్పుడే చాలా అధికంగా వుంటుందనీ ఒడ్డుమీదికి వచ్చిన తర్వాత వాటి వేగం ఉధృతి నూటికి తొంభై పాళ్ళు తగ్గిపోతుందనీ మర్చిపోయి, పిరికిదాని మాదిరి పరిగెత్తుకుంటూ వచ్చిన తన తెలివితక్కువతనానికి తానే నిందించుకుంటూ, తిరిగి వచ్చిన దారినే నది దగ్గరికి బయలుదేరిందామె. ఆయాసం కొంచెం ఉపశమించిన తర్వాత.

ఆమెకు బాగా గుర్తు... ఎంతోసేపు పట్టలేదు తను ఆ ప్రదేశంలోకి రావటానికి... ఒక నిమిషం... మహా అయితే రెండు నిమిషాలు.

పరుగులు తీయకుండా తాపీగా నడుస్తోంది కాబట్టి నది దగ్గరికి పోవటానికి మరో నాలుగైదు నిమిషాలు... మహా అయితే మరో రెండు మూడు నిమిషాలు పట్టవచ్చు.

తాను అరిచిన అరుపులు తప్పకుండా తమ భటులు వినే వుంటారు... ఆయుధాల్ని సిద్దంగా పట్టుకుని వాళ్ళు నది ఒడ్డు వరకూ వచ్చేస్తారు. వాళ్ళని చూసిన ఆగంతకులు ఈపాటికి అడవిని దాటి శిఖావంతుడి సామ్రాజ్యం చేరువదాకా పారిపోయి వుంటారు.

ఒంటరిగా సంచరించటానికి బయలుదేరి అనవసరమైన ఆపదల్ని నెత్తిమీదికి తెచ్చుకున్నందుకు ఆగ్రహంతో అరిచి కేకలు పెడతాడు తన తండ్రి. సంపంగి నగర ప్రయాణాన్ని రద్దుచేసి వెంటనే వెనక్కి వచ్చేయమని ఆజ్ఞలు జారీ చేస్తాడు- తమ భటులు గనుక జరిగింది వెంటనే ఆయనకు తెలియజేసే ప్రయత్నం గనుక చేస్తే.

అటువంటి ప్రయత్నం ఏమీ చెయ్యవద్దని తాను వెంటనే వారిని హెచ్చరించాలి. తనకు ఎదురైన ప్రమాదాన్ని గురించి సంపంగి నగరంలో కూడా ఎవరికీ చెప్పకుండా ఆంక్షలు పెట్టాలి.

రకరకాల ఆలోచనలతో సతమతమైపోతూ అడుగులు వేసింది జ్వాల. నడిచి నడిచి పాదాలు నొప్పిగా వున్నట్టు తెలిసే సమయానికి కూడా తను నది దగ్గరికి చేరుకోలేదని అర్థమయ్యేసరికి అదిరిపడింది.

ప్రాణాలు అరిచేతుల్లో పెట్టుకుని పరిగెత్తటం వల్ల ఎటుగా వస్తున్నదో తాను గమనించుకోలేదు. ఇప్పుడు తాను అనుసరిస్తున్నది ఆ దారి కాదు.

ఎత్తుగావున్న చెట్లను, దట్టంగా పెరిగి వున్న పొదల్ని చూస్తూ తీవ్రమైన ఆలోచనలో పడిందామె. అడవిలో ఉన్నప్పుడు దారి సరిగ్గా తెలియకపోతే ఎత్తయిన ఏదో ఒక చెట్టుమీదికి ఎక్కి చుట్టూ చూడాలట. తను చదువుకున్న చదువులో అటవీ సంచరణ విద్యలో ఒక పాఠం అది.

మొఖం మీదికి జారుతున్న ముంగురుల్ని వెనక్కి నెట్టుకుంటూ దగ్గర్లో వున్న ఒక పెద్ద చెట్టు దగ్గరికి పోబోతుండగా వికృతధ్వనులు చేస్తూ వచ్చి ఆమె పాదాల దగ్గర పడింది ఒక పొడవాటి బాణం.

తన పాదాల దగ్గరికి వచ్చిపడిన బాణాన్ని చూడగానే ఝల్లుమన్నది జ్వాల శరీరం. విపరీతమైన భయం ఆమెను నిలువెల్లా ఆవరించుకున్నది. క్షణం కూడా ఆలస్యం చేయలేదామె. గిరుక్కున వెనుతిరిగి వచ్చిన దారినే ఆ ప్రదేశానికి దూరంగా పరిగెత్తటానికి ప్రయత్నం చేసింది.

ఫలించలేదు ఆ ప్రయత్నం. రెండు అడుగులు కూడా వెయ్యకముందే రివ్వు రివ్వుమంటూ వచ్చి ఆమెచుట్టూ పడ్డాయి మరికొన్ని బాణాలు. గింగిరాలు తిరుగుతూ వచ్చింది ఎవరో విసిరిన ఒక చెట్టుకొమ్మ. ఆమె తల వెనుక భాగానికి తగిలింది. కళ్ళముందు రకరకాల రంగులు ప్రత్యక్షం అవుతుండగా, ముందుకు తూలి, బోర్లా పడిపోయింది ఆమె. మొఖం నేలకు పొడుచుకుని, మరింత దారుణమైన బాధను కలిగిస్తుండగానే తప్పిపోయింది స్పృహ.

❖ ❖ ❖

సాయం సమయం దగ్గర పడుతూ వుండగా గజశాల దగ్గరికి పోయాడు శుశ్రుతుడు. అతన్ని అల్లంత దూరంలో వుండగానే గమనించి, గబగబా ఎదురు వెళ్ళారు బటాణీ వ్యాపారస్థులు ఇద్దరూ.

"చీకటి పడిన తర్వాత కూడా మీ వ్యాపారం కొనసాగుతుందా?" ఆశ్చర్యంగా అడిగాడు శుశ్రుతుడు. ఆ సమయంలో కూడా వారివద్ద వున్న పళ్ళెరాలను గమనించి–

"మా వ్యాపారం ఎప్పుడో పూర్తి అయిపోయింది దేవరా... మీకు సహాయం చేస్తామని మాట ఇచ్చాము గనుక ఇంకా ఇక్కడే వున్నాము. ఒట్టి చేతులతో

దిక్కులు చూస్తూ నిలబడితే రాజభటులు అనుమానిస్తారు. అందుకే ఈ పల్లెరాలను మా వెంట వుంచుకున్నాము" చెప్పాడు వారిలో ఒకతను.

"గజశాల దిగ్బంధం చేయబడింది స్వామి. మిమ్మల్ని కలిసి మేము ఇక్కడికి వచ్చిన తర్వాత ఇంతవరకూ ఒక్కసారి కూడా తలుపులు తెరుచుకోలేదు. లోపలినించి బయటికి వచ్చినవారు గాని, బయటినించి లోపలికి పోయిన వారు గాని ఎవరూ లేరు" చెప్పాడు రెండవ వ్యక్తి.

"సాగరుల వారి ఆజ్ఞలు సామాన్యమైనవి కావు. తేడా వస్తే స్వయంగా వచ్చి తలలు తెగనరుకుతాడు..." అంటూ సాలోచనగా గజశాల వైపు చూశాడు శుశ్రుతుడు.

"లోపలికి ప్రవేశించటం అసాధ్యం దేవరా... ఎంత తల పగలగొట్టుకున్నా ఏమీ తోచటం లేదు నాకు" మళ్ళీ అన్నాడు మొదటి వ్యాపారి.

గంభీరంగా తల ఊపాడు శుశ్రుతుడు. ఉన్నట్లుండి పక్కకు తిరిగి ఆ వీధి చివరి భాగంలోకి బయలుదేరాడు.

అతని మనసులో ఏముందో తెలుసుకోవడానికి విపరీతమైన ప్రయత్నం చేశారు వ్యాపారులు ఇద్దరూ. వాళ్ళ వల్ల కాలేదు.

"వెంట వెళ్ళి చూద్దాం. ఏదో ఆలోచన చేయటమైతే చేస్తున్నాడు. మనం ఒకటికి రెండుసార్లు అడిగితే అనుమానపడతాడు. మాట్లాడకుండా అనుసరించటమే సరైన పద్ధతి" మొదటి వ్యాపారి చెవిలో గుసగుసలాడాడు రెండో వ్యాపారి శుశ్రుతుడి చెవిన పడకుండా.

పది నిమిషాలపాటు నడిచి, గజశాల మాదిరిగానే వున్న మరో పెద్ద ఆవరణ దగ్గర ఆగాడు శుశ్రుతుడు.

గోడలు లేవు ఆ ప్రదేశంలో... దారిన పోయే వారెవరూ ఇష్టం వచ్చినట్లు లోనికి ప్రవేశించకుండా గట్టి కంచె మాత్రం ఏర్పాటు చేయబడి వుంది. ఆ కంచె వెనుక కనిపిస్తున్నాయి పెద్ద పెద్ద గడ్డివాములు.

గజశాలలోని జీవాలన్నిటికీ ఆహారం అది. సంత జరిగే రోజున నగరం వెలుపలనించి వచ్చిన గడ్డి బళ్ళన్నిటినీ అక్కడికే తీసుకువస్తారు భటులు. ఆ బళ్ళమీది గడ్డిని అక్కడి వాముల మీద వరుసగా పేరుస్తారు.

శుశ్రుతుడు చెప్పవలసిన అవసరం లేకుండానే తెలిసిపోయింది వ్యాపారులు ఇద్దరికీ... అతను చేస్తున్న ఆలోచన ఏమిటో.

చీకటి పడిన తర్వాత శాలలో వున్న జీవాలన్నిటిముందు వేయబడే గడ్డి ఆ ఆవరణలోని వాముల దగ్గర్నించే తీసుకుపోబడుతుంది. ఏదో ఒక వామి చాటున నిలబడి, అలా తీసుకుపోయేందుకు వచ్చిన పనివాళ్ళల్లో ఎవరినో ఒకరిని తెలివి తప్పేటట్లు కొడతాడు అతను. అచేతనంగా పడిపోయిన అతన్ని ఏదో ఒక వామిచాటున దాచి అతని వేషంలో తాను మిగిలినవారితో కలిసి గజశాలలోకి పోతాడు.

చీకటి సమయం కావటం వల్ల గుర్తుపట్టటం చాలా కష్టం అతన్ని. ఒకవేళ గుర్తుపట్టినా, అది గజశాలలోకి వెళ్ళిన తర్వాతనే జరుగుతుంది. ఈ లోపల జరగనే జరగదు. కారణం గడ్డివాముల దగ్గరికి దీపాలు గాని, కాగడాలు గాని తీసుకురారు ఎవరూ. ఏదైనా పొరపాటు జరిగితే వాములన్నీ అగ్నికి ఆహుతి అయిపోతాయనే భయం.

శుశ్రుతుడు చేసిన ఆలోచన తాము చేయలేకపోయినందుకు కొంచెం సిగ్గుపడ్డారు వారిద్దరు.

“మనకి బుద్ధి లేదు. ఈపాటికి వచ్చిన పని పూర్తిచేసుకుని నగరం వెలుపలికి వెళ్ళిపోయే పని” రహస్యంగా అన్నాడు వారిలో ఒకతను.

“ఇప్పుడు మాత్రం ముంచుకుపోయింది ఏమీలేదు. వెదురు గొట్టంలోని విష పదార్థాన్నంతా ఈ వాముల మీద జల్లేస్తే?” అడిగాడు రెండో వ్యక్తి.

“ఇన్ని వాముల మీద జల్లటానికి సరిపడే పదార్థం మన దగ్గర లేదు. ఒకటి రెండు వాములమీద జల్లినా, పనివాళ్ళు ఏ వామిలో నుంచి గడ్డిని తీసుకుపోతారో తెలియదు గదా...” అన్నాడు రెండో మనిషి.

“తర్జనభర్జనలు అవసరం లేదు. ఈ పెద్దమనిషి ఏం చేయబోతున్నాడో చూసిన తర్వాత ఆలోచించుకుందాం” రెండు క్షణాలు ఆలోచించి చెప్పాడు మొదటి మనిషి.

గుట్టుగా జరుగుతున్న వారి సంభాషణ శుశ్రుతుడి చెవులకు చేరలేదు... తనను ఎవరూ గమనించటం లేదని నిశ్చయం కాగానే, ఒక్క గంతులో మూడు మూరల ఎత్తు మాత్రమే వున్న కంచెను అధిగమించి లోపలికి పోయాడతను. ఎత్తుగా వున్న ఒక పెద్ద వామిచాటున నిలబడి ఎదురుచూడటం మొదలుపెట్టాడు.

కంచె దగ్గరే నిలబడి వుంటే తమను ఎవరో ఒకరు అనుమానిస్తారని వ్యాపారులిద్దరికీ తెలుసు. శుశ్రుతుడు కంచెను అధిగమించిన వెంటనే, తాము ఆ వీధి రెండవ పక్కకు పోయి, ఒక చెట్టుచాటున నిలబడ్డారు.

చీకట్లు ముదరబోతున్న సమయంలో రానే వచ్చాయి రెండు శకటాలు. గజశాల దగ్గర్నించి కొంచెం లోపలికి వాటిని తీసుకుపోయి ఆవరణ మధ్య భాగంలో వున్న ఒక వామిలో నుంచి గడ్డిమోపుల్ని వాటిమీద పేర్చటం మొదలుపెట్టారు వాటితో పాటుగా వచ్చిన నలుగురు పనివాళ్ళు.

ఒక శకటం నిండిపోయిన తర్వాత రెండో శకటం దగ్గరికి నిశ్శబ్దంగా వచ్చాడు శుశ్రుతుడు. ఒక్క గంతులో దానిమీదికి ఎక్కి బోర్లా పడుకుంటూ, శకటంలోనే చెల్లాచెదురుగా పడి వున్న గడ్డిపరకల్ని తన వంటినిండా కప్పుకున్నాడు.

కన్ను మూసి కన్ను తెరిచేటంతలో జరిగిపోయిందా పని. వీధికి రెండో ప్రక్కన చెట్టుచాటునుండి చూస్తున్న వ్యాపారులిద్దరికీ తప్ప మరో మనిషికి కనిపించలేదు. వామి దగ్గర్నించి గడ్డిమోపుల్ని తీసుకువస్తున్న పనివారికి అసలు అనుమానమే రాలేదు.

"గడ్డిమోపుల్ని చూడటానికి తేలికగానే వున్నా వాటి బరువు మాత్రం చాలా అధికంగానే వుంటుంది. భరించగలడంటావా?" రెండో వ్యాపారిని అడిగాడు మొదటి మనిషి.

"ఒకటి రెండు మోపులనయితే ఎలాగోలా భరించవచ్చు. బండి నిండుగా పేరిస్తే మాత్రం చాలా కష్టం. ఊపిరి ఆడదు" అన్నాడు రెండో వ్యాపారి.

తాము తెచ్చిన మోపుల్ని శకటంలో పడవేసి మరోసారి గడ్డివాముల దగ్గరికి పోయారు పనివాళ్ళు. పిల్లిలా లేచాడు శుశ్రుతుడు. వాళ్ళు వేసిన మోపుల క్రిందినించి వేగంగా కదిలి ఆ మోపుల పైభాగంలో పడుకుని, మరోసారి గడ్డిపరకలతో శరీరాన్ని మరుగు పరుచుకున్నాడు.

"ఏమో అనుకున్నాను గాని ఈ శుశ్రుతుడు తెలివైనవాడే" మెచ్చుకోలుగా చూస్తూ అన్నాడు మొదటి వ్యాపారి.

"ఎంతలేదన్నా అతను ఒక గూఢచారి. సరైన తెలివితేటలు లేకపోతే ఎప్పుడో పదవినించి పడిపోయి వుండేవాడు" అన్నాడు రెండో వ్యాపారి.

వాళ్ళు చూస్తూ వుండగానే గడ్డిమోపులతో నిండిపోయింది రెండవ శకటం కూడా. ఆవరణలో నుంచి దాన్ని , మొదటి బండిని బయటకు తీసుకువచ్చి గజశాల వైపు నడిపించడం మొదలుపెట్టారు పనివాళ్ళు.

తన దుస్తుల్లో దాచుకుని వున్న వెదురుగొట్టాన్ని బయటికి తీశాడు మొదటి వ్యాపారి. గట్టిగా బిగించి వున్న మూతను ఊడతీసి, బలంగా ముందుకు విసిరాడు.

చీకట్లు దట్టం అయివుండటం వల్ల ఆ వీధిలో సంచరిస్తున్న జనం ఎవరికీ కనిపించలేదు అతను చేసిన పని.

గింగిరాలు తిరుగుతూ పోయి ఎత్తుగా పేర్చి వున్న గడ్డిమోపుల మీద పడిందా గొట్టం. లోపల వున్న మెత్తటి పొడుము వంటి పదార్థమంతా బయటికి వచ్చి గడ్డిమీద పరుచుకున్నది.

❖ ❖ ❖

"చాలు... ఇవాల్టికి మన ప్రయాణం ఇక చాలు... నిద్ర ముంచుకు వచ్చేస్తోంది నాకు. కూర్చోవడం కష్టంగా వుంది" అరచేతితో మగ ఏనుగు కుంభస్తలాన్ని మృదువుగా తడుతూ ముందుకు వంగి చెప్పాడు శివుడు.

అర్థం అయినట్లు వెంటనే ఆగిపోయింది అది... పక్కకు తిరిగి ఒక పెద్ద చెట్టు కిందికి పోయి నిలబడింది.

బద్ధకంగా వళ్ళు విరుచుకుని పైనుంచి క్రిందికి చూశాడు శివుడు. నేలమీది ఎండుటాకుల్ని పాదాలతోనే పక్కకు జరిపి, కటిక నేలమీదే మేను వాల్చాడు.

క్రిందికి వాలి వున్న చెట్టుకొమ్మల్ని విరిచి ఆహారం తీసుకోవడం మొదలుపెట్టాయి పెద్ద ఏనుగులు రెండూ.

గున్న మాత్రం అలా చేయలేదు. నెమ్మదిగా శివుడి దగ్గరికి వచ్చి, తొండంతో అతని దట్టీని తడమటం మొదలుపెట్టింది.

చంద్రుడి గుట్ట మీదినించి బయలుదేరే ముందు చారులతాదేవి తనవెంట తీసుకువచ్చిన తీపి పదార్థాల్లో కొన్నింటిని ఆ దట్టీల్లోనే భద్రపరుచుకుని వున్నాడు అతను.

వాటి రుచి గున్న ఏనుగును అమితంగా ఆకర్షించింది కాబోలు, అతను దారి మధ్యలో ఆరగించగా, ఇంకా ఏమైనా మిగిలి వున్నాయేమో చూడాలని దాని అభిలాష.

మరునాటి ఉదయానికి సరిపడేటట్లు మిగుల్చుకున్నాడు శివుడు. ఇప్పుడు గున్న తన దగ్గరికి రాగానే, నవ్వుతూ వాటన్నిటినీ తీసి దానికి అందించాడు. అది ఆనందంగా ఆరగిస్తూ వుండటాన్ని చూసి, తనలో తాను నవ్వుకుంటూ కళ్ళు మూసుకున్నాడు.

మూసుకున్న మరుక్షణం వచ్చేసింది నిద్ర... వున్నట్లుండి మెలకువ కూడా వచ్చేసింది రెండు ఘడియల తరువాత.

కళ్ళు తెరిచీ తెరవగానే కనిపించాయి అతనికి అడవిలోకి చూస్తూ నిలబడి వున్న పెద్ద ఏనుగులు.

"ఏమయింది? మనల్ని పసికట్టిన జంతువులు ఏవైనా ఇటుగా వస్తున్నాయా?" అని అడుగుతూ లేచి నిలుచున్నాడు అతను.

ప్రమాదాన్ని చూసిన తల్లి తన పిల్లాడిని తన కొంగుచాటుకు లాగుకున్నట్టు తొండంతో అతన్ని తనపక్కకు లాగింది ఆడ ఏనుగు.

ప్రమాదాన్ని ఎదిరించటానికి సిద్ధపడే తండ్రి మాదిరి మూడు అడుగులు ముందుకు వేసి నిలబడింది మగ ఏనుగు.

"మీరు మరీ నన్నొక చిన్నపిల్లాడి మాదిరి భావించటం బాగోలేదు. నన్నుకూడా చూడనివ్వండి" అంటూ గబుక్కున ఏ చెట్టు క్రింద తాము నిలబడి వున్నారో ఆ చెట్టుమీదికి ఎగబ్రాకాడు శివుడు.

చిటారుకొమ్మల దాకా వెళ్ళవలసిన అవసరంలేకపోయింది. నేలమీదినించి నాలుగు నిలువుల ఎత్తుకు పోయిన వెంటనే కనిపించాయి అతనికి కాగడాలు.

భగభగలాడుతున్న ఆ కాగడాల్ని పట్టుకుని, తమ దారిలో వున్న ప్రతి చెట్టును పుట్టని, పొదని, ఒక్కదాన్నికూడా వదిలిపెట్టకుండా నిశితంగా పరిశీలిస్తూ వస్తున్నారు పదిమందికి పైగానే వున్న రాజభటులు.

మధ్య మధ్యలో "యువరాణీ... యువరాణీ... ఎక్కడ వున్నారు మీరు?" అని పెద్దగా కేకలు పెడుతున్నారు.

ఆ కేకల్ని ఆలకించడం వల్లనే తన ఏనుగులు అలా పోరాటానికి సిద్ధం అవుతున్నాయని వెంటనే తెలిసిపోయింది శివుడికి.

"తప్పిపోయిన యువరాణీ వారిని వెతకటం కోసం వచ్చిన భటులు వాళ్ళు. చీకటి కూడా లెక్కచెయ్యకుండా గాలింపు చర్యల్ని కొనసాగిస్తున్నారు" బర్రున చెట్టుమీదినుంచి దిగి, మగ ఏనుగు కుంభస్తలం మీదికి పాకుతూ చెప్పాడతను.

"మనం ఈ ప్రదేశంలో వెతుకులాడాల్సిన అవసరం లేదు. ఈ భటులు ఇప్పటికే ఒకటి రెండుసార్లు ఇటుగా వచ్చి వుంటారు" అంటూ దాన్ని కదలమని మడమలతో తట్టాడు.

క్షణం కూడా ఆలస్యంచేయకుండా కదిలింది ఆ ఏనుగు... ఆడ ఏనుగు, గున్న ఏనుగు తన వెనుక నడుస్తూ వుండగా, పొదలకు అడ్డం పడి, దూరంగా తీసుకుపోయింది అతన్ని.

శరీరం మరోసారి విశ్రాంతి తీసుకోమని మొండిపట్టు పడుతున్నా, శివుడి మనస్సు మాత్రం అందుకు అంగీకరించలేదు.

"సువర్ణానది ఈవలి వైపున వున్న అడవినంతా మన భటులు జల్లెడ వేసి వెతుకుతూ వుండివుంటారు. వాళ్ళు వెతికే ప్రదేశాల్లోనే మనం కూడా వెతకడం అనవసరం. ఒకవేళ యువరాణి నదికి ఆవలివైపుకు పోయివుంటే మాత్రం తప్పకుండా కష్టాల్లో పడిపోతుంది'' కుంభస్తలం మీద కుదురుగా కూర్చోవటానికి ప్రయత్నం చేస్తూ మగ ఏనుగుకు చెప్పాడు శివుడు. ఆడ ఏనుగు తనవంక ప్రశ్నార్థకంగా చూసినట్లు అనిపించేసరికి చిన్నగా నవ్వాడు.

"నదికి ఆవలివైపున వున్న ఆటవికులు నాగరికత అంటే నచ్చని అడవిలో నివశిస్తూ వుంటారట. వారిని లొంగతీసుకోవటానికి చక్రవర్తి చేసిన ప్రయత్నాలన్నీ ఎందుకూ పనికిరాకుండా పోయాయట. పరాయి జాతి మనిషి కంటపడితే వాళ్లు కాళ్ళు చేతులు కట్టేసి నదిలో వున్న మొసళ్ళకు ఆహారంగా పారేస్తారు. మా అయ్యవారు చెప్పిన మాటలు ఇవి" దానివంక చూస్తూ చెప్పాడు అతను. అప్పటికీ అది అలాగే చూస్తూ వుండటంతో విసుగు వచ్చేసింది అతనికి.

"నా మాటలన్నీ మీరు సరిగ్గా అర్థం చేసుకోవటం లేదు. సువర్ణానదిలో వున్న మొసళ్ళకు భయపడి మన జనం ఎవరూ అవతలి పక్కకు వెళ్ళే ధైర్యం చెయ్యరు... అందుకే ఆ ఆటవికులు అటు పక్కన హాయిగా బతకగలుగుతున్నారు. ఈ విషయాలు యువరాణికి తెలిసే వుండాలి... తెలియకపోతే మాత్రం చిక్కుల్లో పడి తీరుతుంది" అంటూ కాలిమడమతో మగ ఏనుగును హెచ్చరించాడు.

అతని ఉద్దేశ్యం తనకు తెలిసిపోయినట్లు వేగంగా నడవటం మొదలుపెట్టింది అది. తూర్పు దిక్కు తెల్లబడుతున్న సమయానికి సువర్ణానది ఒడ్డుకు చేరుకుని, ఎత్తయిన ఒక మట్టిదిబ్బమీద నిలబడింది.

అంతవరకూ ఆ దిబ్బ క్రింద హాయిగా విశ్రాంతి తీసుకుంటున్న కొన్ని మొసళ్ళు గబగబా కదిలి, నీటిలోకి ప్రవేశించాయి. దిబ్బమీద జీవాలు గనుక నీటిలోకి దిగితే వెంటనే ఒడిసి పట్టుకునేందుకు సిద్ధంగా వున్నట్లు కనిపించసాగింది వాటి వాలకం.

❖ ❖ ❖

గడ్డిబళ్లు గజశాలను సమీపించగానే తలుపులు తెరుచుకుంటాయి. బళ్ళు లోపలికి పోగానే తిరిగి మూసుకుంటాయి.

వెదురుగొట్టంలో నుంచి గడ్డిమీదికి జారిన విష పదార్థం ఆ సమయానికి బండి మీద వున్న గడ్డినంతా ఆవరించుకుంటుంది. ఆ గడ్డిని నోటిలో పెట్టుకున్న వెంటనే కళ్ళు తేలవేసి విరుచుకు పడిపోతాయి శాలలో వున్న ఏనుగులు.

అరుపులతో, ఆర్తనాదాలతో చరమదశకు చేరుకున్న ఏనుగుల హీన ఘీంకారాలతో అల్లకల్లోలమైపోతుంది గజశాల యావత్తూ.

నగర ద్వారాలకు దగ్గర్లోనే వున్న ఒక పూటకూటి ఇంట్లో బస చేసి వున్న తమ సహచరుల దగ్గరికి పోయి జరిగింది చెపితే ఎంతగానో సంతోషిస్తారు వారందరూ.

నగర ద్వారాలు తెరుచుకున్న మరుక్షణం గుంపుగా చంద్రుడి గుట్ట దగ్గరికి పోయి అక్కడ శిక్షను అనుభవిస్తున్న బాలకుడిని హతమారిస్తే, తాము సంపంగి నగరానికి ఎందుకు వచ్చారో ఆ పని విజయవంతంగా పూర్తి అయిపోతుంది. కనకయ్య శ్రేష్ఠి చేస్తున్న వ్యాపారాలను గురించి తెలిసిన బయటి మనిషి ఆ బాలకుడు ఒక్కడే.

స్వామికార్యం స్వకార్యం సంపూర్ణంగా పూర్తి కాబోతున్నాయన్న సంతోషంలో తలమునకలు అవుతూ ఊపిర్లు బిగపట్టి గజశాల వైపే చూస్తూ వీధికి అవతలి పక్కన ఒక ఇంటి చాటున నిలబడ్డారు బటాణీ వ్యాపారులు ఇద్దరూ.

ఒక ఘడియ గడిచింది. బళ్ళను తీసుకువచ్చిన సేవకులు నలుగురూ ఓరగా తెరిచిన తలుపుల్లో నుంచి లోపలికి పోయారే గానీ, బళ్ళు మాత్రం ఒక్క వేలెడు దూరం కూడా ముందుకు కదలలేదు.

రాత్రి రెండవ ఝాము కూడా ప్రవేశించింది. ద్వారం దగ్గర నిలబడి వున్న బళ్ళను గురించి పట్టించుకున్నవాళ్ళు ఎవరూ కనిపించలేదు.

మూడవ ఝాము వచ్చింది. నిలబడి నిలబడి కాళ్ళు నెప్పులు పుడుతున్నట్టు అసహనంగా కదిలాయి బళ్ళకు పూన్చివున్న వృషభాలు. పది నిమిషాల తరువాత వాటంతటవే తమకు తాము మెడలమీద వున్న కాడులను వదిలించుకుని బళ్ళ దగ్గరే పడుకోవటం మొదలుపెట్టాయి.

ఒకరి మొఖం ఒకరు చూసుకున్నారు బటాణీ వ్యాపారులు ఇద్దరూ. "బయట నిలబడి వుండటం వల్ల కాళ్ళు చేతులు కదిలించి కాలక్షేపం చేయగలుగుతున్నాము. పాపం గడ్డిమోపుల క్రింద వున్న శుశ్రుతుల వారు ఎలా భరించగలుగుతున్నారో..." సానుభూతిగా అన్నాడు ఒకతను.

రెండవ మనిషి ఆ మాటలకు సమాధానం చెప్పకముందే కిరకిరమని శబ్దాలు చేస్తూ పూర్తిగా తెరుచుకున్నాయి గజశాల ద్వారాలు.

అదే సమయంలో తమ అశ్వాలను పరుగులు తీయిస్తూ అక్కడికి వచ్చారు మండలాధిపతి సాగరుడు, ఆయన మంత్రి మహేశ్వరుడు.

"పరీక్షించటం పూర్తి అయిందా? అశ్వాన్ని దిగి కళ్ళేలను తమ వెనుకే పరిగెత్తుకు వచ్చిన ఒక భటుడికి అందిస్తూ, గజశాలలో నుంచి బయటికి వచ్చిన నిర్వాహకుడిని ప్రశ్నించాడు సాగరులవారు.

"లేదు ప్రభూ... ఇప్పుడే మొదలుపెట్టబోతున్నాము" అంటూ తనవెంట వెలుపలికి వచ్చిన పనివాళ్ళకు సైగ చేశాడు గజశాల నిర్వాహకుడు.

మొదటగా ఆగి వున్న బండి పై భాగంలోని గడ్డిమోపును క్రిందికి లాగి, ఆ గడ్డిని వాసన చూశాడు ఒక పనివాడు.

"సోదరా... వాళ్ళు చేస్తున్నపనేమిటి? మనం విషం ప్రయోగించినట్లు అనుమానం వచ్చి వుంటుందా?" ఆశ్చర్యంగా రెండో వ్యాపారిని అడిగాడు ఇంటి చాటున వున్న మొదటి బటాణీ వ్యాపారి.

"అనుమానం అంటూ వస్తే, ఈ బళ్లు ఇక్కడికి చేరుకున్న వెంటనే పరీక్షలు మొదలు అయ్యేవి. అదేమీ అయివుండదు. ఇదేదో కొత్త పద్ధతి మాదిరిగా కనిపిస్తోంది" చిన్నకంఠంతో చెప్పాడు అతను.

గడ్డిబండి అడుగు భాగంలోని కట్టలను కూడా క్రిందికి లాగి, వాసన చూశాడు ఆ పనివాడు. పక్కకు తిరిగి "తీసుకురండి" అని బిగ్గరిగా అరిచాడు.

గజశాలలో నుంచి వెంటనే బయటికి తీసుకు రాబడింది ఒక బక్కచిక్కిన వృషభం. గడ్డిమోపుల్ని చూడగానే ఆత్రంగా వాటిమీదికి ఎగబాకింది.

రెండు... మూడు... పది నిమిషాలు గడిచిన తర్వాత కూడా అది హాయిగా ఆరగిస్తూనే వుండటాన్ని చూసి తృప్తిగా తలవూపాడు సాగరులవారు.

వెంటనే శకటం మీది గడ్డినంతా క్రిందికి దించి లోపలకు మోసుకు పోయారు పనివాళ్ళు. ఖాళీ అయిన బండిని అవతలకు తీసుకుపోయారు.

రెండవ బండి దగ్గర క్రింద పడుకుని వున్న వృషభాలను అదిలించి లేపి నిలబెట్టారు గజశాల పనివాళ్ళు. అవి వదిలించుకున్న కాడులను తిరిగి వాటి మెడలమీద వేసి గజశాల ద్వారాలకు దగ్గరిగా బండిని తీసుకువచ్చారు.

మొదటి బండిలోని గడ్డిలో ఎటువంటి ఇబ్బందులు లేవని నిర్ధారణ అవటం వల్ల రెండవ బండిని పరీక్షించటం జరగదని ఆశపడిన బటాణీ వ్యాపారులకు నిరాశ ఎదురయింది.

బక్కచిక్కిన వృషభాన్ని ఆ బండిమీదికి పంపకం చేశారు పనివాళ్ళు. ఆత్రంగా అది గడ్డిని కొరికింది.

''పారిపోదాం... మన పథకం బెడిసికొట్టింది. ఆలస్యం చేస్తే పట్టుబడిపోతాము" వెంటనే మొదటి వ్యాపారిని హెచ్చరించాడు రెండో మనిషి.

అతను అలా హెచ్చరిస్తూ వుండగానే తెగులు తగిలినట్టు దీనంగా రంకె పెట్టి గిర్రున పక్కకు తిరిగింది బక్కచిక్కిన వృషభం. అందరూ చూస్తూ వుండగానే ఒక్కసారిగా విరుచుకు పడిపోయింది.

"ఒక్క క్షణికం ఆగు... గడ్డిమోపుల క్రింద శుశ్రుతుడు వున్నాడు... ఏం జరుగుతుందో చూసిన తర్వాత పారిపోదాం" అంటూ రెండో వ్యాపారికి చెప్పాడు మొదటి మనిషి.

"ప్రభూ... మీ అనుమానం యదార్థం. ఈ గడ్డి విషపూరితం" బండిలోని గడ్డిపరకల్ని రెండింటిని వాసన చూస్తూ సాగరుల వారికి చెప్పాడు గజశాల నిర్వాహకుడు.

"మన ఆవరణలో వున్న గడ్డివాములన్నింటినీ కూలంకషంగా పరీక్షించండి. ఇప్పటినించీ ఆవరణ దగ్గర పదిమంది భటుల్ని కాపలా పెట్టండి" ఖంగుమంటున్న కంఠంతో ఆజ్ఞ ఇచ్చాడు సాగరులవారు.

"మరి ఈ బండిలోని గడ్డిని ఏం చేద్దాం?" అడిగాడు అప్పటివరకూ మౌనంగా వున్న మహేశ్వరుడు.

"అగ్ని ముట్టించండి... ఒక పరక కూడా మిగలకూడదు. మొత్తం తగలబడిపోవాల్సిందే" అన్నాడు సాగరులవారు.

ఆయన ఆ మాట చెప్పిన వెంటనే లోపలినుంచి ఒక కాగడాని తెప్పించి శకటం మీదికి విసిరాడు గజశాల నిర్వాహకుడు.

ఆదరాబాదరగా ఆ శకటానికి పూన్చి వున్న వృషభాలను అవతలికి లాక్కుపోయారు అతని అనుచరులు.

ఆకాశాన్ని అంటుకొనేటంత ఎత్తుకు లేచి భగభగలాడటం మొదలుపెట్టాయి మంటలు.

ఆ మంటల మధ్యలో నుంచి గబుక్కున బయటికి దూకాడు అంతవరకూ ప్రాణాలు ఉగ్గబట్టుకొని వున్న శుశ్రుతుడు.

"బంధించండి... కాళ్ళుచేతులు కట్టి చెరసాలకు తరలించండి" అని ఆజ్ఞ ఇచ్చాడు సాగరులవారి కంటె ముందుగా మహేశ్వరుడు.

భయంతో వణికిపోతూ తల వంచుకు నిలబడిన శుశ్రుతుడు అతనికి ఎటువంటి సమాధానం ఇచ్చాడో, అసలు ఏమని మాట్లాడాడో వినిపించుకో లేదు బటాణీ వ్యాపారులు.

చప్పుడు చేయకుండా వెనక్కి జరిగి, అతివేగంగా నగర ద్వారాల దగ్గర వున్న పూటకూళ్ళ ఇంటికేసి పరుగులు తీశారు.

"వాళ్ళు ఇద్దరే వున్నారంటావా మహేశ్వరా?" వ్యాపారులు ఇద్దరూ వీధి అవతల పొంచి వున్నప్పుడు పొరపాటున కూడా తల పక్కకు తిప్పి, వారికేసి చూడని సాగరులవారు వెంటనే అడిగాడు మహేశ్వరుడిని.

"ఇద్దరైనా ముగ్గురైనా ముప్పది మంది అయినా గుట్టు రట్టు అయిన తర్వాత భయపడాల్సిన అవసరం లేదు... సైనికులతో సిద్ధంగా వున్నాడు సేనాధిపతి. వాళ్ళు ఎక్కడికి పోయారో చూసిన వెంటనే బంధించి తీసుకువస్తాడు" చెప్పాడు మహేశ్వరుడు.

"గడ్డిబండిలో దూరి గజశాలలో ప్రవేశించటం తేలిక అనుకున్నాడు శుశ్రుతుడు... అతనికి ఈ కుట్రలో భాగం వుండి వుంటుందా?" మరో ప్రశ్న వేశాడు సాగరులవారు.

"అడవిలోకి పోయిన శివుడు తిరిగి వచ్చిన తర్వాత అన్ని రహస్యాలు వాటంతట అవే బయటకి వచ్చేస్తాయి. తొందర అనవసరం. వాడిని రానివ్వండి" చెప్పాడు మహేశ్వరుడు.

"విషప్రయోగం జరుగుతుందని వాడు చెప్పి వుండకపోతే ఈరోజు మన సర్వనాశనాన్ని కళ్ళ చూసి వుండేవాళ్ళం. ఆ ఒక్క అల్లరి గుణం లేకుండా వున్నట్లయితే వాడు నిజంగా చాలా గొప్పవాడు అవుతాడు" గాఢంగా నిట్టూరుస్తూ చెప్పాడు సాగరులవారు.

"అయిందా? పని పూర్తి అయిపోయిందా?" నిద్రలు పోకుండా ఎదురు చూస్తున్నారు కాబోలు... పూటకూళ్ళ ఇంటిముందుకు పోయిన వెంటనే బటాణీ వ్యాపారులిద్దరికీ ఎదురు వచ్చి ఆత్రుతగా అడిగారు వారి సహచరులు అందరూ.

"ఆ పని పూర్తి కాలేదు... మన పని మాత్రం పూర్తి అయిపోయే క్షణం వచ్చేసింది. వెంటనే అవతలికి జారుకోవాలి. లేకపోతే ప్రమాదం" అన్నాడు మొదటి మనిషి.

"ఏమయిందిరా? అసలు ఏం జరిగింది?" ఆశ్చర్యంగా అడిగాడు వారి నాయకుడు.

"అంతా సర్వనాశనం జరిగింది. మనం ఏం చేయబోతున్నామో సాగరుల వారికి ముందుగానే తెలుసు. ఆ శుశ్రుతుడు ఏం చేస్తాడో కూడా తెలిసినట్లే వల పన్నాడు" అంటూ గజశాల దగ్గర జరిగిందంతా క్లుప్తంగా అతనికి చెప్పాడు రెండో మనిషి.

"మనం వెంటనే వెళ్ళిపోకపోతే మనకి కూడా అతనికి పట్టిన గతే పడుతుంది" అని కూడా చెప్పాడు.

పూటకూళ్ళ ఇంట్లోకి వెళ్ళి తమ సరంజామాను బయటికి తెచ్చుకునే ప్రయత్నం కూడా చేయలేదు ఎవరూ.

“పదండి... అందరూ నగర ద్వారాల దగ్గర వున్న గ్రామదేవత గుడి దగ్గరకు పదండి. ద్వారాలు తెరుచుకునేంత వరకూ ఆ గుడిదగ్గరే కాలక్షేపం చేసి వెంటనే బయటికి పోదాము” అన్నాడు నాయకుడు.

కలసికట్టుగా కదిలారు అందరూ. పదే పది అడుగులు వేశారు. పదకొండో అడుగు వేయకముందే శంఖాలు ఊదిన చప్పుడు వినవచ్చింది. అదిరిపడి పక్కకు చూసేసరికి, బరిశెలు బారుచేసి తమను చుట్టుముడుతున్న రాజభటులు చాలామంది కనిపించారు వారందరికీ.

❖ ❖ ❖

మగ ఏనుగు కుంభస్థలం మీదినించి దిగి, నీటి దగ్గరికి పోవాలని అనుకున్నాడు శివుడు. నీటి వేగం ఎంతుందో, ఆ దిబ్బ దగ్గిర్నించి అవతలి ఒడ్డును చేరుకోవటానికి వీలుపడుతుందో పడదో స్వయంగా చూసి తెలుసుకోవాలని అతని ఉద్దేశ్యం.

రెండు అడుగులు కూడా వెయ్యకముందే తొండంతో అతన్ని వెనక్కి లాగింది ఆడ ఏనుగు. కర్ణకఠోరంగా ఘీంకరించింది.

“నీటిలో దిగను తల్లీ... దగ్గిర్నించి చూసి వెంటనే వచ్చేస్తాను. మొసళ్ళు నాకోసం ఎదురుచూస్తున్నాయని నాకు తెలుసు” సమాధానపరచటానికి ప్రయత్నం చేశాడు అతను.

ఆ మాటలు తనకు రుచించనట్లు మరోసారి ఘీంకరించి, ఇంకా వేగంగా వెనక్కి లాగేసింది ఆడ ఏనుగు.

అవి చూస్తూ వుండగా తను నదిలోకి దిగటం గాని, అవతలి ఒడ్డుకు చేరుకునే ప్రయత్నం చేయడం గాని అసంభవమని తెలిసిపోయింది అతనికి.

బురద గుంటలో చిక్కుపడినప్పుడు నదిలోని మొసళ్ళు తమ మీదికి ఎగబడటాన్ని ఇంకా మర్చిపోయినట్లు లేవు అవి.

“అవతలి ఒడ్డును చేరుకోకుండా మనం అనుకున్న పనిని చక్కబెట్టడం అసాధ్యం. మీరు ఇలా అడ్డం పడుతుంటే ఆ పని చేయటం చాలా కష్టం” నదికి దూరంగా వచ్చేస్తూ అన్నాడు శివుడు.

నదిలో దిగే ఆలోచనను అతను వదిలేసినట్లు భావించాయి కాబోలు సంతోషంగా అతని వెనుకే నడిచాయి ఆ ఏనుగులు.

మట్టిదిబ్బకు వంద ధనువుల దూరంలో దట్టంగా ఎదిగి వున్నాయి పెద్ద పెద్ద వెదురు పొదలు. పట్టెడు పట్టెడు లావున్న ఆ వెదురు గడలను చూడగానే తళుక్కున శివుడి మనసులో మెదిలిందొక ఆలోచన.

'ఈ వెదురు గడలను విరిచి మంచి తెప్పను తయారు చేసుకోగలిగితే మొసళ్ళకు అందకుండా అవతలి ఒడ్డుకు వెళ్ళిపోవచ్చు' అనుకుంటూ పొదల దగ్గరికి పోయి, ఒక వెదురు గడను అతి బలవంతంగా క్రిందికి వంచాడు.

వంచటమైతే వంచాడు గాని, దాన్ని విరవటానికి మాత్రం చాలలేదు అతని చేతుల్లో బలం.

పెద్ద పెద్ద వేటకత్తులు గాని, గొడ్డళ్ళు గాని లేకుండా ఆ వెదురు గడలను నరకటం అసాధ్యమని వెంటనే తెలిసిపోయింది శివుడికి. చిన్న చిన్నవి చాలా వున్నాయి. అయితే అవి తెప్పగా తయారు చేసుకోవటానికి పనికిరాకపోవచ్చు.

ఆ పొదల్ని చూసిన వెంటనే వాటి సహాయంతో నదిని అధిగమించి అవతలికి వెళ్ళిపోవచ్చన్న సంతోషం చిటికెలో ఆవిరైపోతుండగా, నిరాశగా నిట్టూర్చాడు అతను.

లోతు తక్కువగా, మొసళ్ళు అధికంగా లేని ప్రదేశాన్ని వెతికి పట్టుకుని, అక్కడినించి నదిని దాటటం కంటె వేరే మార్గం లేదు.

"పదండి పోదాం... నది వెంబడే కొంతదూరం పోయి వెతుకుదాం..."తన వెనుకే నిలబడి తదేక దీక్షగా తనవంకే చూస్తున్న ఏనుగులకు చెప్పాడతను. ముందుకు అడుగు వేయబోయాడు.

అంతవరకూ అతను చేస్తున్న పనిని అత్యంత శ్రద్ధగా గమనిస్తూ వున్న గున్న, అతని మాటలు తనకు అసలు వినిపించనట్టు గబగబా ముందుకు కదిలి, అంతకుముందు అతను ఏ వెదురుగడను విరవటానికి ప్రయత్నించాడో ఆ గడను తన తొండంతో చుట్టి, గబుక్కున కిందికి వంచింది.

అది అలా చేస్తుందని ఊహించకపోవడం వల్ల కాస్తంత ఏమరిపాటుగా వున్నాడు శివుడు. ఒక్కసారిగా వంచబడిన వెదురుగడ, బలంగా వచ్చి అతని భుజాలకు తగిలింది.

నిలదొక్కుకోవటానికి ప్రయత్నం చేశాడు అతను. కాని ఫలించలేదు ఆ ప్రయత్నం. భుజాల మీద ఎవరో లాగిపెట్టి కొట్టినట్లు ముందుకు తూలి బోర్లా పడిపోయాడు నేలమీద.

పెద్దగా ఘీంకరిస్తూ వెదురుగడను వంచిన గున్నని తన తొండంతో అవతలికి నెట్టింది ఆడ ఏనుగు. రెండు అడుగులు ముందుకు వేసి పడిపోయిన శివుడిని పైకి లేపటానికి ప్రయత్నం చేసింది.

"ఆగు... ఒక్కక్షణం ఆగు... నన్ను వదిలేయ్..." తనకు చుట్టుకుంటున్న దాని తొండాన్ని పక్కకు నెడుతూ బిగ్గరగా అరిచినంత పనిచేశాడు శివుడు.

వదిలేయటమైతే వదిలేసింది గాని, దూరంగా మాత్రం జరగలేదు ఆ ఏనుగు. అలాగే నిలబడి అతనివంకే చూసింది.

క్రిందినించి పైకి లేచాడు శివుడు. పూర్తిగా లేవలేదు. మోకాళ్ళ మీద లేచి తనచుట్టూ ఎదిగివున్న పిచ్చిమొక్కల వంక పరిశీలనగా చూశాడు.

భూమికి జానెడు ఎత్తున, కొన్నిచోట్ల మూరెడు ఎత్తునా ఎదిగి వున్నాయి అవి. అంతకుముందు నేలకు అతుక్కుపోయి వున్నాయి వాటిలో కొన్ని.

"ఎవరు వచ్చివుంటారు? యువరాణి కోసం వెతుకుతున్న రాజభటులు ఎవరైనా ఇటుగా వెళ్ళివుంటారా?" తనలో తను అనుకుంటున్నట్లు పైకే అంటూ మోకాళ్ళమీదే మరికొంచెం ముందుకు నడిచాడు అతను.

ఎంతో దూరం పోలేదు. మూడే మూడు వింఢ్ల దూరం పోయాడు. సగం విరిగి ఒక పక్కకు వాలిపోయి వున్న ఒక ఉత్తరేణి మొక్కను చూడగానే చలిచీమలు కుట్టినట్లు అదిరిపడ్డాడు.

రక్తం... రక్తపు మడుగులో వుంది ఆ మొక్క. వెడల్పాటి దాని ఆకుల మీద కూడా స్పష్టంగా కనిపిస్తున్నాయి నెత్తురు మరకలు.

"దెబ్బ తగిలింది ఎవరికో... ఈ వెదురు పొదల్లోనుంచి వచ్చేటప్పుడు ఎవరి పాదమో తీవ్రంగా గాయపడింది. సందేహం లేదు..." అంటూ మగ ఏనుగు వంక చూశాడు అతను.

తొండాన్ని నిట్టనిలువుగా ఎత్తి గాలిని వాసన చూస్తోంది అది. చుట్టుపట్ల పరాయివ్యక్తులు ఎవరైనా వుంటే ఖచ్చితంగా పసికట్టి తీరుతుంది.

నాలుగు నిమిషాలు గడిచిన తర్వాత కూడా అది ఎటువంటి హెచ్చరికా చేయకపోవటంతో నిదానంగా లేచి నిలుచున్నాడు శివుడు.

"దెబ్బతిన్నవాళ్ళు ఎవరోగాని, చాలాదూరం వెళ్ళిపోయి వుంటారు. ఇప్పుడు మనం చేయవలసింది ఏమిటి? నదిని అధిగమించటమా? దెబ్బ తిన్నది ఎవరో తెలుసుకోవటమా?" తోటి మనిషిని అడిగినట్టు ప్రశాంతంగా నిలబడి వున్న ఆడ ఏనుగును అడిగాడు.

అడుగుతూ వుండగానే దాని సమాధానంతో అవసరం లేకుండా అవగతమైపోయింది అతనికి- తను చేయవలసిన పని.

అడవిలో నివశించే గ్రామీణులు తప్ప అన్యులు ఎవరూ సంచరించని ఆ ప్రదేశంలోకి వచ్చిన వారెవరో తెలుసుకోవటమే అతిముఖ్యం. తమకు ఎవరికీ అగుపించని యువరాణి జాడలు తమకంటె ముందుగా వచ్చిన ఆ నూతన వ్యక్తులకు కనిపించే అవకాశాలు చాలా వుంటాయి.

ఆ మాటలు మనసులో మెదిలిన వెంటనే ఒక్క క్షణికం కూడా ఆలస్యం చేయలేదతను. అడుగులు బలంగా పడటం వల్ల నలిగిపోయిన మొక్కల వంకే చూస్తూ ముందుకు నడవటం మొదలుపెట్టాడు.

సుశిక్షుతులైన సైనికుల మాదిరి అతని వెనుక మగ ఏనుగు, దాని వెనుక గున్న ఏనుగు, దాన్ని అనుసరించి ఆడ ఏనుగు నడవటం ఆరంభించాయి.

అర్థఘడియ మాత్రమే గడిచింది... ఉన్నట్లుండి తొండంతో అతని నడుమును చుట్టి బలంగా వెనక్కి లాగేసింది మగ ఏనుగు.

ఆశ్చర్యంగా చూసిన శివుడికి వంద ధనువుల దూరంలో పెద్ద చెట్టుక్రింద విడిది చేసివున్న అనేకమంది ఆయుధ ధారులు కనిపించారు.

❖ ❖ ❖

పెద్ద పెద్ద అడుగులు వేస్తూ భోజనశాలలోకి వచ్చాడు సాగరులవారు. సిద్ధంగా వుంచబడిన బంగరు పళ్ళెరం ముందు కూర్చోబోతూ "దేవిగారు ఎక్కడ?" అని పరిచారికను అడిగాడు.

"అంతఃపురంలోనే వుండిపోయారు ప్రభూ... మీరు గమనించారో లేదో గాని శివుడిని అడవిలోకి పంపించిన క్షణం నుంచీ ఆమె ఆహారం తీసుకోవడం లేదు. అతి బలవంతం మీద ఒక చిన్నపాత్రలో కొద్దిగా నిమ్మరసం మాత్రమే తీసుకున్నారు" చెప్పింది పరిచారిక.

భోజనశాలలో వున్న పదార్థాలన్నిటినీ తనొక్కడే ఆరగించేయాలన్నంత ఆకలిమీద వచ్చిన సాగరులవారికి, ఆ మాటలు ఆలకించిన మరుక్షణం మందగించిపోయినట్లు అనిపించింది ఆకలి.

"గజశాల బాగోగులు పరివేక్షిస్తూ మేము హడావుడిగా వుండటం వల్ల దేవిగారి గురించి పట్టించుకోలేకపోయాము" అంటూ గబుక్కున భోజనశాలలో నుంచి బయటికి వచ్చాడు.

"ప్రభూ... ముందు తమరు భోజనం చేయండి" ఆందోళన నిండిన కంఠంతో ఆ పరిచారిక అతన్ని ఆపటానికి ప్రయత్నించింది.

ఆగలేదు సాగరుల వారు. వేగంగా నడుస్తూ చారులతాదేవి మందిరం దగ్గరికి పోయాడు.

మందిరం ముందుభాగంలో పెద్దపందిరి. సుగంధ సుమధుర పరిమళాలను వెదజల్లే మాలతీ తీగె ఒకటి ఆ పందిరినంతా ఆవరించుకుని వుంటుంది.

ఆ పందిరి క్రింది ఒక ఆసనంమీద కూర్చుని కనిపించింది ఆయన అర్ధాంగి చారులతాదేవి.

ఒంటరిగా లేదామె. చుట్టూ పదిమంది పరిచారికలున్నారు. ఎదుట ఒక అందమైన చిరిచాపమీద బాసిపట్టు వేసుకుని కూర్చుని వుంది ఎరుకలసాని బసివి.

"కావురు కమ్మిన మబ్బులు అడవిలో జడివాన కురిశాయే తల్లీ. అవి ఎప్పుడు ఎక్కడ కురుస్తాయో చెప్పటం కష్టమని అదివరకు నీతో అన్నాను గుర్తుందా?" ముందుకీ వెనక్కీ ఊగుతూ మాట్లాడుతోంది బసివి.

"జరగాల్సింది ఏదో జరిగిపోయింది. ఇకముందు ఏమౌతుందో చెప్పు. మా శివుడిని నేను వంటరిగా అడవిలోకి పంపించాను. వాడు ఏమైపోయాడో తెలియడంలేదు" అంటున్నది చారులతాదేవి.

"ఒంటరిగా పంపించానని నువ్వు అనుకుంటున్నావు. వెంట వందమంది భటులకు సరితోడయిన బలగం వుంది. కంటికి రెప్పలా, పంటికి పెదవిలా కాపాడుతుంది ఆ బలగం. త్వరలోనే వాడు నీ దగ్గరికి వచ్చేస్తాడు" ముందుకీ వెనక్కి ఊగటాన్ని ఆపకుండా చెప్పింది బసివి.

"అభం శుభం తెలియని చిన్నవాడూ... ప్రభువులు విధించిన శిక్ష కారణంగా బాగా నీరసించిపోయి వున్నాడు. నిభాయించుకోగలడంటావా?" మళ్ళీ అడిగింది చారులతా దేవి.

"వాడా? నిభాయించుకోవటమా? పిచ్చితల్లీ... వాడిని నిభాయించుకోగల శక్తి పగవాళ్ళకి వుంటుందా?" అంటూ ఎందుకో ఉన్నట్లుండి ఉలిక్కిపడింది బసివి. చారులతాదేవికి గాని, ఆమె పరిచారికలకు గాని, ఎవరికీ కనిపించని దృశ్యం ఏదో తనకు కనిపించినట్లు ఆశ్చర్యంతో వెడల్పు అయ్యాయి ఆమె కళ్ళు.

"ఏమిటది బసివీ? ఏమయింది?" చారులతాదేవికి బదులుగా తను అడిగింది ఒక పరిచారిక.

"నీడ ఒకటి కనిపిస్తోందే తల్లీ... శివయ్య వెన్నంటి నడుస్తోంది. వాడు వేస్తున్న ప్రతి అడుగును జాగ్రత్తగా గమనిస్తోంది..."

ఆశ్చర్యం అధికమైపోతుండగా "ఎవరు బసివీ? ఆ నీడ ఎవరు?" అడిగింది చారులతాదేవి.

"చెప్పలేను తల్లీ... అదిగో కనిపించినట్టే కనిపించి మటుమాయం అయిపోయింది..." అన్నది బసివి.

ఇంకా ఏదో అడగబోయిన చారులతాదేవిని చేయెత్తి ఆపేసింది. "నేను చెప్పగలిగింది చెప్పాను. పూర్తి అయిపోయింది. అంబ వాక్కు ఆగిపోయింది" అంటూ చాపమీదినించి లేచింది.

పరిచారికల వంక చూసింది చారులతాదేవి. సిద్ధంగా వుంచిన పెద్ద పళ్ళెరం నిండా బియ్యము, జొన్నలు, రెండు వెండి నాణేలు... పప్పు, ఉప్పు మొదలైన సంబారాలను నింపి బసివికి అందించారు వాళ్ళు.

"చల్లగా వుండాలి తల్లీ... వెయ్యేళ్ళు హాయిగా వర్ధిల్లాలి" అంటూ బయలుదేరుతున్న బసివిని వెంటనే ఆపేశాడు అంతవరకూ దూరంగా నిలబడి వున్న సాగరులవారు.

ఎవరిని చూసినా ఇసుమంతయినా చలించని బసివి, ఆ విగ్రహాన్ని చూసేసరికి కొంచెం తడబాటుకు గురి అయింది.

"అడిగినదానికి సూటిగా సమాధానం చెప్పకుండా డొంకతిరుగుడు మాటలతో దేవిగారిని బెదిరించినట్లు నన్నుకూడా బెదిరించాలని చూడకు.

అడవిలో కనిపించకుండా పోయిన యువరాణి జ్వాల జాడలు మాకు తెలుస్తాయో లేదో చెప్పు" సూటిగా అడిగాడు సాగరులవారు.

"నా వంటిమీదికి వచ్చిన అమ్మతల్లి వెళ్ళిపోయి చాలాసేపయింది. నేనేమీ చెప్పలేను" బెదురు బెదురుగా చూస్తూ చెప్పింది బసివి.

"చెప్పేదాక నువ్వు ఇక్కడినించి అవతలికి పోకూడదు. ఎవరక్కడ?" అంటూ దూరంలో వున్న భటులను పిలవబోయాడు సాగరులవారు.

వెంటనే ముందుకు నడిచి ఆయన భుజంమీద చెయ్యి వేసింది చారులతాదేవి. "ఎరుకల సానులతో మాట్లాడటం, అమ్మవారి ఆలయంలో పూజలు చేయించటం, శ్రావణమాసంలో నోములు నోచుకోవటం, ఇవన్నీ మాకు మాత్రమే ప్రత్యేకించిన పనులు. మీ మగవాళ్ళకు సంబంధం లేనివి. దయచేసి జోక్యం చేసుకోకండి. మీకు అనవసరం" అంటూ తన పరిచారికలకు సైగ చేసింది.

ముందుకు వచ్చి బసివిని వెంటబెట్టుకుని అవతలికి తీసుకుపోయారు వాళ్ళు. అంతఃపుర మందిరాలకు ఆవల వున్న రాచవీధిలో వదిలిపెట్టి వెనక్కి వచ్చారు.

"యువరాణిని గురించి ఒక్కమాట కూడా మాట్లాడకుండా నువ్వు ఆ శివుడి గురించే మాట్లాడావు. జ్వాల కంటె శివుడే ముఖ్యమా మనకి?" కోపంగా అడిగాడు చారులతాదేవిని సాగరులవారు.

"చక్రవర్తి ఏదైనా యుద్ధానికి బయలుదేరేటప్పుడు సాగరుల వారి వద్దవున్న గజబలాన్ని గురించి ఆలోచిస్తాడా లేక సాగరుల వారిని గురించా?" ఎదురు ప్రశ్న వేసింది ఆమె.

"యుద్ధంలో గజబలమే ప్రధానం... సాగరుడు కాదు."

"ఇప్పుడు నేనుకూడా ఆ పద్ధతిలోనే ఆలోచించాను. శివుడు క్షేమంగా వుంటే తప్ప యువరాణి జాడలు బయటికి రావు. అడవినంతా జల్లెడ పడుతున్న మీ సైనికులు ఇంతవరకూ విరగపొడిచింది ఏమిటో మీరు చెప్పగలరా?" మరో ప్రశ్న వేసింది చారులతాదేవి.

"అంతమంది సుశిక్షితులైన సైనికులు ఎవరూ చేయలేని పనిని ఆ శివుడు చెయ్యగలడా?" కోపంగా అడిగాడు సాగరులవారు.

"వాడు ఏం చెయ్యగలడో తెలిసిన తర్వాత కూడా మీరు మొండిగా వాదించదలుచుకుంటే నేను చెప్పగలిగింది ఏమీలేదు. మీ గజశాల ఇప్పుడు సురక్షితంగా వుండటానికి కారణం ఎవరో..." అంటున్న ఆమెనోటిని వెంటనే తన అరచేత్తో సున్నితంగా అదిమి, చిరునవ్వు నవ్వాడు సాగరులవారు.

"నా చేతగానితనాన్ని కప్పిపెట్టుకోవటానికి మొండిగా వాదిస్తున్నానే గాని, యదార్థం ఏమిటో తెలియక కాదు. చక్రవర్తి దగ్గిర్నించి ఎటువంటి వర్తమానాలు వస్తాయో తలచుకుంటే కాళ్ళు చేతులు ఆడటంలేదు" అన్నాడు.

"వచ్చింది ప్రభూ... వార్తలను చేరవేసే పావురం ఒకటి ఇప్పుడే వచ్చింది" పావురాలను వుంచి సంరక్షించే మందిరం దగ్గిర్నించి పరుగు పరుగున వస్తూ చెప్పింది ఒక పరిచారిక. తాను తీసుకువచ్చిన చిన్న వస్త్రపు ముక్కను ఆయనకు అందించింది.

మడతలు పెట్టి వున్న ఆ వస్త్రపు ముక్కమీద రాజముద్రికను చూడగానే కనులకు అద్దుకుని చారులతాదేవికి అందించాడు సాగరులవారు.

"చదివే ధైర్యం నాకు లేదు... నువ్వేచూడు" అన్నాడు.

చిరునవ్వు నవ్వుతూ మడతలు విప్పింది ఆమె. పైనుంచి క్రిందివరకూ చదివి ఆశ్చర్యంతో నొసలు ఎగురవేసింది.

"ఎందుకు ఆశ్చర్యం? ఏముంది అందులో?" ఆత్రుతగా అడిగాడు సాగరుల వారు.

"యువరాణి మాయమైపోయిన సంగతి చక్రవర్తికి ఇంకా తెలియదు... యువరాణితో వచ్చిన భటుల దగ్గర వార్తలను చేరవేసే పావురాలు లేవు" చెప్పింది చారులతాదేవి.

"విషయం ఏమిటో చెప్పకుండా నీ అభిప్రాయాలు తెలియచేయడం అనవసరం. అందులో వున్నది చెప్పు" తొందరపెట్టాడు సాగరులవారు.

"శిఖావంతుడి రాజ్యంలో సైన్య సమీకరణలు అధికమయ్యాయట. ఏ సమయంలోనైనా దండయాత్ర మొదలు కావచ్చని అనిపిస్తోందిట. గజబలాన్ని సిద్ధం చేసి, ఆజ్ఞ ఇచ్చిన వెంటనే రాజధానికి తరలించేందుకు సర్వసన్నద్ధంగా వుండాలిట. అన్నిటికంటె ముఖ్యమైన విషయం ఏమిటంటే మన గూఢచారుల నాయకుడు వాసుదేవుడు ఇరువది దినాలుగా చక్రవర్తి సమక్షానికి రానేలేదట...

ఒకవేళ అతను ఈ చుట్టుపట్ల సంచరిస్తూ వుండి వుంటే, వెంటనే రాజధానికి పంపించవలసిందిగా ఆజ్ఞ...!" వస్త్రపు ముక్కమీద వ్రాయబడి వున్న విశేషాలను వరుసగా చెప్పింది చారులతాదేవి.

శిఖావంతుడి సైన్య సమీకరణ మాటను గురించి పెద్దగా పట్టించుకోలేదు సాగరుల వారు. తన గజదళాన్ని సిద్ధంగా వుంచాలన్న విషయాన్ని గురించి కూడా గట్టిగా ఆలోచించలేదు. గూఢచారుల నాయకుడు వాసుదేవుడు ఏమైపోయాడో తెలియదనే మాట చెవుల పడిన మరుక్షణం... ఝల్లుమన్నది ఆయన శరీరం.

"ఇది సామాన్యమైన విషయం కాదు. ఇందులో ఏదో కుట్ర దాగి వుంది. చెప్పాపెట్టకుండా మాయమైపోయే మనిషి కాదు మన వాసుదేవుడు" అంటూ అతివేగంగా కదిలి వెళ్ళాడు అక్కడినించి.

"ఆగండి ప్రభూ... ఒక్కక్షణం ఆగండి" అంటూ ఆపటానికి ప్రయత్నం చేసింది చారులతాదేవి.

ఆగలేదాయన. పరిగెత్తుతున్నట్టుగా నడిచి పదినిమిషాల్లో అంతఃపుర మందిరాలకు వెనుకభాగంలో వున్న కారాగార భవనం దగ్గరికి పోయాడు.

విచ్చుకత్తులు పట్టుకుని సర్వసన్నద్ధంగా నిలబడి వున్నారక్కడ భటులు. ఆయన్ను చూడగానే తలలు వంచి అభివాదం చేశారు.

చూసీచూడనట్లు తలను పంకిస్తూ, లోపలికి పోయాడు సాగరులవారు. మసక చీకటితో నిండి వున్న ఒక మందిర ద్వారం దగ్గర నిలబడి "తలుపులు తీయండి" అని ఆజ్ఞ ఇచ్చాడు.

"మంత్రి మహేశ్వరుల వారు సేనాధిపతితోను, గజశాల నిర్వాహకుడితోను కలిసి శుశ్రుతడిని విచారిస్తున్నారు ప్రభూ..." వినయంగా సమాధానం ఇచ్చారు అక్కడి భటులు.

మరోసారి ఆజ్ఞ ఇవ్వలేదు సాగరుల వారు. ఎడమ పాదాన్ని ఎత్తి ఆ మందిరపు తలుపుల్ని బలంగా తన్నాడు.

కిరకిరమని వికృతశబ్దాలు చేస్తూ తెరుచుకున్నాయి అవి. లోపల వున్న మహేశ్వరుడు మొదలయినవారు అదిరిపడి చూశారు ఆయనవంక.

కాళ్ళూ చేతులు దృఢంగా బిగించి కట్టబడి వున్నాడు ఆ మందిరంలో వున్న శుశ్రుతుడు. అతను ఒక్కడే కాదు, అతనికి సహకరించబోయిన బఠాణీ

వ్యాపారస్తులు, నగర ద్వారం దగ్గర పట్టుబడిన ఆ వ్యాపారస్తుల సహచరులు అందరూ అదే మందిరంలో నిలబెట్టి వున్నారు.

తలుపుల్ని విరగదన్ని లోపలికి పోయిన వెంటనే మహేశ్వరుడి దగ్గర నిలబడి వున్న ఒక భటుడి చేతిలోని బరిశెను తను బలవంతంగా లాక్కున్నాడు సాగరులవారు. తాను ఏం చేయబోతున్నాడో అక్కడి వారికి అవగతం అయ్యేలోపల బరిశెను తిరగవేసి శుశ్రుతుడిని, అతనితో పాటుగా వున్న దృఢకాయుల్ని ఇష్టం వచ్చినట్లు మర్దించటం మొదలుపెట్టాడు.

ఆయన అక్కడికి వచ్చేవరకూ అతి ప్రశాంతంగా జరుగుతోంది విచారణ. లోపల వున్న వారి కంఠాలు బయటికి వినిపించటం లేదు. అటువంటిది-మర్ధనా కార్యక్రమం మొదలు అయిన వెంటనే దారుణమైన ఆర్తనాదాలతో కంపించిపోవటం మొదలుపెట్టింది ఆ మందిరం.

"ఆగండి ప్రభూ... ఒక్కక్షణం ఆగండి... దయచేసి శాంతం వహించండి" ఆదరాబాదరగా అంటూ సాగరుల వారిని అడ్డుకునే ప్రయత్నం చేశాడు మహేశ్వరుడు.

"వీళ్ళు పరమ దుర్మార్గులు మహేశ్వరా... మన నగరంమీద మన గజదళం మీద దాడి చేయటం మాత్రమే కాదు... మన వాసుదేవుడి మీద కూడా ఏదో అఘాయిత్యం జరిపినట్లు మాకు అనిపిస్తోంది. అదేమిటో వెంటనే మనకు తెలియాలి. తెలియచెప్పేటంత వరకూ భటులతో చావకొట్టించండి. ఇనుప కడ్డీలను కాల్చి ఒళ్ళంతా వాతలు పెట్టించండి" ఆయాసంతో రొప్పుతో అతనికి చెప్పాడు సాగరులవారు.

వాసుదేవుడి పేరు వినగానే మహేశ్వరుడి ముఖం కూడా కళ తప్పింది. కనుబొమ్మలు ముడివేసి క్రూరంగా చూశాడు శుశ్రుతుడి వంక.

"దేవుడి మీద ప్రమాణం చేసి చెపుతున్నాను. రాజద్రోహం నేను చేయలేదు. పటిష్టమైన కాపలా వున్న గజశాలలోకి ఇతరులు తేలికగా ప్రవేశించగలరని నిరూపించటం కోసమే నేను ప్రయత్నించాను. అదే నేను చేసిన తప్పు. అంతకుమించి నాకే పాపమూ తెలియదు" కనులనిండా నీరు ప్రత్యక్షం అవుతుండగా చెప్పాడు శుశ్రుతుడు.

"అడవిలో ఆగంతకుల్ని మేము కలిసిన మాట వాస్తవం... గజశాలలోని ఆహారంలో విషం కలపటానికి ఒప్పుకున్న మాట కూడా వాస్తవమే. వాసుదేవుల వారి గురించి మాకేమీ తెలియదు" దణ్ణాలు పెడుతూ చెప్పారు దృఢకాయులు.

మహేశ్వరుడు మెత్తబడినట్లు కనిపించాడు గాని, సాగరుల వారి మొఖంలో ఎటువంటి మార్పులు రాలేదు.

"మీకందరికీ మూడుదినాలు వ్యవధి ఇస్తున్నాము. వాసుదేవుడి సంగతి వెంటనే మాకు తెలియాలి. లేకపోతే మేమే స్వయంగా మిమ్మల్ని చిత్రవధ చేసి చంపేస్తాము" అని హూంకరిస్తూ ఆ మందిరంలో నుంచి బయటకు వచ్చాడు.

మందిర ద్వారాలను మూయించి ఆయనతో పాటు అడుగులు వేశాడు మహేశ్వరుడు. చక్రవర్తి దగ్గర్నించి వచ్చిన వర్తమానాన్ని విన్న తరువాత అతన్ని కూడా ఆవరించుకున్నది ఉద్వేగం.

"మనకి చెడురోజులు సంప్రాప్తించినట్లున్నాయి... ముందు ఆ శివుడి గోల, తర్వాత గజశాల మీద దాడి ప్రయత్నం... యువరాణి మాయం కావటం. ఇప్పుడు వాసుదేవుడు కనిపించకపోవడం..." అంటూ నుదురు రుద్దుకున్నాడు.

"ప్రభూ... మన సైన్యంలో సగభాగాన్ని నగరం చుట్టూ వెతికేందుకు పంపిస్తే?" వెనుకగా వస్తున్న సేనాపతి అడిగాడు.

"నగరం అరక్షితం అవుతుంది. శిఖావంతుడికి కావాల్సింది అదే అయితే మరిన్ని కష్టాలు మనకి సంప్రాప్తిస్తాయి" అన్నాడు మహేశ్వరుడు.

"ఇప్పుడు ఏం చెయ్యాలి మహేశ్వరా? చక్రవర్తికి ఏమని సమాధానం పంపాలి?" నీరసంగా అడిగాడు సాగరులవారు.

"వెతికించే పనిమీద వున్నామని సందేశాన్ని పంపిద్దాం" అన్నాడు మహేశ్వరుడు.

"మరి యువరాణిని గురించి? తనకు చెప్పలేదని ఆయన ఆగ్రహిస్తే తట్టుకోగలమా?" అడిగాడు సాగరులవారు.

సమాధానం చెప్పలేకపోయాడు మహేశ్వరుడు. పది క్షణికాల పాటు ఆలోచించి "ఇటువంటి మాటలు మన దేవిగారి నోటివెంట వస్తే చక్రవర్తి కొంచెం నిదానిస్తారు. మీరు వెంటనే దేవిగారిని సంప్రదించండి. ఈ లోపల

అడవిలో గాలింపు చర్యల్ని నేను రెట్టింపు చేయిస్తాను" అంటూ సేనాపతి వంక చూశాడు మహేశ్వరుడు.

"వాళ్ళూ వాళ్ళూ కాదు. నేనే స్వయంగా బయలుదేరి వెళతాను... నావెంట పావురాల్ని తీసుకుపోయి ఎప్పటికప్పుడు మీకు వార్తల్ని అందచేస్తాను" అన్నాడు సేనాపతి.

తృప్తి కలుగకపోయినా కలిగినట్లు తలవూపాడు సాగరులవారు.

❖ ❖ ❖

"నడవ్వే పిల్లా... నడవటానికే కదా నీ కాళ్ళను కట్టేయకుండా వదిలేసింది? కాళ్లు విరిగిపోయినట్లు కుంటినడకలు నడుస్తావేమిటి?" అంటూ జ్వాలను గట్టిగా ఒక నెట్టి నెట్టాడు నెమలి ఈకల కిరీటాన్ని పెట్టుకుని వున్న ఆటవికుడు.

కదలించటానికి వీలులేకుండా వెనక్కి విరిచి కట్టేయబడి వున్నాయి జ్వాల చేతులు. అందువల్ల తూలిపడిపోకుండా వుండలేకపోయింది. మొఖం నేలకు పొడుచుకుని, అంతకుముందు తగిలిన దెబ్బమీదనే మళ్ళీ దెబ్బ తగలటంతో బాధగా శబ్దం చేసింది.

కఱ్ఱముక్కని విసిరి ఆమెను పడగొట్టిన వెంటనే పిశాచాల మాదిరి ఆమెచుట్టూ ప్రత్యక్షం అయ్యారు ఆటవికులు అంతకుముందు రోజు. కాళ్ళు చేతులు కట్టేసి అడవిజంతువును తీసుకుపోయినట్లు భుజాలమీద మోస్తూ, తమ గూడెం దగ్గరికి తీసుకుపోయారు.

"ఈ నాగరికులను నమ్మటానికి వీలులేదు. ఒంటరిగా వచ్చిందని జాలిపడితే రేపు ఈపాటికి ఇంకో వందమందిని ఇక్కడికి రప్పిస్తుంది. మన ఆనవాయితీ ప్రకారం మొసళ్ళకు ఆహారంగా వేయటమే మంచిది. నెప్పి తెలియకుండా నిన్ను గుటుక్కున మింగేస్తాయి. పద పద..." అంటూ చేతులకు కట్టిన తాళ్ళను అలాగే వుంచి, పాదాలను మాత్రం వదిలిపెట్టారు నడవటానికి వీలుగా.

ఇప్పుడు క్రిందపడిన వెంటనే జుట్టు పట్టుకొని బలవంతంగా పైకి లేపాడు నెమలి ఈకల కిరీటాన్ని పెట్టుకున్న ఆటవిక నాయకుడు.

గూడెంలో నుంచి బయలుదేరిన పావు ఘడియకల్లా వారందరి ఎదుట ప్రత్యక్షం అయింది సువర్ణానది.

ఒడ్డుమీదినించి చీలమండలు మునిగే లోతువరకూ నదిలో దిగి చేతిలోని చెట్టుకొమ్మతో నీటిని దబదబ బాదాడు నాయకుడు.

"రండి రండి... పసందయిన విందు భోజనం తీసుకువచ్చాము... వెంటనే వచ్చి ఆరగించండి" అని కేకలు పెట్టాడు.

ఒడ్డుమీదనే నిలబెట్టబడి వున్న జ్వాల శరీరం కంపించడం మొదలు పెట్టింది. మనిషి జాడ తెలిసిన వెంటనే గుంపుగా వచ్చేస్తాయి మొసళ్ళు. నీటిలో దిగి అంత గట్టిగా అరిస్తే ఆలస్యం చేస్తాయా?

లుకలుకలాడుతూ ఒకదాని మీదినించి మరొకటి ఎగిరెగిరి దూకుతూ కట్టకట్టుకు వచ్చేయాల్సిన మొసళ్ళలో– పదినిమిషాల కాలం గడిచిన తర్వాత కూడా ఒక్కటీ అటుకేసి రాకపోవటం ఆమెకే కాదు... ఆటవికులకు కూడా కలుగచేసింది విపరీతమైన ఆశ్చర్యాన్ని.

"ఏంటిరా ఇది? ఏవిరా మొసళ్ళు? ఏమైపోయాయిరా?" వెనుతిరిగి తనవారి వంక చూస్తూ సంభ్రమంగా అడిగాడు నాయకుడు.

"నీ అరుపు వినిపించి వుండదు. ఇంకోసారి అరువ్" అన్నాడు ఒక వృద్ధ ఆటవికుడు.

ఇంకోసారి చెట్టుకొమ్మతో నీటిని దబదబ బాదాడు ఆటవికుల నాయకుడు. అడవంతా వినిపించేటట్లు బిగ్గరిగా అరిచాడు. అరిచిన మరికొన్ని నిమిషాలు గడిచిన తర్వాత కూడా వారికి కనిపించలేదు మొసళ్ళు.

"ఇదేదో చాలా విచిత్రంగా వుంది. ఈ నరబలి వాటికి ఇష్టం లేదని అనుకుంటున్నాయా?" ఆశ్చర్యంగా అన్నాడు నాయకుడు.

అతనికి, అతని సహచరులకే కాదు జ్వాలకి కూడా వింతగానే అనిపించింది ఆ పరిణామం.

ఏమైపోయాయి అవి? ఎక్కడికి పోయాయి?

"ఇవాళ్టికి ఆగి రేపు తీసుకువస్తే ఎలా వుంటుంది?" బలి తతంగాన్ని మరునాటికి మార్చమని అంటున్నట్లుగా మాట్లాడాడు ఒక ఆటవికుడు.

"ఒకసారి ఇక్కడికి వచ్చిన తర్వాత ఒట్టిగా వెనక్కి పోతే మకర దేవతకి మహాకోపం వచ్చేస్తుంది" అంటూ క్షణికంపాటు ఆలోచించి, ఇద్దరు ఆటవికుల్ని తాము నిలుచుని వున్న ప్రదేశానికి అటూ ఇటూ పంపించాడు నాయకుడు. "పోయి జాగ్రత్తగా వెతకండి. అసలు ఏం జరిగిందో చూసిరండి" అన్నాడు.

వీపులకు వేలాడదీసుకున్న విల్లంబుల్ని సిద్ధంగా పట్టుకుంటూ ఒకడు నది ఎగువకు, రెండవ మనిషి దిగువకు పరిగెత్తారు.

“వాళ్ళు వచ్చేసరికి ఆలస్యం అవుతుంది. కూర్చోబెట్టండి కూనని... నిలబడి వుంటే అలసిపోతుంది. అలసిపోయిన మడిసి మకర దేవతలకు రుచిగా అనిపించదు” తనవారికి చెప్పాడు నాయకుడు.

నిలబడి వున్న జ్వాలను వెనక్కి తీసుకుపోయి ఒక చెట్టుక్రింద కూర్చోబెట్టారు ఆటవికులు.

తన కోసం అడవినంతా గాలించే తమ భటులు ఎవరైనా ఆ సమయంలో అవతలి ఒడ్డుదగ్గరికి వచ్చి తననూ, ఆటవికుల్నీ గమనిస్తే బాగుండునని జ్వాలకు అనిపించింది.

తాను అక్కడ బంధింపబడినట్లు తెలిస్తే, వాళ్ళు నదిలో వుండే మొసళ్ళను కూడా లెక్క చేయరని ఆమెకు తెలుసు.

❖ ❖ ❖

తన వెనుక వున్న ఏనుగుల్ని సద్దు చేయవద్దన్నట్టు సైగ చేసి, మోకాళ్ళమీద మోచేతుల మీద పాకుతూ పది ధనువుల దూరం ముందుకు పోయి ఒక పెద్ద పొద చాటున కూర్చున్నాడు శివుడు. కనులు చిట్లించి, చెవులు రిక్కిస్తూ ముందుకు చూశాడు.

దాదాపు రెండు వందలమందికి పైగానే వున్నారు అతనికి కనిపించిన ఆయుధ ధారులు. పెద్ద చెట్టుక్రింద, పొగ బయటికి రాకుండా చిన్న చిన్న చితుకుల మంటలు వేసి వంటలు చేసుకుంటున్నారు.

వారందరికీ నాయకుడి మాదిరిగా, పెద్ద తలపాగా చుట్టుకుని వున్న వ్యక్తి ఒకతను ఎత్తయిన బండరాయిమీద కూర్చుని వున్నాడు. అతనిముందు వినయంగా చేతులు కట్టుకుని నిలబడి వున్నారు కొంతమంది ఆగంతకులు.

కనులు చిట్లించి చూసిన శివుడి వళ్లు ఝుల్లుమన్నది ఒక్కసారిగా. సంపంగి గజసైన్యాన్ని మట్టుబెట్టమని దృఢకాయులకు విషాన్ని ఇచ్చి పంపించిన వాళ్ళు వారే.

వేగంగా కొట్టుకోవటం మొదలుపెట్టిన గుండెల్ని చిక్కబట్టుకుంటూ మరి కొంచెం ముందుకు జరిగాడు అతను.

"ఎంతో తెలివైనవాళ్ళని భ్రమపడి మిమ్మల్ని ఇక్కడికి పంపించారు మన ప్రభువుల వారు. ఇప్పటివరకూ మీరు చేసింది ఏమిటి? పచ్చటి ఈ అడవిలో ఎనుముల్ని, కుందేళ్ళని వేటాడుతూ కడుపులు నింపుకుంటున్నారు. మీకు అప్పచెప్పిన పనిని ఎవరి నెత్తిమీదో పెట్టి మాటలతో కాలక్షేపం చేస్తున్నారు. అవునా కాదా?" తీవ్రస్వరంతో అడుగుతున్నాడు బండరాయి మీద కూర్చుని వున్న వ్యక్తి తన ఎదుట నిలబడిన ఆగంతకుల్ని.

"అటువంటిది ఏదీ లేదు నాయకా... మేము పంపించిన వాళ్ళు మహా చతురులు. ఈపాటికి సంపంగి నగరమంతా అల్లకల్లోలమైపోతూ వుండి వుంటుంది. సందేహం అనవసరం. మాకు మేముగా నగరంలోకి పోయి అనవసరమైన అనుమానాలకు చోటు కల్పించటం దేనికని ఇక్కడే ఆగిపోయాము" సమాధానం ఇస్తున్నాడు ఒంటికాలిమీద నిలబడి వున్న ఒక ఆగంతకుడు.

ఒంటికాలిమీదే ఎందుకు నిలబడ్డాడంటే... అతని రెండవ కాలు తీవ్రంగా గాయపడి రక్తం ఓడుతోంది. తన తలపాగాని చింపి గట్టిగా కట్టు కట్టుకున్నాడు. అయినా సరే ఆగటంలేదు రక్తస్రావం.

తాను అనుసరించి వచ్చిన రక్తపు మరకలు అతని గాయానికి సంబంధించినవేనని తెలిసిపోయింది శివుడికి. మరింత శ్రద్ధగా ఆలకించటం కోసం కొంచెంగా ముందుకు జరిగాడు.

"ఏమయింది నీకు? ఏమిటా గాయం? ఎందుకు తగిలింది?" కనుబొమలు ముడిచి చూస్తూ అనుమానంగా అడిగాడు బండమీది మనిషి.

"వెదురు పొదలున్నాయి ఈ ప్రదేశంలో. హడావిడిగా రావడంతో ఒక వెదురు ఖండంమీద కాలు పడింది. చురకత్తి మాదిరి అది బలంగా దిగబడింది..." గాయం ఎందుకయిందో వెంటనే చెప్పాడు ఆ ఆగంతకుడు.

"అడవిలో సంచరించటానికి అలవాటు పడిన సంపంగి నగర రాజభటులు ఎవరైనా ఇప్పుడు ఈ చుట్టుపట్ల తిరుగాడటానికి వస్తే నీకు గాయమైన సంగతి చిటికెలో బట్టబయలు అయిపోతుంది. రక్తపు జాడలు నేలమీద పడకుండా జాగ్రత్తలు తీసుకున్నావా?" అడిగాడు బండరాయి మీది వ్యక్తి.

మాటకు మాటగా సమాధానం ఇస్తున్న ఆ ఆగంతకుడి మొఖం వెలాతెలా పోయింది ఒక్కసారిగా.

"వెళ్ళండి... వచ్చిన దారినే వెనక్కి వెళ్ళి రక్తపు మరకలేమైనా నేలమీద పడివుంటే వెంటనే వాటిని తుడిచివేయండి. వెళ్ళండి" ఖంగుమంటున్న కంఠంతో ఆజ్ఞ ఇచ్చాడు బండరాయి మీది వ్యక్తి.

అతను ఎవరో, అతనితో పాటుగా వచ్చి వంటలు చేసుకుంటున్న యోధులు అందరూ ఎందుకు అడవిలోకి వచ్చారో తెలుసుకోవడం చాలా మంచిదని భావిస్తున్న శివుడికి ఒళ్ళు ఝల్లుమన్నది ఒక్కసారిగా.

మాటల్ని ఆపి ఆ ఆగంతకులు ఒక్కసారిగా వెనక్కి వస్తారని ఊహించలేదు అతను. తను ఇంకో పొదచాటుకు పరిగెత్తి తప్పించుకోగలడు... తనతోపాటు వచ్చిన ఏనుగులు అలా తప్పించుకోగలవా?

శివుడి ఆలోచనలు పూర్తి కానేలేదు. గుంపుగా కదిలారు ఆగంతకులు. వేగంగా కొట్టుకోవడం మొదలుపెట్టిన గుండెల్ని చిక్కబట్టుకుంటూ పొదచాటు నుంచి పైకి లేచాడు శివుడు.

అప్పటికే చాలా ఆలస్యం అయిపోయింది. వెనక్కి తిరిగిన ఆగంతకులు చూడనే చూశారు అతన్ని.

"ఎవరు? ఎవరు నువ్వు? ఏం చేస్తున్నావిక్కడ? ఆగు... ఆగిపో..." అని భీకరంగా అరుస్తూ రెట్టించిన వేగంతో వచ్చేశారు.

"పారిపొండి... పారిపోయి మీ ప్రాణాలు రక్షించుకోండి..." అని బిగ్గరిగా అరిచాడు శివుడు తనేనుగుల్ని ఉద్దేశించి. తను మాత్రం వెనక్కిపోకుండా ఎడమచేతివైపున వున్న ఇంకో పొద దగ్గరికి పరిగెత్తాడు.

యమభటుల మాదిరి వచ్చేస్తున్న ఆగంతకులు ఏనుగుల దగ్గరికి పోకుండా తన వెనుకే వస్తారని, ఏనుగులు తప్పించుకోవటానికి ఆ కాస్త వ్యవధి సరిపోతుందని అనుకున్నాడు అతను.

ఆగంతకుల అరుపు, తను పెట్టిన కేక మరో కొత్త ఉత్పాతాన్ని సృష్టిస్తాయని మాత్రం అతను ఊహించలేదు.

యుద్ధ సమయంలో శంఖాలను ఊది అందరినీ హెచ్చరించినట్లు ఆగంతకుల అరుపు అతనికేక అక్కడ వున్న యోధులందర్నీ అదరగొట్టేశాయి. వంటలు చేసుకుంటున్న వారంతా ఒకేసారి లేచి తమ తమ ఆయుధాల్ని అందుకున్నారు.

ఏనుగులున్న ప్రదేశంలోకి పోలేదు ఆగంతకులు. ఎడమచేతివైపుకు తిరిగిన శివుడి దగ్గరికే పరిగెత్తుకు వచ్చారు.

పట్టుబడితే చిత్రహింసలు అనుభవించవలసి వస్తుందని ప్రత్యేకంగా పనికట్టుకుని వేరెవరో చెప్పవలసిన అవసరం లేకుండానే పరిస్థితిని గ్రహించేశాడు శివుడు.

శరవేగంతో ఆలోచించింది పాదరసం మాదిరి చురుకుగా కదిలే అతని మేథస్సు. తను వంటరివాడు కానట్లూ, తనతోపాటు ఇంకా చాలామంది సైనికులో, భటులో ఆ ప్రదేశంలోకి వచ్చి చెట్లచాటునా, పుట్టల చాటునా దాగుకుని వున్నట్లు "రండి... రండి... అందరూ వచ్చి ఈ దుర్మార్గుల పీచం అణిచేయండి" అని ఇంకా బిగ్గరిగా అరుస్తూ, పరుగును కొనసాగించాడు.

పట్టుదలగా వెంటపడిన ఆగంతకులు కనీసం ఒకటి రెండు నిమిషాలయినా ఆగిపోతారని, ఆ కాస్త వ్యవధిలోను తాను చాలా దూరం వెళ్ళిపోవచ్చునని అతని ఉద్దేశ్యం.

ఆగిపోవటం మాత్రం ఆగిపోయారు ఆగంతకులు. వాళ్ళు కాదు, వాళ్ళ వెనుకగా కదిలిన యోధులు కూడా ఎక్కడి వారక్కడ నిలబడి పోయినట్లు వెనక్కి చూడకపోయినా తెలిసిపోయింది అతనికి.

ఒకే ఒక్క మాటతో అంతమందిని కదలకుండా నిలబెట్టేయటమంటే అది సామాన్యమైన విషయం కాదు. వీరాధివీరులకే అది సాధ్యం.

తను నిజంగానే పెద్ద వీరుడైపోయినట్లు అనుభూతి చెందాడు శివుడు. అదోరకమైన గర్వంతో కొద్దిగా ఉప్పొంగింది అతని ఛాతీ. పరిగెత్తటం ఆపకుండానే భుజాలమీదినించి వెనక్కి చూశాడు. చూసిన వెంటనే అణగిపోయింది ఆ గర్వభావం.

అతని మాటల్ని విని ఆగిపోలేదు వెనుక వున్న వారందరూ. "రండి... రండి..." అంటూ అతను పెట్టిన ఉత్తుత్తి కేకను నిజమే అనుకుని, అడ్డువచ్చిన పొదల్ని పాదాలతో మట్టగిస్తూ చెవులు చిల్లులు పడేటట్లు ఘీంకారాలు చేస్తూ మృత్యువుకు ప్రతిరూపాల మాదిరి ఆగంతకులమీదికి, వారి వెనుక వున్న యోధుల మీదికి వచ్చి పడుతున్నాయి ఏనుగులు.

మహోగ్రంగా చూస్తూ తన దంతాలతో నలుగురు ఆగంతకుల గుండెల్ని చీల్చి చంపేసింది మగ ఏనుగు. పాదాలతో ఇంకో ఇద్దరిని అణగదొక్కింది ఆడ ఏనుగు. అటువంటి పనులు చేయడానికి తన వయస్సు, బలం రెండూసరిపోవని అనుకోవటంలేదు గున్న ఏనుగు. తొండాన్ని పైకెత్తి చేతనయినట్లు రంకెలు పెడుతూ తన తల్లిదండ్రుల వెనుకగా అదికూడా యోధులమీదికి పోతోంది.

సిగ్గుతో ఎర్రగా కందిపోయింది శివుడి వదనం... చేవలేని పిరికిపంద మాదిరి ప్రాణాలు కాపాడుకునేందుకు పరిగెత్తుతున్నాడు తను. తనను కాపాడటం కోసం తమ ప్రాణాల్నే పణంగా పెడుతున్నాయి ఆ మూగ జీవాలు.

ఉన్నట్లుండి ఎగసుకు వచ్చేసింది అతనికి రోషం. చటుక్కున వెనక్కి తిరిగి బాణం మాదిరి వచ్చేశాడు ఏనుగుల దగ్గరికి.

"గజయుద్ధం అంటే మాటలు కాదు. కార్చిచ్చు మాదిరి దూసుకుపోవాలి శత్రువుల మీదికి... మాటలతోనే గజాల్ని నడపించాలి... ఎట్టి పరిస్థితిలోను వాటి వేగాన్ని మందగింపచేయకూడదు... ఎదుట వున్న శత్రువును ఎలా పడగొట్టాలో, ఏ విధంగా మట్టగించాలో సైగలతోనే గజాలకు సూచనలు ఇస్తూ వుండాలి.

జ్వలిత సామ్రాజ్యంలోనే కాదు, ఈ చుట్టుపట్ల వున్న మున్నూట ముప్పది నాలుగు దేశాల్లో కూడా సాగరుల వారిని ఆ విద్యలో అధిగమించగలిగిన వాడు లేడు. ఇక ముందు కూడా వుండబోడు" ఉద్యానవన ద్వారం దగ్గరి వృద్ధభటుడు తనకు చెప్పిన మాటల్లో గజ యుద్ధానికి సంబంధించిన వాటిని గుర్తు చేసుకుంటూ ఒక్క ఎగురు ఎగిరి మగ ఏనుగు కుంభస్తలం వెనుక కూర్చున్నాడు అతను.

ఊహించని విధంగా ప్రత్యక్షం అయిన ఏనుగుల్ని చూసి అదిరిపడ్డారు అక్కడ వున్న వారందరూ. నేలమీద పడిన రక్తపు మరకల్ని తుడిచేయటానికి బయలుదేరిన ఆగంతకుల్లో కొంతమంది హతమారిపోవటాన్ని చూసిన వెంటనే వదిలిపోయింది వారిని ఆవరించుకున్న అయోమయం.

"పొడిచేయండి. వాటి తొండాలకు అందకుండా పక్కనుంచి శరీరాల్ని గాయపరచండి..." ఏనుగుల్ని చూడగానే బండమీదినించి దిగి నిలబడిన యోధుల నాయకుడు పెద్ద కంఠంతో ఆజ్ఞలు ఇస్తున్నాడు.

కత్తులు పట్టుకున్న యోధులు వెంటనే వెనక్కి పరిగెత్తి వారి స్థానంలో పొడవాటి బరిశెల్ని పట్టుకున్నవారు నిలబడటం మొదలుపెట్టారు.

"వేసేయండి... ముందు ఆ గున్న ఏనుగును పడగొట్టేయండి" ఇంకో ఆజ్ఞనిచ్చాడు యోధుల నాయకుడు.

పట్టరాని ఆవేశంతో వచ్చి మగ ఏనుగు మీదికి లంఘించాడేగాని, ఆ తరువాత దాన్ని దాని పక్కనే వున్న ఆడ ఏనుగును ఎలా నడిపించాలో తెలియలేదు శివుడికి. తన చేతకానితనం ప్రత్యక్షంగా అవగతమయ్యేసరికి ఏం చెయ్యాలో తోచని పరిస్థితిలో చిక్కుకుపోతున్నాడు. అతనికి తెలియకుండానే నీటితో నిండిపోసాగాయి కళ్ళు.

గున్న ఏనుగును పడగొట్టమని యోధుల నాయకుడు ఇచ్చిన ఆజ్ఞను వినేసరికి చ(్రున ముంచుకువచ్చేసింది అతనికి కోపం.

"మా గున్నని పడగొట్టమంటావా? చచ్చీ చెడి సాగరుల వారు ఇచ్చే శిక్షలకు భయపడకుండా దాన్ని నగరంలో నుంచి బయటికి తీసుకువచ్చింది నీ భటుల చేతికి అప్పగించటానికా?" అంటూ కాలి మడమలతో మగ ఏనుగును అదిలించాడు. ముందుకు వంగి, దాని కళ్ళకు కనబడేలా చేతిని ఆ యోధుల నాయకుడికేసి జూపాడు. "చంపేయాలి వాడిని, పాతాళలోకానికి పంపేయాలి..." అని తను ఇచ్చాడు ఆజ్ఞ.

ఆజ్ఞ ఇచ్చిన వెంటనే దాని కుంభస్తలాన్ని గట్టిగా పట్టుకుని, తన పాదాలతో దాని మెడను మరింత బలంగా నొక్కి కూర్చోవాల్సిన పరిస్థితి ఎదురయింది అతనికి.

ఎందుకంటే– వెంటనే అటు కదిలింది మగ ఏనుగు. గాలితో పందెం వేస్తున్నట్టు మహావేగంతో ముందుకు దూకింది.

బారెడు బారెడు దంతాలు... తన దారికి అడ్డంగా వున్న యోధులను చెల్లాచెదురు చేస్తుండగా తన పాదాలు కిందిపడిన వారి మస్తకాలను ఛిన్నాభిన్నం చేసిపారేస్తుండగా, సుడిగాలి మాదిరి పోయి యోధుల నాయకుడిని సమీపించింది.

అతనికి ఏ గతిపట్టిందో గమనించే స్థితిలో లేడు శివుడు. మొట్టమొదటి సారిగా తనంతట తనే ఒక ప్రత్యేకమైన యుద్ధ తంత్రాన్ని ప్రత్యక్షంగా చూసి నేర్చుకున్నాడు అతను.

వేగం. గజ యుద్ధంలో అతి ముఖ్యమైన అంశం వేగం...

వేగంగా ప్రవహించే నదిలో అడుగు పెట్టే సాహసం ఎవరూ చేయలేరు. అదే విధంగా వేగంగా కదిలే గజ సమూహానికి ఎదురు నిలబడి వాటిని గాయపరచటం కూడా ఎవరికీ సాధ్యపడదు.

అనుభవపూర్వకంగా నేర్చుకున్న ఆ తొలిపాఠం తన వంటిని గగుర్పాటుకు గురి చేస్తుండగా- నితారుగా కూర్చుంటూ చెవులు చిల్లులు పడిపోయేటట్లు అరిచాడు అతను.

"కొట్టేయ్... పాదాల కిందికి నెట్టి నలిపేయ్... చంపేయ్."

అతని ఉద్రేకం పెద్ద ఏనుగుల్ని ప్రభావితం చేసిందో చేయలేదో తెలియలేదు గాని, గున్న మాత్రం పిచ్చిపట్టినట్టు ఘీంకారాలు చేస్తూ వేగంగా కదలటం మొదలుపెట్టింది.

మగ ఏనుగు ధాటికి వెనక్కి పరిగెత్తిన వారు, వెనకనుంచి దాన్ని గాయపరచటానికి ప్రయత్నాలు ప్రారంభిస్తున్నారు. చిచ్చరపిడుగు మాదిరి వారిమీదికి ఎగబడింది అది.

ఆ దృశ్యాన్ని చూసి ఆడ ఏనుగు, దాన్ని అనుసరించి మగ ఏనుగు ఆ అడవి ప్రదేశాన్ని అల్లకల్లోలం చేసేశాయి.

శివుడిని గమనించి అతని మీదికి ఆగంతకులు కదిలిన రెండే రెండు నిమిషాలలో ముగిసిపోయింది ఆ పోరాటం.

మగ ఏనుగు పాదాలకింద పడి పచ్చడి పచ్చడి అయిపోయాడు యోధుల నాయకుడు. ఏబది ఆరుమంది యోధులు విగత జీవులైపోయారు. మిగిలిన వారందరూ తమ ఆయుధాల్ని క్రింద పారేసి అడవిలోకి పారిపోయారు.

అప్పటికి కూడా తగ్గలేదు ఏనుగుల కోపం... భూమిని దడదడలాడిస్తూ అవి వారిని వెంటాడే ప్రయత్నం చేయబోతుండగా, అతి బలవంతంగా ఆపాడు శివుడు. మగ ఏనుగు మీదినించి కిందికి దూకి, దాని తొండాన్ని గట్టిగా కౌగలించుకుని ముద్దు పెట్టుకున్నాడు.

సంతోషం అధికం అయిపోయినట్లు శబ్దం చేసింది అది. తానుకూడా సంతోషిస్తున్నట్టు శివుడి భుజాన్ని తలతో తడిమింది ఆడ ఏనుగు.

గున్నకి మాత్రం ముంచుకు వచ్చేసింది రోషం. తనను మెచ్చుకోనందుకు అలిగినట్టు ఒక చెట్టుచాటుకు పోయి నిలబడింది.

గబగబా వెళ్ళి దాని తలమీద చెయ్యివేసి ఆదరంగా తడిమాడు శివుడు. "నీ వల్లనే సాధ్యపడింది ఇదంతా... నిన్ను చంపమనే ఆజ్ఞ గనుక నా చెవుల పడివుండకపోతే నాకు కోపం వచ్చివుండేది కాదు. కోపం వచ్చి వుండకపోతే వేగాన్ని గురించి తెలిసి వుండేది కాదు. మనం వేగంగా కదిలి వుండకపోతే వాళ్ళని జయించగలిగేవాళ్ళం కాదు. అంతా నీ వల్లనే... నువ్వే ఈ విజయానికి కారణం" అన్నాడు మృదుస్వరంతో.

మాయమైంది గున్న అలక. తన తల్లిదండ్రుల వంక గర్వంగా చూస్తున్నట్టు తల వూపుతూ విలాసంగా ఇవతలికి వచ్చింది.

ఎంత వేగంగా కదిలి శత్రువుల పీచం అణిచినా, వారందర్నీ ఎంతగా భయపెట్టినా, కొన్ని బరిశె పోట్లను మాత్రం తప్పించుకోలేకపోయాయి ఏనుగులు.

మగ ఏనుగు ప్రక్కభాగంలో శివుడికి కనిపించాయి కొన్ని గాయాలు. ఆడ ఏనుగు వంటిమీద ఆఖరికి గున్న ఏనుగు తొండం మీద కూడా నెత్తురు ఓడుతూ అతనికి దర్శనం ఇచ్చాయి అవి.

"నిజమైన యుద్ధంలో మీ పక్కభాగాలను కాపాడేందుకు పెద్ద పెద్ద చర్మపు తొడుగుల్ని ధరింపచేస్తారు. పాదాలకు ఇనప కవచాల్ని కట్టి వుంచుతారు. అటువంటి రక్షణ లేకుండా యుద్ధం చేశారు మీరు... తప్పు నాదే" అంటూ పొదల్లోకి పరిగెత్తాడు.

అంతకుముందు ఆడ నెమలి వంటిమీది గాయాల్ని మాన్పటానికి తాను ఉపయోగించిన ఆకుల్ని వెతికి, ఓపికగా ఆ గాయాలన్నిటి మీదా పసరును పిండాడు.

యుద్ధం జరిగింది అతికొద్దిసేపే అయినా ఆ సమయంలో అతన్ని ఆవరించుకున్న ఉద్రేకం మాత్రం ఎందుకనో అతని శక్తిని హరించివేసింది. రక్తస్రావాన్ని అరికట్టే ఔషధిని వెతకటమే చాలా శ్రమతో కూడుకున్న పని అని అనిపించింది అతనికి.

గాయాలకు వైద్యం చేయటం పూర్తి అయిన మరుక్షణం, అంతకుముందు యోధుల నాయకుడు కూర్చున్న బండదగ్గరే నేలమీద చతికిలపడ్డాడు.

"నా ఓపిక అంతా హరించుకుపోయింది. కాస్సేపు విశ్రాంతి తీసుకుంటాను" అంటూ బండకు చేరగిలబడి కళ్ళు మూసుకున్నాడు.

ఆ ప్రదేశమంతా విగతజీవులైన యోధుల శరీరాలతో నిండి వుంది. ప్రాణాలు కోల్పోయిన అంతమంది మానవులు ఒకే ప్రదేశంలో పడివుండడం, తమకు ఎంతో ఆనందాన్ని కలిగిస్తున్నట్టు ఆకాశంలో గుంపులు గుంపులుగా ప్రత్యక్షం అయ్యాయి రాబందులు.

అవి చేస్తున్న వికృత ధ్వనులు నిద్రాభంగం కలిగించలేదు శివుడికి. అతనికి చాలా పరిచయం అయిన ఇంకో రకపు చప్పుళ్ళు వెంటనే నిద్రను దూరం చేసేశాయి.

అతి బలవంతంగా కళ్ళు తెరిచిన వెంటనే ఇంకోసారి పోరాటానికి సిద్ధం అవుతున్నట్టు కోరగా చూస్తున్న ఏనుగులు కనిపించాయి.

"ఏమయింది? పారిపోయిన వాళ్ళు మళ్ళీ వెనక్కి వస్తున్నారా?" అని అడుగుతూ బండ పక్కనుంచి లేచి నిలబడ్డాడు అతను. లేచిన వెంటనే విపరీతమైన భయం కలిగినట్టు ఎగిరి బండమీద నిలబడ్డాడు.

యుద్ధంలో అపజయాన్ని పొంది వెన్ను చూపిన యోధులు కాదు అతనికి కనిపించింది. చురకత్తుల వంటి దంతాలు బయటికి కనిపించేలా నోళ్ళను తెరిచి, మందలు మందలుగా పాకుకుంటూ వస్తున్న మొసళ్ళు.

❖ ❖ ❖

"ఇంకా ఎంతసేపు ఇక్కడ కూర్చోవాలి? మీకేమీ అనిపించటం లేదేమో గాని, నాకు మాత్రం మహా చిరాకు వేస్తోంది. త్వరగా పిలవండి మీ మకర దేవతల్ని" విసుగు నిండిన కంఠంతో ఆటవికుల నాయకుడికి వినబడేటట్లు బిగ్గరిగా అన్నది జ్వాల.

కనురెప్పలు కూడా కదిలించకుండా తదేకంగా నదిలోకి చూస్తున్న ఆ నాయకుడు ఉలిక్కిపడినట్లు, పక్కకు తిరిగి ఆమెవంక చూశాడు.

"బలి మానవుల్ని మీరు బాధించకూడదు. అన్నం, నీళ్లు ఇవ్వకుండా ఆకలితో మాడ్చకూడదు. ఒకే ప్రదేశంలో ఇంతసేపు కూర్చోబెట్టకూడదు" వారి ఆచార వ్యవహారాలు తనకు బాగా తెలిసినట్లు మరింత గట్టిగా అన్నది జ్వాల.

ఏదో ఒకటి మాట్లాడుతూ కాలక్షేపం చేస్తే తనకు పట్టబోతున్న దుర్గతిని గురించిన ఆలోచనల్ని దూరం చేసుకోవచ్చన్న భావన ఆమెది.

పూర్తిగా కాకపోయినా కొంతవరకూ యదార్థం అయిందది. "ఆకలి వేస్తోందా కూనా?" అడిగాడు నాయకుడు.

"వేస్తోందా అని అడుగుతావేమిటి? పొద్దుననగా ఎప్పుడో తాగిన జున్నుపాలు... అంతసేపు పొట్టలోనే వుండిపోతాయా? ఎప్పుడో అరిగిపోయి వుంటాయి" సన్నగా అన్నాడు నాయకుడి వెనక వున్న ఆటవికుడు ఒకతను.

"మకర దేవతల్ని వెతకటానికి పోయిన మనవాళ్ళు తిరిగిరాలేదు. ఎప్పుడు వస్తారో తెలియటం లేదు. ఇవాల్టికి బలి తతంగాన్ని ఆపి గూడేనికి పోదాం" అన్నాడు మరో ఆటవికుడు.

"తప్పు... చాలా తప్పు... ఏది ఏమైనా బలి ఇచ్చిన తర్వాతనే వెనక్కి వెళ్ళేది... కూనకి ఏవైనా పళ్ళు పెట్టండి... తాగటానికి నీళ్ళు ఇవ్వండి" అన్నాడు నాయకుడు.

చెట్లమధ్యకి పోయి మిగలపండిన ఫలాల్ని వేటినో తీసుకువచ్చి జ్వాల ఎదుట పెట్టారు ఆటవికులు. సొరకాయ బుర్రలో నీటిని ఇచ్చారు.

నాయకుడిని వెక్కిరించటానికి మాట్లాడింది గాని, నిజంగా ఆకలి లేదు జ్వాలకి. నోరు ఎండుకుపోయినట్టు అనిపిస్తున్నా నీటిని తాగాలనే కోరిక కలగటం లేదు.

"అడుగుకి ఆరు మొసళ్ళు కనపడతాయని అంటారు ఈ నదిలో... ఒక్కటి కూడా కనిపించకపోవటానికి కారణం ఏమిటి?" అడిగింది ఆమె వారిని.

"అవతలి ఒడ్డున ఏదో గొడవ జరిగి మనుష్యులో, జంతువులో చచ్చిపడి వుంటారు. మకర దేవతలన్నీ అక్కడికి చేరుకుని వుంటాయి" తన అభిప్రాయాన్ని తెలియజేశాడు ఒకతను.

తన కోసం అడవినంతా జల్లెడ వేసే తమ భటుల్లో ఎవరయినా అతను చెపుతున్న దుర్గతికి లోనై వుంటారేమోనన్న భయం వెంటనే జ్వాలకి కలిగింది.

"దేవతలు దయ్యాలు అంటూ దేబెమొఖాలు వేసుకుని ఇక్కడే నిలబడి వుండకపోతే అందరూ వెళ్ళి అదేమిటో చూసి రావచ్చును కదా" అన్నది ఆమె ఆ భయాన్ని కప్పిపెట్టుకోవడానికి.

"చూసి రావటానికి వెళ్ళినోళ్ళు ఇద్దరూ సామాన్యులు కాదు కూనా. కను చూపు మేరలో కనిపించీ కనిపించనట్టుండే చిన్నపాటి పిట్టల్ని కూడా ఒక్క బాణంతో పడగొట్టగల మొనగాళ్ళు. తిరిగి వచ్చిన తర్వాత వాళ్ళు చెపుతారు జరిగింది ఏమిటో... తొందర అనవసరం. పళ్ళు తిని, నీళ్ళు తాగు" ఒక్క చెవితో ఆమె మాటల్ని ఆలకిస్తున్న నాయకుడు వెంటనే చెప్పాడు ఆమెకి.

ఆ పైన ఏం మాట్లాడాలో తెలియలేదు జ్వాలకి. ఇష్టం లేకపోయినా ఒక పండును కొరికి, కొద్దిగా నీటిని పుచ్చుకోవటం మొదలుపెట్టింది.

❖ ❖ ❖

ఒకటి కాదు, రెండు కాదు... వందలు... వందలకి వందలు... ఒకదాని మీదినించి మరొకటి పుట్టల్లోనుంచి బయటికి వచ్చే పాముల మాదిరి పాకుతూ వస్తున్న మొసళ్ళను చూసేసరికి మతిపోయినంత పని అయింది శివుడికి.

"ఒకటి రెండు అయితే ఏమయినా చేయగలం. ఒకేసారి వీటన్నిటినీ ఎదిరించటం అసాధ్యం. వెనక్కి తగ్గండి... తగ్గండి..." కోరగా చూస్తూ అలాగే నిలబడిన ఏనుగుల్ని హెచ్చరిస్తూ బండమీదినించి దూకాడు అతను.

రెండోసారి అటువంటి హెచ్చరిక చేయవలసిన అవసరం లేకుండా అతనికంటె ముందుగానే దూరంగా పరిగెత్తాయి ఏనుగులు.

అన్నిటికంటె ముందుగా వచ్చిన మూడు మొసళ్ళు, బండరాయి దగ్గర పడివున్న యోధుల నాయకుడి శరీరంకోసం ఒకదానితో ఒకటి గొడవ పడడం వరకే చూశాడు శివుడు.

ఆకాశంలో చక్కర్లు కొడుతున్న రాబందులు నేలమీదికి వచ్చే సమయానికి ఒక్క కళేబరం కూడా అక్కడ వుండదని అర్థం అయిపోయింది అతనికి.

తోటి మానవుల శరీరాలు అంత్యక్రియలకు నోచుకోకుండా అలా ఆ జలభూతాలకు ఆహారం కావటం బాధగానే అనిపించింది అతనికి. తను చేయగలిగింది ఏమీలేదు కాబట్టి, పెద్దగా పట్టించుకోలేదతను. పరిగెత్తి పరిగెత్తి అంతకుముందు తాను చూసిన వెదురు గుబురుల దగ్గర ఆగాడు.

ఆగిన వెంటనే అతని మనస్సులో అడుగు పెట్టింది ఒక ఆలోచన. తలలు తిప్పి తనవంక చూస్తున్న ఏనుగుల్ని ఆగమని సైగ చేస్తూ మరోసారి అంతకుముందు తను అడుగు పెట్టిన మట్టిదిబ్బ మీదికి చేరుకున్నాడు.

అతని ఉద్దేశ్యం అర్థం అయింది కాబోలు వేగంగా వచ్చి మళ్ళీ అతని నడుమును తొండంతో చుట్టి వెనక్కి లాగేయబోయింది ఆడ ఏనుగు.

"చూడు తల్లీ... సరిగ్గా చూడు... ఒక్క మొసలి కూడా ఇక్కడ లేదు. అన్నీ కలిసి విందు ఏర్పాటు చేసిన విందు భోజనానికి పోయాయి" ఒక్క చీమకూడా కనిపించని నీటి అంచును చూపిస్తూ అన్నాడు శివుడు.

మొసళ్ళు లేవనే విషయాన్ని తనుకూడా గమనించి, అతన్ని వెనక్కి లాగే ప్రయత్నాన్ని విరమించుకున్నది ఆడ ఏనుగు. అతని మొఖంలోకి ప్రశ్నార్థకంగా చూడటాన్ని మాత్రం మానలేదు.

"ఇక్కడి మొసళ్ళు మాత్రమే కాదు, నదిలో వున్నవన్నీ అక్కడికే వెళ్ళిపోయి వుంటాయి. నదిని దాటి అవతలికి పోవటానికి ఇదే సరయిన సమయం. మీరు ఇక్కడే వుండండి. నేను చిటికెలో నదిని అధిగమిస్తాను" అంటూ అది తనను ఆపేలోపుగా, వేగంగా దిబ్బమీదినించి దిగి నీటిలోకి ప్రవేశించాడు శివుడు. బలంగా బారలు వేశాడు. నది వేగం ఎక్కువగానే వున్నా లెక్క చేయకుండా రెండే రెండు నిమిషాల్లో అవతలి ఒడ్డుకు చేరుకున్నాడు.

తడిసిన దుస్తుల్ని పిండుకుంటూ తన నేస్తాలు ఏం చేస్తున్నాయో చూడడం కోసం వెనక్కి తిరిగాడు. తిరిగిన వెంటనే కళ్ళు బైర్లు కమ్మినంత పని అయింది అతనికి.

ఒడ్డుమీద లేవు ఏనుగులు. అతనితో పాటు తాముకూడా నదిలోకి దిగాయి. అతను వెనక్కి చూసే సమయానికి మొదటగా ఒడ్డు ఎక్కింది గున్న. తర్వాత దాని తల్లి, ఆ వెనుక మగ ఏనుగు. మూడు జంతువులు సురక్షితంగా అతని పక్కకు వచ్చి నిలబడ్డాయి.

వాటికి తనమీద వున్న ఆపేక్షను గమనించేసరికి, నీటితో నిండిపోయాయి శివుడి కళ్ళు. ఎందుకో తెలియదు గాని, ఆడ ఏనుగు తొండాన్ని కౌగలించుకుని ఒక్కసారిగా బావురుమని ఏడ్చాడు అతను.

ఎందుకు అలా చేస్తున్నాడో తెలియని గున్న తన తొండంతో తలను స్పృశించేసరికి ఆగిపోయింది అతని దుఃఖం.

"మా అమ్మా నాన్న ఇద్దరూ వుండివుంటే ఇప్పుడు మీరు నన్ను కాపాడుతున్నట్టే ఎప్పుడూ నన్ను జాగ్రత్తగా చూసుకుంటూ వుండేవాళ్ళు.

అది గుర్తుకు వచ్చేసరికి ఏడుపొచ్చింది. అంతే" కన్నీటితో మలినమైన బుగ్గల్ని అద్దుకుంటూ గున్నకి చెప్పాడు.

చెపుతూ వుండగానే వచ్చింది అతనికి అనుమానం... ఒక్కసారిగా పక్కకు తిరిగి పాతిక ధనువుల దూరంలో వున్న ఒక పెద్దచెట్టు దగ్గరికి పరిగెత్తాడు.

చెట్టుచాటున గాని, దాని దగ్గర వున్న పొదల మాటున గాని ఎవరూ కనిపించలేదతనికి.

"ఎవరో నన్ను మిమ్మల్ని అదేపనిగా చూస్తున్నట్లు అనిపించింది. ఇదివరకు కూడా ఇట్టాంటి అనుమానమే చాలాసార్లు వచ్చింది. ఒకే ఒకసారి కనిపించినట్టే కనిపించి అంతలోనే మాయమైంది ఒక ఆకారం... నా మీదికి రాబోయిన ఆగంతకుల మీదికి బాణాల్ని వదిలింది ఎవరై వుంటారో తెలియటం లేదు" తల బరుక్కుంటూ చెప్పాడు తన దగ్గరికి వచ్చి నిలబడిన గున్నతో.

తొండాల్ని గాలిలోకి ఎత్తి తమ చుట్టూ వున్న గాలిని వాసన చూడటం మొదలుపెట్టాయి పెద్ద ఏనుగులు రెండూ.

❖ ❖ ❖

అడుగు అడుగు చొప్పున నీటి ఒడ్డుమీద నడిచాడు నాయకుడి ఆజ్ఞ ప్రకారం నది ఎగువకు బయలుదేరిన ఆటవికుడు. నదిమీదనే కాదు నదికి ఆవలి ఒడ్డుమీద కూడా దృష్టిని నిమగ్నం చేశాడు.

నాలుగు కూతల దూరం పోయిన తర్వాత ప్రవాహానికి ఎదురు ఈదుకుంటూ పోతున్న రెండు మకర దేవతలు కనిపించాయి అతనికి.

"అవతల మా నాయకుడు మీ కోసం పసందయిన కూనని సిద్ధం చేసి వుంచితే నీటికి ఎదురు ఈదుతూ ఎందుకు కష్టపడుతున్నారు? వెనక్కి రండి... వెంటనే వచ్చి బలి మనిషిని ఆరగించండి"చేతిలో వున్న విల్లును కిందపెడుతూ భక్తిగా వాటికి చెప్పాడు.

ఆ మాటల్ని అసలు పట్టించుకోలేదు మొసళ్ళు. మరింత పట్టుదలగా ప్రయాణంచేయటం మొదలుపెట్టాయి.

"ఎంతో అవసరం అయితే తప్ప ఇవి ఇలా నీటికి ఎదురు పోవు. ఎక్కడో ఏదో జరుగుతోంది. అదేంటో తెలుసుకోకుండా వెనక్కి వెళితే నాయకుడు నా తల నరికి వాటికే ఆహారంగా పడేస్తాడు" అనుకుంటూ కిందపెట్టిన

విల్లుని తిరిగి తీసుకున్నాడు ఆ ఆటవికుడు. పరుగులాంటి నడకతో ఆ మొసళ్ళను అనుసరించడం మొదలుపెట్టాడు.

రెండు మొసళ్ళు కాస్తా పది అయ్యాయి. పది కాస్తా పది పదులయ్యాయి. పది క్షణికాలు కూడా గడవకముందే నదిలో వున్నవన్నీ తనముందే వున్న అనుభూతి అతనికి కలిగింది.

లుకలుకలాడుతూ అవన్నీ కలిసి అవతలి ఒడ్డుమీది పొదల్లోకిపోవటం కూడా అతనికి కనిపించింది.

అధికం అయిపోయింది అతని కుతూహలం. మరోసారి తన విల్లుని కిందపెట్టాడు. అమ్ముల పొదిని కూడా వదిలేశాడు. నడుముకు వేలాడ తీసుకున్న ఒక చిన్నకత్తిని మాత్రం భద్రంగా వుంచుకుని నిశ్శబ్దంగా నీటిలోకి జారాడు.

అవతలి ఒడ్డును చేరుకుని పొదల్లోకి పోతున్న మొసళ్ళు ఏవీ అతన్ని గమనించలేదు. వాటి మాదిరిగానే నీటిలో ఈదుతూ, అవి ఒడ్డుమీదికి చేరుతున్న ప్రదేశానికి కొంచెం ఇవతలగా తానుకూడా ఒడ్డు ఎక్కాడు అతను.

ఇవతల ఒడ్డు మీద వుండగా అతను గమనించని దృశ్యం ఒకటి వెంటనే కనిపించి అతని ఒళ్ళు జలదరించింది.

ఏ పొదల్లోకి మకర దేవతలు ప్రవేశించాయో ఆ పొదల దగ్గర వున్న చెట్లమీద కూర్చుని వున్నాయి రాబందులు– వందల సంఖ్యలో తలలు వంచి చెట్లక్రిందికే చూస్తున్నాయి.

అధికం అయిపోయింది ఆటవికుడి కుతూహలం. చప్పుడు చేయకుండా ముందుకు పోయాడు. పాతిక అడుగులు వేయగానే కనిపించింది పెద్ద ఖాళీ స్థలం. కుప్పలు తెప్పలుగా పడి వున్న నాగరికుల దేహాలు కూడా అగుపించాయి.

క్షణికం పాటు కూడా ఆలస్యం చేయకుండా అతివేగంగా వెనక్కి వచ్చి నదిలో దూకాడు అతను. వేగంగా ఈదుకుంటూ ఇవతలి ఒడ్డును చేరుకున్నాడు. క్రిందపెట్టిన విల్లుని, అంబులపొదిని తీసుకుంటూ వుండగా, పక్కనే వున్న చెట్టుకొమ్మల మీదినించి దభేలున అతనిమీద పడింది ఒక అతి పెద్ద కొండచిలువ.

అవతలి ఒడ్డుమీద తను చూసిన దృశ్యాన్ని తమ నాయకుడికి ఎలా వర్ణించి చెప్పాలో ఆలోచించుకుంటున్నాడు ఆ ఆటవికుడు. సరయిన మాటల్ని వెదికి సిద్ధంగా వుంచుకోవటానికి ప్రయత్నం చేస్తున్నాడు. ఆ హడావుడి కారణంగా తన చుట్టూ వున్న పరిసరాల్ని పరిశీలించటాన్ని మరిచిపోయాడు.

ఆ ఆదమరపే అతని కొంప ముంచబోతున్నది. పది బారల పొడవున్నది అతనిమీద పడిన కొండచిలువ. తాళవృక్షమంత లావుగా వున్నది దాని శరీరం.

ఆహారం తీసుకుని అప్పటికి చాలా రోజులైనట్లు, ఆకలితో అలమటించి పోతున్నది, అతనిమీద పడీపడగానే నోటిని తెరిచింది రెండు మూరల వెడల్పున.

ఒక్క మనిషినే కాదు... ఒకేసారి ముగ్గురు మనుష్యులను అతితేలికగా పట్టుకోగలిగినట్లు, పెద్దగుహ మాదిరిగా కనిపిస్తున్న ఆ నోటిని చూసేసరికి చెమటలు పట్టేశాయి ఆటవికుడికి.

వేగంగా పరిగెత్తడానికి గాని, పారిపోయి ప్రాణాలు దక్కించుకోవటానికి గాని వీలు లేని పరిస్థితి... మీద పడీ పడటంతోనే అతని పాదాల దగ్గర్నించి భుజాల వరకూ తన శరీరంతో చుట్టలు చుట్టేసిందది. నడుముకువ్రేలాడుతున్న కత్తిని కూడా అందుకోలేని విధంగా బంధింపబడిపోయాయి చేతులు.

బంధించబడకుండా వున్నది ఒక్క నోరు మాత్రమే. మరణం తథ్యమని తెలిసివచ్చిన వెంటనే ఆ నోటిని ఉపయోగించాడు అతను.

"రక్షించండి... ఎవరైనా వచ్చి నన్ను ఈ అజగరం బారినుండి కాపాడండి. రక్షించండి..." అంటూ గొంతు చినిగిపోయే శృతిలో కేకపెట్టాడు.

ఎక్కడో నాలుగు కూతల దూరంలో నిలబడి మకర దేవతల కోసం ఎదురు చూస్తూ వుండే తన గూడెం వాసులకు ఆ అరుపు వినబడే అవకాశం లేదని అతనికి తెలుస్తూనే వుంది.

పర్వతగుహ మాదిరిగా తెరుచుకున్న ఆ చిలువ నోరు తన తలను పట్టుకోవటానికి ముందుకు వంగుతున్న కొద్దీ అధికమైపోసాగింది అతని ఆవేదన.

"కాపాడండి... ఈ దుర్మార్గపు కొండచిలువ నించి నన్ను ఎవరైనా వచ్చి రక్షించండి" ఆర్తి నిండిన కంఠంతో ఇంకోసారి అరిచాడు.

వేగంగా కదిలి అతని తలను నోటిలో చిక్కించుకోబోతూ... ఉన్నట్లుండి ఆగిపోయింది కొండచిలువ. నేరేడు పళ్ళ మాదిరి నిగనిగలాడుతున్న పెద్దకళ్ళతో ఒక పక్కకు చూసింది.

నాలుగు మూరల పొడవుండే ఒక పెద్ద విల్లును పట్టుకుని, రెండున్నర మూరల పొడవున్న పొడుగాటి యుద్ధబాణాన్ని ఆ వింటికి తొడుగుతూ దట్టమైన ఒక పొదచాటు నుంచి ఇవతలికి వచ్చాడు నలుబది సంవత్సరాల వయసుండే మధ్యవయస్కుడు ఒకతను.

ఆటవికుడు కాదతను. పూర్తి నాగరికుడు. అదే పనిగా అడవిలో సంచరించే అలవాటున్నట్టు, దుమ్ముతోను, రకరకాల మరకలతోను అసహ్యంగా కనిపిస్తున్నాయి దుస్తులు.

నడుముకు వ్రేలాడుతోంది ఒక పెద్ద కత్తి. వెన్నుకు తగిలించివుంది యుద్ధ బాణాలు కలిగివున్న అమ్ముల పొది.

"అరుపుల్ని ఆపకు... ఆపావంటే అది నా వైపే చూస్తూ వుంటుంది. బాణంతో కొట్టటం కష్టమవుతుంది. అది తల నీ వైపు తిప్పేటట్లు అరువ్..." పొద చాటునుంచి ఇవతలికి వస్తూనే, భయంతో బెంబేలెత్తిపోతున్న ఆటవికుడికి చెప్పాడతను.

అంతకుముందు కంటె పదిరెట్లు గట్టిగా అరిచాడు ఆటవికుడు. "చూడవే... చూడవే పావుమొఖమా... నాకేసి చూడు... నా మొఖంలోకిచూడు... చూడవే" కీచుకంఠంతో దాని దృష్టిని తనకేసి మరలించుకోవటానికి శక్తివంచన లేకుండా ప్రయత్నం చేశాడు.

ఏబది అడుగుల దూరంలో నిలబడి వింటికి తొడిగిన యుద్ధబాణాన్ని ఆ కొండచిలువ తలకి గురిపెట్టాడు పొదల్లో నుంచి వచ్చిన నాగరికుడు. వదలటానికి మాత్రం తటపటాయించాడు.

ఒకే ఒక్కసారి వుంటుంది అవకాశం... బాణం తగిలిన వెంటనే అది కళ్ళు తేలవేసి పరలోకానికి ప్రయాణమైపోవాలి.

గురి తప్పితే మాత్రం జరగకూడనిది జరిగిపోతుంది. తన ప్రాణాలకు ప్రమాదం వుందని తెలిసిన మరుక్షణం ఆటవికుడి వంటి చుట్టూ చుట్టిన తన శరీరాన్ని మరింతగా కుంచింపచేస్తుంది అది. పెద్ద పెద్ద బండరాళ్ళ

మధ్య చిక్కుబడినట్లు పటపటమని ధ్వనులు చేస్తూ విరిగిపోతాయి అతని శరీరంలోని ఎముకలు... ప్రాణాలు అనంతవిశ్వంలోకి ఎగిరిపోతాయి.

తలను తప్ప ఇంకే ప్రదేశాన్ని కొట్టినా అది చావదు...

పడగను విప్పి నాట్యం చేసే నాగుపాము మాదిరి తలను అటూ యిటూ తిప్పుతూ అతనివంకే చూస్తోంది అది.

"అరవరా నాయనా... అరిచి దాని దృష్టిని నీకేసి మళ్లించుకో..." తన మనసులోని అలజడిని కప్పిపెట్టుకోవటానికి అన్నట్లు విసురుగా ఆటవికుడిని హెచ్చరించాడు ఆ వ్యక్తి.

జీరపడిపోయింది ఆటవికుడి గొంతు. భయం అతని శక్తిని పూర్తిగా హరించివేసింది. అరవటానికి ప్రయత్నం చేశాడు గాని, శబ్దం బయటికి రాలేదు.

ఆలస్యం అయిన కొద్దీ అతన్ని కాపాడటం అసంభవం అవుతుందన్న ఆలోచనతో ఎక్కుపెట్టిన బాణాన్ని వదలనే వదిలాడు ఆ వ్యక్తి.

వదులుతూ వుండగానే తెలిసిపోయింది అతనికి తన గురి తప్పిపోబోతున్న దని. వదిలిన తర్వాత యదార్థమే అయిందది.

అతని కదలికల్ని చాలా తేలికగా పసికట్టి చటుక్కున తలను పక్కకు వాల్చింది అజగరం.

పిడుగులాగా పోయి దాని తలలో దిగబడవలసిన బాణం కాస్తా నిరపాయకరంగా అవతలికి పోయి ఒక పొదమీద పడిపోయింది.

చెవులు చిల్లులు పడేటట్లు వికృతంగా బుస పెడుతూ ఆటవికుడి వంటిమీది తన శరీరాన్ని కుంచింపచేయటం మొదలుపెట్టిందా క్షుద్రపాణి.

బాధను భరించటం అసాధ్యమై గావురుమని అరిచాడు ఆటవికుడు. తన విల్లంబుల్ని వదిలేశాడు పొదల్లోంచి వచ్చిన వ్యక్తి. నడుముకు వేలాడుతున్న ఖడ్గాన్ని వరలోనుంచి బయటికి లాగుతూ వేగంగా పోయి ఆ చిలువమీద కలబడ్డాడు.

ప్రమాదంలో వున్న ఆటవికుడిని రక్షించాలన్న తొందరపాటు తాపత్రయంలో పడి, ఆ చిలువ ఎంత పొడవున్నదో మర్చిపోయాడతను. అతను కత్తిని ఎత్తి తన సమీపంలోకి వచ్చిన వెంటనే చిటికెలో ఆటవికుడి

భుజాల్ని వదిలి, మహావేగంతో కదిలి, ఆ వ్యక్తి భుజాన్ని కూడా చుట్టేసిందా కొండచిలువ.

అటువంటి ప్రమాదం ఎదురవుతుందని ఊహించలేక పోయినందుకు తనను తను నిందించుకుంటున్నట్లు మొఖం పెడుతూ "గొంతెత్తి శివుడు... ఒరేయ్ శివుడూ... వచ్చేయ్‌రా... త్వరగా వచ్చేయ్..." బిగ్గరిగా అరిచాడు ఆ వ్యక్తి.

❖ ❖ ❖

తొండాల్ని గాలిలోకి ఎత్తి తమ చుట్టూ వున్న గాలిని వాసన చూస్తున్న ఏనుగుల వంకే పరీక్షగా చూస్తున్నాడు శివుడు.

ఉన్నట్లుండి పెద్ద శబ్దం చేసింది ఆడ ఏనుగు. తమకు అత్యంత సమీపం లోనే ఏదో ప్రమాదం పొంచి వున్నట్లు వేగంగా వెనక్కి అడుగులు వేసింది.

"ఏమిటది? ఏమయింది తల్లీ? ఏముంది అక్కడ?" అది చూస్తున్న దిశలోకి తనుకూడా చూస్తూ అడిగాడు శివుడు. అడగటంతో ఆగలేదు. తను కూడా వెనక్కి నడిచాడు.

ప్రమాదం పొంచులు వేసి వున్నట్లు ఆ జీవాలు భావిస్తే ఆ ప్రదేశంలో నిలబడి వుండటం మంచిది కాదని అతని అభిప్రాయం. "వెళ్ళిపోదాం... ఇక్కడినించి వెంటనే వెళ్ళిపోదాం" అంటూ మగ ఏనుగు దగ్గరికి పోయి దాని కుంభస్తలం మీదికి పోబోతుండగా వినవచ్చింది అతనికి ఆ అరుపు.

"శివుడు... ఒరేయ్ శివుడు... వచ్చేయ్‌రా... త్వరగా వచ్చేయ్..."

బిత్తరపోయాడు శివుడు. తన చెవుల్ని తనే నమ్మలేకపోతున్నట్టు ఆశ్చర్యంగా చూశాడు అటువైపు.

నాగరికులు కనిపిస్తే వెంటపడి వేటాడే ఆటవికులు తప్ప వేరెవరూ కనిపించని ఆ ప్రదేశంలో తనను పేరుపెట్టి పిలుస్తున్నది ఎవరు??

అతని ప్రశ్నకు సమాధానం లభించకముందే మరోసారి వినవచ్చిందా కేక... "శివుడు.. ఒరేయ్ శివుడూ..." అని.

ఆపైన క్షణం కూడా ఆగలేకపోయాడు అతను. తన నేస్తాలను హెచ్చరించాలన్న మాటను కూడా మర్చిపోయి, వేగంగా ముందుకు పరిగెత్తాడు.

వికృతంగా ఘీంకరించి అతన్ని ఆపటానికి ప్రయత్నించింది మగ ఏనుగు. దాని తొండానికి అందలేదు శివుడు. ఎదురుగా వున్న ఒక పెద్ద పొదమీది నించి అవలీలగా అవతలికి దూకాడు. పాదాలు నేలను తాకిన మరక్షణం మరింత వేగంగా ముందుకు పోయాడు.

ఎంతో దూరం పోవాల్సిన అవసరం లేకపోయింది. పది విండ్ల దూరంలో వున్న ఒక పెద్ద వృక్షాన్ని చేరుకోగానే ఆ వృక్షం అవతలి పక్కన కనిపించిన దృశ్యం అతన్ని నిర్ఘాంతపరిచింది.

❖ ❖ ❖

"అడుగో... అడుగడుగో... వస్తున్నాడు.. మనవాడు వెనక్కి వచ్చేస్తున్నాడు" ఉన్నట్లుండి ఒక ఆటవికుడు బిగ్గరిగా అరవటంతో ఉలిక్కిపడి, అతను చెయ్యి చూపుతున్న వైపు చూసింది జ్వాల.

బలి మనిషిని తీసుకువచ్చి నదిలోని నీటిని చెట్టుకొమ్మతో బాది బాది వదిలినా, కంటికి కనిపించకుండా పోయిన మకర దేవతలను వెతుకుతూ నది దిగువకు పోయిన ఆటవికుడు అలసటగా అడుగులు వేస్తూ వస్తున్నాడు.

"ఏమయిందిరా? ఏమిటి నువ్వు తెచ్చిన సమాచారం?" దగ్గరికి రాగానే అతన్ని అడిగాడు నాయకుడు.

"ఒక్కటంటే ఒక్క దేవత కూడా కనిపించలేదు నాయకా. అన్నీ కలిసి ఎక్కడికో వెళ్ళిపోయాయి..." అంటూ చుట్టూ చూసి "నా తమ్ముడు ఏడి? ఎగువకి వెళ్ళినవాడు ఇంకా తిరిగి రాలేదా?" అని అడిగాడు ఆ వ్యక్తి.

నది ఎగువకి వెళ్ళిన మనిషి అతనికి సోదరుడు అవుతాడని అప్పుడు తెలిసింది జ్వాలకి. "వచ్చేస్తాడు. వాడు కూడా నీ మాదిరిగానే కాళ్లు ఈడ్చుకుంటూ వచ్చి ఏమీ కనిపించలేదని చెపుతాడు" అన్నదామె వెక్కిరింపుగా.

కోపంగా ఆమెవంక చూసి "పట్టుకొచ్చిన దగ్గిర్నించీ చూస్తున్నాను. ఈ కూనకి నోరు మహా దురదే... వెక్కిరించటంలో దిట్ట. నెత్తిమీద రెండు దెబ్బలు వేస్తే అంతా సరి అయిపోతుంది" అన్నాడు ఆ ఆటవికుడు.

"బలికూన జోలికి పోవటం తప్పు... మన దేవతలు ప్రత్యక్షం అయిన వెంటనే నోరు ఎలాగూ మూతబడిపోతుంది... పట్టించుకోకండి" అంటూ తల బరుక్కుని, ఆ ఆటవికుడి భుజంమీద చెయ్యివేశాడు నాయకుడు.

“అలసిపోయి వచ్చిన నీకు మళ్ళీ పని చెప్పటం నాకు ఇష్టం లేదు కాని ఎగువకి వెళ్ళింది నీ తమ్ముడే కాబట్టి శ్రమ అనుకోకుండా నువ్వు కూడా అటుకేసి వెళ్ళిరా... విషయం ఏమిటో తెలుస్తుంది” అన్నాడు.

తోటి ఆటవికుల్లో ఒకతను అందించిన సొరకాయ బుర్రలోని నీటిని రెండు గుక్కలు పుచ్చుకుని, తన ఆయుధాల్ని సవరించుకుంటూ నది ఎగువకి బయలుదేరాడు ఆ ఆటవికుడు.

❖ ❖ ❖

ఆహారం కనిపించగానే అమాంతం మీదపడి గుటుక్కున మింగేస్తాయిట కొండచిలువలు. అలా మింగిన ఆహారం అరిగిపోయేదాకా ఏ చెట్టుకో, బండకో చుట్టలు చుట్టుకుని మత్తుగా పడివుంటాయట. ఆ సమయంలో తన పక్కనించి మరింత రుచికరమైన ఆహారం అవతలికి వెళ్ళినా కొంచెంగా కూడా పట్టించుకోవట.

అటువంటి ఆ పాడు పాము ఒకేసారి ఇద్దరు మనుష్యుల్ని పట్టుకోవటం ఏమిటి?

“నోరు తెరుచుకుని చూస్తావేమిటిరా? నరికేయ్‌రా... త్వరగా... త్వరగా...” నిలువు గుడ్లతో నిలబడిపోయిన శివుడిని చూసీ చూడగానే బిగ్గరిగా అరిచాడు చిలువకు పట్టుబడిన రెండో మనిషి.

ఆ అరుపుతో ఈ లోకంలోకి వచ్చిపడ్డాడు శివుడు. ఆ మనిషి చేతిలో నుంచి జారి క్రిందపడిపోయింది ఒక పొడవాటి ఖడ్గం.

గబుక్కున పోయి దాన్ని చేతిలోకి తీసుకున్నాడు శివుడు. చాలా బరువుగా వున్నది అది. ఒక చేత్తో ఎత్తటం కుదరక, రెండు చేతులతోను పట్టుకున్నాడు.

కొత్తగా వచ్చిన మూడో మనిషిని చూడగానే, తనకు పట్టుబడిన ఇద్దరి ప్రాణాలు తీసేయటం చాలా ముఖ్యమని భావించింది కాబోలు, తన దృష్టినంతా వారిమీదనే కేంద్రీకరించి మొదట దొరికిన ఆటవికుడి తలను నోటితో చిక్కించుకోబోతున్నది కొండచిలువ.

శరీరంలోని శక్తినంతా చేతుల్లోకి తెచ్చుకుంటూ ఖడ్గాన్ని విసిరాడు శివుడు.

లేత అరటి బోది తెగిపోయినట్లు కస్సున తెగిపోయింది చిలువ తల. గింగిరాలు తిరుగుతూ పోయి పది అడుగుల దూరంలో పడి, ఇంకా కొంచెంప్రాణం వున్నట్లు పొర్లిగింతలు పెట్టడం ప్రారంభించింది.

చంద్రుడి గుట్టమీద పుట్టలో నుంచి బయటికి వచ్చిన పాముల్ని తొక్కి చంపిన వృత్తాంతం గుర్తుకు వచ్చింది కాబోలు. నిర్మొహమాటంగా ఆ తలమీద కాలువేసి అణగదొక్కింది శివుడి వెనుకగా పరిగెత్తుకు వచ్చిన ఏనుగు గున్న.

తల లేకపోయినా అటూ యిటూ కదిలి, తను పట్టుకున్న మానవుల్ని అదిమేయబోతున్న చిలువ శరీరాన్ని ఖడ్గంతో ఇష్టం వచ్చినట్లు పొడిచి పొడిచి వదిలాడు శివుడు.

పది క్షణికాల తరువాత ఆ మనుష్యుల్ని వదిలి కిందపడిపోయింది ఆ శరీరం. నిలబడటానికి ఓపిక లేనట్లు వెల్లకిలా పడిపోయాడు ఆటవికుడు. స్పృహను కోల్పోయి కళ్ళు తేలవేశాడు.

అతని మాదిరిగా అడ్డంగా పడిపోకపోయినా, కొద్దిగా ముందుకు తూలాడు రెండో మనిషి.

చటుక్కున అతన్ని పట్టుకుని పళ్ళబిగువున అతని బరువును భరిస్తూ అతినెమ్మదిగా నేలమీద కూర్చోబెట్టాడు శివుడు.

"మిమ్మల్ని ఈ ప్రదేశంలో చూస్తానని నేను అనుకోలేదు. నేను ఏదైనా తప్పు చేసివుంటే క్షమించండి" అంటూ తలవంచి నమస్కారం చేశాడు.

"నువ్వు తప్పు చేయటమా? మొట్టమొదటిసారిగా నువ్వు అడవిలో అడుగుపెట్టిన క్షణం నుంచీ నీడ మాదిరి నీ వెనుకే తిరుగుతున్నాను. ఎప్పుడు ఏం చెయ్యాలో, ఏ ఏ పరిస్థితుల్లో ఎలా ప్రవర్తించాలో నీకు బాగా తెలుసు. నాకు నచ్చావురా శివుడూ... చాలా బాగా నచ్చావు" అతని తలమీద చెయ్యివేసి ఆదరంగా నిమురుతూ అన్నాడు ఆ మనిషి.

జ్వలిత సామ్రాజ్యంలో చక్రవర్తి చేతిక్రింద పనిచేసే గూఢచారులు అందరిలోకి అత్యంత మేథాశక్తి సంపన్నుడయిన వాసుదేవుడు అతను.

కొండచిలువ తలను చితకతొక్కుతున్న ఏనుగు గున్న వెనకాలే ప్రత్యక్షం అయిన పెద్ద ఏనుగులు రెండిటిని చూడగానే అందమైన చిరునవ్వు ఒకటి ప్రత్యక్షం అయింది అతని పెదవులమీద.

"నీ నేస్తాలను హెచ్చరించి దూరంగా నిలబెట్టు. అవి ఘీంకారాలు చేస్తే ఈ పడిపోయిన ఆటవికుడి బంధువులు, స్నేహితులు, చుట్టాలు పక్కాలు అందరూ మనమీదికి యుద్ధానికి వచ్చేస్తారు" అని చెప్పాడు.

కత్తిపోట్లకు గురై కిందపడిపోయిన చిలువ శరీరం దగ్గరికి వస్తున్నాయి పెద్ద ఏనుగులు. చేయెత్తి వాటిని ఆపేశాడు శివుడు.

"ఇతని పక్కటెముకలు బాగా నలిగిపోయాయి. ఏదైనా వైద్యం చేయకపోతే బతకటం కష్టం..." అంటూ గట్టిగా ఆలోచించి నెమ్మదిగా పైకి లేచాడు వాసుదేవుడు.

"విరిగిన ఎముకల్ని అతికించి విరగటం వల్ల కలిగే నొప్పుల్ని తగ్గించే మూలికలు ఈ చుట్టుపట్ల వున్నాయేమో చూసి వస్తాను. నువ్వు జాగ్రత్త" అని చెప్పి గబగబా ముందుకు పోయాడు. క్రిందపడవేసిన తన విల్లంబుల్ని అంబులపొదిని తీసుకుని పొదల్లోకి పోయాడు.

"మనల్ని మొదటినుంచీ అనుసరించి వస్తున్నది ఆయనే... బాగా గుర్తు పెట్టుకోండి... చాలా తెలివైనవాడట. మహా బలవంతుడు..." పొదల్లోకి పోతున్న వాసుదేవుడి వంకే కోరగా చూస్తున్న తన నేస్తాలకు చెప్పాడు శివుడు.

❖ ❖ ❖

మొట్టమొదట కదిలే కొండల మాదిరిగా వున్న పెద్ద ఏనుగుల్ని చూశాడు నది ఎగువకు బయలుదేరి వచ్చిన రెండో ఆటవికుడు. తర్వాత చెట్టుక్రింద గుట్టగా పడివున్న కొండచిలువ శరీరాన్ని చూశాడు.

ఆ తర్వాత స్పృహ కోల్పోయిన తన తమ్ముడిని గమనించాడు. అతనికి సేవలు చేస్తున్న పెద్ద నాగరికుడిని, అతని వెనుకే నిలబడి ఆతృతగా చూస్తున్న బాలకుడిని గమనించాడు.

అప్పటికప్పుడు వెనక్కి పరిగెత్తి తన గూడెం వారందర్ని వెంటబెట్టుకు రావాలన్న కోరిక వెంటనే కలిగింది అతనికి. వెంటనే ఆ కోరికను అడ్డుకున్నది అతని అహం.

ఇద్దరంటే ఇద్దరు ఆ నాగరికులు. ఒకడు పెద్ద, రెండవవాడు చిన్న. వారిద్దరినీ హతమార్చటానికి తన గూడెమంతా కదిలి రావాలా? తను ఒక్కడే సరిపోడా?

శబ్దం చేయకుండా చేతుల్ని మాత్రం కదిలించి, తన వీపుకు వున్న విల్లంబుల్ని అందుకున్నాడు అతను. అంబును వింటికి తొడుగుతూ ఎందుకో పక్కకి చూశాడు.

చూసిన వెంటనే శరీరంలోని రక్తం అంతా గడ్డకట్టుకుపోయిన అనుభూతి కలిగింది అతనికి.

ఎప్పుడు కదిలిందో, శబ్దం చేయకుండా ఎలా ముందుకు రాగలిగిందో గాని, చాలా దగ్గరికి వచ్చి అతనివంకే తీక్షణంగా చూస్తోంది ఒక ఏనుగుగున్న.

పెద్ద ఏనుగుల్ని చూడగలిగిన తాను ఆ పిల్ల ఏనుగును చూడలేకపోవటం చాలా తప్పయిపోయిందని వెంటనే తెలిసివచ్చింది అతనికి.

బాణం కదల్చవచ్చు. ఒక బాణం దెబ్బకు అది గాయపడదు. రెండో బాణాన్ని పొదిలో నుంచి తీసేలోపుగా వచ్చి మీదపడుతుంది. కత్తిని తీసి ఎదిరించేలోపుగా దాని వెనుకే వచ్చిపడతాయి పెద్దవి రెండూ. పాదాలతో తనని బారెడు లోతుకు భూమిలోకి పంపించేస్తాయి.

వేటాడటంలో ఎంతో పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్న తాను... అలా దిక్కులేని చావు చచ్చాడంటే ఎంత నగుబాటు?

ఏం చెయ్యాలో, ఆ విపత్కర పరిస్థితిని ఎలా ఎదుర్కోవాలో అతను తేల్చుకోకముందే, బాధగా మూలుగుతూ కనులు తెరిచాడు అంతవరకూ అచేతనంగా పడివున్న అతని సోదరుడు.

తన దగ్గర వున్న నాగరికుల్ని చూసి అలజడి చెందుతూ, పైకి లేవబోయాడు. వెంటనే అతన్ని వారించాడు పెద్ద నాగరికుడు.

"కదిలావంటే, నీ పరిస్థితి బాగా విషమిస్తుంది. నాలుగు పక్కటెముకలు విరిగిపోయాయి. వాటి మొదలు నీ ఊపిరితిత్తులకు గుచ్చుకుని గాయాలు అయ్యాయంటే నిన్ను ఆ దేవుడు కూడా కాపాడలేడు. కదలకుండా పడుకో..." అంటూ తన వెనక వున్న బాలకుడి కేసి చూశాడు.

"మనం చేసిన వైద్యం చాలదు. ఇతని గూడెంలో అనుభవం కలిగిన పెద్దవాళ్ళు తప్పకుండా వుండే వుంటారు. నేను వెళ్ళి వాళ్ళని తీసుకువస్తాను. అంతవరకూ జాగ్రత్తగా చూసుకోగలవా?" అని అడిగాడు.

"వాళ్ళని తీసుకురావటం కంటె మనమే ఇతన్ని వాళ్ళ దగ్గరికి తీసుకుపోతే?' అడిగాడు బాలకుడు.

"కదిలితే పరిస్థితి ఇంకా విషమిస్తుందని చెప్పాను కదా... వినలేదా?" చిరుకోపంతో అడిగాడు నాగరికుడు.

సిగ్గుపడుతున్నట్లు తల పక్కకు తిప్పుకున్నాడు బాలకుడు. అంతలోనే అతనికి ఇంకో అనుమానం వచ్చినట్లుంది. "గూడెంలో వాళ్ళు మీ మాటల్ని వినిపించుకోకుండా యుద్ధానికి సిద్ధం అయితే?" అని అడిగాడు.

తన ఆయుధాలన్నిటినీ తడుముకోకుండా సాలోచనగా తలవూపాడు పెద్ద నాగరికుడు. "ఆ ప్రమాదం తప్పకుండా వుంటుంది. ఏదో ఒక విధంగా వాళ్ళకి నచ్చచెప్పాలి" అన్నాడు.

"నేను వెళితే చిన్నవాడిని కాబట్టి వాళ్ళు కొంచెం నిదానిస్తారు. పెద్దవాళ్ళని చూసి ఉద్రేకపడినట్లు నన్ను చూసి ఆవేశపడరు. నా మాటల్ని వింటారు" అన్నాడు బాలకుడు.

ఏం చెయ్యాలో తోచని పరిస్థితిలో కూడా ఆ బాలకుడి మాటలు ముచ్చటగొలిపాయి రెండో ఆటవికుడికి.

నిజముంది అతని మాటల్లో. అతన్ని చూసిన తర్వాత తప్పకుండా అతని మాటల్ని వింటారు తన గూడెంవాళ్ళు. తొందరపడరు.

కాని అతనికి వున్న నమ్మకం పెద్ద నాగరికుడికి వున్నట్లు కనిపించలేదు. "నువ్వు అసలే దుందుడుకు పిల్లాడివి. ఎవడో ఒకడు నీకేసి కోరగా చూస్తాడు. నీకు కోపం వస్తుంది. నీకు కోపం వస్తే నీ నేస్తాలకు కూడా అది అంటుకుంటుంది. అప్పుడు ఏం జరుగుతుందో తలచుకుంటే నాకు బెదురు పుడుతోంది. ఎట్టి పరిస్థితిలోను నువ్వు ఇక్కడినించి కదలటం నాకు ఇష్టం లేదు. నేనే వెళ్ళివస్తాను" అంటూ లేచి నిలబడ్డాడు.

ఆ మాటల్ని విన్న తర్వాత మౌనంగా వుండలేకపోయాడు రెండో ఆటవికుడు. ఆ పెద్ద నాగరికుడు ప్రమాదంలో తలదూర్చటానికి సిద్ధం అవుతున్నాడని అర్థం అయినవెంటనే "నేను మీ దగ్గరికి రావచ్చునా?" అని బిగ్గరిగా అన్నాడు.

అదిరిపడి తన ఆయుధాలమీద చెయ్యి వేశాడు పెద్ద నాగరికుడు. ఛెంగున పక్కకు దూకి ఒకచోట కనిపించిన పెద్ద పలుకురాయిని చేతుల్లోకి తీసుకున్నాడు బాలకుడు.

"యుద్ధానికి రాలేదు. పడిపోయి వున్న వాడి సోదరుడిని నేను. శాంతం గానే వస్తున్నాను" ఆయుధాల్ని వదిలి చేతులు గాలిలోకి ఎత్తి ముందుకు అడుగు వేస్తూ అన్నాడు రెండో ఆటవికుడు.

"నీ నేస్తాలను హెచ్చరించరా శివుడు... వాటిని కదలనీయకు" వెంటనే బాలకుడిని హెచ్చరించాడు పెద్ద నాగరికుడు.

రెండో ఆటవికుడు కదిలిన వెంటనే తనుకూడా కదలబోయిన గున్ననీ, పెద్దవాటినీ ఒకే ఒక అరుపుతో కదలకుండా నిలబెట్టేశాడు బాలకుడు.

"వాసుదేవుల వారు మనతో వున్నారని మరచిపోకండి. ఎప్పుడు ఏం చెయ్యాలో బాగా తెలిసిన మనిషి. అవసరం అయితే ఆజ్ఞ ఇస్తారు. అప్పుడు కదులుదాం మనం..." అని వాటికి చెప్పాడు.

నడికొండల వంటి ఆ అడవిజీవులు పెంపుడు జంతువుల మాదిరి ప్రశాంతంగా నిలబడిపోవటం, గున్నకూడా ఆగిపోవటం రెండో ఆటవికుడికి అమితమైన ఆశ్చర్యాన్ని కలిగించింది.

"మీరు మామూలు నాగరికులు కారు. మీ పరిచయం మాకు మేలు చేస్తుందనే నమ్మకం కలుగుతోంది" అంటూ మరింత ముందుకు వచ్చి పడిపోయి వున్న తన సోదరుడి మొఖంలోకి చూశాడు.

పళ్ళబిగువున తన బాధను భరిస్తున్న ఆ సోదరుడు అతన్ని చూడగానే మహా సంతోషపడిపోయాడు. చిన్న చిన్న మాటలతో జరిగింది ఏమిటో అతనికి తెలియచేసి గుట్టగా పడివున్న చిలువ శరీరాన్ని చితికి ఛిద్రమైపోయిన దాని తలను చూపించాడు.

గుండెలమీద చెయ్యి వేసుకున్నాడు రెండో ఆటవికుడు. విచిత్రంగా చూస్తూ నిలబడిన శివుడికి తలవంచి అభివాదం చేశాడు.

"మీరు మామూలు నాగరికులు కారని ఇందాకనే చెప్పాను. మళ్ళీ ఇప్పుడు కూడా చెపుతున్నాను. నా తమ్ముడి ప్రాణాలు కాపాడిన మీకు నేను పూర్తిగా రుణపడిపోయాను" అన్నాడు.

చిరాకు పుట్టినట్లుంది పెద్ద నాగరికుడికి. "మాటలు వద్దు. చేతలు చూపించు. వెంటనే వెళ్ళి..." అంటుండగా తలవూపాడు ఆ ఆటవికుడు. "ఇప్పుడే వెళ్ళి మా మందుల ముసలయ్యని తీసుకువస్తాను"అంటూ వెనుతిరిగి పొదల్లోకి పరిగెత్తాడు.

తన దట్టీలో నుంచి జానెడు పొడుగున్న చురకత్తిని ఒకదాన్ని తీసి శివుడికి అందించాడు వాసుదేవుడు.

"అవసరం అయితే నిర్మొహమాటంగా ఉపయోగించు. ఈ ఆటవికులు ఎప్పుడు ఎలా ప్రవర్తిస్తారో చెప్పటం కష్టం" అన్నాడు.

❖ ❖ ❖

"రెండోవాడు వెళ్ళి కూడా చాలా సమయం గడిచిపోయింది. ఈ రోజుకు మనం గూడేనికి వెళ్ళిపోవడం చాలా మంచిది. ఈ బలి తతంగం ఎందుకో బెడిసికొట్టింది" సాలోచనగా అన్నాడు ఒక వృద్ధ ఆటవికుడు.

"ఇంతసేపు ఆగినవాళ్ళం ఇంకో కొద్దిసేపు ఆగలేమా? చూద్దాం..." అన్నాడు నాయకుడు.

అడవిలో తనకోసం వెతికే తమ భటులు ఎవరో ఒకరు అవతలి ఒడ్డుకు వచ్చి తనను గమనిస్తే బాగుంటుందని జ్వాలకు అనిపించిన మాట వాస్తవం. వృద్ధ ఆటవికుడు చెప్పినట్లు గూడేనికి తిరిగిపోతే అటువంటి పని జరగదు... మరి కొంతసేపు అక్కడే వుంటే బాగుంటుంది.

"నిమిషానికి నాలుగుసార్లు అటూ యిటూ తిరిగే ఓపిక నాకు లేదు. మీ మకర దేవతలు ప్రత్యక్షం అయ్యేదాకా నేను ఇక్కడినించి కదిలే ప్రసక్తి లేదు" పెద్దకంఠంతో చాలా గట్టిగా అన్నది ఆమె.

అంటూ వుండగానే ఆమె కంటికి కనిపించింది ఒక పెద్ద మొసలి. ఆహారం కోసం వెతికే సమయంలో చాలా వేగంగా కదులుతాయి అవి. ఇప్పుడు కనిపించింది మాత్రం అలా వేగంగా కదలటం లేదు. చాలా నిదానంగా, తాపీగా నీటి వాలున కొట్టుకు వస్తున్న పెద్ద దుంగమాదిరిగా తేలుతూ వస్తోంది.

"అదిగో.. దేవత... మకరదేవత... వచ్చేస్తోంది. వచ్చేస్తోంది" జ్వాలతో పాటుగా తాముకూడా దాన్ని గమనించి బిగ్గరిగా అరిచారు ఆటవికులు.

ఒక్క క్షణికం కూడా ఆలస్యం చేయకుండా చీలమండలు మునిగేవరకూ నీటిలోకి దిగి, చేతిలో వున్న చెట్టుకొమ్మతో నీటిని దబదబా బాదాడు నాయకుడు.

"వచ్చేయ్ తల్లీ... వచ్చి బలి ఆహారాన్ని స్వీకరించు" అంటూ ఎలుగెత్తి అరిచాడు.

వచ్చింది ఆ మొసలి... అతను నిలబడిన ప్రదేశానికి పది అడుగుల దూరంలోకి వచ్చి అతనివంక చూసింది.

"దింపండి... బలికూనని నీళ్ళల్లోకి దింపండి" ఆనందంగా అరిచాడు నాయకుడు.

తాపీగా కూర్చుని వున్న జ్వాలను వెంటనే ఆవరించుకున్నది తీవ్రమైన నిర్వేదం.

గూడేనికి వెళ్లిపోదామని ఆ వృద్ధ ఆటవికుడు చెప్పగానే తనుకూడా అందుకు ఒప్పుకుని వుంటే బాగుండేదని ఆమెకు అనిపించింది. ఆమె ఆలోచనలు ఎవరికీ అర్థం కాలేదు. భుజాల్ని గట్టిగా పట్టుకుని బలవంతంగా నెట్టారు నీళ్ళల్లోకి.

పొడవాటి తోకతో నీటిని అల్లకల్లోలం చేస్తూ, పదునైన దంతాలు బయటకి కనిపించేలా నోటిని తెరిచి, కంటికి కనిపించనంత వేగంతో ముందుకు వచ్చి ఆటవికులు నీటిలోకి నెట్టిన బలిమనిషిని చటుక్కున పట్టుకోవల్సిన ఆ మొసలి, అసలు ఆహారం తీసుకోవటం తనకు అలవాటు లేని మహాయోగి మాదిరి నిరాసక్తంగా చూసింది నీటిలోకి నెట్టబడిన జ్వాల వైపు.

ఆశ్చర్యంతో మతులు పోయినట్లు నోళ్ళు తెరుచుకుని విచిత్రంగా చూశారు ఆటవికులు అందరూ. "తల్లీ... స్వీకరించు... నీకు మేము తీసుకువచ్చిన ఈ బలికూనని ఆరగించి నీ ఆకలిని తీర్చుకో." చేతుల్లోని చెట్టుకొమ్మతో ఇంకోసారి నీటిని దబదబా బాదుతూ అర్థించాడు నాయకుడు. జ్వాలని మరికొంచెం ముందుకు నెట్టాడు.

అయినా సరే ఉత్సాహం చూపించలేదా మకరి. అతను మాట్లాడుతున్నది తనతో కాదనుకున్నట్టు, అసలు వారెవర్నీ తాను చూడనట్టు, నిదానంగా నీటివాలుకు వెళ్ళిపోయింది.

"ఏమిటిది? ఏమిటీ వింత?? పుట్టి బుద్ధెరిగిన తర్వాత ఇప్పటివరకూ ఇటువంటి విచిత్రాన్ని నేను చూసింది లేదు. ఎందుకు జరుగుతోంది ఇలా??" ఒడ్డుమీద నిలబడి వున్న వృద్ధ ఆటవికుల కేసి తిరుగుతూ అడిగాడు నీటిలో నిలబడిన నాయకుడు.

"ఎందుకు ఇలా జరుగుతోందో మాకు కూడా తెలియటం లేదు. ఒకవేళ దేవతలకి కోపం వచ్చి వుంటుంది" సాలోచనగా అన్నాడు ఒక వృద్ధుడు.

"కోపం రావటానికి ఏదో ఒక అపరాధం జరిగివుండాలి... నాకు తెలిసి మనం ఎవరము ఎటువంటి అపరాధము చెయ్యలేదు" గంభీరంగా అన్నాడు నాయకుడు.

"ఎందుకు చెయ్యలేదు? మీరు చేశారు... క్షమించరాని ఘోర అపరాధాన్నే చేశారు" చటుక్కున అన్నది జ్వాల.

తనకేసి చూడను కూడా చూడకుండా ఆ మొసలి అలా ఎందుకు వెళ్ళిపోయిందో ఆమెకు కూడా తెలియలేదు. అయితే అలా వెళ్ళిపోవటాన్ని తనకు అనుకూలంగా మార్చుకోవటం చాలా మంచిదని ఆమెకు అనిపించింది.

"మీమీద యుద్ధం చెయ్యటానికో, దాడి చెయ్యటానికో వచ్చిన శత్రువుల్ని మాత్రమే బలి ఆహారంగా తీసుకుంటాయి ఈ నదిలోని మొసళ్ళు. దారి తప్పి పొరపాటుగా మీ సమీపంలోకి వచ్చిన నా వంటి అమాయకుల్ని అవి ఆరగించటానికి ఇష్టపడవు. ఈ విషయం మీ మొద్దుబుర్రలకి ఇంకా తట్టకపోవటం నాకు చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది'' వాళ్ళ ఆచార వ్యవహారాలు తనకు బాగా తెలిసినట్టు పెద్ద ఆరిందా మాదిరిగా చెప్పింది.

ఒకళ్ళ మొఖాలు ఒకళ్ళు చూసుకున్నారు ఆటవికులు అందరూ.

తన మాటలు వాళ్ళని ఆలోచనలో పడవేశాయని అర్థమైంది జ్వాలకి. అడవి జంతువులైనా, నీటిలో నివశించే మొసళ్ళవంటి జలజీవులైనా ఆకలి వేస్తే తప్ప ఆహారం కోసం ఆరాటపడవు. ఆత్మరక్షణ కోసం తప్ప అన్యజీవుల మీద యుద్ధానికి బయలుదేరవు.

నీళ్ళలో తేలుతూ వచ్చే పెద్ద దుంగమాదిరిగా వున్న ఆ మొసలి అంతకుముందే కడుపునిండుగా ఆహారాన్ని తీసుకుని వుంటుంది. అందుకే అది తనవంక కన్నెత్తి కూడా చూడకుండా అవతలికి వెళ్ళిపోయింది.

ఆ సంగతి ఈ ఆటవికులకు తెలియటం లేదు. తెలిసేలోపుగా తను అక్కడినించి తప్పించుకునే అవకాశాలు ఏమైనా లభిస్తాయేమో వెతుక్కోవాలి.

జ్వాల ఆలోచనలు పూర్తికాలేదు. నీరసం నిలువెల్లా ఆవరించుకుని వున్నా, అలసట అణువణువునా కనిపిస్తూనే వున్నా ఎక్కడా ఆగకుండా పరిగెత్తుకు వచ్చాడు అంతకుముందు తన తమ్ముడిని వెతుకుతూ నది ఎగువకి పోయిన ఆటవికుడు.

వచ్చీరావడంతోటే "ముసలయ్యా... మందుల ముసలయ్యా... ఎక్కడ వున్నావ్?" అని అరిచాడు జీరపడిన కంఠంతో.

ఎవరో కాదు ఆ మందుల ముసలయ్య. నదీ తీరం దగ్గరికి వచ్చిన క్షణం నుంచీ జ్వాల విషయంలో నాయకుడికి మాటల్ని అందిస్తున్న వృద్ధ ఆటవికుడే అతను.

"ఏంటిరా పెద్దోడా? ఏమయిందిరా? ఏడిరా నీ తమ్ముడు?" అని అడిగాడు ముందుకు అడుగు వేస్తూ.

చిన్న చిన్న మాటలతో అతనికి, నాయకుడికి మాత్రమే వినబడేటట్లు ఏదో చెప్పాడు పరిగెత్తుకు వచ్చిన ఆటవికుడు. ఏం చెప్పాడో జ్వాలకి వినబడలేదు కాని ఆ మాటల్ని విన్నవెంటనే వెలా తెలా పోయింది నాయకుడి మొఖం.

"అందుకోండిరా ఆయుధాల్ని... పట్టుకోండిరా బాణాల్ని... అనుమతి లేకుండా మన గడ్డమీదికి అడుగుపెట్టిన ఆ నాగరికుల అంతు చూసి తీరాల్సిందే" ఖంగుమంటున్న కంఠంతో అరిచాడు.

ఆ ఆజ్ఞల్ని విన్నవెంటనే నడుములకు వ్రేలాడుతున్న కొమ్ముబూరల్ని తీసి పెద్దగా ఊదబోయిన వారందర్ని అతి బలవంతంగా ఆపేశాడు ఎగువ నించి వచ్చిన ఆటవికుడు.

"నా తమ్ముడి ప్రాణాలు కాపాడిన ఆ నాగరికులకు నేను పూర్తిగా రుణపడిపోయి వున్నాను. వాళ్ళని ఏమైనా చేయాలని అనుకునే వాళ్ళు అంతకుముందుగా నన్ను ఏదో ఒకటి చేయాలి. నా ప్రాణాలు తీసిన తర్వాతనే ముందుకు అడుగువేయాలి" అని హెచ్చరించాడు.

ఎర్రబడిన మొఖంతో అతనిమీద విరుచుకుపడుతున్న నాయకుడి వంక, ఏ క్షణంలోనైనా ఆయుధాల్ని పట్టుకుని ఎవరి మీదికో యుద్ధానికి బయలుదేర బోతున్నట్టు సిద్ధంగా నిలబడిన ఇతర ఆటవికుల వంక ఆశ్చర్యంగా, మార్చిమార్చి చూసింది జ్వాల.

తనకోసం అడవినంతా గాలించే తమ భటులు ఎవరైనా నదిని అధిగమించి ఇటుపక్కకు వచ్చివుంటారా? వాళ్ళను నరికి పోగులు పెట్టటం కోసమే నాయకుడు ఆత్రుత పడుతున్నాడా?

ఎగువనించి వచ్చిన ఆటవికుడు తను వారికి రుణపడిపోయానని అంటున్నాడు. ఏ విధంగా? ఎందుకు?

సమాధానం లభించని ఆ ప్రశ్నలతో సతమతం అవుతూనే “ఎందుకు అనవసరంగా రచ్చ చేసుకుంటారు? అసలు జరిగింది ఏమిటో నాయకుడు స్వయంగా వెళ్ళిచూస్తే ఏ గోలా వుండదు కదా?” అన్నది ఆమె.

చిన్నపాటి చెట్టుకొమ్మ విరిగి కిందపడినా, పెద్దగా వినిపించేటంత నిశ్శబ్దం ఆవరించుకున్నది ఒక్కసారిగా ఆ ప్రదేశాన్ని.

“బలికూన పలుకులు లెస్సగా వున్నాయ్. ముందు మందుల ముసలయ్య, తర్వాత నాయకుడు నిశ్శబ్దంగా పోయి కళ్ళారా చూసిరావటమే మేలు” నిర్మొహమాటంగా అన్నాడు ఒక ఆటవికుడు.

“త్వరగా... త్వరగా తేల్చండి. అవతల నా తమ్ముడు చావుబతుకుల మధ్య తందనాలు తొక్కుతున్నాడు” అసహనంగా అన్నాడు ఎగువ నించి వచ్చిన యువకుడు.

గట్టిగా నిట్టూర్చాడు నాయకుడు. “బలికూనని గూడేనికి తీసుకుపోండి. మనవాళ్ళందర్నీ యుద్ధానికి సిద్ధంగా వుండమని చెప్పండి” అని మిగిలిన వారికి ఆజ్ఞ ఇచ్చి యువ ఆటవికుడికి సైగ చేశాడు.

అంతవరకూ ఒక చెట్టు దగ్గర పెట్టి వుంచిన తన మందుల సంచిని వీపుకు వ్రేలాడతీసుకుని అడుగు కదిపాడు మందుల ముసలయ్య. అతన్ని అనుసరించాడు నాయకుడు. ముందు పరిగెత్తుతూ దారి చూపించాడు యువ ఆటవికుడు.

“చావు తప్పిందని సంబరపడిపోకు కూనా... ఇవ్వాళ కాకపోతే రేపయినా నీ బతుకు తెల్లారిపోవాల్సిందే... మాచేతికి చిక్కిన నాగరికుల్ని ఎవరినీ ప్రాణాలతో ఇంతవరకూ వదిలింది లేదు” అంటూ జ్వాలని అతి బలవంతంగా గూడెంవైపు నడిపించారు మిగిలిన ఆటవికులు.

❖ ❖ ❖

“నాగరికులు నాగరికులు... వాళ్ళల్లో వాళ్ళు కొట్టుకుని గుట్టలు గుట్టలుగా పడి చచ్చిపోయారు. నదిలో వున్న మకర దేవతలన్నీ విందు భోజనాలు చేసుకుంటున్నాయి. బలికూన కోసం ఒక్కటీరాకపోవటానికి కారణం అదే”

నీరసంగానే వున్నా నాయకుడిని చూడగానే చెప్పాడు పక్కటెముకలు విరిగిన ఆటవికుడు.

"అబ్బో... నాలుగు విరిగిపోయినయ్. అయినా నువ్వు ఇంకా ప్రాణాలతోనే వున్నావంటే విచిత్రమే" ఆశ్చర్యంగా అన్నాడు అతన్ని పరీక్ష చేసిన ముసలయ్య.

"అంతా వీళ్ళ దయ... శత్రువునని అనుకోకుండా కాపాడారు. తనకు తెలిసిన మూలికల్ని తెచ్చి వైద్యం చేశాడు ఈ పెద్దాయన..." ఒక పక్కగా నిలబడిన వాసుదేవుడి వంక చూపిస్తూ చెప్పాడు ఆ ఆటవికుడు.

"మరి ఈ బుడతడు ఏం చేశాడు?" అడిగాడు నాయకుడు.

"బుడతడు కాదు... చిచ్చరపిడుగు. చేయెత్తి సైగ చేశాడంటే నువ్వు నేనూ ముసలయ్యతో సహా పాతాళంలోకి వెళ్ళిపోతాము" అంటూ దూరంగా నిలబడిన ఏనుగుల్ని చూపించాడు పడిపోయిన ఆటవికుడి సోదరుడు. తను అక్కడికి వచ్చిన వెంటనే ఎదురైన అనుభవాన్ని వర్ణించాడు.

అందుబాటులో వున్న చెట్టుకొమ్మల్ని విరిచి చిన్న చిన్న బద్దలుగా చీల్చి విరిగిపోయిన పక్కటెముకలు కదలకుండా గట్టిగా కట్టుకట్టాడు మందుల ముసలయ్య.

పెద్ద పెద్ద కొమ్మలతో ఒక మనిషిని పడుకోబెట్టేందుకు వీలుగా వుండే నిచ్చెనను తయారుచేసి దానిమీద ఆ ఆటవికుడిని పడుకోబెట్టాడు.

నిచ్చెన ముందు భాగాన్ని తన భుజాలకు ఎత్తుకున్నాడు నాయకుడు. వెనుక భాగాన్ని పడిపోయిన ఆటవికుడి సోదరుడు ఎత్తుకున్నాడు.

మందుల ముసలయ్య ముందుండి దారి చూపిస్తుండగా, అతిజాగ్రత్తగా తమ గూడేనికి బయలుదేరారు వారు.

"మీరు నాగరికులైనా సరే, మాకు ఉపకారంచేశారు కాబట్టి మాకు స్నేహితులే అయ్యారు. మాతోబాటు గూడేనికి రండి. రేపు చద్దన్నం తిన్న తర్వాత మీ దారిని మీరు వెళ్ళిపోవచ్చు" తమ పద్ధతులకు విరుద్ధమే అయినా వాసుదేవుడికి చెప్పాడు నాయకుడు.

నిశ్శబ్దంగా నిలబడి వున్న శివుడిని చూశాడు వాసుదేవుడు. "యువరాణిని వెతకటానికి ఆలస్యం అయిపోతుంది. ఆలస్యం అయిన కొద్దీ ఆమెను వెతకటం

చాలాకష్టం అవుతుంది" వాళ్ళతో వెళ్ళటం తనకు ఇష్టం లేనట్లు చెప్పాడు శివుడు.

"నిజమే. కాని వీళ్ళు మనకి సహాయపడవచ్చు. వాళ్ళకి తెలిసినట్టు ఈ ప్రదేశాలను గురించి మనకి తెలియదు..." సాలోచనగా అన్నాడు వాసుదేవుడు.

అప్పటికీ మనసు మార్చుకోలేదు శివుడు. "నాకు ఇష్టంలేదు" అన్నాడు మళ్ళీ.

"నది కొండల్లాంటి ఏనుగుల్ని ఒక్కమాటతో ఆపగలిగిన నీకు నేను చెప్పేటంతటి వాడిని కాదుగాని, మాతోపాటు వచ్చేయ్... నిన్ను చూసి మా వాళ్ళందరూ సంతోషిస్తారు" అతని తటపటాయింపును గమనించి, తను స్వయంగా ఆహ్వానించాడు నిచ్చెన రెండోపక్కను మోస్తున్న యువ ఆటవికుడు.

"నాకు తెలిసినంతవరకూ ఈ కర్కోటకులు నాగరికులతో ఇంత సౌమ్యంగా మాట్లాడిన దృష్టాంతాలు లేవు. మొట్టమొదటిసారిగా నీ మూలకంగానే ఇది సాధ్యపడింది. ఒకసారి వెళ్ళి కొద్దిసేపు వాళ్ళతో గడిపి ఆ తర్వాత మనదారిన మనం వెళ్ళిపోదాము" అన్నాడు వాసుదేవుడు.

అతను అంత పట్టుదలగా చెప్పిన తర్వాత కూడా కాదనటం సరికాదని గ్రహించి, అంగీకారసూచకంగా తలవూపాడు శివుడు.

ముందు మందుల ముసలయ్య తర్వాత ఆటవికుడు పడుకొని వున్న నిచ్చెన, తర్వాత వాసుదేవుడు అతని వెనుక శివుడు అతన్ని అనుసరించి ఏనుగులు... ఆటవిక గూడెం మొత్తం గుండెలమీద చేతులు వేసుకుని చూసింది ఆ దృశ్యాన్ని.

❖ ❖ ❖

కొండచిలువల బారిన పడనే కూడదు. పడినవాళ్ళు తిరిగి ప్రాణాలతో బయటపడడం అంటూ జరుగనే జరగదు. అటువంటిది, కేవలం నాలుగు పక్కటెముకల్ని మాత్రమే విరగగొట్టుకుని, క్షేమంగా వుండగలిగిన తమ మనిషిని చూసి ఆటవిక గూడెమంతా అపరిమితమైన సంతోషానికి గురి అయింది.

"అంతా మకర దేవతల మహిమ. ఆ దేవతలే ఇటువంటి ప్రమాదం వస్తోందని ముందుగానే గమనించి, ఆ నాగరికుల్ని, ఆ ఏనుగుల్ని ఇవతలి ఒడ్డుకు రానిచ్చాయి. లేకపోతే ప్రాణాలతో ఎవరూ నదిని దాటి రాలేరు"

చీకటి పడుతున్న సమయంలో తమ గూడెం మధ్యభాగంలో వున్న రచ్చబండ దగ్గర నిలబడి తన అభిప్రాయాన్ని వెల్లడించాడు ఒక ఆటవికుడు.

అంతటితో ఆగలేదతను. "కృతజ్ఞతా సూచకంగా మనం రేపు ఉదయమే మళ్ళీ ఆ బలికూనని తీసుకుపోయి దేవతలకు ఆహారంగా ఇచ్చేయాలి" అనికూడా అన్నాడు.

రచ్చబండకు పది ధనువుల దూరంలో వున్న చిన్న గుడిశెలో బంధింపబడి వున్నది జ్వాల. ఆ మాటలు చెవుల పడేసరికి, దిగజారిపోయింది ఆమె ధైర్యం. ఆమెకు తెలియకుండానే నీటితో నిండిపోయాయి కళ్ళు.

ఆరు నూరయినా నూరు ఆరయినా సరే ఏదో ఒక విధంగా ఆ రాత్రికి రాత్రి అక్కడినించి తప్పించుకుపోవాలని చాలా గట్టిగా నిర్ణయం తీసుకున్నది ఆమె హృదయం.

మెత్తమెత్తగా మాట్లాడినట్లు పైకి కనిపించినా లోలోపల మాత్రం ఆ ఆటవికులు మహా కర్కోటకులని తెలుస్తూనే వున్నది ఆమెకు. అటువంటి మొండి బండ రాక్షసుల్ని అంతగా మైకంలో మునిగిపోయేటట్లు చేసిన నాగరికులు ఎవరో తెలుసుకోవాలని అనిపించింది. ఒట్టిగా తెలుసుకోవటం ఒక్కటే కాదు, ఏ మాత్రం వీలున్నా తను తప్పించుకోవటానికి వారి సహాయం అర్థించాలని కూడా అనుకున్నది.

అనుకోవటం వరకూ బాగానే సాగాయి ఆమె ఆలోచనలు. కార్యరూపంలోకి మటుకు రావడం చాలా కష్టమని వెంటనే తెలిసిపోయింది.

"నాగరికురాలైన బలికూన మనదగ్గర బంధించబడి వున్నదని తెలిస్తే మన అతిథులు ఏం మాట్లాడతారో, ఎలా ప్రవర్తిస్తారో చెప్పటం కష్టం. ఎట్టి పరిస్థితిలోను ఈ కూనని గురించి వాళ్ళకి తెలియకూడదు" జ్వాల బంధింపబడి వున్న గుడిశె దగ్గరికి వచ్చి అక్కడ కాపలాగా నిలబడిన ఇద్దరు ఆటవికులకు చెప్పాడు నాయకుడు.

గుడిశె ద్వారాన్ని మందపాటి చర్మపు పరదాతో కప్పివేశారు ఆ ఆటవికులు. గొంతెత్తి బిగ్గరిగా అరిచే వెసులుబాటు లేకుండా జ్వాల నోటిలో ఏవో అడవి ఆకుల్ని గట్టిగా కుక్కారు.

❖ ❖ ❖

ఆటవికులు విరుచుకు వచ్చిన చెట్లకొమ్మల మీది ఆకుల్ని, వాళ్ళు తీసుకువచ్చి తమముందు పెట్టిన పచ్చగడ్డి మోపుల్ని తనవితీరా ఆరగించి, గూడెం చివరి భాగంలో వున్న పెద్దనీటి గుంటలోని నీటిని తాగి హాయిగా నిలబడ్డాయి పెద్ద ఏనుగులు రెండూ.

అవి నిలబడిన ప్రదేశానికి నాలుగు ధనువుల దూరంలోనే వున్నది శివుడికి, వాసుదేవుడికి కేటాయించబడిన పెద్ద గుడిశె. ఆ గుడిశె ముందుభాగంలోని మట్టి అరుగుమీద కూర్చుని వున్న శివుడు వాటికి చాలా స్పష్టంగానే కనిపిస్తున్నాడు.

అతని కదలికల్లోగాని, వదనంలో గాని ఎటువంటి ఆందోళనా కనిపించక పోవడంతో, అవికూడా ప్రశాంతంగానే వుండిపోయాయి. గున్న మాత్రం వాటిలాగా కుదురుగా నిలబడలేకపోయింది. తొండాన్ని గాలిలోకి ఎత్తి చుట్టుపట్ల మీంచి వచ్చే వాసనల్ని పీలుస్తూ నెమ్మది నెమ్మదిగా గూడెం మధ్యభాగంలోకి వెళ్ళింది.

రచ్చబండను దాటి నాలుగు అడుగులు అవతలికి వేసిన వెంటనే దానికి తెలిసివచ్చింది ఒక విచిత్రమైన వాసన.

తనను చూసి దూరంగా తప్పుకుంటున్న ఆటవికుల వాసన కాదు అది. తాము వెంటపడి వచ్చిన శివుడి శరీరం మీదినించి కొత్తగా అతనికి తోడైన మధ్యవయస్కుడి దగ్గిర్నించీ వచ్చేటటువంటిది అది.

మరో నాలుగు అడుగులు వేసేసరికి మరింత గట్టిగా తెలిసిపోయింది దానికి... వేగంగా అడుగులు వేస్తూ ఒక చిన్న గుడిశె దగ్గరికి పోయింది.

పొడవాటి బరిశెల్ని గట్టిగా పట్టుకుని ఆ గుడిశె దగ్గర నిలబడి వున్న ఇద్దరు ఆటవికులు కోపంగా చూశారు దానివంక.

“పో... అవతలికిపో...” హెచ్చరించాడు ఒకతను.

అది ఆ మాటల్ని లక్ష్యపెట్టకుండా గుడిశె ద్వారానికి అడ్డంగా కట్టిన చర్మపు తెరను తొండంతో పక్కకు తొలగించబోయేసరికి తన బరిశెతో బలంగా ఒక దెబ్బ వేశాడు రెండో ఆటవికుడు.

బాధను భరించడం అసాధ్యమై, పెద్దగా గీ పెట్టింది గున్న. ఆ శబ్దం దాని నోటినుంచి వెలువడిన మరుక్షణం వేగంగా కదిలాయి పెద్ద ఏనుగులు.

"ఆపేయ్ శివుడూ... వాటిని ఆపేయ్... ఆ పిల్ల ఏనుగు ఏదో పాడుపనిచేసినట్టుంది..." శివుడికి నాలుగు అడుగుల దూరంగా కూర్చుని వున్న వాసుదేవుడు వెంటనే హెచ్చరించాడు.

అతను తనకు ఇచ్చిన చురకత్తిని దట్టీలోనే భద్రపరచుకుని వున్నాడు శివుడు. దాన్ని బయటికి లాగుతూ వేగంగా పరిగెత్తాడు ఏనుగుల వెనుక.

భూమి అదిరిపోయేలా అడుగులు వేస్తూ వస్తున్న పెద్ద ఏనుగుల్ని చూసి బిత్తరపోయారు గున్నని అదిలించిన ఆటవికులు.

"నాయనా... ప్రమాదం... ప్రమాదం" అని బిగ్గరిగా అరిచారు.

అతిథులిద్దరికీ పసందయిన ఆహారం అందించే ఏర్పాట్లను స్వయంగా దగ్గర వుండి పరివేక్షించి, అప్పుడే రచ్చబండ దగ్గరికి రాబోతున్నాడు నాయకుడు.

"ఆపండి... వెంటనే ఆ జీవాల్ని నిలవేయండి" అని తనుకూడా బిగ్గరిగా అరిచాడు.

కత్తులు తీసుకున్నారు కొందరు ఆటవికులు. బాణాల్ని పట్టుకున్నారు మరికొందరు. బరిశెలతో ముందుకు పరిగెత్తుకువచ్చారు ఇంకా కొందరు.

వాళ్ళల్లో ఏ ఒక్కడు పెద్ద ఏనుగుల దగ్గరికి పోయినా వాటిమీదికి తమ ఆయుధాల్ని విసిరినా జరిగేది ఏమిటో తెలుసు కాబట్టి, మరింత వేగంగా కదిలి, అందరికంటే ముందుగా వాటిని సమీపించాడు శివుడు. "ఆగండి... ఆగిపోండి... ఆగండి" అని హెచ్చరిస్తూ బలంగా వెనక్కి నెట్టాడు వాటి తొండాలమీద చేతులు వేసి.

తమ బిడ్డకు బాధను కలిగించిన కారణాన్ని తెలుసుకోవాలని మహా ఆత్రుతతో బయలుదేరిన ఆ మూగజీవాలు రెండూ- శివుడి మాటలు చెవిన పడగానే చటుక్కున ఆగిపోయాయి.

"మా పెద్దోడు చెపుతుంటే ఏమో అనుకున్నాను గాని, ఈ జీ భూతాలని ఒక్కమాటతో నిలబెట్టగలిగావంటే నువ్వు నిజంగా చిచ్చరపిడుగువే" తనవారిని కూడా ఆగమని సైగ చేసి ముందుకు వస్తూ శివుడిని మెచ్చుకున్నాడు నాయకుడు.

ఆ మాటల్ని శివుడు వినిపించుకోలేదు. గుడిశె ద్వారం దగ్గరే నిలబడి వున్నది గున్న. గుండ్రటి కళ్ళని ఇంకా గుండ్రంగా తిప్పుతూ కోరగా చూస్తోంది అక్కడ కాపలా వున్న ఇద్దరివంకా.

"ఏం చేశావు నువ్వు? చెవులు చిల్లులు పడేటట్లు గీపెట్టాల్సిన అవసరం ఏమొచ్చింది?" దాని తలను నిమురుతూ ఆదరంగా అడిగాడు శివుడు.

"వెనక్కి పొమ్మన్నాం. వినిపించుకోలేదు. గుడిశె లోపలికి పోయే ప్రయత్నం చేసింది. బరిశెతో ఒక చిన్నదెబ్బ వేశాము" తమని అడగకపోయినా గున్న అరుపుకు కారణాన్ని వివరించాడు కాపలా ఆటవికుల్లో ఒకతను.

"చిన్నపిల్ల. గుడిశె లోపల తినటానికి ఏదైనా తియ్యటి పదార్థం వుండి వుంటుందని అనుకుని వుంటుంది. లోపలికి తొంగిచూడనిచ్చివుంటే తనంతట తనే తెలుసుకుని వెనక్కి వెళ్లిపోయేది. ఇంత మాత్రం దానికి బరిశెతో కొట్టాలా?" చిరుకోపంతో అడిగాడు శివుడు.

"లోపల బలికూన కూర్చుని వుంది. ఎవరినీ లోపలికి పోనీయవద్దని మా నాయకుడి మాట... అందుకే కొట్టాము" అంటూ చటుక్కున నాలుక కరుచుకున్నాడు ఆ ఆటవికుడు.

అప్పటికే ఆ మాటలు శివుడి చెవులకు చేరటం, అతనిలో కుతూహలాన్ని రేకెత్తించటం జరిగిపోయింది.

"బలికూనా? అంటే ఎవరు?" ఆశ్చర్యంగా అడుగుతూ, వాళ్ళు తనను అడ్డుకునేలోపుగానే చర్మపు తెరమీద చెయ్యివేసి పక్కకు లాగబోయాడు.

పరిగెత్తుతున్నంత వేగంగా వచ్చి అతనికి అడ్డంగా నిలుచున్నాడు నాయకుడు. "ఇది మా గూడెపు ఆచారం. పరాయి వాళ్లెవరూ పట్టించుకో కూడనటువంటిది. నువ్వు లోపలికి పోరాదు..." అంటూ అడ్డుకున్నాడు.

తన వెనుక నిలబడి వున్న పెద్ద ఏనుగులు అసహనంగా కదలటం శివుడికి కనిపించింది. తను గట్టిగా మాట్లాడినా, విసుగ్గా తల విదిలించినా వాటికి కోపం వచ్చేస్తుందని తెలుసు కనుక ఎదురు మాట్లాడకుండా వెనక్కి తిరిగాడు.

"పద పద...మన విడిదికి మనం వెళ్ళిపోదాం" అని గున్నకి చెపుతూ దాని తొండాన్ని గట్టిగా పట్టుకుని తనతోపాటు నడిపించాడు.

అతను ప్రశాంతంగా వెనుతిరగటంతో తాముకూడా శాంతంగానే కదిలాయి పెద్ద ఏనుగులు. అతనితోపాటు విడిది దగ్గరికి వచ్చేశాయి.

తమ మాటలు అతనికి వినబడవని నిశ్చయం అయిన తర్వాత గుడిశె దగ్గర కాపలా ఆటవికులిద్దరిమీదా విరుచుకుపడ్డాడు నాయకుడు.

"బుద్ధి జ్ఞానం లేని చచ్చుదద్దమ్మలు మీరు. నేను కల్పించుకోవటం ఒక్క రెప్పపాటు కాలం ఆలస్యం అయివుంటే బలికూన రహస్యం బట్టబయలు అయిపోయి వుండేది" అని కసురుకున్నాడు.

"బట్టబయలు అయితే మాత్రం ఏమౌతుంది నాయకా? ఆ బుడతడు మనల్ని చేయగలిగింది ఏముంది? బరిశెతో ఒక్కపోటు పొడిస్తే గుటుక్కుమని కళ్ళు తేలవేసి వుండేవాడు" సగర్వంగా అన్నాడు కాపలా వారిలో రెండో ఆటవికుడు.

"అలాగా... అంత పోటుగాడివా? ఆ బుడతడిని పొడిచిన తర్వాత ఆ జీ భూతాలు వచ్చిపడితే ఏం చేసేవాడివో అదికూడా చెప్పు" వెక్కిరింపుగా అన్నాడు నాయకుడు.

లోపల వున్న జ్వాలకి వినబడుతూనే వున్నాయి ఆ మాటలు. గుడిశె దగ్గరికి వచ్చిన బుడతడు ఎవరో ఆమెకు తెలియలేదు. అతనితో పాటుగా అతి పెద్ద ఏనుగులు రెండు అక్కడికి వచ్చినట్లు కూడా ఆమెకు అర్థం అయింది. ఏదో ఒక విధంగా తను తన ఉనికి బట్టబయటు అయ్యేటట్లు చేయగలిగితే బతికి బయటపడవచ్చని కూడా తెలిసిపోయింది.

కదలటానికి వీలులేకుండా కరచరణాలు బంధింపబడి వుండటం, అరవటానికి వీలుపడకుండా నోటిలో అడవి ఆకులు కుక్కి వుండటం ఆమె కోరికకు అవరోధాలుగా నిలబడ్డాయి.

❖ ❖ ❖

అర్థరాత్రి సమయంలో అనుకోకుండా మెలకువ వచ్చింది వాసుదేవుడికి. అందుకు కారణాన్ని అన్వేషిస్తూ పక్కకు చూశాడతను.

అడవికఱ్ఱలతో తయారుచేయబడిన రెండు మంచాలను తెచ్చి వారి విడిది ముందు వేసి, మెత్తటి చర్మాలతో పక్కలను తయారుచేశారు నాయకుడు పంపించిన ఆటవికులు.

"నిర్భయంగా నిద్రపొండి... గూడెం చుట్టూ కాపలా చాలా గట్టిగా వుంటుంది. అడవి జంతువులు ఏవీ లోపలికి రాలేవు" అనిచెప్పి వెళ్ళిపోయారు.

పడకమీద మేను వాల్చిన మరుక్షణం గాఢమైన నిద్రలోకి జారిపోయిన శివుడు ఇప్పుడు లేడు అక్కడ.

ఒక్కక్షణం పాటు తీవ్రమైన ఆందోళనకు గురై, అంతలోనే తనకు తను ధైర్యం చెప్పుకున్నాడు వాసుదేవుడు.

అతని ఏనుగులు రెండూ ఆ చుట్టుపట్ల వుండగా శివుడికి ఎటువంటి ప్రమాదమూ ఎదురుపడదు. అతనే తనంతట తను మంచం దిగి ఎక్కడికో వెళ్ళి వుండాలి.

తన మంచం క్రింద చేతికి అందే విధంగా పెట్టివుంచిన ఖడ్గాన్ని తీసుకుని తనుకూడా మంచంమీదినించి దిగాడు వాసుదేవుడు. శబ్దం కాకుండా అడుగులు వేస్తూ, తమ విడిది పక్క భాగంలోకి పోయాడు.

పది ధనువుల దూరంలో కనిపించాయి అతనికి పెద్ద ఏనుగులు. వాటికి దగ్గరగా నేలమీద పడుకొని వుంది గున్న. దాని నడుముమీద తల పెట్టుకుని తనుకూడా పడుకుని వున్నాడు శివుడు.

అతను ఏదో ప్రమాదానికి గురై వుంటాడని తను అనుకోవటాన్ని గుర్తుకు తెచ్చుకుని తనలో తను నవ్వుకున్నాడు వాసుదేవుడు. ఎంత నిశ్శబ్దంగా అటు వచ్చాడో అంతే నిశ్శబ్దంగా వెనుతిరగబోతుండగా, అతని కర్ణేంద్రియాలకు సోకింది శివుడి కంఠం.

నిద్రపోవటం లేదతను. కదలిక లేకుండా నిలబడి వున్న పెద్ద ఏనుగులతో మాట్లాడుతున్నాడు.

తన చేతుల్లో వున్న కత్తిని నెమ్మదిగా నేలమీదికి వదిలేశాడు వాసుదేవుడు. మోచేతుల మీద పాము మాదిరి పాకుతూ కొద్దిదూరం ముందుకు పోయి ఒక బండరాయి కనిపించేసరికి దాని చాటున ఆగాడు.

అంతకుముందు అస్పష్టంగా వినవచ్చిన శివుడి కంఠం ఇప్పుడు స్పష్టంగా అతని చెవులకు చేరింది.

"ఆ గుడిశెలో ఎవరో బంధింపబడి వున్నారు. నాయకుడి మాటల్ని బట్టి చూస్తుంటే ఆ బంధితులు ఎవరో గాని ఖచ్చితంగా నాగరికులే అయివుంటారు" అంటున్నాడు శివుడు.

ఊపిరి బిగపట్టాడు వాసుదేవుడు. చెవులను మరింతగా రిక్కించాడు.

"ఇంకో ఘడియ కాలం ఆగితే గూడెంలోని వాళ్ళందరూ గాఢనిద్రలు పోతారు. అప్పుడు మనం రహస్యంగా అక్కడికి పోయి ఆ గుడిశె రహస్యాన్ని తెలుసుకుంటే బాగుంటుందని నాకు అనిపిస్తోంది. మీరు ఏమంటారు?"

ఝల్లుమన్నది వాసుదేవుడి శరీరం ఆ మాటల్ని వినేసరికి. నరరూప రాక్షసుల వంటి ఆ ఆటవికుల గూడెంలోకి వచ్చి ఇంకా తామిద్దరూ ప్రాణాలతో వుండటమే ఒక అద్భుతం. వారి కట్టుబాట్లకు విరుద్ధమయిన పనిచేసిన తర్వాత ఇంకా బతికి వుండటం అంటే అది పరమార్థమే. చిన్నతనపు అజ్ఞానంతో చేయకూడని పని చేయటానికి సిద్ధపడుతున్నాడు శివుడు. వద్దని వారించడం తన కర్తవ్యం.

బండరాయి చాటునుంచి లేచి నిలబడబోయాడు వాసుదేవుడు. సరిగ్గా అదే సమయంలో చెలరేగింది ఆ కలకలం. చెవులు చిల్లులు పడిపోయేటట్లు ఊదబడసాగాయి కొమ్ము బూరాలు.

"శత్రువులు... శత్రువులు వచ్చేశారు... తోడేలు గూడెం వాళ్ళు గుంపులు గుంపులుగా వచ్చి పడుతున్నారు..." బిగ్గరిగా అరుస్తూ వాసుదేవుడు దాగుకుని వున్న బండరాయికి పది అడుగుల దూరంలో నించి రచ్చబండ దగ్గరికి పరిగెత్తాడు ఒక ఆటవికుడు.

గున్న నడుము మీద తలపెట్టి పడుకుని, పెద్ద ఏనుగులతో మాట్లాడుతున్న శివుడు అదిరిపడి లేచాడు.

అంతవరకూ ఎంతో ప్రశాంతంగా అతని మాటలు వింటూ నిలబడి వున్న ఏనుగులు కాస్తా తొండాలను గాలిలోకి ఎత్తి భీకరంగా ఘీంకారాలు మొదలుపెట్టాయి.

వాసుదేవుడు చూస్తూ వుండగానే నల్లటి చర్మపు దుస్తుల్ని ధరించిన మరో ఆటవికుల గుంపు ఆ గూడెంలోకి ప్రవేశించింది. ఎదురుపడిన గూడెపు వాసులందర్ని తమ బరిశెలతో పొడిచి ప్రాణాలు తీస్తూ రచ్చబండ కేసి కదలటం మొదలుపెట్టింది.

"ఏనుగుల్ని అదుపులో పెట్టుకో శివుడు. వాటిని యుద్ధంలోకి పోనీయకు" అని శివుడిని హెచ్చరిస్తూ బండచాటునించి లేచాడు వాసుదేవుడు.

నాగరికులు ఎవరో తను బంధించబడి వున్న గుడిశె దగ్గరికి వచ్చి నాయకుడి పట్టుదల కారణంగా వెనక్కి వెళ్ళిపోయినట్లు అర్థం అయిన క్షణం నుంచీ ప్రయత్నిస్తూనే వున్నది జ్వాల తన బంధనాల నుంచి బయటపడటానికి.

అర్ధరాత్రి గడిచిపోతున్న సమయానికి కూడా చేతకాలేదామెకు ఆ పని చేయటం.

అతిగా కదిలించటం వల్ల రాపిడి ఎక్కువై ఒరుసుకుపోయాయి ఆమె మణికట్లు. చీలమండల దగ్గర గాయాలు ప్రత్యక్షమై విపరీతమైన బాధ ఆమెను వివశురాలిని చేయటం మొదలుపెట్టింది.

దట్టంగా నోటిలో కుక్కబడిన అడవి ఆకుల్ని బయటికి నెట్టే ప్రయత్నం కూడా చేసింది గాని, సాధ్యపడకుండా పోయింది.

ప్రాణాలు వుండగా తాను తప్పించుకుపోవటం అసాధ్యమని గట్టిగా తెలిసివచ్చి, విపరీతమైన నిస్పృహతో కన్నీళ్ళు పెట్టుకోబోతుండగా ఆమెకు వినబడింది గూడెంలో చెలరేగిన గందరగోళం.

“వచ్చేశారు.. తోడేలుగూడెం వాళ్ళు మన మీద దాడికి వచ్చేశారు. అందుకోండి ఆయుధాల్ని. సిద్ధం కండి అందరూ యుద్ధానికి...” రచ్చబండ దగ్గిర్నించి అతి బిగ్గరిగా అరిచాడు ఎవరో ఆటవికుడు.

తోడేలు గూడెం వాళ్ళు ఎవరో, భూతపిశాచాల వంటి ఈ ఆటవికుల మీదికి యుద్ధానికి రావడం ఏమిటో జ్వాలకి తెలియదు. తెలిసిందల్లా ఒకటే...

అల్లకల్లోలమై పోతోంది గూడెం. అరుపులు, కేకలు, ఆర్తనాదాలతో కంపించిపోతోంది... తప్పించుకోవాలన్న కోరిక తనలో ఇంకా మిగిలివుంటే ఆ పని చేయటానికి సరైన సమయం ఇదే.

దృఢంగా బంధించబడి వున్న తన కరచరణాలను వదిలించుకునే ప్రయత్నాన్ని వదిలి పెట్టేసిందామె. నునుపైన కొండరాయి దొర్లినట్లు దొర్లుకుంటూ గుడిశె ద్వారం దగ్గరికి పోయింది.

అక్కడ కాపలా వున్న ఆటవికులు తనను మళ్ళీ వెనక్కి నెట్టవచ్చునని తెలుసు ఆమెకు. అయినా సరే ఆగలేదు... ద్వారానికి అడ్డంగా వున్న మందపాటి చర్మపు తెర క్రిందినించి దొర్లి బయటికి వచ్చేసింది.

ద్వారం దగ్గరే వున్నారు గాని, ఆమెను గమనించే పరిస్థితిలో లేరు అక్కడ కాపలాగా నియమించబడిన ఆటవికులు ఇద్దరూ. బరిశెల్ని గాలిలో ఊపుతూ ఎవరితోనో యుద్ధం చేస్తున్నారు.

అక్కడే ఆగిపోయి ఆ యుద్ధాన్ని వీక్షించాలన్న కోరిక జ్వాలకి లేదు. గుడిశెలో నుంచి బయటపడిన వెంటనే మరింత వేగంగా దొర్లి, గుడిశె వెనుక భాగంలో వున్న పొదలకేసి వెళ్ళింది.

ఒక పొదను అధిగమించింది. రెండవ పొదను కూడా దాటబోతుండగా వున్నట్లుండి ఆమె దారికి అడ్డంగా వచ్చాడు నలుపురంగు తోలుదుస్తులు ధరించి వున్న ఆటవికుడు ఒకతను. వికటంగా నవ్వుతూ తన చేతుల్లోని బరిశెను పైకెత్తి ఆమె గుండెలమీద పొడవబోయాడు.

❖ ❖ ❖

అరుపులు కేకలు ఆయుధాల చప్పుళ్ళతో బీభత్సంగా తయారైపోయింది ఆటవిక గూడెం.

పెద్ద ఏనుగుల్ని యుద్ధంలోకి ప్రవేశించనీయవద్దని శివుడికి చెప్పి బండరాయి చాటునుంచి లేచిన వాసుదేవుడిని గమనించారు అటుగా వస్తున్న తోడేలు గూడెం యోధులు కొంతమంది.

తోడేళ్ళు ఎలా అరుస్తాయో అచ్చం అలాగే అరుస్తూ అతనిమీదికి లంఘించారు.

బరువైన తన ఖడ్గాన్ని గిర్రున రెండు తిప్పులు తిప్పాడు వాసుదేవుడు. తాటిపళ్ళు పడినట్లు ఎగిరి అవతల పడ్డాయి రెండు తలకాయలు.

తమను చూసి భయంతో వణికిపోవటానికి బదులు మంచినీళ్ళు తాగినంత తేలికగా తమను ఎదిరించిన ఆ నాగరికుడిని చూసేసరికి మతులు పోయాయి ఆ ఆటవికులకు.

"పిలవండి... మన వాళ్ళందర్ని పిలవండి... ఈ నాగరికుడు ఎవరో గాని, పెద్ద పోటుగాడి మాదిరిగా వున్నాడు... పిలవండి" అని కేకలు పెడుతూ దూరంగా పరిగెత్తారు అందరూ.

"నువ్వు జాగ్రత్తగా వుండాలి శివుడు... పొలమారకూడదు..." శివుడిని మరోసారి హెచ్చరించి ముందుకు పరిగెత్తాడు వాసుదేవుడు.

ఆయుధాలు పట్టుకోవడం చేతకాని తను అతని మాదిరిగా యుద్ధంలోకి వెళ్ళే ప్రసక్తి లేదని తెలిసినా, ఎందుకనో కుదురుగా నిలబడి వుండలేకపోయాడు శివుడు.

అతనే కాదు... ఎంత ఆపినా ఆగకుండా అసహనంగా కదలటం మొదలు పెట్టాయి ఏనుగులు. గాలిలో వ్యాపిస్తున్న రక్తపు వాసన వాటిని ఒక విధమైన ఉద్రేకానికి గురి చేస్తోంది.

పెద్ద ఏనుగులే కాదు... ఆఖరికి గున్న కూడా తొండాన్ని గాలిలోకి ఎత్తి చిన్నగా ఘీంకారాలు మొదలుపెట్టింది.

వాసుదేవుడి మీదికి ఎగబడిన ఆటవికుల వంటివాళ్ళు, తనను గమనించి తనమీదికి కూడా లంఘిస్తే అవి పూర్తిగా రెచ్చిపోతాయని అవగతమైంది అతనికి.

"మనం ఇక్కడేవుంటే ఏదో ఒక గోలలో తప్పకుండా చిక్కుపడతాము... దూరంగా వెళ్ళి పొదల చాటున నిలబడితే కొంతలో కొంత ఉపశాంతి... పదండి పోదాం" అంటూ ఒక చేత్తో గున్న తొండాన్ని రెండవ చేత్తో మగ ఏనుగు దంతాన్ని పట్టుకుని వెనక్కి బయలుదేరాడు.

క్షణక్షణానికి అధికం అయిపోతున్న గూడెంలోని రణగొణ ధ్వనుల్ని ఆలకిస్తూ దట్టంగా వున్న పొదల దగ్గరికి పోయిన వెంటనే కనిపించింది అతనికి ఆ దృశ్యం.

కాళ్ళుచేతులు బంధింపబడి వున్న ఒక యువతి గుండెల్లో పొడవటానికి బరిశెను పైకి ఎత్తుతున్నాడు ఒక ఆటవికుడు.

ఆ గూడేనికి చెందినవాడిలా కనిపించడం లేదతను. బహుశా చీకటి మాటున దాడి చేయటానికి వచ్చిన తోడేలు గూడేనికి చెందినవాడై వుంటాడు.

తన గుండెలకు గురిపెట్టబడిన బరిశెను చూసి భయంతో వణికిపోతూ బిగ్గరిగా కేకలు పెట్టాలి కింద వున్న యువతి. కాని అలా చేయటం లేదామె. తన ప్రాణాలమీద ఆశను వదిలేసుకున్నట్టు నిర్భయంగా అతని మొఖంలోకి చూస్తోంది.

ఆ దృశ్యాన్ని చూసిన వెంటనే శివుడికి అవగతమైన అంశాలు అవి.

అవగతమైన వెంటనే తనకు వాసుదేవుడు ఇచ్చిన చురకత్తిని వేగంగా బయటికి తీశాడు అతను. దాన్ని ఉపయోగించటం ఎలాగో తెలియకపోయినా తడుముకోకుండా ముందుకు విసిరాడు.

కిందికి దిగుతున్నది ఆటవికుడు గాలిలోకి ఎత్తిన బరిశె... కింద వున్న జ్వాల గుండెలకు దగ్గరిగా పోబోతున్న సమయంలో గింగిరాలు తిరుగుతూ వెళ్లి అతని కుడిభుజంలో దిగబడింది చురకత్తి.

బాధతో చెవులు చిల్లులు పడేటట్లు తనకు తెలియకుండానే గావురుమని అరిచాడు ఆ ఆటవికుడు.

ఒకసారి మాత్రమే అరిచాడు. రెండవసారి అరిచే అవకాశం అతనికి లభించలేదు. శివుడు అతన్ని ఎదిరించటాన్ని చూసిన వెంటనే, తనంతట తానే కదిలి నాలుగు అంగల్లో అతన్ని సమీపించింది మగ ఏనుగు. తొండాన్ని జాచి అతని నడుమును చుట్టింది. అమాంతంగా గాలిలోకి ఎత్తి దభేలున నేలకేసి కొట్టింది.

బిగ్గరిగా అరవటానికి తెరిచిన నోరు తెరిచినట్టు వుండగానే ప్రాణాలు పోగొట్టుకున్నాడు ఆ ఆటవికుడు. నడుములు విరిగిపోయిన ఆటబొమ్మ మాదిరి అడ్డదిడ్డంగా వుండిపోయాడు.

అదే వేగంతో కింద వున్న యువతిని కూడా తొండంతో పైకెత్తి నేలకేసి బాది వుండేది మగ ఏనుగు. “ఆగు... ఆగిపో... ఆగిపో” అని అరుస్తూ శివుడు తనకు అడ్డుపడటంతో, తన ఆగ్రహాన్ని అదుపు చేసుకున్నది.

ఆటవికుడి భుజంలో దిగబడిన తన చురకత్తిని బయటికి లాగి, కదలిక లేకుండా పడివున్న యువతి కరచరణాలను బంధవిముక్తం చేశాడు శివుడు.

“నువ్వు ఎవరివో నాకు తెలియదు... వాళ్ళ దగ్గర బంధింపబడి వుండటం ఎలా సంభవించింది?” చేయిపట్టుకుని నెమ్మదిగా పైకి లేపుతూ అడిగాడు.

అడిగిన వెంటనే సమాధానం ఇవ్వలేదామె. లేచి నిలబడగానే, తననోటిలో దట్టంగా కూరబడి వున్న అడవి ఆకుల్ని ఒకటొకటిగా బయటికి లాగేసుకున్నది.

“నీళ్ళు... కాసిని నీళ్ళు కావాలి. నా గొంతు ఎండుకుపోయింది. మాట్లాడటం బహుకష్టంగా వుంది” అస్పష్టంగా అతనికి చెప్పింది.

ఆమెను కాపాడటానికి కదిలినంత వేగంగా ఆమె కోరిన నీళ్ళను తీసుకు రావటం కోసం కదలలేకపోయాడు శివుడు.

కారణం ఇంకా ఇంకా తీవ్రతరం అయిపోయింది గూడెంలోని గందర గోళం. వట్టిగా యుద్ధం చేయటం వల్ల ఉపయోగం పెద్దగా వుండదని

అనుకున్నారు కాబోలు.. గుడిశెలకు నిప్పు ముట్టించడం మొదలుపెట్టారు తోడేలు గూడెం యోధులు.

ఫెటఫెటార్భాటాలు చేస్తూ ఆకలిగొన్న పాముల మాదిరి ఆకాశంలోకి లేవటం మొదలుపెట్టాయి గుడిశెల మీది అగ్నిజ్వాలలు. గుడిశెల్ని కాకుండా చుట్టుపక్కల వున్న చెట్లను పుట్టల్ని కూడా అవి దహించటం ఆరంభం అయింది.

"ఈ మంటలు ఇక్కడితో ఆగకుండా మొత్తం అడవినంతా అలుముకుంటే?" తన కళ్ళను తనే నమ్మలేకపోతున్నట్టు చూస్తూ ఏనుగుల్ని అడిగాడు శివుడు.

అడవిని మంటలు అలుముకుంటే ఆ తర్వాత ఏం జరుగుతుందో తమకు బాగా తెలిసినట్లు ఆందోళనగా ఘీంకరించాయి ఏనుగులు.

"పదండి... మనం వెంటనే నీటిగుంట దగ్గరికి పోవాలి... మంటల్ని ఆర్పటానికి మనకు చేతనయిన పని ఏదో మనం వెంటనే చేయాలి" అంటూ బొమ్మ మాదిరి నిలువబడి వున్న యువతిని ఆడ ఏనుగు దగ్గరికి నెట్టాడు శివుడు. తాను మగ ఏనుగు దంతాల మీద పాదాలు మోపి, కుంభస్తలం మీదికి ఎగబ్రాకాడు.

అతను ఆ యువతిని తన దగ్గరికి ఎందుకు నెట్టాడో అర్థం అయినట్టు వెంటనే తన తొండంతో ఆమె నడుమును చుట్టి, తన తల వెనుక కూర్చోబెట్టుకున్నది ఆడ ఏనుగు.

"పదండి... గుంట దగ్గరికి పదండి" అంటూ అరిచాడు శివుడు.

పద ధ్వనులతో భూమిని కంపింపచేస్తూ పరిగెత్తాయి ఏనుగులు. పది క్షణికాల తరువాత అంతకుముందు తాము నీటిని తాగిన గుంట దగ్గరికి పోయి నిలుచున్నాయి.

తల్లి వెనుకే వచ్చిన గున్నని ఆ గుంటలోకి దిగమని సైగ చేశాడు శివుడు. "నువ్వు నీళ్ళల్లోనే నిలబడి వుండాలి. ఎట్టి పరిస్థితిలోను బయటికి రాకూడదు. ఈ మంటల వేడిని నువ్వు భరించలేవు" అంటూ తను కిందికి దూకి ఆ యువతిని కూడా కిందికి లాగాడు.

"నీ దాహం తీర్చుకో... నువ్వు కూడా మా గున్నతో పాటు ఇక్కడే ఆగిపో" అని చెపుతూ పెద్ద ఏనుగుల కేసి చేయి వూపాడు.

గబగబా నీటిలోకి దిగి తొండాలతో నీటిని తమ శరీరాల మీదికి జల్లుకున్నాయి అవి. అతని మీద కూడా దట్టంగా జల్లాయి.

❖ ❖ ❖

తోడేళ్ళ గుంపుల మాదిరిగానే గూడెమంతా కలియతిరుగున్న తోడేళ్ళ గూడెం ఆటవికుల్ని దొరికిన వాళ్ళని దొరికినట్లే తన ఖడ్గానికి బలి చేస్తూ రచ్చబండ దగ్గరికి పోయాడు వాసుదేవుడు.

పోయిన వెంటనే కనిపించాడు అతనికి ఆ గూడెం నాయకుడు. తనను చుట్టిముట్టిన పదిమంది శత్రువులతో ఘోరయుద్ధం చేస్తున్నాడు.

నాలుగు అంగల్లో అతన్ని చేరుకుని, తనుకూడా తన ఖడ్గానికి పని కల్పించాడు వాసుదేవుడు.

రెండే రెండు క్షణాల్లో అంతం అయిపోయిందా పోరాటం... నాయకుడిని హతమార్చటానికి చుట్టుముట్టిన శత్రువులు అందరూ విగతజీవులై నేలకు ఒరిగిపోయారు.

“నీకు నేను కూడా రుణపడిపోయాను స్నేహితుడా... నువ్వు చేసిన సాయం సామాన్యమైంది కాదు” అని వాసుదేవుడిని మెచ్చుకుంటూ ఇంకో పక్కకు పరిగెత్తబోయాడు నాయకుడు.

సరిగ్గా అదే సమయంలో ఛటఛటమని శబ్దాలు చేస్తూ మంటల బారిన పడసాగాయి గూడెంలోని గుడిశెలు.

“గాలి తీవ్రంగా వుండే కాలం ఇది... వెంటనే అదుపు చేయకపోతే ఈ అడవి అంతా మంటలబారిన పడుతుంది. తినటానికి తిండి లభించక మేమందరం మకర దేవతలకు ఆహారం అయిపోవాలి...” తీవ్రమైన ఆందోళనతో, కంఠం గద్గదమౌతుండగా అన్నాడు నాయకుడు.

“నీ శత్రువుల సంగతి నేను చూసుకుంటాను... నువ్వు నీ వాళ్లందర్నీ కూడగట్టుకుని మంటల్ని అదుపు చేసుకో...” అంటూ దూరంలో కనిపించిన ఇంకో శత్రువుల గుంపు దగ్గరికి పరిగెత్తాడు వాసుదేవుడు.

“రండిరోయ్... ఆడంగులు అందరూ రండి... మీ కూనల్ని కూడా వెంటబెట్టుకు రండి” అని తన గూడెంలోని ఆడవారిని అందర్నీ పిల్లలతో సహా రమ్మని అరిచాడు నాయకుడు.

"కుండల్ని తీసుకోండి... దొప్పల్ని అందుకోండి... నీళ్లు నింపటానికి పనికివచ్చేది ఏదైనా సరే పట్టుకురండి" అని ఆజ్ఞలు జారీ చేస్తూ నీటిగుంట దగ్గరికి దారి తీశాడు.

అవసరం అయితే ఇంకోసారి తమ శరీరాల మీద నీళ్ళను జల్లుకుని మంటల మూలకంగా వెలువడుతున్న వేడిమిని తట్టుకోవడం కోసం, ఆ గుంట దగ్గిరే నిలువబడి వున్నాడు శివుడు.

ఆడవారితో కలిసి గూడెం నాయకుడు అటుగా రావటాన్ని చూడగానే, ఎందుకు అలా వస్తున్నాడో తెలిసిపోయింది అతనికి.

"తాగండి... తొండాల నిండుగా నీటిని తీసుకోండి" అని ఏనుగులకు సైగ చేసి తను స్వయంగా నీటిని పుక్కిట బట్టి వాటికి చూపించాడు.

పెద్దగా ఘీంకారాలు చేసి, అతను చూపించిన విధంగానే తొండాల నిండుగా నీటిని గ్రహించాయి ఏనుగులు.

"నువ్వు మాత్రం కదలకు. మా గున్నతో పాటు ఇక్కడే వుండు" అని యువతికి చెప్పాడు శివుడు.

అతని వంకా, ఏనుగుల వంకా ఆశ్చర్యంగా చూస్తున్నది ఆమె. అతను మాట్లాడుతున్న ప్రతి మాట వాటికి అతి తేలికగా అర్థం అవుతున్న సంగతిని ఆమె గమనించటమే అందుకు కారణం.

"నా గొంతు బాగయింది. నేను కూడా సహాయం చేస్తానని" అంటూ తాను కూడా బయలుదేరింది ఆతనితోపాటు.

ఆమె కదిలిన మరుక్షణం, తన తల్లిదండ్రుల మాదిరి తానుకూడా నీటిని తొండంతో గ్రహించి, గుంటలో నుంచి బయటికి వచ్చింది గున్న. గూడెం ఆడంగులందరినీ, పిల్లా పాపలతో సహా వెంటబెట్టుకుని నాయకుడు గుంట దగ్గరికి వచ్చేసమయానికి వారందరూ గుడిశెల సమీపంలోకి వెళ్లిపోయారు.

గుడిశెల దగ్గర కనిపించిన పెద్ద చెట్టుకొమ్మ నొకదాన్ని పట్టుకుని భగభగలాడుతున్న ఒక గుడిశె పైకప్పును బలంగా బాది క్రింద పడిపోయేటట్లు చేశాడు శివుడు.

తమ తొండాల నిండుగా తెచ్చిన నీటిని వెదురు గొట్టాల్లో నుంచి విరజిమ్మినట్లు వేగంగా ఆ ప్రదేశంలోకి వెదజల్లాయి ఏనుగులు.

"మట్టిని పోయాలి... మంటలమీద నీళ్లు జల్లినా మట్టిని వెదజల్లినా ఒకటే ఫలితం..." అని అరుస్తూ క్రింద వున్న మట్టిని దోసిళ్ళతో ఎత్తి మంటల మీదికి విసిరాడు.

చూస్తూ చూస్తూ వుండగానే చల్లారిపోయాయి ఆ గుడిశెను కబళిస్తున్న మంటలు. ఏనుగుల్ని నీటికోసం మళ్ళీ గుంట దగ్గరికి పంపి ఇంకో గుడిశె దగ్గరికి పోయాడు శివుడు.

❖ ❖ ❖

తెల్లబడింది తూర్పుదిక్కు. బద్ధకంగా ఒళ్లు విరుచుకుంటూ తల్పం మీదినించి క్రిందికి దిగాడు సాగరులవారు.

కనులు తెరిచిన వెంటనే చిరునవ్వుతో ఎదురుగా కనిపించే తన సతీమణి ఆ రోజు కనిపించలేదు.

"ఎక్కడ? దేవివారు ఏరి?" అసహనంగా అడిగాడు ద్వారం వెలుపల నిలబడివున్న ఒక పరిచారికను.

"తెల్లవారుఝామున చక్రవర్తి వద్దనుంచి ఒక పావురం వచ్చింది. విషయం తెలుసుకునేందుకు వెళ్ళారు.. మీరు ఆదమరిచి నిద్రిస్తున్నందు వల్ల నిద్రాభంగం కావించలేదు" వినయంగా సమాధానం ఇచ్చింది ఆ పరిచారిక.

మరింత అధికం అయిపోయింది సాగరుల వారి అసహనం. కాలకృత్యాలు తీర్చుకుని, స్నానసంధ్యలు పూర్తి కావించుకున్న తర్వాతనే అంతఃపురంలో నుంచి అవతలికి పోవాలనే మాటను మరిచిపోయి వడివడిగా అడుగులు వేస్తూ నడిచారాయన.

వార్తలను చేరవేసే పావురాలను పెంచి పోషించే భవనం వెలుపలే కనిపించింది చారులతాదేవి.

"చక్రవర్తి చాలా అసహనంగా సమాచారం పంపించారు. వెంటనే యువరాణి క్షేమసమాచారాలతో తనకు వర్తమానం అందకపోతే తామే స్వయంగా సంపంగి నగరానికి బయలుదేరనున్నట్లు లిఖించారు" సాగరుల వారిని చూడగానే చిన్నగా చెప్పాడు చారులతాదేవిగారి దగ్గర నిలబడి వున్న మంత్రి మహేశ్వరుడు.

"నేను ముందుగానే హెచ్చరించాను కదా... ఎటువంటి ప్రమాదం రాకుండా ఏదో ఒకటి చేయమని అడిగాను కదా" తన భార్యవంక చూస్తూ చిరుకోపంతో అన్నాడు సాగరులవారు.

"అడవిలోనుంచి ఏదైనా సంతోషకరమైన మాట మనకి తెలిసిన తర్వాత చూసుకోవచ్చని ఆగాను. స్వయంగా వెళ్ళిన మన సేనాపతి కూడా ఇంతవరకూ ఏ విధమైన మాటను మనకి తెలియచేయలేదు" చెప్పింది చారులతాదేవి.

తనే స్వయంగా వెళ్లి చిటికెలో అన్ని విషయాలు తేటతెల్లం చేస్తానని సగర్వంగా చెప్పిన సేనాపతి దగ్గర్నించి కూడా ఎటువంటి వర్తమానం తమకు అందలేదని తెలిసిన వెంటనే ఇంకా అధికం అయిపోయింది సాగరుల వారి అసహనం.

"వారిని వీరిని నమ్ముకోవటం వల్ల ఉపయోగం ఏదీ వుండదు. మనమే స్వయంగా వెళ్ళి వద్దాం. అశ్వాలను సిద్ధం చేయించు మహేశ్వరా" అని ఆజ్ఞ ఇచ్చాడు.

తల వూపి, దూరంగా నిలుచుని వున్న తమ భటులకేసి తిరగబోతూ, ఉన్నట్లుండి ఆగిపోయాడు మహేశ్వరుడు.

గిట్టల చప్పుడుతో ఆ ప్రదేశాన్ని దద్దరిల్లచేస్తూ వేగంగా వస్తున్నాయి పది అశ్వాలు.

ముందున్న అశ్వం మీదినించి క్రిందికి దూకి, అలసట నిండి వున్న వదనాన్ని చేతులతో తడుముకుంటూ సాగరుల వారికి నమస్కరించాడు సేనాపతి.

"ఏమైపోయావు నువ్వు? ఏం జరిగింది అడవిలో??" అతనికి వెనుకగా వచ్చి నాలుగు బారల దూరంలో ఆగిన మిగతా అశ్వాల వంక చూస్తూ అడిగాడు సాగరులవారు.

మూటలుగా కట్టి వున్నాయి ఆ అశ్వాలమీద రకరకాల దుస్తులు, శిరస్త్రాణాలు, కవచాలు, బరిశెలు, కత్తులు, తలపాగాలు ఇంకా వివిధ రకాలయిన వస్త్రాలు ఎన్నో వున్నాయి.

అవన్నీ రక్తపు చారికలతో మలినపడి కనిపిస్తున్నాయి.

"శిఖావంతుడి సైన్యం ధరించే దుస్తులు అవి. ఆ సైనికులు ఉపయోగించే ఆయుధాలు... నీకు ఎక్కడ దొరికాయి" మొదటిచూపుతోనే అవి ఏమిటో అర్థం చేసుకుని సూటిగా సైన్యాధిపతిని అడిగాడు మహేశ్వరుడు.

"అడవి మధ్యలో సువర్ణానది ఒడ్డున పడి వున్నాయి ఇవి. వీటిని ధరించిన సైనికుల శరీరాల్ని చాలా భాగం నదిలోని మొసళ్ళు ఆరగించాయి. అవి ఆరగించగా మిగిలిన భాగాల్ని రాబందులు, అడవి పక్షులు ఆహారంగా చేసుకున్నాయి" చెప్పాడు సేనాపతి.

"మొసళ్ళకు ఆహారం అయ్యారంటే నమ్మబుద్ధి కావడం లేదు. నేలమీద వుండగా ఒకేసారి అంతమంది వాటి బారిన పడే అవకాశం లేదు... ఎవరో ఏదో యుద్ధంలో అందరినీ హతమార్చి వుంటారు" సాలోచనగా అన్నాడు మహేశ్వరుడు.

"నిజం చెప్పారు మంత్రిగారు... ఇవి నాకు కనిపించిన ప్రదేశంలో ఏదో ఘోరయుద్ధం జరిగింది. ఆ ప్రదేశం నిండా ఏనుగుల పాదముద్రలు కనిపించాయి..." అన్నాడు సేనాపతి.

ఛర్రున తలతిప్పి చారులతాదేవి వంక చూశాడు సాగరుల వారు. ఏనుగుల పాదముద్రలనే మాటను వినగానే కలువపువ్వు మాదిరి విప్పారింది ఆమె వదనం.

"ఇది తప్పకుండా మన శివుడి పనే అయివుంటుంది. మన అడవిలో ప్రస్తుతం ఏవైనా ఏనుగులు కనిపించాయంటే అవి శివుడికి మచ్చిక అయినవే అయివుంటాయి. సందేహం లేదు" తనను అడగకముందే సగర్వంగా చెప్పింది ఆమె.

"దగ్గర దగ్గరగా ఎనుబది డెబ్బది మంది సైనికులు హతమారిపోయినట్లు నాకు అనిపించింది. అంతమందిని ఎదిరించే సాహసం శివుడికి వుంటుందంటే నేను నమ్మను... అతను కాదు" తడుముకోకుండా చెప్పాడు సేనాపతి.

"అతను కాకపోతే మరి ఎవరై వుంటారు?" అడిగాడు సాగరులవారు.

"యువరాణితో వచ్చిన భటులై వుంటారని నా అభిప్రాయం."

"మరి వారెవరయినా నీకు కనిపించారా? వారి వద్ద యుద్ధ గజాలు ఏమైనా వున్నాయా?"

తల అడ్డం తిప్పాడు సేనాపతి.

"తగుదునమ్మా అనుకుంటూ అడవిలోకి పోయి నువ్వు సేకరించింది ఏముంది?"

తలవంచుకున్నాడు సేనాపతి.

"నువ్వు వెంటనే ఇంటికిపోయి విశ్రాంతి తీసుకో... అలసట తీరిన తర్వాత మాట్లాడుకుందాము" సాగరుల వారి కోపం అధికం అయ్యే అవకాశాలు కనిపిస్తూ వుండటంతో చిన్నగా సేనాపతికి చెప్పాడు మహేశ్వరుడు. అతను తలవూపి వెనుతిరగగానే తమ భటులకు ఆజ్ఞ ఇచ్చాడు.

"అశ్వాలను సిద్ధం చేయించండి. ప్రభువుల వారితో కలిసి అడవిలోకి పోయి రావాలి. పాతికమంది భటులు కూడా మాతో ప్రయాణం చేయాలి."

క్షణం కూడా ఆలస్యం చేయకుండా అవతలికి పరిగెత్తారు ఆ భటులు ఆ ఆజ్ఞల్ని అమలుపరచటానికి.

"ఈ సాయం సమయం లోపల మా దగ్గర్నించి నీకు వర్తమానం రాకపోతే జరిగింది పూర్తిగా వివరిస్తూ చక్రవర్తికి పావురాన్ని పంపించు... ఇకమీదట ఏదీ దాచిపెట్టకూడదు. ఇప్పటికే చాలా ఆలస్యం అయింది'' అని చారులతాదేవికి చెప్పారు సాగరులవారు.

❖ ❖ ❖

గూడెంలో వున్న గుడిశెల్లో ఒక వంతు అగ్నికి ఆహుతి అయిన తరువాత అదుపులోకి వచ్చాయి మంటలు.

తెల్లవారబోతున్న సమయానికి వాసుదేవుడి నాయకత్వంలో రెచ్చిపోయి పోరాటం చేశారు గూడెపు వీరులు. తోడేళ్ళ గూడెం వాళ్ళని దూరంగా తరిమికొట్టారు.

"ఏమో అనుకున్నాము గాని, మీ నాగరికులు సామాన్యులు కారు... ఒంటిచేత్తో మా శత్రువుల్ని అడ్డుకున్నావు నువ్వు. అదే ఒంటి చేత్తో మంటల్ని ఆర్పేందుకు మాకు సహాయపడ్డాడు మీ బుడతడు. మీకు మేము పూర్తిగా ఋణపడిపోయాము. ఏం చేస్తే ఋణం తీరుతుందో చెప్పండి" తెల్లగా తెల్లవారిన తర్వాత రచ్చబండమీద నిలబడి వాసుదేవుడితో అన్నాడు నాయకుడు.

మంటలు చల్లారినా, దట్టమైన పొగలు మాత్రం ఇంకా పైకి లేస్తూనే వున్నాయి. ప్రాణాలు పోగొట్టుకున్న గూడెపువాసుల శరీరాలతో ప్రాణాలు వదిలిన తోడేళ్ళగూడెం శత్రువుల శవాలతో బీభత్సంగా వుంది గూడెపు వాతావరణం.

"ముందు గూడెం ప్రశాంత వాతావరణంతో నిండివుండాలి. అసువులు వదిలిన వారికి అంత్యక్రియలు చేయాలి... గాయపడిన వారికి వైద్య సహాయం అందించాలి" అన్నాడు వాసుదేవుడు.

"అంతా జరిగిపోతోంది... మందుల ముసలయ్య అదే పనిమీద వున్నాడు" అంటూ తనవారిని కొంతమందిని దగ్గరికి పిలిచాడు నాయకుడు.

"ప్రాణాలు వదిలిన వారు ఎవరైనా సరే, మకర దేవతలకు ఆహారం అయిపోవాలి. మనవారి శరీరాల్ని సగౌరవంగా తీసుకుపోయి నదిలో వదలండి. ఆ తోడేళ్ళ గుంపుగాళ్ళని ఈడ్చుకుపోయి నీళ్ళల్లోకి విసిరేయండి" అని ఆజ్ఞ ఇచ్చాడు.

వాళ్ళ ఆచార వ్యవహారాల్లో వేళ్ళు పెట్టడం ఇష్టం లేకపోవడం వల్ల మౌనంగా అక్కడినించి కదిలి, తమకు విడిదిగా ఇచ్చిన గుడిశె దగ్గరికి తిరిగివచ్చాడు వాసుదేవుడు.

మంచంమీద కూర్చుని వుంది ఒక యువతి. పక్కనే నిలబడి వున్నాడు శివుడు.

అంత దూరంలో వుండగానే వాసుదేవుడిని చూసి గభాలున మంచం దిగింది ఆ యువతి. గబగబా ఎదురువచ్చి నమస్కారం చేసింది.

"అయ్యబాబోయ్... యువరాణీ... నువ్వా... నువ్వు ఇక్కడికి ఎలా వచ్చావ్?" ఆశ్చర్యంతో కనులు పెద్దవి చేస్తూ అడిగాడు వాసుదేవుడు.

చిన్నగా నవ్వి తాను నదిని ఎందుకు అధిగమించిందో, ఎలా పట్టుబడిందో, ఎవరి సహాయంతో విముక్తి పొందిందో వివరంగా చెప్పింది జ్వాల.

"ఇతను ఎవరు బాబయ్యగారు? ఇంతటి ప్రతిభాశాలిని గురించి మాకు ఇంతవరకు ఎందుకు తెలియలేదు?" ఆశ్చర్యంగా చూస్తున్న శివుడికేసి చేయి వూపుతూ అడిగింది.

"అబ్బో... అదంతా పెద్దకథ... అసలు తనలో ఇంతటి ప్రతిభ వున్నదన్న సంగతి మీకు నాకే కాదు... ఇతనికే సరిగ్గా తెలియదు. సానపెట్టని ముడి

వజ్రం... సాన పెడితే ఎంతగా ప్రకాశిస్తుందో ఎవరూ చెప్పలేరు" నవ్వుతూ అన్నాడు వాసుదేవుడు.

"మదగజాల్ని మచ్చిక చేసుకోవటంలో సాగరులవారే సాటిలేని మేటి అని నాన్నగారు ఎప్పుడూ చెపుతూ వుంటారు. ఇతను ఆ ఏనుగుల్ని నడిపించిన విధానం మాటల్లో చెప్పలేను..." దూరంగా నిలుచుని వున్న ఏనుగుల్ని కూడా చూపిస్తూ చెప్పింది జ్వాల.

"నేర్పు ఓర్పు వంటి లక్షణాలు కొన్ని కొన్ని అంశాల్లో నేర్చుకుంటే వస్తాయి. కొన్ని కొన్ని పరిస్థితుల్లో వారసత్వంగా పుట్టుకతోనే సంక్రమిస్తాయి. ఒట్టి ఏనుగుల్నే కాదు... మాటలు రాని మూగజీవాలు ఎన్నో ఈ శివుడికి చిటికెలో మచ్చిక అయిపోతాయి" నవ్వుతూ అన్నాడు వాసుదేవుడు.

"ఇతని తల్లిదండ్రులు ఎవరు?" కుతూహలంగా అడిగింది జ్వాల.

చెవులు రిక్కించి వింటున్న శివుడి వదనం ఒక్కసారిగా వాడిపోయింది. తలను గిర్రున పక్కకు తిప్పుకుని, దూరంలో వున్న తన ఏనుగుల దగ్గరికి వెళ్ళిపోయాడు.

"అదేమిటి? ఎందుకలా వెళ్ళిపోతున్నాడు?"

తన తల్లిదండ్రుల ప్రసక్తి వచ్చేసరికి తలతిప్పుకుని దూరంగా వెళ్ళిపోతున్న శివుడి వంక ఆశ్చర్యంగా చూస్తూ వాసుదేవుడిని అడిగింది జ్వాల.

"తల్లి ఎవరో తండ్రి ఎవరో తెలియని అనాథ వాడు... సాగరుల వారి దయాధర్మ భిక్షల కారణంగా పెరిగి పెద్దవాడవుతున్న నిర్భాగ్యుడు" గట్టిగా నిట్టూరుస్తూ చెప్పాడు వాసుదేవుడు.

"అతను నిర్భాగ్యుడు ఎలా అవుతాడు బాబయ్యగారు? మనిషి వాసన తగిలితే మదం పెచ్చరిల్లి పాదాలతో తొక్కి చంపే మద కరీంద్రాల్ని తన చిటికెన వేలి కదలికలతో కట్టుబడి చేసే సాహసవంతుడు.

తన జన్మను గురించి అతను సిగ్గుపడవలసిన అవసరం ఎంత మాత్రం లేదు. ఎందుకంటే అతనికి అలవడిన ఆ విద్య అమోఘ ప్రజ్ఞావంతులైన తల్లిదండ్రుల దగ్గిర్నించే సంక్రమించి వుంటుంది. అతని తల్లిదండ్రులు ఎవరోగాని అసాధారణ ప్రజ్ఞావంతులే అయివుంటారు" అవసరం లేకపోయినా అదోరకమైన ఆవేశంతో చెప్పింది జ్వాల.

వినోదంగా చూస్తున్న వాసుదేవుడి పెదవులమీద వెంటనే ప్రత్యక్షం అయిందొక చిరునవ్వు.

ఆ నవ్వును చూసేసరికి మాయం అయిపోయింది జ్వాల ఆవేశం. దాని స్థానంలో చిన్నపాటి సిగ్గు ప్రవేశించింది.

"చిటికెలో ప్రాణాలు పోగొట్టుకోబోతున్న సమయంలో అతను వచ్చి నన్ను ఉద్ధరించాడు. ఆ కృతజ్ఞతాభావం నన్ను వివశురాలిని చేస్తూ వుండడం చేత అలా మాట్లాడాను... తప్పుగా ఏమైనా చెప్పానా?" అడిగింది తనుకూడా చిరునవ్వు నవ్వుతూ.

"తల్లీ... నువ్వు మహాబలుడి కుమార్తెవి. నీ నోటినుంచి తప్పుమాటలు పొరపాటున కూడా వెలువడవు. శివుడి పుట్టుక గురించి నువ్వు చెప్పినవి మాత్రం అక్షర సత్యాలు. వాడి తల్లిదండ్రులు నిజంగానే మహాయోధులు అయివుంటారు" అన్నాడు వాసుదేవుడు.

"వారు ఎవరో మీకు తెలుసా?" కుతూహలంగా అడిగింది జ్వాల.

"తెలియదు తల్లీ.. కాని నాకు ఒకే ఒక సందేహం చాలాకాలం నుంచీ అదేపనిగా కలుగుతూ వస్తోంది. పనుల ఒత్తిడి వల్ల నివృత్తి చేసుకోలేక పోతున్నాను" గంభీరంగా అన్నాడు వాసుదేవుడు.

దగ్గర్లో లేడు శివుడు. ఉండి వున్నట్లయితే తప్పకుండా ఆ మాటల్ని ఆలకించి వుండేవాడు. ఆలకించిన తర్వాత వాసుదేవుడి వెంటపడి ఆ సందేహం ఏమిటో తెలుసుకునే ప్రయత్నం తప్పకుండా చేసి వుండేవాడు.

"మీరు తలచుకుంటే ఎటువంటి అసాధారణ సమస్యలకైనా సమాధానాలు లభించి తీరతాయని నాకు తెలుసు. ఈ శివుడి జన్మ రహస్యాన్ని మీరు బట్టబయలు చేయగలిగితే అతనికే కాదు మన సామ్రాజ్యానికీ మహోపకారం చేసినవాళ్ళు అవుతారు" అన్నది జ్వాల.

"మహోపకారమా? అదేమిటి తల్లీ??" ఆశ్చర్యంగా అడిగాడు వాసుదేవుడు.

"జ్వలిత సామ్రాజ్య భవిష్యత్తు అంతా సాగరుల వారి వద్ద వున్న గజబలం మీదనే ఆధారపడి వుందనీ, ఆ బలాన్ని చూసి భయపడటం వల్లనే మన చుట్టుపట్ల రాజ్యాలు మనల్ని ఏమీ చేయలేకపోతున్నాయనీ శిఖావంతుడు తెగించి ముందడుగు వేయలేకపోవటానికి కారణం కూడా అదేనని మా

తండ్రిగారు నాకు అనేకమార్లు ఉద్బోధించారు. సాగరుల వారి తర్వాత వారితో సరితూగగల నేర్పరి ఇకముందు ఎవరూ వుండబోరని కొంచెంగా బాధకూడా పడ్డారు. కాని ఈ శివుడి నేర్పరితనాన్ని చూస్తుంటే సాగరుల వారి నైపుణ్యం ఇతని ముందు తీసికట్టేనని నాకు అనిపిస్తోంది. అవునా కాదా?" అడిగింది జ్వాల.

అవునన్నట్లు తలవూపాడు వాసుదేవుడు.

"ఇటువంటి వాడు తన జన్మని గురించి తెలియక, మనసు కష్టపెట్టుకుని సహజంగా తనకు అబ్బిన ఆ మహావిద్యను నిర్లక్ష్యం చేస్తే ఆ నష్టం అతనికి కాదు, మన సామ్రాజ్యానికి. అవునా కాదా?" మరో ప్రశ్న వేసింది జ్వాల.

ఆమె ముందుచూపును గమనించి ముచ్చటపడిపోతున్నట్టు తల పంకించి గభాలున ఆమె మొఖాన్ని చేతుల్లోకి తీసుకుని నుదుటి మీద ముద్దు పెట్టుకున్నాడు వాసుదేవుడు.

"తండ్రికి తగిన తనయవని అనిపించావు తల్లీ. నీ మాటలు అక్షరసత్యాలు. ఎట్టి పరిస్థితిలోను ఈ శివుడు తన శక్తుల్ని నిర్లక్ష్యం చేయకుండా మనం చూసుకోవాలి" అన్నాడు.

"అందుకు మీరు మీ కర్తవ్యంగా అతని తల్లిదండ్రులు ఎవరో తెలుసుకోవాలి" అన్నది జ్వాల.

"తప్పకుండా తల్లీ... ప్రస్తుతం మన ఎదుట ఎన్నెన్నో అత్యవసరమైన సమస్యలు శివతాండవం చేస్తున్నాయి. వాటిని వెంటనే పరిష్కరించాలి. ఆ తరువాత నేను శివుడి పనిమీదనే దృష్టిని లగ్నం చేస్తాను" అంటూ వున్నట్లుండి మాటల్ని ఆపాడు వాసుదేవుడు.

"ఏమిటి బాబయ్యగారూ? ఏమయింది?" అడిగింది వెంటనే జ్వాల.

"వచ్చే పౌర్ణమి నాడు సాగరుల వారి వద్ద పెరిగి పెద్దవుతున్న అనాధలందరికీ వారి వారి పరిజ్ఞానాన్ని పరీక్షించే ప్రయత్నం జరుగుతుంది. భవిష్యత్తులో వారు నేర్చుకోవల్సిన వృత్తి విద్యలేమిటో తెలుసుకుంటారు. ఈ శివుడు కూడా వారిలో ఒకడే కాబట్టి ఇతన్ని కూడా అందరితో పాటు నిలబెట్టి రకరకాల ప్రశ్నలు వేస్తారు" అన్నాడు అతను.

"ఇంత జరిగిన తర్వాత ఇతనికి ఇంకా పరీక్ష ఎందుకు? భవిష్యత్తులో ఇతను నేర్చుకోవల్సిన వృత్తివిద్య ఏమిటో కొట్టవచ్చినట్టు తెలిసిపోతోంది. ఇతనికి పరీక్ష అనవసరం" తడుముకోకుండా చెప్పింది జ్వాల.

"ఈ మాటలు నువ్వు నేను చెప్పగూడదు. పరీక్షలు జరిపేందుకు నియమించబడే ఆచార్యులు, అధికారులు చెప్పాలి" అంటూ మరోసారి మాటల్ని ఆపాడు వాసుదేవుడు.

"మళ్ళీ ఏమయింది బాబయ్యగారు?" అసహనంగా అడిగింది జ్వాల.

"అడుగో... గూడెం నాయకుడు వస్తున్నాడు... నీ గురించి ఏదో మాట్లాడటానికే ప్రయత్నం చేస్తాడు. మనం అప్రమత్తంగా వుండాలి" అంటూ దూరంలో వున్న శివుడికి చేయివూపాడు వాసుదేవుడు.

అలా చేయి వూపవలసిన అవసరంలేదు. దూరంలో వుండగానే నాయకుడిని గమనించి గట్టిగా ఘీంకరించింది మగ ఏనుగు. వెంటనే అప్రమత్తమై ముందుకు పరిగెత్తుకు వచ్చాడు శివుడు.

❖ ❖ ❖

"ఆజన్మశత్రువులైన ఆ తోడేలు గూడెం వాళ్ళనించి మమ్మల్ని కాపాడారు. మా గూడెం అగ్నిజ్వాలల్లో పడి ఆహుతి అయిపోకుండా అడ్డుకోవడంలో సాయపడ్డారు. మీ రుణం ఎన్ని జన్మలు ఎత్తినా తీర్చుకోలేము. మనమధ్య ఏర్పడిన అనుబంధాన్ని ఆసరాగా చేసుకుని మిమ్మల్ని ఒక్క కోరిక కోరటానికి వచ్చాను. కాదని అనకూడదు" వాసుదేవుడిని సమీపించి, చేతులు జోడిస్తూ అడిగాడు గూడెం నాయకుడు.

"బాబయ్యగారూ! జాగ్రత్త. మిమ్మల్ని మాటలతో బురిడీ కొట్టిస్తారు. ఏదో పెద్ద ఎత్తుగడ మీదే వచ్చాడు" వెంటనే వాసుదేవుడికి మాత్రమే వినపడేటట్లు చెవిలో ఊదింది జ్వాల.

"బురిడీ కొట్టించటానికి వాడు ఏమీ పెద్ద మొనగాడు కాదు. దేవతల పేర్లు, దేవుళ్ళ పేర్లు చెప్పి నిన్ను మళ్ళీ తనకి అప్పగించమంటాడు. నిన్ను ఆ మొసళ్ళకి ఆహారంగా వేయకపోతే దేవతలు తన గూడేన్ని శపిస్తాయని అంటాడు" తడుముకోకుండా చెప్పాడు శివుడు రెండో ప్రక్కనించి.

"మీరిద్దరూ కాస్సేపు మౌనంగా వుంటే వాడు చెప్పేదేమిటో ప్రశాంతంగా వింటాను" అని వారిద్దరివంకా చురుకుగా చూసి, నాయకుడి కేసి తిరిగాడు

వాసుదేవుడు. "చెప్పు నాయనా... నువ్వు చెప్పదలుచుకున్నదేమిటో త్వరగా చెప్పు" అన్నాడు.

"నదిలో వున్న మకర దేవతలకు మొక్కు చెల్లించుకోకపోతే మాకు చాలా కష్టం కలుగుతుంది. ఈ కూనని తీసుకుపోయి నదిలో వదలాలి. దయచేసి మాకు అప్పగించండి" అన్నాడు నాయకుడు అతి వినయంగా.

"ఈ కూనని నదిలో పడవేయకపోతే మీ గూడెం కష్టాల పాలు అవుతుంది కదా?" అడిగాడు వాసుదేవుడు.

గబగబా తలవూపాడు నాయకుడు.

"ఇప్పటికే ఎంతోమందిని నదిలోకి విసిరారు. తోడేలు గూడెం వాళ్ళు, మీవాళ్ళు చాలామంది వున్నారు. మకర దేవతల కడుపులు నిండిపోయి వుంటాయి. మళ్లీ ఈ కూనని వాటికి ఇవ్వవలసిన అవసరం ఏముంది?"

"మొక్కు స్నేహితుడా... బలి ఇస్తామని మొక్కుకున్న తర్వాత వెనక్కి తగ్గితే అపచారం జరిగిపోయి అరిష్టం చుట్టుకుంటుంది."

అతను మాట్లాడబోయేది ఏమిటో ముందుగానే పసికట్టిన శివుడి వంక ఆప్యాయంగా చూసి తల విదిలించాడు వాసుదేవుడు.

"అచ్చు నువ్వు చెప్పినట్లే మాట్లాడుతున్నాడు వాడు. ఇప్పుడు ఏం చేద్దాం?" అని అడిగాడు.

ఆలోచనలో పడ్డాడు శివుడు. నాయకుడి కోరికను నిర్మొహమాటంగా తిరస్కరించవచ్చు. వెంటనే ఆవేశాలు అధికం అయిపోయి యుద్ధం అనివార్యం అవుతుంది.

తాము యుద్ధం మొదలుపెడితే తన ఏనుగులు కూడా వెంటనే రంగంలోకి దిగిపోతాయి. పోరాటం అంటూ ప్రారంభం కానే కూడదు. అయిన తర్వాత ఎటుపోయి ఎటువస్తుందో చెప్పటం కష్టం. వాటికి ఏదైనా అపాయం సంభవిస్తే??

శివుడి ఆలోచనల్ని వెంటనే పసికట్టాడు వాసుదేవుడు. "నిజమే శివుడు... వీటికి ఏదైనా జరిగితే మనం ఓడిపోవటం తప్పనిసరి. ఈ సమస్యను ఎలా ఎదుర్కోవటం?" అన్నాడు చిన్న కంఠంతో.

మౌనంగా నిలబడి వున్న జ్వాలకేసి చూశాడు శివుడు. ఊరు పేరు తెలియని ఎవరో అపరిచితురాలని అనుకున్నాడు ఆమెను గురించి అంతకుముందు.

జ్వలిత సామ్రాజ్యానికి కాబోయే మహారాణి అని తెలిసేసరికి ఒక విధంగా నోటివెంట మాటలు రాలేదు అతనికి.

జ్వలిత సామ్రాజ్యంలో భాగమైన సంపంగి నగరంలో నివశిస్తున్నాడు తను. అంటే తను జ్వలిత సామ్రాజ్య పౌరుడే. తమకు కాబోయే మహారాణిని కాపాడుకోవటం తన విధి... కర్తవ్యం.

కాని, తనను గుడ్డిగా నమ్మి, తను నిప్పుల్లో దూకమని ఆజ్ఞ ఇచ్చినా తడుముకోకుండా ఆ పని చేయటానికి సిద్ధపడే తన ఏనుగుల్ని యుద్ధానికి బలి చేయటం ధర్మమా?

శివుడి మనసులో మెదులుతున్న ఆలోచనల్ని ఈసారి జ్వాల కూడా తేలికగా గ్రహించగలిగింది.

"అవసరం లేదు శివుడు... నాకోసం ఆ మూగజీవాలను యుద్ధంలోకి దింపవద్దు... ఇంకో మార్గం ఏదైనా ఆలోచించు" వెంటనే చెప్పింది అతనికి.

మౌనంగా నిలబడి వున్నాడు వాసుదేవుడు. నోరు తెరిచి ఒక్కమాట కూడా మాట్లాడకుండా శివుడివంకే చూస్తున్నాడు.

"మీరు అలా మాట్లాడకుండా వుండిపోతే ఎలా? ఏదో ఒకటిచెప్పి శివుడికి మార్గదర్శనం చేయండి" వున్నట్టుండి అతనికేసి తిరుగుతూ అన్నది జ్వాల.

"రాబోయే పౌర్ణమి రోజున సంపంగి నగరంలో పెరిగి పెద్దవారవుతున్న అనాధ బాలబాలికలకు పరీక్షలు నిర్వహించబడతాయని నీకు చెప్పాను. గుర్తున్నదా తల్లీ?" అడిగాడు వాసుదేవుడు.

అప్పటికప్పుడు ఏదో ఒక నిర్ణయాన్ని గూడెపు నాయకుడికి వినిపించాల్సిన ఆ సమయంలో ఎప్పుడో జరగబోయే ఏవో పరీక్షలను గురించి అతను మాట్లాడడం వింతగా కనిపించింది జ్వాలకి.

"ఇప్పుడు ఆ మాటలు అవసరమా బాబయ్యగారూ?" కాస్తంత చిరాకుగా అడిగింది.

"అవసరమే తల్లీ... ఎప్పుడో జరగబోయే ఆ పరీక్ష ఇప్పుడే జరగబోతున్నది. ఈ శివుడి మానసిక సామర్థ్యాన్ని అంచనా వేయటానికి ఇంతకంటె మంచి అవకాశం మరొకటి రానే రాదు" ఆమెకు మాత్రమే వినబడేటట్లు చెప్పాడు అతను.

నరరూప రాక్షసుడి వంటి గూడెపు నాయకుడు తమ ఎదుటే వున్నాడని కూడా చూసుకోకుండా ఫక్కున నవ్వింది జ్వాల.

“ఎటువంటి ప్రమాద పరిస్థితి ఎదురయినా, కొంచెంకూడా చలించకుండా ఎన్నెన్నో అంశాల గురించి ఆలోచిస్తూనే వుంటారని మీకు పెద్ద పేరు. అది అక్షరాల యదార్థమని నాకు ఇప్పుడే తెలిసింది. శివుడిని గురించి వదిలేయండి. మీరు నన్ను తప్పించటానికి ఏం చేస్తారో నాకు చెప్పండి” అన్నది దగ్గరికి జరుగుతూ.

తల ముందుకు వంచి ఆమె చెవిలో చిన్నగా ఏదో చెప్పాడు వాసుదేవుడు. “శివుడు ఏం చేస్తాడో ఆలకించు” అని అన్నాడు.

శివుడి కేసి తిరిగింది జ్వాల.

ఆమె వాసుదేవుడితో మాట్లాడిన మాటల్ని వినిపించుకోలేదు శివుడు. ఆ మాటలకు వాసుదేవుడు సమాధానాన్ని ఇవ్వటాన్ని కూడా అతను గమనించలేదు.

నాయకుడు వచ్చిన వెంటనే తొండాలను వేగంగా అటూ యిటూ తిప్పుతూ అవసరం అయితే వేగంగా కదలటానికి సిద్ధంగా నిలబడిన తన ఏనుగుల దగ్గరికి పోయాడతను.

“నాయకుడికి కోపం రాకుండా, అతని జనంతో మనకి యుద్ధం చేయవలసిన అవసరం లేకుండా యువరాణిని రక్షించుకోవటానికి నాకు ఒక ఉపాయం తోచింది. బాగుంటుందా అది?” ఆడ ఏనుగు తొండాన్ని గట్టిగా కౌగలించుకుంటూ అడిగాడు.

అతను ఆలోచించిన ఉపాయం ఏమిటో తెలియకపోయినా చిన్నగా ఘీంకరించింది అది. మగ ఏనుగు తలను వంచి అతని భుజాల్ని తడిమింది. గున్న అయితే తొండంతో అతని నడుమును చుట్టి బలంగా వెనక్కి లాగి, తను తన తల్లిదగ్గర నిలబడింది.

“చాలు... నాకు ఈ మద్దతు చాలు” అంటూ గబుక్కున వెనుతిరిగి నాయకుడి దగ్గరికి వచ్చాడు శివుడు.

“తోడేలు గూడెం వాళ్ళు ఎంతమంది మీ మకర దేవతలకు ఆహారం అయినారు?” అని అడిగాడు.

చేతివేళ్ళమీద లెక్కకట్టి, తన వెనుక వున్న ఇద్దరు వృద్ధులను సంప్రదించి ఒక అంకెను చెప్పాడు నాయకుడు.

"మరి మీవాళ్ళు ఎంతమంది వాటికి ఆహారమై సద్గతి పొందారు?" మళ్ళీ అడిగాడు శివుడు.

ఇంకోసారి తనవారిని సంప్రదించి మళ్ళీ ఇంకో అంకెను చెప్పాడు నాయకుడు.

తృప్తిగా తలవూపి "తీసుకుపోండి... బలికూనని వెంటనే నదిలోకి నెట్టి మీ మొక్కు తీర్చుకోండి. ఆలస్యం చేయవద్దు..." అన్నాడు శివుడు. అన్న తర్వాత క్షణం కూడా ఆలస్యం చేయలేదు అతను. వెనుతిరిగి తన ఏనుగల దగ్గరికి పరిగెత్తాడు.

అతని సమాధానాన్ని విని బలికూన అరిచి కేకలు పెడుతుందనీ, ఆగమాగం చేసేస్తుందని, ఆమెను అతి బలవంతంగా నది దగ్గరికి లాక్కు పోవాల్సి వస్తుందనీ భావించాడు కాబోలు- ఆమెకేసి తిరిగి ఆశ్చర్యంగా నోరు తెరిచాడు నాయకుడు.

ఆగమాగం చేయటం లేదామె. చిరునవ్వుతో వాసుదేవుడి వంక చూస్తోంది.

"మీ అంచనా తప్పలేదు బాబయ్యగారు... మీరు ఏం చెప్పారో అదే తనుకూడా చెప్పాడు శివుడు. అసలు ఇంత తెలివి ఇతనికి ఎక్కడినించి వచ్చింది?" అని అడుగుతోంది.

"తెలుసుకుంటాను తల్లీ! ఎక్కడినించి వచ్చిందో తప్పకుండా తెలుసు కుంటాను. నువ్వు సందేహపడవలసిన అవసరం ఎంత మాత్రం లేదు" అంటూ ఆమె చేతిని పట్టుకుని నాయకుడికి అప్పగించాడు.

నదిలో నివశించే మకర దేవతలకు జయుజయుధ్వానాలు చేస్తూ అప్పటికప్పుడే అటుకేసి కదిలాడు నాయకుడు.

❖ ❖ ❖

పట్టుకుంటే జారిపోయేటంత మెత్తగా తేలికగా వున్న చిన్న వస్త్రపు పీలిక మీద నెమలి ఈక మొనను కరక్కాయ రసంలో ముంచి చక్రవర్తికి ఒక లేఖను రచించింది చారులతాదేవి.

అఖండ జ్వలిత సామ్రాజ్యనేతకు మొదటగా తలవంచి అభివాదాలు తెలిపింది. ఆ తర్వాత సూటిగా అడవిలో జ్వాల దారి తప్పి కనిపించకుండా పోయిన వైనాన్ని తెలియచేసింది.

"నా కడుపున పుట్టకపోయినా నా స్వంత బిడ్డడి కంటె అధికం అయిన శివుడు అడవిని గాలించటానికి వెళ్ళాడు. యువరాణి నా మేనకోడలు అయినటువంటి జ్వాల వివరాలు ఏ క్షణంలోనైనా మాకు తెలుస్తాయి. మీరు కలత చెందవలసిన అవసరం లేదు."

అంతకుమించి ఒక్క అక్షరంకూడా అధికంగా వ్రాయలేదు ఆమె. వస్త్రపు పీలికను ముడిచి పావురం కాలికి కట్టి తనే స్వయంగా గాలిలోకి ఎగురవేసింది.

అడవుల్ని అధిగమించింది ఆ పావురం. నగరాల మీదుగా ఎగిరింది. తనను చూసి వేటాడటానికి ప్రయత్నం చేసిన గ్రద్దలను, డేగలను నేర్పుగా తప్పించుకుంటూ రాజధాని నగరంకేసి వెళ్ళింది.

❖ ❖ ❖

"దింపండి... కూనని నీళ్ళల్లోకి దింపండి"అని తనవారికి ఆజ్ఞ ఇచ్చి, తన చేతుల్లో వున్న చెట్టుకొమ్మతో నదిలోని నీటిని దబదబాబాదాడు గూడెం నాయకుడు.

"రండి... రండి... ఆనందంగా రండి... మేము సమర్పించుకుంటున్న ఈ బలికూనని ఆరగించి మమ్మల్ని మా గూడేల్ని చల్లగా చూడండి" అని కూడా అరిచాడు.

అవతలి ఒడ్డుకు దగ్గరిగా తిరుగుతున్న రెండు మొసళ్ళు నింపాదిగా అతనికేసి బయలుదేరటం జ్వాలకి కనిపించింది. ఎంత కాదని అనుకున్నా ఆమె ఒళ్ళు జలదరించింది.

ఇవతలి ఒడ్డుమీదనే గూడెం వాళ్లు నిలబడిన ప్రదేశానికి పాతిక ధనువుల దూరంలో పడుకుని వున్నాయి మరో పది మొసళ్ళు. వాటిలో సగం నెమ్మదిగా నీటిలోకి జారి జ్వాలకేసి ఈదటం మొదలుపెట్టాయి.

"శివుడి అంచనా తప్పు అయినట్టు కనిపిస్తోంది బాబయ్యగారు" ఒడ్డుమీదే నిలబడి వున్న వాసుదేవుడితో అన్నది జ్వాల భయపడకుండా వుండటానికి ప్రయత్నం చేస్తూ.

"అదేం కాదు తల్లీ... నువ్వు కలత పడాల్సిన అవసరం లేదు" అంటూ నది దిగువకు చేయి చూపించాడు వాసుదేవుడు.

అటు చూసిన జ్వాలకు వెంటనే కనిపించాడు శివుడు. ఒడ్డుమీద లేడు అతను నీటిలో నిలబడి వున్నాడు. అతనితో పాటు అతని ఏనుగులు కూడా నదిలో దిగాయి.

ఒడ్డు మీద దట్టంగా పెరిగి వున్న గడ్డిని చిన్న చిన్న కట్టలుగా కట్టి, ఆ కట్టలతో అతను ఏనుగుల శరీరాల్ని గట్టిగా రుద్ది స్నానం చేయిస్తున్నాడు.

తొండాల నిండా నీటిని గ్రహించి, తమ ఒంటిమీద అతని ఒంటిమీద జల్లుతూ, చిన్న చిన్న శబ్దాలు చేస్తూ ఆనందిస్తున్నాయి ఏనుగులు.

వాటి తొండాలకు అందనంత దూరంలో నీటిలో తేలుతూ ఆ దృశ్యాన్ని చూస్తున్నాయి పెద్ద చిన్న మొసళ్ళు అనేకం.

నాయకుడి అరుపుల్ని విని కదిలినవి కూడా జ్వాల దగ్గరికి పోలేదు. సూటిగా ఆ ఏనుగుల దగ్గరికే పోతున్నాయి.

అంతకుముందే నదిలో విడువబడిన శరీరాలను ఆరగించటం వల్ల వాటికి ఆకలి మందగించింది. ఆకలి మందగించటం వల్ల అవి ఏనుగుల్ని గాని, వాటికి స్నానం చేయిస్తున్న శివుడిని కాని పట్టుకునే ప్రయత్నం చేయటం లేదు. దూరంగా తేలుతూ వింత చూస్తున్నాయి.

"రండి దేవతల్లారా... వచ్చి బలికూనని స్వీకరించండి" ఆ దృశ్యాన్ని తనుకూడా చూసి గొంతు చించుకుని అరిచాడు నాయకుడు.

"అనవసరమైన శ్రమ. ఈ కూనని బలి తీసుకోవడం వాటికి ఇష్టం వున్నట్టు నాకు అనిపించడంలేదు" నెమ్మదిగా అన్నాడు వాసుదేవుడు.

"ఎందుకు ఇలా జరుగుతోంది? ఎందుకు?" ఆవేదనగా అడిగాడు నాయకుడు.

"ఎందుకంటే ఈ కూన మీ దేవతలకు చాలాకావాల్సిన కూన. అసలు అవతలి ఒడ్డు మీదినించి ఇవతలి ఒడ్డుకు వచ్చినప్పుడే మీరు గ్రహించి వుండాల్సింది. గ్రహించకుండా బంధించారు. దానితో వాటికి కోపం వచ్చి తోడేలు గూడెం వాళ్ళని మీ మీదికి పంపకం చేశాయి. ఇప్పటి కయినా మీరు బుద్ధి తెచ్చుకుంటే బాగుంటుంది. లేకపోతే ఈసారి అవతలి

ఒడ్డుమీదినించి మా నాగరికులే యుద్ధానికి రావచ్చు" మెత్తగా చెప్పాడు వాసుదేవుడు.

"లాగండి. కూనని బయటికి లాగి కట్లు విప్పేయండి. మన స్నేహితుడు నిజమే చెప్పాడు" వెంటనే తనవారికి ఆజ్ఞ ఇచ్చాడు నాయకుడు.

క్షణం కూడా ఆలస్యం చేయకుండా జ్వాలను ఒడ్డుమీదికి చేర్చారు అతని అనుచరులు.

కడుపులు నిండిన తర్వాత మొసళ్ళు వేటాడటానికి రావనే నమ్మకంతో జ్వాలను నదిలో నిలబెట్టటానికి అంగీకరించాడు గాని, తనని, తన ఏనుగుల్ని చూడటానికి అవి గుంపులు గుంపులుగా పోగుపడుతూ వుండటాన్ని గమనించి భయంతో బెదిరిపోతున్నాడు శివుడు.

ఆకలి వేయకపోయినా అల్లరి చేయటం కోసం ఏదో ఒకటి జ్వాలమీదికో, తనమీదికో ఎగబడతే ఎలా ఎదుర్కోవాలో ఆలోచిస్తున్నాడు అతను.

ఆ ఆలోచన తెగకముందే జ్వాల ఒడ్డుకు చేరటాన్ని గమనించి, ఆనందంగా ఒక చిన్న ఈల వేశాడు. ఈల వేస్తూ ఎగిరి ఒడ్డుమీదికి దూకాడు.

అతను కదులుతూ వుండగానే తాము కూడా కదిలాయి ఏనుగులు. అతనితో పాటుగా ఒడ్డుకు చేరుకుని ఘీంకారాలు చేశాయి.

❖ ❖ ❖

సూర్యుడు ఇంకో పావు ఘడియ తరువాత పడమటి దిశలో పడి మటుమాయం అయిపోతాడనగా రెక్కల్ని తపతపలాడిస్తూ రాజధానిలోని పావురాల శాల ముఖద్వారం ముందుండే పెద్ద వేదికమీద వాలింది చారులతాదేవి సాగనంపిన పావురం.

వెంటనే దాన్ని శాలలోకి తీసుకుపోయి కాలికి కట్టి వున్న వస్త్రపు ముక్కను చక్రవర్తి సమక్షానికి పంపించారు శాలలోని భటులు.

సభా మందిరంలో సింహాసనం మీద కూర్చుని, మంత్రులతో, తన సైన్యంలోని కొంతమంది దళపతులతో మాట్లాడుతున్నాడు చక్రవర్తి.

"ప్రభూ... సంపంగి నగరం నుంచి పావురం ఒకటి ఏదో సమాచారాన్ని మోసుకువచ్చింది" మందిర ద్వారం దగ్గర భటుడు ఒకతను ఒక అడుగు ముందుకు వేసి వినయంగా వెల్లడించాడు.

మాటల్ని మధ్యలోనే ముగించి "ప్రవేశపెట్టండి..." అంటూ అనుమతి ఇచ్చాడు చక్రవర్తి.

పెద్ద పెద్ద అడుగులు వేస్తూ లోపలికి వచ్చిన భటుడిని, అతని చేతిలో వున్న వస్త్రపు పీలికను చూడగానే దళపతులకు, మిగిలిన మంత్రులకు సైగ చేశాడు ముఖ్యమంత్రి గుణధాముడు.

"ఈరోజుకు సభ సమాప్తం. అవసరం అయితే చక్రవర్తి మిమ్మల్ని పిలిపిస్తారు. అందరూ నేటికి వెళ్ళిపోవచ్చు" అన్నాడు.

రెండవసారి చెప్పించుకోకుండా గబగబా ఆసనాలమీదినించి లేచి ఆ భవనంలో నుంచి బయటికి వెళ్ళిపోయారు వారందరూ.

పావురాలను పెంచే భవనం దగ్గిర్నించి వచ్చిన భటుడి దగ్గరి వస్త్రపు పీలికను తనే స్వయంగా తీసుకున్నాడు చక్రవర్తి. దానిమీద లిఖించబడిన విషయాన్ని చదివి ఒకింత ఆందోళనగా చూశాడు.

"మా సోదరి చారులతాదేవి వ్రాసింది. నువ్వు కూడా చదువు" అంటూ గుణధాముడికి అందించాడు.

ఒకే ఒక క్షణికంలో మొత్తం చదివి దీర్ఘంగా నిట్టూర్చాడు మంత్రి గుణధాముడు.

"యువరాణి ప్రయాణమై వెళ్ళిన క్షణం నుంచీ సంపంగి నగరం నుంచి మనకు నిర్దిష్టమైన సమాచారం ఇంతవరకూ అందక పోవటానికి కారణం ఏమిటో ఇప్పుడు తెలిసింది" అన్నాడు.

"నా తల్లికి ఏదైనా ప్రమాదం వాటిల్లి వుంటుందా" కొంచెం ఆవేదనగా అడిగాడు చక్రవర్తి.

"అడవిలో అడుగుపెట్టిన తర్వాత ఒళ్లు దగ్గర పెట్టుకొని ప్రయాణం చేయకపోతే ప్రమాదాలు తప్పనిసరిగా ఎదురుపడతాయి. అందులోను మన యువరాణి వారి పాదాలు కుదురుగా నిలబడవు. దారిన పోయే తలనెప్పులన్నిటినీ తడిమి తడిమి తలమీదికి తెచ్చుకోవడం అలవాటు" దీర్ఘంగా నిట్టూరుస్తూ అన్నాడు గుణధాముడు.

క్షణాలు గడిచిన కొద్దీ చక్రవర్తిలోని అసహనం అధికమైపోతుందనీ, అప్పటికప్పుడు ససైన్యంగా ఆయన సంపంగి నగరానికి ప్రయాణం కావచ్చనీ అనిపించింది అతనికి.

అయితే పది క్షణికాలు గడిపిన తర్వాత కూడా ఆయన నోటివెంట అటువంటి ఆజ్ఞలు వెలువడకపోవటం ఆశ్చర్యాన్ని కలిగించింది.

"ఏం చేద్దామని అనుకుంటున్నారు ప్రభూ?" అని తనే అడిగాడు.

"నా సోదరి చారులత వ్రాసిన దాన్ని బట్టి చూస్తే ఆమె యువరాణి కోసం పంపిన శివుడు ఎవరోగాని మహా శక్తిమంతుడు అయివుంటాడు. అతను తప్పకుండా యువరాణిని క్షేమంగా తీసుకు రాగలడని మేము విశ్వసిస్తున్నాము. ఎంతో నమ్మకం లేకపోతే చారులత ఆ విధంగా లిఖించి వుండదు" సాలోచనగా అన్నాడు చక్రవర్తి.

"ప్రభూ... నాకు రెండు ఘడియల వ్యవధి ఇవ్వండి. ఆ శివుడు ఎవరో, ఎంతటి శక్తిమంతుడో తెలుసుకుని మీకు విన్నవిస్తాను" అన్నాడు గుణధాముడు.

తల వూపాడు చక్రవర్తి. "మీరు విన్నవించే విషయాన్ని బట్టి మనం సంపంగి నగరానికి వెళ్ళటమో మానటమో నిర్ణయించుకుందాం. ముందు ఆ పని చూడండి" అంటూ సింహాసనం దిగి, అంతఃపురం వైపు అడుగులు వేశాడు.

చక్రవర్తికి తన సోదరి చారులత మీద అభిమానం చాలా అధికంగానే వుంటుందని గుణధాముడికి తెలుసు. తమ కూతురి శ్రేయస్సుకు సంబంధించిన విషయంలో ఆమె మాటల్ని పూర్తిగా విశ్వసించే స్థాయిలో వుంటుందని మాత్రం తెలియదు.

'ప్రభువులు తమ సోదరి మాటలమీద విశ్వాసం వుంచటంలో అసంబద్ధం ఏమీ లేదు. ఆమె తన బిడ్డడి వంటి శివుడి సామర్థ్యం మీద నమ్మకం పెట్టుకోవటమే చాలా విచిత్రంగా వుంది. అసలు ఆ శివుడు ఎవరు? ఎటువంటివాడు?' తనలో తాను మాట్లాడుకుంటూనే సభా భవనంలో నుంచి బయటకి వచ్చాడతను. సూటిగా తన కార్యాలయం నిర్వహించబడే భవనంలోకి పోయాడు.

"మన గూఢచారి శుశ్రుతుడు ఎక్కడ వున్నాడో నాకు వెంటనే తెలియాలి... నగరంలోనే వుంటే వెంటనే వచ్చి మాట్లాడమని చెప్పండి" అంటూ తన భటులకు ఆజ్ఞ ఇచ్చాడు. తలలు వంచి అభివాదం చేసి నగరంలోకి బయలు దేరారు వారందరూ.

గూఢచారుల నాయకుడైన వాసుదేవుడితో సరిసమానమైన ప్రజ్ఞ కలవాడని శుశ్రుతుడికి పెద్ద పేరు. వాసుదేవుడి తర్వాత నాయకుడి స్థానంలో అతనే నియమించబడతాడని కూడా అనుకుంటూ వుంటారు చాలామంది. తను ఎక్కడికి వెళ్ళినా, ఎటువంటి పనుల మీద అజ్ఞాతంలో వున్నా క్రమం తప్పకుండా తన భార్యాబిడ్డలకు క్షేమ సమాచారాలు అందిస్తూ వుంటాడు శుశ్రుతుడు.

"ఈసారి అటువంటిది జరుగలేదు. ఇంటిని వదిలి ఇరువది దినాలకు పైగానే అయింది. తన యోగక్షేమాల గురించి ఒక ముక్కకూడా మాకు తెలియదు. అసలు ఎక్కడ వున్నాడో కూడా అవగతం కావటం లేదు" మహామంత్రి గుణధాముడు పంపించిన భటులు తమ గుమ్మంలోకి వచ్చిన వెంటనే కన్నీటిపర్యంతం అవుతూ చెప్పింది శుశ్రుతుడి భార్య.

"ఆయనకు ఏదైనా ఆపద కలిగివుంటుందని మీరు భావిస్తున్నారా?" సూటిగా అడిగాడు ఒక భటుడు.

"ఎల్లప్పుడు మా గురించే ఆలోచించే మనిషి ఇప్పుడు ఉలుకు పలుకు లేకుండా మాయం అయిపోతే అందుకు కారణం ఆపదే అని భావించటంలో తప్పు లేదు కదా?" బిగపట్టుకున్న కన్నీరు బుగ్గలమీదికి జారుతుండగా అడిగింది ఆమె.

మరికొన్ని ప్రశ్నలు వేసి ఆమెను మరింతగా బాధపెట్టడం ఇష్టం లేక వెంటనే వెనుతిరిగారు ఆ భటులు.

"అప్పచెప్పిన పనిని పూర్తిచేయకుండా మంత్రిగారి వద్దకు పోతే మన వీపులు వాచిపోతాయి. ఏం చేద్దాం?" అడిగాడు వారిలో ఒకతను.

శుశ్రుతుడు నివశించే వీధిలో నుంచి వర్తక వ్యాపారాలు జరిగే మరో వీధిలోకి వెళుతూ వుండగా మొదటి భటుడికి వచ్చింది ఒక ఆలోచన. వెంటనే తన సహచరుడికి తేటతెల్లంచేశాడు దాన్ని.

"శ్రావస్తి నగరంలో నివశించే కనకయ్య శ్రేష్ఠి మన చక్రవర్తి ఆంతరంగికుల్లో ఒకడు. మన రాజ్యంలోనే కాకుండా ఇతర రాజ్యాల్లో కూడా అప్రతిహతంగా కొనసాగుతూ వుంటాయి అతని వ్యాపారాలు. మెరికల్లాంటి సేవకులు ఎంతోమంది పనిచేస్తూ వుంటారు ఆయన చేతిక్రింద. ఎక్కడ ఎప్పుడు ఏమి జరిగినా క్షణికాలమీద ఆయనకు చేరవేస్తూ వుంటారు" అని అన్నాడు.

"అందువల్ల మనకి ఏమిటి ఉపయోగం?" నిరాసక్తంగా అన్నాడు రెండో భటుడు.

"శుశ్రుతుల వారు మాయం అయిపోవటానికి ఏదైనా ప్రమాదం జరగటమే కారణమైతే అది తప్పకుండా కనకయ్య శ్రేష్ఠి అనుచరులకు తెలిసే వుంటుంది" అన్నాడు మొదటి భటుడు.

"అయితే ఇప్పుడు మనం చెయ్యవలసిన పని ఏమిటి?" అడిగాడు రెండో భటుడు.

"నగరంలోని పడమటి వీధుల్లో పెద్ద పానశాల వుంది కదా! కనకయ్య శ్రేష్ఠి నిర్వహించే బొమ్మల దుకాణం ఆ పానశాల పక్కనే వుంది. అతని సేవకుల్లో ఒకడు నాకు తెలుసు. వాడిని పానశాలలోకి తీసుకుపోయి పీకల దాకా మదిర పోయిస్తే" నవ్వుతూ అడిగాడు మొదటి భటుడు.

నవ్వులమయమైపోయింది రెండో భటుడి వదనం. "మంచి ఆలోచన... మరింక ఆలస్యం అనవసరం" అంటూ అప్పటికప్పుడు పడమటి వీధికి నడిచాడు తన సహచరుడితో కలిసి.

❖ ❖ ❖

"అమ్మో... మా శ్రేష్ఠిగారికి మాత్రమే తెలిసిన విషయాల్ని ఇతరులకు తెలియచేయడం దుస్సాహసం... ఆయన చెవికి చేరితే నిలబెట్టి నరికేయిస్తాడు. ఉరి వేయించి ప్రాణాలు తీస్తాడు" భయంతో వణికిపోతున్నట్టు చేతులు జోడిస్తూ చెప్పాడు కనకయ్య శ్రేష్ఠి బొమ్మల దుకాణంలో పనిచేసే మధ్యవయస్కుడు ఒకతను.

దూరంగా వున్న పానశాల యజమానిని దగ్గరికి పిలిచి, కొయ్యతో చేయబడిన ఒక పాన పాత్ర నిండుగా మదిర తెప్పించి, మధ్య వయస్కుడి ముందుకు జరిపాడు మొదటి భటుడు.

"పనిచేసి చేసి నీకు అలసట అధికమై అనవసరమైన భయాలు కలుగుతున్నాయి. నువ్వు మాకు చెప్పే ఏ విషయాలు మాకు తప్ప మరో వ్యక్తికి తెలియదు... ముందు మదిర పుచ్చుకో" అని ఒత్తిడి చేశాడు.

రెండు క్షణికాలు తటపటాయించి కొయ్యపాత్రలో వున్న మదిరనంతా నాలుగే నాలుగు గుటకల్లో పుచ్చేసుకున్నాడు ఆ మధ్యవయస్కుడు.

బొమ్మల దుకాణంలో తను చేయవలసిన పనిని పూర్తిచేసుకొని, అతను తన ఇంటికి బయలుదేరుతుండగా- దారి మధ్యలోనే అటకాయించి, ఆ మాటలు ఈ మాటలు చెపుతూ పానశాల వద్దకు తీసుకువచ్చారు భటులు.

"మీ శ్రేష్ఠిని మించిన వారు ఈ రాజ్యంలోనే కాదు, ఈ చుట్టుపట్ల కూడా ఎవరూ లేరు" అన్నాడు రెండో భటుడు.

రెండవసారి నింపబడిన పానపాత్రను పైకి ఎత్తి పెదవులకు ఆనించుకుంటూ చిత్రంగా నవ్వాడు మధ్యవయస్కుడు.

"ఈ చుట్టుపట్ల అనేది సరైన మాట కాదు. శిఖావంతుడి సామ్రాజ్యంలో కూడా మా శ్రేష్ఠిని మించినవారు ఎవరూ లేరు. మీకు ఒక విషయం తెలుసా? తన ఉదరంలోకి పోయిన మదిర అదోరకమైన ఉత్సాహాన్ని కలిగిస్తుండగా అన్నాడు అతను.

"ఏ విషయం? ఎవరి గురించి?" కుతూహలంగా అడిగాడు మొదటి భటుడు.

"మీ విషయమే... ప్రచ్ఛన్న దేశాల్లోనూ దుకాణాలు తెరిచిన మా శ్రేష్ఠి మన సంపంగి నగరంలోకి మాత్రం ఇంతవరకూ అడుగుపెట్టలేదు..." చెప్పాడు ఆ వ్యక్తి.

ఒకరి మొఖం ఒకరు చూసుకున్నారు భటులు. వాణిజ్యంలో చక్రవర్తి వంటి కనకయ్య శ్రేష్ఠికి సంపంగి నగరంలో దుకాణం లేకపోవటమా?? విచిత్రంగా లేదూ?

"ఎందుకని? ఏదైనా కారణం వుందా?" ముందుకు వంగి రహస్యంగా అడిగాడు రెండో భటుడు.

"ఇది ఏమంత రహస్యమైన మాటేమీ కాదు. మా శ్రేష్ఠిగారు తయారు చేయించేవి దంతపు బొమ్మలు. ఆ దంతాలు ఏనుగు దంతాలు. సంపంగి నగరాధీశుడు సాగరుల వారికి ఏనుగులంటే మక్కువ అధికం. దంతపు బొమ్మల్ని చూసీ చూడగానే ఆయన ఆ దంతాలు ఎక్కడినించి వచ్చాయోనని విచారణ మొదలుపెడితే మొదటికే మోసం వస్తుంది. అవిగాక..." అంటూ ఆగాడు మధ్యవయస్కుడు.

"చెప్పు... త్వరగా చెప్పు" అంటూ తొందరచేశాడు మొదటి భటుడు.

"మన గూఢచారి దళానికి నాయకుడైన వాసుదేవుడిది సంపంగి నగరమే. అతను గనుక ఆరా తీయడం మొదలుపెడితే లేనిపోని చిక్కులు ఎదురు కావచ్చుని కూడా ఒక భయం" అన్నాడు అతను.

ఒకరి మొఖం ఒకరు మరోసారి చూసుకున్నారు భటులు ఇద్దరూ. పది క్షణికాల తర్వాత మెల్లగా తలవూపాడు రెండో భటుడు.

"శుశ్రుతుల వారనీ మన వాసుదేవుడి తర్వాత అంతటి శక్తియుక్తులు కలిగిన గూఢచారి... ఈ నగరంలోనే నివశిస్తూవుంటాడు" చిన్నగా మొదలు పెట్టాడు మొదటి భటుడు.

రెండవసారి కూడా పానపాత్రను పూర్తి చేసి మూడవసారి తాగేందుకు సిద్ధం అవుతున్నాడు మధ్య వయస్కుడు. కళ్ళను చిత్రవిచిత్రంగా తిప్పుతూ ఫక్కున నవ్వాడు.

"నవ్వటం దేనికి?" అడిగాడు ఆ భటుడు.

"ఇంకెక్కడి శుశ్రుతుడు... సంపంగి నగరంలో ఎవరినో పట్టుకోవటానికి మా శ్రేష్ఠిగారు పంపించిన జనంతో పాటు అతను కూడా సాగరుల వారికి పట్టుబడి కారాగారంలో చువ్వలు లెక్కిస్తున్నాడు. ఇంక ఈ జన్మలో బయటికి రాలేడు..." ముద్ద మాటలతో చెప్పాడు మధ్యవయస్కుడు.

గుభిల్లుమన్నాయి భటుల గుండెలు.

"కారాగారం లోనా? శ్రేష్ఠిగారు పంపిన జనాలతోనా? ఎలా? ఎందుకు?" అతని భుజంమీద చెయ్యి వేస్తూ సాదరంగా అడిగాడు.

మూడవ పాత్రలోని మదిరను రుచి చూస్తూ గొంతు తగ్గించాడు మధ్య వయస్కుడు.

"అందరికీ తెలిసిన విషయం. కాని చాలా రహస్యం... మా శ్రేష్ఠిగారు తయారుచేయించే దంతపు బొమ్మలకు కావల్సిన దంతాలు సంపంగి నగరం చుట్టుపట్ల నివశించే ఏనుగుల దగ్గిర్నించి సంగ్రహించేందుకు అక్కడికి పోయారు ఆయన పంపిన జనం. ఏం జరిగిందో ఎవరికీ సరిగ్గా తెలియదు. సాగరుల వారికి పట్టుబడిపోయారట వాళ్ళు. వారితో పాటు శుశ్రుతుల వారు కూడా బంధింపబడ్డారట" అన్నాడు. అక్కడితో ఆగలేదు.

"నిన్న సాయంత్రమే మాకు చేరిన వార్త ఇది. అది రహస్యమనీ బయటికి పొక్కితే పరిణామాలు చాలా తీవ్రంగా వుంటాయని శ్రీవాస్తి నగరం నుంచి శ్రేష్ఠిగారికి పంపించిన హెచ్చరిక కూడా నిన్ననే మాకు అందింది" చెప్పాడు.

"పట్టుబడిన మీ జనాన్ని విడిపించేందుకు కనకయ్య శ్రేష్ఠి ఎటువంటి ప్రయత్నాలు చెయ్యడం లేదా?" అడిగాడు రెండవ భటుడు.

"కన్నంలో తేలుకుట్టిన దొంగ... కదలలేడు మెదలలేడు. పెద్దగా మొత్తుకోలేడు పాపం... ఏం చేయాలో తోచక గుంజాట పడిపోతూ వుండి వుంటాడు" అన్నాడు మధ్యవయస్కుడు.

"చక్రవర్తికి చాలా బాగా కావల్సినవాడు కదా... వచ్చి వారికి విన్నవించుకోవచ్చు కదా..." మాటలు అందించాడు మొదటి భటుడు.

"ఎవరిమీద ఎటువంటి మాటలు చెప్పినా మౌనంగా విని తల వూపుతాడు మహాబల చక్రవర్తి. రూపంలో సింహమే గాని, స్వభావంలో గంగిగోవు. సాగరుల వారి విషయంలో మాత్రం ఆ పప్పులు ఉడకవు. సాక్షాత్తూ దేవుడే స్వయంగా వచ్చి చెప్పినా ఆయన పట్టించుకోడు" అన్నాడు మధ్యవయస్కుడు.

కనకయ్య శ్రేష్ఠి దగ్గర పనిచేసే సేవకులకు ఎక్కడ ఏది జరిగినా వెంటనే తెలిసిపోతుందని మొదటి భటుడు ఎందుకు చెప్పాడో అప్పుడు అవగతం అయింది రెండో భటుడికి.

కాచి వడబోసిన మాటలు అవి... చక్రవర్తి స్వభావాన్ని గురించి, ఆయన కొలువులో వున్నవారికి సైతం పూర్తిగా తెలియనటువంటివి.

అటువంటి పరివారాన్ని కలిగివున్నాడు కాబట్టే చక్రవర్తికి అంతరంగికుడు అయ్యాడు కనకయ్య శ్రేష్ఠి.

ఎక్కడో వున్న సంపంగి నగరంలో జరిగిన సంఘటనలు ఇంకా చక్రవర్తికి చేరలేదు. కనకయ్య శ్రేష్ఠి పరివారంలో వున్న అందరికీ పూర్తి వివరాలతో తెలిసిపోయినాయి.

"ఇప్పటివరకూ మనకు తెలిసిన వివరాలు ఇక చాలు" మొదటి భటుడి చెవిలో ఊదాడు అతను.

మూడవ పాత్రను ముగించి, కళ్ళను చిత్రవిచిత్రంగా మూసి తెరుస్తూ వున్నట్లుండి తను కూర్చున్న చెక్కబల్ల మీదినించి జారి క్రిందపడిపోయాడు మధ్యవయస్కుడు.

వెంటనే దగ్గరికి వచ్చిన పానశాల యజమాని వంక కృతజ్ఞతా పూర్వకంగా చూశాడు మొదటి భటుడు.

"నువ్వు చేసిన సహాయం సామాన్యమైందికాదు. మేము మా మహామంత్రి గుణధాముల వారికి నీ గురించి చెపుతాము" అన్నాడు తన దట్టీలో నుంచి మూడు నాణేలను తీసి అతనికి అందిస్తూ.

"చక్రవర్తి మహాబలుల వారంటే మాకు తగని అభిమానం. ఆయనకు సంబంధించిన ఏ పనైనా సరే మేము సంతోషంగా చేస్తాము. తెలివి తప్పి పడిపోయిన ఇతన్ని పానశాల వెనుక పడుకోబెట్టి తెలివి రాగానే రెండు తిట్లు తిట్టి ఇంటికి పంపిస్తాను. మీరు వేరే ఆలోచనలు చేయాల్సిన అవసరం లేదు. వెళ్ళిరండి" వినయంగా చెప్పాడు అతను.

❖ ❖ ❖

"శుశ్రుతుడు సంపంగి నగర చెరసాలలో వున్నాడా? మరి చారులతాదేవి తన బిడ్డడిగా భావిస్తున్న ఆ శివుడి సమాచారం ఏమిటి?" తన భటులు చెప్పినదంతా సావకాశంగా విన్న తరువాత సూటిగా అడిగాడు గుణధాముడు.

"అవకాశం లభించలేదు ప్రభూ... అప్పటికే అతనికి మత్తు అధికం అయిపోయింది. తెలివితప్పి పడిపోయాడు..." చెప్పాడు మొదటి భటుడు.

ఇరువది క్షణికాల పాటు తీవ్రంగా ఆలోచించాడు గుణధాముడు. "చక్రవర్తిని వదిలి నేను సంపంగి నగరం వెళ్ళటం అసంభవం. నా బదులు మీరిద్దరు అక్కడికి పోయి పూర్తి వివరాలను నాకు అందించాలి. అందించగలరా?" అని అడిగాడు.

"ఆజ్ఞ ప్రభూ... తప్పకుండా ప్రయత్నం చేస్తాము..." ఏకకంఠంతో సమాధానం ఇచ్చారు ఆ భటులు.

ద్వారం దగ్గర వున్న మరో భటుడిని పిలిచి ఒక చిన్న మూట నిండుగా వెండినాణేలను తెప్పించి వారికి ఇచ్చాడు గుణధాముడు.

"కనకయ్య శ్రేష్ఠి సేవకుల మాదిరి మదిర పానం చేసి మన విషయాలను మరొకరికి తెలియచేస్తే పరిణామాలు చాలా తీవ్రంగా వుంటాయి. అర్థం అయిందా?" అని హెచ్చరించాడు.

వినయంగా తలలు వూపారు వాళ్ళు. భవనం వెలుపలికి వచ్చి, సిద్ధంగా వున్న అశ్వాలను అధిరోహించారు. నగర ద్వారాలను అధిగమించే వరకూ నెమ్మదిగా నడిపించి ఆ పైన వేగంగా పరుగులు తీయించారు.

❖ ❖ ❖

పూసలపేర్లు, పగడపు దండలు, ముత్యాల మాదిరి మెరిసిపోతున్న రకరకాల గవ్వలు, పది వెదురు గొట్టాల నిండుగా రుచికరమైన పుట్ట తేనె మిగల పండిన పనస తొనలు... ఎనిమిది ఎలుగుబంటి చర్మాలు, పొడవాటి బరిశె, బలమైన విల్లు, నిండుగా వున్న అమ్ములపొది... పెద్ద చర్మపు వస్త్రంలో మూటగా కట్టి జ్వాలకు కట్నంగా ఇచ్చాడు గూడెం నాయకుడు.

"మాకు తెలిసినంతవరకు మా గూడెం చరిత్రలో మకర దేవతలకు ప్రియమైన వారెవరూ నదిని దాటి ఈవలికి రాలేదు. నీటిలో నిలబడిన వెంటనే పిచ్చికని పాము పట్టినట్టు కటుక్కున నోట కరుచుకుని దూరంగా లాక్కుపోయే దేవతలు రెండుసార్లు నిన్ను చూసి దూరంగా తప్పుకున్నాయి. నువ్వు మాకు శత్రువు కాదని నిర్ధారించాయి. మన స్నేహం కలకాలం వర్ధిల్లాలని మా కోరిక" రచ్చబండ దగ్గర నిలబడి ఊపిరి కూడా తీసుకోకుండా పెద్ద ఉపన్యాసం ఇచ్చాడు.

అతను అతని గూడెం వాసులు ఎంతటి కర్కోటకులో జ్వాలకి తెలుసు. అయినాసరే అతని మాటలకు చలించిపోయిందామె.

"ప్రమాణం చేస్తున్నాను... మీరు మాకు స్నేహితులు. మా నాగరికులు ఎవరూ మీ జోలికి రారని, నేను రానీయనని గట్టిగా ప్రమాణం చేస్తున్నా" అన్నది ఆవేశంగా.

"తల్లీ... నవ్వులాటలకు కూడా అనకూడని మాటలు అంటున్నావు. నువ్వు కాబోయే మహారాణివి. రేపు ఎప్పుడయినా అవసరం అయితే వాళ్లమీదికి సైన్యాలను తీసుకురావాల్సి వుంటుంది. ఇటువంటి ప్రమాణాలుచేస్తే ఆ తరువాత బాధపడాల్సి వస్తుంది" ఆందోళనగా అంటూ ఆమెను ఆపటానికి ప్రయత్నం చేశాడు వాసుదేవుడు.

"అయినా సరే... మాట ఇచ్చేశాను. మాట తప్పటం ఎలాగో నా తండ్రి నాకు నేర్పించలేదు" మొండిగా అన్నది జ్వాల.

"అదికాదు తల్లీ... అసలు వాళ్ళు..." అంటూ ఇంకా ఏదో చెప్పబోయిన అతనికేసి చాలా విసురుగా చూసిందామె.

ఆమె నోరు తెరువకముందే తను కల్పించుకున్నాడు అంతవరకూ మౌనంగా వున్న శివుడు. "మనలో మనం కొట్లాడుకుని ఈమె కాబోయే మహారాణి అని వాళ్ళకు తెలియచేయడం ప్రమాదకరం. ఈ సంభాషణను ఆపేయటం ఉత్తమం" అన్నాడు గబగబా.

వాసుదేవుడితో ఏదో కోపంగా మాట్లాడబోతున్న జ్వాల వెంటనే అదుముకున్నది తన నోటిని. తను చెప్పబోయిన మాటను తనలోనే ఆపుకున్నాడు వాసుదేవుడు.

"మకర దేవతలకి ఈ కూన అంటే ఇష్టమే అయినా, మీరిద్దరూ పరాయి వాళ్ళే. అవి మందలు మందలుగా నదిలో తేలుతున్నప్పుడు మీ ఏనుగులతో నదిని దాటిపోవటం చాలా కష్టం. ఏం చేయదలుచుకున్నారు?" అడిగాడు నాయకుడు.

అటువంటి ప్రమాదం ఏదో ఒకటి తప్పకుండా ఎదురౌతుందని ఊహిస్తూనే వున్నాడు శివుడు. వెనుకంజ వేయటానికి వీలులేదు. పిరికితనంగా భావించబడుతుంది. తెగించి నదిలో దిగితే తమ జోలికి రాకపోయినా ఏనుగుల వెంట అని పడక మానవు.

సమాధానం లభించని ఆ ప్రశ్నతో సతమతం అవుతూ వాసుదేవుడి కేసి చూశాడు అతను.

"ఇప్పటికిప్పుడు వాళ్ళు చూస్తుండగా ఇక్కడే నదిని అధిగమించాలన్న నియమం ఏమీలేదు. దిగువకు పోదాం... నది సన్నబడి వేగం తగ్గిన చోటనో, మధ్య మధ్యలో బండరాళ్ళు పైకి కనిపించే ప్రదేశంలోనో అవతలికి పోవచ్చును" చిన్న కంఠంతో చెప్పాడు వాసుదేవుడు.

బాగా నచ్చాయి ఆ మాటలు శివుడికి. క్షణికం పాటు కూడా ఆలస్యం చేయకుండా, నాయకుడు జ్వాలకు బహూకరించిన మూటను ఆడ ఏనుగుమీదికి ఎక్కించి, జ్వాలను కూడా కూర్చోబెట్టాడు. ఆమెకు వెనుకగా వాసుదేవుడిని ఎక్కమని చెప్పి, తను మగ ఏనుగుపైకి ఎగబ్రాకాడు.

గూడెంలోని చిన్నా పెద్దా అందరూ గుంపుగా నిలబడి చేతులు ఊపుతుండగా కదిలి, నది దిగువకు బయలుదేరాయి ఏనుగులు.

గూడెం పొలిమేరలు దాటి దూరంగా పోయేసరికి ఊపిరి బిగపట్టి కూర్చున్న జ్వాల, ఆ తరువాత తేలికగా నిట్టూర్చింది.

"ఇంత తేలికగా ఆ రాక్షసుల మధ్యలో నుంచి బయటపడగలమని అనుకోలేదు. నా జీవితంలో మరిచిపోలేని అనుభవం ఇది" అన్నది ఆమె వాసుదేవుడితో.

అడ్డం వచ్చిన చెట్లకొమ్మలను తన తొండంతో విరిచిపారేస్తూ వేగంగా ముందు నడుస్తున్న మగ ఏనుగు వంకా, దాన్ని నడిపిస్తున్న శివుడి వంకా చూసి చిన్నగా నవ్వాడు వాసుదేవుడు.

"నువ్వే కాదు తల్లీ... నేను కూడా నా జీవితంలో ఎప్పుడయినా ఈ నదిని అధిగమించి ఇవతలివైపుకు వస్తానని అనుకోలేదు. అంతా ఆ శివుడి మూలంగా జరిగింది" అన్నాడు.

తన గురించి జరుగుతున్న సంభాషణ శివుడికి వినిపించలేదు. అసలు అతని దృష్టి వెనక భాగంలో లేదు. సుడులు తిరుగుతూ ప్రవహిస్తున్న సువర్ణానది మీదనే వుంది.

సాయం సమయమై, మరో అర్థఘడియకు చీకట్లు అడవిని చుట్టు ముడతాయనగా- ఉన్నట్లుండి పలుచబడింది వారు ప్రయాణం చేస్తున్న అడవి మార్గం. దట్టమైన చెట్లు, పొదల స్థానంలో పెద్ద పెద్ద రాతిబండలు కనిపించడం మొదలుపెట్టాయి.

మగ ఏనుగు కుంభస్తలం వెనుక కూర్చున్నవాడు కాస్తా నిఠారుగా నిలబడి తదేక దీక్షగా నదివంక చూశాడు శివుడు. రెండు నిమిషాల అనంతరం ఆగిపొమ్మన్నట్టు ఏనుగులకు సైగ చేశాడు.

సుశిక్షితమైన యుద్ధ గజాల మాదిరి చటుక్కున ఆగిపోయాయి పెద్దవి రెండు. తొండాన్ని గాలిలో ఊపుతూ గున్న మాత్రం తన నడకను కొనసాగించింది.

అంతెత్తున వున్న మగ ఏనుగు మీదినుంచి అమాంతం క్రిందికి దూకి నాలుగు అంగల్లో దాన్ని చేరుకున్నాడు శివుడు.

"నువ్వేమైనా పెద్ద తెలివిగలదానివా? ఆగమని సైగ చేస్తే ఆగిపోవడం చేతకాదా?" కోపంగా అంటూ దాని తొండాన్ని పట్టుకుని వెనక్కి లాగటానికి ప్రయత్నం చేశాడు.

కీచుగా శబ్దం చేసింది గున్న. తన తొండం తెగిపోతున్నట్లు చిందులు తొక్కి అతన్ని తలతో బలంగా వెనక్కి నెట్టింది.

పడిపోకుండా వుండటానికి ఎంత ప్రయత్నం చేసినా, కాలు నిలుపుకోవటం చేతకాలేదు శివుడికి. వెల్లకిలా పడిపోయాడు.

ఆడ ఏనుగు మీద కూర్చుని వున్న వాసుదేవుడు, జ్వాల ఇద్దరూ చూస్తూనే వున్నారు ఆశ్చర్యంగా.

"అయ్యయ్యో... దెబ్బ తగిలిందేమో..." అంటూ దిగబోయింది జ్వాల.

ఆమె పూర్తిగా కదలకముందే పరిగెత్తుతున్నంత వేగంగా నడిచింది ఆడ ఏనుగు. గున్నను సమీపించి తొండంతో దాని నడుము మీద చాచిపెట్టి కొట్టింది. వెనుక కాళ్ళకు తొండాన్ని చుట్టి ముళ్ళకంపను ఈడ్చినట్లు బరబరా వెనక్కి ఈడ్చింది.

మగ ఏనుగు కూడా కదిలింది. పడిపోయిన శివుడి మొఖాన్ని తొండంతో స్పృశించి, అతన్ని నెమ్మదిగా లేపి నిలబెట్టింది.

"నా ఊహ యదార్థం బాబయ్యగారూ... గజాల్ని ఇంతగా మచ్చిక చేసుకోగల మనిషి ఇంతవరకూ పుట్టినట్టు నేను వినలేదు. బహుశా వినను కూడా..." వాసుదేవుడిని చూస్తూ చెప్పింది జ్వాల.

చిరునవ్వు నవ్వి తల ఊపవలసిన వాసుదేవుడు ఆ పనులు చేయలేదు. ముఖ్యమైన విషయం ఏదో అప్పుడే గుర్తుకు వచ్చినట్లు ఆకాశంలోకి చూస్తూ ఏదో ఆలోచనలో మునిగిపోయాడు.

"ఏమిటి బాబయ్యగారూ... ఏమయింది మీకు?" ఆశ్చర్యంగా అడిగింది జ్వాల.

"పదునెనిమిది ఇరవై సంవత్సరాల క్రితం చక్రవర్తి మంచి పరువ ప్రాయంలో వుండగా మనకి మొట్టమొదటిసారిగా శిఖావంతుడితో విరోధం పెరిగి యుద్ధం అనివార్యం అయింది. అప్పటికి సాగరుడు ఇంకా సంపంగి నగరానికి పాలకుడు కాలేదు. గజదళాన్ని నడిపించటంలో కూడా అతనికి

ఏమంత పట్టు లేదు. ఆ యుద్ధం కేవలం అతని భుజబలం, చక్రవర్తి సామర్థ్యం మీదనే నడిచింది. సంవత్సర కాలం గడిచిన తర్వాత మనకి విజయం లభించింది" అరమూసిన కనులతో చెప్పుకుంటూ పోయాడు వాసుదేవుడు.

"యుద్ధం జరిగినంత కాలం సుశిక్షితులైన సైనికులతో సాగరుడు శిఖావంతుడి సామ్రాజ్యానికి సమీపంలో వున్న నల్లరాతి గుట్టల్లోనే తన స్థావరాన్ని ఏర్పాటు చేసుకున్నాడు. యుద్ధం పూర్తి అయిన తర్వాత సంపంగి నగర పాలకుడిగా మారిన తర్వాత వున్నట్లుండి అతను గజ దళాన్ని నడిపించటంలో సాటిలేని మేటిగా పేరు తెచ్చుకున్నాడు."

"అంటే మీ ఉద్దేశం ఏమిటి బాబయ్యగారూ?" కుతూహలంగా అడిగింది జ్వాల.

"యుద్ధ స్థావరంలో వుండగా సాగరుల వారికి గజ యుద్ధం ఎలా చెయ్యాలో తెలిసింది. అంటే ఆ విద్యను అతను ఎవరి దగ్గరో అభ్యసించాడు."

"ఎవరై వుంటారు?"

"ఎవరైనా అయి వుండవచ్చు."

"సాగరులవారిని అడిగితే?"

"యుద్ధ రహస్యం... పొరపాటునకూడా పెదవి విప్పడు."

"మరి ఈ అనుమానం ఎలా తీరుతుంది?"

"అదే ఇప్పుడు మన ఎదుట వున్న సమస్య."

"అసలు ఈ ఆలోచన ఇంత హఠాత్తుగా మీకు ఎందుకు వచ్చింది?" నొసలు విరుస్తూ సూటిగా అడిగింది జ్వాల.

"ఆ శివుడు క్రిందపడిపోగానే తమ బిడ్డ పడిపోయినట్టుగా భావించిన ఆ ఏనుగుల్ని చూస్తే ఎందుకో గుర్తుకు వచ్చింది."

"ఇంకా ఇటువంటివి ఏమైనా గుర్తుకు వస్తాయేమో బాగా ఆలోచించండి. ఈ శివుడిని గురించి మనకి పూర్తిగా తెలియాలి" అంటూ ఏనుగు మీదినించి క్రిందికి దూకి శివుడి దగ్గరికి పోయింది జ్వాల. "మనం ఎందుకు ఆగిపోయాం?"అని అడిగింది.

నది అవతల నిట్టనిలువుగా వున్న కొన్ని కొండగుట్టల్ని ఆమెకు చూపించాడు శివుడు.

"అవి ఏమిటో తెలుసా?" అని అడిగాడు.

తనుకూడా ఏనుగు మీదినించి దిగి వారిద్దరితోను కలిశాడు వాసుదేవుడు.

"అవేమిటో నాకు తెలుసు. నీకు తెలిసిందేమిటో ముందుగా చెప్పు" అన్నాడు.

"శిఖావంతుడి సామ్రాజ్యానికి మన రాజ్యానికి మధ్యన వున్న నల్లరాతి గుట్టలు... మన సామ్రాజ్యపు సరిహద్దుల గురించి మా ఆచార్యుల వారు మాకు బోధిస్తూ, ఒక పటం గీసి చూపించారు. ఆ పటంలో గుర్తుపెట్టబడిన గుట్టలే అవి" అన్నాడు శివుడు.

శిఖావంతుడి సైన్యంతో యుద్ధం చేస్తూ ఒక సంవత్సరం పాటు సాగరుల వారు స్థావరం ఏర్పాటు చేసుకున్న కొండగుట్టలు అవేనన్న అనుమానం వెంటనే జ్వాలకి కలిగింది. అర్ధనిమీలిత నేత్రాలతో ప్రశ్నార్థకంగా చూసిందామె వాసుదేవుడి కేసి.

"నీ అనుమానం యదార్థమే తల్లీ... అయితే ఇప్పుడు వాటిని గురించి మాట్లాడుకోవాల్సిన అవసరం ఏమిటో నాకు అంతుబట్టలేదు" అన్నాడు వాసుదేవుడు.

"మనం మన భూభాగంలో నుంచి శిఖావంతుడి రాజ్యంలోకి ప్రవేశించ బోతున్నామని చెపుతున్నట్లుంది. అంతేనా శివుడు?" అడిగిది జ్వాల.

తల వూపి వెంటనే అవునని చెప్పాల్సిన శివుడు తలను అడ్డంగా తిప్పి వెంటనే విభేదించాడు.

"నేను అటుకేసి చూస్తుండగా ఆ గుట్టమీద ఏదో తళుక్కున మెరిసింది. సూర్యుడి కిరణాలు పడితే తళుకు తళుకుమనే వస్తువు ఏదో అక్కడ వున్నది" సాలోచనగా చెప్పాడు.

నరమానవుడు ఎవరూ కనిపించని ఆ ప్రదేశంలోకి తళుకుమనే వస్తువులు తమంతట తాముగా నడిచి రావని వెంటనే అనిపించింది వాసుదేవుడికి.

కవచ శిరస్త్రాణాలు లోహంతో తయారుచేయబడతాయి. వాటిని ధరించిన వారు ఎవరైనా ఎండలో నిలబడితే తప్పకుండా తళుకులు ప్రత్యక్షం అవుతాయి.

జ్వలిత సామ్రాజ్యం మీద దండయాత్ర చేయటానికి సిద్ధంగా వున్న శిఖావంతుడు తన సైన్యాన్ని ఆ గుట్టల దగ్గరికి చేర్చాడా? గతంలో అక్కడ

స్థావరాన్ని ఏర్పాటు చేసుకుని తనను చావుదెబ్బ కొట్టిన సాగరుల వారి మాదిరిగా తానుకూడా ఏదైనా చేయదలుచుకున్నాడా??

పూర్తి కాలేదు వాసుదేవుడి ఆలోచనలు. తల్లి తనమీద తిరగబడేసరికి ఉక్రోషం ముంచుకు వచ్చింది కాబోలు... దూరంగా వెళ్ళిపోయింది గున్న. బండరాళ్ళను దాటి నది ఒడ్డున నిలబడింది.

పది నిమిషాలు గడిచిన తర్వాత కూడా అది తిరిగి వెనక్కి రాకపోయేసరికి అధికం అయిపోయింది శివుడి ఆత్రుత.

"చిన్నపిల్ల... తెలిసో తెలియకో ఏదో చేస్తే నెమ్మదిగా నచ్చచెప్పటానికి బదులు చావకొట్టి చెవులు మూయటం తప్పు..." ఆడ ఏనుగుతో చెపుతూ తనుకూడా నది ఒడ్డుకు పోయాడు.

పోయిన రెండే రెండు నిమిషాల్లో వేగంగా వెనక్కి పరిగెత్తుకు వచ్చి, "రండి... ఒకసారి నది ఒడ్డుకు రండి... త్వరగా" అని వాసుదేవుడికి చెప్పాడు. అతని కంఠంలోని అదోరకమైన మార్పును గమనించి, ఎదురు ప్రశ్నలు వేయకుండా నదిఒడ్డుకు పరిగెత్తాడు వాసుదేవుడు. వెనుకే వెళ్ళింది జ్వాల. ఆమె వెనుక కదిలాయి పెద్ద ఏనుగులు.

"ఏముంది శివుడు? ఏముంది ఇక్కడ? శత్రువులు ఎవరైనా నీకు కనిపించారా?" నిర్మానుష్యంగా వున్న ఆ పరిసరాల వంక పరీక్షగా చూస్తూ అడిగాడు శివుడిని వాసుదేవుడు.

మాటలతో సమాధానం చెప్పలేదు శివుడు. నదిలోని నీటివంక చూడమని చేత్తో సైగ చేశాడు.

క్షణక్షణానికీ అధికం అయిపోతున్న కుతూహలాన్ని అదిమి పట్టుకోవటం అసాధ్యం అయిపోతూ వుండగా, మూడు అడుగులు ముందుకు వేసి మరీ పరీక్షగా చూశాడు నదివంక వాసుదేవుడు.

నల్లరాతి గుట్టల్ని సమీపిస్తున్నందు వల్లనో, ఏమో గాని సన్నబడింది సువర్ణానది. వెడల్పుగా వున్నప్పటికంటె సన్నబడినప్పుడు దాని వేగం దాదాపు రెట్టింపు అయినట్లు కనిపిస్తోంది.

నురుగులు ప్రత్యక్షం అవుతున్నాయి. నది నీరు, ఒడ్డున వున్న బండరాళ్ళని తాకినప్పుడు సుడులు తిరుగుతున్నాయి.

తెలిసో తెలియకో ఎవరైనా నీటిలోకి అడుగుపెడితే ఆ వేగాన్ని తట్టుకోవటం అసాధ్యమై, తల్లక్రిందులు అయిపోతారు చిటికెలో... సుడులు తిరుగుతున్న నీటిలో మునిగి ప్రాణాలు పోగొట్టుకుంటారు.

అటువంటి ప్రమాదకరమైన ప్రదేశంలో, నదిని అధిగమించే వారికి ఎటువంటి హాని జరగకుండా బలమైన రాతిబండలతో సన్నపాటి వారధి ఒకటి నిర్మించబడి వున్నది అక్కడ.

తల్లిమీద అలిగిన ఏనుగు గున్న సరిగ్గా ఆ వంతెన దగ్గరే నిలబడి వున్నది. శివుడు అక్కడికి రావటం మరో పది క్షణికాలు ఆలస్యం అయివుంటే అది ఆ వంతెన మీదుగా అవతలి పక్కకు వెళ్ళిపోయేది.

"అసాధ్యం ఇది. నమ్మటానికి వీలు కానటువంటిది. వందా రెండు వందల మంది పనివాళ్లు కనీసం ఒక సంవత్సరం పాటు కఠోర దీక్షతో పనిచేస్తే తప్ప ఈ వంతెనను నిర్మించలేరు. ఒట్టి సమయమే కాదు... బోలెడంత ధనం కూడా వెచ్చించాలి..." గుండెల మీద చెయ్యి వేసుకోకపోయినా, వేసుకున్నంతగా ఆశ్చర్యపడుతూ అన్నాడు వాసుదేవుడు.

"ఎందుకూ పనికిరాని ఈ ప్రదేశంలో ఈ వంతెనను నిర్మించాల్సిన అవసరం ఎవరికి వుంది? ఎవరు దీని నిర్మాతలు?" తను కూడా అడిగింది జ్వాల ఆశ్చర్యంగానే.

"నాకు తెలిసి చక్రవర్తికి ఇటువంటి ఆలోచన లేదు. సాగరుల వారికి అంతకన్నా లేదు" అన్నాడు వాసుదేవుడు.

"ఉంటే, గింటే శిఖావంతుడికే వుంటుంది... నన్ను అడిగితే శిఖావంతుడే ఈ పని చేయించి వుంటాడు" వున్నట్లుండి అన్నాడు శివుడు.

ఉలిక్కిపడినట్లు అయి, అంతలోనే సర్దుకున్నాడు వాసుదేవుడు. "ఎందుకని నీకు అలా అనిపించింది?" అని అడిగాడు అతన్ని సూటిగా చూస్తూ.

"అందరూ చూస్తుండగా మన సరిహద్దుల్ని అధిగమిస్తే పరాభవం తప్పదని శిఖావంతుడికి తెలుసు. అందులోను సంపంగి నగరానికి చెందిన భూభాగం లోకి వచ్చిన వెంటనే సాగరుల వారు తమ గజదళంతో అతన్ని చావకొట్టి చెవులు మూయిస్తారు" అన్నాడు శివుడు.

"ఇప్పుడు ఈ వంతెన సంపంగి నగరానికి చెందిన అడవికి దగ్గర్లోనే నిర్మించబడిన సంగతి మర్చిపోయావా?" అడిగింది జ్వాల.

"మర్చిపోలేదు. కాని ఇది సాగరుల వారిని మోసగించేందుకే తయారు చేయబడిందని నా ఉద్దేశ్యం" అన్నాడు శివుడు.

"ఎలా? ఏ విధంగా?" మరింత ఆశ్చర్యంగా అడిగాడు వాసుదేవుడు.

"నల్లరాతి గుట్టల్ని అధిగమించి శిఖావంతుడు సూటిగా సంపంగి నగరం కేసి సైన్యాలను నడిపిస్తే అడవి గ్రామాల్లో ఆందోళన అధికమై, ఆ వార్త వెంటనే సాగరుల వారికి చేరుతుంది. ఆయన తన గజసైన్యంతో మెరుపులా వచ్చి శిఖావంతుడిని ఎదుర్కొంటాడు."

"సంపంగి నగరంలోని పసిబిడ్డల్నే కాదు జ్వలిత సామ్రాజ్యంలో అప్పుడే పుట్టిన పురిటి కందుల్ని అడిగినా ఈ మాటే చెపుతారు. అందరికీ తెలిసిన వాటినే నువ్వు చెపుతున్నావు. కొత్తది ఏమీ చెప్పడం లేదు" ఒకింత వెక్కిరింపుగా అన్నాడు వెంటనే వాసుదేవుడు.

శివుడు ఆ మాటలకు చిన్నబుచ్చుకుంటాడని భావించింది జ్వాల. కాని అలా జరగలేదు.

"ఈ వంతెన మీదుగా నదిని దాటి, ఈ ప్రదేశంలో నివశించే ఆటవికుల్ని భయపెట్టో, భ్రమపెట్టో తన సైన్యాల్ని నది ఒడ్డునే సంపంగి నగరం దాకా తీసుకువచ్చి, నాటు పడవల సాయంతోనో, అడవి బాదులతో చేసిన తెప్పల సహాయంతోనో సైన్యాన్ని నదిని దాటిస్తే?" అడిగాడు అతను.

వెక్కిరింపుగా మాట్లాడిన వాసుదేవుడి మొఖంలో వెంటనే మారిపోయాయి రంగులు.

"నిజమే సుమా! నదికి ఆవల చీమ కదిలినా వెంటనే తెలిసిపోతుంది సాగరుల వారికి. ఈవల భూకంపం వచ్చినా కొంచెంగా కూడా తెలియదు. తెలిసే సమయానికి శిఖావంతుడి సైన్యం సంపంగి నగరం చుట్టూ ఈగలు మూగినట్టు మూగిపోతుంది" ఇప్పుడు నిజంగానే గుండెలమీద చెయ్యి వేసుకుంటూ అన్నాడు.

"ఒకేసారి కోటలో నుంచి బయటికిరాలేవు సాగరుల వారి ఏనుగులు. ఒక దాని వెనుక ఒకటిగా ద్వారాన్ని దాటాలి. సిద్ధంగా వున్న శిఖావంతుడి

సైన్యానికి ఒకటొకటిగా వచ్చే ఏనుగుల్ని వధించటం ఏమంత కష్టం కాదు. సంపంగి నగరం నాశనం అయితే జ్వలిత సామ్రాజ్యానికి చేటు కాలం మూడినట్లే!" ఆ తరువాత జరగబోయేది ఏమిటో ఊహిస్తూ అస్పష్టంగా అన్నది జ్వాల.

"ఇంతదూరం ఆలోచించటం నీకు ఎలా సాధ్యపడిందిరా శివుడు? ఎవరు నేర్పారు ఈ విషయాల్ని?" శివుడి వంక ఆప్యాయంగా చూస్తూ అడిగాడు వాసుదేవుడు.

"మన గజసైన్యాన్ని నాశనం చేసేందుకు మొదట్లో కొద్దిమందిని మాత్రమే పంపాడు శిఖావంతుడు. తర్వాత చాలామందిని పంపకం చేశాడు. వారి వల్ల తన పథకం విజయవంతం అవుతుందని అతను భావించలేదు. తను ఇక్కడ ఈ వంతెనను నిర్మిస్తున్నట్టు ఎవరికీ తెలియకుండా వుండేందుకే అలా చేశాడు. మనల్ని పక్కదారి పట్టించటమే అతని ఉద్దేశ్యం" అన్నాడు శివుడు.

"అదేరా నేనూ అడుగుతోంది. ఈ పద్ధతిలో ఆలోచించడం నీకు ఎవరు నేర్పారు? మీకు విద్యాబోధన చేసిన ఆచార్యుల వారా?" మళ్ళీ రెట్టించాడు వాసుదేవుడు.

సన్నపాటి వెదురుచువ్వతో అవకాశం దొరికిన ప్రతిసారీ తన వీపు వాచి పోయేటట్లు కొట్టే అయ్యవారి మొఖం కనులముందు మెదిలింది శివుడికి. అతనికి తెలియకుండానే పెదవుల మీదికి పరిగెత్తుకు వచ్చింది ఒక చిరునవ్వు.

"మా అయ్యవారికి అన్నీ తెలుసు ఒక్క యుద్ధం చెయ్యటం తప్ప. ఆయన ప్రత్యేకంగా పనికట్టుకుని ఏదీ మాకు చెప్పలేదు. ఉద్యానవన ద్వారం దగ్గర కాపలా వుండే వృద్ధ భటుడే గతంలో జరిగిన యుద్ధం గురించి, వాటిలో సాగరుల వారు చూపించిన సాహసాన్ని గురించి కథలు చెపుతూ వుండేవాడు" అన్నాడతను.

చటుక్కున వాసుదేవుడి కేసి తిరిగింది జ్వాల. "గుర్తుపెట్టుకోండి బాబయ్యగారు! మనం సంపంగి నగరానికి చేరుకోగానే ఆ వృద్ధ భటుడిని సన్మానించాలి. సాగరుల వారు అంగీకరిస్తే అతన్ని నాతోపాటుగా రాజధానికి తీసుకుపోయి, నేనుకూడా అతను చెప్పే కథల్ని వినాలని అనుకుంటున్నాను" అన్నది.

"నువ్వు కావాలని అనుకుంటే ఏపనైనా వెంటనే జరిగిపోతుంది. అలాగే చేద్దాం... ముందు మనం ఇక్కడి సమస్యను పరిష్కరించుకోవాలి" అని ఆమెకు చెప్పి శివుడి కేసి తిరిగాడు వాసుదేవుడు.

"ఇప్పుడు ఏం చేస్తే బాగుంటుందని నీ ఉద్దేశ్యం?" అని అడిగాడు.

తడుముకోలేదు శివుడు... కొంచెంగా కూడా ఆలోచించలేదు. "గుట్టల మీదినించి నాకు కనిపించిన మెరుపు ఏమిటో తెలుసుకోవాలి. అది చాలా ముఖ్యం" అన్నాడు.

అనటంతో ఆగలేదతను. ప్రశాంతంగా నిలువబడివున్న తన ఏనుగుల కేసి చేయి వూపి, వంతెన మీదుగా నడవటం మొదలుపెట్టాడు.

ఎగుడు దిగుడుగా పేర్చి వున్న బండరాళ్ళు తమ బరువును భరించగలవో లేవో, పాదాలతో అదిమి నిర్ధారించుకుంటూ అతని వెనుకే బయలుదేరాయి ఏనుగులు. వాటి వెనుకగా తాముకూడా నదిని అధిగమించారు జ్వాల, వాసుదేవులు.

ఆ ప్రదేశంలో కనిపిస్తున్న నీటివేగాన్ని చూసి, దూరదూరంగా తిరుగుతున్నాయి ఆటవికులు మకర దేవతలుగా పిలుచుకునే మొసళ్ళు. వంతెన మీదినించి ఎవరైనా నీటిలో పడితే ఆరగించేందుకు ఆత్రంగా ముందుకు వచ్చాయి.

❖ ❖ ❖

తమ సేనాపతి చెప్పిన గుర్తుల ఆధారంగా ముందు శిఖావంతుడి సైన్యం మొసళ్ళకు ఆహారం అయిపోయిన ప్రదేశాన్ని చేరుకున్నాడు సాగరుడు తన మంత్రి మహేశ్వరుడితో కలిసి.

భరించరాని దుర్వాసనతో నిండి వున్నదా ప్రదేశం. మొసళ్ళు ఆరగించగా మిగిలిన బొమికల కోసం అడవిలోని క్షుద్ర ప్రాణులు అమితంగా సంచరించడం వల్ల చిరాకుగా తయారయి వున్నది.

మందపాటి వస్త్రాన్ని నాశికా రంధ్రాలకు అడ్డుగా పెట్టుకుని అడుగు అడుగు చొప్పున ఆ ప్రదేశమంతా కలియతిరిగాడు సాగరుడు.

అంత గడబిడ గందరగోళం జరిగిన తర్వాత కూడా అతనికి కనిపించాయి పూనకం వచ్చినట్టు చెలరేగి, ఆ ప్రదేశంలో యుద్ధం చేసిన ఏనుగుల పాదముద్రలు.

"మూడే మూడు ఏనుగులు జరిపిన దమనకాండ ఇది... రెండు పెద్దవి. ఒకటి చిన్నది..." మహేశ్వరుడికి చెప్పాడు ఆయన.

"చంద్రుడి గుట్టమీద మనం చూసినవి కూడా మూడే. రెండు పెద్దవి. ఒకటి చిన్నది" వెంటనే అన్నాడు మహేశ్వరుడు.

అంగీకార సూచకంగా తల వూపి ఆ ప్రదేశంలో నుంచి ఇవతలికి వచ్చి అక్కడి దుర్వాసన తమను బాధించకుండా వుండే ప్రదేశంలో నిలుచున్నాడు సాగరుడు.

"మా దేవిగారికి వర్తమానం పంపించు. ఈ సైన్యాన్ని అల్లకల్లోలం చేసింది శివుడే. చంద్రుడి గుట్ట మీద మనం చూసిన మహాగజాలే ఈ యుద్ధంలో పాల్గొన్నాయి" అని చెప్పాడు.

"శివుడు మనకు కనిపించేదాకా ఆగటం ఉత్తమం. లేదా మరిన్ని వివరాలు తెలిసిన తర్వాత పంపిద్దాం వర్తమానాన్ని" అన్నాడు మహేశ్వరుడు.

తమతో వచ్చిన భటుల్ని వెనుకగా రమ్మని సైగచేసి, మరోసారి ఏనుగుల అడుగుజాడల్ని అనుసరించడం మొదలుపెట్టాడు సాగరుడు.

వెంట వున్న మహేశ్వరుడి కంటికి కనిపించని ఎన్నెన్నో సున్నితమైన అంశాలు సాగరులవారికి మాత్రమే కనిపించాయి.

"వాటంతట అవిగా నడవలేదు... బహుశా శివుడు బలవంతంగా నడిపించి వుంటాడు. వాటి అడుగుల్లో ఏదో సంశయం కనిపిస్తోంది. ఎదుట ఏదో ప్రమాదం పొంచి వున్నట్టు, తమకు ఇష్టం లేకపోయినా బలవంతంగా బయలుదేరినట్లు నాకు అనిపిస్తోంది" నేల వంకే దీక్షగా చూస్తూ నడిచాడు సాగరుడు. కొద్దిసేపటి తర్వాత మట్టిదిబ్బ మీదికి ఎక్కి వేగంగా ప్రవహిస్తున్న నదిని, అందులోని మొసళ్ళను చూశాడు.

"శివుడు ఏనుగులతో సహా నదిని దాటి అవతలికి పోయాడు" అక్కడి జాడల్ని చూడగానే తడుముకోకుండా ప్రకటించాడు.

"ఎలా? ఎలా పోగలడు ప్రభూ? ఆ మొసళ్ళను చూడండి" ఆందోళనగా అన్నాడు మహేశ్వరుడు.

"ఇప్పుడున్నవన్నీ ఇందాక మనం చూసిన యుద్ధ ప్రదేశంలో విందు భోజనాలకి వెళ్ళివుంటాయి. అదే అదునుగా వాడు నదిని దాటేసి వుంటాడు" అన్నాడు సాగరుడు.

ఆయన సూక్ష్మదృష్టికి, ఆలోచనా విధానానికి అచ్చెరువందకుండా వుండలేకపోయాడు మహేశ్వరుడు.

"అయితే ఇప్పుడు మనం చేయవలసింది ఏమిటి? శివుడి మాదిరిగా నదిని అధిగమించటం ఇప్పుడు ప్రమాదకరం. అదీగాక ఆవలి పక్కన వున్న ఆటవికుల్ని కూడా గుర్తుపెట్టుకోవాలి" అన్నాడు అతను.

"ఇప్పుడు నన్ను భయపెడుతున్నది అదే... వాళ్ళు శివుడిని చూడకుండా వుండరు. చూసిన తర్వాత ఊరికే వదిలిపెట్టరు..." సాలోచనగా అన్నాడు సాగరుడు. పది క్షణికాల తర్వాత మళ్ళీ తనే మాట్లాడాడు. "నది దిగువకు పోయి అవతలి ఒడ్డుకు చేరుకునేందుకు అవకాశం లభిస్తుందేమో చూద్దాం" అంటూ నది ఒడ్డున నడక మొదలుపెట్టాడు.

చీకటి పడేవరకూ సాగింది వారి నడక. చీకటిపడిన వెంటనే ఒక పెద్ద బండరాయి చాటున రాత్రి గడిపే ఏర్పాట్లు చేశాడు మహేశ్వరుడు. నదిలోని మొసళ్ళు చీకటి మాటున వచ్చి తమమీద పడకుండా భటుల్ని కాపలా నిలబెట్టాడు. తూర్పు దిశ తెల్లబడగానే తిరిగి నడక మొదలుపెట్టారు అందరూ. తిరిగి చీకట్లు ముసురుకోబోతున్న సమయంలో వున్నట్లుండి ఆగిపోయాడు సాగరులవారు.

"ఏమయింది ప్రభూ?" అడిగాడు మహేశ్వరుడు.

నదికేసి చూపించాడు సాగరుడు. తమ చుట్టూ చూడమని సైగ చేశాడు. పలుచబడిపోతోంది అడవి... చెట్లు పుట్టలు మాయమై పెద్ద పెద్ద రాతిబండలు ప్రత్యక్షం అవుతున్నాయి.

వెడల్పుగా విశాలంగా ప్రవహించే సువర్ణానది సన్నగా కనిపిస్తోంది. నీటి వేగం చాలా అధికం అయినట్లు కనిపిస్తోంది.

అంతవరకు నది గట్లమీద విశ్రాంతిగా పడుకుని వున్న మొసళ్ళు గబగబా నీటిలోకి జారి వేగంగా దిగువకు ప్రయాణం అవుతున్నాయి.

"వాటికి ఏదో ఆహారం కనిపించింది... అందుకే ఆత్రత పడుతున్నాయి" అంటూ తమ వెనక వస్తున్న భటులకు సైగ చేశాడు సాగరుడు.

"అశ్వాలను గట్టిగా పట్టుకోండి. నీటికి సమీపంగా ఎవరూ పోవద్దు..." అని జాగ్రత్తలు చెపుతూ తన నడుముకు వ్రేలాడుతున్న కరవాలాన్ని తీసి, గట్టిగా పట్టుకున్నాడు. అడుగులో అడుగు వేస్తూ ముందుకు సాగాడు.

❖ ❖ ❖

ఎగుడు దిగుడుగా పేర్చబడి వున్న బండరాళ్ళమీద కుదురుగానే అడుగులు వేశాయి పెద్ద ఏనుగులు రెండు. గున్న మాత్రం అలా చేయలేదు. తమ కదలికలను గమనించి వంతెన దగ్గరికి వస్తున్న మొసళ్ళను చూసి చాలా ఉద్రేకపడిపోయింది. కీచుధ్వనులు చేస్తూ వంతెన అంచు దగ్గరికి పోయి నదిలోకి తొంగిచూసింది.

"నీకు బుద్ధి లేదు. నీ అల్లరికి హద్దు లేదు. నువ్వు ఒట్టి మట్టిమొఖానివి" కోపంగా అంటూ దాని నడుముమీద బలంగా ఒక దెబ్బ వేశాడు శివుడు.

గుండ్రటి కళ్ళను గిరగిర తిప్పుతూ అతని చెవులు చిల్లులు పడేలా శబ్దం చేసింది అది.

"శబ్దం వద్దు శివుడు... అవతలి పక్కన ఎవరైనా వుంటే మనల్ని పసికట్టేస్తారు" ఆందోళనగా అంటూనే వున్నాడు వాసుదేవుడు.

అతని మాటలు ముగియటం... వంతెన ఆవలి పక్కన ఒక వందమంది కవచ శిరస్త్రాణధారులు ఒకేసారి ప్రత్యక్షం అవటం వెంటనే జరిగిపోయింది.

"నేను అనుకుంటూనే వున్నాను... ఈ వంతెన నిర్మింపచేసిన శిఖావంతుడు దానికి సరైన కాపలా పెట్టకుండా గాలికి వదిలేయడు... చిక్కుల్లో పడ్డాం శివుడా... పెనం మీదినించి సరాసరి నిప్పుల్లోకి దూకాం" తన కరవాలాన్ని బయటికి తీస్తూ శివుడిని హెచ్చరించాడు వాసుదేవుడు.

అతను తనకు ఇచ్చిన చురకత్తిని దట్టీలో నుంచి తీస్తూ వేగంగా పోయి మగ ఏనుగు కుంభస్తలం మీదికి ఎగబ్రాకాడు శివుడు.

"సంపంగి నగర గజదళం అంటే ఎలా వుంటుందో ఇంకోసారి ఈ దుర్మార్గులకు చూపించాల్సిన సమయం వచ్చేసింది. పదండి" అంటూ పాదాలతో దాన్ని అదిలించి, ఆ ప్రదేశం దద్దరిల్లిపోయేటట్లు పెద్ద పొలికేక పెట్టాడు.

అతని కంఠంలోని ఆవేశం వెంటనే పెద్ద ఏనుగుల్ని ఆవరించుకున్నది. పిచ్చిపట్టినట్లు ఘీంకారాలు చేస్తూ వేగంగా వంతెన దాటి, ఆయుధాలతో నిలబడి వున్న ఆ సైన్యం మీద విరుచుకుపడ్డాయి అవి.

తన ఖడ్గాన్ని గాలిలో గిరగిరా తిప్పుతూ ఏనుగుల వెనుకే తనుకూడా యుద్ధంలోకి దిగిపోయాడు వాసుదేవుడు.

ఉన్నచోటినించి కదలలేదు జ్వాల. అవతలి ప్రక్కన సైనికులు ప్రత్యక్షం అయిన వెంటనే ఆడ ఏనుగుమీద వున్న మూటని క్రిందికి లాగిందామె. ఆటవికులు తనకు బహుమతిగా ఇచ్చిన విల్లంబుల్ని బయటికి తీసి బాణాలను ప్రయోగించటం మొదలుపెట్టింది.

వంతెన అంచు దగ్గరికి వెళ్ళిన గున్న శివుడు కొట్టిన దెబ్బకు గట్టిగా శబ్దం చేసిన నాలుగే నాలుగు క్షణికాల్లో దారుణమైన గందరగోళం ఆ ప్రదేశాన్ని అల్లకల్లోలం చేయటం మొదలుపెట్టింది.

మృత్యువుకు ప్రతిరూపాల మాదిరి వచ్చిన ఏనుగుల్ని ఎదిరిస్తూ సైనికులు అరిచే అరుపులతో, శివుడి పొలికేకలతో, ఏనుగుల ఘీంకారాలతో దద్దరిల్లి పోవటం మొదలుపెట్టింది సువర్ణానది.

❖ ❖ ❖

అడుగులో అడుగు వేస్తున్న సాగరుల వారు అదిరిపడి మహేశ్వరుడి కేసి చూశారు.

"యుద్ధం... యుద్ధం ప్రభూ... మన భూభాగం మీద యుద్ధం అంటూ జరిగితే అది మనమీద దాడి చేయబడుతున్నట్టుగానే భావించాలి" తనుకూడా తన కరవాలాన్ని బయటికి లాగుతూ అన్నాడు మహేశ్వరుడు.

వెనుక వున్న భటులకు చేయి వూపి వేగంగా పరిగెత్తాడు సాగరుడు. ఒక పెద్ద మలుపు తిరిగిన వెంటనే కనిపించింది వారికి నదికి అడ్డుగా నిర్మించబడి వున్న వంతెన. దానికి ఈవలి ఒడ్డుమీద ఆరంభం అయిన గందరగోళం కూడా అగుపించింది.

"శివుడు... మన శివుడు ప్రభూ... చూస్తారేం" అంటూ మరింత వేగంగా ముందుకు పరిగెత్తాడు మహేశ్వరుడు.

తన కరవాలాన్ని మరింత గట్టిగా బిగించి పట్టుకుని సూటిగా పోయాడు సాగరుడు. మహేశ్వరుడి మాదిరిగా కవచ శిరస్త్రాణాలు ధరించి వున్న సైనికులమీద వెంటనే కలబడలేదతను.

ఘీంకారాలు చేస్తూ చిందులు తొక్కుతున్నాయి పెద్ద ఏనుగులు. వాటి వెనకగా తాను కూడా అలాగే చేయటానికి ప్రయత్నిస్తోంది గున్న.

అడ్డం వచ్చిన వారిని తీవ్రంగా గాయపరుస్తూ దాన్ని సమీపించాడు సాగరుడు. ఒక చేతిని దాని తలమీద వేసి, రెండవ చేతిలోని ఖడ్గంతో అటుగా వచ్చిన వారందర్ని గాయపరచటం మొదలుపెట్టాడు.

ఆయన కత్తిదెబ్బలకు క్రిందపడిన వారి శరీరాలను పాదాలతో అణగ ద్రొక్కుతూ, ఆయన ఎటు కదిలితే తను కూడా అటే కదలటం మొదలుపెట్టింది గున్న.

ఎంతోసేపు జరుగలేదా పోరాటం... తాము పట్టుకుని వున్న అశ్వాలను వదిలిపెట్టి, సాగరుల వారితో వచ్చిన పాతికమంది భటులు తాముకూడా ఆ యుద్ధంలో పాలుపంచుకోవటంతో చాలా త్వరగా ముగిసిపోయింది.

పెద్ద ఏనుగుల ధాటికి దగ్గర దగ్గరిగా నలభై మంది సైనికులు ప్రాణాలు పోగొట్టుకున్నారు. వాసుదేవుడి ఖడ్గానికి మరికొందరు, జ్వాల వదిలిన బాణాలకు ఇంకా కొందరు, మహేశ్వరుడి ఉధృతికి పదిమంది, సాగరుల వారి దెబ్బలకు పద్దెనిమిది మంది సర్వనాశనం అయిపోగా, వెనుతిరిగి నల్లరాతి గుట్టల దగ్గరికి పారిపోయారు మిగిలినవారందరూ.

❖ ❖ ❖

అంతఃపురంలోకి పోనేలేదు చారులతాదేవి. పావురాలను సంరక్షించే మందిరం దగ్గరే కూర్చున్నది తన చెలికత్తెలతో.

"వర్తమానం ఏదైనా వచ్చిన వెంటనే మీకు తెలియజేస్తాము... వెళ్ళి విశ్రాంతి తీసుకోండి తల్లీ" అని అక్కడి నిర్వహణాధికారి ఎంత చెప్పినా వినిపించుకోలేదామె.

"చక్రవర్తి వద్ద నుంచి ఏదైనా సమాచారం వస్తే వెంటనే స్పందించాలి. అడవిలోకి వెళ్ళిన ప్రభువులు ఇంతవరకూ ఎటువంటి సమాచారము పంపించలేదు. మాకు ఆందోళనగా వున్నది" అంటూ అక్కడే వుండిపోయింది.

"తల్లీ... నన్ను మరోసారి అడవిలోకి వెళ్ళి రమ్మంటారా?" ఆ రోజు సాయంసమయంలో వచ్చి వినయంగా అడిగాడు సేనాపతి.

"ప్రభువులతో పాటు మీరు కూడా నగరాన్ని విడిచి వెళితే రక్షణ కొరవడుతుంది. వద్దు" వెంటనే నిరాకరించింది ఆమె.

"పోనీ... కారాగారంలో బంధించబడి వున్నవారిని నేనే స్వయంగా విచారించనా?" అడిగాడు సేనాపతి.

అందుకు కూడా తల అడ్డం తిప్పింది ఆమె. "ప్రభువుల దగ్గర్నించి ఏదోఒక మాట మాకు చేరిన తర్వాతనే మేము ఇక్కడి వ్యవహారాల గురించి ఆలోచిస్తాము. అంతవరకూ మమ్మల్ని విసిగించవద్దు. మీరు వెళ్ళి నగర రక్షణ గురించి చూసుకోండి. వెళ్లండి" కొంచెం కఠినంగానే అతన్ని హెచ్చరించింది.

తలవంచుకుని వెనక్కి వెళ్లిపోయాడు సేనాపతి. అతను అవతలికి వెళ్ళిన అర్థఘడియకు చీకటి పడింది. చీకటి పడిన అర్థఘడియ కల్లా, రెక్కల్ని తపతపలాడిస్తూ వచ్చి ఆ భవనం ఎదుట వున్న వేదికమీద వాలింది ఒక పావురం.

"ప్రభువులు పంపించినది అది. అడవిలో నుంచి ఏదో సమాచారం వచ్చింది" పావురాన్ని గుర్తుపట్టి బిగ్గరిగా అరుస్తూ వేగంగా వెళ్ళి దాన్ని చేతుల్లోకి తీసుకున్నాడు అక్కడి నిర్వాహకుడు. కాలికి కట్టి వున్న వస్త్రపు పీలికని తీసి ఆమెకు అందించాడు.

విపరీతమైన ఆత్రుతతో ఆ పీలికమీద వ్రాయబడి వున్న అక్షరాలను చదివింది చారులతాదేవి.

"యువరాణి క్షేమం. శివుడు క్షేమం... ఏనుగులు క్షేమం."

మూడే మూడు మాటలు లిఖించబడి వున్నాయి. అంతకుమించి ఒక్క అక్షరం కూడా పీలికమీద ఆమెకు కనిపించలేదు.

ఎంత బిగపట్టుకున్నా ఆగకుండా ఆమె బుగ్గలమీదికి వచ్చేశాయి ఆనంద భాష్పాలు. "నగరంలోని ఆలయాలన్నింటిలోను విశేష పూజలు జరిపించండి. ఎరుకల సాని బసివికి ఇబ్బడి ముబ్బడిగా కానుకలు పంపించండి" అంటూ అప్పటికప్పుడు ఒక పావురాన్ని చక్రవర్తి సమక్షానికి పంపించింది.

❖ ❖ ❖

"శిఖావంతుల వారికి జయము... శౌర్యసాహస సంపన్నులకి మహా విజయము..." ఒక్కసారిగా గొంతులు ఎత్తి ఒకేసారి జయజయధ్వానాలు చేశారు వరుసల్లో నిలబడి వున్న సైనికులు.

ఎనుబది వేలమంది కాల్బలము, నలుబది వేలమంది అశ్వికులు, పదిహేడు వేలమంది రథికులు, ఇరవైవేలమంది ధనుర్ధారులు సమావేశమై వున్నారు అక్కడ.

ఎత్తుగా నిర్మించబడిన ఒక వేదికమీద నిలబడి వారందర్నీ చూస్తూ సగర్వంగా మీసాలు మెలితిప్పుకున్నాడు శిఖావంతుడు.

సంవత్సరాల తరబడి ఎంతో శ్రమపడి తాను తయారుచేసుకున్న సైన్యం అది. ఆజ్ఞ ఇచ్చిన మరుక్షణం జ్వలిత సామ్రాజ్యం మీదికి దండయాత్ర ఆరంభం అవుతుంది.

"ఒకే ఒక్క లోటు వున్నది మనకి. అదొక్కటి లేకపోతే జ్వలిత సామ్రాజ్యాన్ని ఈపాటికి సర్వనాశనం చేసి వుండేవాడిని" తనలో తను అనుకుంటున్నట్లు పైకి అన్నాడు అతను.

"ఏమిటది ప్రభూ?" వెంటనే అడిగాడు కొంచెం వెనుకగా నిలబడి వున్న సేనాపతుల్లో ఒకతను.

"గజసైన్యం సేనాపతి... మనకు యుద్ధగజాలు లేకపోవటమే పెద్ద లోటు. జ్వలిత సామ్రాజ్యం మనకంటె బలంగా వుండటానికి కారణం వారి యుద్ధ గజాలే" అన్నాడు శిఖావంతుడు.

"ఆ బలాన్ని వారినించి దూరం చేయటానికి ఏర్పాట్లు పూర్తి చేశాము కదా ప్రభూ" అన్నాడు ఆ సేనాపతి.

"ఏం చేశారు? రహస్యంగా సంపంగి నగరంలోకి వెళ్ళి విషంతో యుద్ధ గజాలను మట్టుబెట్టే పథకం విఫలం అయింది కదా... ఆ పని చేయటానికి పోయిన వారందరూ నాశనమైపోయారు కదా" కించిత్ బాధతో అన్నాడు శిఖావంతుడు.

"సంపంగి పాలకుడైన సాగరుడిని మభ్యపెట్టటానికి మాత్రమే చేసిన ప్రయత్నం అది. నల్లరాతి గుట్టల దగ్గర సువర్ణానదిని అధిగమించటానికి వంతెన నిర్మాణం పూర్తి అయింది. దేవర వారు ఎప్పుడు ముహూర్తం నిర్ణయిస్తే

అప్పుడు సంపంగి నగరాన్ని ముట్టడించడానికి ప్రయాణం అవుతాము" అన్నాడు ఆ సేనాపతి.

మిలమిల మెరిశాయి శిఖావంతుడి కనులు. "ఆలస్యం అమృతం విషం. రేపే ప్రయాణం అవండి. మీరు సంపంగి నగరాన్ని ముట్టడించిన వెంటనే నేను మహాబలుడి మీదికి పోతాను. ఒకేసారి రెండు ప్రదేశాల్లో యుద్ధం జరుగుతుందని ఎవరూ ఊహించలేరు" ఉత్సాహంగా చెప్పాడు.

నిలుచున్న ప్రదేశం నుంచి వెనుతిరిగి, కొంచెం ఆవలగా వున్న ఇతర సేనాపతుల్ని శిఖావంతుడి సమీపంలోకి రమ్మని సైగ చేయబోయి, మధ్యలోనే ఆగిపోయాడు ఆ సేనాపతి.

నురుగులు కక్కుతున్న అశ్వాన్ని గట్టిగా అదిలిస్తూ ఒక అశ్వికుడు వేదిక దగ్గరికి వస్తూ వుండటమే అందుకు కారణం.

"ఎవరతను? ఎందుకా హడావుడి??" కనుబొమలు ముడిచి చూస్తూ కోపంగా అడిగాడు శిఖావంతుడు.

వేదిక దగ్గరకు రాగానే గభాలున అశ్వంమీది నించి క్రిందికి దూకాడు ఆ అశ్వికుడు. తడబడుతున్న అడుగులతో వేదికిమీదికి వచ్చి శిఖావంతుడికి నమస్కరించాడు.

"ఇతను నల్లరాతి గుట్టల దగ్గర వుండే మన సైనికుల్లో ఒకతను. వంతెన నిర్మాణంలో పాలుపంచుకున్నవాడు'' అతన్ని గుర్తుపట్టిన వెంటనే శిఖావంతుడికి పరిచయం చేశాడు సేనాపతి.

"ఏర్పాట్లన్నీ పూర్తి అయినాయా?" గంభీరంగా అడిగాడు శిఖావంతుడు.

చిన్నబోయిన మొఖంతో తల అడ్డం తిప్పాడు ఆ సైనికుడు. "రెండో కంటివాడికి తెలియకుండా వంతెన నిర్మాణం పూర్తి అయింది ప్రభూ... సంపంగి నగర భటులు గాని, అడవి గ్రామాల ప్రజలు గాని ఎవరూ మన ప్రయత్నాన్ని పసికట్టకుండా అడ్డుకునేందుకు కొంతమంది సైనికులు అడవిలో కాపుదలగా నిలుచున్నారు" చెప్పటం మొదలుపెట్టాడు.

అధికం అయిపోయింది శిఖావంతుడిలో అసహనం. "జరిగింది ఏమిటో ఒక్కమాటలో చెప్పు... సోది వద్దు" అని హుంకరించాడు.

"సంవత్సర కాలంగా మేము పడిన శ్రమ ఒకే ఒక ఘడియలో సర్వనాశనం అయిపోయింది ప్రభూ. ఎక్కడినించి వచ్చాడో గూఢచారి వాసుదేవుడు

మెరుపులా వచ్చిపడ్డాడు. అతనితోపాటు కేవలం పాతిక మంది భటులతో సాగరుడు వచ్చి వంతెన వద్ద వున్న మనవారిని మట్టుబెట్టారు. ఆ తర్వాత..." అంటూ ఆగాడు సైనికుడు.

"ఆ తర్వాత ఏం జరిగింది?" క్రూరంగా చూస్తూ అడిగాడు శిఖావంతుడు.

"కష్టపడి మనం నిర్మించిన వంతెనను కూడా కూలద్రోసేశారు. మన కష్టం అంతా వృథా అయింది" తలవంచుకుంటూ చెప్పాడు ఆ సైనికుడు.

వంచిన తలను తిరిగి పైకి ఎత్తలేదు అతను. ఒరలో వున్న ఖడ్గాన్ని వేగంగా బయటకు లాగి బలంగా ఒక వేటు వేశాడు శిఖావంతుడు. బిగ్గరగా అరిచే ప్రయత్నం చేశాడు ఆ సైనికుడు. శబ్దం అతని పెదవులు దాటకముందే తెగి వేదిక క్రిందికి దొర్లుకుంటూ పోయింది అతని తల. చాపచుట్టలా క్రిందపడిపోయింది శరీరం.

"ఇతనే కాదు... సువర్ణానది వద్దకు పంపబడిన వారినందర్నీ నరికి పోగులు పెట్టండి. ఒక్కడు కూడా బతికి వుండటానికి వీలులేదు" విపరీతమైన కోపంతో పళ్ళు కొరుకుతూ ఆజ్ఞ ఇచ్చాడు శిఖావంతుడు.

"ప్రభూ! దయచేసి శాంతం వహించండి. ఆ గూఢచారి వాసుదేవుడంటే మహా చతురుడు. అతన్ని తెలివితేటల్లో ఎదుర్కోగల వాళ్ళు మన సైనికుల్లో ఎవరూ లేరు... ఎక్కడో ఏదో పొరపాటు జరిగివుంటుంది. అదేమిటో తెలుసుకున్న తర్వాత శిక్షలు విధించటం బాగుంటుంది" ధైర్యం చేసి చేతులు జోడిస్తూ నెమ్మదిగా విన్నవించాడు సేనాపతి.

కోపంగా చూస్తూనే కొద్దిసేపటి తర్వాత తలవూపాడు శిఖావంతుడు. "మూడు రోజుల్లో నాకు పూర్తి వివరాలు తెలియాలి" అని ఆజ్ఞ యిచ్చాడు.

వినయంగా నమస్కారం చేసి ఆ సేనాపతి వేదికమీది నించి క్రిందికి దిగుతూ వుండగానే, మరో భటుడు అక్కడికి వచ్చాడు. "ప్రభువుల వారికి జయము... జ్వలిత సామ్రాజ్యంలో పేరు ప్రతిష్టలు కలిగిన కనకయ్య శ్రేష్ఠి తమరి దర్శనాన్ని ఆపేక్షిస్తున్నాడు" అని విన్నవించాడు.

❖ ❖ ❖

ఇక్కడితో **శివుడు** మొదటిభాగం పూర్తయ్యింది. మిగతా కథ **శివుడు** రెండవ (ఆఖరి) భాగంలో చదవండి.

# SIVUDU-1

Written by

## Madhu Baabu



**SRI SRINIVASA PUBLICATIONS**
4/4, A.T. Agraharam, GUNTUR - 522 004.
Ph.No: 0863 - 2357945

# శివుడు-2

## మధుబాబు

శ్రీ శ్రీనివాస పబ్లికేషన్స్
ఎ.టి.అగ్రహారం - గుంటూరు - 522 004

# SIVUDU-2

(Serialised in Navya Weekly)

**By :**

**Madhu Baabu**

---


**First Edition :**

**April : 2014**

Price :

**Rs. 90-00**

Cover Design :

**N.V. RAMANA**

Printers :

**SAHITHI PRINTERS**

VIJAYAWADA - 520 002

Publishers : Ph : 0863 - 2357945

*Sri Srinivasa Publications*

4/4, A.T. Agraharam, Guntur - 522 004.

## మా వద్ద స్టాకులో వున్న మధుబాబు నవలలు

| | | | |
|---|---|---|---|
| 1. | శివుడు (రెండు భాగములు) | ... | 180–00 |
| 2. | స్వర్ణ ఖడ్గం (రెండు భాగములు) | ... | 160–00 |
| 3. | మచ్చల గుఱ్ఱం (రెండు భాగములు) | ... | 160–00 |
| 4. | చతుర్నేత్రుడు (రెండు భాగములు) | ... | 160–00 |
| 5. | శిక్ష (రెండు భాగములు) | ... | 150–00 |
| 6. | బైరాగి | ... | 90–00 |
| 7. | బొమ్మ | ... | 90–00 |
| 8. | రహస్యం | ... | 90–00 |
| 9. | టాప్‌టెన్ | ... | 90–00 |
| 10. | పాము | ... | 90–00 |
| 11. | అతను | ... | 90–00 |
| 12. | డౌన్‌స్ట్రీట్ మిస్టరీ | ... | 90–00 |
| 13. | ఆనందజ్యోతి | ... | 90–00 |
| 14. | అపరిచితుడు | ... | 80–00 |
| 15. | ఫినిషింగ్ టచ్ | ... | 80–00 |
| 16. | రుద్రాణి | ... | 80–00 |

| | | | |
|---|---|---|---|
| 17. | జ్వాలాముఖి | ... | 80-00 |
| 18. | వర్జిన్ ఐలాండ్ | ... | 80-00 |
| 19. | కంకణ రహస్యం | ... | 70-00 |
| 20. | టైగర్ వాత్సవ | ... | 70-00 |
| 21. | సాలభంజిక | ... | 70-00 |

# శివుడు-2

**వర్తక వాణిజ్యాల్లో అపరిమితమైన అనుభవమున్న కనకయ్య శ్రేష్ఠి గతంలో ఎన్నడూ లేని విధంగా తన దర్శనాన్ని ఆపేక్షించటం ఏమిటో, ఎందుకో శిఖావంతుడికి అవగతం కాలేదు. "జ్వలిత పాలకుడికి అతను మహా సన్నిహితుడని పేరు పొందాడు కదూ?" అని అడిగాడు తనతోపాటుగా వేదికమీదనే వున్న ఒక మంత్రిని.**

"అక్షరాలా యదార్థం ప్రభూ... ఎంత సన్నిహితుడంటే అతను ఏ సమయంలో వెళ్ళినా ఆ చక్రవర్తి దర్శనం చిటికెలో అయిపోతుందిట. భోజన సమయంలో వెళ్లటం జరిగితే చక్రవర్తితో సహపంక్తి కూర్చుంటాడట" వినయంగా చెప్పాడు ఆ మంత్రి.

"అంతటి వ్యక్తి మరి మన దగ్గరికి రావటం దేనికో? సంధి సంప్రదింపులేమయినా మొదలు పెట్టటానికా?" మర మనుష్యుల మాదిరి వరుసల్లో నిలబడి వున్న తన సైనికుల వంక సగర్వంగా చూసుకుంటూ అడిగాడు శిఖావంతుడు.

"సంధి సంప్రదింపులకే అయితే ఈ కనకయ్య శ్రేష్ఠిని పంపించరు ప్రభూ... ఎటువంటి జటిల సమస్యలకైనా తేలికగా సమాధానాలు వెతుకగల మంత్రులు చాలామంది వున్నారు చక్రవర్తి మహాబలుడి ఆస్థానంలో. వారిలో ఒకరు వస్తారు..." చెప్పాడు ఆ మంత్రి.

ఎందుకనో ఒక్కసారిగా అరుణవర్ణాన్ని సంతరించుకున్నాయి శిఖావంతుడి నయనాలు. కోపం అధికం అవుతూ వున్నట్లు గుర్తుగా నాశికా పుటాలు విస్తరించటం మొదలుపెట్టాయి.

"తప్పు ఏదయినా మాట్లాడి వుంటే ప్రభువులు నన్ను క్షమించాలి. తమరి పాదసేవకుడిని నేను" ఆ లక్షణాలను గమనించి వెంటనే తలను వంచుకుంటూ అన్నాడు ఆ మంత్రి.

"ఒట్టి తప్పే కాదు... వంద తప్పులకు సమానమయ్యే తేలిక మాటలు మాట్లాడావు... అపక్ర పరాక్రమవంతుడినైన మా సమక్షంలో ఆ చేతకాని మహాబలుడిని చక్రవర్తిగా సంబోధించావు. చక్రవర్తి అనే బిరుదు మాకు మాత్రమే స్వంతం. మరెవ్వరికీ కాదు" హూంకరించాడు శిఖావంతుడు.

"ప్రభువులు నన్ను మన్నించాలి... మరెన్నడూ ఈ తప్పు జరుగదు" మరింత వినయంగా శిరస్సును ఇంకా కొంచెం క్రిందికి వంచుకుంటూ చెప్పాడు ఆ మంత్రి.

శిఖావంతుడికి కోపం ఎప్పుడు వస్తుందో, ఎందుకు వస్తుందో ఎవరికీ తెలియదు. వచ్చిన తర్వాత తను ఏం చేస్తాడో, ఎలా ప్రవర్తిస్తాడో అతనికే తెలియదు.

అంతకుముందు ఎన్నోమార్లు మహాబలుడిని చక్రవర్తిగా సంబోధించాడు ఆ మంత్రి. అప్పుడెప్పుడూ ఆగ్రహానికి గురి కాని శిఖావంతుడు ఇప్పుడు క్రోధ వివశుడు అవటానికి కారణం తెలియలేదు ఆ మంత్రికి.

"ఆయుధాలు ధరించి లోహపుబొమ్మల మాదిరి వరుసల్లో నిలువబడి వున్న సైనికుల్ని చూసేసరికి ప్రభువుల వారి మనస్సు ఉప్పొంగిపోతోంది. తామే ఈ భూప్రపంచానికి సర్వం సహా చక్రవర్తి అనుకుంటూ వుండి వుండవచ్చు. అదే కారణం... మరేమీ కాదు" ఆ మంత్రి సత్తాముడి వెనుక నిలబడివున్న అతని సహాయకుడు ఒకతను చిన్నగా ఊదాడు అతని చెవిలో.

తలవూపి తన మనస్సులోకి ప్రవేశించిన ఆందోళనను అదుముకున్నాడు ఆ మంత్రి. మహాబలుడి ప్రసక్తి వచ్చినప్పుడు ఆచితూచి మాట్లాడటమే మంచిదనే నిర్ణయానికి వచ్చి, నెమ్మదిగా తలను పైకి ఎత్తాడు.

"కనకయ్య శ్రేష్ఠిని ఏం చేద్దాం?" ఉన్నట్లుండి అతన్ని అడిగాడు శిఖావంతుడు.

"అసలు అతను ఎందుకు వచ్చాడో తెలుసుకోవడం మంచిది ప్రభూ... అందువల్ల మనకు ఉపయోగం ఏదీ వుండకపోయినా, నష్టం ఏమీ వుండదని నా భావన" అంటూ తన అభిప్రాయాన్ని వెల్లడించాడు మంత్రి.

సాలోచనగా తలవూపాడు శిఖావంతుడు. "సభా భవనం చెంతన వున్న అతిథి గృహంలో అతనికి బస ఏర్పాటు చేయండి. వీలుచూసుకుని దర్శనం ఇస్తామని తెలియచేయండి" అని ఆజ్ఞ ఇచ్చాడు.

వేదిక దిగి సభా భవనం వైపు వేగంగా అడుగులు వేశాడు కనకయ్య శ్రేష్ఠి ఆగమన వార్తను తీసుకువచ్చిన భటుడు.

❖ ❖ ❖

శిఖావంతుడి సభా భవనం ఎదురుగానే వుంటుంది పెద్ద రాచవీధి. ఎత్తుగా ఎదిగి చల్లటి నీడను ఇచ్చే వృక్షాలు పెంచబడి వుంటాయి ఆ వీధికి రెండు పక్కలా.

అలా పెంచబడిన ఒక మారేడు వృక్షం కింద నిలువబడి అసహనంగా అటు ఇటూ చూశాడు కనకయ్య శ్రేష్ఠి.

నగర పౌరులు ఎంతోమంది రాకపోకలు సాగిస్తున్నారు ఆ వీధిలో. పాతికమంది అనుచరులతో, పదిహేను సంఖ్యలో వున్న ఉత్తమాశ్వాలతో, ముత్యాల దండలతో అలంకరించబడిన పల్లకీతో, అక్కడికి వచ్చి నిలబడిన శ్రేష్ఠి వంక చూసినవారు మాత్రం ఎవరూ లేరు.

"ఇది చాలా అవమానకరమైన విషయం ప్రభూ... ఇదే మనం మహాబల చక్రవర్తి దగ్గరికి వెళ్లివుంటే ఆ నగరంలోని సమస్త ప్రజానీకం ఈపాటికి తమచుట్టూ ఈగలు మూగినట్టు మూగి వుండేవారు. తమ ఘనతను కీర్తిస్తూ జయ జయ ధ్వనులు చేస్తూ వుండేవారు" శ్రేష్ఠి పక్కనే నిలబడి వున్న ఆయన అనుచరుడు ఒకతను చిన్నగా చెప్పాడు ఆయన చెవిలో.

"అవసరం మనది... అది తీరేవరకూ మౌనంగానే వుండాలి. మన రాజ్యంలో మనం ఎంత అధికులమైనా పరాయి ప్రదేశంలో ఒదిగి నిలబడవలసిందే" అన్నాడు కనకయ్య శ్రేష్ఠి.

అనటం అయితే అన్నాడు గాని, ఆయనకి కూడా అవమానకరంగానే వున్నది అక్కడి పరిస్థితి.

"ఈ నగరంలో మనకి నాలుగు దుకాణాలున్నాయి. వాటి దగ్గరికి పోయి కూర్చుందాము. ఊరు పేరు లేని పాంథుల మాదిరి ఇలా నిలువబడి వుండాల్సిన అవసరం మనకి లేదు" మళ్ళీ అన్నాడు ఆ అనుచరుడు.

"మనకి తెలిసినదాన్ని బట్టి చూస్తే, ఈ శిఖావంతుడు ఒట్టి అహంభావి... తన అనుమతికోసం ఎదురుచూడకుండా మనదారిన మనం వెళ్ళిపోయామని అతను భావిస్తే మనం వచ్చిన పని చెడిపోతుంది. అది మంచిది కాదు" అన్నాడు కనకయ్య శ్రేష్ఠి.

తాము అక్కడికి ఏ పనిమీద వచ్చామో ఆ అనుచరుడికి తెలియదు. అదేమిటో ఊహించటానికి అతను చేసిన ప్రయత్నం విఫలం అయింది. సూటిగా అడిగితే శ్రేష్ఠి చెప్పడు. చుట్టుదారిన మాట్లాడి, మాటల మధ్యలో అడిగితే ఏమైనా బయటపడవచ్చు.

"నగరంలోని పరిస్థితులను చూస్తుంటే సైన్యం యావత్తూ దండయాత్రకు బయలుదేరబోతున్నట్టు కనిపిస్తోంది. ఇటువంటి సమయంలో మనకి సరైన మర్యాదలు జరుగుతాయని అనుకోకూడదు. మనతో మాట్లాడటం వల్ల తను తలపెట్టిన పని విజయవంతం అవుతుందన్న నమ్మకం కలిగితే తప్ప శిఖావంతుడు మనకి దర్శనం ఇవ్వడు. మనం మాట్లాడవలసింది ఏమిటో అతనికి సులభంగా అర్థం అయ్యేటట్టు చెప్పగలగాలి... అదేమిటో మాకు చెపితే..." అంటూ మాటల్ని మధ్యలోనే ఆపేశాడు ఆ అనుచరుడు.

అసహనంగా అటూ యిటూ చూస్తున్న శ్రేష్ఠి ఒక్కసారిగా తలతిప్పి అతని వంక చురుకుగా చూడటమే అందుకు కారణం.

"ఎప్పుడు ఎవరితో ఏం మాట్లాడాలో ఎలా మాట్లాడాలో మాకు బాగా తెలుసు. నీ నోటిని అదుముకుని నిశ్శబ్దంగా నిలుచోవటం నీ ఆరోగ్యానికి చాలా మంచిది" ఖంగుమంటున్న కంఠంతో కోపంగా అన్నాడు.

అదిరిపడి నిజంగానే నోటికి చేతిని అడ్డుపెట్టుకున్నాడు ఆ అనుచరుడు. తలవంచుకుని వెనక్కి జరిగాడు.

❖ ❖ ❖

"... మన అడవిలోని ఏనుగుల్ని బంధించి వాటి దంతాల్ని సేకరించడానికి కనకయ్య శ్రేష్ఠి తన అనుచరుల్ని పంపాడా? అందుకు అడ్డుపడిన నిన్ను చంపించటానికి ప్రయత్నం చేశాడా??" విపరీతమైన ఆశ్చర్యంతో అడిగాడు సాగరులవారు శివుడిని.

చారులతాదేవి చకోర పుష్పాలను సేకరించుకు రమ్మని తనకు చెప్పిన మాట దగ్గర్నించీ మొదలుపెట్టి అప్పటివరకూ జరిగిన సంఘటనలన్నిటినీ సవివరంగా బయటపెట్టాడు శివుడు.

శిఖావంతుడి సైన్యం సువర్ణానది మీద నిర్మింపచేసిన వంతెనకు సమీపంలోనే కూర్చుని వున్నారు వారందరూ.

నీటిలో కలిసిపోయింది ఆ వంతెన. ఆనవాళ్ళు కూడా కనబడకుండా మాయం అయిపోయింది.

"తిరిగి మరో వంతెన నిర్మించటానికి ఇంకో సంవత్సరం పడుతుంది. మన సైనికుల్ని ఇక్కడ కాపలా పెడితే పది సంవత్సరాలకు కూడా పూర్తి కాదు ఆ పని..." నమ్మకంగా చెప్పాడు మంత్రి మహేశ్వరుడు.

"మనం వెంటనే నగరానికి వెళ్ళి ఆ కనకయ్య శ్రేష్ఠిని విచారించే పని ప్రారంభించాలి. అతను మన శ్రేయస్సును కోరుకునేవాడని అనుకుంటూ వచ్చాము ఇంతవరకూ. తన వ్యాపారం నవనవోన్మేషంగా సాగిపోయేందుకు ఎంతకైనా తెగిస్తాడని అనుకోలేదు" సాలోచనగా అన్నాడు వాసుదేవుడు.

అంతవరకూ కుదురుగా ఒక బండరాయి మీద కూర్చుని వున్న సాగరుల వారు వున్నట్లుండి లేచి దూరంగా వెళ్ళిపోయాడు.

ఒకరి మొఖం ఒకరు చూసుకున్నారు మహేశ్వరుడు, వాసుదేవుడు. "ఎందుకలా వెళ్ళిపోయారు? కారణం ఏమై వుంటుంది?" ఆశ్చర్యంగా అన్నాడు వాసుదేవుడు.

వంతెనను నిర్మూలించటంలో విపరీతంగా సాయపడ్డాయి శివుడి ఏనుగులు. తన బరువును తనే మోసుకోలేని గున్న కూడా తన తల్లిదండ్రులతో సమానంగా శ్రమపడింది.

వడివడిగా ప్రవహిస్తున్న నదిలో దిగి, సంతృప్తికరంగా స్నానాలు చేయాలని ఎంతగా అనిపిస్తున్నా ఒడ్డువంకే చూస్తూ నీటిలో తేలుతున్న మొసళ్ళ కారణంగా అవి ముందుకు అడుగు వేయటం లేదు.

అడవిలో సంచరించేటప్పుడు ఆహారం తయారుచేసుకోవటానికి అవసరమైన పాత్రలు, సంబారాలతో సిద్ధంగా వచ్చారు సాగరుల వారితో కలిసి వచ్చిన భటులు.

వారి వద్ద వున్న ఒక పెద్ద పాత్రను తీసుకుని నీటిలో వున్న మొసళ్ళను ఒక కంట కనిపెట్టుకుంటూ నీటిని సేకరించాడు శివుడు. ఆ నీటిని ముందుగా గున్న వంటిమీద జల్లి, శుభ్రంగా స్నానం చేయించాడు.

అతను తమ దగ్గర వున్న పాత్రను ఎందుకు తీసుకున్నాడో అర్థమై, వెంటనే తాముకూడా కదిలారు పదిమంది భటులు. మిగిలిన పాత్రలతో నీటిని పెద్ద ఏనుగుల మీదికి కూడా విరజిమ్మటం మొదలుపెట్టారు.

"మనిషి వాసన తగిలితే పిచ్చిపట్టినట్లు ఘీంకరిస్తూ మీదికి వచ్చే అడవి ప్రాణులు ఇవి... పుట్టిన క్షణం నుంచీ మనుష్యుల మధ్యనే పెరిగి పెద్దవి అయినట్లు ప్రశాంతంగా నిలుచుండిపోతున్నాయి. అంతా శివుడి చేతి మహిమ..." ఆ దృశ్యాన్ని చూస్తూ వాసుదేవుడికి చెప్పాడు మహేశ్వరుడు.

"వంతెన మీద యుద్ధం జరుగుతున్న సమయంలో సాగరుల వారు చెలరేగిపోయిన దృశ్యాన్ని నువ్వు గమనించావా?" నవ్వుతూ అడిగాడు వాసుదేవుడు.

ఒక్క క్షణం పాటు కనులు మూసుకుని అప్పటి సంఘటనల్ని నెమరు వేసుకున్నాడు మహేశ్వరుడు.

పెద్ద ఏనుగు మీద కూర్చుని వున్నాడు శివుడు. వాటి వెనుకగా చిందులు తొక్కుతోంది గున్న... వచ్చీ రావటంతోనే సూటిగా ఆ గున్న దగ్గరికే పోయాడు సాగరుల వారు. దాని తలమీద చెయ్యివేసి తనతోపాటుగా యుద్ధం చేయించాడు.

తిన్నగా నిలబడి సూటిగా నడవటం కూడా సరిగ్గా చేతకాని ఆ పిల్ల ఏనుగు, ఎంతో అనుభవం కల యుద్ధగజం మాదిరి ఆయనతో సరిసమానంగా యుద్ధంలో పాల్గొన్నది.

"ఇదేదో చాలా విచిత్రంగానే వున్నది. చూడగా చూడగా సాగరుల వారి సాహసంలోనూ, శివుడి పోరాట పటిమలోను పోలికలు ఒకే మాదిరి వున్నట్లు నాకు గోచరిస్తోంది" సాలోచనగా అన్నాడు మహేశ్వరుడు.

తన మనస్సును అదేపనిగా వేధిస్తున్న ఏదో జటిల సమస్యకు సమాధానం లభించినట్లు గట్టిగా నిశ్వసించాడు వాసుదేవుడు.

"నీ అనుమానం ఏమిటి?" ఆశ్చర్యంగా అడిగాడు మహేశ్వరుడు.

"అనుమానం అని కాదు గాని ఒక సందేహం. కొంతవరకు సమాధానం లభించింది. పూర్తి సమాధానం కొద్దిరోజుల్లోనే అవగతమై తీరుతుంది" తలవూపుతూ చెప్పాడు వాసుదేవుడు.

"నీ మాటలు నాకు అర్థం కావటం లేదు" అయోమయంగా చూస్తూ అన్నాడు మహేశ్వరుడు. "విషయం ఏమిటో తెలియచెప్పందే నీకు ఏదీ అర్థం కాదు. తీరికగా చెపుతాను. ముందుగా ఇప్పుడు మనం చేయవలసింది ఏమిటో ఆలోచించు" అన్నాడు వాసుదేవుడు.

"ఆలోచించటానికి ఏమీలేదు... సాగరులవారు ఏదో సంగతిని తలుచుకుని అదేపనిగా ఆత్రుత పడుతున్నారు. ముందు అదేమిటో తెలుసుకోవాలి" అంటూ దూరంగా వెళ్ళి నిల్చున్న సాగరులవారి దగ్గరికి పోయాడు మహేశ్వరుడు.

"వంతెనను నిర్మూలించే పని దిగ్విజయంగా ముగిసింది. ఇప్పటికిప్పుడు తన సైన్యాన్నంతా వెంటబెట్టుకొని ఆ శిఖావంతుడు ఇటుకేసి వచ్చినా, మనల్ని ఏమీ చెయ్యలేడు. మాయమైపోయిందనుకున్న యువరాణి క్షేమంగా మనకి దక్కింది. ఇంకా ఆలోచన దేనికి? వెనుతిరిగి నగరానికి ప్రయాణం అయితే బాగుంటుంది కదా!" అన్నాడు చిన్న కంఠంతో.

"తల్లితండ్రి లేని అనాథ బాలకుడని కూడా చూడకుండా శివుడిని అష్టకష్టాలు పెట్టాను. అతని పట్ల చాలా నిర్దయగా ప్రవర్తించాను. ఎందుకనో మనసు వికలమైపోతోంది. ఏదో పెద్ద తప్పు చేసినట్లు గుండెలు బరువెక్కి పోతున్నాయి" చిన్నకంఠంతో చెప్పాడు సాగరుడు.

"శివుడు అనాథ ఎలా అవుతాడు ప్రభూ? తండ్రి వంటి తమరు తల్లివంటి దేవిగారు వాడిని కడుపులో పెట్టుకుని పెంచారు. కన్నప్రేమకంటే పెంచిన ప్రేమే అధికం అంటారు పెద్దలు. వాడిని పెంచి పెద్ద చేసిన పెంపుడు తండ్రిగా

మీకు వాడిమీద సర్వాధికారాలు వున్నాయి. వాడిని శిక్షించినా, రక్షించినా మీరు ఎవరికీ సమాధానం చెప్పుకోవాల్సిన అవసరం లేదు" ఆర్ద్రంగా అన్నాడు మహేశ్వరుడు.

"బిడ్డలమీద ఎన్ని అధికారాలు వున్నా, సరైన కారణం లేకుండా శిక్షించడం అపరాధమే కదా?" అన్నాడు సాగరులవారు.

"మనం మనుష్యులం ప్రభూ... దేవతలం కాదు. మన కంటికి కనపడిన కారణాలను బట్టే మన ప్రవర్తన ఆధారపడి వుంటుంది. ఒకవేళ అది తప్పు అనిపించే పక్షంలో దిద్దుబాటు చర్యలను తీసుకోవచ్చు. నగరానికి తిరిగి వెళ్లగానే ఆ పని చేద్దాం... శివుడికి ఇవ్వవలసిన గౌరవాన్ని గుర్తింపును ఇచ్చేద్దాం" మరింత మృదువుగా అన్నాడు మహేశ్వరుడు.

"దేవిగారు మొదటినించీ చెపుతూనే వున్నారు. మనమే పెడచెవిన పెట్టి మూర్ఖంగా ప్రవర్తించాము" అన్నాడు సాగరుడు.

"మర్చిపొండి ప్రభూ... దయచేసి జరిగినవన్నీ ఇక్కడే వదిలివేయండి. శివుడిని మనం దేవిగారి సంరక్షణకు వదిలేశామని మర్చిపోకండి. జరగవలసింది ఏమైనా వుంటే ఆమె చూసుకుంటారు. మనం ఆలోచించి మనసును కష్టపెట్టుకోవల్సిన అవసరం లేదు" మరింత నమ్మకంగా చెప్పాడు మహేశ్వరుడు.

"నువ్వు చెపుతున్న మాటలన్నీ నాకు నేనే చాలాసార్లు చెప్పుకున్నాను. అయినా సరే ఎందుకో ఏదో బాధ. చెయ్యరాని తప్పు ఏదో చేశానన్న క్షోభ నన్ను వివశుడిని చేసేస్తోంది. ఎంతగా సర్ది చెప్పుకున్నా అది సమసిపోవటం లేదు. మనసు కుదుటపడటంలేదు" అంటూ గాఢంగా నిట్టూర్చి వెనుతిరిగాడు సాగరుడు.

"తల్లీ... మనం నగరానికి ప్రయాణం అవుతున్నాము" అంటూ మౌనంగా కూర్చుని వున్న జ్వాలకి చెప్పాడు.

అప్పటివరకూ పడిన అష్టకష్టాల నుంచి విముక్తి లభించినందుకు ఎంతగానో సంతోషిస్తూ తల వూపవలసిన జ్వాల ఆ పని చేయలేదు.

"ఒకసారి శివుడిని కూడా అడగండి. అతను చెప్పేది ఏమైనా వున్నదేమో తెలుసుకోండి" అని అన్నది.

మగ ఏనుగు దగ్గర నిలబడి దాని పొడవైన దంతాలను తన దట్టీతో నిగనిగ మెరిసిపోయేటట్టు మెరుగు పెడుతున్నాడు శివుడు.

ఆ స్పర్శ ఎంతో ఆనందాన్ని కలిగిస్తున్నట్టు తలను కొంచెంగా ఊపుతూ కనులను అరమూసి తెరుస్తూ నిలబడి వున్నది ఆ ప్రాణి. తమ సమీపంలోకి రాబోయిన సాగరులవారిని, మహేశ్వరుడిని చూసి అసహనంగా శబ్దం చేసింది.

"అవసరాన్ని మించి వాటిని ముద్దు చేయకూడదు. మనిషి మీద ఇవి మమకారం పెంచుకుంటే యుద్ధరంగంలో విచ్చలవిడిగా సంచరించలేవు. శత్రువుల్ని కూడా తనకు సన్నిహితులుగా భావించి వదిలేస్తాయి" దూరంగానే నిలబడి శివుడికి చెప్పాడు సాగరుడు.

శివుడి సమక్షంలో పరమ సాధుమూర్తుల మాదిరిగా ప్రవర్తించే ఆ ప్రాణులు తనను పరాయివాడిగానే భావిస్తున్న సంగతిని ఆయన గమనించటం లేదని మహేశ్వరుడికి తెలిసిపోయింది.

"గజయుద్ధం గురించి శివుడికి తర్వాత నేర్పవచ్చు. ముందుగా జరగవలసింది ఏమిటో చూడండి" సున్నితంగా హెచ్చరించాడు అతను సాగరుల వారిని.

"నగరానికి తిరిగి పోదాము. నీ అభిప్రాయం ఏమిటి?" గంభీరంగా అడిగాడు సాగరులవారు శివుడిని.

చటుక్కున తలతిప్పి వాసుదేవుడి వంక చూశాడు శివుడు.

"సాగరులవారు అడిగింది నన్ను కాదు. నిన్ను. నీ అభిప్రాయం చెప్పు" ప్రోత్సహించాడు వాసుదేవుడు.

"నల్లరాతి గుట్టల్లో నాకు ఏదో మెరుపు కనిపించింది. అదేమిటో తెలుసుకోకుండా నగరానికి వెళ్ళటం నాకు ఇష్టంలేదు" తడుముకోకుండా చెప్పాడు శివుడు.

"వంతెనకు కాపలా వున్నవారి కవచ శిరస్త్రాణాలమీద పడిన వెలుగే అయివుంటుంది అది. వాళ్లని మనం చూడటం, ఎదిరించటం అయిపోయింది" గుర్తు చేశాడు వాసుదేవుడు.

"కాపలా వాళ్ళు ఇక్కడే మనకి కనిపించారు. వెలుగు మాత్రం గుట్టల మీదినించి వచ్చింది. ఇక్కడినించి కాదు" మొండిగా సమాధానం ఇచ్చాడు శివుడు.

నిశ్చలంగా నిలబడివున్న సాగరుల వారి వైపు తిరిగి చిన్నగా నవ్వాడు వాసుదేవుడు. "అదీ అసలు సంగతి. ఇంతదూరం వచ్చినవాళ్ళం ఒకసారి గుట్టల దగ్గరికికూడా పోయి వస్తే ఒక పని అయిపోతుంది" అని అన్నాడు.

"ఇక్కడ మీకు కనిపించిన వారికంటే ఎక్కువమంది గుట్టల్లో కనిపిస్తే ఎదిరించటం మనకి సాధ్యపడుతుందా?" సాగరుల వారు మాట్లాడకముందే తను కల్పించుకుంటూ అడిగాడు మహేశ్వరుడు.

"సాధ్యపడకపోతే సగౌరవంగా తిరోగమిద్దాం. నగరానికి వార్తను పంపి మరింత మంది భటుల్ని రప్పిద్దాం. మన భూభాగం దగ్గరికి వచ్చిన శత్రువుల నెవర్నీ ఉపేక్షించేది లేదని శిఖావంతుడికి అర్థం అయ్యేటట్లు పోరాటాల ద్వారా ఎరుక పరుద్దాం" అన్నాడు వాసుదేవుడు.

ఒట్టిగా నగరానికి తిరిగిపోవటం శివుడితోపాటు అతనికి కూడా అంగీకారయోగ్యం కాదని తెలిసిపోయింది మహేశ్వరుడికి. "ఈరోజుకు అందరూ విశ్రాంతి తీసుకోండి. సూర్యోదయం కాగానే మనం నల్లరాతి గుట్టలమీదికి పోతున్నాము" అని తమ భటులకు ఆజ్ఞ ఇచ్చాడు అతను.

❖ ❖ ❖

"జ్వలిత సామ్రాజ్య రక్షణ వ్యవస్థ మొత్తము సంపంగి నగరంలో వున్న గజదళం మీదనే ఆధారపడి వున్నది. ప్రత్యేకంగా పనికట్టుకుని ఈ విషయాన్ని నేను ప్రభువులవారికి చెప్పవలసిన అవసరంలేదు"

చీకటి పడిన రెండు ఘడియలకు తనకోసం వచ్చిన భటుల వెంట శిఖావంతుడి సభాభవనంలోకి వచ్చి సింహాసనారూఢుడైన ఆ సామ్రాట్టుకు చెప్పాడు కనకయ్య శ్రేష్ఠి.

"నువ్వు ఆ రాజ్యపౌరుడివి. పై పెచ్చు మహాబలుడికి ఎంతో ఆత్మీయుడివి. అటువంటి నువ్వు మా దగ్గరికి వచ్చి ఇటువంటి మాటలు మాట్లాడటానికి కారణం ఏమిటి?" సూటిగా అడిగాడు శిఖావంతుడు.

"ప్రభువులు చాలా సూక్ష్మగ్రాహులు. నేను చేసే వ్యాపారాల గురించి పూర్తిగా తెలిసినవారు మీరు" వెంటనే అన్నాడు కనకయ్య శ్రేష్ఠి.

"ఇంతకీ నువ్వు చెప్పదలుచుకున్నదేమిటి?" విసుగు నిండిన కంఠంతో అడిగాడు శిఖావంతుడు.

"నేను చేస్తున్న వ్యాపారాల్లో దంతపు బొమ్మలను తయారుచేయించి విక్రయించటం కూడా ఒకటి. అచ్చమైన ఏనుగు దంతాలతో చేయబడే ఆ బొమ్మలకు అన్ని రాజ్యాలలోను విపరీతమైన ఆదరణ వుంటుంది. ముఖ్యంగా మహాబలుడికి మహాప్రియమైన వస్తువులు అవి. వాటి ద్వారానే మాకు ఆ ప్రభువులతో పరిచయం ఏర్పడింది."

"అయితే?"

"బొమ్మలకు అవసరమైన దంతాలను ఏనుగులను సంహరించటం ద్వారా సేకరిస్తున్నాను నేను. గజబలం మీద అపారమైన అభిమానాన్ని పెంచుకున్న మహాబలుడికి ఈ విషయం తెలియకుండా ఎన్నో జాగ్రత్తలు తీసుకున్నాను."

చెంపకు చేయి ఆనించి నిశితంగా చూస్తూ కూర్చున్న శిఖావంతుడి నొసలు ముడిపడ్డాయి ఒక్కసారిగా.

"దంతాల కోసం నువ్వు ఏనుగుల్ని చంపిస్తున్నావని తెలిస్తే ఆ మహాబలుడు నిన్ను కారాగారంలోకి నెట్టిస్తాడని భయపడుతున్నావా?" అని అడిగాడు.

"భయపడటమే కాదు ప్రభూ... ప్రాణాలు అరిచేతుల్లో పెట్టుకొని బ్రతుకుతున్నాను" అంటూ సంపంగి నగరం చుట్టుపట్ల సంచరించే ఏనుగుల్ని వేటాడటం కోసం తను పంపించిన దృఢకాయులను ఒక బాలుడు గమనించటాన్ని గురించి, అతన్ని చంపడానికి వెళ్ళినవారు అడవిలో శిఖావంతుడి భటులను కలుసుకుని సాగరుడి గజశాలలో విషప్రయోగం చేయబోవటాన్ని గురించీ, వారందరూ పట్టుబడటాన్ని గురించీ వివరంగా చెప్పాడు కనకయ్య శ్రేష్ఠి.

"ఏ క్షణంలోనైనా నాపేరు బయటికి రావచ్చు. ఏనుగుల్ని వేటాడటమే పెద్ద నేరంగా భావించే ఆ సాగరుడు, తన గజశాలలో విషప్రయోగం చేయటానికి మీరు పంపినవారితో చేతులు కలపటాన్ని మరింత తీవ్రంగా తీసుకోవచ్చు. దేవరవారే నన్ను ఆదుకోవాలి" చేతులు జోడిస్తూ అన్నాడు.

"నిన్ను ఏ విధంగా ఆదుకోవాలి?" ఆశ్చర్యంగా అడిగాడు శిఖావంతుడు.

"తమ సైన్యం నల్లరాతి గుట్టల దగ్గర సమీకృతం అయివున్నదని, సంపంగి నగరం మీద దండయాత్రకు సర్వసన్నద్ధంగా వున్నదని నాకు తెలిసింది."

"తెలిస్తే?"

"సంపంగి నగరాన్ని ఆక్రమించుకున్న వెంటనే తమరు దయచేసి చెరసాలలో వున్న నా అనుచరుల్ని విడుదల చేయించాలి. నేను రాజద్రోహం చేసినట్లు మహాబలుడికి తెలియకముందే సంపంగి నగరం పతనం అయిపోవాలి."

"అది మాటలు చెప్పినంత సులువుగా పూర్తి అవుతుందా? సాగరుడి గజ సైన్యం గురించి నువ్వు మరచిపోయావా?"

"మర్చిపోలేదు కాబట్టే నేను ఆఘమేఘాల మీద మీ దర్శనానికి వచ్చాను. సాగరుడి గజదళం గజశాలలో నుంచి కదలకుండానే పని పూర్తి అయ్యే మార్గాన్ని నేను చెప్పగలను" అన్నాడు కనకయ్య శ్రేష్ఠి.

అంతవరకూ అతని మాటల్ని అనాసక్తంగా వింటున్న శిఖావంతుడి మొఖంలో వెంటనే ప్రత్యక్షమయింది విపరీతమైన కుతూహలం.

"సాగరుడి గజదళం గజశాలలో నుంచి బయటికి రాకుండా పని పూర్తి అయిపోతుందా? ఎలా? ఏ విధంగా?" చటుక్కున ముందుకు వంగుతూ అడిగాడు.

అంతవరకూ అత్యంత వినయంగా నిలబడిన కనకయ్య శ్రేష్ఠి చిరునవ్వు నవ్వుతూ నిఠారుగా నిలుచున్నాడు.

"అదేమంత కష్టమైన పని కాదు ప్రభూ... సాగరుడి గజదళాన్ని మట్టుబెట్టడం కంటే, ఆ దళాన్ని నడిపించే సాగరుడినే మట్టుబెట్టవచ్చు. అతన్ని అడ్డు తొలగించుకుంటే నడిపించే నాథుడు లేక గజదళం నిర్వీర్యమై పోతుంది. సంపంగి నగరం చిటికెలో తమ వశమైపోతుంది.

నన్ను తప్పుబట్టే వారుండరు. జ్వలిత సామ్రాజ్యంలోని నా వ్యాపారాలన్నీ యధావిధిగా కొనసాగుతాయి" ఒక్కొక్క మాటను వత్తి వత్తి పలుకుతూ వివరంగా చెప్పాడు.

చెవులు రిక్కించి వింటున్న శిఖావంతుడి కనులు మిలమిల మెరిసిపోయాయి ఆ మాటల్ని విన్న మరుక్షణం.

"నిజమే... సాగరుడు మరణిస్తే అతని గజబలం నిర్వీర్యమైపోతుంది. ఆ గజబలం తోడు లేకపోతే మహాబలుడు ఎందుకూ పనికిరాని వాడై పోతాడు. నీ ఆలోచన అద్భుతంగా వున్నది శ్రేష్ఠీ... కాని..."అంటూ మాటల్ని ఆపాడు.

"ఏమిటి ప్రభూ! మీ సందేహం?" అడిగాడు శ్రేష్ఠి.

"స్వయంగా మహాయోధుడు ఆ సాగరుడు. విశ్వాసపాత్రులైన మంత్రులు, సేనాధిపతులు, ఎప్పుడు చూసినా అతనిచుట్టూ వుంటారు. అటువంటి మనిషిని మట్టుపెట్టడం అంటే మాటలు కాదు. ఆ మహాకార్యాన్ని సాధించగల నేర్పు కలవాళ్ళు ఎవరూ నా దగ్గర లేరు. నీ దగ్గర వున్నారా ఎవరైనా?" అని అడిగాడు శిఖావంతుడు.

అటువంటి శక్తిగలవాళ్లు తన దగ్గర వుంటే తను అక్కడికి రావాల్సిన అవసరం వుండేది కాదని అతనికి చెప్పలేదు కనకయ్య శ్రేష్ఠి.

"జ్వలిత సామ్రాజ్యంలో పేరెన్నిక గన్న గూఢచారి వాసుదేవుడు. ఈ మాట తమకు బాగా తెలుసు" అన్నాడు.

సాలోచనగా తలవూపాడు శిఖావంతుడు.

"వాసుదేవుడి తర్వాత అంతటి శక్తి కలిగిన శుశ్రుతుడు అనే గూఢచారి మరొకడు వున్నాడు" అన్నాడు శ్రేష్ఠి.

"అతనితో నీకు పరిచయం వున్నదా? భయపెట్టో భ్రమపెట్టో అతన్ని నీ పక్కకు తిప్పుకోగలవా?" అడిగాడు శిఖావంతుడు.

"అతను ఇప్పుడు సాగరుడి చెరసాలలో వున్నాడు" అంటూ శుశ్రుతుడు పట్టుబడిన విధానాన్ని గురించి తనకు తెలిసిన మాటల్ని చెప్పాడు కనకయ్య శ్రేష్ఠి.

"ఏదో ఒక విధంగా అతన్ని చెరసాలలో నుంచి బయటికి తీసుకురాగలిగితే అతన్ని నేను లోబరుచుకుంటాను. అతనికి జరిగిన అవమానాన్ని వెయ్యింతలుగా చేసి రెచ్చగొడతాను. సాగరుడి మీద పగ తీర్చుకునే మార్గంలో నడిపిస్తాను. ఆ తరువాత జరుగబోయేది ఏమిటో కొంచెంగా ఊహించి చూడండి" ఉద్వేగంగా చెప్పాడు.

ఊహించాడు శిఖావంతుడు. సాగరుడి మరణంతో నిర్వీర్యమైపోయిన గజబలం, ఆ బలం సరిగ్గా పనిచేయకపోవడం వల్ల బలహీనుడైపోయిన మహాబలుడు వెంటనే అతని కనులముందు మెదిలారు.

"ఎవరక్కడ?" వున్నట్లుండి తల పక్కకు తిప్పి పెద్దగా పిలిచాడు అతను.

వెంటనే లోనికి వచ్చారు ఆ సభాద్వారం అవతల నిలబడి వున్న అతని మంత్రులు అందరూ.

"కనకయ్య శ్రేష్ఠి గారిని తీసుకుపోయి మన అతిథి గృహంలో సకల మర్యాదలు చేయండి... తిరిగి మేము రేపు ఉదయం మరోసారి సమావేశమై మరికొన్ని మాటలు మాట్లాడుకుంటాము" ఆజ్ఞ ఇచ్చాడు అతను.

సగౌరవంగా తనను అతిథి గృహం దగ్గరికి తీసుకుపోవటానికి సిద్ధంగా నిలుచున్న మంత్రులను చూసి సగర్వంగా తనలో తనే నవ్వుకున్నాడు కనకయ్య శ్రేష్ఠి. తన ఆలోచన శిఖావంతుడికి నచ్చింది. అనుకున్న పని అనుకున్నట్లు నెరవేరితే జ్వలిత సామ్రాజ్యంలో తనకున్న పలుకుబడి కంటె పదింతలు గౌరవం శిఖావంతుడి రాజ్యంలో తన పరమౌతుంది.

అందరితో పాటు తనుకూడా కదలబోయిన తన ముఖ్యమంత్రిని మాత్రం కదలవద్దని కనులతోనే సూచించాడు శిఖావంతుడు.

"ఈ కనకయ్య శ్రేష్ఠి మహాతెలివైన వాడు... ఒక కన్ను వేసి వుంచండి" అని ఆజ్ఞ ఇచ్చాడు లోగొంతుకతో.

కనకయ్య శ్రేష్ఠి మీద ఒక కన్నువేసి వుంచమని శిఖావంతుడు ఆజ్ఞ ఇవ్వగానే చిన్న నవ్వు ఒకటి ముఖ్యమంత్రి మొఖంమీద ప్రత్యక్షం అయింది.

"తెలివితేటల్లో ఆ శ్రేష్ఠి తమ కాలిగోటికి కూడా సరిపోడు ప్రభూ. అతని గొంతెమ్మ కోరికలను విని సానుకూలంగా వున్నట్లు స్పందించారే గాని, ఒక్కదాన్ని కూడా తీరుస్తామని చెప్పలేదు" మెచ్చుకోలుగా చూస్తూ అన్నాడు.

గుబురు మీసాలు శిఖావంతుడివి. వాటిచాటున అతని పెదవుల మీద కూడా ప్రత్యక్షమయింది ఒక నవ్వు.

"ఇంతకాలంగా ఆ మహాబలుడికి ఆత్మీయుడిగా వుంటూ, అతన్నే వెన్నుపోటు పొడవటానికి చూస్తున్నాడు ఈ శ్రేష్ఠి. మనల్ని కూడా అదేవిధంగా మోసం చేయడని అనుకోవటానికి వీలులేదు. మీకు నేను చెప్పిన పనిని జాగ్రత్తగా పూర్తిచేయండి" అంటూ సింహాసనం మీదినించి లేచాడు. అంతలోనే ఏదో గుర్తుకు వచ్చినట్టు "నల్లరాతి గుట్టల దగ్గర్నించి ఏదైనా వర్తమానం వచ్చిందా? వంతెన నాశనం అయిపోవటానికి కారణమైన భటులందరికీ శిక్ష విధించబడిందా?" అని అడిగాడు.

"ఆ వంతెన ధ్వంసం అయిపోయిన వార్త మనకు తెలిసి ఎంతో సమయం కాలేదు ప్రభూ... వార్త తెచ్చిన వాడికి తమరే శిక్షను విధించారు. మనం పంపిన ఆజ్ఞలు అక్కడివారికి బహుశా రేపు సాయంత్రానికి చేరుకుంటాయి" అన్నాడు ముఖ్యమంత్రి.

సాలోచనగా తలవూపి అంతఃపురం వైపు వెళ్ళిపోయాడు శిఖావంతుడు.

❖ ❖ ❖

సూర్యోదయం అయిన వెంటనే నడక మొదలుపెట్టి సూర్యుడు పడమటి దిక్కుకు మరలబోతున్న సమయంలో నల్లరాతి గుట్టల్ని చేరుకున్నాడు సాగరుల వారు. తనను అనుసరించి వస్తున్న వారందర్నీ ఆగమని చేసైగ చేశాడు.

గుట్టల క్రిందిభాగంలో ఎత్తుగా ఎదిగి వున్న కొన్ని మర్రివృక్షాల క్రిందికి చేరుకున్నారు అందరూ. తన ఏనుగుల్ని మాత్రం అందరికీ దూరంగా ఒక రావిచెట్టు క్రిందికి తీసుకుపోయాడు శివుడు. ఉడుత మాదిరి ఆ చెట్టుమీదికి ఎగబ్రాకి, కొన్ని కొమ్మల్ని విరిచి క్రిందికి జారవిడిచాడు.

దారిమధ్యలో ఎక్కడా ఆగకుండా ప్రయాణం చేస్తూ రావడం వల్ల ఆకలితో నకనకలాడుతున్నాయి ఆ మూగజీవాలు. లేలేతగా కనిపిస్తున్న ఆకులతో నిండివున్న ఆ కొమ్మల్ని చూసి అప్పటికప్పుడు ఆబగా ఆరగించటం మొదలుపెట్టాయి.

కానీ శివుడు చెట్టుమీదినించి క్రిందికి దిగి తమ దగ్గరికి వచ్చేటంత వరకూ అవి గున్నతో సహా ఆ కొమ్మల దగ్గరికి పోలేదు. అతను వచ్చి తన చేతులతో తనే స్వయంగా అందించే వరకూ అసలు ఆ కొమ్మలవంక చూడను కూడా చూడలేదు.

"వీడు ఆ జీవాల్ని బాగా చెడగొడుతున్నాడు. పెంపుడు జంతువుల కంటే అధికంగా మాలిమి అయిపోయాయి. వాడు దగ్గర లేకపోతే యుద్ధం జరిగేటప్పుడు అడుగు ముందుకు వెయ్యవు" ఆ దృశ్యాన్ని చూస్తూ చిన్నగా వాసుదేవుడితో అన్నాడు సాగరులవారు.

"వాడు వాటిని యుద్ధం చెయ్యటానికి మాలిమి చేసుకోలేదు. అవికూడా వాడిని పరాయివాడిగా భావించటం లేదు. తమకే జన్మించిన మరో బిడ్డగా అనుకుంటున్నాయి" నవ్వుతూ సమాధానం ఇచ్చాడు వాసుదేవుడు.

"పొగ బయటికి రాకుండా వంటలు చేయండి... ఆహారం తీసుకున్న తరువాత గుట్టలమీదికి పోయి చూడాలి" పక్కకు తిరిగి తమ భటులకు ఆజ్ఞ ఇచ్చాడు సాగరులవారు.

చెట్లక్రింద కనిపించిన ఎండుకొమ్మల్ని, చితుకుల్ని ఏరుకువచ్చి సన్నటిసెగ వెలువరించే చిన్న చిన్న మంటలను వేశారు భటులు. తాము మోసుకువచ్చిన పాత్రలను ఆ మంటలమీద పెట్టి తోలు తిత్తుల్లో వున్న నీటిని నింపి, చకచకా వంటలు చేశారు.

వెడల్పాటి మర్రి ఆకులను తుంచి, మర్రిచెట్లకు దగ్గర్లో వున్న పూచిక పొదల్లో నుంచి పూచికపుల్లల్ని తీసుకువచ్చి విస్తళ్ళు తయారుచేశారు కొందరు. వేడి వేడి ఆహార పదార్థాలను ఆ విస్తళ్ళలో పెట్టి అందరికీ అందించారు.

పెద్ద ఏనుగులు పట్టించుకోలేదు గాని, గున్న ఏనుగు మాత్రం తన తొండాన్ని ఊపుకుంటూ శివుడి దగ్గరికి వచ్చేసింది. అతని అనుమతితో నిమిత్తం లేకుండా తనుకూడా అతని విస్తరిలోని ఆహారాన్ని ఆరగించటం మొదలుపెట్టింది.

అది అలా చేయటం, శివుడు అడ్డుచెప్పకుండా ఊరుకోవటం తనకు నచ్చనట్లు మొఖాన్ని పక్కకు తిప్పుకుంటున్న సాగరుల వారిని చూసి తనలో తను నవ్వుకున్నాడు వాసుదేవుడు.

"నీకు కనిపించిన మెరుపు ఏ గుట్ట మీదినించి వచ్చిందిరా?" ఆహారం తీసుకోవటం పూర్తి అయిపోయిన వెంటనే శివుడిని అడిగాడు సాగరులవారు.

ఎత్తుగా కనిపిస్తున్న గుట్టలవంక పది క్షణికాల పాటు పరిశీలనగా చూసి, నిట్టనిలువుగా పెద్దగోపురం మాదిరి కనిపించే ఒక గుట్టను చూపించాడు శివుడు.

తన ఒరలో వున్న ఖడ్గాన్ని ఒకసారి కదిలించి చూసుకుని ఆ గుట్టమీదికి బయలుదేరాడు సాగరుల వారు. వెనుకే నడిచాడు మంత్రి మహేశ్వరుడు. అతనికి నాలుగు అడుగుల దూరంలో అడుగులు వేశారు వాసుదేవుడు, జ్వాల.

తనుకూడా వారిని అనుసరించబోయే ముందు ఏనుగుల దగ్గరికి పోయాడు శివుడు.

"మీరు ఇక్కడే వుండండి. ఎక్కడికీ పోవద్దు. గున్నని కూడా కదల నీయకండి" అని వాటికి చెప్పి గుట్టమీదికి బయలుదేరిన వారి దగ్గరికి పరిగెత్తబోయాడు.

అంతవరకూ ఎంతో ప్రశాంతంగా నిలువబడి వున్న మగ ఏనుగులో వున్నట్లుండి వచ్చేసింది ఒక మార్పు. తన కుంభస్తలం మీద కందిరీగల గుంపు తచ్చాడుతున్నట్లు తలను అదేపనిగా విదిలించటం, తొండాన్ని గాలిలోకి ఎత్తి గాలిని వాసన చూడటం మొదలుపెట్టింది.

అలా వాసన చూసి చూసి అతిపెద్దగా ఘీంకారాలు చేయడం మొదలు పెడుతుందేమో అనిపించింది శివుడికి.

"మనకి చెడుపు తలపెట్టే శత్రువులు ఈ గుట్టలమీద గానీ, ఈ చుట్టు పక్కల గాని దాగుకుని వుంటే, నీ ఘీంకారాలు వారిని హెచ్చరిస్తాయి. మన గుట్టురట్టు అయిపోతుంది. నీ ఆవేశాన్ని అదుపులో పెట్టుకో. శబ్దాలు చేయకు"గబగబా దాని తొండాన్ని తడుముతూ హెచ్చరించాడు.

అతను అలా అనునయించిన వెంటనే శాంతించవలసిన ఆ మహాగజం మరింతగా కళవళపడిపోతున్నట్టు, ఇంకా వేగంగా తలను విదిలించటం మొదలుపెట్టింది.

శివుడు ఎంత సముదాయించినా అది ఆగకపోవటాన్ని చూసి వేగంగా పరిగెత్తారు చెట్లక్రిందనే వుండిపోయిన భటుల్లో కొందరు. సాగరుల వారి దగ్గరికి పోయి, వెనక్కి చూడమని విన్నవించారు.

వెనక్కి చూశాడు సాగరుల వారు. చూసినవెంటనే ముడివడ్డాయి ఆయన కనుబొమలు.

"ఇక్కడి గాలి ఆ మదగజానికి సరిపడనట్లు నాకు అనిపిస్తోంది. దానికి మదం దిగిందేమో అనిపిస్తోంది" అంటూ ముందుకు పోయే ఆలోచనను విరమించుకుని వేగంగా వెనక్కి వచ్చేశాడు.

మదం దిగటమంటే మగ ఏనుగుకు పిచ్చి అధికం అయిపోవటం. పెంచి పెద్దచేసిన వారిని కూడా లక్ష్యపెట్టవు అవి. తమ శిక్షకుల్ని కూడా లెక్కచెయ్యవు. ఇష్టం వచ్చినట్లు చెలరేగిపోతాయి. చెట్లను కూల్చివేయటం, బండల్ని పిండి చేయటం, భవనాల్ని పడగొట్టటం, అడ్డువచ్చిన వారందర్నీ హతమార్చటం వంటి దారుణ కృత్యాలను చేస్తూ వుంటాయి.

కొన్ని కొన్ని సమయాల్లో సరైన ఔషధాల్ని సేవింపచేస్తే శాంతిస్తుంది ఆ మదం. కొన్ని పరిస్థితుల్లో మాత్రం బరిశెలతో పొడిచి హతమార్చవలసిందే.

"మనం నగరంలో వున్నప్పుడు ఇటువంటి పరిస్థితి ఎదురైతే గజ వైద్యుడిని పిలిచి ఔషధాలు ఇప్పించేవాళ్ళం. ఈ కొండగుట్టల్లో ఆ సౌకర్యం లభించదు. ప్రాణాలు తీయటం కంటె వేరే మార్గం లేదు" ఐరావతం కంటె పెద్దదిగా వున్న ఆ మహాగజం వంక చూస్తూ ఆవేదన వెలిబుచ్చాడు సాగరులవారు.

"మదం దిగిన లక్షణాలు కాదని అనుకుంటున్నాను ప్రభూ... అది ఏదో విషయాన్ని గురించి ఆందోళన చెందుతోంది. మదం దిగితే దారుణంగా ఘీంకారాలు చెయ్యాలి. కాని అది చిన్నపాటి శబ్దం కూడా చెయ్యటం లేదు" సాగరుల వారితో పాటు వెనక్కి పరిగెత్తుకు వచ్చిన వాసుదేవుడు వెంటనే తెలియచేశాడు తన అభిప్రాయాన్ని.

"శబ్దం చేయకుండా శివుడు అడ్డుకుంటున్నట్లుంది. సరిగ్గా చూడండి" అన్నాడు అతని వెనుక వచ్చిన మహేశ్వరుడు.

"మనిషి మాటను మన్నించటమే జరిగితే అది మదం దిగిన లక్షణం కాదు. మనం ఎక్కడో పొరపాటు పడుతున్నామనిపిస్తోంది" అన్నాడు వాసుదేవుడు.

"ఈ శివుడిని చూడగా చూడగా గజశిక్షణలో నాకున్న అనుభవం ఏమంత పెద్దదికాదన్న అనుమానం కలుగుతోంది. నిన్న మొన్నటి వరకూ నగరాన్ని విడిచి వెలుపలికి రాని ఈ శివుడికి ఇంతటి తెలివి ఎక్కడినించి వచ్చిందో అర్థం కావటంలేదు" అంటూ శివుడిని సమీపించాడు సాగరులవారు.

"ఇది నాకు ఏదో ప్రమాదాన్ని గురించి చెప్పటానికి ప్రయత్నిస్తోంది. ఎలా చెప్పాలో దీనికి తెలియటంలేదు. ఏం చెప్పాలనుకుంటోందో నాకు అంతుబట్టటం లేదు" తన అశక్తతకు సిగ్గుపడుతున్నట్టు తలవంచుకుంటూ అన్నాడు శివుడు.

తలను వేగంగా విసురుతున్న ఆ ఏనుగు వంక మరింత పరిశీలనగా చూసి, వెనక్కి తిరిగాడు సాగరుల వారు. "నీ అభిప్రాయం ఏమిటి వాసుదేవా?" అని అడిగాడు.

"గుట్ట మీదికి మనం మాత్రమే వెళదాము. శివుడిని ఇక్కడే వుండమని చెపుదాము. వాడు క్షేమంగా వుంటే ఇవి సంతోషిస్తాయి" అన్నాడు వాసుదేవుడు.

"మాతోపాటు నువ్వు గుట్టమీదికి పోవటం లేదని చెప్పరా శివుడు" గంభీరంగా అన్నాడు సాగరులవారు.

"నేను చూసిన మెరుపు ఎక్కడినించి వచ్చిందో నేను మాత్రమే గుర్తుపట్ట గలను" అక్కడే వుండిపోవటం తనకు ఇష్టం లేకపోవటం వల్ల తడుముకోకుండా అన్నాడు శివుడు.

"ఏ గుట్ట మీదినించి వచ్చిందో ఆ గుట్టమీదికే పోతున్నాము. ఒక్క బండ రాయిని కూడా వదిలిపెట్టకుండా మొత్తం గుట్ట పైభాగాన్నంతా కలియతిరిగి వస్తాము. అంతగా అవసరం అయితే ఆ తరువాత వాసుదేవుడితో నువ్వు వెళ్ళి చూడవచ్చు. ఇప్పుడు మాత్రం ఆ జీభూతాన్ని శాంతంగా నిలుచునేటట్లు చెయ్యి" ఖచ్చితమైన కంఠంతో చెప్పి మిగిలిన వారందరికీ సైగ చేశాడు సాగరుల వారు.

చిన్నబుచ్చుకున్నాడు శివుడు. "అంతా నీ మూలకంగానే జరిగింది. నన్ను వదిలేసి వాళ్ళందరూ వెళ్ళిపోయారు. నాకు అవమానంగా వుంది" కోపంగా చూస్తూ అన్నాడు మగ ఏనుగుతో.

చిత్రంగా అది తలను విదిలించటాన్ని ఆపేసింది. తొండంతో అతని భుజాల్ని చుట్టి తన దగ్గరికి లాగుకున్నది.

❖ ❖ ❖

సూర్యుడు ఇంకో ఘడియ కాలంలో అస్తమిస్తాడనగా గుట్ట పైభాగాన్ని చేరుకున్నాడు సాగరుల వారు. పైన వున్న ఒక పెద్ద బండరాయి దగ్గరికి పోయి ఆవలి పక్కకు చూశాడు. చూసిన వెంటనే పామును చూసినట్లు ఎగిరి వెనక్కి దూకాడు.

"ఏమయింది ప్రభూ? ఏముంది ఆవలి ప్రక్కన?" రెండే రెండు అంగల్లో ఆయన్ని సమీపిస్తూ అడిగాడు వాసుదేవుడు.

శబ్దం చేయవద్దని అంటున్నట్లు వెంటనే పెదవుల మీద వేలు పెట్టుకుని చూపించాడు సాగరులవారు.

చప్పుడు చేయకుండా రెండు అడుగులు ముందుకు వేసి అవతలి పక్కకుతొంగి చూశాడు వాసుదేవుడు. చూసిన వెంటనే చలిగాలి వీచినట్లు జలదరించింది అతని శరీరం.

"అయ్యబాబోయ్... దగ్గిర దగ్గరగా ఐదువేలమంది వుంటారు. సందేహం లేదు" చిన్న కంఠంతో అన్నాడు అతని భుజాలమీదుగా తనుకూడా ఆవలి పక్కకు చూస్తూ మంత్రి మహేశ్వరుడు.

"గతంలో నేను నా సైన్యంతో మాటు వేసి శిఖావంతుడి వెన్ను విరిచిన ప్రదేశమే ఇది. పదివేలమంది సైన్యం ప్రశాంతంగా విడిది చేయవచ్చు ఇక్కడ" వారిద్దరూ బండరాయి దగ్గిర్నించి ఈవలికి రాగానే అన్నాడు సాగరులవారు.

"ఈ సైన్యం అంతా మనం కూలగొట్టిన వంతెన మీదుగా ఆవలి పక్కకు పోయి, అటునుంచి నగరం దగ్గరికి వస్తే ఏమయి వుండేది?" తను కూడా ఒక అడుగు ముందుకు వేసి, అవతలి పక్కన వున్న లోయలోని సైన్యాన్ని చూసి వెనక్కి వచ్చిన జ్వాల చిన్నకంఠంతో సాగరులవారిని అడిగింది.

"తిప్పి తిప్పి లెక్కవేసినా వెయ్యిమందికి మించరు నగరంలోని సైన్యం. ఇంతమంది ఒకేసారి నగరాన్ని చుట్టుముడితే మన ఏనుగుల్ని బయటికి తీసుకు రావడం కూడా అసాధ్యమే అవుతుంది" సాలోచనగా అన్నాడు సాగరుల వారు.

"శివుడు నన్ను వెతుకుతూ అడవిలోకి రావటం చాలా మంచిది అయింది. అతనే గనుక రాకుండా వున్నట్లయితే ఈ రహస్యం బట్టబయలు అయ్యేది కాదు" అన్నది జ్వాల.

"ఇప్పుడు మనం చెయ్యవలసింది ఏమిటి?" సూటిగా అడిగాడు మంత్రి మహేశ్వరుడు.

"ప్రస్తుత పరిస్థితిలో ఇక్కడ నిలబడి మనం చేయగలిగింది ఏమీలేదు. మనం గుట్టమీదికి వచ్చామని తెలిస్తే వాళ్లే ఏదో ఒకటి చేస్తారు. నిశ్శబ్దంగా వచ్చిన దారినే వెనక్కి పోవాలి. మన జాడలు వాళ్ళకి తెలియకముందే నగరాన్ని చేరుకోవాలి. ఒక్క క్షణంకూడా ఆలస్యం చేయకుండా కోటలో వున్న గజాలన్నిటినీ కోట బయటికి తెచ్చి యుద్ధానికి సిద్ధంగా నిలబెట్టాలి" అప్పటికప్పుడు చకచకా ఆలోచిస్తూ చెప్పాడు సాగరులవారు.

"వంతెన దగ్గర వున్న శిఖావంతుడి భటుల్ని కనిపెట్టుకోవటానికి ఆ సైన్యంలో ఎవరో ఈ గుట్టమీదికి వచ్చి వుంటారు. వారికవచాల మీదనో

శిరస్త్రాణాల మీదనో పడిన సూర్యకాంతినే శివుడు చూడటం జరిగివుంటుంది” క్రిందికి దిగుతూ వాసుదేవుడితో చెప్పింది జ్వాల.

“నగరానికి వెళ్ళగానే చక్రవర్తికి వర్తమానం పంపించాలి. సైన్యాన్ని పూర్తిగా సిద్ధం చేయించాలి..” మహేశ్వరుడికి చెప్పాడు సాగరులవారు.

“మన దగ్గర పావురాలు వున్నాయి. ఆ పనేదో వెంటనే చేద్దాం!” అన్నాడు మహేశ్వరుడు.

“ఎందుకని? నగరానికి వెళ్ళిన తర్వాత చేయవలసిన పనిని ఇక్కడ వుండగానే చేయటమెందుకని?” చురుకుగా చూస్తూ అడిగాడు సాగరుడు.

“ఎందుకంటే మనం అడవిని దాటి చాలా ఇవతలికి వచ్చాము గనుక... మనం ఎంత వేగంగా ప్రయాణం చేసినా నగరాన్ని చేరుకోవటానికి కనీసం రెండురోజులకు పైనే పడుతుంది గనుక” అన్నాడు మహేశ్వరుడు.

అతి ముఖ్యమైన ఆ విషయాన్ని మరిచిపోయి మాట్లాడినందుకు నొచ్చుకోలేదు సాగరులవారు. “మనం గుట్ట దిగేసరికి చీకటి పూర్తిగా ఆవరించుకుంటుంది. చీకట్లో ప్రయాణం అసంభవం... వెలుగు వచ్చేవరకూ ఇక్కడే ఆగాలి... మంటలు వేస్తే చీకటి సమయంలో చాలాదూరం కనిపిస్తుంది. నీకు చిమ్మచీకట్లో వర్తమానాలు పంపించటం సాధ్యపడుతుందా?” అని ఎదురు ప్రశ్న వేశాడు.

“ఇప్పుడు కాకపోతే రేపు తెల్లవారగానే పంపించవచ్చు. ఇప్పుడు మనం వర్తమానం గురించి కాదు ఆలోచించవలసింది. ఈ రాత్రికి శత్రువుల కంట పడకుండా క్షేమంగా వుండటాన్ని గురించి” చిన్నగా తన అభిప్రాయాన్ని తెలియజేశాడు వాసుదేవుడు.

అంతకుముందు వరకూ ఏదో ఒక మాట మాట్లాడి వారి సంభాషణలో పాలుపంచుకుంటూ వస్తున్న జ్వాల, ఈసారి మౌనంగా వుండిపోయింది. పావుఘడియ గడిచిన తర్వాత కూడా ఆమె పెదవులు విప్పకపోవటాన్ని గమనించి ఆశ్చర్యంగా చూశాడు వాసుదేవుడు.

“ఏమిటి తల్లీ? ఏమిటి ఆలోచిస్తున్నావు?” అని అడిగాడు.

“ఐదువేలమంది సైనికుల్ని ఇక్కడ సిద్ధంగా వుంచిన శిఖావంతుడు నగరంమీదికి రాకుండా ఇంకా మీనమేషాలు ఎందుకు లెక్కపెడుతున్నాడో

నాకు అర్థం కావటంలేదు. మనం చూసే సమయానికి వంతెన కూడా పూర్తిగా తయారయి వుంది. అయినా సరే వాళ్లు ఇక్కడే ఎందుకు వుండిపోయారు?" అడిగింది ఆమె.

"సంపంగి నగరం మీద దండు వెడలటం అంటే మాటలు కాదు" సగర్వంగా అన్నాడు మహేశ్వరుడు.

మాటకు మాటగా ఎదురు సమాధానం చెప్పవలసిన జ్వాల, చిన్నగా నవ్వి మౌనంగా వుండిపోయింది.

"నీ అనుమానం ఏమిటి తల్లీ?" పది క్షణికాల తర్వాత కూడా ఆమె పెదవులు విప్పకపోవటంతో సాదరంగా అడిగాడు సాగరులవారు.

"మనకి అర్థం కానిది ఏదో ఇక్కడ జరుగుతోంది. నేను అనుకోవటం ఏమిటంటే శిఖావంతుడు ఎవరికీ తెలియకుండా ఏదో కొత్త ఎత్తు ఎత్తుతున్నాడు. నగరంలో వున్న గజదళం గురించి అతనికి బాగా తెలుసు. ఎందుకయినా మంచిదని ముందుగానే విషప్రయోగం ద్వారా మనల్ని దెబ్బ తీయటానికి ప్రయత్నం చేశాడు. అది విఫలం అవటం వల్ల ఇంకో కొత్తమార్గాన్ని వెతుకుతున్నాడు..." ఒక్కొక్క మాటను వత్తి వత్తి పలుకుతూ చెప్పింది జ్వాల.

"ఏమయి వుంటుంది ఆ కొత్తమార్గం?" కుతూహలంగా అడిగాడు వాసుదేవుడు.

"అది తెలిస్తే గుట్టమీద వుండగానే చెప్పి వుండేదాన్ని... ఇప్పటిదాకా ఆగేదాన్ని కాదు" చిరునవ్వుతో చెప్పింది ఆమె.

ఎంతోమంది శత్రువులు తమకు అత్యంత సమీపంలో వున్నారని తెలిసి కూడా భయపడకుండా ఆమె అలా నవ్వుతూ మాట్లాడటాన్ని చూసి చాలా ముచ్చటపడ్డాడు సాగరులవారు.

"పోలికలన్నీ చక్రవర్తివే... ఒక్కటికూడా బీరుపోకుండా వచ్చేశాయి" మెచ్చుకోలుగా అన్నాడు చిన్నకంఠంతో- వాసుదేవుడికి మాత్రమే వినిపించేటట్లు.

"గుట్ట క్రింద శివుడు ఏం చేస్తున్నాడో... ఆ ఏనుగు గొడవ చెయ్యటాన్ని ఆపిందో ఆపలేదో ఎలా తెలుస్తుంది మనకి?" అతన్నే అడిగింది జ్వాల.

"క్రిందికి వెళుతున్నాము కదా. ఇంకొద్దిసేపట్లో చూడనే చూస్తాము" అంటూ సమాధానాన్ని దాటవేశాడు ఆయన.

నల్లరాతి గుట్టల్ని చీకట్లు పూర్తిగా ఆవరించుకున్నాయి వారందరూ కిందికి చేరుకునేసరికి. సమతల ప్రదేశంలో అడుగు పెట్టీపెట్టగానే రావిచెట్టు దగ్గరికి పోయింది జ్వాల.

కడుపులు నిండేటట్లు ఆహారాన్ని తీసుకున్నాయి కాబోలు- ప్రశాంతంగా నిలబడి వున్నాయి పెద్ద ఏనుగులు. మగ ఏనుగు పాదాల దగ్గర వట్టి నేలమీదే తలక్రింద చేయిపెట్టుకుని నిద్రపోతున్నాడు శివుడు.

అతనికి నిద్రాభంగం చేయటం ఇష్టం లేక నిశ్శబ్దంగా వెనక్కి వచ్చేసింది జ్వాల.

"మంటలు లేకుండా తినటానికి సరైన ఆహారం సిద్ధం చేయండి" అని భటులకు చెపుతున్నాడు మహేశ్వరుడు.

అడవిలో ప్రయాణం చేసేటప్పుడు వంటలు చేసుకోవటానికి వీలుపడని పరిస్థితుల్లో ఆరగించటానికి వీలుగా అంతకుముందే కాల్చి వుంచిన రొట్టెల్ని ఒక పెద్ద పాత్రలోనుంచి బయటకి తీసి అందరికీ అందించారు భటులు.

"శివుడి నిద్రను చెడగొట్టకండి. వాడంతట వాడు లేచినప్పుడే తీసుకుపోయి ఇవ్వండి" శివుడిని నిద్రలేపటానికి బయలుదేరి అతని ఏనుగుల్ని చూసి భయపడుతున్న భటులకు చెప్పాడు వాసుదేవుడు.

తోలుతిత్తిలో భటులు నింపుకు వచ్చిన సువర్ణానది నీటిని తాగి దాహం తీర్చుకున్నారు అందరూ. మర్రికొమ్మల్ని విరిచి భటులు సిద్ధం చేసిన మెత్తటి పడకల మీద పడుకొని కళ్ళు మూసుకున్నారు.

❖ ❖ ❖

గాఢనిద్రలో వున్న శివుడు లేవగానే రొట్టెల్ని తీసుకువెళ్ళి అతనికి ఇవ్వటం కోసం మొదటి ఝాము గడిచి రెండో ఝాము ప్రవేశించేవరకు వేచి చూశారు అందరికీ రొట్టెల్ని అందించిన భటులు. అప్పటికి కూడా అతను నిద్ర లేవకపోవటంతో నిలుచున్న ప్రదేశంలోనే కూలబడి కునికిపాట్లు పడటం మొదలుపెట్టారు.

రెండవ ఝాము కూడా గడిచిపోబోతున్న సమయంలో వున్నట్లుండి మెలకువ వచ్చింది శివుడికి.

కనులు తెరిచీ తెరవగానే కనిపించింది మళ్ళీ అతనికి అదే దృశ్యం. అంతకుముందు మాదిరి తలను విదిలిస్తోంది మగ ఏనుగు. అసహనంగా అటూ ఇటూ కదులుతోంది.

తనకు మెలకువ రావటానికి ఆ కదలికలే కారణమని అర్థమై గబుక్కున పైకి లేచాడు అతను.

"ఏమయింది? ఎందుకు ఈ గడబిడ??" తలను పైకి ఎత్తి దాని మొఖంలోకి చూస్తూ అడిగాడు.

అతను అడిగిన వెంటనే తలను విదిలించటం ఆపి ప్రశాంతంగా నిలబడింది అది. "నేను ప్రశాంతంగా పడుకోవటం నీకు నచ్చలేదు. నా నిద్ర చెడగొట్టటానికి ప్రయత్నం చేస్తున్నావు" చిరుకోపంగా అంటూ మళ్ళీ క్రింద పడుకోబోయాడు అతను.

పూర్తిగా పడుకోకముందే, రివ్వుమంటూ వచ్చి అతని మొఖానికి తగిలింది బలమైన ఒక గాలి తెర. ఆ తెరతో పాటు అదోరకమైన ఏదో వాసన వెగటుగా తగిలింది అతని నాశికా పుటాలకు.

అతని వంటికే కాదు... ఏనుగు మొఖానికి కూడా తగిలిందా గాలి. వెంటనే రెచ్చిపోయింది అది. తలను విదిలించి పెద్దగా ఘీంకరించబోయింది.

చటుక్కున చేతులు జాచి దాని తొండాన్ని గట్టిగా పట్టుకున్నాడు శివుడు. "వద్దు శబ్దం చేయవద్దు. నిన్ను ఆందోళనకు గురి చేస్తున్నదేమిటో నాకు తెలిసిపోయింది. నిశ్శబ్దంగా నిలబడు" గబగబా దాన్ని హెచ్చరించాడు.

అప్పుడే అటుగా వస్తున్న గాలితెర ఆగిపోయింది. దానితోపాటు అతనికి తెలియవస్తున్న వెగటు వాసన కూడా మటుమాయం అయిపోయింది. ఏనుగులో ఆందోళన నిలిచిపోయింది.

"ఈ వాసన ఏమిటో నాకు తెలియటం లేదు... ఎక్కడి నించి వస్తోందో అర్థం కావటం లేదు. ఇది తగిలినప్పుడల్లా నీకు పిచ్చెక్కుతోంది. అవునా?" దాని మొఖంలోకి చూస్తూ అడిగాడు మృదువుగా.

నల్లరాతి గుట్టలవైపే తిరిగి, తొండాన్ని పైకి ఎత్తి గాలిని వాసన చూడటానికి సిద్ధంగా వున్నట్లు నిలుచున్నది అది.

"ఇదేదో నువ్వు నేను ఇక్కడే నిలబడి తేల్చుకునేది కాదు... కాస్తంత ముందుకు పోయి అదేమిటో చూసి వద్దాం" అంటూ దాని దంతాలమీద పాదం మోపి, బరబరా కుంభస్తలం మీదికి ఎగబ్రాకాడు శివుడు. పాదాలతో మృదువుగా శరీరాన్ని తడిమి, ముందుకు కదలమని సూచించాడు.

క్షణికం పాటు కూడా ఆలస్యం చేయకుండా కదిలింది అది. పది బారల దూరం పోయిన తర్వాత గాని తెలియలేదు శివుడికి. దాని వెనుకే తనుకూడా బయలుదేరింది ఆడ ఏనుగు. తల్లితో పాటు గునగునలాడుతూ నడుస్తోంది గున్న ఏనుగు.

"అయ్యబాబోయ్... మీరు ఇద్దరూ రావటం దేనికి? మీరు ఇక్కడే వుండండి... మేము ఇలా పోయి అలా వచ్చేస్తాం" అంటూ వాటిని ఆపటానికి చూశాడు శివుడు.

ఆగలేదు అవి... అలాగే అడుగులు వేయటం మొదలుపెట్టాయి. వాటిని వెంటబెట్టుకుని తను గుట్టల దగ్గరికి పోవటాన్ని సాగరుల వారి భటులు చూస్తే వెంటనే అల్లరి చేసి నిద్రలు పోతున్న వారందరినీ లేపి కూర్చోబెడతారని శివుడికి తెలుసు.

పది బారలే కాదు... వంద బారల దూరం పోయిన తర్వాత కూడా అతన్ని ఆ ఏనుగుల్ని గమనించలేదు ఎవరూ. పగలంతా ఎక్కడా ఆగకుండా ప్రయాణం చేయడం వల్ల విపరీతమైన బడలికకు గురి అయివున్నారు కాబోలు... మర్రిచెట్టు మొదళ్ళను ఆనుకుని కునికిపాట్లు పడుతున్నారు కాపలా కాయవలసినవారు.

తన కదలికలు ఎవరికీ తెలియటం ఇష్టం లేకపోవటం వల్ల వాళ్లు నిద్రలు పోవటం తప్పుగా భావించలేదు శివుడు.

"త్వరగా... త్వరగా నడవండి... వాళ్ళు మేల్కొని మనకోసం వెతుకులాడే లోపల తిరిగి వచ్చేయాలి" ముందుకు వంగి మగ ఏనుగును హెచ్చరించాడు.

పెద్ద పెద్ద అడుగులు వేస్తూ మూడు వందల ధనువుల దూరం పోయి వున్నట్లుండి ఆగిపోయింది అది.

నిలువెత్తు రాతి బండలున్నాయి. అడుగు తీసి అడుగు వేయటానికి వీలు కానంత దట్టంగా మొలిచి వున్నాయిరకరకాల ముళ్ళపొదలు ఆ బండల మధ్య.

"మీరు ఇక్కడినించి కదలకండి... శబ్దం చేయకండి" అని మగ ఏనుగును హెచ్చరిస్తూ దాని కుంభస్థలం మీదినించి దగ్గర్లో వున్న ఒక బండమీదికి దుమికాడు శివుడు. ఆ బండమీది నించి ఇంకో బండమీదికి చేరుకున్నాడు. కన్ను పొడుచుకున్నా కానరాని ఆ కటిక చీకటిలో తప్పటడుగు వేయటం అంటూ జరిగితే ఏం జరుగుతుందో తలుచుకునే సరికి, చెమటలు ప్రత్యక్షం అయ్యాయి అతని మొఖం మీద.

ఎదుట ఏముందో తెలియకుండా కోతి మాదిరి అలా చిందులు వేయటం అనవసరం అనిపించి, వచ్చిన దారినే వెనక్కి బయలుదేరబోతుండగా గట్టిగా వచ్చి అతని మొఖానికి తగిలింది ఒక గాలి తెర. దానితో పాటు ఘాటుగా సోకింది మళ్ళీ అంతకుముందు తెలిసిన వెగటు వాసన.

'ఇది ఏదో ఇంతకుముందు బాగా పరిచయం వున్న వాసన మాదిరిగానే వున్నది. ఎక్కడ పరిచయం అయిందో తెలియటం లేదు' తనలో తను అనుకుంటూ వెనక్కి వచ్చేశాడు అతను.

అసహనంగా కదులుతున్నది మగ ఏనుగు. అతన్ని చూసి కాస్తంత కుదుట పడినట్లు కనిపించింది.

"ఈ బండలకు అవతలి పక్కన మనం తెలుసుకోవలసిన విషయం ఏదో వున్నది. ఈ చీకట్లో ఆ పని చేయటం సాధ్యపడేటట్లు కనిపించటం లేదు. ఏం చేద్దాం?" మగ ఏనుగు కుంభస్థలం మీదినించిపక్కకు వంగి ఆడ ఏనుగును అడిగాడు అతను.

శబ్దం చేయవద్దని అతను చేసిన హెచ్చరిక జ్ఞాపకం వున్నది కాబోలు... నిశ్శబ్దంగా తొండాన్ని ఎత్తి అతని ముఖాన్ని స్పృశించింది అది.

"వెనక్కి వెళ్ళిపోదాం... తెల్లవారిన తర్వాత వచ్చి చూద్దాం" అంటూ పాదాలతో మగ ఏనుగును హెచ్చరించాడు శివుడు.

వెనక్కి వెళ్ళిపోదామని శివుడు తన పాదాలతో హెచ్చరించిన వెంటనే కదిలింది మగ ఏనుగు. బండరాళ్ళకు దూరంగా నడవటం మొదలుపెట్టింది. దాని వెనుకే ఆడ ఏనుగు, దాన్ని అనుసరించి గున్న ఆ ప్రదేశాన్ని వదిలిపెట్టాయి.

వంద ధనువుల దూరం మాత్రమే ఇవతలికి వచ్చారు వాళ్ళు. సాగరుల వారు విడిదిచేసి వున్న ప్రదేశం ఇంకా రెండువందల ధనువులకు పైగానే

వున్నది. ఉన్నట్లుండి ఆగిపోయి మళ్ళీ అంతకుముందు మాదిరి తలను విదిలించడం మొదలుపెట్టింది మగ ఏనుగు.

"నిశ్శబ్దం... నిశ్శబ్దంగా వుండాలి మనం... నిశ్శబ్దం..." వేగంగా కొట్టుకుంటున్న గుండెల్ని చిక్కబట్టుకుంటూ జర్రున క్రిందికి జారాడు శివుడు మగ ఏనుగు కుంభస్థలం మీదినించి.

"నిన్ను కలవరపెడుతున్న వాసనేదో నాకు కూడా తెలుస్తోంది. అదేమిటో వెంటనే తెలుసుకుంటాను. నువ్వు కలవరపడాల్సిన పని లేదు"దాని దంతాలను పట్టుకుని, తలను పైకెత్తి దాని మొఖంలోకి చూస్తూ చాలా చిన్నకంఠంతో చెప్పాడు. "గున్నని జాగ్రత్తగా చూసుకో. దాన్ని కదలనీయకు" అని ఆడ ఏనుగుతో చెప్పి తనకు ఎడమచేతి వైపున వున్న పొదల్లోకి ప్రవేశించాడు.

మగ ఏనుగు మాదిరిగానే తొండాన్ని గాలిలోకి ఎత్తి చుట్టూ వున్న గాలిని వాసన చూస్తూ, అతని మాదిరిగానే పొదల్లోకి బయలుదేరబోయిన గున్న నడుమును తన తొండంతో చుట్టి కదలకుండా నిలబెట్టేసింది ఆడ ఏనుగు. అది గనుక ఏదైనా శబ్దం చేస్తే నెత్తిమీద మొట్టినట్లు తొండంతో దబదబా బాదడానికి సిద్ధంగా నిలబడింది.

చుట్టూ వున్న పొదలు తన వంటిమీద వున్న దుస్తుల్ని ముళ్ళమాదిరి పట్టుకుంటున్నా లెక్కచేయకుండా ముందుకు పోయాడు శివుడు. పోయిన కొద్దీ మరింత స్పష్టంగా తెలియసాగిందా వెగటు వాసన. వెడల్పాటి ఆకులు కలిగివున్న ఒక పెద్ద కలబంద పొద పక్కనుంచి రెండు అడుగులు వేయగానే కనిపించారు అతనికి గుంపుగా నిలబడి వున్న కొంతమంది వ్యక్తులు.

పొడవాటి బరిశెల్ని బలంగా వున్న బాణాల్ని పదునైన కత్తుల్ని పట్టుకుని వున్నారు అందరూ... తమలో తాము ఏదో విషయాన్ని గురించి చాలా తీవ్రంగా చర్చించుకుంటున్నారు.

దాహం వేస్తున్నట్లు ఎండుకుపోయిన పెదవుల్ని నాలుకతో తడి చేసుకుంటూ కనులు చిట్లించి పరిశీలనగా చూశాడు శివుడు.

ఒక్కసారిగా జలదరించింది అతని శరీరం. గిరుక్కున వెనక్కి తిరిగి వచ్చిన దారినే వేగంగా తన ఏనుగుల దగ్గరికి పోయాడు. తల విదిలిస్తున్న మగ ఏనుగు మీదికి ఎగబ్రాకుతూ "పదండి... త్వరగా... త్వరగా" అని

హెచ్చరించాడు తన ఆందోళనను అదిమిపట్టుకోవటానికి విశ్వప్రయత్నం చేస్తూ.

అతని మొఖంలో కనిపించకపోయినా, ఆ ఆందోళన అతని కంఠంలో ధ్వనిస్తూ వుండటాన్ని వెంటనే గమనించింది మగ ఏనుగు. ఒక్కసారిగా పరుగు మొదలుపెట్టింది అది.

వాటితో పరిచయం అయిన తర్వాత అవి అంత వేగంగా కదలటాన్ని అప్పుడే మొదటిసారి చూశాడు శివుడు. రెండు వందల ధనువుల దూరాన్ని రెండే రెండు నిమిషాల్లో అధిగమించి సాగరుల వారు విశ్రాంతి తీసుకుంటున్న చెట్లగుంపును చేరుకున్నది మగ ఏనుగు. పది అడుగులు వెనుకగా వచ్చింది ఆడ ఏనుగు. పాతిక అడుగులు ఆలస్యంగా అక్కడికి చేరుకున్నది పడుతూ లేస్తూ వచ్చిన గున్న.

"లేవండి... అందరూ నిద్రలు లేవండి" కంఠంలోని వణుకును కప్పి పెట్టుకోవటానికి ప్రయత్నం చేస్తూ నిద్రలు పోతున్న వారందరినీ లేపబోయాడు శివుడు.

మాటలు అతని నోటినుంచి బయటికి రాలేదు. "ఎక్కడికి పోయావురా? నువ్వు ఏమైపోయావో తెలియక మేము ఎంత గిజాటు పడుతున్నామో తెలుసా?" అంటూ ఒక చెట్టుచాటునుంచి ఈవలికి వచ్చాడు వాసుదేవుడు.

అతను ఒక్కడే కాదు, కత్తిని పట్టుకున్న సాగరుల వారు, ఆయుధాల్ని సిద్ధంగా పట్టుకున్న భటులు, జ్వాల, మంత్రి మహేశ్వరుడు ఒకరి తర్వాత ఒకరుగా మర్రిచెట్టు చాటునుంచి ఈవలికి వచ్చారు.

"రెండు నిమిషాల పాటు ఒకే ప్రదేశంలో కుదురుగా నిలబడటం గాని, కూర్చోవటం గాని నీకు చేతకాదా?" కనుబొమల మధ్యలో నుంచి గుర్రుగా చూస్తూ అతన్ని అడిగాడు సాగరులవారు.

"మనం పోరాటానికి సిద్ధంగా వుండాలి..." ఎండుకు పోయినట్లయిన గొంతుకను అరిచేత్తో అద్దుకుంటూ చెప్పాడు శివుడు.

"పోరాటమా? ఎవరితో? గుట్టల వెనక వున్న సైన్యం యుద్ధానికి బయలుదేరిందా?" ఆశ్చర్యంగా అడిగాడు మహేశ్వరుడు.

తల అడ్డం తిప్పి వాసుదేవుడి వంక చూశాడు శివుడు. "సైనికులు కాదు. ఆటవికుల దగ్గర మనం చూసిన తోడేలు గూడెం వాళ్ళు... చాలామంది..." అన్నాడు.

తన చెవుల్ని తానే నమ్మలేకపోతున్నట్టు చూశాడు వాసుదేవుడు.

"నిజమే చెపుతున్నాను. నది ఆవల వుండగా వాళ్ళు యుద్ధానికి వచ్చినప్పుడు వాళ్ళని చాలా గట్టిగా గమనించాయి ఏనుగులు. గాలి వాలున వాళ్ళ వాసనను గమనించినందువల్లే పిచ్చిగా ప్రవర్తించింది పెద్దది" మగ ఏనుగు తొండాన్ని కౌగలించుకుని నిలబెడుతూ చెప్పాడు శివుడు.

"పెద్దది ప్రవర్తించడం బాగానే వున్నది. మరి ఈ ఆడ ఏనుగు సంగతేమిటి? దానికి వాళ్ళ వాసన సోకలేదెందుకని?" వున్నట్లుండి కల్పించుకున్నది అంతవరకు మౌనంగా వున్న జ్వాల.

"గూడెంలో యుద్ధం జరుగుతున్నప్పుడు వీటిని నేను యుద్ధంలోకి రానీయలేదు. దూరంగానే నిలబెట్టాను. నిన్ను కాపాడే సమయంలో ఆ తోడేలు గూడెం యోధుడిని తొండంతో చుట్టిపట్టుకున్నది మగ ఏనుగు. అందువల్లనే వాళ్ల వాసన దానికి బాగా తెలిసింది" అంతకుముందు ఆటవికగూడెంలో జరిగిన పోరాటాన్ని తలుచుకుంటూ చెప్పాడు శివుడు.

"నది మీది వంతెనను మనం కూల్చిపారేశాము... మరి ఆవలి ఒడ్డున వుండాల్సిన ఈ తోడేలుగాళ్ళు ఈవలి ఒడ్డుకు ఎలా రాగలిగారు?" అడిగాడు మంత్రి మహేశ్వరుడు.

"ఎలా రాగలిగారన్నది కాదు సమస్య. ఎందుకు వచ్చారో మనం తెలుసుకోవాలి. మొసళ్ళ బారిన పడకుండా నదిని దాటటం ఏమంత కష్టమైన పనేమీ కాదు. మంచి తెప్పనో, పడవనో సిద్ధం చేసి వుంచుకుంటే మనం కూడా ఆ పని చేయవచ్చు" సాలోచనగా అన్నాడు వాసుదేవుడు.

"మనం ఇక్కడ విడిది చేసివున్న సంగతి వాళ్ళకి తెలిసిపోయి వుంటుందా?" అడిగాడు సాగరులవారు.

"తెలిసి వుండకపోవచ్చు. తెలిసివుంటే ఈపాటికి యమభటుల మాదిరిగా వచ్చి మనమీద పడివుండేవాళ్ళు" అంటూ చుట్టూ చూశాడు వాసుదేవుడు.

‘‘ఈ శివుడు ఏమైపోయాడో తెలియక అందరమూ నిద్రలు చెడగొట్టుకున్నాము. చెడిన నిద్ర ఎలాగూ చెడిపోయింది. వెంటనే నగరానికి ప్రయాణం మొదలుపెట్టటం బాగుంటుంది. వెలుగు వచ్చేసరికి చాలా దూరం వెళ్లిపోవచ్చు" అన్నాడు మహేశ్వరుడు.

శివుడిని చూశాడు వాసుదేవుడు.

"ఆ తోడేలు గాళ్ళు ఈ పక్కకి ఎందుకు వచ్చారో తెలుసుకోవాలి. ఒకవేళ వాళ్ళు గనక శిఖావంతుడి సైన్యంతో చేతులు కలిపి వుంటే చాలా ప్రమాదం" అన్నాడు అతను.

"వంతెన లేదు. మనం నాశనం చేశాము. ఎన్ని పడవల్ని సిద్ధం చేసినా గుట్టల అవతల వున్న సైన్యాన్నంతా అవతలి ఒడ్డుకు తీసుకుపోవటానికి చాలా సమయం పడుతుంది. ఈ పరిస్థితిలో ఆ తోడేళ్ళగూడెం వాళ్ళు శిఖావంతుడి సైన్యానికి చేయగల సహాయం ఏముంటుంది?" అడిగింది అంతవరకూ మౌనంగానే వున్న జ్వాల.

"కారణం లేకుండా వాళ్లు ఈవలి ఒడ్డుకు రారు. వచ్చారంటే ఏదో కారణం చాలా బలమైనదే అయివుంటుంది" మళ్ళీ అన్నాడు శివుడు.

సాగరుల వారు, మహేశ్వరుడు ఒకరి వంక ఒకరు చూసుకుని వెంటనే వాసుదేవుడి కేసి తిరిగారు.

"శివుడి మాటల్లో యదార్థం వున్నది. ఆ తోడేళ్ళ గూడెం వాళ్ళ సంగతేమిటో తెలుసుకోవటమే చాలా మంచిది" అంటూ శివుడి మాటల్ని బలపరిచాడు వాసుదేవుడు.

"అయితే ఇప్పుడు మనం చేయవలసింది ఏమిటో అదికూడా నువ్వే చెప్పు" సాలోచనగా అన్నాడు సాగరులవారు.

"ఏమంటావురా శివుడు?" అని అడిగాడు వాసుదేవుడు.

"ఎంతో దూరంలో లేరు... చాలా దగ్గర్లోనే వున్నారు... చూపిస్తాను. నాతో రండి" అంటూ వెనక్కి తిరిగాడు శివుడు.

అతనితోపాటు తనుకూడా వెనుతిరిగింది మగ ఏనుగు. దానితోపాటు ఆడ ఏనుగు, దాని బిడ్డ మళ్ళీ ప్రయాణానికి సిద్ధం అయ్యాయి.

"వద్దు. మీరెవరూ నాతో రాకూడదు. అసలు అక్కడ ఏం జరుగుతున్నదో తెలుసుకోకుండా మనం తొందరపడకూడదు. మీరు ఇక్కడే వుండిపోండి" అంటూ అతి బలవంతంగా వాటిని అంతకుముందు నిలబెట్టిన రావిచెట్టు క్రిందికి తీసుకుపోయి వదిలాడు శివుడు. తాను చెప్పేంతవరకు అక్కడినించి కదలకూడదని ఇంకోసారి గట్టిగా ఆంక్ష పెట్టి వాసుదేవుడి దగ్గరికి వచ్చాడు.

"అవి వాడి మాటలు వింటాయంటారా ప్రభూ?" నొసలు ముడివేసి చూస్తున్న సాగరులవారిని అడిగాడు మహేశ్వరుడు.

"గంగిగోవుల వంటివి ఈ మదగజాలు. ఒకసారి మనమీద నమ్మకాన్ని ఏర్పరచుకుంటే మరణించి మట్టిలో కలిసిపోయేంత వరకు మర్చిపోవు. మనం తిరిగి వచ్చేంతవరకు ఇవి ఇక్కడే వుంటాయని నా నమ్మకం" అంటూ ముందుకు అడుగు వేశారు సాగరులవారు.

❖ ❖ ❖

అంతకుముందు శివుడు చూసినప్పుడు ఎక్కడ నిలబడివున్నారో, ఇప్పుడు కూడా అక్కడే నిలబడి తమలో తాము మాట్లాడుకుంటూనే వున్నారు తోడేలు గూడేనికి చెందిన ఆటవికులు అనేకమంది.

"అడవి జంతువులకి వాళ్ళకి పెద్ద తేడా వుండదు. గాలివాలున మన వాసన సోకితే మన ఏనుగుల మాదిరి చిటికెలో పసికట్టేస్తారు" దూరంగా పొదల చాటున నిలబడి అందర్నీ హెచ్చరించాడు వాసుదేవుడు.

కొండగుట్టల మీదినించి ఆగి ఆగి వస్తోంది గాలి. అది ఆటవికుల మీది నుంచి సాగరుల వారి బృందం మీదికి వస్తూ వుండటం వల్ల, వాళ్ళ ఉనికి బట్టబయలు కావడంలేదు. ఒకవేళ గాలి దిశ మారి పొదల మీదినించి గుట్టలవైపు వీచటం మొదలుపెడితే వాసుదేవుడు చెపుతున్నట్టు చిటికెలో రట్టు అయిపోతుంది వారి గుట్టు.

"అయితే మనం యిక్కడే వుండిపోవాల్సి వస్తుంది. వాళ్ళ సమీపంలోకి పోవటం అసాధ్యం అయిపోతుంది" విసుగ్గా అన్నాడు సాగరులవారు.

"ఏరా శివుడూ? ఏం చేద్దాం?" అడిగాడు వాసుదేవుడు.

"వాడు చిన్నవాడు... వాడికి ఏం తెలుస్తుందని అదేపనిగా వాడి అభిప్రాయాన్ని అడుగుతున్నావు?" చిరుకోపంతో అనబోయి ఆఖరి క్షణంలో ఆ మాటల్ని తనలోనే అదుముకున్నాడు సాగరులవారు.

నదిమీది వంతెనను చూసింది వాడే. గుట్ల దగ్గరి ఆటవిక మూకను గమనించింది కూడా వాడే... అప్రక పరాక్రమవంతులమని పేరు పొందిన తాము చేయలేని పనులన్నిటినీ చకచకా చేసి చూపిస్తున్నది కూడా వాడే.

తన మనసులోని మాటల్ని ఆయన బయటపెట్టలేరు. అయినా సరే చిటికెలో కనిపెట్టేసినట్లు ముసిముసి నవ్వులు నవ్వాడు మంత్రి మహేశ్వరుడు. అంత చీకటిలోనూ అది గమనించి మరింత గుర్రుగా చూశాడు అతని వంక సాగరులవారు.

"ప్రభువులు ఇంకా శివుడు చిన్నపిల్లవాడేనని, ఏమీ తెలియని అమాయకుడని భ్రమపడుతున్నారు. వాడు ఎప్పుడో పెద్దవాడైపోయాడు. తమరు వాడి పట్ల వున్న భావాలన్నిటినీ మార్చుకోవలసిన సమయం వచ్చేసింది" ఆయనకు మాత్రమే వినబడేటట్లుగా చెప్పాడు మహేశ్వరుడు.

మరోసారి ఇంకా కాస్త కోపంగా చూసి వేగంగా తల తిప్పుకున్నాడు సాగరులవారు.

ఆయన మహేశ్వరుడి వైపు చూస్తున్న సమయంలో వాసుదేవుడికి, శివుడికి మధ్య ఏదో సంభాషణ నడిచినట్లుంది. వాసుదేవుడు తనకు ఇచ్చిన చురకత్తిని దుస్తుల్లో నుంచి తీసి, ఎడమ చేతిలో పట్టుకున్నాడు శివుడు. నిఠారుగా నిలబడిన వాడు కాస్తా నేలబారుగా క్రిందికి వంగి, మోచేతుల మీద పాకుతూ ముందుకు పోతున్నాడు.

తనకు తెలియకుండానే ముందుకు అడుగు వేయబోయిన సాగరుల వారికి చేయి అడ్డంపెట్టి ఆపేశాడు వాసుదేవుడు.

"పెద్దవాళ్ళం మనం. మన కదలికల వల్ల ఎంతో కొంత శబ్దం ఉత్పన్నమౌతుంది. వాడు చిన్నవాడు... తక్కువ శబ్దంతో కదలగలడు" చిన్న కంఠంతో ఆయన చెవిలో ఊదాడు.

పాము మాదిరి పాకుతూ, గుంపుగా నిలబడి వున్న ఆటవికులకు చాలా దగ్గరిగా పోతున్న శివుడికి వినబడలేదా మాటలు.

అతని దృష్టి అంతా ముందున్న ఆటవికుల మీదనే కేంద్రీకరించి వున్నది. ఆయుధాల్ని బిగించి పట్టుకుని, శిలావిగ్రహాల మాదిరి నిలబడి వున్నారు వారందరూ.

అవయవాలు ఒక్కటికూడా కదలటం లేదు. కనులు మాత్రం చురుకుగా అటూ యిటూ చూస్తున్నట్లు తెలిసిపోయింది అతనికి.

తనున్న ప్రదేశంలో నుంచి మరో అడుగు దూరం ముందుకు పోతే వారి దృష్టిని ఆకర్షించడం తప్పనిసరి అని తెలిసి ఆగిపోయి, చెవులు రిక్కించాడు.

పావుఘడియ పాటు సాగింది అతని నిరీక్షణ. ఉన్నట్లుండి కదిలి, నెమ్మదిగా నిలుచున్న ప్రదేశంలోనే కూర్చున్నాడు ఒక ఆటవికుడు.

"పనీ పాట లేకుండా బొమ్మల మాదిరి నిలబడి నిలబడి నా కాళ్ళు నెప్పులు పుడుతున్నాయి. ఇంకా ఎన్నిరోజులు ఈ కాపలా?" తలతిప్పి పక్కనే వున్న ఆటవికుడిని అడిగాడు.

"నిన్నటిదాకా ఇవాళ రేపు అంటూ చెప్పారు లోయలో వున్నవాళ్ళు. నదిమీది వంతెన నాశనం అయిపోయే సరికి, వాళ్ళకు కూడా ఏం చేయాలో తెలియటం లేదు. వాళ్ళ నాయకుడి దగ్గర్నించి ఆజ్ఞ కోసం ఎదురు చూస్తున్నారు" అన్నాడు అతను.

గుట్టల వెనుక పెద్ద లోయ వున్నదనీ, అందులో అపారమైన సైన్యం నిలబడి వున్నదనీ శివుడికి పూర్తిగా తెలియదు. సాగరుల వారు గుట్ట దిగి వచ్చేసరికి అతను నిద్రలో వుండటమే అందుకు కారణం.

అయితే ఈ తోడేలు గూడెం వాళ్ళని చూసిన తర్వాత వెనక్కి వెళ్ళినప్పుడు జ్వాల మాట్లాడిన మాటల ద్వారా శిఖావంతుడి సైన్యం ఏదో గుట్టల వెనక నిలబడి వున్నట్లు రూఢి అయింది.

ఇప్పుడు వాళ్ళు మాట్లాడుతున్నది ఆ సైన్యాన్ని గురించేనని గ్రహించి, ఊపిరి మరింతగా బిగపట్టి చెవులు రిక్కించాడు.

"వాళ్ళ నాయకుడు ఇక్కడ లేదు. ఎక్కడో వున్నాడు. అతను ఆజ్ఞ పంపి వాళ్ళు లోయలో నుంచి బయటికి వచ్చేసరికి చాలా రోజులు పడుతుంది. అంతవరకూ మనం ఇలాగే నిలబడి వుండాల్సిందేనా?" నిస్పృహగా అడిగాడు కూర్చున్న ఆటవికుడు.

"పని చేసిపెడతామని ఒప్పుకున్న తర్వాత ఎంతటి కష్టాన్నయినా భరించ వలసిందే... నోరు మూసుకో... ఇంకోసారి గొణిగితే నీ తల ఎగిరిపోతుంది" కటువుగా అన్నాడు పక్కనే వున్న ఆటవికుడు.

మాటల్ని మాని మళ్ళీ లేచి శిలావిగ్రహం మాదిరి నిలుచున్నాడు కూర్చున్న ఆటవికుడు.

చెవులు రిక్కించిన శివుడికి అంతా అయోమయంగా అనిపించింది. లోయలో వున్న సైన్యానికి ఏదో పని చేసిపెడతామని వాళ్ళు వాగ్దానాలు చేసినట్టు తెలుస్తోంది. ఏమిటా పని??

ఎంత ఆలోచించినా సమాధానం లభించకపోవటంతో, ఒకింత అసహనానికి గురి అయినాడు అతను.

అసలు వాళ్ళు అలా నిలబడి వుండటానికి కారణం ఏమిటో తెలుసుకో గలిగితే, ఆ ప్రశ్నకు సమాధానం లభిస్తుందని అనుకుంటూ మరింత జాగ్రత్తగా ముందుకు సాగాడు.

బండరాళ్ళ మధ్య దట్టంగా పెరిగిన ముళ్ళపొదల మాదిరి కాకపోయినా, మోకాలి ఎత్తువరకు ఎదిగి వున్నాయి అక్కడ రకరకాల మొక్కలు. వాటిమధ్య నిజమైన పాము మాదిరిగానే పాకుతున్నా అతన్ని గమనించటం చేతకాలేదు స్తంభాల మాదిరి నిలబడి వున్న ఆ ఆటవికులకి.

వారికి పది ధనువుల దూరంగా, ఒక పక్కనుంచి ఇంకా ఇంకా ముందుకు పోయాడు శివుడు.

ఉన్నట్లుండి మాయమైపోయాయి అంతవరకూ అతనికి రక్షణగా వున్న మోకాలి ఎత్తు మొక్కలు. ఎదుట అంతా ఖాళీ స్థలం.

ఆ స్థలం నిండుగా అంత చీకటిలోను అతనికి స్పష్టంగా అగుపించాయి గున్న ఏనుగు కంటె కొంచెం ఎత్తుగా... పెద్ద ఏనుగుల మాదిరి బలిష్టంగా వున్న భల్లూకాలు అనేకం.

ఒక్కసారిగా తడి ఆరిపోయింది శివుడి కంఠం. క్రిందినించి లేచి శరవేగంతో వెనక్కి పారిపోవాలన్న కోరిక చాలా గట్టిగా కలిగింది అతనికి.

వెల్లికిలా పడుకుని వున్నాయి వాటిలోకొన్ని. మొఖాలను ముందు కాళ్ళమీద పెట్టుకుని నిద్రతో జోగుతున్నాయి మరికొన్ని. నిద్రపట్టక కాబోలు వెనుక కాళ్ళమీద నిలబడి చుట్టూ చూస్తున్నాయి ఇంకా కొన్ని.

చీకటి సమయం కావడంవల్ల చాలా చల్లగా వున్నది అక్కడి వాతావరణం. అంత చల్లదనంలోనూ మండుటెండలో నిలబడినట్లు శివుడి మొఖంమీద ప్రత్యక్షం అయ్యాయి స్వేద బిందువులు.

దగ్గర దగ్గరగా రెండు మూడు వందలకు పైగానే వున్నట్లు కనిపిస్తోంది ఆ ఎలుగుబంట్ల సంఖ్య.

అన్ని క్షుద్రపాణుల్ని ఒకేచోటగా చేర్చి వుంచటం దేనికి? తిక్కరేగితే ఎటువంటి జంతువునైనా చీల్చి చెండాడేస్తాయని అంటారు ఆ ఎలుగులు గురించి తెలిసినవాళ్ళు. అటువంటి ప్రమాదకర జంతువుల్ని పోగుచేసి వుంచటంలో రహస్యం ఏమిటి?

పదే పది క్షణికాల పాటు శివుడిని వివశుడిని చేసిందా ఆలోచన. తల ఎత్తి చుట్టూ చూస్తున్న ఒక ఎలుగు దృష్టి ఉన్నట్లుండి అతనిమీదికి ప్రసరించటం కనిపించిందతనికి.

అంతకుముందు ఒక్క క్షణం వరకూ ఎంతో ప్రశాంతంగా నిలబడి వున్న ఆ ప్రాణి అతన్ని గమనించిన వెంటనే గుండెలు జలదరించేటట్లు గురక పెట్టి ఎగురుకుంటూ వచ్చేసింది అతని దగ్గరికి.

అక్కడే వుంటే తాను బలి అయిపోవటం తప్పదని తెలిసిపోయింది శివుడికి. జాగ్రత్తలన్నిటినీ గాలికి వదిలేశాడు అతను. క్రిందినించి వేగంగా పైకి లేచాడు.

ఎలుగుబంటి చేసిన శబ్దాలు ముందున్న ఆటవికులకు వినిపించి, గిరుక్కున వెనుతిరిగి చూశారు వాళ్ళు.

"ఎవరు? ఎవరు??" పైకి లేస్తున్న శివుడు కనిపించేసరికి బిగ్గరిగా అడుగుతూ ఒకేసారి పరిగెత్తుకు రాసాగారు.

ఆలస్యం చేస్తే ఆ తరువాత బాధపడే అవకాశం కూడా వుండదని తెలిసిపోయింది శివుడికి. మృత్యుదేవత మాదిరి వచ్చేస్తున్న భల్లూకానికి దొరికితే, పదునైన గోళ్ళతో రక్కి చంపేస్తుంది. ఆటవికులకు చిక్కితే తమ దగ్గర వున్న ఆయుధాలతో ముక్కలు ముక్కలు చేసి, ఆ భల్లూకానికి ఆహారంగా వేసేస్తారు.

అన్నిటికి తెగించి పరుగు అందుకున్నాడు అతను. ఎదురుగా వస్తున్న ఆటవికుల మధ్యలో నుంచి అతివేగంగా దూసుకుపోయాడు.

ఒక ఆటవికుడి ఖడ్గం తగిలి గాయపడింది అతని తల. మరొకడి చేతిలోని బరిశె పొడుచుకుని, భుజం రక్తసిక్తమైంది. అయినా సరే ఆగలేదతను. అలాగే పరిగెత్తాడు.

తమను చూసి దూరంగా పారిపోకుండా, తమకు ఎదురు రావటమే కాకుండా మధ్యలో నుంచి బాణం మాదిరి దూసుకుపోయిన అతన్ని చూసి పట్టరాని కోపంతో పిచ్చివాళ్ళ మాదిరి కేకలు పెట్టారు కొందరు ఆటవికులు.

ఆ కేకలు విశ్రాంతి తీసుకుంటున్న భల్లూకాలన్నిటినీ విపరీతంగా రెచ్చగొట్టాయి కాబోలు...గుండెలు జలదరించేటట్లు గురకలు పెడుతూ లేచి నిలబడ్డాయి అవన్నీ.

ఆ ఒక్క అంశం ఆ క్షణంలో శివుడి ప్రాణాలను కాపాడింది. “ఆగండి... అందరూ ఆగిపోండి.. అనవసరంగా వాటిని రెచ్చగొట్టకండి... అదుపు తప్పితే ఆపడం కష్టం” అని ఆ ఆటవికులందరికీ నాయకుడి మాదిరి కనిపిస్తున్న వ్యక్తి ఆందోళనగా హెచ్చరించటంతో అరుపుల్ని ఆపేశారు. పిచ్చిపట్టినట్లు గంతులు వేయటం మానుకున్నారు.

“ముందు వాటిని పడుకోబెట్టండి. త్వరగా... త్వరగా” అని కొందరికి పురమాయించి, పదిమందిని మాత్రం శివుడి వైపు పంపించాడు వారి నాయకుడు.

చిత్రమైన ధ్వనులు చేస్తూ ఈలల వంటి శబ్దాలను వినిపిస్తూ గురకలు పెడుతున్న ఎలుగుల చుట్టూ తిరిగారు ఆ పనికి వినియోగింపబడిన ఆటవికులు.

ఆ శబ్దాలను వినటానికి అలవాటు పడివుంటాయి కాబోలు రెండే రెండు నిమిషాల్లో గురకల్ని ఆపి, తిరిగి ఎక్కడివక్కడ ఆగిపోవటం మొదలుపెట్టాయి ఆ ఎలుగుబంట్లు.

తమ దగ్గర వున్న పొడుగాటి బరిశెల్ని గట్టిగా పట్టుకుని, గాలిలో ఊపుతూ శివుడిని వెంటాడారు ఆ పనికి పురమాయించబడిన ఆటవికులు.

అప్పటికే పాతిక అంగల దూరం ముందుకు వెళ్ళిపోవటం వల్ల తేలికగా తప్పించుకోవటమే కాదు తన కోసం ఆతృతగా ఎదురుచూస్తున్న తనవారిని కూడా హెచ్చరించాడు శివుడు.

“పారిపోవాలి... ప్రమాదం తరుముకుంటూ వచ్చేస్తోంది... పారిపోవాలి” అంటూ సుడిగాలి మాదిరి వారిని చేరుకున్నాడు.

జరిగింది ఏమిటో పూర్తిగా తెలియకపోయినా అతను చెపుతున్న ప్రమాదం ఎటువంటిదో కళ్ళారా చూశారు అందరూ. ఎదురుప్రశ్నలు వేయలేదు. ఏమి జరిగిందని అడగలేదు.

"యువరాణి చేయి పట్టుకో వాసుదేవా" అని వాసుదేవుడిని హెచ్చరించి, తను మహేశ్వరుడిని తనతోపాటు పరుగు తీయించాడు సాగరులవారు.

తాపీగా తీరికగా వెళ్ళిన వారందరూ ఏవో భూతాలు వెంటపడినట్లు అలా వేగంగా వచ్చేస్తూ వుండటాన్ని గమనించారు చెట్లగుంపు దగ్గర వుండిపోయిన భటులు అందరూ.

"ప్రమాదం ఏదో ప్రభువుల వారిని తరుముకుంటూ వస్తోంది. అందుకోండి ఆయుధాల్ని" ఖంగుమంటున్న కంఠంతో హెచ్చరించాడు అందర్నీ వారి నాయకుడు.

బరిశెల్ని పట్టుకుని ఎదురు పరిగెత్తారు వారిలో కొందరు. విల్లంబుల్ని తీసుకుని, బాణాలను గురిపెట్టారు మరికొందరు.

ఆ సంరంభం అంతవరకూ ఎంతో ప్రశాంతంగా నిలబడి వున్న ఏనుగుల్ని రెచ్చగొట్టింది. నిశ్శబ్దంగా వుండాలని శివుడు చేసిన హెచ్చరికల్ని గాలికి వదిలేసి చెవులు గింగిర్లెత్తిపోయేలా ఘీంకారాలు మొదలుపెట్టాయి అవి.

అందరికంటె వెనుకగా పరిగెత్తుతున్న శివుడి వెన్నుమీద దృష్టిని నిలిపి, తన బరిశెను విసరబోతున్నాడు తరుముకు వస్తున్న ఆటవికుడు ఒకతను.

ఉరుములు ఉరిమినట్లు వినవచ్చిన ఘీంకారాలను వినేసరికి, చేతులు వణికాయి అతనికి. సూటిగా వచ్చి శివుడి వెన్నులో దిగబడవలసిన ఆ బరిశె పక్కకు పోయి నేలలో దిగబడింది.

గుండెను దిటవు పరుచుకుని, అతను ఇంకో బరిశెను అందుకునే లోపల చెట్లగుంపులోకి పోయి ఒక చెట్టుచాటుకు దూకేశాడు శివుడు.

భూమి కంపించేలా అడుగులు వేస్తూ అతని దగ్గరికి వస్తున్న ఏనుగుల్ని చూశారు ఆటవికులు. విల్లంబుల్ని పట్టుకున్న భటుల్ని, పరిగెత్తుకు వస్తున్న వారిని గమనించారు. కూడబలుక్కున్నట్లు ఒకేసారి వెనక్కి తిరిగి వచ్చిన దారినే పొదల్లోకి పారిపోయారు.

❖ ❖ ❖

"సర్దేయండి... మన సామాగ్రినంతా అశ్వాలమీదికి సర్ది వెంటనే ప్రయాణం మొదలుపెట్టండి" చెట్లగుంపులోకి అడుగుపెట్టగానే పెద్ద కంఠంతో భటులందరినీ హెచ్చరించాడు మంత్రి మహేశ్వరుడు.

కనిపించినట్లే కనిపించి వెనక్కి పారిపోయిన ఆటవికుల వెనుక పరిగెత్త టానికి సిద్ధపడుతున్న భటులు వెంటనే ఆ పనులు చేయడం మొదలుపెట్టారు.

"ఇంత బతుకూ బతికి ఆఖరికి ఆ ఆటవికులకు భయపడి పారిపోవ టమా?" కరకరలాడుతున్న కంఠంతో అన్నాడు సాగరులవారు.

"వాళ్ళని చూసి కాదు. వాళ్ళ అరుపుల్ని విని లోయలో నుంచి బయటికి వచ్చే శిఖావంతుడి సైన్యాన్ని చూసి మనం భయపడవలసిందే..." నిర్భయంగా సమాధానం ఇచ్చి యువరాణి జ్వాలను ఒక అశ్వం మీదికి నెట్టాడు మహేశ్వరుడు.

ఆ మాటల్లోని యదార్థం వెంటనే అణిచివేసింది సాగరుడి క్రోధాన్ని. నిజమే... ఆటవికుల గోలను గమనించి ఆ సైన్యం ఈవలికి వస్తే తట్టుకో గలరా తాము??

"ఇంతకీ నువ్వు ఏం చూశావురా శివుడు?" తన అశ్వం దగ్గరికి పోతూ శివుడిని అడిగాడు ఆయన.

మగ ఏనుగుపైకిపాకి, తనకు తగిలిన గాయాల్ని తడుముకుంటున్నాడు శివుడు. చిన్న చిన్న మాటలతో తను చూసింది ఏమిటో చెప్పాడు.

"భల్లూకాలా? శిఖావంతుడి సైనికులు ఈ ఆటవికుల సాయంతో భల్లూక దళాన్ని తయారుచేయించారా? ఎందుకు??" విపరీతమైన ఆశ్చర్యంతో అడిగాడు సాగరుల వారు.

అడిగిన వెంటనే శివుడు సమాధానం చెప్పవలసిన అవసరం లేకుండానే అవగతమైపోయింది ఆయనకి అసలు విషయం.

అరుపులతో కేకలతో, రకరకాల సైగలతో శత్రువుల మీదికి తన గజ దళాన్ని నడిపించే సమయంలో ఆ భల్లూకాలు ఎదురైతే ఏం జరుగుతుంది??

ఆ పైన మరొక్క ప్రశ్న కూడా వేయలేదాయన. తన అశ్వాన్ని అడవి దారివెంట పరుగులు తీయించటంలో పూర్తిగా నిమగ్నమైపోయాడు.

❖ ❖ ❖

"తల్లీ... తల్లీ... వర్తమానం వచ్చింది. ప్రభువుల వారు పంపిన పావురం వర్తమానాన్ని మోసుకు వచ్చింది" పెద్ద కంఠంతో చెపుతూ అంతఃపురంలోకి పరిగెత్తుకు వచ్చింది పరిచారిక.

జ్వలిత సామ్రాజ్యంలో ఒక భాగమైన చంపక మండలంలో పట్టువస్త్రాలు విపరీతంగా తయారు చేయబడతాయి. అక్కడినించి వచ్చిన ఒక వర్తకుడిని అంతఃపురంలోనికి పిలిపించి, అతను తెచ్చిన వస్త్రాలను ఎంపిక చేస్తోంది చారులతాదేవి.

పరిచారిక అరుపుల్ని వినగానే కలువపువ్వు మాదిరి విప్పారింది ఆమె వదనం. "మీరు తెచ్చిన వాటినన్నిటినీ మేము తీసుకుంటాము. రేపు ఉదయమే ధనాగారం నుంచి మీకు ధనం అందచేయబడుతుంది. ఇప్పుడు వెళ్ళిపొండి" అని ఆ వర్తకుడికి  చెప్పింది.

విపరీతమైన సంతోషంతో వంగి వంగి నమస్కారాలు చేస్తూ ఆ మందిరంలో నుంచి వెళ్ళిపోయాడు ఆ వర్తకుడు.

పరిచారిక చేతిలోని వస్త్రపు పీలికను తీసుకుని గబగబా చదివింది చారులతాదేవి.

"సైన్యాన్ని సిద్ధం చేయమని సేనాధిపతికి ఆదేశాలు ఇవ్వాలి. గజశాల నిర్వాహకుడికి చెప్పి శాలలో వున్న సుశిక్షిత గజాలన్నిటినీ కోట వెలుపలికి తరలించాలి... యుద్ధం ఏ క్షణంలోనైనా ప్రారంభం కావచ్చు" సాగరుల వారు స్వహస్తాలతో వ్రాసిన వర్తమానం అది. వివర్ణమైపోయింది ఆమె వదనం.

యుద్ధం అంటే శౌర్య సాహసాల ప్రదర్శన మాత్రమే కాదు, విపరీతమైన జనక్షయం కూడా. శత్రువులు ఎంతమంది హతమారిపోతారో, అంతే సంఖ్యలో తమవారు కూడా ప్రాణాలు పోగొట్టుకోవచ్చు. కన్నవారికి, కట్టుకున్నవారికి, కడుపున పుట్టినవారికి తీరని బాధల్ని మిగల్చవచ్చు.

కళ తప్పిన చారులతాదేవి మొఖాన్ని చూసి, సాగరుల వారు పంపిన వర్తమానం ఏదోగాని, సంతోషించదగినది కాదని తెలిసిపోయింది ఆ మందిరంలో వున్న పరిచారికలందరికీ.

"ఏమయింది తల్లీ? ఏదైనా దుర్వార్త లిఖించబడిందా? అడవిలో జరుగరానిది ఏదైనా జరిగిందా?" ధైర్యం చేసి ఆమెను అడిగింది ఒకత్తె.

తల అడ్డం తిప్పి తన దిగులును తనలోనే అతి బలవంతంగా అదుము కున్నది చారులతాదేవి. "సైన్యాధిపతుల వారిని వెంటనే సభామందిరం దగ్గరికి రమ్మని వార్త పంపించండి. నగర పెద్దలను కూడా సమావేశపరచండి." అని ఆజ్ఞ ఇచ్చి, తమ అభ్యంతర మందిరంలోకి వెళ్లిపోయింది– సభా మందిరంలోకి వెళ్ళేటప్పుడు ధరించవలసిన దుస్తుల్ని ధరించేందుకు.

ఒకరి మొఖాలు ఒకరు చూసుకుంటూ ఆమె ఆజ్ఞలను అమలు పరిచేటందుకు కదిలారు ఆ పరిచారికలు.

పావుఘడియ తరువాత వున్నట్లుండి గుండెలు జలదరించే స్థాయిలో మ్రోగటం మొదలుపెట్టింది గజశాలకు దగ్గర్లో వున్న కూడలిలోని పెద్ద గంట.

ఎవరి పనుల మీద వాళ్లు ఆత్రుతగా అటూ ఇటూ పోతున్న నగర ప్రజలందరూ అదిరిపడ్డారు ఒక్కసారిగా.

"నిజంగానే సరైన కారణంతో అది మోగుతోందా?" అంతకుముందు అది మ్రోగటానికి శివుడి ఆకతాయితనమే కారణమని భావిస్తూవుండటం వల్ల తమలో తాము మాట్లాడుకోవటం మొదలుపెట్టారు చాలామంది.

"సరైన కారణం లేకపోతే ఇది ఇంతసేపు ఇంకా మ్రోగుతూనే వుండదు... సభా భవనం దగ్గరికి వెళ్ళటమే మంచిది" తీవ్రంగా ఆలోచించి వారి సందేహాలకు సమాధానం చెప్పారు కొందరు వృద్ధులు.

కర్రల్ని, కత్తుల్ని పట్టుకున్న పౌరులు అనేకమంది ముందు గంట దగ్గరికి, ఆ తరువాత అక్కడినించి సభాభవనం దగ్గరికి బయలుదేరారు.

రాచరిక అధికారాన్ని సూచించే దుస్తులు ధరించి, పదిమంది పరిచారికలు విచ్చుకత్తులు పట్టుకుని తన వెనుక నడుస్తుండగా సభా భవనం దగ్గరికి వచ్చింది చారులతాదేవి.

"దేవి వారికి జయము జయము... కలకాలం చల్లగా చక్కగా వుండాలి జ్వలిత సామ్రాజ్యము" చేతుల్ని గాలిలోకి ఎత్తి పెద్ద పెద్ద కంఠాలతో జయజయ ధ్వానాలు చేశారు అందరూ.

కవచ శిరస్త్రాణాలు ధరించిన సైనికులు అందరూ ఆయుధాల్ని ఎత్తి ఆమెకు సైనిక వందనం చేశారు.

"తల్లీ... మీ ఆజ్ఞల కోసం ఎదురు చూస్తున్నాము" మూడు అడుగులు ముందుకు వేసి వినయంగా అన్నాడు సైన్యాధిపతి.

సాగరుల వారి వద్ద నుంచి వచ్చిన వర్తమానంలో ఏముందో ఇంకా తెలియలేదు అతనికి. వర్తమానం అయితే వచ్చిందని మాత్రం తెలుసు.

"నగరం అంతా దిగ్బంధనం కావాలి... గోడలమీద బురుజుల మీద కాపలా పటిష్టపరచాలి... ఎటువంటి దాడి జరిగినా ఎదుర్కొనేటందుకు సిద్ధం అవాలి..." తడుముకోకుండా చెప్పింది ఆమె.

"తల్లీ... మరి సాగరులవారు??" అడిగాడు సైన్యాధిపతి.

"వస్తారు... వారు దారిలోనే వున్నారు" అంటూ సైన్యాధిపతి వెనుకే నిలబడివున్న గజశాల నిర్వాహకుడిని దగ్గరికి పిలిచింది చారులతాదేవి.

"సుశిక్షితులైన గజాలన్నిటినీ మనం వెంటనే నగరం వెలుపలికి తీసుకు పోవాలి... అవి నగరంలోనే వుండగా కోటని శత్రువులు ముట్టడిస్తే చాలా ఇబ్బంది..." అన్నది.

"తల్లీ... మా సంగతేమిటి? మాకు కూడా ఆజ్ఞలు దయచేయండి... మేము ఏం చేయాలో దయచేసి చెప్పండి" కర్రలు కత్తులు పట్టుకుని వచ్చిన నగర పెద్దల్లో ఒకతను వెంటనే బిగ్గరిగా అడిగాడు.

"నగరంలో ఎటువంటి అలజడి, అశాంతి చెలరేగకుండా మీరందరూ అప్రమత్తులై వుండాలి. యుద్ధ సమయంలో రకరకాల వదంతులు వినిపిస్తూ వుంటాయి. వాటిని వేటినీ మీరు నమ్మకూడదు. ఆందోళన చెందకూడదు. ఎవరి గృహాన్ని వారు జాగ్రత్తగా చూసుకోండి. అందరూ కలిసి మీ ఇళ్ళున్న వీధుల్ని గమనించుకోండి... యుద్ధ వ్యవహారాలు మాకు మా సైనికులకు వదిలేయండి" దృఢస్వరంతో చెప్పిందామె.

"తల్లీ... యుద్ధం తప్పదా?" నెమ్మదిగా ఆమెను అడిగాడు నగర పెద్దల్లో ఒక వృద్ధుడు.

జ్వలిత సామ్రాజ్యంలో చిట్టచివరి నగరం కావడం వల్లను, దట్టమైన అడవుల మధ్యన వుండటం వల్లను, అన్నిటిని మించి అపక్ర పరాక్రమవంతు డైన సాగరుల వారు అన్ని విషయాలను స్వయంగా గమనించుకుంటూ వుండటం వల్లను, అంతవరకూ ఎటువంటి అల్లకల్లోలాలకు గురి కాలేదు

సంపంగి నగరం. ఎవరో బయటినుంచి వచ్చిన వాళ్ళు చెప్పటం వల్ల యుద్ధం గురించి వినటమే గాని, నగరంలోని చాలామందికి అవి ఎలా వుంటాయో, అవి మొదలు అయితే ఎటువంటి బీభత్స దృశ్యాలు కనిపిస్తాయో తెలియదు.

"సాగరుల వారు నగరంలో లేరని, శత్రువుల్ని ఆపటం మాకు చేతకాదని మీరు ఎవరూ భయపడవలసిన పనిలేదు. మన గజబలం నగరం వెలుపలికి తీసుకుపోబడుతోంది. అది సన్నద్ధంగా వున్నంత వరకూ మన వంక ఎవరూ కన్నెత్తి కూడా చూడలేరు. నిర్భయంగా వుండండి" మరోసారి నగర పెద్దలకు చెప్పింది చారులతాదేవి.

తలలు వూపి వెనక్కి తిరిగారు వారు... వారితో పాటు వరుసల్లో వెళ్ళిపోయారు ఆయుధాలతో వచ్చిన పౌరులు.

సిద్ధంగా నిలబడిన సైనికులందర్నీ నడుపుకుంటూ సేనాపతి కోటగోడల దగ్గరికి పోయిన తర్వాత స్వయంగా గజశాల దగ్గరికి వెళ్లింది చారులతాదేవి.

ఇనుప కవచాలు తొడగబడుతున్నాయి ఏనుగులన్నిటికీ. తొండాలకు, పాదాలకు మందపాటి చర్మరక్షలు ధరింప చేయబడుతున్నాయి. పదునుగా పొడుగ్గా వున్న కత్తుల వంటి ఇనుప చువ్వలు వాటి దంతాలకు బిగిస్తున్నారు.

ఏబది సంవత్సరాలకు కొంచెం ఎక్కువే వయసుండే పెద్ద ఏనుగు ఒకటి వున్నది ఆ గజదళంలో. సాగరుల వారు స్వయంగా అధివసించే గజం అది. యుద్ధంలో అన్నిటికంటే ముందు నడిచేది కూడా అదే.

అన్నిటికంటే ముందుగా దాన్నే సిద్ధం చేశారు గజశాల నిర్వాహకుడి సహాయకులు... చారులతాదేవి వచ్చీ రావడంతోటే పెద్ద బంగారు పళ్ళెరంలో నారికేళ ఫలాల్ని పెట్టి ఆమెకు అందించారు.

మూడు ఫలాల్ని తీసుకుని ఆ గజం చుట్టూ వలయాకారంలో తిప్పి దిష్ఠి తీసేసింది ఆమె. నిర్వాహకుడి సహాయకులు అందించిన కర్పూర ఖండాన్ని వెలిగించి హారతి ఇచ్చింది.

"సంపంగి నగర పరిరక్షణా బాధ్యత అంతా నీ మీదనే ఆధారపడి వుంది... నీ పరాక్రమం చూపించు. నీ దళాన్ని నువ్వు నడిపించు" అంటూ దాని తొండాన్ని పట్టుకుని ఆర్ద్రంగా చెప్పింది.

ఆ పైన మరేమీ మాట్లాడవలసిన అవసరం లేకపోయింది. చెవులు చిల్లులు పడిపోయేటట్లు ఘీంకరించి, పెద్ద పెద్ద అడుగులతో గజశాల ద్వారంలో నుంచి వీధిలోకి వచ్చిందా ఘటం. దాని వెనుకే ఒకదాని వెనక మరొకటిగా కదిలాయి మిగిలినవి.

కూడలిలో వున్న ప్రమాద ఘంటిక మ్రోగటం మొదలుపెట్టగానే మూసి వేయబడ్డ నగర ద్వారాల్లో ఒక తలుపును మాత్రం తెరిచారు అక్కడ వున్న భటులు.

ఒకదాని వెనుక ఒకటిగా వెలుపలికి పోతున్న ఏనుగులను చూస్తూ ఒక పక్కగా నిలువబడిన చారులతాదేవికి, అప్పుడు అవగతమయింది సాగరుల వారు పంపిన వర్తమానంలోని ఒక విశేషం.

తమ నగరం మీద ముట్టడి మొదలు కాకముందే గజబలాన్ని నగరం వెలుపలికి తీసుకుపోయి నిలబెట్టమని ఆజ్ఞాపించాడాయన.

ముట్టడి ప్రారంభం అయిన తరువాత ఆ పనిచేస్తే ఒకదాని వెనక ఒకటిగా వెలుపలికి వచ్చే గజాలన్నీ తేలికగా దొరికిపోయేవి శత్రువుల ఆయుధాలకు.

"తల్లీ! వీటన్నిటినీ మేము వరుసల్లో నిలబెట్టి వుంచుతాము. మీరు సభా భవనం దగ్గరికి వెళ్లి మిగిలిన ఏర్పాట్లు చూసుకోవచ్చును" గజశాలతో పాటుగా యుద్ధరంగంలోకి దుమికే దళపతి ఒకతను దగ్గరికి వచ్చి చెప్పటంతో నగర ద్వారాల దగ్గిర్నించి కదిలిందామె. తన అంగరక్షకులు వెనుక నడుస్తుండగా సభా భవనం దగ్గరికి బయలుదేరింది.

❖ ❖ ❖

"ఏయ్... ఎవరు మీరు? ఎందుకు నిలబడి వున్నారిక్కడ?" ఉన్నట్లుండి తన అశ్వాన్ని ఆపి, క్రిందికి దూకుతూ రాచవీధికి దగ్గరిగా వున్న ఇంకో చిన్న వీధి దగ్గర ఇద్దరు ఆగంతకుల్ని ప్రశ్నించాడు ఒక భటుడు.

"మేము కేసరి నగరాన్నించి వచ్చాము... ఇక్కడి అడవుల్లో లభించే ఔషధ మూలికల్ని కొనుగోలుచేయాలని మా కోరిక" తడుముకోకుండా సమాధానం ఇచ్చాడు ఆ ఇద్దరిలో ఒకతను.

"నగరం దిగ్బంధనం చేయబడింది. బయటినుంచి ఎవరూ లోపలికి రాకూడదు. మీరు వచ్చిన పని ఇప్పట్లో సఫలం కాదు" వెంటనే అన్నాడు ఆ భటుడు.

కేసరి నగరం కూడా జ్వలిత సామ్రాజ్యంలో ఒక ప్రముఖ నగరమే. మానవులకే కాదు, పెంపుడు జంతువులకు కూడా వచ్చే వ్యాధుల్ని నయం చేసే ఔషధాలు తయారు చేయబడతాయి అక్కడ.

ఆ విషయం పూర్తిగా తెలిసి వుండడం వల్ల అతిగా ఆశ్చర్యపడలేదా భటుడు. వారిని అనుమానించలేదు.

"మీరు ఎక్కడ విడిదిచేసి వున్నారు?" అని అడిగాడు.

తమకు దగ్గర్లోనే వున్న ఒక పూట కూటి ఇంటిని చూపించాడు ఆ ఇద్దరిలో రెండవ మనిషి. "నిన్న సాయం సమయంలో వచ్చాము. ఈరోజు మీ నగరంలోని వర్తక ప్రముఖుల్ని కలిసి మాట్లాడదామని అనుకున్నాము. ఇంతలోనే ఈ ముట్టడి గందరగోళం మొదలు అయింది" అని కూడా చెప్పాడు.

"సాగరుల వారు నగరంలోకి వచ్చేంతవరకూ మీరు చేయగలిగింది ఏమీ లేదు. ఆ ప్రభువు వచ్చిన తర్వాత వారితో మాట్లాడి మీ దారిన మీరు వెళ్ళిపోవచ్చు. అంతవరకూ మీరు విడిది చేసిన చోటే విశ్రాంతి తీసుకోండి. వీధుల్లో తిరగవద్దు..." అని హెచ్చరించి, తిరిగి తన అశ్వాన్ని అధిరోహించి అవతలికి వెళ్ళిపోయాడు ఆ భటుడు.

అతను దూరంగా వెళ్ళిపోయాడని, తమను గమనించే వాళ్ళు ఆ దగ్గర్లో ఎవరూ లేరని నిశ్చయం చేసుకుని, ఒకరి వంక ఒకరు చూసుకున్నారు ఆ వ్యక్తులు.

"సాగరుల వారి పెంపకంలో వున్న శివుడి గురించి, చెరసాలలో వున్న శుక్రుతుడి గురించి పూర్తి వివరాలు తెలుసుకురమ్మని మనకు ఆజ్ఞ ఇచ్చారు మంత్రి గుణధాముల వారు. ఇక్కడి పరిస్థితి ప్రస్తుతం అంతా గందరగోళంగా వున్నది. అనవసరమైన ప్రశ్నలు వేస్తే మన వీపులు వాచిపోయేటట్లు కనిపిస్తోంది" చిన్నగా అన్నాడు మొదటి మనిషి.

"మనం ఎవరిమో, ఎవరు పంపగా వచ్చామో చారులతాదేవి వారికి తెలియచేస్తే?" అడిగాడు రెండో మనిషి.

"అందరికీ తెలిసిన మాటలే మనకి కూడా తెలుస్తాయి. కొత్తవి ఏవీ బయటికి రావు. ఆ శుక్రుతుడి గురించి అస్సలు ఏమీ తెలియదు" అన్నాడు మొదటి వ్యక్తి.

"మంత్రి గుణధాముల వారికి శుశ్రుతుడి మీద విపరీతమైన నమ్మకం వున్నట్లు కనిపిస్తోంది. ఆ శివుడిని గురించి ఏమైనా విశేషాలు వుండి వుంటే అతనే బట్టబయలు చేయగలడని ఆయన భావిస్తున్నారని నాకు అనిపిస్తోంది" అన్నాడు రెండో మనిషి.

కొద్దిసేపు ఆలోచించి రెండవ మనిషికి సైగ చేశాడు మొదటి వ్యక్తి. "అందరూ హడావుడి పడుతున్న ఈ సమయంలోనే మనం ఒకసారి చెరసాల సమీపంలోకి పోయి, శుశ్రుతుడిని గురించి ఆరా తీయటం బాగుంటుంది" అన్నాడు ముందుకు అడుగు వేస్తూ.

"ఎక్కడికీ కదలవద్దని హెచ్చరించబడ్డాము. అనవసరమైన బాధల్ని నెత్తికి తెచ్చుకోవటం దేనికి?" అని అంటూనే అతన్ని అనుసరించాడు రెండో మనిషి.

"అవసరం అయితే మనం ఎవరిమో ఎవరు పంపగా వచ్చామో బట్టబయలు చేద్దాం. అంతవరకూ రహస్యంగానే పని పూర్తి చేసుకుందాము" అంటూ ఎక్కడా ఆగకుండా ముందుకు నడిచాడు మొదటి మనిషి.

నిర్భయంగా, తడబడకుండా అడుగులు వేయటం వల్ల వారిని గురించి పట్టించుకోలేదు వీధుల వెంట తిరుగుతున్న భటులు ఎవరూ. పావు ఘడియ తరువాత కారాగారం దగ్గరికి పోయి నిలుచున్నారు వారిద్దరూ.

మరో పావుఘడియ గడిచిన తర్వాత వారి దృష్టికి వచ్చింది ఒక విచిత్రమైన అంశం.

కోటగోడల మీదా, బురుజుల మీదా సైనికుల్ని సిద్ధంగా నిలబెట్టి వుంచమని చారులతాదేవి ఆజ్ఞలు ఇచ్చిన వెంటనే సైనికులందరికీ వారు చేయవలసిన పనుల్ని సూచించాడు సైన్యాధిపతి.

మూడు వంతుల మందిని కోటగోడల మీదికి పంపించాడు. ఒక వంతు మందిని నగర ద్వారం దగ్గర నిలబెట్టారు. మిగిలిన కొద్దిమందిని నగర వీధుల్లో సంచరించుతూ వుండమని ఆజ్ఞ ఇచ్చాడు.

కారాగార రక్షణ కోసం కేటాయించబడిన సైనికుల్లో చాలామంది ఆ విధంగా వేరు వేరు పనుల్లోకి వెళ్ళిపోవడం వల్ల కేవలం ముగ్గురు భటులు మాత్రమే మిగిలిపోయారు అక్కడ.

కారాగారం వెలుపల ఒక భటుడు... లోపల ఇద్దరే యిద్దరు వున్నారు. ఆ విషయం తమకు సంపూర్ణంగా తెలిసివచ్చిన వెంటనే మరోసారి ఒకరి వంక ఒకరు చూసుకున్నారు గుణధాముడు పంపించిన వ్యక్తులు ఇద్దరూ.

"ముగ్గుర్ని పడగొట్టడం మనకి ఏమంత కష్టం కాబోదు... రెండో కంటి వాడికి తెలిసే లోపల శుశ్రుతుడిని మనం చెర విడిపించవచ్చు" అన్నాడు మొదటి మనిషి.

"విడిపించటం వరకు బాగానే వుంటుంది. ఆ తరువాత అతన్ని తీసుకుని నగరం వెలుపలికి పోవటం ఎలా? పట్టుబడితే రాజద్రోహం చేసినవాళ్ళం అవుతాము కదా" సందేహంగా అన్నాడు రెండో వ్యక్తి.

"మనం విడిపించబోతున్నది శుశ్రుతుల వారిని. సామాన్యుడిని కాదు... ఇక్కడినుంచి తప్పించుకునే మార్గాన్ని ఆయనే మనకి చూపిస్తాడు" అన్నాడు మొదటి మనిషి.

అప్పటికీ ధైర్యం చేయలేదు రెండో వ్యక్తి. "సాగరుల వారు బంధించిన మనిషిని తప్పించటం అంటే చూస్తూ చూస్తూ తలని నేలకేసి కొట్టుకోవడం వంటిది. నాకు భయంగా వుంది" అన్నాడు.

"భయపడితే ఏ పనీ మనం చేయలేము. మంత్రి గుణధాముల వారి ప్రశ్నలన్నిటికీ సమాధానాలు సమకూర్చగలిగింది ఒక్క శుశ్రుతుడే" అని ధైర్యం చెప్పటానికి ప్రయత్నించాడు మొదటి మనిషి.

"నిజమే కాని.. ఇప్పుడు పరిస్థితి వేరుగా వున్నది. నగరం మీద దండ యాత్ర జరగబోతున్నది. ఈ సమయంలో మనం కారాగారంలోని శుశ్రుతుడిని విడిపించడం అంటే లేనిపోని సమస్యలను రేకెత్తించడం. అది పద్ధతి కాదు. గుణధాముల వారికి తెలిస్తే హర్షించరు" అన్నాడు రెండో మనిషి.

"అప్పజెప్పిన పనిని పూర్తిచేసి మంత్రిగారి మెప్పు పొందటానికి ఇదే మంచి అవకాశం. మనం విడిపిస్తోంది ఒక్క శుశ్రుతుడినే మాత్రమే. రాజద్రోహుల్నో, నేరస్థుల్నో కాదు. అతన్ని వెంటబెట్టుకుని మనం మంత్రిగారి దగ్గరికి తీసుకుపోదాము. అది తప్పు ఎలా అవుతుంది? ఒకవేళ అతను శిక్షింపదగిన వాడే అయితే అదేదో మంత్రిగారే చూసుకుంటారు. బాగా ఆలోచించు" అంటూ మరింత ఒత్తిడి చేశాడు మొదటి మనిషి.

మరో రెండు నిమిషాల పాటు ఆలోచించి, ఒకింత అయిష్టంగానే తలవూపాడు రెండవ మనిషి.

అటు ఇటు చూసి కారాగార ద్వారం దగ్గరకు పోయాడు ముందుగా మొదటి మనిషి.

"ఎవరు మీరు? ఏమిటి పని మీకు ఇక్కడ?" వెంటనే తన బరిశెను అతని గుండెల కేసి గురిపెడుతూ అడిగాడు కాపలా భటుడు.

తన దట్టీలోనుంచి ఏదో రాగిబిళ్ళను తీసి అతనికి చూపించాడు మొదటి మనిషి. గూఢంగా సంచరించే గూఢచారుల దగ్గర, రాచకార్యాల మీద దేశ విదేశాల్లో తిరిగే రాజభటుల వద్ద వుంటాయి వారెవరో తెలియచేసే గుర్తులు కొన్ని.

అతను చూపించిన బిళ్ళ అటువంటిదే అయివుంటుందన్న ఉద్దేశ్యంతో బరిశెను క్రిందికి దించి ముందుకు వంగాడు ఆ భటుడు, పరిశీలనగా దాన్ని చూసేటందుకు.

వట్టి రాగి నాణమే అది. ఎటువంటి గుర్తులు దానిమీద లేవు.

"ఇదేమిటి? ఎందుకు దీన్ని చూపిస్తున్నావు?" ఆశ్చర్యం, కోపం కలగలిసిన కంఠంతో అడుగుతూ మళ్ళీ తన బరిశెను ముందుకు చాపబోయాడు అతను.

ఫెడీమని అతని గుండెలమీద పడింది ఒక బలమైన పిడికిలి పోటు... దానివెనుకే తలకు తగిలింది మరో బలమైన దెబ్బ.

కళ్ళముందు రకరకాల రంగులు ప్రత్యక్షం అవుతూ వుండగా, వెంటనే స్పృహను కోల్పోయి క్రిందికి వాలిపోబోతున్న అతన్ని గట్టిగా పట్టుకుని, కారాగార భవనంలోకి నెట్టాడు మొదటి మనిషి.

అతని పక్కనుంచి వేగంగా పోయాడు లోపలికి రెండవ మనిషి. అదిరిపడి ముందుకు రాబోతున్న మరో భటుడిని ఒకే ఒక దెబ్బతో నేలకూల్చాడు. అతని పక్కనే నిలబడి వున్న మూడో భటుడిని మొదటి మనిషి ఎదుర్కొని తెలివి తప్పించాడు.

ఆ మూడో మనిషి దగ్గరే వారికి కనిపించాయి పెద్ద పెద్ద తాళం చెవులు. వాటి సహాయంతో ఆ భటులు ఏ మందిరం దగ్గర నిలబడి వున్నారో ఆ మందిర ద్వారాన్ని తెరిచారు వాళ్ళు.

మసక చీకటితో నిండి వుంది లోపలి ప్రదేశం. అదే పనిగా చిత్రహింసలకు గురి కాబడటం వలన కాబోలు కదలలేక పోతున్నట్లు నిస్త్రాణగా కూర్చుని వున్నారు లోపలి గోడల దగ్గర కొందరు బందీలు.

“శుశ్రుతుల వారూ! ఇక్కడే వున్నారా మీరు?” లోపలికి తొంగి చూస్తూ చిన్నగా పిలిచాడు మొదటి మనిషి.

వెంటనే వచ్చింది సమాధానం. వెనుక గోడను ఆనుకుని కూర్చున్న వారిలో ఒక బందీ లేచి, గబగబా ద్వారం దగ్గరికి వచ్చాడు.

“మహామంత్రి గుణధాముల వారు మీ కోసం మమ్మల్ని పంపించారు. సాగరుల వారు నగరంలో లేకపోవడం వల్ల...” అంటూ తాము అక్కడికి ఎందుకు వచ్చారో అతనికి తెలియచేయబోయాడు ఆ మనిషి.

అతన్ని విడిపించాలని తాము ఎందుకు అనుకున్నారో, ఆ పని చేయటం వల్ల ముమ్ముందు వచ్చి పడే కష్టనష్టాలు ఎటువంటివో కూడా అతనికి తెలియచేయటం తన విధి అని అతను భావించాడు.

అయితే ఆ మాటలు అతని నోటివెంట వెలువడకముందే అతను ఎదురు చూడని పరిణామం ఒకటి అక్కడ చోటు చేసుకున్నది.

శుశ్రుతుడితో పాటుగా గోడల్ని ఆనుకుని కూర్చున్న ఇతర బందీలలో కూడా వచ్చేసింది చలనం.

శుశ్రుతుడిని పిలిచినట్లు, తమను పిలవలేదని ఆగిపోలేదు వాళ్ళు. “ఆగండి, మీరందరూ ఆగిపోండి. మేము ఒక్క శుశ్రుతుల వారి కోసం మాత్రమే వచ్చాము” అని వారి దారిని అడ్డుకోబోయాడు రెండో వ్యక్తి.

పిడికిళ్ళు బిగించి అతన్ని నేలకూల్చారు వాళ్ళు. అదిరిపడి వెనక్కి పరిగెత్తబోయిన మొదటి మనిషిని కూడా మట్టి కరిపించారు ఒకే ఒక దెబ్బతో.

“మనల్ని భ్రమలో పెట్టి మన నోటివెంట తనకు కావల్సిన సమాచారాన్ని రాబట్టటం కోసం మంత్రి మహేశ్వరుడు ఎత్తిన ఎత్తుగడ ఇది. తప్పించుకు పోయి తేలికగా అతని పని పట్టాలి” జరుగుతున్నదేమిటో అర్థంకాక అయోమయంగా చూస్తూ నిలబడిపోయిన శుశ్రుతుడితో చెప్పి కారాగారం వెలుపలికి పరుగు తీశారు అందరూ. తమతో పాటు శుశ్రుతుడిని కూడా చేయి పట్టుకుని లాక్కుపోయారు.

❖ ❖ ❖

తన అంగరక్షకురాళ్లు వెన్నంటి నడుస్తుండగా, నగర ద్వారాల్ని దాటి వెలుపల విశాలమైన మైదానంలో నిలువబడి వున్న గజదళం దగ్గరికి పోయింది చారులతాదేవి.

శత్రువులు ఎంతమంది ఎటునుంచి వచ్చిపడినా ఎదుర్కొనేందుకు సిద్ధంగా నిలుచుని వున్నాయి మగ ఏనుగులు.

సాగరుల వారు పరామర్శించినట్లే వాటిలో ఒక్కదాన్ని కూడా వదిలి పెట్టకుండా ప్రతి ఏనుగు దగ్గరికి పోయి తొండాల్ని తడిమింది చారులతాదేవి.

"మీరే మా బలం... మాకు రక్ష... మీరే మా సర్వస్వం..." అని వాటిని పొగుడుతూ వున్న సమయంలో ఆమె చెవికి చేరింది కారాగారంలో జరిగిన సంఘటన గురించిన వర్తమానం.

"మహామంత్రి గుణధాముల వారు పంపించిన వారిమని చెపుతున్నారు స్పృహలో లేకపోవటం వల్ల పట్టుబడిన మనుష్యులు ఇద్దరూ. శుశ్రుతుడు అతని స్నేహితులు తప్పించుకుపోవటానికి వారిద్దరే కారకులని అక్కడి మన కాపలా భటులు నొక్కి వక్కాణిస్తున్నారు" వినయంగా వెల్లడించాడు ఆ వార్తను మోసుకువచ్చిన భటుడు.

"తల్లీ... కోటగోడల మీదినించి కొందరు భటుల్ని క్రిందికి దింపి పారిపోయిన దుర్మార్గుల కోసం నగరంలో వెతికించనా?" ఆ భటుడి వెనకే వచ్చిన సేనాపతి అడిగాడు ఆమెను.

అరమూసిన కనులతో పది క్షణికాల పాటు ఆలోచించి తల అడ్డం తిప్పింది చారులతాదేవి.

"పారిపోయిన వారిలో శుశ్రుతుడు వున్నాడు. అతను ఎవరికీ కనిపించకుండా నగరంలో నుంచి బయటపడగలడు. అతన్ని పట్టుకోవడం మీకు నాకు సాధ్యపడే పని కాదు. సాగరుల వారు తిరిగి వచ్చిన తర్వాత వారే చూసుకుంటారు. అంతవరకూ నగర సంరక్షణమే మన బాధ్యత" గంభీరంగా చెప్పింది అతనికి.

ప్రభువులు నగరంలో లేని సమయంలో కారాగారంలోని నిందితులు తప్పించుకోవటాన్ని తన అసమర్థత క్రింద భావించి ఆమె పరుష వాక్యాలు పలుకుతుందేమోనని భయపడుతున్న సేనాపతికి గుండెలమీదినించి కొండంత బరువు దిగిపోయినట్లు అయింది.

"ఈసారి ఆ శుత్రుతుడే గనుక నా చేతికి చిక్కితే ఆ పైన ప్రాణాలతో వుండడు తల్లీ... నిలువుగా నరికి ముక్కలు చేసి వేస్తాను" కోపంగా అన్నాడు.

"గుణధాముల వారు పంపగా వచ్చామని చెపుతున్న వారినైనా జాగ్రత్తగా బంధించి వుంచండి. వారు కూడా మన భటుల కళ్ళు కప్పి పారిపోకుండా గట్టి కాపలా ఏర్పాటు చేయండి" చిన్నగా అతనికి చెప్పింది ఆమె.

తల వూపి నగర ద్వారాల దగ్గరికి వెళ్ళిపోయాడు సేనాపతి. తిరిగి తమ గజబలాన్ని పరామర్శించడం మొదలు పెట్టిందామె.

❖ ❖ ❖

విశ్రాంతి తీసుకోవాలనే మాటను మరిచిపోయినట్లు ఎక్కడా ఆగకుండా ప్రయాణం చేసి సూర్యుడు పడమటి దిశలోకి మరలే సమయంలో ఒక అడవి గ్రామాన్ని చేరుకున్నది సాగరులవారి బృందం.

ఆ బృందంలో తమకు కాబోయే మహారాణి కూడా వున్నట్టు తెలిసేసరికి అమితమైన ఆనందోత్సాహాల్లో మునిగిపోయారు ఆ గ్రామస్థులు.

"చక్రవర్తి మహాబలుల వారికి జయము. సంపంగి నగర సామ్రాట్టు సాగరుల వారికి విజయము" అంటూ పెద్ద పెట్టున జయ జయ ధ్వానాలు చేశారు.

వారి విశ్వాసాన్ని, వారి రాజభక్తిని చూసి మురిసిపోయారు సాగరుల వారు. "మా వెనుక శిఖావంతుడి సైన్యం ఉరుకులు పరుగుల మీద వచ్చిపడే అవకాశం వున్నది. మీరు మీ మాన ప్రాణాలను కాపాడుకునే ప్రయత్నం మొదలు పెట్టండి... ఆలస్యం చేయవద్దు" అని హెచ్చరించి, తమ వాహనాలకు అలసట తీరిపోగానే మళ్లీ నగరం వైపు పరుగులు తీయించటం మొదలుపెట్టారు.

మరో పావు ఘడియలో చీకట్లు ముసురుకుంటాయనగా వారి మార్గంలో కనిపించింది ఇంకో అడవి గ్రామం.

"మొదటి ఝాము గడిచేవరకూ మనం ఇక్కడ ఆగి విశ్రాంతి తీసుకోవటం ఉత్తమం ప్రభూ..." అన్నాడు మంత్రి మహేశ్వరుడు.

"ఈ గ్రామస్థుల్ని కూడా హెచ్చరించు. ఈ చుట్టుపట్ల తల దాచుకునే అవకాశం లేకపోతే పిల్లా పాపలతో నగరంకేసి ప్రయాణమవ్వాలని ఆజ్ఞాపించు. ఆ దుర్మార్గుల చేతుల్లో నా గ్రామస్థులు ఎవరూ అవమానాల పాలు కావడం

గాని, ప్రాణాలు పోగొట్టుకోవటం గాని నాకు ఇష్టం లేదు"అశ్వం దిగి నిలబడుతూ చెప్పాడు సాగరులవారు.

తమను చూసి గుంపుగా ఇళ్ళల్లో నుంచి బయటికి వచ్చిన గ్రామస్థుల దగ్గరికి పోయాడు మహేశ్వరుడు.

"మనం ప్రయాణించే మార్గంలో ఎదురైన ప్రతి గ్రామంలోని వారిని నగరం వైపు ప్రయాణించమని చెపితే, నగరం ఎంతమందిని భరించగలదు?" ఉన్నట్టుండి వాసుదేవుడి వైపు చూస్తూ అడిగింది జ్వాల.

"వారం పదిరోజుల పాటు ఎంతమందినైనా భరించవచ్చు. ఎటు తిరిగీ పదిరోజులు దాటితేనే వచ్చి పడుతుంది సమస్య. అందరూ ఆకలితో అలమటించిపోవాల్సి వస్తుంది" సాలోచనగా చెప్పాడు వాసుదేవుడు.

"నల్లరాతి గుట్టల్లో మనం చూసిన సైన్యం అన్నిరోజుల పాటు నగరాన్ని ముట్టడి చేయగలదా?" అడిగింది జ్వాల.

"ఆ సైన్యం మనకి ఒక లెక్కలోది కాదు. మన గజదళం విజృంభిస్తే ఒకే ఒకరోజులో దిక్కులు పట్టి పారిపోతుంది కాని..." అంటూ మాటల్ని ఆపాడు వాసుదేవుడు.

"ఏమిటి మీ సందేహం?" కుతూహలంగా అడిగింది జ్వాల.

"మన శివుడు చూసి వచ్చిన భల్లూకాలను గురించి ఇంతవరకూ మనం సరిగ్గా ఆలోచించలేదు. ఆవేశంలో వున్న ఏ ఏనుగునయినా అడవి జంతువులు ఏవీ ఎదుర్కోలేవు. ఎదుటపడి ప్రాణాలతో అవతలికి పోలేవు. కానీ ఈ భల్లూకాల విషయమే నాకు వింతగా కనిపిస్తోంది. కాని శిఖావంతుడు తెలివి తక్కువ వాడు కాదు. మనతో పోరాటానికి సిద్ధపడుతున్నాడంటే మనం గట్టిగా ఆలోచించవలసిందే" అన్నాడు వాసుదేవుడు.

"ఈ సమస్యకు సమాధానం మనకి ఎలా లభిస్తుంది?" అడిగింది జ్వాల. అడిగిన తర్వాత వెనక్కి చూసింది ఆ విషయంలో శివుడి అభిప్రాయం తెలుసుకోవటానికి.

గ్రామం మొదట్లో వున్న ఒక పెద్ద నేరేడు చెట్టుక్రింద నిలబడి క్రిందికి వాలి వున్న కొమ్మల్ని విరిచి, ఆడ ఏనుగుకు, గున్నకి అందిస్తోంది మగ ఏనుగు.

దాని కుంభస్థలం మీదనో, లేక దానికి సమీపంలో వుండవలసిన శివుడు ఆమెకు కనిపించలేదు.

“బాబయ్యగారూ...” ఒకింత ఆందోళనగా వాసుదేవుడిని హెచ్చరించింది ఆమె.

“వాడు మళ్ళీ ఏదో ఆలోచన చేస్తున్నట్లున్నాడు. బలంగా వీచే గాలినైనా గట్టిగా పట్టుకుని ఆపవచ్చేమో గాని, వాడిని ఆపటం మాత్రం అసాధ్యంగా కనిపిస్తోంది” అంటూ తన వాహనం మీదికి ఎగిరాడు వాసుదేవుడు.

మొదటి ఝాము గడిచిపోయే వరకు మాత్రమే విశ్రాంతి తీసుకోవాలని సాగరుల వారికి చెప్పాడు మంత్రి మహేశ్వరుడు. రెండవ ఝాము వచ్చీ రావటంతోనే తిరిగి ప్రయాణం ప్రారంభించాలని, తెల్లవారే సమయానికి నగరం దరిదాపుల్లోకి వెళ్ళిపోవాలని అతని ఉద్దేశ్యం.

గ్రామస్థులు తెచ్చి ఇచ్చిన ఆహారాన్ని ఆరగించి, గ్రామ మధ్యంలో వున్న రచ్చబండ మీద కుశలంగా కూర్చున్న తర్వాత “వాసుదేవుడు ఏడి? ఎక్కడికి పోయాడు??” అని అడిగాడు సాగరులవారు.

“మనం ఇక్కడికి వచ్చిన సమయంలో శివుడు మనతో లేడు. ఏమైపోయాడో తెలుసుకోవటం కోసం వెళ్ళాడు” వెంటనే చెప్పింది జ్వాల.

కుదురుగా నిలబడి వున్నాయి శివుడి ఏనుగులు. వాటివంక ఒకసారి చూసి సాలోచనగా తలవూపాడు సాగరులవారు.

“వాడు వాటికి చెప్పిన తర్వాతే మాయం అయివుంటాడు. చెప్పాపెట్టకుండా అంతర్ధానం అయితే ఇవి ఇంత ప్రశాంతంగా నిలబడవు” అన్నాడు.

“ప్రభూ... మనం బయలుదేరవలసిన సమయం దగ్గర పడుతోంది” వున్నట్లుండి హెచ్చరించాడు మహేశ్వరుడు.

“బయలుదేరటమా? ఇప్పుడా? శివుడు ఏమైపోయాడో తెలుసుకోవాల్సిన అవసరం లేదా?” ఆందోళనగా అడిగింది జ్వాల.

“ఉన్నది తల్లీ! కాని వాడికోసం ఎదురుచూస్తూ సమయాన్ని వృధా చేస్తే నగరాన్ని చేరుకోవటంలో ఆలస్యం అవుతుంది. అది కూడని పని. మనం ఎంత త్వరగా వెళ్ళగలిగితే అంత మంచిది” అంటూ కొంచెం అవతలగా కూర్చుని వున్న తమ భటులకు సైగ చేశాడు మహేశ్వరుడు.

చకచకా లేచారు వారందరూ. రెండే రెండు నిమిషాలలో ప్రయాణానికి సిద్ధం అయ్యారు.

“శివుడి తర్వాత ఈ గజాల దగ్గరికి వెళ్ళగలిగిన దానివి నువ్వు మాత్రమే. వీటిని నడిపించవలసిన బాధ్యత నీదే” జ్వాలకు చెప్పాడు మహేశ్వరుడు.

నమ్మకం లేదు జ్వాలకి అవి తన మాటను మన్నిస్తాయని. అయినా సరే కాదని అనకుండా నెమ్మదిగా వాటి దగ్గరికి పోయింది.

నేరేడు ఆకుల్ని నమిలిన తర్వాత కూడా ఆకలి మందగించలేదు కాబోలు, తల్లి పొదుగు దగ్గర చేరి, పాలకోసం మారాం చేస్తోంది గున్న ఏనుగు.

“మనం ప్రయాణం మొదలుపెట్టాలి. శివుడి కోసం ఎదురుచూస్తూ కూర్చుంటే సమయం వృథా అవుతుంది. నడక మొదలుపెట్టండి” మగ ఏనుగు దగ్గరికి పోయి, భయం భయంగానే దాని తొండాన్ని స్పృశిస్తూ చెప్పింది జ్వాల.

చిన్నగా ఘీంకరించి, అడుగు కదిపిందా మహాగజం. జ్వాలకే కాదు, సాగరులవారికి, మహేశ్వరుడికి కూడా విపరీతమైన ఆశ్చర్యం కలిగింది.

“శివుడు వాటిని పూర్తిగా తన వశంలోకి తెచ్చేసుకున్నాడు. ఎవరూ చెప్పకుండా ఎటువంటి శిక్షణ పొందకుండా ఇంతటి నేర్పరితనం వాడికి ఎలా అబ్బిందో మరి?” అన్నాడు సాగరులవారు.

“నగరానికి పోయిన తర్వాత వాడినే అడుగుదాము ప్రభూ...” అన్నాడు మహేశ్వరుడు.

“అడిగితే చెపుతాడా?”

“మనకి చెప్పకపోవచ్చు. దేవిగారు అడిగితే తప్పకుండా చెపుతాడు. ఆ తల్లి మాట వాడికి వేదవాక్కు.”

సాలోచనగా తలవూపి, తన అశ్వాన్ని ఇంకా కొంచెం వేగంగా నడిపించటం మొదలుపెట్టాడు సాగరులవారు.

వారి వెనుకగా అశ్వికులు, వారిని అనుసరించి ఒక అశ్వం మీద జ్వాల, ఆమెను వెన్నంటి ఏనుగులు కదలటం ఆరంభించాయి.

❖ ❖ ❖

"శివుడు... ఒరేయ్ శివుడు..." గ్రామానికి దూరంగా తాము వచ్చిన మార్గంలోనే వెనక్కి వెళ్ళి పెద్ద కంఠంతో పిలిచాడు వాసుదేవుడు.

ఎత్తుగా వత్తుగా ఎదిగి వున్నాయి చెట్లు... కాలు పెట్టటానికి కూడా వీలు కానంత దట్టంగా పెరిగి వున్నాయి పొదలు. అటువంటి ప్రదేశంలో ఎంతగా అరిచి కేకలు పెట్టినా శబ్దం ఆ చెట్లను పొదల్ని దాటి ఎంతో దూరం వినిపించదని అతనికి తెలుసు. రాతి గోడల మాదిరి అడ్డుకుంటుందా పచ్చదనం శబ్దతరంగాల్ని.

శివుడితో పరిచయం అయిన తరువాత మొట్టమొదటిసారిగా ఒకింత ఆగ్రహానికి గురి అయినాడు వాసుదేవుడు.

"ఇష్టం వచ్చినట్లు ప్రవర్తించడం చాలా ఎక్కువైపోయింది నీకు. ఇంత చీకట్లో నువ్వు విరగపొడిచే పనులు ఏముంటాయ్ ఈ కారడవిలో? ఏమైనా వుంటే మాకు చెప్పవచ్చు కదా..." తనలో తను అనుకుంటూ అంతవరకూ తను అనుసరించి వచ్చిన మార్గాన్ని వదిలి, దట్టంగా వున్న పొదల మధ్యకు అశ్వాన్ని నడిపించబోయాడు.

పది అడుగుల దూరం మాత్రమే పోగలిగింది అది. ఆ తర్వాత అడుగు వేయటం అసాధ్యం అవటంతో ఆగిపోయింది.

ఇంకా అధికం అయిపోయింది వాసుదేవుడి కోపం. పళ్ళు బిగించి, వాహనం మీదనించి దిగాడు. ఒరలో ఉన్న ఖడ్గాన్ని తీసి అడ్డుగా వున్న పొదల్ని ఛిన్నాభిన్నం చేయటం మొదలుపెట్టాడు.

పది నిమిషాలు మాత్రమే చేయగలిగాడు అతను ఆ పనిని. పదకొండో నిమిషంలో సునిశితమైన అతని నాశికా రంధ్రాలకు సోకింది ఒక వాసన.

పొగ వాసన అది. దట్టమైన ఆ పొదలకు ఆవలి ప్రక్కన ఎక్కడో ఎవరో పెద్ద చితుకుల మంట వేసినట్లు గాలివాలున చాలా గాఢంగా తెలిసి వస్తోంది.

శివుడి మీది కోపం చటుక్కున మాయం అయిపోతుండగా... మరింత పట్టుదలగా ఆ పొదల మధ్యన ఒక దారిని ఏర్పాటు చేసుకున్నాడు అతను తన కరవాలం సహాయంతో. అడుగు తీసి అడుగు వేయటానికి ఎంతగానో భయపడుతున్న తన అశ్వాన్ని అతి బలవంతంగా నడిపిస్తూ, పొగ వాసన తెలిసివస్తున్న దిశలోకి నడిచాడు.

వందబారల దూరం పోవటానికి అర్థఘడియ పైగానే పట్టింది అతనికి. లావుగా వున్న ఒక చెట్టు మొదలు దగ్గర ఆగి అవతలి పక్కన వున్న ఒక పల్లపు ప్రదేశంలోకి తొంగిచూశాడు.

చిన్ననీటిగుంట ఒకటి వున్నది అక్కడ. ఆ గుంటదగ్గర ఆగి వున్నాయి కొన్ని అశ్వ శకటాలు. అడవి పొదల్లో అతిగా సంచరించడం వల్ల చినిగి పీలికలైన దుస్తులతో, ముళ్లపొదల మూలకంగా గాయపడిన మొఖాలతో, ఆ శకటాల దగ్గర కూర్చుని వున్నారు కొందరు భటులు. చితుకుల మంట వేసి ఆ మంటల మీద ఆహారాన్ని వండుకుంటున్నారు.

వారందరికీ పదివిండ్ల దూరంలో వున్న ఒక పెద్ద బండరాయి చాటున మోకరించి కూర్చుని వున్నాడు శివుడు. తదేక దీక్షగా వారివంకే చూస్తున్నాడు.

❖ ❖ ❖

అంతకుముందు అతనిమీద తనకు విపరీతమైన కోపం వచ్చిన సంగతిని వెంటనే మరచిపోయి తనలో తను నవ్వుకున్నాడు వాసుదేవుడు.

ఏనుగుల మీద కూర్చుని వుండగా గాలివాలున ఆ భటులు వేసిన చితుకుల మంట వాసన అతనికి తెలిసినట్టుంది... ఎవరికీ చెప్పకుండా అదేమిటో తెలుసుకోవటానికి వచ్చేశాడు.

"నీకు అసలు బుద్ధి అనేది కొంచెం కూడా లేదురా శివుడు... చెప్పా పెట్టకుండా వచ్చి ఏం చేద్దామనిరా ఇక్కడ కూర్చున్నావు?" పాము పాకినట్లు నిశ్శబ్దంగా మోచేతుల మీద పాకుతూ అతని సమీపంలోకి పోయి రహస్యంగా అడిగాడు.

అదిరిపడి వెనక్కి చూసి, కొంచెంగా సిగ్గుపడ్డాడు శివుడు. "శిఖావంతుడి సైనికులు ఎవరో మనల్ని అనుసరించి వస్తున్నారనిపించింది" అన్నాడు తనుకూడా రహస్యంగానే.

"వాళ్లు ఎవరో నాకు తెలుసు. మనం చాటుమాటుగా కూర్చోవాల్సిన అవసరం లేదు" అంటూ లేచి నిలుచున్నాడు వాసుదేవుడు.

"హెచ్చరిక భటులారా! భయపడకుండా మా వంక చూడండి" అంటూ చితుకుల మంట దగ్గర వున్నవారిని సంబోధించాడు.

అదిరిపడి తలా ఒక పక్కకు దొర్లుతూ మంటలవైపే చూస్తున్న ఆ భటులందరూ తమ ఆయుధాల మీద చేతులు వేస్తూ గబగబా లేచి నిలుచున్నారు.

"మందబుద్ధులు మీరు. కాబట్టే మీతో వచ్చిన యువరాణి జాడల్ని వెతుకలేక అడవిపక్షుల మాదిరి చెట్లు పుట్టల్ని పట్టుకు తిరుగుతున్నారు" మరింత గంభీరంగా అంటూ బండరాయి దగ్గర్నించి ముందుకు అడుగు వేశాడు వాసుదేవుడు.

పట్టిపట్టి చూశారు ఆ భటులు. ఉన్నట్లుండి వారి వదనాల్లో కనిపిస్తున్న ఆందోళన మటుమాయం అయిపోయింది.

"వాసుదేవుల వారికి వందనాలు" అంటూ ముందుకు వచ్చి నమస్కారాలు చేశారు.

"వీళ్ళు మనవాళ్ళేరా శివుడూ... మన యువరాణిని వెంటబెట్టుకొని రాజధాని నుంచి బయలుదేరిన చక్రవర్తి సైనికులు... పిచ్చిపట్టిన వాళ్ళమాదిరి ఈ అడవిలో కారట్లాడుతున్నారు" వెనుక వున్న శివుడికి చెప్పాడు వాసుదేవుడు.

"కారట్లాడవలసిన అవసరం ఏమొచ్చింది? ఎన్నో గ్రామాలున్నాయి ఈ చుట్టుపట్ల. అక్కడికి పోయి గ్రామస్థుల సహకారం తీసుకుని వుండాల్సింది" అన్నాడు శివుడు.

"దారి తెలిసినవారికి చాలా తేలిక ఆ గ్రామాల్ని వెతికి పట్టుకోవడం. యువరాణి మాయం అయిపోయేసరికి వాళ్ళకి మతులుపోయినట్లున్నాయి. అడవిదారుల్ని వదిలి ఈ పొదల మధ్యకి వచ్చి ఇరుక్కున్నట్లున్నారు" అంటూ ఆ భటుల వంక చూశాడు వాసుదేవుడు.

ఆలస్యం చేయకుండా తలలు ఊపారు వారందరూ.

"మీరు ముందుగా మీ ఆందోళనను వదిలిపెట్టండి. యువరాణి క్షేమం. ఇంతకుముందే ఈ పొదలకు ఆవలగా వున్న మార్గం గుండా ఆమె సంపంగి నగరం వెళ్ళింది" వాళ్ళకు చెప్పాడు వాసుదేవుడు.

గుండెలమీదినించి కొండంత బరువు దిగిపోయినట్లు తేలికగా నిట్టూర్చి అతనికి పదే పదే నమస్కారాలు చేశారు వాళ్ళు.

"మాకు అప్పజెప్పిన బాధ్యతని సరిగ్గా నిర్వహించ లేకపోయినందుకు సిగ్గుపడుతున్నాము. మా ఆందోళనను ఉపశమింపచేశారు మీరు. కృతజ్ఞతలు" అన్నారు.

శివుడి వద్ద వున్న చురకత్తిని తీసుకుని, చితుకుల మంట దగ్గర నేలమీద రకరకాల గీతలు గీసి, వారు చేయవలసిన పనిని, అనుసరించవలసిన మార్గాల్ని చూపించాడు వాసుదేవుడు.

"ఒళ్ళు దాచుకోకుండా ప్రయాణం చేస్తే రేపు సాయంకాలానికి మీరు సంపంగి నగరం చేరుకోగలరు మీ శకటాలతో సహా..." అని చెప్పి శివుడి కేసి తిరిగాడు.

"వచ్చిన పని అయిపోయింది. నీ అనుమానం వల్ల అడవిలో దారితప్పిన వాళ్ళ జాడలు తెలిశాయి. ఇక మన దారిన మనం వెళ్ళవచ్చు" అంటూ ఏ చెట్టు చాటునుంచి అతన్ని చూశాడో, ఆ చెట్టుదగ్గర వదిలిపెట్టిన తన అశ్వం దగ్గరికి చేరుకున్నాడు. ముందు శివుడిని ఎక్కించి, వెనక తను కూర్చున్నాడు. కాలి మడమలతో అదిలించి, దట్టమైన ఆ పొదల మధ్య తను ఏర్పాటు చేసిన మార్గంలో నుంచి ఇవతలి పక్కకు వచ్చాడు.

"సాగరుల వారు ఈ సరికి గ్రామంలో నుంచి బయలుదేరి వుంటారు. వేగంగా వెళితే తప్ప మనం వారిని కలుసుకోలేము" అంటూ గుర్రాన్ని మరింత గట్టిగా అదిలించాడు.

❖ ❖ ❖

నగరం వెలుపల వున్న ఆలయంలోని సొరంగ మార్గంలో నుంచి శివుడు ఎవరికీ కనిపించకుండా ఎలా నగరం లోపలికి వెళ్ళాడో, సరిగ్గా అదే మార్గంలో నుంచి నగరం వెలుపలికి వచ్చాడు శుశ్రుతుడు.

"సాగరుల వారికి ఆయన అంతరంగికుల్లో అతి కొద్దిమందికి మాత్రమే తెలిసిన రహస్యమార్గం ఇది. మనం దీన్ని ఉపయోగించినట్లు ఎవరూ గ్రహించలేరు. గ్రహించే సమయానికి మనం చాలా దూరం వెళ్ళిపోవచ్చు."

తనను బలవంతంగా కారాగారం దగ్గిర్నించి ఇవతలికి లాక్కువచ్చిన ఆగంతకులకి చెప్పాడు అతను.

"ఇటువంటి దారి ఒకటుందని మాకు ముందుగానే తెలిసివుంటే చాలా బాగుండేది. రాజభటులకు చచ్చినా దొరికేవాళ్ళం కాదు" అన్నాడు ఆగంతకుల నాయకుడు.

"ఇంకోసారి వాళ్ళకి దొరికితే చచ్చిపోవటం తప్పనిసరి. మీరు ఎటుగా ప్రయాణం చేయదలుచుకున్నారు?" అని అడిగాడు శుశ్రుతుడు.

"మేము మా శ్రేష్ఠిగారి దగ్గరికి పోయి జరిగింది వారికి విన్నవించాలి. మీ సంగతేమిటి?" అడిగాడు నాయకుడు.

"కారాగారంలో మనల్ని బయటకి రమ్మని పిలిచినవారి వాలకం నాకు వారు మన రాజధాని నుంచి వచ్చినవారి మాదిరిగా అనిపించింది. నేను అన్యాయంగా బంధించబడినట్లు మహామంత్రి గుణధాముల వారికి తెలిసి, బంధవిముక్తుడిని చేయటానికి వారిని పంపించినట్లుగా అనిపిస్తోంది. నిజం ఏమిటో తెలియదు" తను కారాగారం మందిర ద్వారం దగ్గిరికి వచ్చినప్పుడు తనను బయటికి పిలుస్తూ వాళ్లు మాట్లాడిన మాటల్ని మరోసారి గుర్తుచేసు కుంటూ అన్నాడు శుశ్రుతుడు.

"సాగరుడు మిమ్మల్ని దోషిగా భావించిన తర్వాత ఈ భూ ప్రపంచంలో ఎవరూ మీ నిర్దోషిత్వాన్ని నమ్మరు. దోషిగానే అనుకుంటారు. ఇప్పుడు మీరు గుడ్డిగా రాజధానికి వెళితే ఇంకోసారి బంధింపబడతారు. రాజధానిలో వున్న చెరసాలలు చాలా బలిష్టంగా వుంటాయని మీకు తెలుసు. వాటిలో నుంచి బయటపడటం నరమానవులెవరికీ సాధ్యపడే విషయం కాదు" నెమ్మదిగా చెప్పాడు ఆగంతకుల నాయకుడు.

అధికం అయిపోయింది శుశ్రుతుడి అనిశ్చిత పరిస్థితి. ఏదో చేయాలను కుని, ఇంకేదో చేశాడు తను. అనుకోని విధంగా తప్పటడుగు వేసి రాజద్రోహిగా మారిపోయాడు.

కనులు చిట్లించి అతని ముఖంలోకి చూస్తున్న ఆగంతకుల నాయకుడికి అర్థం అయిపోయాయి ఆ ఆలోచనలు.

"నిప్పులాంటి విశ్వాసపాత్రులు మీరు... నిజం ఏమిటో తెలుసుకొనే ప్రయత్నం చేయకుండా మిమ్మల్ని అనుమానించి, అవమానించారు. ఇంతకాలం చేసిన సేవలన్నీ ఎందుకూ పనికిరాకుండా పోయాయి. మీవంటి సాహసవంతుడికి ఇంతటి అవమానం జరగటం నిజంగా చాలా బాధాకరం" అంటూ అతని మనసులోని అనిశ్చిత పరిస్థితిని మరింతగా ఎగద్రోశాడు.

"ఇప్పుడు నేను ఏం చేస్తే బాగుంటుంది?" తనలో తను అనుకుంటున్నట్టు పైకే అన్నాడు శుశ్రుతుడు.

"అనవసరమైన ఆలోచనలతో మనసును కష్టపెట్టుకోకండి. మాతోపాటు మీరుకూడా మా శ్రేష్ఠిగారి వద్దకు విచ్చేయండి. మీ శక్తియుక్తులు ఆయనకు బాగా తెలుసు. ఏం చేయాలో ఆయనే చెపుతారు" అని అన్నాడు నాయకుడు.

"నన్ను ఇంతగా బాధపెట్టిన సాగరుల వారికి, ఆ మంత్రి మహేశ్వరుడికీ నా పగ ఎటువంటిదో తెలిసేటట్టు చేయకుండా మీతో ఎలా రాను?" అడిగాడు శుశ్రుతుడు.

తన వెనక నిలబడివున్న తన సహచరుల వంక ఓరగా చూసి, చిన్న నవ్వు ఒకటి నవ్వాడు ఆగంతకుల నాయకుడు.

"గజశాల దగ్గర జరిగిన సంఘటన సాగరుల వారి ముందుచూపు వల్ల జరిగిందని మేము అనుకోవటం లేదు. ఆయన పెంపకంలో పెరుగుతున్న అనాథ బాలబాలికల్లో శివుడు అనబడే ఆకతాయి ఒకడున్నాడు. మాకు వాడిమీదనే అనుమానంగా వున్నది. మీరు అవమానాలపాలు కావటానికి వాడే కారణమని కూడా మాకు అనిపిస్తోంది" అన్నాడు శుశ్రుతుడితో నమ్మకంగా.

శత్రువులతో చేతులు కలిపి ఆ ఆగంతకులు సంపంగి నగర గజదళాన్ని నాశనం చేయటానికి ప్రయత్నం చేశారని మరిచిపోయాడు శుశ్రుతుడు. తన అహంకారం తనను దేశద్రోహులతో చేతులు కలిపేటట్లు చేస్తోందని కూడా విస్మరించాడు.

"నిజమే... ఆ బాలుడిని దెబ్బతీయటం ద్వారా సాగరుల వారికి మంచి గుణపాఠం నేర్పవచ్చు... అతన్ని గురించి నాకు వివరంగా చెప్పండి" అన్నాడు.

గొంతు సవరించుకుని ఆగంతకుల నాయకుడు మాటలు మొదలుపెట్ట బోతుండగా వారు నిలబడిన ప్రదేశానికి దగ్గర్లో వున్న రహదారి మీద ప్రత్యక్షం అయినారు ఇద్దరు అశ్వికులు.

తమ గుట్టురట్టు అయిందన్న భయంతో బండరాళ్ళ చాటున పరిగెత్తబోయిన తన సహచరులందర్నీ ఒక్కచూపుతో కట్టడి చేశాడు నాయకుడు.

"వాళ్ళు నగరంలో నుంచి రావటంలేదు. వెలుపలినించి వస్తున్నారు కాబట్టి మనం ఎవరిమో, ఏమిటో వారికి తెలిసే అవకాశం లేదు. కదలకుండా నిలబడండి. నేను మాట్లాడతాను" అన్నాడు.

అతని సహచరులతో పాటు తనుకూడా మౌనంగా తలవంచుకుని నిలుచున్నాడు శుశ్రుతుడు.

"ఎవరు మీరు? ఎందుకు నిలుచున్నారు ఇక్కడ?" రహదారి పక్కనే నిలుచున్న వారందర్నీ గమనించి దగ్గరిగా వస్తూ అడిగాడు ఆ అశ్వికుల్లో ఒకతను.

తూర్పు దిక్కు తెల్లబడలేదు. చీకట్లు ఇంకా తొలగిపోలేదు. ఆకారాలు కనిపించినా మొఖాలు మాత్రం స్పష్టం కావడం లేదు.

"నగరమంతా ముట్టడికి సిద్ధం అవుతోంది. గజదళం నగరం వెలుపల సర్వసన్నద్ధంగా నిలబడి వుంది. చుట్టుపక్కల వున్న గ్రామాల్లో నుంచి గడ్డిమోపుల్ని తీసుకురమ్మనమని సేనాపతి ఆజ్ఞ... సిద్ధపరిచిన గజాలకు ఆహారం అత్యవసరం కదా" అన్నాడు ఆగంతకుల నాయకుడు. అంతటితో ఆ అశ్వికులు తృప్తిపడ్డారు గాని, నాయకుడు మాత్రం అంతటితో ఆగలేదు.

"సైనికులంతా నగరంలో కాళ్ళు విరగదొక్కుకుంటుంటే, మీరు నగరం వెలుపలికి ఎందుకు పోయినట్లు?" అన్నాడు.

"మేము సాగరుల వారిని అనుసరించి అడవిలోకి వెళ్ళాము. యువరాణి వారిని వెంటబెట్టుకుని సాగరుల వారు క్షేమంగా వెనక్కి వస్తున్నారు. చారులతాదేవి గారికి ఈ మాట చెప్పటం కోసం మమ్మల్ని ముందు పంపించారు" అంటూ తమ వాహనాల్ని వేగంగా నగరం వైపు పరిగెత్తించారు.

మౌనంగా తలవంచుకు నిలబడి వున్న శుశ్రుతుడి వంక ఓరగా చూశాడు ఆగంతకుల నాయకుడు.

"సాగరుల వారితో పాటు ఆ మంత్రి మహేశ్వరుడు కూడా వుండే వుంటాడు. ఎంత చీకట్లోనయినా నన్ను" మిమ్మల్ని అతను తేలికగా గుర్తుపట్టేస్తాడు... మనం దూరంగా వెళ్ళిపోవటం చాలా మంచిది" వెంటనే అన్నాడు శుశ్రుతుడు.

ఎదురు చెప్పలేదు ఆగంతకుల నాయకుడు. తనవారికి సైగ చేసి రహదారికి ఆవలి పక్కగా కొంచెం దూరంలో వున్న ఒక కొండగుట్ట కేసి బయలుదేరాడు.

తన శక్తి ఎటువంటిదో సాగరుల వారికి తెలియచెప్పే మార్గాల్ని ఆలోచిస్తూ అతన్ని అనుసరించాడు శుశ్రుతుడు.

❖ ❖ ❖

నగరం నగరమంతా సైనికులు ఎంతగా వారిస్తున్నా వినకుండా నగర ద్వారాల దగ్గరికి వచ్చేసింది.

జ్వలిత సామ్రాజ్యానికి కాబోయే మహారాణిని వారెవరూ చూసి వుండలేదు అప్పటివరకూ. తోసుకుంటూ తొక్కిసలాడుకుంటూ ఊపిర్లుబిగపట్టి ఎదురు చూడటం మొదలుపెట్టారు.

"తల్లీ... వాళ్ళని అదుపుచేయటం అసాధ్యంగా వుంది. బలప్రయోగం చేయకపోతే తొక్కిసలాట అధికం అయిపోయేటట్లుంది. వెదురుచువ్వలతో రెండు మూడుసార్లు బెదిరించమని ఆజ్ఞ ఇవ్వండి" చెలికత్తెలు, అంగరక్షకులు వెనుక నడుస్తుండగా, ద్వారాల దగ్గరికి వచ్చిన చారులతాదేవిని అర్థించాడు సేనాపతి.

"తల్లీ... కట్టకట్టుకుని అందరూ ద్వారాల మీద పడిపోయేటట్లున్నారు. ద్వారాలు విరిగిపోతే చాలా ప్రమాదం" ఆందోళనగా చెప్పాడు అప్పుడే వచ్చిన ఒక దళపతి.

"తమకు కాబోయే మహారాణిని చూడాలనే వారి కుతూహలాన్ని మనం గౌరవించాలి. ముందు ద్వారాల్ని తెరిపించండి" చెప్పింది చారులతాదేవి.

ముట్టడి జరుగుతుందన్న అనుమానంతో మూసివేయబడిన ద్వారాల్ని తిరిగి తెరవటానికి తటపటాయించాడు సేనాపతి.

"మన గజదళం వెలుపల నిలబడి వుండగా, ఇప్పటికిప్పుడు వచ్చిన భయం ఏమీలేదు. తెరవమని ఆజ్ఞ ఇవ్వండి" మరింత గట్టిగా చెప్పింది ఆమె.

అయిష్టంగానే వెళ్ళి ఆ ఆజ్ఞల్ని అమలులో పెట్టాడు సేనాపతి. గొల్లుగొల్లున కేకలు పెడుతూ ద్వారాలను దాటి కోట వెలుపలికి పరిగెత్తబోయారు చాలామంది పౌరులు.

కదిలే కొండల మాదిరి గంభీరంగా నిలబడి వున్న ఏనుగుల్ని చూసి భయంతో మళ్ళీ వెనక్కి వచ్చేశారు.

సూర్యుడు ఒక బారెడు దూరం ఆకాశంలోకి ఎగబ్రాకుతున్న సమయంలో రహదారి మీద ప్రత్యక్షం అయింది సాగరులవారి బృందం.

ఆయనకు, మంత్రి మహేశ్వరుడికి మధ్యగా తన అశ్వాన్ని నడిపిస్తూ వస్తున్న జ్వాలను చూసీచూడగానే యువరాణి అని గుర్తించి జయజయ ధ్వానాలు మొదలుపెట్టారు పౌరులు.

ద్వారం వెలుపలికి వచ్చి నిలబడిన చారులతాదేవి ఇంకా కొంచెం దూరంలోనే వున్నదనగా తన వాహనం మీదినుంచి దుమికి, వేగంగా పరిగెత్తుకు వచ్చింది జ్వాల. ముందు పాదాలకు నమస్కరించి, ఆ తరువాత మేనత్త కౌగిలిలో ఒదిగిపోయింది.

"ఏడి మా శివుడు? ఎక్కడ??" తల ఎత్తి దగ్గరికి వచ్చిన మహేశ్వరుడిని అడిగింది చారులతాదేవి.

"ఈ గజదళాన్ని చూసి తన ఏనుగులు ఆగ్రహం చెందటమో, ఆవేశ పడటమో ఏదో జరుగుతుందని వాడు అనుమానపడ్డాడు. తన ఏనుగులతో పాటు దూరంగానే ఆగిపోయాడు" చెప్పాడు మహేశ్వరుడు.

"వాడిని చూడటం కోసం మేము ఎంతో ఆత్రుతగా ఎదురుచూస్తున్నాము. వెంటనే వాడిని రప్పించండి" అన్నది ఆమె.

"ముందు మీరు యువరాణితో అంతఃపురానికి వెళ్లండి తల్లీ... నేను ఏదో ఒకటి ఏర్పాటు చేసి వాడిని రప్పిస్తాను... వాడు కనిపించకపోతే ఆ ఏనుగులు ఆగవు... ఈ ప్రదేశమంతా అల్లకల్లోలం అయిపోతుంది" అంటూ వెనక్కి చూశాడు మహేశ్వరుడు.

అతనితోపాటుగా ద్వారాల దగ్గరికి రాలేదు సాగరుల వారు. ఆయన్ను చూడగానే పెద్దగా ఘీంకరించి, వేగంగా ఎదురు వెళ్ళింది ఆ గజసైన్యానికి నాయకత్వం వహించే పట్టపుటేనుగు.

తన అశ్వం మీదినించి దిగి, దాన్ని ముద్దుచేశాడు సాగరుల వారు. గజదళానికి చెందిన సైనికులు కొందరు తీసుకువచ్చి తనకు అందించిన కలకండ స్ఫటికాలను దోసిటనిండా తీసుకుని దాని నోటికి అందించి సాదరంగా తొండాన్ని నిమిరాడు.

పట్టపుటేనుగును ఒక్కదాన్నే కాదు... వరుసల్లో నిలబడి వున్న అన్ని గజాలను అదేవిధంగా పరామర్శించాడు.

"ఇంతకు ముందెన్నడూ జరుగని భయంకర యుద్ధం జరగబోతోంది. సిద్ధంగా వుండండి. నగరంలోని పనులు పూర్తి చేసుకొని మళ్ళీ మీ దగ్గరికి వస్తాను" మనుష్యులతో చెప్పినట్లు వాటికి చెపుతూ ద్వారాల దగ్గరికి వచ్చి, తనకు పాదాభివందనం చేసిన భార్యను కౌగిలించుకుని చిరునవ్వు నవ్వాడు.

జయజయ ధ్వానాలతో దద్దరిల్లిపోతోంది ఆ ప్రదేశం.

"తమరు యువరాణిని ఎంత త్వరగా అవతలికి తీసుకుపోతే అంత మంచిది. ఆనందం అధికమై వాళ్ళందరూ తమ మీదికి ఎగబడే ప్రమాదం వుంది" చిరునవ్వుతో ఆయన్ని హెచ్చరించాడు మహేశ్వరుడు.

జ్వాలనీ, తన సతీమణిని వెంటబెట్టుకుని నగర పౌరులందరికీ అభివాదం చేస్తూ అంతఃపుర మందిరాల వైపు బయలుదేరాడు సాగరులవారు.

❖ ❖ ❖

"మొదలుపెట్టిన పని జయప్రదంగా పూర్తి అయింది. మన సేనాపతి మళ్ళీ నగర ద్వారాల్ని మూసివేయించక ముందు మనం కూడా లోపలికి వెళ్ళటం బాగుంటుంది" శివుడితో అన్నాడు వాసుదేవుడు.

దూరంలో నిలబడి వున్న గజదళం వంక కోరగా చూస్తున్న తన ఏనుగుల వంక ఒకసారి చూసి గాఢంగా నిట్టూర్చాడు శివుడు.

కదలమని సైగ చేసిన వెంటనే పరుగు పరుగున పోయి ఆ సైన్యంమీద కలబడేటట్టుంది వాటి వాలకం.

"వీటిని నగరంలోకి తీసుకుపోవటం ఇప్పుడు సాధ్యపడే విషయం కాదు... వాటిని ఆ సైన్యానికి దూరంగానే వుంచాలి" తనుకూడా ఆ పరిస్థితిని గమనిస్తూ అన్నాడు వాసుదేవుడు.

తను దగ్గర లేకపోయినా, అవి గజసైన్యం మీదికి ఎగబడటం తప్పదని తెలిసిపోయింది శివుడికి.

"వాటికి నచ్చచెప్పటం కొంచెం కష్టమే. కొంచెం వ్యవధి కావాలి. మీరు నగరంలోకి వెళ్ళండి. నేను వెనుకగా వస్తాను" పది క్షణికాలు ఆలోచించి చెప్పాడతను.

"నిన్ను ఒంటరిగా వదిలిపెడితే సాగరుల వారు నా భరతం పట్టేస్తాడు. ఇద్దరం కలిసే పోదాము" అన్నాడు వాసుదేవుడు.

సరిగ్గా అదే సమయంలో తల్లిచాటునుంచి కాస్తంత ఇవతలికి వచ్చింది గున్న. దూరంలో కొండరాళ్ళ మాదిరి నిలబడి వున్న ఏనుగుల్ని చూడగానే దానికి ఉత్సాహం అధికం అయిపోయింది. తొండాన్ని గాలిలోకి ఎత్తి తన తల్లి ఘీంకరించినట్లు భీకరంగా ఘీంకరించటానికి ప్రయత్నం చేసింది.

వయసు చాలా తక్కువ అవడంతో ఘీంకారం మాదిరి ధ్వనించలేదు. ఆ శబ్దం కీచుగా బయటికి వచ్చింది.

అది ఏదో ప్రమాదానికి గురి అవుతున్నట్టు భావించింది కాబోలు, అతి వేగంగా కదిలింది గజ సైన్యంలో వున్న పట్టపుటేనుగు. భూమి అదిరిపోయేటట్లు అడుగులు వేస్తూ అటుకేసి రావటం మొదలుపెట్టింది.

దాన్ని ఆపడం గాని, అదుపు చేయడం గానీ ఏమీ చేతకాక, "వెళ్లిపోండి... అక్కడినించి వెళ్లిపోండి" అని బిగ్గరగా అరిచారు గజసైన్యం దగ్గర వున్న సైనికుల్లో కొందరు.

దబదబమని అడుగులు వేస్తూ వస్తూన్న పట్టపుటేనుగును చూసి, ఆవేశపడింది మగ ఏనుగు. చెవులు చిల్లులు పడేటట్లు శబ్దం చేసి దాన్ని ఎదిరించేటందుకు కదిలింది.

దానితో పాటుగా అడుగు కదిపిన ఆడ ఏనుగును అదిలించి ఆపేశాడు శివుడు. "అది మనకి శత్రువు కాదు. మిత్రుడే... మనం ఎదిరించకూడదు... వెనక్కి వచ్చేయ్...." అని అరుస్తూ మగ ఏనుగు ముందుకు పోయి అతి బలవంతంగా ఆపాడు. దాని దంతాల మీద పాదాలు మోపి గబగబా కుంభ స్థలం మీదికి పాకాడు. మడమలతో అదిలించి వెనక్కి తిప్పాడు.

పట్టపుటేనుగు మరో పాతిక ధనువుల దూరం వచ్చేసరికి వెనక్కి తిరిగి రహదారికి కొంచెం దూరంలో వున్న ఒక కొండగుట్టవైపు వెళ్ళిపోయింది మగ ఏనుగు... దాన్ని చాలా దగ్గరగా అనుసరించింది ఆడ ఏనుగు గున్నతో సహా.

"ఒరేయ్ శివుడూ... నువ్వు చెప్పిందే నిజం. ఏదో ఒక విధంగా వాటికి నచ్చచెప్పి, గొడవ లేకుండా నగరంలోకి తీసుకురా... నేను నగరంలోకి పోతున్నాను" అని చెప్పి తన అశ్వాన్ని ముందుకు కదిలించాడు వాసుదేవుడు.

ద్వారాల ముందున్న గజసైన్యం కనిపించకుండా, తన ఏనుగుల్ని గుట్టచాటుకు తీసుకుపోయాడు శివుడు. "ముందుగా మనం మంచినీటి గుంటని వెతికి శుభ్రంగా స్నానం చేయాలి" అంటూ మగ ఏనుగు మీదినించి క్రిందికి దూకాడు. దూకుతూ వుండగానే వచ్చింది అతనికి ఒక అనుమానం.

నగరంలోకి రాకపోకలు సాగించే రహదారికి చాలాదూరంలో వున్నది ఆ కొండగుట్ట. ఎండుచితుకులు ఏరుకోవటం కోసమో, ఏవైనా వనమూలికల్ని వెదుక్కోవటం కోసమో తప్ప ఎవరూ రారు అక్కడికి. ఒకవేళ వచ్చినా ఒకరిద్దరు మాత్రమే వస్తారు తప్ప గుంపులు గుంపులుగా వచ్చే అవకాశం అస్సలు లేదు.

చిత్తడి చిత్తడిగా కనిపిస్తున్నాయి ఇప్పుడు పాదముద్రలు అనేకం . కనీసం ఒక వందమందికి పైగా ఆ బండరాళ్ళ మధ్య అటూయిటూ సంచరించినట్లు చాలా స్పష్టంగా అగుపిస్తున్నాయి.

నీటిగుంటని వెతికి ఒంటిని ఆవరించుకుని వున్న మురికిని వదిలించు కోవాలన్న మాటను వెంటనే మరిచిపోయాడు శివుడు.

"మీరు ఇక్కడే నిలబడి వుండండి. ఒక్క అంగుళం కూడా అటూ యిటూ కదలవద్దు" అని తన ఏనుగులను హెచ్చరించి, క్రింద కనిపిస్తున్న అడుగు జాడల వంకే చూస్తూ గుట్టమీదికి బయలుదేరాడు.

చదరంగా వున్న ఒక బండరాయి దగ్గర కనిపించింది ఒక గుహ. ఆ ప్రదేశం వరకూ వచ్చి ఆగిపోయాయి ఆ అడుగుజాడలు.

గుబగుబలాడుతున్న గుండెల్ని చిక్కబట్టుకుని మూడు అడుగులు ముందుకు వేసి గుహలోకి తొంగిచూశాడు అతను. మనిషిని చూస్తే మీద పడి ప్రాణాలు తీసే అడవిజంతువులు ఏమైనా ఆ గుహలో తలదాచుకుని వుంటే, అవి తనను చూసి మీదికి లంఘించేటట్లయితే వెంటనే దూరంగా పారిపోవటానికి సిద్ధంగానే వున్నాడు అతను.

అదృష్టవశాత్తు అటువంటివేవీ కనిపించలేదతనికి. ఒత్తుగా వున్న ఎండుపొదలు, పిచ్చిచెట్లు, ఎండిపోయిన వాటి కొమ్మలు...

ఏదేదో ఊహించుకుని పెద్దపోటుగాడి మాదిరిగా అక్కడికి వచ్చినందుకు ఒకింత సిగ్గుపడుతూ వెనుతిరగబోయి అంతలోనే ఆగిపోయాడతను.

సూర్యరశ్మి సోకని ప్రదేశంలో పిచ్చిచెట్లు కాదు గదా గడ్డిపోచలు కూడా పెరిగి పెద్దవి కాలేవు. తనకు కనిపించినవన్నీ చాలా రోజుల క్రితం ఎవరో అక్కడికి కావాలనే తీసుకువచ్చినట్లు వడిలి, వాడిపోయి ఎండుకుపోయి వున్నాయి.

చటుక్కున ముందుకు వంగి, దగ్గర్లోవున్న ఒక పొదని పట్టుకుని బరా బరా బయటికి లాగాడతను.

రెండు పొదల్ని తొలగించిన వెంటనే కనిపించాయతనికి గుహ లోపలి భాగంలో గుట్టలు గుట్టలుగా పేర్చి వున్న ఆ ఆయుధాలు.

❖ ❖ ❖

తన దగ్గర వున్న సైన్యంలో సగభాగాన్ని సంపంగి నగరం కేసి ప్రయాణం కమ్మని ఆజ్ఞలు ఇచ్చాడు శిఖావంతుడు. మిగిలిన సైన్యాన్ని జ్వలిత సామ్రాజ్యపు రాజధానివైపు నడవ వలసిందిగా చెప్పాడు.

"ప్రభూ... సంపంగి నగరాన్ని ముట్టడించేందుకు కొండలోయలో వున్న సైన్యం సరిపోతుంది. ఇంత బలగం అవసరం లేదు" అంటూ చెప్పబోయిన మంత్రి వంక కోరగా చూసి నోరు మూయించాడు.

"ముట్టడి అంటూ మొదలు కాకముందే ఎన్నెన్నో ఎదురుదెబ్బలు మనకు ఆ సంపంగి నగరం నుంచే తగిలాయి. అక్కడ వున్నవారిని తక్కువ అంచనా వేయటానికి వీలులేదు. మన దృష్టిలో సగం ఆ నగరం మీదనే కేంద్రీక రించాలి.... మీరు వెళ్ళి ఆ కనకయ్య శ్రేష్ఠిని తీసుకురండి" అని చెప్పాడు.

పావు ఘడియ తరువాత ఆయన ఎదుట ప్రవేశపెట్టబడ్డాడు కనకయ్య శ్రేష్ఠి. తలవంచి నమస్కరించాడు.

"సంపంగి నగర చెరసాలలో వున్న శుశ్రుతుడిని విడిపిస్తే అతని ద్వారా ఆ సాగరుడి పని పట్టవచ్చని మీరు అభిప్రాయపడ్డారు. అవునా?" అతనివంక సూటిగా చూస్తూ అడిగాడు శిఖావంతుడు.

తలవూపాడు కనకయ్య శ్రేష్ఠి.

"మా మంత్రి మీకు కావాల్సిన ప్రయాణ సాధనాల్ని సమకూరుస్తాడు. మా సైన్యం సంపంగి నగరం కేసి బయలుదేరింది. మీరు సైన్యం కంటే ముందుగానే ఆ నగరానికి చేరుకుని, మీ ఆలోచనని కార్యరూపంలో పెట్టండి" అని ఆజ్ఞ ఇచ్చి చేయి వూపాడు శిఖావంతుడు.

ఎన్నెన్నో ఊహలతో అతని దగ్గరికి వచ్చాడు కనకయ్య శ్రేష్ఠి. తను అతనికి సహాయం చేసినందుకు ప్రతిఫలంగా తనకు ఏదో ఒక ఉపయోగం వుండేలా ఒప్పందాలు చేసుకోవాలని అతని కోరిక.

ఒప్పందాల మాట దేవుడెరుగు... తన క్రింద పనిచేసే అనుచరులకు ఆజ్ఞలు ఇచ్చినట్లు ముక్తసరిగా మాట్లాడతాడని కొంచెంగా కూడా ఊహించలేదు.

"వెళ్లి ప్రయాణ సన్నాహాలు చేసుకోమని చెపితే ఇంకా ఏమిటో ఆలోచిస్తా రెందుకు? కదలండి" ఖంగుమంటూ శిఖావంతుడి కంఠం వినవచ్చేసరికి అంతమైపోయాయి కనకయ్య శ్రేష్ఠి ఆలోచనలు.

ఆ సమయంలో ఏ మాత్రం తాత్సారం చేసినా అతనికి ఎదురుచెప్పినా తన ప్రాణాలకే ప్రమాదమని గ్రహించి తలవూపాడు వినయాన్ని నటిస్తూ.

"చిత్తం ప్రభూ... మీరు చెప్పినట్లే చేస్తాను" అంటూ సభా భవనం నుంచి బయటికి వచ్చాడు.

"మనంతట మనంగా సంపంగి నగరానికి వెళ్ళే ఆలోచన ఏమంత మంచిగా వున్నట్లు తోచటం లేదు. మన గురించిన వివరాలు సాగరుల వారికి తెలిసివుంటే చాలా ప్రమాదం..." ఆయన వెనుకే వున్న అనుచరుడు చిన్నగా చెవిలో చెప్పాడు.

"నిజమే... కాని ఈ అహంభావి ఆజ్ఞలను ధిక్కరించటం కూడా ప్రమాదమే. ప్రాణాలతో ఈ నగరంలో నుంచి బయటపడాలంటే ప్రస్తుతానికి ఇతని మాటల్ని వినటమే మంచిది" అన్నాడు కనకయ్య శ్రేష్ఠి.

"సంపంగి నగర కారాగారంలో బంధింపబడిన మనవాళ్ళని చిత్రహింసలు పెట్టి వుంటారు. ఆ హింసలను తట్టుకోలేక వాళ్ళు మన గుట్టుమట్లన్నిటినీ బట్టబయలు చేసేసి వుంటారు. నగరంలోకి వెళ్ళవలసిన అవసరం లేదు. ఆ పొలిమేరల సమీపంలోకి కూడా పోకముందే సాగరుల వారు మన అంతు చూసే పథకాలు రచించివుంటారు..." మరింత భయంగా అన్నాడు ఆ అనుచరుడు.

సమాధానం ఇవ్వలేదు కనకయ్య శ్రేష్ఠి. సాలోచనగా తలవూపుతూ తమ విడిది భవనాన్ని చేరుకున్నాడు. తమ ఆడంబరాన్ని, వైభోగాన్ని తేటతెల్లం చేసే లాంఛనమైన ముత్యాల పల్లకీ, దాసదాసీ జనం అందరినీ అక్కడే వదిలి, అంతరంగికుడైన ఆ ఒక్క అనుచరుడితో కలిసి శిఖావంతుడు సిద్ధం చేయించిన అశ్వశకటంలో కూర్చున్నాడు అతను. సంపంగి నగరంకేసి బయలుదేరిన

సైన్యం వెనుకే ప్రచోద నగరంలో నుంచి వెలుపలికి వచ్చి అడవిదారిలో ప్రయాణం మొదలుపెట్టాడు.

❖ ❖ ❖

పొడవుగా వున్న ధనస్సులు, పదునైన బాణాలు, కత్తులు, మిలమిల మెరిసిపోతున్న కతార్లు, చురకత్తులు, మందపాటి కవచాలు, బలమైన శిరస్త్రాణాలు... కోటగోడల మీదికి విసరటానికి ఉపయోగపడే జనపనార మోకులు, వాటి చివర్లకుకట్టే ఇనుపకొక్కీలు...

గుట్టలు గుట్టలుగా పడి వున్నాయి ఆ ముట్టడి సామాగ్రులు. బయటికి కనిపించకుండా గుట్ట క్రిందినించి తవ్వుకు వచ్చిన పొదలతో, విరుచుకు వచ్చిన చెట్లకొమ్మలతో కప్పబడి వున్నాయి.

అటువంటి దృశ్యం కంట పడుతుందని ఊహించకపోవడం వల్ల పది క్షణికాల పాటు నిశ్చేష్టుడైనాడు శివుడు.

సంపంగి నగరానికి చెందిన సామాగ్రి నిశ్చయంగా కాదు అది. బంగారు బయలు ప్రదేశంలో అటువంటి వాటిని దాచిపెట్టవలసిన అవసరం సాగరుల వారికి లేదు. తప్పకుండా అది శత్రువుల పనే అయి వుంటుంది.

దగ్గర దగ్గరగా రెండు మూడు వేలమంది సైనికులకు సరిపడే సామాగ్రి అది. రెండోకంటివాడికి తెలియకుండా అక్కడికి ఎలా తీసుకురాబడింది? ఎవరిచేత తీసుకురాబడింది??

ఇవతలికి లాగిన ఎండుపొదల్ని, కొమ్మల్ని తిరిగి ఆ సామాగ్రికి అడ్డుగా నెట్టి, ఇవతలికి వస్తూ చాలా తీవ్రంగా ఆలోచించాడు శివుడు.

ఒకరు ఇద్దరు చేసిన పని కాదు అది. దాదాపు ఒక వందమందికి పైగా వాటిని మోసుకువచ్చి అక్కడ నిక్షిప్తపరచి వుంటారు.

సంపంగి నగరం మీదికి దండు వెడలాలంటే, అడవిదారుల వెంట ప్రయాణం చేయవలసిందే... వేరే మార్గం లేదు. యుద్ధం చేయటానికి అవసరమైన సామాగ్రితో వేగంగా ప్రయాణం చేయడం చాలా కష్టం. ఎటువంటి బాదరబందీ వెంటలేకుండా వుంటే ఆ పని చేయటం సులువని శిఖావంతుడు భావించి ముందుగానే ఆయుధ సామాగ్రిని ఇక్కడికి పంపించాడా??

రాళ్ళల్లో చెక్కిన బొమ్మల మాదిరి నిలుచుని వున్న తన ఏనుగుల దగ్గరికి తిరిగి వస్తుండగా చటుక్కున అతని కనుల ముందు మెదిలింది నదీ తీరంలో తన ఏనుగులు చేసిన యుద్ధం.

అవును... వాళ్ళే... ఈ ఆయుధాల్ని ఇక్కడ దాచిపెట్టి వెనక్కి వెళుతూ తన ఏనుగుల ధాటికి చెల్లాచెదురైపోయారు.

కనకయ్య శ్రేష్ఠి అనుచరుల్ని వశపరచుకుని విషప్రయోగంతో కోటలోని ఏనుగుల్ని మట్టుబెట్టే ప్రయత్నం కూడా వాళ్ళే చేశారు.

మంచినీటి గుంటని వెతికి, ఒంటిమీది మురికి వదిలించుకోవాలన్న కోరిక వేగంగా మాయమైపోయింది శివుడు మనస్సులో నుంచి.

"శత్రువులు పన్నిన మరో పన్నాగం దేవుడి దయవల్ల మన దృష్టిలోకి వచ్చింది. అవసరమైన ఆయుధాలు ఇక్కడ వున్నాయన్న నమ్మకంతో శత్రుసేనలు చాలా వేగంగా మన నగరం మీదికి వచ్చేస్తాయి. వెంటనే వెళ్లి అందరినీ హెచ్చరించాలి... పదండి" అంటూ గబగబా మగ ఏనుగు మీదికి ఎగబ్రాకి, కోటవైపు నడవమని సైగ చేశాడు అతను.

చెవులు చిల్లులు పడేటట్లు ఘీంకరించింది అది. తమను చూసి మందలో నుంచి పరిగెత్తుకు వచ్చిన పట్టపుటేనుగు కనులముందు మెదిలి, ఆవేశం అధికమైపోయింది కాబోలు, శివుడు ఊహించినదాని కంటే వేగంగా పరుగు మొదలుపెట్టింది.

సగం దూరం వెళ్లేవరకూ రాబోతున్న ప్రమాదాన్ని గుర్తించలేదు శివుడు. నిశ్చలంగా నిలబడి వున్న గజదళంలో నుంచి మళ్ళీ పట్టపుటేనుగు విడివడి తమకు ఎదురు వస్తూ వుండటాన్ని చూసిన తర్వాత గాని తన పొరపాటు ఏమిటో అతనికి అర్థం కాలేదు.

"వద్దు... పోట్లాట వద్దు. ఆగు... ఆగిపో..." ఆందోళన నిండిన కంఠంతో మగ ఏనుగును ఆపటానికి ప్రయత్నించాడు అతను.

ఆగలేదు అది. అతని మాటల్ని వినిపించుకోను కూడా వినిపించుకోలేదు. వేగాన్ని మరింతగా పెంచేసింది.

భూమి కంపించేటట్లు అడుగులు వేస్తూ వస్తున్న పట్టపు టేనుగును చూసిన కొద్దీ అధికం అవసాగింది శివుడి ఆరాటం.

అది తన ఏనుగును ఏదో చేస్తుందని కాదు ఈ ఆరాటం. తన ఏనుగుతో తలపడినప్పుడు దానికి ఏమైనా గాయాలు తగిలితే ఆ తప్పు అటు తిరిగి ఇటు తిరిగి తన మీదికే రుద్దబడుతుంది.

అదీకాక, యుద్ధం చేయటానికి సంసిద్ధంగా వుంది అది. ఇనుప కవచాలు, చర్మపు తొడుగులు, దంతాలకు పదునైన కత్తులు, అన్నీ సిద్ధంగా వున్నాయి దాని దగ్గర. తన ఏనుగు తట్టుకోవటం కష్టం అయిపోవచ్చు.

“వెళ్ళిపో... దూరంగా వెళ్ళిపో... వెళ్ళిపో...” పట్టపు టేనుగును ఆపటం అసాధ్యమైపోవటం వల్ల, చెవులు చిల్లులు పడే రీతిలో కేకలు మొదలుపెట్టారు గజదళానికి రక్షణగా నిలుచుని వున్న సైనికులు.

“వద్దు... యుద్ధం వద్దు... వెనక్కి వెళ్ళిపోదాం...” కుంభస్థలం మీదినించి ముందుకు వంగి మగ ఏనుగు చెవి దగ్గర గట్టిగా అరిచాడు శివుడు.

వినిపించుకోలేదది... మరింత భీకరంగా ఘీంకారం చేసింది.

తన దంతాలకు బిగించి వున్న కత్తుల్ని పైకీ క్రిందికీ ఆడిస్తూ దగ్గరికి వచ్చేసింది పట్టపుటేనుగు.

పదే పది క్షణికాల్లో వచ్చి మగ ఏనుగును తాకుతుంది అది. కుంభస్థలానికి బిగించి వున్న ఇనుప కవచం మీది పదునైన గుబ్బలు, మగ ఏనుగు తలను తీవ్రంగా గాయపరుస్తాయి. దంతాలకున్న కత్తులు తొండాన్ని కోసి వేస్తాయి.

నీటితో నిండిపోయాయి శివుడి కళ్ళు. ఎదుట వున్న శత్రువు ఎంత ప్రమాదకారో మగ ఏనుగుకు తెలియటంలేదు. అది పొరపాటున కూడా తన వేగాన్ని తగ్గించడం లేదు.

మరో రెండు క్షణికాల్లో ఆ రెండూ ఒకదాని నొకటి ఢీ కొట్టుకుంటాయని అనిపిస్తున్న సమయంలో తళుక్కున శివుడి మనసులో మెదిలిందొక ఆలోచన.

“వచ్చేయ్.. ముందుగా వచ్చేయ్... ఆ ఏనుగును ఎదిరించేయ్” పక్కకు తిరిగి ఆడ ఏనుగును హెచ్చరించాడు అతను.

మగ ఏనుగుకు మూడు అంగల వెనుకగా వస్తున్న ఆడ ఏనుగు, పదునైన అంకుశంతో తనను ఎవరో పొడిచినట్లు ఒక్కసారిగా ముందుకు దూకింది. తనకు అడ్డం రాబోయిన మగ ఏనుగును లక్ష్యపెట్టకుండా సూటిగా పట్టపు టేనుగు మీదికి పోయింది.

తొండాన్ని గాలిలోకి ఎత్తి సింహనాదం చేస్తున్నట్టుగా ఘీంకరిస్తున్న ఆ యుద్ధ గజం తన మార్గానికి ఏదో పెద్ద కొండరాయి అడ్డు వచ్చినట్లు ఒక్కసారిగా ఆగిపోయింది.

"అవతలికి నెట్టేయ్... ఆలస్యం చేయకు. ఆలోచించకు" గొంతు జీరపడి పోయేట్లు ఇంకో అరుపు అరిచాడు శివుడు. తన ఆలోచన యదార్థమైనందుకు ఉప్పొంగిపోతోంది అతని అంతరంగం. ఆడ ఏనుగును రెచ్చగొట్టటంతో ఆగలేదతను. గున్నని కూడా హెచ్చరించాడు.

"చూస్తావేం? వెళ్ళు... వెళ్ళి వెనకనుంచి పొడిచేయ్..." అని అరిచాడు.

నడవటం కూడా సరిగ్గా చేతకాని ఆ పిల్ల ఏనుగు తన తల్లి మాదిరిగానే భీకరంగా అరవటానికి ప్రయత్నం చేస్తూ గునగునా పోయింది పట్టపుటేనుగు మీదికి.

పాదాలతో మగ ఏనుగు మెడను గట్టిగా అదిమి పట్టుకున్నాడు శివుడు. "పరిస్థితి మనకు చాలా అనుకూలంగా వుంది. నువ్వు ఆవేశపడకూడదు. చూస్తూ నిలబడవలసిందే" అంటూ దాన్ని అతి బలవంతంగా నిలుపుదల చేశాడు.

తన దంతాలకున్న కత్తులతో మగ ఏనుగును చీల్చి చెండాడాలన్నంత కసితో పరిగెత్తుకు వచ్చిన పట్టపు టేనుగు ఘీంకారాల్లో విచిత్రమైన మార్పు వచ్చేసింది.

అంతకుముందు మాదిరి ఆవేశం కనిపించడం లేదు. ఆత్రుత... తన దారికి అడ్డు రావద్దన్నట్లు ఒక అభ్యర్థన వినిపించటం మొదలుపెట్టింది.

అయినా సరే లెక్కచెయ్యటం లేదు ఆడ ఏనుగు. దాని దంతాలకున్న కత్తుల్ని లెక్కచెయ్యకుండా తలతో దాన్ని మోదటం మొదలుపెట్టింది. అదే విధంగా పక్క భాగంలో నుంచి తను దాడి చేయటం ఆరంభించింది గున్న.

పట్టపుటేనుగు తొండం విసిరితే అది గాలిలోకి ఎగిరి అల్లంత దూరంలో పడిపోతుందని ఆ దృశ్యాన్ని చూస్తున్న వారందరికీ అనిపించింది.

పొరపాటున కూడా జరగలేదు అటువంటి పని. గున్ననే కాదు తననూ తీవ్రంగా గాయపరచటానికి చూస్తున్న ఆడ ఏనుగును కూడా ఎదిరించలేదు

పట్టపు టేనుగు. తన శౌర్యం సాహసం అన్నీ అణగారిపోయినట్లు అడుగు అడుగు చొప్పున వెనక్కి జరిగి మిగిలిన ఏనుగుల మధ్యలోకి వెళ్ళిపోయింది.

"దారి వదలండి. ద్వారాల్ని బార్లా తెరిపించండి" అని సైనికుల్ని హెచ్చరిస్తూ, మగ ఏనుగును సూటిగా, వేగంగా కోట తలుపుల దగ్గరికి తీసుకుపోయాడు శివుడు.

అది తలుపుల్ని దాటి లోపలికి పోయిన వెంటనే తను క్రిందికి దూకి వెనుక వున్న ఆడ ఏనుగును, గున్నని బిగ్గరిగా కేకవేసి పిలిచాడు.

గజ సమూహంలోకి వెళ్ళిన పట్టపు టేనుగును ఇంకా తరుముతున్న తల్లీ బిడ్డ త్వర త్వరగా వచ్చేశాయి అతని దగ్గరికి.

"మూసేయండి... ద్వారాల్ని మూసేయండి" అరిచాడు శివుడు.

"ఆడ ఏనుగు వెనుతిరిగిన వెంటనే మగ ఏనుగు కోసం బయలుదేరిన పట్టపు టేనుగు తలుపుల దగ్గరికి రాకముందే కిరకిర శబ్దాలు చేస్తూ మూసుకున్నాయి కోట తలుపులు.

❖ ❖ ❖

"నేను నమ్మను... ఇది నిజం కాదు. మన పట్టపు టేనుగు యుద్ధం చేయకుండా వెనుతిరగటం అసంభవం... ప్రాణం పోయినా కూడా అది వెనుకంజ వేయదు" తల అడ్డం తిప్పుతూ అన్నాడు సభా భవనంలో వున్న సాగరులవారు.

"మీరు నమ్మక తప్పదు ప్రభూ... శివుడు తన ఏనుగుల్ని కోటలోకి తీసుకువచ్చాడు. ప్రస్తుతం వాడు వాటిని దేవిగారి మందిరం దగ్గర పున్నాగ చెట్టు క్రింద నిలబెట్టి వుంచాడు" నెమ్మదిగా చెప్పాడు మహేశ్వరుడు.

"ఎలా తీసుకువచ్చాడు? రహస్య మార్గం గుండా తీసుకువచ్చాడా? ఆ మార్గంలో ఏనుగులు ఎలా ప్రవేశించగలిగాయి?" సూటిగా అడిగాడు సాగరుల వారు.

మాటలతో సమాధానం చెప్పలేదు మహేశ్వరుడు. తలతిప్పి సభా భవనం ద్వారం వైపు చూసి చేయి వూపాడు.

వెంటనే పరుగులాంటి నడకతో లోపలికి వచ్చాడు ఒక సైనికుడు. "జరిగింది ఏమిటో ప్రభువుల వారికి చెప్పు" అన్నాడు మహేశ్వరుడు.

మొట్టమొదట వాసుదేవుల వారితో కలిసి వున్నప్పుడు పట్టపుటేనుగు శివుడి ఏనుగుల మీదికి ఎగబడినప్పుడు అతను వాటిని అవతలికి తీసుకు పోయిన విషయంతో మొదలుపెట్టి, రెండవసారి అతను వెనక్కి వచ్చినప్పుడు జరిగింది ఏమిటో సవివరంగా చెప్పాడు ఆ సైనికుడు.

ఆశ్చర్యంతో బ్రమాన్పడిపోయాడు సాగరులవారు. "నేను స్వయంగా శిక్షణ ఇచ్చాను. ఎదుట ఎంత బలమైన శత్రువు వున్నా వెనుకంజ వేయకుండా ఎదిరించటం నేర్పాను. ఏమైపోయింది నా శిక్షణ?" తనలో తను అనుకుంటున్నట్లు అస్పష్టంగా అన్నాడు.

"ముందు వచ్చిన చెవుల కంటే వెనక వచ్చిన కొమ్ములకు వాడి ఎక్కువగా వుంటుందని ఒక సామెత. శివుడు మీ కంటే అధికమైన శిక్షణ ఇచ్చి వుంటాడు" తన పెదవుల మీదికి వచ్చిన నవ్వును అతి బలవంతంగా దాచిపెట్టుకుంటూ అన్నాడు మహేశ్వరుడు.

"ఎలా? ఎలా సాధ్యం? ఎలా??" తల విదిలిస్తూ ఆతృతగా అడిగాడు సాగరులవారు.

"ప్రభూ... ఇది చాలా చిన్న విషయం... శివుడు మనవాడు... పట్టపు టేనుగు పనిపట్టిన జీవులు మన పక్షానే వున్నాయి. శత్రుపక్షంలో లేవు.. మీరు ఎందుకు ఆత్రుత పడుతున్నారో నాకు బోధపడటం లేదు" సూటిగా అన్నాడు మహేశ్వరుడు.

"అదికాదు మహేశ్వరా... అసలు ఇది ఇలా ఎలా సాధ్యపడింది? ఇవాళ మనవాడే సాధించగలిగాడని సంతోషిస్తే, రేపు శత్రువులు ఎవరైనా ఇదేవిధంగా చేసి మనల్ని ఓడించవచ్చు కదా..." తనను ఆత్రుతకు గురిచేస్తున్న అంశాన్ని బట్టబయలు చేశాడు సాగరులవారు.

"మీ సందేహానికి సమాధానం మనం శివుడినే అడగాలి... పదండి, వాడిని వాడి ఏనుగుల దగ్గర వుండగానే అడిగి చూద్దాము" అన్నాడు మహేశ్వరుడు.

మారు మాట్లాడకుండా సింహాసనం దిగి, అంతఃపుర మందిరాల దగ్గరికి బయలుదేరాడు సాగరులవారు.

❖ ❖ ❖

వంటశాల నుంచి పెద్ద పెద్ద తట్టలతో తీపి పదార్థాలను తెప్పించింది చారులతాదేవి.

"తినబెట్టరా శివుడు... నువ్వు చెపితే గాని అవి వాటిని ముట్టుకోవని నాకు తెలుసు" అని చెప్పింది అతనితో.

తీపి వాసన సోకిన దగ్గిర్నించీ శివమెత్తిపోతున్నది గున్న. తెగించి ముందుకు పోతే తల్లి తొండంతో మొట్టుతుందన్న భయంతో ఆగిపోతోంది. శివుడు తల వూపగానే వేగంగా వచ్చి ఒక తట్టను తల్లక్రిందులు చేసి ఆబగా ఆరగించటం మొదలుపెట్టింది.

"ఒక చిన్న ప్రశ్న అడుగుతాను, దాచుకోకుండా సమాధానం చెపుతావా?" వున్నట్లుండి అడిగింది చారులతాదేవి ప్రక్కనే నిలబడి వున్న జ్వాల.

తీపి పదార్థాలను స్వయంగా పెద్దవాటికి తినిపిస్తూ తలవూపాడు శివుడు.

"పట్టపు టేనుగు మహాభయంకరమైనటువంటిదని అందరూ అంటున్నారు... దాన్ని వెనక్కి నెట్టటం ఎలా సాధ్యపడింది" అడిగింది జ్వాల.

నవ్వాడు శివుడు.

"నాకు కావల్సింది సమాధానం. నవ్వు కాదు" చిరుకోపంతో అన్నది ఆమె.

"నిజమేరా శివుడూ... ఎలా గెలిచావురా? ఏ ఉపాయంతో గెలిచావు?" కుతూహలంగా అడిగింది తనుకూడా చారులతాదేవి.

"అమ్మా... ఇప్పుడు మనం యుద్ధంలో లేము. యుద్ధ సమయంలో వుండే వాతావరణం కూడా లేదు..." అన్నాడు శివుడు.

"నేను యుద్ధాల గురించి మాట్లాడటం లేదు... నువ్వు పట్టపు టేనుగును..." తనుకూడా చిరుకోపంతో అంటూ వుండగా ఆమెకు అగుపించాడు మహేశ్వరుడితో కలిసి వస్తున్న సాగరుల వారు.

తమ రాకను గురించి శివుడికి చెప్పవద్దన్నట్టు సైగ చేసి, ఒక ఫలవృక్షం చాటున నిలుచున్నాడాయన.

"చెప్పరా... నీకు ఎలా సాధ్యపడిందో చెప్పు" అంటూ శివుడికేసి తిరుగుతూ రెట్టించింది చారులతాదేవి.

"మగ ఏనుగు ఎంత బలం కలది అయినా, ఎంత ఆవేశంలో వున్నా ఆడ ఏనుగు అడ్డం వస్తే తన కోపాన్ని అదుముకుంటుందని నాకు అనిపించింది. అది నిజమే అయింది" అన్నాడు శివుడు.

"ఇది యుద్ధ వ్యూహానికి సంబంధించిన విషయం. ఎవరైనా చెపితే తప్ప తెలియని ఉపాయం. నీకు ఎవరు చెప్పారు?" వెంటనే అడిగింది జ్వాల.

కనుచివరల నుంచి, సాగరుల వారు నిలుచుని వున్న ఫలవృక్షం కేసి చూశాడు శివుడు. ఆయన అక్కడికి వచ్చినట్లు అతనికి తెలిసిపోయిందని గ్రహించి చిన్నగా నవ్వింది చారులతాదేవి.

"ఎవరైనా వింటారన్న భయం నీకు వద్దు. సమాధానం చెప్పు" అంటూ ప్రోత్సహించింది.

"గజశాలలో పనిచేయమని నన్ను పంపించినప్పుడు శిక్షణ కోసం సిద్ధపరచబడ్డవన్నీ మగ ఏనుగులే. యుద్ధంలో ఆడ ఏనుగులుంటే అవి వెనుకంజ వేస్తాయని ఆడవాటినన్నిటినీ దూరంగా వుంచారట ప్రభువులు. గున్న ఏనుగుల్ని చూసినా కూడా పెద్దవి తమ కోపాన్ని అణుచుకుంటాయని నేను స్వయంగా చూశాను"

"బాగుందిరా శివుడు... తనకు తెలియకుండానే ప్రభువులు నీకు గజ యుద్ధంలో శిక్షణ ఇచ్చిన విధానం చాలా బాగుంది" ఆప్యాయంగా అతని తల నిమురుతూ అన్నది చారులతాదేవి.

తన చెవుల్ని తనే నమ్మలేనట్లు చూస్తున్న సాగరుల వారి వంక నొసలు ముడిచి కొంచెం కరుకుగానే చూశాడు మహేశ్వరుడు.

"మీకు మీరుగా వాడికి అన్ని విషయాలు విడమరిచి చెప్పి, ఇప్పుడు ఏమీ తెలియనట్లు ఆశ్చర్యపడటం ఏమీ బాగాలేదు ప్రభూ..." అని ఎత్తి పొడిచాడు.

"నేను వాడికి ఏమీ చెప్పలేదు... అయినా సరే గజయుద్ధంలోని ఆయువు పట్టును అతి తేలికగా పట్టేశాడు.. వాడు నిజంగానే అసాధ్యుడు" అస్పష్టంగా అన్నాడు సాగరులవారు.

"శివుడు చెప్పిన గుట్ట దగ్గరికి మన సేనాపతి వెళ్ళాడు. ఈపాటికి తిరిగి వస్తూ వుంటాడు. మనం సభామందిరం దగ్గరికి వెళ్ళటం బాగుంటుంది" అన్నాడు మహేశ్వరుడు.

అతని మాటలు ముగియటం పదిమంది సైనికులు వెంట వస్తుండగా సేనాపతి ఆ ప్రదేశంలోకి రావటం ఒకేసారి జరిగింది.

"ప్రభూ... మూడువేలమంది సైనికులకు సరిపడే యుద్ధ పరికరాలు లభ్యం అయ్యాయి. అవి గనుక ఉపయోగంలోకివస్తే మనం చాలా పెద్ద ప్రమాదంలో చిక్కుపడేవాళ్లం" వస్తూనే సాగరులవారికి తెలియచేశాడు.

ఏనుగుల దగ్గరే వున్న శివుడి వంక ఇంకొకసారి చూసి సభా భవనం దగ్గరికి బయలుదేరారు సాగరులవారు.

❖ ❖ ❖

దుమ్ము తెరలు రేపుతూ ప్రయాణం చేస్తోంది శిఖావంతుడి సైన్యం. బయలుదేరిన మొదటిరోజున కనకయ్య శ్రేష్ఠిని ఆశ్చర్యానికి గురిచేసింది ఒక విచిత్రమైన విషయం.

అందరికంటె వెనకగా వస్తున్న శకటాల నిండుగా వున్నాయి సైన్యానికి అవసరమైన ఆహార పదార్థాలు. యుద్ధం చేయటానికి అవసరమైన ఆయుధాలు మాత్రం చాలా తక్కువగా కనిపిస్తున్నాయి.

"వాళ్ళల్లో కొంతమంది ముందుగానే అక్కడికి వెళ్ళి వుంటారు. అవసరమైన వన్నీ వారి దగ్గర వుండి వుంటాయి..." శ్రేష్ఠి ఆశ్చర్యాన్ని గమనించి తన అభిప్రాయాన్ని చెప్పాడు అతని అంతరంగికుడు.

ఆయుధాల బరువు చాలా తక్కువగా వుండటం వల్ల చాలా వేగంగా సాగింది ప్రయాణం. మూడు రోజుల ప్రయాణాన్ని రెండవ రోజునే ముగించి నల్లరాతి గుట్టల్ని చేరుకున్నది సైన్యం. అక్కడ సిద్ధంగా వున్నవారితో కలిసి సంపంగి నగరం వైపు ప్రయాణం అయ్యింది.

ఆ రోజు చీకటి పడిన అర్థఘడియ తర్వాత ఆపబడింది సైన్యం. చెట్ల క్రింద అడ్డుగా వున్న పొదల్ని నరికి, విశ్రాంతి తీసుకోవటానికి ఏర్పాట్లు చేసుకోవటంలో నిమగ్నమయ్యారు అందరూ.

తామున్న శకటంలో నుంచి క్రిందికి దిగి నిలబడిన శ్రేష్ఠికి, అతని అనుచరుడికి రెండు కత్తుల్ని అందించాడు ఒక దళపతి.

"విశ్రాంతి తీసుకోవటానికి సరైన ప్రదేశాన్ని మీకు మీరుగా సిద్ధం చేసుకోవాలి. మీకు ఎవరూ సేవలు చెయ్యబోవటం లేదు" అని చెప్పాడు.

ఉబికిరాబోయిన కోపాన్ని అతి బలవంతంగా అదుముకున్నాడు కనకయ్య శ్రేష్ఠి. దళపతి అందించిన కత్తిని తీసుకుని ఒక పెద్ద వృక్షం దగ్గరికి పోయాడు.

"ఇక్కడ పొదలు చాలా దట్టంగా వున్నాయి. వాటిని తొలగించాలంటే ఈ రాత్రంతా నరుకుతూ వుండాల్సిందే... ఇంకో ప్రదేశాన్ని వెతుక్కుందాం" అంటూ ఆ వృక్షాన్ని వదిలి, మరో పక్కకు పోబోయాడు అతని అనుచరుడు.

చటుక్కున చేతిని జాచి అతన్ని ఆపాడు కనకయ్య శ్రేష్ఠి.

"ఏమిటి ప్రభూ? ఏమయింది??" ఆశ్చర్యంగా అడగబోయి, శ్రేష్ఠి కనుసైగ చేయడంతో ఆగిపోయాడు ఆ అనుచరుడు.

"ఎవరి గోలలో వారున్నారు. మన గురించి ఎవరూ గట్టిగా పట్టించు కోవటం లేదు. మన దారి ఏదో మనం చూసుకోవటానికి ఇదే మంచి సమయం" అంటూ అతని చేతిని పట్టుకుని చెట్టుచాటుకు లాగాడు కనకయ్య శ్రేష్ఠి.

అతని మాటలే యదార్థమయ్యాయి. అర్థ ఘడియ తర్వాత గాని అతన్ని గురించిన ఆలోచన రాలేదు ఎవరికీ.

"అడవి జంతువులు ఏవైనా మీదపడి పొదల్లోకి ఈడ్చుకుపోయి వుంటాయి..." కొద్దిసేపు చుట్టుపట్ల వున్న పొదలన్నిటిని గాలించిన తర్వాత అన్నాడు ఒక దళపతి.

"సంపంగి నగరానికి చేరువగా వెళ్ళగానే శ్రేష్ఠిని ముందుగా నగరంలోకి పంపించే ఏర్పాటు చేయమని ప్రభువులు ఆజ్ఞ ఇచ్చారు. ఇప్పుడు కనిపించటం లేదంటే ఎంత కోపగించుకుంటారో ఊహించటానికి వీలులేకుండా వున్నది" అన్నాడు మరో దళపతి.

"యుద్ధం అంటూ మొదలు అయిన తర్వాత ఎవరెవరు ఏమైపోతారో ఎక్కడ వుంటారో ఎవరికీ తెలియదు. ప్రభువులకు అసలు శ్రేష్ఠిని గురించిన జ్ఞాపకమే వుండకపోవచ్చు... అనవసరమైన ఆలోచనలు మాని ఎవరి పనులు వారు చూసుకోండి" అన్నాడు మరో దళపతి.

ఆ సైన్యం విడిది చేసిన ప్రదేశానికి వంద ధనువులు దూరంలో ఒక పెద్ద వృక్షం మీద, దట్టమైన కొమ్మల మధ్యన కూర్చుని వున్నాడు కనకయ్య శ్రేష్ఠి. తనకోసం మొదలైన వెతుకులాట ఆగిపోవటాన్ని చూసి తేలికగా నిట్టూర్చాడు.

"వెతుకులాట ఆగిపోయింది దేవరా... చెట్టు దిగి మన దారిన మనం వెళ్లిపోవచ్చు" శిఖావంతుడి దళపతులు తమలో తాము మాట్లాడుకున్న మాటల్ని విని, సంతోషంగా అన్నాడు కనకయ్య శ్రేష్ఠి ఆంతరంగికుడు.

అలికిడి కాకుండా చెట్టుకొమ్మల మధ్యలో నుంచి క్రిందికి జారాడు కనకయ్య శ్రేష్ఠి. భుజాల మీదినించి క్రింది జారిపోబోయిన ఉత్తరీయాన్ని సవరించుకుంటూ వేగంగా నడవటం ప్రారంభించాడు.

అర్ధరాత్రి కావస్తున్న సమయంలో వారికి కనిపించింది కొండరాళ్ళతో నిర్మించబడిన మండపం ఒకటి.

జ్వలిత సామ్రాట్టు మహాబలుడు నిర్మింప చేసినటువంటిది అది. సంపంగి నగరంనుంచి శ్రావస్తి నగరానికి వెళ్లేదారిలో వుంటుంది అది. అలసిపోయిన ప్రయాణీకులు విశ్రాంతి తీసుకోవటానికి, చీకటి సమయాల్లో అటుగా రావటం జరిగితే విశ్రాంతి తీసుకోవటానికి ఉద్దేశించబడింది.

"శిఖావంతుడి సైన్యం ఇక్కడికి రావటానికి ఇంకా చాలా వ్యవధి వున్నది. ఈ లోపల మనం కొద్దిసేపు విశ్రమించవచ్చు" మండపంలో కూర్చుని ఒక స్తంభానికి చేరగిలబడుతూ అన్నాడు శ్రేష్ఠి.

"దాహంగా వున్నది దేవరా... గొంతు ఎండుకుపోతోంది" ఎండిపోయిన పెదవుల్ని నాలుకతో తడి చేసుకుంటూ దీనంగా అన్నాడు అతని ఆంత రంగికుడు.

శ్రేష్ఠిని కూడా బాధిస్తోంది విపరీతమైన దాహం. "విశ్రాంతి తీసుకోవటానికి ఒక్క మండపాన్ని మాత్రమే నిర్మించి చేతులు దులుపుకోరు ఎవరూ... నీటివసతి కూడా ఏర్పాటు చేసే వుంటారు. ఒకసారి మండపం వెనక్కివెళ్ళి చూడు" అన్నాడు తన బలహీనత బయటపడకుండా.

మండపం వెనక్కి పోయాడు ఆంతరంగికుడు. పోయిన వెంటనే కనిపించింది అతనికి చిన్న నీటి వాగు. ఎక్కడో ఏవో కొండగుట్టల్లో నుంచి వస్తోంది కాబోలు మంచుకంటే చల్లగా వున్నాయి నీళ్ళు.

పట్టరాని సంతోషంతో ఆ నీటిలోకి దిగి దోసిళ్ళతో ఎత్తి నెత్తిమీద పోసుకున్నాడు అతను. ఆబగా గొంతు తడుపుకుని, అవతలి ఒడ్డుకేసి చూశాడు.

అంత చీకటిలోను అతి స్పష్టంగా కనిపించింది అతనికి ఆ పొద. మధురమైన పళ్ళను అందించే రేగుపొద మాదిరి కనిపిస్తోంది. రేగుపళ్ళ మాదిరిగానే వున్నాయి దాని మండలకు గుత్తులు గుత్తులుగా వ్రేలాడుతున్నపళ్ళు.

అడవిని గురించి, అడవిలో కనిపించే విచిత్రమైన ప్రమాదాల గురించి తెలిసినవాడై వున్నట్లయితే వెంటనే తన దృష్టిని ఇవతలకు మరలించుకుని, వచ్చిన దారినే వెనక్కి వెళ్ళిపోయి వుండేవాడతను.

ఎవరెవరో చెప్పిన ఏవేమో మాటలు వినటం తప్ప స్వయంగా ఎప్పుడూ అడవిలోకి వచ్చి వుండలేదతను.

శిఖావంతుడి సైన్యం నుంచి విడివడిన తర్వాత ఎక్కడా ఆగకుండా ప్రయాణం చేయటం వల్ల, ఒక్క దాహమేకాదు... విపరీతమైన ఆకలి కూడా వేధిస్తోంది అతన్ని.

నోరు ఊరించే సువాసనలు వెదజల్లుతున్న ఆ పళ్ళగుత్తుల్ని చూడగానే మరింత అధికమైపోయిందా ఆకలి.

"కనిపించిందా కొండవాగు? తీరిందా నీ దాహం??" మండప స్తంభానికి ఆనుకుని వున్న శ్రేష్ఠి కొంచెం బిగ్గరిగానే పిలిచాడు అతన్ని.

"కనిపించింది దేవరా... నీళ్ళే కాదు... కడుపు నింపుకునేందుకు కొన్ని మధుర ఫలాలు కూడా అగుపించాయి" తానుకూడా అరిచాడు ఆంతరంగికుడు.

అదిరిపడినట్లు గబుక్కున మండపంలోనుంచి క్రిందికి దిగాడు కనకయ్య శ్రేష్ఠి.

"చీకటి సమయంలో చెట్లు పుట్టల జోలికి వెళ్ళటం చాలా తప్పు. వెలుగు వచ్చిన తర్వాత చూసుకుందాం వెనక్కి వచ్చేయ్" అని ఆజ్ఞ చేస్తూ, పెద్ద పెద్ద అడుగులతో నీటి దగ్గరికి వచ్చాడు.

అప్పటికే కొండవాగు అవతలి ఒడ్డు మీదికి వెళ్ళిపోయాడు అతని ఆంతరంగికుడు. దగ్గరికి పోయిన కొద్దీ మరింతగా సోకటం మొదలుపెట్టింది అద్భుతమైన సువాసన.

"రేగిపళ్ళ మాదిరిగా వున్నాయి దేవరా... గంగరేగి పళ్ళకంటే చాలా పెద్దగా వున్నాయి. వాటి వాసనతో నా మనసు వుక్కిరిబిక్కిరి అయిపోతోంది" అంటూ చేతులు చాచి ఒక మండకు వ్రేలాడుతున్న ఫలాలను త్రుంచాడు.

"వద్దు... వద్దు... వెనక్కి వచ్చేయ్..." మరింత వేగంగా నడుస్తూ వాగును దాటి అతన్ని సమీపించాడు శ్రేష్ఠి.

అప్పటికే చాలా ఆలస్యం అయిపోయింది. ఏ ఫలాలను త్రుంచాడో ఆ పళ్ళ తొడిమలలో నుంచి బుస్సుమని శబ్దంచేస్తూ అతని ఆంతరంగికుడి దుస్తుల మీదికి విరచిమ్మబడింది నూనెవంటి ద్రవం.

బంగారాన్ని కరిగించేటందుకు ఉపయోగించే ద్రావకం మీద పడినట్లు ఒక్కసారిగా భగ్గుమన్నాయి దుస్తులు.

భయంతో బెంబేలెత్తిపోతూ తను త్రుంచిన ఫలాలను క్రిందికి వదిలేశాడతను. చేతులతో దుస్తుల మీది మంటల్ని ఆర్పుకుంటూ, వెనక్కి తిరిగి నీటివద్దకు రాబోయాడు.

మంటలయితే ఆరిపోయాయి గాని, అతని అడుగులు మాత్రం ముందుకు పడలేదు. ఎందుకంటే అతను వెనక్కి తిరుగుతున్న సమయంలోనే తమకు ప్రాణం వున్నట్లు చివ్వున ముందుకు వంగాయి రెండు ముళ్ళమండలు. అతని మెడను గట్టిగా చుట్టి పట్టుకుంది వాటిలో ఒకటి. నడుమును కౌగలించుకున్నది రెండవది. రెండూ కలిసి నెమ్మది నెమ్మదిగా పొద మధ్యలోకి లాగటం మొదలుపెట్టాయి.

విపరీతమైన భయంతో వెర్రిగా కేకలు మొదలుపెట్టాడు అతను. "రక్షించండి... శ్రేష్ఠిగారు! నన్ను కాపాడండి" అని ఆక్రోశించటం ప్రారంభించాడు.

శిఖావంతుడి దళపతులు ఇచ్చిన ఆయుధాల్లో ఒకటి శ్రేష్టి చేతుల్లోనే వున్నది. వెనక్కి పరిగెత్తాలన్న కోరికను బలవంతంగా అదుముకుంటూ దాన్ని పైకెత్తి తన ఆంతరంగికుడిని పట్టుకున్న మండల్లో ఒకదానిమీద బలంగా కొట్టాడు.

మధ్యకు తెగి, నడుము తెగిన పాములా మెలికలు తిరగటం మొదలు పెట్టిందా మండ. రెండో మండకేసి అతను కత్తిని గురి పెట్టకముందే సుడిగాలిలో చిక్కుపడినట్లు తీవ్రంగా చలించింది ఆ పొద. దాని కొమ్మలు రెమ్మలు అన్నీ ఒకేసారి ముందుకు వాలి, శ్రేష్ఠిగారిని కూడా బిగించి పట్టుకున్నాయి.

బొటన వేలిలో సగం పొడవున్నట్లు కనిపించే పెద్ద పెద్ద ముళ్ళు వున్నాయి ఆ మండల మీద. అవి తన మెడను, ముంజేతులను అదిమిపట్టుకుని, తన శరీరంలోని రక్తాన్ని జుర్రుకుంటున్న అనుభూతి కలిగింది అతనికి.

తనకు తెలియకుండానే గొంతెత్తి తన ఆంతరంగికుడు అరిచినట్లే అరిచాడు "రక్షించండి...కాపాడండి... ఈ రాక్షసి పొద మా ప్రాణాలు తీసేస్తోంది. రక్షించండి" అంటూ.

అర్థరాత్రి సమయం. నరమానవుడు ఎవరూ కనిపించని నిర్జనారణ్య ప్రదేశం అది. ఎవరు వస్తారు? ఎలా రక్షిస్తారు?

❖ ❖ ❖

పెదవులు బిగపట్టి, శరీరంలో మిగిలివున్న ఓపికనంతా పాదాల్లోకి తెచ్చుకుంటూ నడిచాడు శుశ్రుతుడు. ఆహారం తీసుకోకుండా, ఒక్క చుక్క నీటిని కూడా కోరుకోకుండా ఏకబిగిన రెండు మూడు రోజులపాటు ప్రయాణించగల నేర్పు అతనికి వుండేది- సాగరుల వారి చెరసాలలో బంధింప బడక ముందు.

ఇప్పుడు లోపించిందా నేర్పు. కారాగారంలో రక్షకులు కొట్టిన దెబ్బలకు సగం హరించుకుపోయింది. అక్కడ బందీలకు వారందించే ఆహారం ఒంటబట్టక మిగిలిన సగం మటుమాయం అయిపోయింది.

సంపంగి నగరం నుంచి శ్రావస్తి నగరానికి వెళ్లే మార్గాన్ని సమీపిస్తున్న సమయంలో తనకు తెలియకుండానే ముందుకు తూలి క్రిందకు పడిపోబోయాడు.

చటుక్కున చేతులు జాచి అతన్ని పట్టుకున్నాడు వెనుకే వస్తున్న ఆగంతకుల్లో ఒకడు.

"మహాబలి చక్రవర్తి ఇటుగా ప్రయాణం చేసే పాంథుల కోసం నిర్మింప చేసిన మండపం ఒకటి దగ్గర్లోనే కనిపిస్తుంది. మండపం వెనుక చల్లని నీటిని అందించే కొండవాగు కూడా వుంటుంది. కొద్దిసేపు ఓపిక పట్టండి... మరో పదినిమిషాల్లో అక్కడికి చేరుకుంటాం" అతని భుజం తడుతూ సానుభూతి నిండిన కంఠంతో చెప్పాడు.

సాటిలేని మేటి గూఢచారిగా పేరుతెచ్చుకున్న తను వారి కళ్ళముందు కష్టాలను తట్టుకోలేని బలహీనుడిగా కనిపించటం– విపరీతమైన సిగ్గుతో నల్లగా కమిలిపోయింది శుశ్రుతుడి వదనం.

"చీకటి సమయం కదా... పాదానికి ఏదో గులకరాయి అడ్డం పడటం వల్ల ఒళ్లు తూలింది. అంతే" తన బలహీనతను కప్పిపెట్టుకోవటానికి బింకాన్ని నటిస్తూ అన్నాడు.

అనటం అయితే అన్నాడుగాని, మరో పది నిమిషాలపాటు నడవటం అసాధ్యమేమో అని అతనికి అనిపించిన మాట వాస్తవం.

"శుశ్రుతుల వారు అలసిపోయినా పోకపోయినా నాకు మాత్రం ఆయాసం అధికం అయింది. నేను నడవలేను" వున్నట్లుండి అన్నాడు అందరికంటె ముందు నడుస్తున్న ఆగంతకుడు. అనటమే కాదు, నడక ఆపి నిలబడిన ప్రదేశంలోనే నేలమీద చతికిలపడ్డాడు.

అతన్ని అదిలించి పైకి లేపలేదు ఎవరూ... తాముకూడా నెమ్మదిగా నేలమీద కూర్చున్నారు.

అది కేవలం తన బలహీనతను వారు గమనించటం వల్లనే అలా ఆగిపోవటం జరిగిందని వెంటనే గ్రహించాడు శుశ్రుతుడు. మాటల్లో చెప్పలేని భావాలు అతని మనసునిండా అలుముకున్నాయి.

"మీరు ఎందుకు ఆగిపోయారో నాకు అవగతమయింది. మీకు నేను పూర్తిగా రుణపడిపోయి వున్నాను" తన భావాలను దాచుకోకుండా బయట పెట్టేశాడు వెంటనే.

"ఒకేచోట బంధింపబడ్డాము. ఒకే మాదిరి హింసలను అనుభవించి, కలిసికట్టుగా బయటపడ్డాము. ఒకరి బాధలను మరొకరు పంచుకోవడం మా పద్ధతి" నెమ్మదిగా అన్నాడు ఆగంతకుల నాయకుడు. తనకు సమీపంలో కూర్చున్న సహచరుడి వైపు తిరిగి "నువ్వు మండపం దగ్గర వాగు దగ్గరికి పోయి, ఏదో ఒక విధంగా కాసిని నీటిని ఇక్కడికి తీసుకురా" అని చెప్పాడు.

ఆ నీరు తన కోసమేనని అతను ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరం లేకుండానే అర్థం చేసుకున్నాడు శుశ్రుతుడు.

"ఏ విధంగా మీ రుణం తీర్చుకోగలనో నాకు తెలియటం లేదు" అని అన్నాడు అతనితో.

ఆ మాటలకు ఆగంతకుల నాయకుడు సమాధానం ఏదో ఇవ్వబోతూ చటుక్కున ఆగిపోయాడు. నీటికోసం వాగు దగ్గరికి పోతున్న అతని సహచరుడు వేగంగా వెనక్కి రావటమే అందుకు కారణం.

"ఏమయిందిరా? ఎందుకు వచ్చావ్ వెనక్కి?" కోపంగా అతన్ని అడిగాడు నాయకుడు.

"చెవులు రిక్కించి జాగ్రత్తగా ఆలకించండి... ఎవరో గగ్గోలుగా అరుస్తున్నారు.. వినండి" గబగబా చెప్పాడు ఆ వ్యక్తి.

శుశ్రుతుడితో సహా ఆగంతకులు అందరూ చెవులు ఓరగా పెట్టి చీకట్లోకి చూశారు.

పదే పది క్షణికాల తరువాత అస్పష్టంగా వారందరికి వినిపించాయి ఆ అరుపులు. "రక్షించండి... కాపాడండి..." అంటూ.

అదిరిపడి లేచి నిలుచున్నారు అందరూ.

"మండపం దగ్గర్నించే వస్తోంది. అక్కడే ఎవరో ఏదో ప్రమాదానికి గురి అయినట్లున్నారు" అందరివంకా చూస్తూ అన్నాడు నాయకుడు.

"ఆలస్యం చేస్తే ఆ అరుస్తోంది ఎవరో గాని పరలోకానికి ప్రయాణం అయిపోతారు... శరీరంలోని శక్తి సన్నగిల్లిపోతున్నట్లుంది ఆ శబ్దాన్ని వింటుంటే..." అన్నాడు శుశ్రుతుడు.

నెమ్మదిగా నడవటమే చాలా కష్టమై ముందుకు తూలిపడిన అతను, వేగంగా మండపం దగ్గరికి రాలేడని ఆగంతకులకు తెలుసు.

"మీరు నెమ్మదిగా రండి... మేము ముందుకు పోతాము" అంటూ ఒక్కసారిగా పరుగు అందుకున్నారు.

మరోసారి పళ్లుబిగించి శరీరంలోని శక్తినంతా కూడగట్టుకున్నాడు శుశ్రుతుడు. అడుగు అడుగు చొప్పున ముందుకు నడవటం మొదలుపెట్టాడు.

❖ ❖ ❖

తన పని అయిపోయిందని తెలిసివచ్చింది కనకయ్య శ్రేష్ఠికి. చిన్నపిల్లలు చింపి అవతలికి విసిరేసిన గుడ్డబొమ్మ మాదిరి వ్రేలాడుతున్నాడు అతని ఆంత రంగికుడు.

మరి కొద్దిసేపట్లో తనుకూడా అదే మాదిరి నీరసించిపోతాడని అర్థమయ్యే సరికి, పొంగుకువచ్చింది దుఃఖం.

శ్రావస్తి నగరంలోనే కాదు, జ్వలిత సామ్రాజ్యం మొత్తంమీద ఒక్క మహాబలి చక్రవర్తి తప్ప మరెవ్వరూ సరి రాలేరు తన వైభవంతో. కనుసైగతో మండలాలకు మండలాలనే శాసించగల స్థోమత తనది.

అటువంటి తను ఏదో సాధించాలనే తపనతో శిఖావంతుడి దగ్గరికి పోయి, హీనాతి హీనంగా అవమానించబడ్డాడు. ఒక సామాన్యమైన నేరస్థుడి మాదిరి చెట్లు పుట్టలు పట్టుకుని పారిపోయి వచ్చాడు. ఆఖరికి ప్రాణం వుందో లేదో తెలియని ఈ ముళ్ళపొదలో చిక్కుబడి ఆర్తనాదాలు చేస్తున్నాడు.

ఏమైపోయింది తన వైభవం? ఎక్కడ వున్నది తన స్థోమత??

ఒక్క క్షణంపాటు ఎందుకో అతని కనులముందు మెదిలాయి దంతాల కోసం తాను చంపించిన ఏనుగులు.

ప్రాణాలు పోయే ఆఖరి క్షణంలో అవికూడా తన మాదిరిగానే తమ తాహతును గురించి, తమ బలాన్ని గురించి తలంచుకుని వేదన చెంది వుంటాయా??

మెడను చుట్టుకున్న ముళ్ళమండ, మెడమీదినించి జరిగి తన బుగ్గల్ని స్పృశించేసరికి ఒక్కసారిగా మాయమైపోయాయి కనకయ్య శ్రేష్టి ఆలోచనలు.

బుగ్గలమీద సూదులు గుచ్చినంత బాధ ప్రారంభం అవడంతో, ఆఖరిసారిగా శరీరంలోని శక్తినంతా కూడగట్టుకుని, గొంతు బొంగురు పోయేటట్లు అరిచాడు తనను రక్షించమని.

❖ ❖ ❖

వేగంగా పరిగెత్తుకు వస్తూ వస్తూ చటుక్కున ఆగిపోయాడు ఆగంతకుల నాయకుడు తన కాళ్ళకు బంధాలు పడినట్లు.

అది చూసి తాముకూడా ఆగిపోయారు అతని అనుచరులు. "ఏమైంది? ఎందుకు ఆగటం?" అని అడిగారు.

"అది... ఆ గొంతు ఎక్కడో విన్నట్లుగా వుంది. అది మనకి బాగా పరిచయమైన కంఠం మాదిరిగా అనిపిస్తోంది" ఇంకోసారి అది వినబడితే గుర్తుపట్టటానికి సిద్ధంగా వున్నట్లు నిలబడుతూ అన్నాడు నాయకుడు.

"మనకి పరిచయం అయిందో కాదో తరువాత ఆలోచిద్దాం. ఆలస్యం చేస్తే ఇకమీదట వినిపించదని అనిపిస్తోంది" అన్నాడు ఒక అనుచరుడు.

మళ్ళీ మొదలుపెట్టారు అందరూ పరిగెత్తటాన్ని. పదే పది క్షణికాల్లో మండపాన్ని చేరుకుని, వెనుక వున్న నీటిజాలును సమీపించారు.

అవతలి ఒడ్డున కనిపించిన దృశ్యం వారిని నిర్ఘాంతపరిచింది. పరుగును ఆపకుండా నీటిలోకి దిగి ఆ పొద దగ్గరికి పోబోయిన ఒక అనుచరుడి చేతిని గట్టిగా పట్టుకుని, బలవంతంగా వెనక్కి లాగాడు నాయకుడు.

"నాకు తెలిసి ఆ పొదలో చిక్కుబడిన పక్షులు గాని, జంతువులు గాని ప్రాణాలతో బయటపడింది లేదు. మనిషి రక్తమంటే దానికి మహా ఇష్టమని అంటారు. ముందుకు పోతే మన పని కూడా అదే మాదిరి తయారవుతుంది" అన్నాడు.

మూతలు పడిపోతున్నాయి కనకయ్య శ్రేష్ఠి కనులు. కలలో వినిపించినట్లు వెనుకనుంచి వినవచ్చిన అలికిడిని, ఆ తరువాత వినవచ్చిన మాటల్ని ఆలకించేసరికి జారిపోతున్న శక్తి కొద్దిగా తిరిగి వచ్చినట్లయింది.

"రక్షించండి... కాపాడండి" అస్పష్టంగా వెలువడ్డాయి మాటలు అతని నోటినుంచి.

అదిరిపడ్డాడు అనుచరులనందర్నీ ఆపుతున్న ఆగంతకుల నాయకుడు. "శ్రేష్ఠి కంఠం... అది మన కనకయ్య శ్రేష్టి గొంతుక..." అంటూ ఈసారి తనే ముందుగా నీటిజాలును అధిగమించి పొద దగ్గరికి చేరుకున్నాడు.

చేరుకున్న వెంటనే కనకయ్య శ్రేష్ఠిని గుర్తుపట్టాయి చీకట్లో స్పష్టంగా చూడటానికి అలవాటుపడిన అతని కనులు.

"లాగండి... శ్రేష్టిగారిని బయటికి లాగండి" అని అందరిని హెచ్చరిస్తూ శ్రేష్ఠిని గట్టిగా పట్టుకుని వున్న మండల్ని విరిచి అవతల పడేయటానికి ప్రయత్నించాడు.

తాచుపాముల మాదిరి కదిలి, అతని చేతుల్ని అతనితోపాటు కదిలిన అనుచరులు చేతుల్ని చుట్టుకున్నాయి ముళ్ళమండలు. పట్టరాని సంతోషంతో పరవశించిపోతున్నట్లు పిచ్చిపిచ్చిగా ఊగటం మొదలుపెట్టింది పొద.

అడుగులు ఎత్తి ఎత్తి వేస్తూ అతికష్టం మీద మండపం దగ్గరికి వచ్చి, నీరసంగా నీటిజాలుకేసి చూసిన శుశ్రుతుడికి కనిపించిన దృశ్యం అది.

సంపంగి నగరం చుట్టూ వున్న అడవిలో అటువంటి విచిత్రాలు అక్కడక్కడా వున్నాయని వినటమేగాని, స్వయంగా చూడలేదు శుశ్రుతుడు. ఇప్పుడు చూడగానే అతనికి తెలిసివచ్చిన విషయం ఏమిటంటే ఏ మాత్రం ఆలస్యం చేసినా ఆగంతకులందరూ హతమారిపోతారని.

శిఖావంతుడి దళపతులు తమకు ఇచ్చిన కత్తిని మండపంలోనే వదిలేశాడు కనకయ్య శ్రేష్ఠి ఆంతరంగికుడు.

ఆ కత్తి ఎవరిదో ఆ క్షణంలో శుశ్రుతుడికి తెలియదు. అయినా సరే దాన్ని దొరకబుచ్చుకుని చేతనయినంత వేగంగా ఆ పొద దగ్గరికి పోయాడతను.

"జాగ్రత్త... జాగ్రత్త... ముందుకు వచ్చారంటే మీరుకూడా బంధింప బడతారు. జాగ్రత్త సుమా" బిగ్గరిగా అరిచి హెచ్చరించాడు ఆగంతకుల నాయకుడు.

అంత నీరస పరిస్థితిలోను అటువంటి ప్రమాదం ఎదురుపడవచ్చుని ముందుగానే తెలిసిపోయింది శుశ్రుతుడికి. అందుకని ఈదురుగాలిలో చిక్కుతున్నట్లు వేగంగా కదులుతున్న మండల జోలికి పోలేదతను. క్రిందికి వంగి ఆ పొద మొదలువంక చూశాడు.

జానెడు మందాన వున్నది మొదలు. వయసులో వున్న కొండచిలువ శరీరం మాదిరి నల్లగా కనిపిస్తోంది.

తన తలను స్పృశించబోయిన మండలకు అందకుండా కత్తిని దూసి బలంగా రెండు దెబ్బలు వేశాడు అతను. సగానికి పైగా తెగిపోయింది మొదలు. మూడవ దెబ్బకు మొత్తం తెగి, ఒక పక్కకు వాలిపోయింది పొద.

ఆ పైన జాగ్రత్తలన్నిటినీ గాలికి వదిలేసి, దొరికిన మండల్ని దొరికినట్లే కత్తితో ఛిన్నాభిన్నం చేసేశాడు శుశ్రుతుడు.

మొదలు తెగి పొద ఒక పక్కకి వాలిపోయిన వెంటనే ఆగంతకుల్ని వదిలేశాయి వారిని పట్టుకున్న మండలు.

స్పృహ కోల్పోయినట్లు నిట్టనిలువుగా క్రిందికి జారిపోబోతున్న శ్రేష్ఠిని, ఆయన ఆంతరంగికుడిని చేతుల్లోకి తీసుకుని మండపం దగ్గరికి పరిగెత్తారు అందరూ.

"అడవుల్లో సంచరించడం మాకు వెన్నతో పెట్టిన విద్య. ఇటువంటి ప్రమాదాలను ముందుగానే గుర్తించి దూరంగా తప్పుకోవటం కూడా మాకు తెలుసును. కాని, మొండిగా ఎదిరించి విజయం సాధించటం మాత్రం ఇంతవరకూ జరగలేదు. మీ శరీరంలోని ఓపిక నశించిపోయినా, మా కోసం మా శ్రేష్ఠిగారి కోసం ప్రాణాలకు తెగించిన మిమ్మల్ని అభినందించకుండా వుండలేకపోతున్నాము" నీరసంగా నీటిజాలు దగ్గరే చతికిలబడిపోయిన శుశ్రుతుడి చేతులు పట్టుకుని ఆర్ద్రంగా అన్నాడు ఆగంతకుల నాయకుడు.

వారితోపాటు తాను రక్షించిన వారిలో కనకయ్య శ్రేష్ఠి వున్నాడనే మాట ఒకింత సంతోషాన్ని కలుగచేసింది శుశ్రుతుడికి.

❖ ❖ ❖

పన్నెండు రకాల శాకపాకాలు పచ్చళ్ళు చేయించి, బంగారు పళ్ళెరం నిండా వడ్డించి "తినరా శివుడూ..." అన్నది చారులతాదేవి.

"ఇంత తినలేను తల్లీ... చాలా ఎక్కువ" అస్పష్టంగా అన్నాడు అతను.

"పిచ్చి వేషాలు వేయకు... వంటశాలలోకి పిల్లిమాదిరి దొంగతనంగా దూరి ఇంతకంటే ఎక్కువే ఆరగించేవాడివని మాకు తెలుసు. త్వరగా తిను" హుంకరించకపోయినా కొంచెం అదే ధోరణిలో గట్టిగా చెప్పిందామె.

దూరంగా ఒక చందనపు పీటమీద కూర్చుని తనుకూడా భోజనం చేయటానికి ఉద్యుక్తురాలవుతోంది జ్వాల. ఆ మాటలకు ఫక్కున నవ్వింది.

చురుకుగా చూసింది ఆమెవంక చారులతాదేవి.

"ఒట్టిగా ఆరగించమంటే ఆరగించడు... పక్కన ఆ ఏనుగులు వుండాలి. ముఖ్యంగా ఆ గున్న తనుకూడా కంచంలో కలియబడితే తప్ప ముద్దతిన్నట్లుగా వుండదు" అన్నది జ్వాల.

"ఏరా శివుడూ? నిజమేనా? గున్నని తీసుకురమ్మని భటులకు చెప్పనా?" అడిగింది చారులతాదేవి.

సిగ్గుతో ఎర్రబడిపోయింది శివుడి వదనం. “అవసరం లేదు తల్లీ... నేను తినేస్తాను” అంటూ గబగబా ఆరగించటం మొదలుపెట్టాడు.

తృప్తిగా నిట్టూర్చింది చారులతాదేవి. “నువ్వు జ్వాలను వెతకటానికి వెళ్ళిన దగ్గర్నించి తనను చూసేవరకు జరిగిన సంఘటనలన్నిటినీ వినాలని వున్నది... చెపుతావా?” అని అడిగింది మృదుస్వరంతో.

“తను చెప్పడు... తన వెనుకే నీడమాదిరిగా అనుసరించిన వాసుదేవుల వారు మాకు చెప్పారు. కావాలంటే నేను చెపుతాను” శివుడు మాట్లాడకముందే తను కల్పించుకున్నది జ్వాల.

“నేను నీతో మాట్లాడటం లేదు. వాడితో మాట్లాడుతున్నాను. మాట మాటకి నువ్వు కల్పించుకోవటం ఏమీ బాగాలేదు” చురుకుగా చూస్తూ అన్నది చారులతాదేవి.

ఆ మాటలు కొంచెం విసురుగా వున్నట్లు ధ్వనించినా, కొంచెంగా కూడా చిన్నబుచ్చుకోలేదు జ్వాల.

“పరిచయమైన క్షణం నుంచీ నేను ఈ సాహసవంతుడిని పరిశీలనగా చూస్తూనే వున్నాను. తనంతటతానుగా నోరువిప్పి మాట్లాడటం చేతకాదు. మనతో సంభాషించటం కంటే, నోరు లేని ఆ ఏనుగులతోనే ఎక్కువగా సంభాషిస్తాడు” అన్నది.

“ఒక్కొక్కళ్ళది ఒక్కో పద్ధతి. అందరూ నీవంటి వాగుడుకాయలే అయివుండరు. నోరు మూసుకుని నీ పని ఏదో నువ్వు చూసుకో” అంటూ తిరిగి శివుడికేసి చూసింది చారులతాదేవి. “ఒరేయ్ శివుడూ! అసలు నీకు నీ ఏనుగులకి ఎలా పరిచయం అయిందో చెప్పు” అని అడిగింది.

సాగరులవారు శిక్షించటానికి తనను అడవిలోకి పంపించినప్పుడు ఏనుగుల్ని వేటాడే ఆగంతకులు కనిపించిన దగ్గర్నించి మొదలుపెట్టి బురద గుంటలో చిక్కుపడిన ఏనుగుల్ని మొసళ్ళు ఆరగించటానికి ప్రయత్నించడం వరకూ చెప్పాడు శివుడు.

“అసలు విషయాన్ని వదిలేశాడు. సిగ్గు కాబోలు...” అంతవరకూ మౌనంగా వున్న జ్వాల వున్నట్లుండి మాట్లాడింది.

“ఏమిటి ఆ అసలు విషయం?” అడిగింది చారులతాదేవి.

"ఆ ఏనుగుల జాడల్ని వెతుకుతూ వస్తున్న ఆగంతకుల మీదికి మిన్నాగుల్ని పంపకం చేయటం" అన్నది జ్వాల.

అధికం అయిపోయింది చారులతాదేవి కుతూహలం. "మిన్నాగుల్ని పంపకం చేయటమేమిటి?" అని అడిగింది.

చకోర వృక్షాలను ఆశ్రయించుకుని వుండే మిన్నాగుల మీదికి రాళ్లు విసిరి వాటిని క్రిందికి రప్పించడం ద్వారా ఆగంతకుల్ని శివుడు ఎలా అడ్డుకున్నాడో సవివరంగా చెప్పింది జ్వాల.

"చేతుల్లో సరయిన ఆయుధం లేకుండా ఆ దుర్మార్గుల్ని అడ్డుకోవటం నిజంగా సాహసమే... నాకు చాలా సంతోషంగా వుందిరా శివుడు... జ్వాల నిన్ను సాహసవంతుడిగా వర్ణించటం సబబే..." సాలోచనగా తలవూపుతూ అన్నది చారులతాదేవి. "మాకు ఎవరికీ తెలియని ఈ వివరాలన్నీ నీకు ఎలా తెలిశాయి?" అని జ్వాలని అడిగింది.

"ఈ గండరగండ మహావీరుడు మొట్టమొదటిసారి అడవిలోకి వెళ్ళిన క్షణం నుంచీ వాసుదేవుల వారు ఈయనగారి వెన్నంటే వున్నారు. ఎక్కడయినా తప్పటడుగు వేసి ప్రమాదంలో చిక్కుబడితే కాపాడటానికి సిద్ధంగా నిలుచుండేవారట" అన్నది జ్వాల.

"చిక్కుబడ్డాడా ఎక్కడయినా?" అడిగింది చారులతాదేవి.

"చిక్కుపడినట్లే పడి ఆఖరి క్షణంలో తప్పించుకునేవాడు. కాలు నిలకడ లేని మనిషి. ఏ క్షణంలో ఏం చేస్తాడో ఎవరూ ఊహించలేరని వాసుదేవుల వారు చెప్పారు" చెప్పింది జ్వాల.

మరింత ప్రసన్నంగా మారిపోయింది చారులతాదేవి మొఖం.

"ఒక్కడే వుంటే వాడు ఈ ఏనుగులతోను, ఎనుబోతులతోను కాలక్షేపంచేసి ఎందుకూ పనికిరాకుండా పోతాడు... వీడిని నువ్వు రాజధానికి వెళ్లేటప్పుడు నీతోపాటు పంపిస్తాను. అక్కడి విద్యాలయంలో శాస్త్రవిద్యలు నేర్పించాలి" అన్నది.

మౌనంగా వుండిపోయింది జ్వాల. వంచిన తల ఎత్తకుండా భోజనం చేయటంలో మునిగిపోయింది.

కొసరి కొసరి వడ్డిస్తున్న చారులతాదేవి, మరికొన్ని పదార్థాలను వంటశాల నుంచి తెప్పించకముందే గబగబా తినటాన్ని ముగించి పైకి లేచాడు శివుడు.

"అప్పుడే ముగించావేమిటి? ఆగు..." అని ఆమె వారిస్తున్నా వినిపించుకోకుండా ఆ మందిరంలో నుంచి వెలుపలికి వెళ్ళిపోయాడు.

"వాడిని నేను నీతోపాటు పంపిస్తానని చెపితే మౌనం వహిస్తావేమిటి? నీకు ఇష్టం లేదా?" జ్వాలను అడిగింది చారులతాదేవి.

తల ఎత్తి తెల్లటి పల్వరుస కనిపించేలా తళుక్కున నవ్వింది జ్వాల. "విద్యాలయంలో విద్య మాత్రమే నేర్పుతారు. పౌరుషం నేర్పరు... మూగజీవాలను ప్రేమించి వాటి అభిమానాన్ని సంపాదించుకోవటం నేర్పరు. ఆ రెండు విద్యల్లోను శివుడు మహా నేర్పరి. ఇంకా అతనికి ఇతర విద్యలు దేనికి?" అని అడిగింది.

ఆమె దగ్గరికి పోయి బుగ్గలు పుణికి నుదురును చుంబించింది చారులతాదేవి.

"అత్తా... నిన్ను ఒక మాట అడగాలని అనుకుంటున్నాను. ఏమీ అనుకోకుండా సమాధానం చెపుతావా?" అడిగింది జ్వాల.

"నువ్వు అడిగిన దానికి నేను వేరేగా అనుకోవటం ఏమిటి? నీకేమైనా మతిపోయిందా?" చిరుకోపంతో అన్నది చారులతాదేవి.

"మీ దగ్గర శివుడు ఒక్కడే కాదు. ఇంకా చాలామంది అనాథలు పెరిగి పెద్దవాళ్ళవుతున్నారు. వారందరి మీద మీకు అభిమానం వుండవచ్చేమో గాని శివుడిమీద వున్నంత మాత్రం ఖచ్చితంగా లేదు. ఎందుకని?" సూటిగా ప్రశ్నించింది జ్వాల.

ఎవరు ఎటువంటి ప్రశ్న వేసినా సమాధానం ఇచ్చేందుకు తడుముకునే అలవాటు చారులతాదేవికి లేదు.

"మన దగ్గర పెరిగి పెద్దవారవుతున్న బిడ్డల్లో చాలామందిని మన ప్రభువుల వారో, మంత్రి మహేశ్వరుడో గమనించి ఇక్కడికి తీసుకురావటం జరిగింది. శివుడు ఒక్కడిని మాత్రమే నేను గమనించాను. ఎందుకంటే వాడు సరాసరి నా అంతఃపుర ద్వారం దగ్గర వదిలిపెట్టబడ్డాడు గనుక..." అరమూసిన కనులతో ఎప్పుడో జరిగిపోయిన ఆ సంఘటనను గుర్తుచేసుకుంటూ చెప్పిందామె.

❖ ❖ ❖

తూర్పుదిక్కు ఇంకా పూర్తిగా తెల్లబడకముందే రాణీవారి భవన ద్వారం దగ్గర విచిత్రమైన సందడి నెలకొన్నది.

విచ్చుకత్తులు పట్టుకుని రాతి విగ్రహాల మాదిరి ద్వారం దగ్గర కాపలా నిలబడే వున్నారు ఇద్దరు భటులు. అయినా సరే వారిద్దరికీ తెలియకుండా సరిగ్గా ద్వారం ముందే వుంచబడింది ఒక పెద్ద వెదురుబుట్ట.

ప్రాతఃకాలపు చలిగాలి మూలకంగా బాధ కలిగింది కాబోలు చిట్టి చిట్టి పిడికిళ్ళను మరింత గట్టిగా బిగిస్తూ గుక్కపట్టి ఏడుస్తున్నాడు ఆ బుట్టలో పరుండబెట్టి వున్న బిడ్డడు.

పరుగు పరుగున పోయి గాఢనిద్దురలో వున్న చారులతాదేవికి ఆ దృశ్యాన్ని వివరించి చెప్పారు అంతఃపుర పరిచారికలు.

"కాపలా భటులు ఇద్దరూ వట్టి దద్దమ్మలు. తమ బాధ్యతను గాలికి వదిలేసి కునికిపాట్లు పడుతున్నారు'' అని కూడా చెప్పారు. ఆ భటులిద్దరినీ అప్పటికప్పుడే అట్నుంచి అటే చెరసాలకు పంపించేయాలన్నంత కోపంతో భవన ద్వారం దగ్గిరికి వచ్చింది చారులతాదేవి.

గుక్కపట్టి ఉక్కిరిబిక్కిరిగా రోదిస్తున్న బుట్టలోని బిడ్డ ఆమెను చూసీ చూడగానే గమ్మత్తుగా ఏడుపు ఆపేశాడు. నీళ్ళు నిండిన కళ్ళతోనే ఆమెవంక చూస్తూ చిత్రంగా నవ్వాడు.

పట్టుకుపోయాయి చారులతాదేవి గుండెలు. తనకు తెలియకుండానే చేతులు చాచి అతడిని బుట్టలో నుంచి పైకి ఎత్తింది.

నెలలు కూడా పూర్తిగా నిండని శిశువు అతను. చిన్న చిన్న చేతులతో ఆమె మెడలోని రత్న హారాన్నొకదాన్ని గట్టిగా పట్టుకుంటూ చిన్న చిన్న శబ్దాలు చేశాడు.

"అమ్మా... అమ్మా... అంటున్నాడు కాబోలు తల్లీ..." ఆ శబ్దాలకు అర్థాన్ని వెంటనే వివరించింది చారులతాదేవి పక్కనే వున్న పరిచారిక ఒకర్తె.

"ఎవరు తీసుకువచ్చారు ఇతన్ని?" బిడ్డడిని గుండెలకు హత్తుకుంటూ తలలు వంచుకు నిలబడిన భటుల్ని అడిగింది చారులతాదేవి.

"తల్లీ... మీరు మమ్మల్ని క్షమించాలి. కనురెప్ప కూడా వాల్చకుండా కాపలా కాస్తున్నాం. వేకువ ఝాము కావటం వల్ల ఒకింత మత్తు అనిపించింది.

రెండే రెండు క్షణికాల పాటు కునికిపాట్లు పడ్డాము. ఆ సమయంలోనే ఎవరో ఈ బుట్టని తెచ్చి ఇక్కడ వదిలారు" వంచిన తలలు ఎత్తకుండానే చెప్పారు వారిద్దరూ.

రాజ భవన రక్షణలో పాలుమారటం అంటే సామాన్యమైన నేరం కాదు. అప్పటికప్పుడు బహిరంగంగా ఉరి తీయించవలసినంత తప్పు.

అంతకుముందు అల్లకల్లోలంగా ఏడ్చిన బిడ్డ, తనను చూసీ చూడగానే ఏడుపు ఆపి, బల్లిపిల్లలా తన గుండెల్ని కరచి పట్టుకోవడంతో, ఎందుకో మెత్తబడిపోయింది చారులతాదేవి హృదయం.

"అలా ఎందుకు జరిగిందో ఎంత ఆలోచించినా ఇప్పటికీ నాకు అర్థం కావటంలేదు. ఆ శిశువును చూడగానే ఉప్పొంగిపోయింది మనసు. కోపం తెచ్చుకోవాలన్నా తెచ్చుకోలేకపోయాను" ఆనాడు జరిగిన ఆ సంఘటనను గుర్తుచేసుకుంటూ చెప్పింది ఆమె.

"నిన్ను అంతగా కదిలించిన శివుడికి నువ్వే నామకరణం చేశావా?" అడిగింది జ్వాల.

తల అడ్డం తిప్పింది చారులతాదేవి. "బుట్టలోనే వాడిపేరు వ్రాయబడి వుంది. ఎవరు రాశారో, అసలు ఆ బుట్టను తెచ్చి భవన ద్వారం దగ్గర ఎవరు పెట్టారో ఎంత విచారించినా మాకు తెలియలేదు. మూడు మాసాల పాటు నగరమంతా తిరిగి ఎందరెందరినో ప్రశ్నించి చూశారు ప్రభువుల వారు. ఏమీ ఉపయోగం లేకపోవటంతో ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నారు" చెప్పింది.

"ఇతర బిడ్డల్ని ఎవరో తీసుకువచ్చి శరణాలయంలో పెట్టారు. శివుడిని మాత్రం నువ్వు గమనించావు. అందువల్లనే అతనంటే ప్రత్యేకమైన అభిమానమా?" ఇంకోసారి మొట్టమొదట అడిగిన మాటనే మళ్ళీ అడిగింది జ్వాల.

"చెప్పలేను. కాని వాడిని చూస్తే చాలు నా మనసు అదోలా అయిపోతుంది. వాడు నా కన్నబిడ్డే అని అనిపిస్తుంది. కారణం ఏమిటో నాకు కూడా తెలియదు" నిజాయితీగా సమాధానం ఇచ్చింది చారులతాదేవి.

"కారణం లేకుండా ఈ ప్రపంచంలో బాంధవ్యాలు, బంధుత్వాలు, ఆపేక్షలు, అనురాగాలు ఏమీ వుండవని నాకు శాస్త్రవిద్యలు బోధించిన

ఆచార్యుల వారు చెపుతూ వుండేవారు. మనకు ఎవరి మీదనైనా ఏదో ఒక భావం ఏర్పిడిందంటే అందుకు ఎక్కడో ఏదో ఒక మూల కారణం వుండే వుంటుందని ఆయన అనేవారు" అన్నది జ్వాల.

"శివుడిమీద నాకున్న అభిమానానికి ఏదో కారణం వుండి వుంటే అది ఎటువంటిదై వుంటుంది?" చిరునవ్వుతో అడిగింది చారులతాదేవి.

"తెలుసుకుంటాను. అదేమిటో తప్పకుండా తెలుసుకుంటాను. ఎంతోమంది అనాథలు మీ దగ్గర పెరిగి పెద్దవారవుతున్నా వారందరి కంటె ఒక్క శివుడి మీదనే మీకు అమితమైన అభిమానం కలుగటానికి కారణమైన ఆ విషయాన్ని నేను తప్పకుండా తెలుసుకుంటాను" భోజనం ముగించి పైకి లేస్తూ దృఢస్వరంతో చెప్పింది జ్వాల.

"ఎలా తెలుసుకుంటావు?" అడిగింది చారులతాదేవి.

"శివుడు శిశువుగా వున్నప్పుడు అతణ్ణి తెచ్చి రాజభవనం వద్ద వదిలిన ఆనాటి బుట్టగాని, ఆ సమయంలో అతని దగ్గర వున్న వస్తు పరిచయం గాని ఏమైనా భద్రపరుచబడ్డాయా?" అడిగింది జ్వాల.

"వందసార్లు కాదు, కనీసం వెయ్యి మార్లయినా మంత్రి మహేశ్వరుడు ఆ బుట్టని సమూలంగా పరిశీలించి చూసి వుంటాడు. ఆయనకి కనిపించని విశేషం నీకు కనిపిస్తుందనే నమ్మకం నాకులేదు" అంటూ జ్వాల చేతిని పట్టుకుని ఆ భవనం వెనుక భాగంలో వున్న ఒక మందిరంలోకి తీసుకు పోయింది చారులతాదేవి.

చీకటితో నిండి వున్నది అది. చెలికత్తెలు వెలిగించిన నూనె దీపాల వెలుతురులో ఆ మందిరంలో ఒక గోడకు ఆనించి వున్న పెద్ద మందసాన్ని తెరిపించి అందులో భద్రపరచి వున్న ఆ బుట్టను బయటికి తీయించింది ఆమె.

మరికొన్ని దీపాలను వెలిగించమని ఆజ్ఞాపించి, ఆ వెలుగులో ఆ బుట్టను చాలా నిశితంగా పరిశీలించింది జ్వాల.

వెదురుబద్దలతో అల్లిన బుట్ట మాదిరిగానే వున్నది అది. కాని వెదురు బద్దలు మాత్రం కావు అవి.

సంవత్సరాల తరబడి వెలుగు చూడకపోవడం వల్ల దుమ్ము కొట్టుకుని మాసిపోయి, మాగుడు వాసనను వెదజల్లుతున్నాయి ఆ బుట్టలోని వస్త్రాలు.

"శివుడు మనకి లభించినప్పుడే ఇవి చినుగులు పడి జీర్ణావస్థలో వున్నాయి. వాడిని ఈ బుట్టలో పెట్టి తీసుకువచ్చిన వాళ్లు ధనవంతులు కాదు. పేదవారే అయివుంటారు" జ్వాలతో పాటు తాను కూడా ఆ వస్త్రాలవంక చూస్తూ చెప్పింది చారులతాదేవి.

ఆ మాటలు తనకు వినిపించనట్టు, ఆ వస్త్రాలను బుట్టలోనుంచి బయటికి తీసి గట్టిగా విదిలించి, నేలమీద వెడల్పుగా పరిచింది జ్వాల.

చారులతాదేవి చెప్పినట్లే చినుగులతో మరకలతో కడుపేదగా కనిపించాయి అవి.

"మహేశ్వరుడికి అంతుబట్టని రహస్యాలు ఏవైనా నీకు కనిపించాయా?" నవ్వుతూ అడిగింది చారులతాదేవి.

క్రింద పరిచిన వస్త్రాన్ని తిరిగి ఆ బుట్టలోకి నెడుతూ తల అడ్డం తిప్పింది జ్వాల.

"మహేశ్వరుల వారి కంటె తెలివితేటలు అధికంగా వున్నాయని నేను అనుకోవటంలేదు. ఆయనతో సరిసమానంగా ఆలోచించటం కూడా నాకు చేతకాదు. కాని, శివుడి పద్ధతుల్ని చాలా దగ్గరిగా చూసి వుండటం వల్ల నాకు కొన్ని, వాసుదేవుల వారికి మరికొన్ని అనుమానాలు ఉత్పన్నం అయ్యాయి. వాటిని దృష్టిలో పెట్టుకుని పరిశోధన చేయటమే నా అభిమతం" అంటూ మందసాన్ని కూడా మూసివేయించమని చెప్పి, ఆ మందిరంలో నుంచి వెలుపలికి వచ్చింది.

"ఇన్ని సంవత్సరాలుగా ప్రయత్నం చేస్తున్న మాకు తెలియని విషయాలు, నీకు, వాసుదేవుల వారికి తెలుస్తాయంటే నమ్మబుద్ధి కావటం లేదు. అయినా సరే నీ ప్రయత్నం సఫలం అవ్వాలని నేను కోరుకుంటున్నాను" ఆమెను దగ్గరికి తీసుకుని నుదురు చుంబిస్తూ అన్నది చారులతాదేవి.

రకరకాల ఆలోచనలతో సతమతమవుతూ తనకు కేటాయించబడిన మందిరంలోకి పోయి, మందిర మధ్యభాగంలోని తల్పం మీద మేను వాల్చింది జ్వాల.

చిరుగులు పడి, చిల్లులతో నిండి, మహా అసహ్యంగా కనిపిస్తున్నాయి శివుడు దొరికిన బుట్టలోని పాత వస్త్రాలు. వాటి పరిస్థితి మాత్రమే అసహ్యకరంగా వున్నది గాని, ఒకప్పుడు అవి మహావిలువ కలిగినట్టుగానే అనిపిస్తోంది.

కనులు మూసుకుని నిద్రపోవటానికి తీవ్రంగా ప్రయత్నించింది జ్వాల. నిద్ర రాకపోగా మరింత తీవ్రమైనాయి ఆలోచనలు. ఉన్నట్లుండి తల్పం దిగి పక్కనే వున్న జేగంటను ఠంగున మ్రోగించింది.

వెంటనే లోపలికి వచ్చింది ఆ మందిర ద్వారం దగ్గర కావలి నిలుచున్న పరిచారిక.

"వాసుదేవుల వారిని వెంటనే దర్శించుకోవాలి" చెప్పింది జ్వాల.

తల వంచి నమస్కారం చేసి వేగంగా వెలుపలికి వెళ్ళిపోయింది పరిచారిక.

❖ ❖ ❖

అడవిలో ప్రయాణం చేసేవారు విశ్రాంతి తీసుకునేందుకు మహాబలి చక్రవర్తి కట్టించిన మండపంలో కనకయ్య శ్రేష్ఠిని పరుండబెట్టి, సపరిచర్యలు చేశారు ఆగంతకులు. నీటివాగులో నుంచి నీటిని తెచ్చి ముఖంమీద జల్లి, తమ అంగవస్త్రాలతో గాలిని విసిరారు.

అర్థఘడియ తరువాత కనులు తెరిచాడు శ్రేష్ఠి.

వారు దోసిళ్లతో తెచ్చి అందించిన నీటిని తాగి నెమ్మదిగా లేచి కూర్చున్నాడు.

"మీరు మమ్మల్ని మన్నించాలి. మీరు మాకు అప్పచెప్పిన పనిలో పూర్తిగా విఫలం అయ్యాము. ఆ దుర్మార్గపు బాలుడిని మేము ఏమీ చేయలేకపోగా, చెరసాలలో బంధింపబడ్డాము..." అంటూ తాము సంపంగి నగరం దగ్గరికి వచ్చిన క్షణం నుంచీ అప్పటివరకూ జరిగినవన్నీ వివరంగా అతనికి చెప్పాడు ఆగంతకుల నాయకుడు.

"సంపంగి నగరపు అడవుల్లోని ఏనుగుల్ని మనం వధింపచూసినట్లు సాగరుల వారికి తెలిసిపోయింది. దానికి కారకులు కూడా మీరేనని మేము మంత్రి మహేశ్వరుడికి చెప్పక తప్పలేదు" అనికూడా చెప్పాడు.

"శిఖావంతుడి సైన్యం సంపంగి నగరంమీదికి దండు వెడలిన సంగతి సాగరుడికి తెలుసునా?" అంతా విని సౌమ్యంగా అడిగాడు శ్రేష్ఠి.

"గజబలమంతా నగరం వెలుపుల సర్వసన్నద్ధంగా నిలబడి వుంది. శిఖావంతుడి సైన్యం కోటని సమీపిస్తే చేజేతులారా చావును కొనితెచ్చుకోవటమే" అన్నాడు అంతవరకూ మౌనంగా వున్న శుశ్రుతుడు.

తెలివి వచ్చిన తర్వాత మొదటిసారిగా అతన్ని గమనించాడు శ్రేష్ఠి. ఒక్క క్షణికం పాటు నొసలు ముడివేసి అయోమయంగా చూశాడు. అంతలోనే అతన్ని గుర్తుపట్టినట్టు "శుశ్రుతుల వారు మీరేనా? నమస్కారం" అంటూ నమస్కరించాడు.

"నమస్కరించదగిన సంస్కారం మీకు వున్నా నమస్కారం అందుకునే అర్హత నాకులేదు. మీ అనుచరుల మాటలకు తల ఒగ్గి అనవసరమైన అహంకారానికి లొంగిపోయాను. రాజద్రోహం చేసిన వాడినైనాను" తల వంచుకుంటూ అన్నాడు శుశ్రుతుడు.

"ఎంతటి వారికైనా ఎప్పుడో ఒకప్పుడు ఒకింత ఈర్ష్య భావం కలుగకపోదు. మీ విషయంలో అదే జరిగింది. అనవసరంగా బాధపడవద్దు. మీరు చేసిన పనుల వల్ల జ్వలిత సామ్రాజ్యానికి ఎటువంటి చేటు జరగలేదు. కాబట్టి మీరు క్షమార్హులే..." సాలోచనగా అన్నాడు శ్రేష్ఠి.

"మరి మీరు?" అడిగాడు శుశ్రుతుడు.

"సంపంగి నగరం చుట్టూ వున్న అడవిలోని ఏనుగులన్నిటినీ చంపి వాటి దంతాలను సేకరించే ప్రయత్నం చేశాను. నా గురించి మాత్రమే ఆలోచించాను గాని, సామ్రాజ్య క్షేమాన్ని గురించి ఆలోచించలేదు. నేను చేసిన తప్పులు బట్టబయలు కాకుండా కప్పిపెట్టుకోవాలనే కోరికతో శిఖావంతుడిని రెచ్చగొట్టి లేనిపోని ఉపాయాలు చెప్పి దండయాత్రకు పురికొల్పేందుకు అతని దగ్గరికి పోయాను" తలవంచుకుంటూ చెప్పాడు శ్రేష్ఠి.

"ఏం జరిగింది? ఇప్పుడు ఇటుగా వస్తున్న సైన్యం మీరు ఉపాయం చెప్పటం వల్లనే వస్తున్నారా?" అని అడిగాడు శుశ్రుతుడు.

"లేదు. శిఖావంతుడు చాలా తెలివైనవాడు. సాగరుల వారి గజబలాన్ని ఎదిరించే ఉపాయాన్ని అతను ముందుగానే సిద్ధం చేసుకుని వున్నాడు. అతని

దగ్గరికి పోయి నేను అవమానపడటం తప్ప మరేమీ జరుగలేదు" బరువుగా చెప్పాడు శ్రేష్ఠి.

ఆగంతకుల నాయకుడు, శుశ్రుతుడు ఇద్దరూ ఆశ్చర్యంగా చూసేసరికి, శిఖావంతుడితో తాను జరిపిన సంభాషణంతా వివరంగా చెప్పాడు.

"అయితే ఇప్పుడు మీరు ఏం చేయదలుచుకున్నారు స్వామీ? జరుగబోయే యుద్ధంలో శిఖావంతుడు గెలిచినా, లేక సాగరుల వారే విజయులుగా నిలిచినా మీ పరిస్థితి అయోమయమే కదా!" అన్నాడు శుశ్రుతుడు.

"నన్ను మించిన తెలివి కలవాడు ఈ భూ ప్రపంచంలో ఎవరూ లేరని గర్వపడ్డాను. నాకు విజయమే తప్ప అపజయం అంటూ ఎదురుపడదని రొమ్ములు విరుచుకుని తిరిగాను. ఎందుకూ పనికిరాని ఒక ముళ్ళపొదలో చిక్కుబడి ప్రాణాలు పోగొట్టుకునే పరిస్థితి వస్తుందని ఎన్నడూ ఊహించలేదు" బరువుగా నిట్టూరుస్తూ అన్నాడు శ్రేష్ఠి.

అతిశయపు మాటలు తప్ప అటువంటి నీరస వచనాలు ఏనాడూ అతని నోటినుంచి విని వుండలేదు ఆగంతకులు. ఆశ్చర్యంగా చూశారు అతడికేసి.

"అవును. ఈ భగవంతుడి సృష్టిలో మనిషి ప్రాణాలకున్న విలువ ఏపాటిదో ఈ ముళ్లపొద నాకు తెలియచేసింది. బ్రతికివున్న నాలుగురోజులు మంచిగా బ్రతికి, అందరిచేతా మన్ననలు పొందటమే ముఖ్యం. ఎప్పుడు ఏ క్షణంలో ప్రాణాలు వదులుతామో తెలియనప్పుడు ఈ కుట్రలు కుతంత్రాలు అర్థం లేనటువంటివి" అన్నాడు శ్రేష్ఠి.

"అయితే ఇప్పుడు ఏం చేయదలచుకున్నారు?" అడిగాడు శుశ్రుతుడు.

"మహాబలుడి దగ్గరికి పోయి జరిగిందంతా చెప్పి చెంపలు వేసుకుంటాను. ఏ శిక్ష విధించినా తలవంచి అంగీకరిస్తాను. నా స్వార్థం కోసం చెడు ఆలోచనలు చేయవలసి వచ్చిందని నా అపరాధాన్ని మన్నించమని కోరతాను" అన్నాడు శ్రేష్ఠి.

"మీరు ఒంటరిగా చక్రవర్తి వద్దకు వెళ్ళవలసిన అవసరం లేదు. అహంకార మనోవికారాలకు లోబడి నేను కూడా వక్రమార్గం పట్టానని చెప్పుకోవటానికి మీతోపాటు నేనుకూడా చక్రవర్తి వద్దకు వస్తాను" వెంటనే అన్నాడు శుశ్రుతుడు.

"మరి మీ సంగతేమిటి?" ఆగంతకుల నాయకుడిని అడిగాడు శ్రేష్ఠి.

"తమరి దయాధర్మభిక్షం మీద బ్రతికేవాళ్ళం. మీరు ఏం చేయమంటే అదే చేస్తాం... మంచైనా చెడైనా..." వెంటనే అన్నాడు అతను.

"మనం రాజధానికి వెళ్ళిన తర్వాత చక్రవర్తి ఏం చెపితే అది చేద్దాం" అన్నాడు శ్రేష్ఠి.

సరిగ్గా అదే సమయంలో వున్నట్లుండి తల పక్కకు తిప్పాడు శుశ్రుతుడు. తిప్పిన వెంటనే "ప్రమాదం ముంచుకు వస్తోంది" అంటూ మండపం వెనక్కి పరిగెత్తాడు.

క్షణికం కూడా ఆలస్యం చేయకుండా, శ్రేష్ఠిని ఆయన ఆంతరంగికులని మండపంలో నుంచి క్రిందికి దింపి, అతివేగంగా అతన్ని అనుసరించారు ఆగంతకులు.

సైన్యం నడిచే దారిలో అడ్డంకులు ఏవైనా వుంటే ముందుగానే గమనించి అందరినీ హెచ్చరించటం కోసం బలిష్టమైన అశ్వాలమీద అటుగా వచ్చారు శిఖావంతుడి సైన్యంలోని అశ్వికులు ఒక నూట ఏబదిమంది.

అడవిలో అలుముకుని వున్న చీకట్ల మూలకంగా మండపం దగ్గర్నించి దూరంగా పారిపోయిన వారి నెవరినీ వారు గమనించలేదు.

పాతికమంది అశ్వికులు మండపం దగ్గరే ఆగిపోయారు. మిగిలిన వారందరూ వెనుతిరిగి తమ సైన్యం దగ్గరికి వెళ్ళిపోయారు.

❖ ❖ ❖

"వాళ్ళు అక్కడ వుండగా మనం మండపం దగ్గరికి పోలేము. రహదారిని సమీపించలేము" తూర్పుదిక్కు తెల్లబడబోతున్న సమయం దగ్గరపడినా మండపం దగ్గర అశ్వికులు కదలకుండా అలాగే నిలబడి వుండటాన్ని చూసి, నెమ్మదిగా అన్నాడు శుశ్రుతుడు.

"రహదారి మీదికి పోవాలంటే మండపం దగ్గరికి వెళ్ళవలసిన అవసరం లేదు. నీటిజాలు వెంట ఇంకా కొంతదూరం ప్రయాణం చేస్తే పొదల మధ్యలో నుంచి దారిని చేరుకోవచ్చును కదా" అన్నాడు ఒక ఆగంతకుడు.

"శ్రేష్ఠిని బంధింప చూసిన పొదల్లాంటివి ఏమైనా ఇంకా ఈ చుట్టుపట్ల వుండివుంటే లేనిపోని గోల అవుతుంది కదా" వెంటనే తన అనుమానాన్ని బయటపెట్టాడు శుశ్రుతుడు.

ఆ మాటల్లోని యదార్థాన్ని గమనించి మౌనంగా వుండిపోయాడు ఆ ఆగంతకుడు.

"తెల్లవారిన తర్వాత చూసుకోవచ్చు. ఈ చీకటివేళ గడిచిపోయే వరకూ విశ్రాంతి తీసుకోవటం మంచిది" సాలోచనగా అన్నాడు శ్రేష్ఠి.

విశ్రాంతి తీసుకోవటానికి సరైన స్థలాన్ని వెతకటం కోసం, తాము నిలబడిన ప్రదేశాన్నంతా కూలంకషంగా గమనించాడు ఆగంతకుల నాయకుడు.

"రండి... అందరూ ఇటు రండి" ఉన్నట్లుండి చిన్నకంఠంతో అందరినీ పిలిచాడు.

ఆశ్చర్యంగా చూస్తూ అటుకేసి వెళ్ళిన వారందరికీ కనిపించింది అస్పష్టంగా వున్న ఒక చిన్న కాలిబాట.

అంత చీకటిలోను ఆ బాటను చూసిన వెంటనే ఆశ్చర్యంగా తలలు విదిలించారు మిగిలిన ఆగంతకులు అందరూ.

మనుషులు నడవటం వల్ల ఏర్పడింది కాదు అది... బలమైన, బరువైన ఏనుగులు అదేపనిగా అటూ ఇటూ తిరగటం వల్ల తయారయినటువంటి మార్గం.

"ఏర్పడి చాలాకాలం అయింది. ఈ మధ్యకాలంలో ఎవరూ ఈ బాటమీద నడిచింది లేదు" మోకాళ్ళమీద వంగి, నేలను చేతితో స్పృశిస్తూ అన్నాడు ఆగంతకుల నాయకుడు.

"ఈ బాట చివర ఏనుగులు వుంటాయంటావా?" అడిగాడు శ్రేష్ఠి.

"వెళ్ళి చూస్తేగాని తెలియదు" అంటూ అతని ఆజ్ఞల కోసం ఎదురు చూడకుండా ముందుకు నడిచాడు ఆగంతకుల నాయకుడు.

ఓపిక లేకపోయినా అనుసరించారు శ్రేష్ఠి శుశ్రుతుడు.

పాము మెలికలు తిరిగినట్లు వంపులు తిరుగుతూ ప్రయాణం చేసిందా బాట... తూర్పుదిక్కున వెలుగులు ప్రత్యక్షం అవుతున్న సమయంలో ఒక పెద్ద కొండలోయలోకి పోయి అంతమైంది.

"సంపంగి నగరం చుట్టూ వున్న అడవి అంతా మాకు తెలుసని చాలా గర్వంగా అనుకునేవాడిని... ఈ అడవి అనంతమని ఇప్పుడే తెలిసింది. నాకు

తెలియని దారులు, విచిత్రాలు చాలా వున్నాయని అర్థం అయింది" అన్నాడు శుశ్రుతుడు.

"ఏనుగుల్ని గురించి మీకు తెలిసి వుండకపోతే ఈ దారి, ఈ కొండలోయ ఎప్పటికీ కనిపించేది కాదు" అంటూ వున్నట్లుండి పక్కకు దూకాడు ఆగంతకుల నాయకుడు.

శ్రేష్ఠి ఆంతరంగికుడి ఖడ్గం ఇంకా శుశ్రుతుడి దగ్గరే వున్నది. దాన్ని తను తీసుకుని బలంగా ముందుకు విసరబోయాడు.

రివ్వుమంటూ వచ్చి అతని పాదాల దగ్గర భూమిలో దిగబడింది ఒక బాణం. మరింత వేగంగా వచ్చి అతని చేతిలోని ఖడ్గాన్ని ఎగురగొట్టింది రెండో బాణం.

"కదలవద్దు... కదిలి ఎవరూ ముందుకు రావద్దు... ఇంకేమైనా ఆయుధాలు మీ దగ్గర వుంటే వాటిని కూడా క్రిందపడవేయండి" ఖంగుమంటూ వినవచ్చింది ఒక కంఠం.

ఆగంతకులు ఎవరి దగ్గరా లేవు ఆయుధాలు. శ్రేష్ఠిగారి ఖడ్గం ముళ్ళపొద దగ్గిరే పడిపోయిన సంగతిని ఎవరూ గమనించలేదు. ఉన్న ఒక్కటీ బాణం దెబ్బకు ఎగిరి ఎటో దూరంగా వెళ్ళి పడిపోయింది.

"మేము శత్రువులం కాదు. శిఖావంతుడి సైన్యానికి చిక్కబడకుండా వుండేందుకు పారిపోయి వచ్చినవాళ్ళం..." ఒట్టి చేతుల్ని గాలిలోకి ఎత్తుతూ బిగ్గరగా అన్నాడు శుశ్రుతుడు.

"శిఖావంతుడి సైన్యాలు అడవిలోకి వచ్చాయా? గజయుద్ధంలో సాటిలేని మేటి సాగరుల వారి గురించి మర్చిపోయాడా ఆ శిఖావంతుడు! సంపంగి నగర గజదళం నిద్రపోతున్నది అనుకున్నాడా?" ఆశ్చర్యంగా అడుగుతూ ఒక పెద్ద చెట్టుచాటు నుంచి ఈవలకు వచ్చాడు ఒక వృద్ధుడు.

❖ ❖ ❖

చీకటి సమయంలో తనను కలుసుకోవాలని జ్వాల అభిలషించడం వెనక వున్న కారణం ఏమిటోనని ఆశ్చర్యపడకుండా అంతఃపురం నుంచి వర్తమానం వచ్చిన వెంటనే నిద్రకనులను నులుముకుంటూ వచ్చేశాడు వాసుదేవుడు.

అతనొక్కడే కాదు ఆ విషయం తెలిసిన మహేశ్వరుడు కూడా వచ్చాడు. ఆది గమనించిన చారులతాదేవి కూడా జ్వాల మందిరానికి వచ్చేసింది.

వారందరినీ మళ్ళీ పాత సామాగ్రిని భద్రపరిచే మందిరంలోకి తీసుకుపోయి, శివుడు దొరికిన బుట్టని ఇంకోసారి మందసంలో నుంచి బయటికి తీయించింది జ్వాల. అంతకుముందు చూసిన వస్త్రాన్ని మళ్ళీ నేలమీద పరిపించి నూనె దీపాల వెలుగులో దానిని పరిశీలించమని చెప్పింది.

ఎన్నోమార్లు చూసివుండడం చేత, అసహనంగా తల విదిలించి పెదవి విరిచాడు మంత్రి మహేశ్వరుడు.

"ఈ వస్త్రం బహుశా శ్రావస్తి నగరంలోని పనివారు నేసి వుంటారు. సామాన్యులు అందరూ ధరించే వస్త్రమే ఇది... ప్రత్యేకత ఏమీ లేదు" అనికూడా అన్నాడు.

వాసుదేవుడి వైపు చూసింది జ్వాల.

"వయసు మీదపడటం వల్ల దృష్టిలోపం ఏర్పడుతున్నట్టు అనుమానంగా వున్నది. నీ అభిప్రాయం చెప్పు తల్లీ" అన్నాడు వాసుదేవుడు.

చారులతాదేవి వంక చూసింది జ్వాల. ఆమెనుంచి ఎటువంటి అభిప్రాయాలు వెలువడక పోవటంతో, క్రిందపరిచిన వస్త్రం చివరి భాగంలో నుంచి ఒక సన్నని పోగుని బయటికి లాగి, అన్నిటికంటె ప్రకాశవంతంగా వెలుగుతున్న నూనెదీపం ముందు పెట్టి పట్టుకున్నది.

"సాధారణమైన నూలుపోగు... అందులో విశేషం" అని నాలుక చప్పరించబోతూ అదిరిపడి ఆ మాటల్ని మ్రింగేశాడు మహేశ్వరుడు. ఆమె చేతుల్లోని పోగును తన చేతితో స్పృశించి విపరీతమైన ఆశ్చర్యంతో కనులు పెద్దవిచేశాడు.

"నూలుపోగు కాదు ఇది... ఎంతోకాలంగా శుభ్రపరచకుండా వదిలి వేయటం వల్ల మలినపడి మామూలుగా కనిపిస్తున్న బంగారపు పోగు" ఖచ్చితమైన కంఠంతో చెప్పింది జ్వాల.

"ఈ వస్త్రం శ్రావస్తి నగరంలో నేయబడింది కాదు... బంగారు పోగుల్ని నేర్పుగా వస్త్రంతో జతచేసే పనివాళ్ళు బహుశా నగరంలో వుంటారు. గతంలో మా రాచకుటుంబీకుల వస్త్రాలన్నీ ఆ నగరంనుంచే తెప్పించబడేవి. గుర్తున్నదా అత్తా?" చారులతాదేవి వంక చూస్తూ అడిగింది.

గుండెలమీద చెయ్యి వేసుకుని అలాగే నిలుచుండిపోయింది చారులతాదేవి.

"శివుడు పరుండబెట్టబడిన ఈ బుట్టకూడా వెదురుబుట్ట కాదు. అడవిలో నివశించే ప్రజలు ఉపయోగించే తుంగగడ్డితో కూడా ఇది చేయబడలేదు. యుద్ధబాణాలు తయారుచేసే సన్నపాటి కలపతో తయారుచేయబడింది" బుట్టని గురించి కూడా తన అభిప్రాయాన్ని తెలియచేసింది జ్వాల.

ఒకరివంక ఒకరు చూసుకున్నారు వాసుదేవుడు, మహేశ్వరుడు.

"యుద్ధ బాణాలకు అవసరమయ్యే కలప మన అడవిలో లేదు. మనం సౌగంధ దేశం నుంచి తెప్పించుకుంటున్నాము" అన్నాడు వాసుదేవుడు.

"అంటే శివుడు ఆ దేశంలో నుంచి తీసుకురాబడ్డాడా?" వెంటనే అడిగింది చారులతాదేవి. అప్పటికి ఆమె కాస్తంత తేరుకున్నది తన ఆశ్చర్యాన్నించి.

"బుట్ట తయారుచేయబడిన కలప ఆ సౌగంధ దేశానికి చెందినదైనంత మాత్రాన ఈ బుట్టలోని బిడ్డడు ఆ దేశంలో నుంచి తీసుకురాబడ్డాడని అనుకోవాల్సిన అవసరం లేదు. బుట్ట అక్కడినుండి వచ్చిన తర్వాత ఇక్కడీ పనికి ఉపయోగించ బడి వుండవచ్చు" అన్నాడు వాసుదేవుడు.

"నువ్వు ఏమంటావు తల్లీ?" జ్వాలనే అడిగాడు మహేశ్వరుడు.

"నాకు సౌగంధ దేశాన్ని గురించి కొంతవరకూ తెలుసు. ముఖ్యంగా అది వ్యవసాయం మీద ఆధారపడి వుంటుందనీ, అక్కడి వారందరికీ యుద్ధాలు చేయటమంటే అసహ్యమనీ తెలుసు" సాలోచనగా అంటూ వున్నట్లుండి వాసుదేవుడి కేసి తిరిగి, "సుబోధుడనే ఒక వీరుడు ఆ దేశంలో వుండేవాడట... అతడ్ని గురించి చెప్పండి" అన్నది.

"అబ్బో... ఇప్పటి మాట కాదు తల్లీ... దాదాపు అర్థ శతాబ్దం క్రితం జరిగిన మాట... సౌగంధ దేశపు యువరాణిని ప్రేమించి, ఆమె తండ్రి అంగీకరించకపోయేసరికి, ఆమెను రహస్యంగా వివాహం చేసుకుని ఎక్కడికో తీసుకుపోయాడు అతను" అన్నాడు వాసుదేవుడు.

"సామాన్యులు ఎవరో అసామాన్యుల్ని ప్రేమించటం, అందుకు పెద్దలు అంగీకరించకపోతే రహస్యంగా వివాహమాడి ఎటెటో వెళ్ళిపోవటం... ఇవన్నీ సాధారణమైన విషయాలు. ప్రతి దేశంలోను ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒకచోట

జరిగే సంఘటనలు. ఈ సుబోధుడి పేరు మాత్రం ఇప్పటికీ మీకు గుర్తు వుందంటే... అందుకు ఏదో కారణం వుండే వుంటుంది" అన్నది జ్వాల.

వాసుదేవుడి మొఖంలో వెంటనే ప్రత్యక్షమైంది అదోరకమైన భావం.

"నిజంగా యువరాణీ... నీ మేధస్సు అపూర్వం. నువ్వు ఇప్పుడు ఈ ప్రసక్తి తీసుకువచ్చే వరకూ నాకు తట్టనేలేదు" అన్నాడు ఆప్యాయంగా చూస్తూ.

"ఏమిటి మీకు తట్టనిది?" ఆలస్యం భరించలేనట్లు అసహనంగా అడిగింది చారులతాదేవి.

"గజాలను మచ్చిక చేసుకోవడంలో మహామేధావి ఆ సుబోధుడు. దేశ విదేశాల నుంచి ఏనుగుల్ని తెప్పించి శిక్షణ ఇస్తే బ్రహ్మాండమైన గజదళం తయారవుతుందని అనుకునేవాడట. స్వతహాగా యుద్ధాలంటే ఇష్టం లేని సౌగంధ పాలకులు అతనికి దేశ బహిష్కరణ శిక్షను విధించారట..." తనకు తెలిసిన మాటల్ని గుర్తుచేసుకుంటూ నెమ్మదిగా చెప్పాడు వాసుదేవుడు.

"అంటే మన శివుడు ఆ సుబోధుడి సంతానమై వుంటాడని మీ అభిప్రాయమా?" వెంటనే అడిగింది చారులతాదేవి.

"కాదు తల్లీ... శివుడు సుబోధుడి సంతానమై వుండటానికి అవకాశాలు లేవు... ఈ కథ ఇప్పటిది కాదు... అర్థ శతాబ్దానికి పైగానే వుంటుందని ఇందాక చెప్పాను కదా?" అన్నాడు వాసుదేవుడు.

"మరి శివుడి తల్లిదండ్రులు ఎవరై వుంటారు?" తనలో తాను అనుకుంటున్నట్టు పైకే అన్నది జ్వాల.

"నాకు ఒక విషయం సరిగ్గా అవగతం కావటం లేదు. ఇక్కడ వున్నవారు ఎవరయినా విడమరిచి చెపితే చాలా సంతోషిస్తాను" ఉన్నట్లుండి మాట్లాడింది చారులతాదేవి.

జ్వాలతో సహా అందరూ ఆమెవంక చూశారు ఆశ్చర్యంగా.

"నిద్రలు చెడగొట్టుకుని మరీ ఆలోచించవలసినంత ముఖ్యమైన విషయమా ఇది? వాడి తల్లిదండ్రులు ఎవరైనా, ఎటువంటి వారైనా మాకు అనవసరం. వాడు మా బిడ్డ..." కొంచెం తీవ్రంగానే ప్రకటించింది ఆమె.

ఆమె అలా మాట్లాడుతుందని ఊహించలేదు కాబోలు ఇసుమంత ఆశ్చర్యానికి గురి అయ్యాడు మహేశ్వరుడు. జ్వాల, వాసుదేవులు మాత్రం ఒకరివంక ఒకరు చూసుకుని గుంభనంగా నవ్వుకున్నారు.

"ఎందుకు జ్వాల, ఆ నవ్వు?" అది గమనించనే గమనించి తీవ్రంగా అడిగింది చారులతాదేవి.

"శివుడి ఊసు వచ్చిన వెంటనే నువ్వు ఏదో తెలియని మమకారానికి లోనవుతూ వుండటమే ఇప్పుడు మనం ఈ పాత సామాన్ల మధ్య కూర్చుని వుండటానికి కారణం... నీకు కలుగుతున్న భావనలకు ఏదో కారణం వుంటుందనే మేము భావిస్తున్నాము" అంటూ మహేశ్వరుడికేసి తిరిగి, "ఏమంటారు మంత్రిగారూ?" అని అడిగింది జ్వాల.

లౌక్యం తెల్సినవాడతను. "నాకంటూ ప్రత్యేకమైన ఆలోచనలు ఏవీ లేవు. మీరందరూ ఎలా చెపితే అలాగే" అంటూ నవ్వేశాడు.

"సరిసరి... ఇప్పటికే చాలా రాత్రి గడిచిపోయింది. ఈ పరిశోధనలు చాలు. ఇక పదండి" అన్నది చారులతాదేవి.

తలవూపి ఆ పురాతన మందిరంలో నుంచి వెలుపలికి నడిచింది జ్వాల. బయటికి తీసిన వాటన్నిటినీ తిరిగి మండపంలోకి నెట్టించి, ఆమె వెనుకే బయటికి వచ్చారు మిగిలినవారందరూ.

❖ ❖ ❖

"శిఖావంతుడు సాగరుల వారిని గురించి మర్చిపోయాడా?" అని చెట్టు చాటునుంచి ఇవతలికి వస్తూ వృద్ధుడు పలికిన పలుకుల్ని ఆలకించగానే విపరీతమైన ఆశ్చర్యానికి గురి అయినారు శుశ్రుతుడు, కనకయ్య శ్రేష్ఠి.

"నోళ్ళు తెరుచుకుని బొమ్మల మాదిరి నిలబడబోకండి... నా ప్రశ్నకు సమాధానం చెప్పండి" కొంచెం తీవ్రంగానే అడిగాడు మళ్ళీ ఆ వృద్ధుడు.

"శిఖావంతుడు మర్చిపోయాడో లేదో మాకు తెలియదు. అతని సైన్యం మాత్రం సంపంగి నగరం మీదికి బయలుదేరిన మాట వాస్తవం..." అన్నాడు శుశ్రుతుడు.

"సంపంగి నగర గజదళాన్ని ఎదిరించేందుకు ఏదో ఉపాయాన్ని ఆలోచించుకున్నాడు అతను. అందుకే ధైర్యంగా వస్తున్నాడు" అన్నాడు కనకయ్య శ్రేష్ఠి.

"సువర్ణానది మీద ఏదైనా వంతెన నిర్మించి, నదిలోని మొసళ్ళకు చిక్కకుండా అవతలి ఒడ్డుమీద ప్రయాణం చేసి, ఎవరూ ఊహించని రీతిలో

కోటని ముట్టడి చేస్తే తప్ప శిఖావంతుడు విజయం సాధించలేడు. కోటలో వున్న గజబలం ఒకదాని వెనుకగా ఒకటి బయటికి వస్తున్న సమయంలో ఎదిరించగలిగితే... సాగరుడు నిర్వీర్యుడు అవుతాడు" సాలోచనగా అన్నాడు ఆ వృద్ధుడు.

అడవి జంతువుల చర్మంతో తయారుచేయబడి వున్నాయి అతని దుస్తులు. అవికూడా చిరుగులు పడి అసహ్యంగా కనిపిస్తున్నాయి. మొఖం మాత్రం తేజోవంతంగా వుంది. మాటలు బహుసూటిగా రమ్యంగా వున్నాయి.

"నేను మహాబలి చక్రవర్తుల వారి ఆస్థానంలో ఒక గూఢచారిని. జ్వలిత సామ్రాజ్యంలో నివశించే పెద్దలందరితోను నాకు పరిచయం వున్నది. ఎవరెవరు ఎటువంటివారో నాకు తెలుసు" అన్నాడు శుశ్రుతుడు.

"నువ్వు చెప్పదలుచుకున్నది ఏమిటి? నేనెవరినో నీకు తెలియదనా?" నొసలు ముడివేసి చూస్తూ అడిగాడు ఆ వృద్ధుడు.

"దయచేసి చెప్పండి... మీరెవరు?" వినయంగా చేతులు జోడిస్తూ అడిగాడు శుశ్రుతుడు.

"నేను ఎవరినో మీకు చెప్పవలసిన అవసరం లేదు. ప్రాణాలు దక్కించు కోవటానికి పారిపోయి వస్తున్నామని చెప్పారు కాబట్టి, అలసట తీరేదాకా నాకు అతిథులుగా వుండండి. ఆ తరువాత శిఖావంతుడి సైన్యానికి కనిపించకుండా క్షేమంగా మీ చక్రవర్తి దగ్గరికి పోయేందుకు ఒక దారిని చూపిస్తాను. రండి" అంటూ వెనుతిరిగాడు వృద్ధుడు.

ఒకరి వెనుక ఒకరుగా అతన్ని అనుసరించారు శ్రేష్ఠి బృందం.

"ఇతని మాటలు వింటుంటే నాకు చాలా ఆశ్చర్యంగా వున్నది. సంపంగి నగరం మీద విజయం సాధించటం ఎలాగో, సూటిగా రెండు ముక్కల్లో చెప్పేశాడు" అన్నాడు శుశ్రుతుడు చాలా రహస్యంగా శ్రేష్ఠికి మాత్రమే వినబడేటట్లు.

"నువ్వన్నది అక్షరాల నిజం. శిఖావంతుడు సువర్ణానది మీద వంతెనను నిర్మింపచేశాడు. కాని అది ధ్వంసం కావించబడినట్లు నాకు అతని నగరంలో వుండగా తెలిసింది" అన్నాడు శ్రేష్ఠి.

"సాగరుల వారి శక్తిసామర్థ్యాల మీద ఇతనికి సంపూర్ణమైన విశ్వాసం వున్నది. ఇటువంటి వ్యక్తి ఒకడున్నాడని నాకు తెలియకపోవటమే విచిత్రంగా వుంది" ఆ వృద్ధుడు ఎవరో తెలుసుకోవటానికి విఫలప్రయత్నం చేస్తూ అన్నాడు శుశ్రుతుడు.

దట్టంగా వున్న కొన్ని పొదల మధ్యలో నుంచి రెండువందల ధనువుల దూరం పోగానే, వారికి కనిపించింది గలగలా ప్రవహిస్తున్న చిన్న సెలయేరు. దాని ఒడ్డున కొండరాళ్ళతో నిర్మించబడి వున్నది ఒక చిన్న నివాసం. ఆ నివాసానికి సరిగ్గా ఎదురుగా కనిపించాయి రెండు సమాధులు.

"ఇవి ఎవరివి?" కుతూహలాన్ని అణుచుకోలేక అడిగాడు శుశ్రుతుడు.

"నీకు అవసరం లేని వివరం అది" చెంపదెబ్బ కొట్టినట్టు వేగంగా సమాధానం ఇచ్చాడు వృద్ధుడు.

నోరు తెరిచి ఇంకోసారి అడిగితే నిజంగానే అతను దెబ్బ కొడతాడేమో అనిపించి ఠప్పున నోటిని అదుముకున్నాడు శుశ్రుతుడు.

అతన్ని, శ్రేష్ఠిని, వారివెంట వచ్చిన ఆగంతకులను సమాధులకు కొంచెం ఆవలగ వున్న వృక్షాల క్రింద కూర్చోబెట్టి, కొండరాళ్ళతో నిర్మించబడిన నివాసంలో నుంచి పెద్ద బుట్టతో మిగలపండిన అడవిఫలాల్ని తీసుకువచ్చాడు ఆ వృద్ధుడు.

"శ్రేష్ఠిగారూ... గమనించారా? ఆ బుట్ట ఎటువంటి కలపతో నిర్మాణం చేయబడిందో..." ఆశ్చర్యంగా అన్నాడు శుశ్రుతుడు.

కనులు పెద్దవి చేసి మరీ చూశాడు శ్రేష్ఠి. అతనికి ఏమీ తెలియలేదు.

"యుద్ధబాణాలను తయారుచేసే కలపను బద్దెలుగా చీల్చి ఆ బుట్టను అల్లారు. అదికూడా చాలాకాలం క్రితం... ఇటువంటివి ఒక్క సౌగంధ దేశంలోనే లభిస్తాయి. ఇంకెక్కడా లభించవు. ఇతను ఎవరోగాని సౌగంధీయుడే అయివుంటాడు" చెప్పాడు శుశ్రుతుడు.

వృద్ధుడు అందించిన ఫలాలను ఆరగించి, సెలయేటిలోని నీటిలో దాహం తీర్చుకున్న తర్వాత, నశించిపోతున్న శక్తి తిరిగి వచ్చినట్లు అనిపించింది వారందరికీ.

మరో పావు ఘడియ పాటు విశ్రాంతి తీసుకోనిచ్చి, వారందరినీ ఆ లోయ చివరి భాగంలోకి తీసుకుపోయాడు వృద్ధుడు. పొదల మధ్య కనిపించీ కనిపించనట్లున్న ఒక దారిని వారికి చూపించాడు.

"సూటిగా మిమ్మల్ని శ్రావస్తి నగరం పొలిమేరల దగ్గరికి తీసుకుపోతుంది. పక్క చూపులు చూడకుండా నడవండి" అని హెచ్చరించాడు.

"మీరు చేస్తున్న సహాయానికి కృతజ్ఞులం. మీ పేరు చెబితే చాలా సంతోషంగా వుంటుంది" అన్నాడు శుశ్రుతుడు.

నొసలు విరిచి తల అడ్డం తిప్పాడు వృద్ధుడు. వెళ్ళిపొమ్మని చేయి వూపాడు. అతను సమాధానం చెప్పడని అవగతమై తలలు వంచుకుని అతను చూపించిన దారిలో నడక మొదలుపెట్టారు అందరూ.

❖ ❖ ❖

మిట్ట మధ్యాహ్నపు సూర్యుడు వెదజల్లుతున్న వేడిమిని కూడా లక్ష్యం పెట్టకుండా, కోటముందుగా నిలువబడి వున్న తన ఏనుగుల దగ్గరికి వచ్చాడు సాగరుడు. సరిగ్గా అప్పుడే తమ అశ్వాలను అతివేగంగా పరుగులు తీయిస్తూ వచ్చారు నలుగురు అశ్వికులు... అడవిలో నుంచి.

"శిఖావంతుడి సైన్యం అడవి గ్రామాలమీద అడ్డగోలుగా దాడులు చేస్తోంది. ఆహార పదార్థాలను దోచుకుని, ఆడమగ తేడాలు లేకుండా దొరికిన వారిని దొరికినట్లు నరికిపారేస్తోంది" అన్నాడు ఒక అశ్వికుడు.

"గగ్గోలెత్తిపోతున్నాయి ప్రభూ గ్రామాలన్నీ... భయంతో వణికిపోతున్నాయి" అన్నాడు మరొకతను.

"ప్రజల్లో భయాందోళనలను కలిగించటమే వాళ్ళ లక్ష్యంగా కనిపిస్తోంది. అపరిమితమైన భయాన్ని పొందినవారు... ఆ తర్వాత విపరీతమైన ఉద్వేగంతో తమ పాలకులమీద తిరగబడతారని ఆ శిఖావంతుడు అనుకుంటున్నాడు కాబోలు... ఆ తిరుగుబాటును తనకు అనుకూలంగా మార్చుకోవాలని ఆశ పడుతున్నట్లున్నాడు" సాలోచనగా అన్నాడు సాగరులవారు.

"శిఖావంతుడు ఎటువంటి ఆలోచన చేస్తున్నాడో మనకి అనవసరం. ముందు మనం మన ప్రజల్ని కాపాడుకునే ప్రయత్నం చేయాలి" అన్నాడు పక్కనే నిలుచుని వున్న మంత్రి మహేశ్వరుడు.

"వాడు సూటిగా నగరం మీదికి వస్తాడని అనుకున్నానే గాని, ఇలా మన గ్రామాల మీద పడతాడని అనుకోలేదు" కోపంగా అన్నాడు సాగరులవారు.

"అక్రమంగా మనమీద యుద్ధాన్ని ప్రకటించినవాడికి ధర్మాధర్మాలతో నిమిత్తం వుండదు. వాడు ఏమైనా చేస్తాడు. ముందుగా ఊహించి మనం జాగ్రత్తలు తీసుకుని వుండాల్సింది. తీసుకోలేదు. అది మన తప్పు" అన్నాడు మంత్రి మహేశ్వరుడు.

నుదురు రుద్దుకుంటూ తన కోటకేసి చూశాడు సాగరులవారు. వందల సంఖ్యలోనే వున్నది అతని సైన్యం. వారిలో ఏ కొంతమందిని అడవిలోకి పంపించినా నగర రక్షణ కష్టతరమౌతుంది.

"ఏం చేద్దాం మహేశ్వరా?" అని అడిగాడు.

"వాసుదేవుడున్నాడు. మన శివుడున్నాడు. అడవినంతా కలియతిరగ గల వాడి ఏనుగులున్నాయి. పాతికమంది భటులతో వాళ్ళని అడవిలోకి పంపిద్దాం. ముఖాముఖీ ఎదురుపడకుండా వెనుకనుంచో, పక్కనుంచో దాడులు జరిపి చికాకు పరచటం లెస్సగా వుంటుంది" అన్నాడు మహేశ్వరుడు.

పది నిమిషాల పాటు దీర్ఘంగా ఆలోచించి తలవూపాడు సాగరుల వారు. "వెళ్ళి వెంటనే వాసుదేవుడికి చెప్పండి" అన్నాడు.

"వాసుదేవుడికి చెప్పటం చాలా తేలిక. మన భటుల్లో ఎవరిని పంపినా వెంటనే రెక్కలు కట్టుకుని మనముందు వాలతాడు. శివుడు విషయంలో మాత్రం ఆ పద్ధతి పనికిరాదు. మీరే స్వయంగా రాణిగారి వద్దకు వెళ్ళి ముందుగా వారికి చెప్పాలి. ఆమె మాత్రమే శివుడిని పంపించగలదు.. అది ఆమెతో మీరు చేసుకున్న ఒప్పందం. గుర్తున్నదా?" నవ్వుతూ అడిగాడు మహేశ్వరుడు.

కోరగా చూసి, తన భటుడు ముందుకు తీసుకువచ్చిన అశ్వాన్ని అధిరోహించాడు సాగరుల వారు. కాలిమడమలతో గట్టిగా అదిలించి, వేగంగా నగరంలోకి పరుగు తీయించాడు.

❖ ❖ ❖

"వల్ల కాదు. అడవిలో అష్టకష్టాలు పడి క్షేమంగా తిరిగి వచ్చినవాణ్ణి వెంటనే ఇంకోసారి అడవిలోకి పంపించడం నావల్ల కాదు. మీరు వెంటనే ఇంకో ఆలోచన చేసుకోవడం చాలా మంచిది. కావాలంటే మీ మంత్రి మహేశ్వరుడినే పంపించుకోవచ్చు. నాకు ఎటువంటి అభ్యంతరమూ లేదు."

తమ మందిరం వెలుపల వున్న పూ పొదల దగ్గర నిలబడి అన్నది చారులతాదేవి. సాగరుల వారి ఆలోచనను వినగానే నిర్మొహమాటంగా తిరస్కరించింది.

"అడవి గ్రామాలు అల్లాడిపోతున్నాయి దేవీ... ఏదో ఒకటి వెంటనే చేయకపోతే అమాయకులు ఎంతోమంది హతమారిపోతారు. ఇప్పటికే చాలామంది హతులైనారు" ఓపికగా చెప్పాడు సాగరులవారు.

"మన సైన్యంలో సగంమందిని తీసుకుని మీరే స్వయంగా వెళ్ళిరండి. కోటరక్షణ నేను చూసుకుంటాను" చెప్పిందామె.

"చుట్టూ దారిన ఆ శిఖావంతుడి సైన్యంలో కొంతభాగం నగరం మీదికి వస్తే?" అడిగాడు సాగరుడు.

"గజదళాన్ని ఉరికించటానికి శివుడున్నాడు... మరేం ఫరవాలేదు" అన్నది ఆమె.

ఏమని సమాధానం ఇవ్వాలో, ఆ సంభాషణను ఎలా పొడిగించాలో సాగరులవారికి అవగతం కాలేదు.

"ఆలోచించు దేవీ... ఇంకొక్కసారి బాగా ఆలోచించు..." అని మాత్రం చెప్పి వెను తిరగబోతుండగా ముందు గున్న ఏనుగు ఆ వెనుక శివుడు అతనికి ఎదురు వచ్చారు.

"తల్లీ... మేము అడవిలోకి వెళతాము.. .అనుమతి ఇవ్వండి" సాగరుల వారు తనకు ఏమీ చెప్పకముందే సూటిగా చారులతాదేవిని అడిగాడు శివుడు.

"నువ్వు నోరుమూసుకోవటం చాలా బాగుంటుంది. నువ్వు ఎక్కడికి పోవాలో, ఎప్పుడు పోవాలో నేను నిర్ణయించగలను" కోపంగా అన్నది ఆమె.

"తల్లీ... అడవి గ్రామాల్లో వున్న వారందరూ ఒట్టి అమాయకులు" అన్నాడు శివుడు.

"నువ్వు ఎవడివిరా? తెలివైనవాడివా?"

"కాదు తల్లీ... కాని ఆపద ముంచుకు వస్తే వాళ్ళు మీవంకే చూస్తారు. మీరు ఏదో ఒకటి చేసి కాపాడతారని ఆశగా ఎదురు చూస్తూ వుంటారు" అన్నాడు శివుడు.

"అందుకే కదా నేను ప్రభువుల వారిని వెళ్ళమని చెపుతున్నది" అన్నదామె.

"ప్రభువుల వారు ఇక్కడ లేకపోతే కోట వెలుపలి గజబలం నిస్సారమై పోతుంది. అవి వారి మాటల్నే మన్నిస్తాయి. నా మాటల్ని వినిపించుకోవు. వాటిని అదుపు చేయటం నావల్ల జరిగే పని కాదు. నా ఏనుగులు కూడా ఇందుకు ఒప్పుకోవు" మరింత ఒత్తిడిగా చెప్పాడు శివుడు.

"నిన్ను మళ్ళీ అడవిలోకి పంపించటం నాకు ఇష్టంలేదు" అసలు మాటను చాలా స్పష్టంగా చెప్పింది ఆమె.

"వాసుదేవుల వారు వెంటవుండగా నాకు ఎటువంటి ఆపదా రాదు తల్లీ... నా మాట నమ్మండి" బ్రతిమాలుకుంటున్నట్టు అడిగాడు శివుడు.

ఆలోచనలో పడింది చారులతాదేవి. పది నిమిషాల తరువాత అయిష్టంగానే తలవూపింది.

అంతవరకూ మౌనంగా నిలుచుని వున్న సాగరుల వారికి గుండెల మీదినించి కొండంత బరువు దిగిపోయినట్లయింది.

"నేను నగరం వెలుపల పట్టపుటేనుగు దగ్గర వుంటాను. నీ ఏనుగుల్ని చూసి మళ్ళీ గొడవ మొదలుపెట్టకుండా జాగ్రత్తలు తీసుకుంటాను" అని శివుడుకి చెప్పి మళ్ళీ నగరం వెలుపలికి తన అశ్వాన్ని పరుగులు తీయించాడు.

"అత్తా... నేను కూడా అడవిలోకి వెళ్లి వస్తాను"ఉన్నట్లుండి అన్నది జ్వాల.

అదిరిపడింది చారులతాదేవి. "అవతల వున్నది శిఖావంతుడి సైన్యం. నువ్వు మళ్ళీ ఏదైనా చిక్కుల్లో పడితే చక్రవర్తికి మేము సమాధానం చెప్పుకోలేము" అన్నది భయం భయంగా.

"ఈ సామ్రాజ్యానికి నేను కాబోయే మహారాణిని. సామ్రాజ్యంలోని ప్రజల్ని కాపాడుకోవాల్సిన బాధ్యత కలిగినదానిని. రేపు నేను పట్టం కట్టుకున్న తర్వాత ఇటువంటి పరిస్థితి ఏదైనా ఎదురుపడితే ఇప్పుడు మాట్లాడినట్లే అప్పుడు కూడా మాట్లాడగలవా?" సూటిగా అడిగింది జ్వాల.

సంకటంలో పడిపోయింది చారులతాదేవి.

"నువ్వు సమాధానం చెప్పలేవు... ఎందుకంటే నేను అడవిలోకి వెళ్ళటమే ధర్మం గనుక..." అంటూ ఆమె అనుమతించకముందే అంతఃపురంలోకి పరిగెత్తి అడవిలో సంచరించటానికి అనువైన వస్త్రాలు ధరించి వచ్చింది జ్వాల. ఆటవికులు తనకు బహూకరించిన ఆయుధాల్ని కూడా వెంట తీసుకువచ్చింది.

"నీ గురించిన బాధకంటె ఇప్పుడు నాకు ఈ అల్లరిపిల్లను గురించిన బాధ అధికం అవుతోంది. జ్వాలను జాగ్రత్తగా చూసుకోరా శివుడు. ఆ దుష్ట శిఖావంతుడి సైన్యానికి మన సంపంగి నగరం దెబ్బ ఎలా వుంటుందో చూపించు..." శివుడి తల నిమురుతూ చెప్పింది చారులతాదేవి.

చిన్న నవ్వు నవ్వి వెనక్కి పరిగెత్తాడు శివుడు. దూరంలో ఒక చెట్టుక్రింద నిలబడి వున్న తన ఏనుగుల్ని ప్రయాణానికి సిద్ధం చేశాడు.

❖ ❖ ❖

రెండు కొండగుట్టల మధ్యన వున్న గ్రామంమీద హఠాత్తుగా వచ్చిపడింది శిఖావంతుడి సైన్యం.

"ఇటువంటివి ఇంకా పన్నెండు వున్నాయి. వాటిని కూడా నాశనం చేసేస్తే సాగరుడి గర్వం అణిగిపోతుంది. అతని చేతకానితనం అందరికీ వెల్లడి అవుతుంది" సైన్యాన్ని ముందుకు పంపి గ్రామానికి దూరంగా తన వాహనాన్ని నిలబెడుతూ అన్నాడు ఆ సైన్యానికి నాయకత్వం వహిస్తున్న సేనాపతి.

"శిఖావంతుల వారినుంచి సమాచారం ఏమీ రాలేదు. వారు ఇప్పుడు ఏం చేస్తూ వుంటారో మనకి తెలియదు" అన్నాడు అతని పక్కన వున్న ఇంకో సేనాపతి.

"సంపంగి నగరాన్ని మనం ముట్టడించిన వెంటనే మిగిలిన సైన్యంతో ప్రభువులవారు మహాబలుడి మీదికి కదులుతారు" చెప్పాడు ఆ సేనాపతి.

"మన సైన్యం మహాబలుడి రాజధానిని ముట్టడించినప్పుడు ఈ సంపంగి నగరం నుంచి అతనికి సహాయం అందకుండా చేయటమే కదా ఈ పథకానికి అర్థం?" అడిగాడు రెండో సేనాపతి.

తలవూపాడు మొదటి సేనాపతి.

గ్రామంమీద పడిన సైనికులు, కనిపించిన ప్రతి ఇంటికి అగ్ని ముట్టించి, నాశనం చేయటం మొదలుపెట్టారు. ఆక్రోశిస్తూ బయటికి వచ్చిన గ్రామీణుల్ని కరకు కత్తులతో నరికి పోగులు పెట్టటం చేస్తున్నారు.

అగ్నిజ్వాలలు వికృత ధ్వనులతో, గాయాలపాలైన గ్రామీణుల ఆర్తనాదాలతో గందరగోళంగా తయారయిందా ప్రదేశం.

అదే సమయంలో వెనుకగా నిలబడి వింత చూస్తున్న కొంతమంది సైనికుల మీద ఒక్కసారిగా దూసుకువచ్చాయి పదునైన బాణాలు.

ఏం జరుగుతున్నదో అందరికీ అర్థమయేలోపల ప్రాణాలు వదిలి, నేలమీద పడిపోయారు అనేకమంది సైనికులు.

"ఎదిరించండి... చాటునుంచి బాణాలు వదిలే వారెవరో గుర్తించి ప్రాణాలు తీయండి" గర్జించాడు మొదటి సేనాపతి. గర్జిస్తూ వుండగానే అతని మీదికి దూసుకు వచ్చిందొక బాణం. ఆఖరి క్షణంలో తన వాహనం మీదినించి క్రిందికి దూకటం వల్ల ప్రాణాలు కాపాడుకోగలిగాడు అతను.

అతని ఆజ్ఞను అమలుపరచటానికి సిద్ధపడిన సైనికుల మీద బాణవర్షం కురియటమే కాదు... ఒక పెద్ద చెట్టుచాటునుంచి భూతాల మాదిరి విరుచుకు పడ్డాయి రెండు ఏనుగులు. దొరికిన సైనికుల్ని దొరికినట్టే తొండాలతో క్రిందికి నెట్టి పాదాలతో పుచ్చకాయలను తొక్కినట్లు నేలకేసి తొక్కి ప్రాణాలు తీయటం మొదలుపెట్టాయి.

అంతకు పది క్షణికాల ముందు వరకూ తమను ఎదిరించేవారు ఎవరూ లేరని ఎంతగానో గర్వించిన శిఖావంతుడి సేనాపతులకు నిలువుగుడ్లు పడ్డాయి.

"కమ్ముకోండి... ఆ ఏనుగుల్ని చుట్టూ కమ్ముకుని బరిశెలతో పొడిచేయండి" జీరపడిన కంఠంతో ఆజ్ఞలు ఇచ్చారు వాళ్ళు.

❖ ❖ ❖

"వెనక్కి లాగు శివుడు... నీ ఏనుగుల్ని వెంటనే వెనక్కి రమ్మని చెప్పు" సేనాపతులు ఇచ్చిన ఆజ్ఞలను తనుకూడా విని, వెంటనే శివుడిని హెచ్చరించింది జ్వాల.

మగ ఏనుగు కుంభస్తలం మీద కూర్చుని వున్న శివుడు వెంటనే పాదాలతో తట్టి దాన్ని వెనక్కి తిప్పాడు.

ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరం లేకుండానే ఆడ ఏనుగు కూడా వెనుతిరిగి చెట్లచాటుకు పరిగెత్తింది.

వాటిని వెంటాడబోయిన సైనికుల మీదికి ఒక్కపెట్టున బాణ వర్షం కురిపించింది జ్వాల. నలుగురు సైనికుల్ని పడగొట్టింది ఆమె. అరుగుర్ని హతమార్చాడు వాసుదేవుడు.

వారిద్దరూ వెనక్కి వస్తున్న సమయంలో సైనికులు ఎవరూ బరిశెలతో దాడి చేయకుండా తమ ఆయుధాలతో రక్షణ కల్పించారు సంపంగి నగరం నుంచి వారి వెంట వచ్చిన భటులు.

గ్రామంలోని ఇళ్ళన్నిటినీ తగులబెట్టి, దారుణమైన అల్లకల్లోలాన్ని సృష్టించాలని అనుకున్న శిఖావంతుడి సైన్యానికి మొట్టమొదటిసారిగా పెద్ద ఎదురుదెబ్బ తగిలినట్లయింది.

చెట్ల చాటునుంచి వచ్చిన బాణాలకి మొత్తం నలభైమందికి పైగా హతమారిపోగా, ఏనుగుల ధాటికి ఇంకో పాతికమంది నాశనమైపోయారు.

ఆ సందడిలో ప్రాణాలు కాపాడుకోవటానికి తమ ఇళ్ళను వదిలి అడవిలోకి పారిపోగలిగారు మూడొంతుల మంది గ్రామస్థులు.

“మీకు తెలిసిన గ్రామాలకు వెళ్ళి వారందరినీ హెచ్చరించండి. మాతోపాటు నిలబడి శత్రువులతో పోరాటం చేయగలవాళ్ళు అడవిలోనే ఆగిపోండి. మిగిలిన వారందరూ నగరం దగ్గరికి వెళ్ళిపొండి... సాగరుల వారు మీకు అక్కడ పూర్తి రక్షణ కల్పించేందుకు సిద్ధంగా వున్నారు” చెట్లకు పుట్టలకు అడ్డం పడి తమ ఎదుటికి వచ్చిన గ్రామస్థులందరికీ ఓపికగా చెప్పాడు వాసుదేవుడు.

కొండగుట్ట మధ్యన వున్న గ్రామం దగ్గర్నించి కదిలి, శిఖావంతుడి సైన్యం ఆ తరువాతి గ్రామాన్ని సమీపించేసరికి, నిర్మానుష్యంగా అగుపించింది అది. బార్లా తెరిచివున్నాయి ఇళ్ళ తలుపులు. ఆహార పదార్థాలు మాయమైపోయాయి. పశువులు కూడా అదృశ్యం అయినాయి.

అప్పటికి చీకట్లు దట్టం అవటంతో ఆ గ్రామంలోనే ఆగిపోయాయి శిఖావంతుడి సైన్యాలు. గుడారాలు వేసుకోవాల్సిన అవసరం లేదనుకుంటూ గ్రామస్తులు వదిలివెళ్ళిన ఇళ్ళల్లోనే విశ్రాంతి తీసుకోవాలని నిర్ణయించుకున్నారు సైనికులు.

సరిగ్గా అర్థరాత్రి సమయంలో నూనెగుడ్డలు చుట్టి నిప్పు ముట్టించిన బాణాలు ఆ ఇళ్ళమీదికి వచ్చిపడ్డాయి. అవి పడిన వెంటనే అంటుకున్నాయి అడవి ఆకులతో కప్పి వున్న ఆ ఇళ్ళు. చూస్తూచూస్తూ వుండగానే విలయతాండవం చేయటం మొదలుపెట్టాయి అగ్నిజ్వాలలు.

గాఢనిద్రల్లో వున్న సైనికులు గావుకేకలు పెడుతూ ఆ ఇళ్ళల్లో నుంచి బయటికి వచ్చారు. అప్పటికే మంటల్లో పడి హతమారిపోయారు దగ్గర దగ్గరగా రెండు వందలమంది.

కంటికి కనిపించకుండా ఎట్ట ఎదుటికి రాకుండా తమకు విపరీతమైన నష్టాన్ని కలుగచేస్తున్న శత్రువులు ఎంతమందో సరిగ్గా అంచనా వేయలేక పోయారు శిఖావంతుడి సేనాధిపతులు.

"అడవి గ్రామాలను అల్లకల్లోలం చేయాలన్న ఆలోచనలో మనం నెమ్మదిగా ప్రయాణం చేస్తున్నాము. అందుకే శత్రువులకు అలుసు అయిపోతున్నాము. ఇకమీదట ఈ పద్ధతి వద్దు. వేగంగా ప్రయాణం చేద్దాము. సూటిగా పోయి నగరాన్ని చుట్టుముట్టి ముందుగా దాన్ని వశపరుచుకుందాము. నగరం మన వశమైన తరువాత ఈ గ్రామాలను నేలమట్టం చేయడం చిటికెలో పని" అన్నాడు మొట్టమొదటి సేనాపతి.

"వేగంగా వెళ్ళినా, నెమ్మదిగా వెళ్ళినా వెనుకనుంచి దాడి జరగదని నమ్మకం ఏమిటి?" అడిగాడు రెండో సేనాపతి.

"వేగంగా వెళ్ళేటప్పుడు మనల్ని ఎదిరించాలంటే శత్రువు మన కంటికి కనిపించి తీరాలి. కంటి ఎదుటికి వచ్చిన తర్వాత తప్పించుకుపోలేడు..." అన్నాడు ఆ సేనాపతి.

తూర్పుదిక్కు తెల్లబడే వరకూ చెట్లక్రిందనే కాలక్షేపం చేసి, వేగంగా ప్రయాణం మొదలుపెట్టింది ఆ సైన్యం.

❖ ❖ ❖

"శిఖావంతుడి సేనాపతులకి జ్ఞానోదయం అయింది. సూటిగా నగరం మీదికి పోతున్నారు. మనం అడవిలోకి వచ్చిన పని పూర్తి అయింది. ఇంక త్వరగా వెనక్కి వెళ్ళిపోవటమే మంచిది" ఎక్కడా ఆపకుండా ప్రయాణం చేస్తున్న ఆ సైన్యాన్ని చూసి చిన్నగా అన్నాడు వాసుదేవుడు.

"వెనుకనుంచి ఎదిరించటానికి ఏమిటి అభ్యంతరం?" అసహనంగా అడిగింది జ్వాల.

వద్దని చెప్పలేదు వాసుదేవుడు. "నిజమే... ఒకసారి ప్రయత్నించి చూడటంలో తప్పులేదు" అన్నాడు.

తన అశ్వాన్ని అదిలించి వేగంగా ముందుకు దూకించింది జ్వాల. వింటిని ఎక్కుపెట్టి బాణాన్ని వదలటానికి ప్రయత్నించింది.

ఎదుట వున్న సైనికులు కదలకుండా నిలబడి వుంటే ఆమె గురికి తప్పకుండా దొరికిపోయి వుండేవారు. కాని వాళ్లు వేగంగా వెళ్ళిపోతూ వుండటం వల్ల ఆమె తన అశ్వాన్ని కూడా వారితో పాటు సరిసమానమైన వేగంతో నడిపించాల్సి వచ్చింది.

ఆ ప్రయత్నంలో ఆమె పొదల్ని వదిలి రహదారి మీదికి రావాల్సి వచ్చింది. ముందున్న శత్రువుల మధ్యలో నుంచి ఒక్కసారిగా ఆమెమీదికి వచ్చిపడ్డాయి పది యుద్ధబాణాలు.

అదిరిపడి అశ్వం మీదినించి క్రిందికి దూకి అత్యంత లాఘవంగా పక్కన వున్న పొదలోకి పరిగెత్తింది జ్వాల.

ఆమెను బలి తీసుకోవాల్సిన యుద్ధబాణాలు ఆమెకు బదులు ఆమె వాహనాన్ని పరలోకానికి పంపించివేశాయి.

"ఇలా జరుగుతుందని మీరు నాకు ముందుగానే చెప్పివుంటే బంగారం లాంటి ఆ గుర్రం బ్రతికివుండేది" కోపంగా అన్నది ఆమె వాసుదేవుడితో.

"కొన్ని మాటలు నోటితో చెపితే అర్థం అవుతాయి. కొన్ని ప్రత్యక్షంగా ఎవరికి వారు అనుభవిస్తే తప్ప అవగాహనకు రావు. ఇప్పుడు జరిగింది అదే. ఇంకెప్పుడూ వేగంగా వెళ్ళే సైన్యం జోలికి నువ్వు పోలేవు" చెప్పాడు వాసుదేవుడు చిరునవ్వుతో.

ముక్కును గట్టిగా ఎగపీల్చి భటుడు ఒకతను సిద్ధం చేసిన ఇంకో అశ్వం మీదికి లంఘించింది జ్వాల. "ఇప్పుడు మనం చేయవలసింది ఏమిటి?" అని అడిగింది.

"వెంటనే నగరంలోకి వెళ్ళిపోవటమే... వేరే పనేమీ లేదు" అంటూ తన వాహనాన్ని పరుగు తీయించాడు వాసుదేవుడు.

అర్ధఘడియ గడిచిన తర్వాత వారందరికీ కొట్టవచ్చినట్టు అర్థం అయిందొక విషయం. వేగంగానే కాదు... ఒకరి వెనుక ఒకరు కాకుండా వెడల్పుగా విస్తరించుకుని మరీ ప్రయాణం చేస్తోంది శిఖావంతుడి సైన్యం.

వారికి కనిపించకుండా నగరందగ్గరికి పోవటం అసాధ్యం. అయినా సరే పట్టువదలకుండా ప్రయత్నం చేశారు వాళ్ళు. ప్రయోజనం లేకపోయింది. చీకటి పడే సమయంలో నగరాన్ని సమీపించి కోట వెలుపల సిద్ధంగా వున్న గజబలం దగ్గరికి పోకుండా, కోటను పూర్తిగా ముట్టడించింది శిఖావంతుడి సైన్యం.

లోపలికి పోయే రహస్య మార్గం దగ్గర కూడా కొంతమంది సైనికులు గుడారాలు నిర్మించుకోవటంతో, వెలుపలే వుండిపోవాల్సిన పరిస్థితి ఎదురయింది వాసుదేవుడి బృందానికి.

❖ ❖ ❖

నగరాన్ని నాలుగు పక్కలనుంచి ముట్టడించడం జరిగితే ఎదుర్కోవటానికి ఏర్పాట్లు ముందుగానే చేయించి సిద్ధంగా వున్నాడు సాగరులవారు.

గజబలం నిలుపబడిన ప్రదేశాల్ని మాత్రం వదిలివేశాడు. మిగిలిన చోట్ల గోడలమీద కొండరాళ్ళను గుట్టలు గుట్టలుగా పోయించాడు కోటగోడల్ని ఎక్కటానికి ప్రయత్నించే వారి తలల మీద వేయటం కోసం.

గాడిపొయ్యలను సిద్ధం చేసి పెద్ద పెద్ద గంగాళాలతో నీటిని సలసల మరిగించే ఏర్పాటు చేశాడు.

వేడినీళ్ళు పడి చర్మం కమిలిపోయిన శత్రువులు, కోటగోడల్ని అధిగమించే ఆలోచనను విరమించుకోవడం తప్ప వేరే గత్యంతరం లేదు.

"రేపు ఉదయం తూర్పుదిక్కు తెల్లబడిన వెంటనే అటో యిటో తేల్చిపారేద్దాం. యుద్ధాన్ని సాగదీస్తే వాళ్ళకి ధైర్యం అధికం అయిపోతుంది" ఆ రోజు రాత్రి చారులతాదేవికి చెప్పాడు అతను.

"అడవిలోకి వెళ్ళినవాళ్ళ దగ్గిర్నించి వర్తమానం ఏదైనా వచ్చిందా?" ఆందోళనను అదిమిపెట్టుకోవటానికి ప్రయత్నిస్తూ అడిగింది ఆమె.

"రహస్య మార్గం మూతబడిపోయింది. శత్రువులు సరిగ్గా అక్కడే తమ గుడారాలను నిర్మించుకున్నారు. మనవాళ్ళు ఎక్కడ వున్నారో ఇప్పటివరకూ తెలియలేదు. రేపు మనం యుద్ధం ప్రారంభించిన తర్వాత తెలుస్తుంది" అన్నాడు సాగరులవారు.

తన మందిరానికి తిరిగిపోయి, తన చెలికత్తెలకు ఆజ్ఞలు ఇచ్చింది చారులతాదేవి– తాను ధరించటానికి అవసరమైన దుస్తుల్ని సిద్ధం చేయమని.

"తల్లీ... మీరు యుద్ధం చేయటమేమిటి? అంత అవసరం ఇప్పుడు ఏమొచ్చింది?" ఆశ్చర్యంగా అడిగారు వాళ్ళు.

"జ్వాల నగరం వెలుపలే వుండిపోయింది. శివుడు కూడా బయటే నిలబడి వున్నాడు. వాళ్ళిద్దరూ అలా ఒంటరిగా వుండిపోవటం నాకు నచ్చటం లేదు. నేను వారి దగ్గరికి పోవాలి" దృఢస్వరంతో చెప్పిందామె.

"అదికాదు తల్లీ... సాగరుల వారికి తెలిస్తే..." అని చెప్పబోయి ఆమె చురుకుగా చూడటంతో నోటిలోని మాటల్ని నోటిలోనే అదిమివేసుకున్నారు ఆమె చెలికత్తెలు.

కవచ శిరస్త్రాణాలను ధరించి, పొడవాటి బరిశెను, పదునైన ఖడ్గాన్ని తీసుకున్నది చారులతాదేవి. చెలికత్తెలు సిద్ధం చేయించిన అశ్వాన్ని అధిరోహించి అతివేగంగా కోట వెలుపలికి వెళ్ళింది.

"నువ్వు రావటం దేనికి దేవీ? శత్రువుల ఉధృతి చాలా అధికంగా వున్నది. వెలుగు వచ్చీరాగానే ఘోరమైన పోరు ప్రారంభం అవుతుంది. నువ్వు వెంటనే నగరంలోకి వెళ్ళిపోవటం చాలా బాగుంటుంది" ఆమెను చూడగానే తీవ్రమైన ఆందోళనతో బిగ్గరగా అరిచినంత పనిచేశాడు సాగరులవారు.

"నా గురించి మీరు చింతపడవలసిన అవసరం లేదు. నేనుకూడా సాము గరిడీలు నేర్చుకున్నదానినే. పోరాటం చేయటం నాకు కూడా వచ్చు. నన్ను గురించి మర్చిపోయి మీ వ్యూహాలను మీరు గమనించుకోండి" ఖచ్చితమైన కంఠంతో చెప్పి తన అశ్వాన్ని గజదళానికి దూరంగా నడిపించిందామె.

"ప్రభూ... మీరు ఆవేశపడవద్దు. ఆత్రుత అంతకన్నా పడవద్దు. దేవిగారు మనతో కలిసి యుద్ధం చేయటానికి రాలేదు. అవకాశం దొరికిన వెంటనే శత్రుసమూహాన్ని దాటి యువరాణి దగ్గరికి, శివుడి దగ్గరికి వెళ్ళిపోవటమే ఆమె ఉద్దేశ్యం. అక్కడ వారిద్దరితో మన వాసుదేవుడే వున్నాడు" అదేపనిగా అసహనంగా తల విదిలిస్తున్న సాగరులవారికి చెప్పాడు మంత్రి మహేశ్వరుడు.

ఆ మాటల్ని విన్న తరువాత కొద్దిగా ఉపశమించింది సాగరులవారి ఆత్రుత. తన దృష్టినంతా జరగబోయే పోరుమీద కేంద్రీకరించి, తగిన ఏర్పాట్లును ఆఖరిసారిగా సమీక్షించుకోవటంలో నిమగ్నమైపోయాడు.

చూస్తూ చూస్తూ వుండగానే తెల్లబడటం మొదలుపెట్టింది తూర్పుదిక్కు. ఎంత సిద్ధంగా వున్నా ఒక్కసారిగా శత్రువులలో చలనం వచ్చేసరికి, కొంచెంగా కలవరపాటుకు గురికాక తప్పలేదు సాగరుల వారి సైన్యానికి.

"పొడవండి... నరకండి... కొట్టండి... చంపండి" అనే కేకలతో వున్నట్లుండి దద్దరిల్లిపోయింది కోట వెలుపలి ప్రదేశం.

చెవులు చిల్లులు పడేటట్లు ఘీంకారాలను మొదలుపెట్టిన తన గజసైన్యాన్ని ముందుకు కదిలించాడు సాగరుడు. పట్టపుటేనుగు మీద ఆశీనుడై తనే అన్ని ఏనుగులకీ దారి చూపించాడు.

"వదలరా శివుడు... నీ ఏనుగుల్ని వదులు... వెనుకనుంచి కొట్టిపారేయ టానికి ఇదే సరయిన సమయం..." తీవ్రాతి తీవ్రంగా సాగుతున్న యుద్ధాన్ని చూసి, పెద్ద కంఠంతో శివుడిని హెచ్చరించాడు వాసుదేవుడు.

క్షణం కూడా ఆలస్యం చేయకుండా బాణం తర్వాత బాణాన్ని వదులుతూ, అందుబాటులోకి వచ్చిన సైనికుల్ని నేలకూలుస్తోంది జ్వాల.

"వదులు శివుడు... ఏనుగుల్ని వదులు..." అని హెచ్చరించిందతన్ని తను కూడా.

మగ ఏనుగు కుంభస్థలం మీద కూర్చుని పాదాలతో దాని శరీరాన్ని తడమబోతూ ఒక్కసారిగా ఆగిపోయాడు శివుడు.

అవతలిపక్కన వీరవిహారం చేస్తున్నాయి సాగరుల వారి ఏనుగులన్నీ. మట్టి పిడతల్ని గాలిలోకి విసిరినట్లు, తొండాలతో శత్రువుల్ని చుట్టి పైకి ఎగరేస్తున్నట్లు నేలకేసి అదిమి ప్రాణాలు తీస్తున్నాయి.

ఆ సమయంలో వెనుకనుంచి కూడా ఒత్తిడి అధికం అయితే శత్రువులు తడబడిపోవడం తప్పనిసరి. తట్టుకోలేక ఆయుధాల్ని వదిలి పారిపోవటం కూడా ఖచ్చితంగా జరిగి తీరుతుంది కాని–

"ఏమిటిరా? ఏమిటి నీ సందేహం? ఏమయింది నీకు?" ఆలస్యాన్ని భరించలేక వాసుదేవుడు బిగ్గరగా ప్రశ్నించడంతో, అంతం అయిపోయాయి శివుడి ఆలోచనలు.

సాగరుల వారి గజసైన్యం దెబ్బ ఎలావుంటుందో తెలుసు శిఖావంతుడికి. ప్రస్తుతం యుద్ధం కొనసాగుతున్న పద్ధతి ప్రకారం చూస్తే మరో అర్థఘడియలో

అంతం అయిపోయేటట్లు కనిపిస్తోంది. అతను ఏదైనా విరుగుడు ప్రయోగించ దలుచుకుంటే దాన్ని వెంటనే ఆచరణలో పెట్టాలి.

అదేమిటో తెలియకుండా తన ఏనుగుల్ని ముందుకు దూకించటం మంచిదికాదు. వేచి చూడాలి... మరి కొద్దిసేపు నిరీక్షించాలి.

"ఒరేయ్, బుద్ధిహీనుడా... ఏయిందిరా నీకు? ఇంతమంది సైన్యాన్ని చూసేసరికి అరికాళ్ళు చల్లబడ్డాయా? ఒళ్ళంతా చెమటలు పడుతున్నాయా?" ఆత్రుత అణచుకోవటం అసాధ్యమై గొంతు చించుకుని అరిచాడు వాసుదేవుడు.

తీరిక లేకుండా బాణవర్షం కురిపిస్తున్న జ్వాల కూడా చూసింది అసహనంగా ఒక్కచూపు. అయినా సరే తన ఏనుగుల్ని కదిలించలేదు శివుడు.

శివుడి ధైర్యం దిగజారిపోయిందనే నిర్ణయానికి వచ్చి, తన అశ్వాన్ని వేగంగా శత్రువుల మధ్యకు దూకించబోయాడు వాసుదేవుడు.

సరిగ్గా అదే సమయంలో తొండాలను గాలిలోకి ఎత్తి వికృతంగా శబ్దాలు చేసింది శివుడి ఏనుగు.

శిఖావంతుడి పథకం ఏమిటో తెలుసుకోవటానికి సంసిద్ధంగా వున్న శివుడికి నిజంగానే ముచ్చెమటలు పట్టాయి.

"వచ్చేయండి... వెనక్కి వచ్చేయండి" అని వాసుదేవుడిని, జ్వాలను, తమతో వున్న భటుల్ని జీరపడిన కంఠంతో హెచ్చరిస్తూ తన ఏనుగుల్ని వేగంగా వెనక్కి పరిగెత్తించాడు.

గుంపులు గుంపులుగా సాగరుల వారి గజసైన్యాన్ని కమ్ముకోబోతున్న శిఖావంతుడి సైన్యం, ఉన్నట్లుండి జట్లు జట్లుగా చీలి, వెనక్కి వచ్చేసింది. అప్పటివరకూ పెద్ద పెద్ద గుడారాలలో ఎవరికీ కనిపించకుండా నిలబెట్టి వుంచిన ఎలుగుబంట్లు ఒక్కసారిగా బయటికి వచ్చాయి గుండెలు జలదరించేటట్లు వికృత శబ్దాలు చేస్తూ. వాటిని సాగరుల వారి ఏనుగుల మీదికి ఉసికొల్పటం మొదలుపెట్టారు వాటితో పాటుగా ఆ గుడారాలలో వున్న ఆటవికులు.

గోధుమరంగులో వున్న కోరలు బయటికి కనపడేలా నోళ్ళు తెరిచి, చురకత్తుల వంటి పంజాలను పొడవుగా జాచి, భూతాల మాదిరి ఏనుగుల మీద కలబడ్డాయి ఆ ఎలుగులు.

ఎదుట ఎటువంటి శత్రువు వున్నా గాలిలోకి ఎగురవేసి బంతులాట ఆడుకునే విధంగా శిక్షణ పొందిన ఏనుగులు అవి. అసహనాన్ని కలిగించే అడవి జంతువులు ఎదురయితే ఏం చెయ్యాలో వాటికి తెలియలేదు.

కొండచిలువల మాదిరి గాలిలో ఊగుతున్న వాటి తొండాలకు అందకుండా గభాలున పైకి ఎగిరి తమ పంజాలతోను, కోరలతోను వాటిని తీవ్రంగా గాయపరచటం మొదలుపెట్టాయి ఎలుగుబంట్లు.

ఒకేసారి పట్టపుటేనుగును కమ్ముకున్న నాలుగు ఎలుగుల్లో ఒకదాన్ని తన బరిశెతో నేలకూల్చటానికి ప్రయత్నించాడు సాగరులవారు.

దట్టంగా వున్నాయి ఆ ఎలుగుబంటి వంటిమీద రోమాలు. బరిశె మొన ఆ రోమాల్ని దాటి లోపలికి వెళ్ళలేకపోయింది.

జానెడు వెడల్పున నోటిని తెరిచి, బరిశె మొనను తన కోరల మధ్య దొరికించుకుని బలంగా వెనక్కి లాగిందా ఎలుగు.

వదిలివేయక తప్పలేదు సాగరుల వారికి ఆ బరిశెని. వదలకపోతే ఆ విసురుకు తప్పకుండా తనుకూడా పట్టపుటేనుగు కుంభస్థలం మీదినించి జారి క్రిందపడిపోయి వుండేవాడు. బరిశెను వదిలివేయటమే కాదు, భూత పిశాచాల వంటి ఆ క్షుద్రజీవుల కోరల మూలకంగా గాయపడకుండా వుండటానికి తన ఏనుగును పక్కకు తిప్పి దూరంగా పరిగెత్తించకుండా కూడా వుండలేకపోయాడు.

గజ యుద్ధంలో ఎంతటి సామర్థ్యం వున్నప్పటికీ ఆ సమయంలో అతను చేసిన ఆ ఒకే ఒక తప్పుతో అనుకోని విధంగా అస్తవ్యస్తం అయిపోయింది అతని వ్యూహం.

మిన్నువిరిగి మీద పడినా చలించకుండా నిలబడి వుండవలసిన పట్టపు టేనుగు పక్కకు పరిగెత్తటాన్ని గమనించేసరికి, మిగిలినవి కూడా అదేమాదిరి పరుగు మొదలుపెట్టాయి. కన్నుమూసి కన్ను తెరిచేటంతలో అంతా తారుమారు అయిపోయింది. యుద్ధరంగంలో వీరవిహారం చేస్తూ వుండవలసిన యుద్ధ గజాలన్నీ అడవిదారిలోకి పోయి చెట్ల చాటున గుట్టల చాటునా తలలు దాచుకోవడం మొదలుపెట్టాయి.

జయ జయ ధ్వానాలు మిన్నుముట్టాయి శిఖావంతుడి సైన్యంలో. గట్టు తెగిన వరద మాదిరి పోయి కోటగోడలకు దగ్గరిగా నిలబడింది అంతకుముందు జట్లు జట్లుగా చీలి దూరంగా జరిగిన ఆ సైన్యం.

❖ ❖ ❖

"ప్రమాదం చక్రవర్తి... పెను ప్రమాదం ముంచుకు వస్తోంది... వెంటనే సైన్యాన్ని సిద్ధంచేసి సరిహద్దుల మీద మొహరించకపోతే సర్వనాశనం అయిపోతాం" ఆందోళన నిండిన కంఠంతో బిగ్గరగా చెప్పాడు సభాభవనంలోకి వచ్చిన సేనాపతి ఒకతను.

సభాసదులతో శిఖావంతుడి దండయాత్రను గురించే చర్చిస్తున్నాడు జ్వలిత చక్రవర్తి మహాబలుడు. ఉలికిపాటును కప్పిపెట్టుకోవటానికి ప్రయత్నిస్తూ చూశాడు అతని వంక.

"సంపంగి నగరం పతనం అయింది. శిఖావంతుడి సైన్యం ధాటికి కోటగోడలు పగిలిపోయాయి. ఇప్పుడే అక్కడినించి పావురం ఒకటి ఈ దుర్వార్తను మోసుకువచ్చింది" అంటూ తన చేతుల్లో వున్న చిన్న వస్త్రపు పీలికను ముందుకు జాచాడు ఆ సేనాపతి.

తన చెవుల్ని తనే నమ్మలేకపోయాడు మహాబలుడు. వస్త్రపు పీలికమీద వ్రాయబడి వున్న అక్షరాలను చదివే సమయంలో తన కనులుకూడా తనను ఏమారుస్తున్నాయేమోనని అనుకున్నాడు.

"కోట శిఖావంతుడి సైన్యాలకు దొరికిపోయిందనే వ్రాయబడి వుంది. మరిసాగరుడి సంగతేమిటి? మహేశ్వరుడు ఏమైనాడు? మా సోదరి చారులత, మా బిడ్డ జ్వాల... వారి సంగతేమిటి?" ఆందోళనను అతిప్రయత్నంమీద అణుచుకుంటూ అడిగాడు.

"అవేమీ తెలియలేదు ప్రభూ... అసలు సాగరుల వారి గజదళం ఏమయిందో కూడా ఎరుక కాకుండా వున్నది" చెప్పాడు సేనాపతి.

"సంపంగి నగరం చేజిక్కిన తర్వాత శిఖావంతుడు ఇక ఆగడు. ఏ క్షణంలోనైనా మనమీదికి వచ్చి పడతాడు" అన్నాడు పక్కనే నిలబడి వున్న మంత్రి గుణధాముడు. అక్కడితో ఆగలేదతడు.

"వేగంగా వెళ్ళే అశ్వాల మీద కొంతమందిని సంపంగినగరం దగ్గరికి పంపించాలి. యువరాణి జ్వాల ఆచూకీని వెంటనే తెలుసుకోవాలి. ఆమెను వెంటనే సురక్షితంగా తీసుకువచ్చేయాలి" అని ఆజ్ఞలు ఇవ్వబోతుండగా– తల అడ్డం తిప్పి వెంటనే అడ్డుకున్నాడు మహాబలుడు.

"మన సైన్యాన్ని వెంటనే సరిహద్దుల దగ్గర మోహరించి యుద్ధానికి సిద్ధంగా వుండమని చెప్పండి... ముందు సాగరుడు ఏమైపోయాడో తెలుసుకోవాలి" అన్నాడు.

"ప్రభూ... యువరాణి..." అంటూ అడ్డుకోబోయాడు గుణధాముడు మరోసారి.

పెదిమలు బిగించి మళ్ళీ తల అడ్డం తిప్పాడు మహాబలుడు. "సాగరుడు క్షేమంగా వుంటే యువరాణి కూడా క్షేమంగానే వున్నట్లు లెక్క. సాగరుడికి ఏదైనా ప్రమాదం వాటిల్లి వుంటే యువరాణే కాదు... మనం కూడా చిక్కులో పడినట్లే. శిఖావంతుడిని ఎదిరించగలవాడు అతనొక్కడే" అన్నాడు.

అప్పటికప్పుడు అంగీకరించకపోయినా, ఆ మాటల్లోని యదార్థాన్ని గమనించి, గట్టిగా నిట్టూర్చాడు మంత్రి గుణధాముడు.

కనీసం పది పన్నెండు రోజులు యుద్ధం జరిగితే తప్ప శత్రువుల వశం కాదు సంపంగి నగరం. అప్పుడే అంత హఠాత్తుగా ఎందుకు లోబడిపోయింది? శత్రు సైన్యాలకు సింహస్వప్నం వంటి గజదళం అంతా ఎటు పోయింది?

తన మనసులోని ప్రశ్నలను సభా సదులెవ్వరికీ తెలియచెయ్యలేదతను. తనలోనే దాచుకుని సైన్యాన్ని సరిహద్దుల దగ్గరికి నడిపించే ఏర్పాట్లు చేయటానికి బయలుదేరాడు.

❖ ❖ ❖

పట్టపుటేనుగును పక్కకు పరిగెత్తించిన వెంటనే అర్థం అయింది సాగరుల వారికి తాను చేసిన తప్పు. దిద్దుకునే వ్యవధి మాత్రం లేకపోయింది. చూస్తూ చూస్తూ వుండగానే దళం అంతా యుద్ధరంగాన్ని వదిలి దూరంగా వచ్చేసింది.

వెనుకనుంచి శత్రువుల మీద దుమకటానికి సిద్ధమైన వాసుదేవుడు ఆ ప్రయత్నాన్ని విరమించుకుని, తన అశ్వాన్ని సాగరుల వారి దగ్గరికి పరిగెత్తించాడు.

"గుంపులో నుంచి వేరుపడిన ఏనుగుల్ని పడగొట్టడం చాలా తేలిక. శిఖావంతుడి భల్లూక సైన్యం తోడయితే ఒక్క ఏనుగు కూడా మనకి కనిపించదు. అన్నీ అడవిలోకి పారిపోతాయి" పట్టపుటేనుగు మీదినించి దిగి నిస్సహాయంగా నిలబడి వున్న సాగరులవారితో అన్నాడతను.

"ఇలా జరుగుతుందని నేను కలలో కూడా ఊహించలేదు. నా తెలివి నా సామర్థ్యం అన్నీ ఎందుకూ పనికిరాకుండా పోయాయి" నుదురు రుద్దుకుంటూ చెప్పాడు సాగరులవారు.

అంతలోనే అతివేగంగా వచ్చాడు అక్కడికి మంత్రి మహేశ్వరుడు. "మనం ఇక్కడ నిలబడి వుండటం ప్రమాదకరం. శత్రువులు కొందరు భల్లూక సైన్యంతో వెనక్కి వస్తున్నారు" అని చెప్పాడు.

"ఎక్కడ దాచిపెట్టాలి మన గజాల్ని?" అడిగాడు వాసుదేవుడు.

ఉన్నట్లుండి మహేశ్వరుడి కేసి తిరిగాడు సాగరులవారు. "జ్వాలని, మా దేవిగారిని వెంటబెట్టుకుని వెంటనే రాజధానికి ప్రయాణం కట్టండి... నేను మన గజాల్ని ఒక సురక్షిత ప్రదేశంలో దాచిపెడతాను" అన్నాడు.

సాగరుల వారి సతీమణి ఆయన్ను వదిలి రాజధానికి ప్రయాణం కట్టడం జరిగేపని కాదని తెలుసు మహేశ్వరుడికి. యువరాణి జ్వాల కూడా అందరినీ అక్కడ వదిలిపెట్టి తన ప్రాణాలను మాత్రమే కాపాడుకోవటానికి ఇష్టపడదని కూడా తెలుసు.

అయితే అప్పటికప్పుడు ఎదురు చెప్పలేదతను సాగరుల వారికి. అంగీకార సూచకంగా తలవూపాడు.

వెంటనే తిరిగి పట్టపుటేనుగు మీదికి ఎగబ్రాకి, తన దట్టీలో భద్రపరచుకుని వున్న ఒక చిన్న కొమ్ముబూరని తీసి గట్టిగా ఊదాడు సాగరులవారు.

భూతాలవంటి ఎలుగుల ధాటిని తట్టుకోలేక పరిగెత్తుకు వచ్చి చెట్లు చాటున, గుట్టల చాటునా నిలబడి వున్న యుద్ధ గజాలన్నిటికీ వినబడిందా శబ్దం. ఒకదాని తరువాత ఒకటిగా పట్టపు టేనుగు దగ్గరికి వచ్చాయి అవన్నీ.

ఒక్క నిమిషంపాటు సాగరులవారి మనసును పట్టుకుని గట్టిగా కుదిపింది ఒక ఆలోచన. పారిపోయి రావటమే జరిగింది గాని, ఒక్క ఏనుగును కూడా నష్టపోవటం జరగలేదు. అన్నింటినీ కూడగట్టుకుని మరోసారి యుద్ధానికి సిద్ధమైతే??

పదునైన కోరలతో, పంజాలతో ఉక్కిరిబిక్కిరి చేసిన ఎలుగుబంట్లు కనుల ముందు మెదిలేసరికి ఒక్కసారిగా మటుమాయం అయిపోయిందది.

"శత్రువుల పథకాన్ని అడ్డుకోవటం ఎలాగో ఆలోచించుకోకుండా మొండిగా వెనక్కిపోతే ఈసారి నిజంగానే పెను ప్రమాదంలో చిక్కుపడతాము. ప్రస్తుతానికి ఓటమిని అంగీకరించటమే లెస్స" ఆయన మనసులోని ఆలోచనల్ని గమనించినట్లు వెంటనే అన్నాడు వాసుదేవుడు.

అంగీకారసూచకంగా తలవూపి పట్టపుటేనుగును అడవిలోకి నడిపించాడు సాగరుడు. దాని వెనుకే వరుసల్లో కదిలాయి మిగిలినవన్నీ.

అది జరిగి మూడురోజులయింది. నాలుగవ రోజు ఉదయం వేళలో పడుతూ లేస్తూ అడవిలోకి వచ్చారు కోటలోనుంచి తప్పించుకున్న భటుల్లో కొంతమంది.

శిఖావంతుడి సైనికులు గనుక తమకోసం వెతుకులాట మొదలుపెడితే తప్పించుకుని, శ్రావస్తి నగరం వైపు వెళ్లిపోవటానికి వీలుగా ఒక చెట్లతోపులో స్థావరం ఏర్పాటు చేయించింది చారులతాదేవి.

"తల్లీ... నగరం మొత్తం సర్వనాశనం అయిపోతోంది... దోపిడీ దొంగల మాదిరి ప్రజలమీద పడి దారుణంగా ప్రవర్తిస్తున్నారు శిఖావంతుడి సైనికులు ఎదురు చెప్పిన వారి తలలు నిర్దాక్షిణ్యంగా నరికేస్తున్నారు. నగరంలోని ఆహార పదార్థాలన్నింటినీ శకటాల మీదికి ఎక్కించి ఎక్కడికో తరలిస్తున్నారు. మన ప్రజలు ఆకలితో అలమటించి ప్రాణాలు వదిలే పరిస్థితి రాబోతున్నది" ఆ చెట్లతోపులోకి రాగానే ఆమెకు విన్నవించారు తప్పించుకు వచ్చిన భటులు.

బుగ్గల మీదికి జారుతున్న కన్నీటిని తుడుచుకోవటం కూడా మరిచిపోయి, మహేశ్వరుడి కేసి తిరిగింది చారులతాదేవి.

"తొందరపడినందు వల్ల ఉపయోగం ఏమీ లేకపోగా, మన ప్రాణాలు కూడా గాలిలో కలిసిపోతాయి. కొంచెం వ్యవధి కావాలి మనకు..." సాలోచనగా అన్నాడు మహేశ్వరుడు.

"వ్యవధి దేనికి? దూరంగా పారిపోవటానికా?" కోపంగా అడిగిందామె.

"కాదు తల్లీ... మన గజదళం ఆ ఎలుగుబంట్లను ఎదిరించటంలో తడబడటం వల్లనే ఈ దుష్పరిణామం చోటు చేసుకున్నది. దానికి విరుగుడు

ఆలోచించాలి... ఆ వెంటనే ఈ కష్టం తొలగిపోతుంది" సౌమ్యంగా సమాధానం ఇచ్చాడు మహేశ్వరుడు.

"ఎప్పుడు ఆలోచిస్తారు మీరు? ఇంకా ఎంతకాలం ఆలోచిస్తారు? మీరు విరుగుడు ఆలోచించే వరకూ మన ప్రజలు ప్రాణాలతో వుంటారా?" మరింత కోపంగా అడిగిందామె.

తలవంచుకున్నాడు మహేశ్వరుడు.

"మా శివుడు ఏడి? వెంటనే పిలిపించండి" ఆజ్ఞ ఇచ్చింది ఆమె.

"తల్లీ... నిన్న సాయంత్రం తన ఏనుగులతో ఎక్కడికో పోయాడు. ఇంకా తిరిగిరాలేదు. యువరాణి వారు కూడా అతనితోపాటు వున్నారు. ఆమె కూడా రాలేదు" వెంటనే చెప్పింది దూరంగా నిలబడి వున్న ఒక పరిచారిక.

గట్టిగా నిట్టూర్చి మహేశ్వరుడికేసి చూసింది చారులతాదేవి.

"వాసుదేవుడు కూడా వారితోపాటు వెళ్ళాడు... మరేం ఫరవాలేదు" అన్నాడు అతను.

❖ ❖ ❖

"సాగరుల వారు యుద్ధ గజాలన్నిటినీ ఎక్కడ దాచిపెట్టి వుంటారో?" తనలో తను అనుకుంటున్నట్టు పైకే అన్నది జ్వాల.

తన ఏనుగుల్ని ఒక నీటిగుంట దగ్గర నిలబెట్టి, తాము ఆరగించటానికి ఏవైనా పళ్ళు, ఫలాలు కనిపిస్తాయేమోనని చుట్టూ వున్న చెట్లన్నిటినీ గాలిస్తున్నాడు శివుడు.

పళ్ళు, ఫలాలు కనిపించలేదతనికి. అడవిలోకి వచ్చిన ఏనుగుల జాడల్ని అనుసరించి వస్తున్న శిఖావంతుడి సైనికులు కొందరు కనిపించారు.

రెండువందల మందికి కొంచెం పైగానే వున్నారు వాళ్ళు.

"వీళ్ళు ఎవరి కోసం వస్తున్నట్లు? మన కోసమా? మన యుద్ధ గజాలకోసమా?" వారిని ఒక చెట్టుచాటునుంచి చూసిన జ్వాల వెంటనే అడిగింది వాసుదేవుడిని.

"మనం కనిపిస్తే వెంటనే తమ ఆయుధాలకు పని చెపుతారు. మన ఏనుగులు గాని, యుద్ధ గజాలు గాని కనిపిస్తే వెనక్కిపోయి ఆ దుర్మార్గపు ఎలుగుబంట్లను వెంటబెట్టుకు వస్తారు" చిన్నగా చెప్పాడు వాసుదేవుడు.

"ఇప్పుడు ఏం చేద్దాం? అటు తిరిగి ఇటు తిరిగి వాళ్ళు మనవాళ్ళందరూ విడిది చేసివున్న చెట్లతోపును చూస్తే చాలా ప్రమాదం కదా..." అన్నది జ్వాల.

"ఏరా శివుడు... ఏం చేద్దాం?" శివుడిని అడిగాడు వెంటనే వాసుదేవుడు.

ఏం చేయాలో అంతకుముందే తను నిర్ణయించుకుని వున్నట్లు, ఒక్కసారిగా తను నిలుచుని వున్న చెట్టుచాటునుంచి అవతలికి దూకాడు శివుడు. "శిఖావంతుడి సైనికులు మిమ్మల్ని చూడకముందే పారిపోండి.... పారిపోండి" అని అరుస్తూ పొదల్లోకి పరిగెత్తాడు.

అశ్వాలను నెమ్మదిగా నడిపిస్తూ తమచుట్టూ వున్న చెట్టు పుట్టల్ని నిశితంగా పరిశీలిస్తూ వస్తున్న శిఖావంతుడి సైనికులు అతన్ని చూడనే చూశారు. "పట్టుకోండి... పట్టుకోండి" అని ఒకరినొకరు హెచ్చరించుకుంటూ తమ వాహనాలను అతనివెనకే పరుగులు తీయించారు.

ఆ దృశ్యాల్ని చూసిన తర్వాత ఒక్క క్షణికం పాటు కూడా ఆలస్యం చేయలేదు వాసుదేవుడు. తన విల్లంబుల్ని, ఖడ్గాన్ని సరిచేసుకుని పొదల చాటున నిలబెట్టి వుంచిన తన అశ్వాల దగ్గరికి పరిగెత్తాడు.

అతను ఏం చేయబోతున్నాడో తెలియకపోయినా, తనుకూడా అదేమాదిరి తన ఆయుధాల్ని సిద్ధంగా పట్టుకుంటూ అనుసరించింది జ్వాల.

❖ ❖ ❖

వింటినుంచి వెలువడిన బాణం మాదిరి సూటిగా, వేగంగా పరుగు తీశాడు శివుడు. పరిగెత్తి పరిగెత్తి ఆయాసం ముంచుకు వస్తున్నా ఎక్కడా ఆగకుండా, ఒక ఘడియకాలం తర్వాత సువర్ణానది ఒడ్డుకు చేరుకున్నాడు.

అడ్డం వచ్చిన చెట్లకొమ్మల్ని, పొదల్ని తమ కత్తులతో నరికేస్తూ అతన్ని అనుసరించి వస్తున్నారు శిఖావంతుడి సైనికులు.

అటూ ఇటూ చూసి నది ఒడ్డుమీద కనిపించిన ఒక లావుపాటి కొండరాయిని పైకి ఎత్తి బలంగా నదిలోకి విసిరాడు శివుడు.

గింగిరాలు తిరుగుతూ పోయి దభేలున నీటిలో పడింది అది. వెనుక వస్తున్న సైనికులకు పెద్ద శబ్దం కూడా వినిపించింది. మరింత వేగంగా ఒడ్డుమీదికి వచ్చిన వారందరికీ, రాయి పడటం వల్ల ఉత్పన్నమైన అలజడి చాలా స్పష్టంగా అగుపించింది.

"నదిలో దూకాడా?" సాలోచనగా అన్నాడు అందరికంటె ముందున్న అశ్వికుడు.

"మొసళ్ళు వదిలిపెట్టవు. ఈపాటికి ముక్కలు ముక్కలు అయిపోయి వుంటాడు" అన్నాడు మరో వ్యక్తి.

"జాగ్రత్తగా చూడండి... మొసళ్ళు పట్టుకొని వుంటే నెత్తుటి జాడలు కనిపించి తీరాలి" అన్నాడు మరో వ్యక్తి.

"దూకాడో లేదో మనకి ఖచ్చితంగా తెలియాలి. దూకినట్లు నటించి, మనల్ని ఏమార్చటానికి ప్రయత్నం చేస్తే అదికూడా మనం తెలుసుకోవాలి" అన్నాడు మొదటి అశ్వికుడు.

గుంపుగా వచ్చిన వారందరినీ చూడగానే, అంతకుముందు వరకూ ఒడ్డుమీద విశ్రాంతిగా పడుకుని వున్న మొసళ్ళు అన్నీ తిరిగి నదిలోకి వెళ్ళిపోయాయి. వేగంగా ప్రవహిస్తున్న నీటితో పాటు దిగువకు కొట్టుకు పోకుండా వుండేందుకు ప్రయత్నం చేస్తూ వారివంకే తదేక దీక్షగా చూడటం మొదలుపెట్టాయి.

నీటి అంచు దగ్గరికి పోకుండా దూరంగా నిలబడినంత వరకూ అవి తమను ఏమీ చేయలేవని ఆ సైనికులకు తెలుసు. అందువల్ల వారిలో ఎటువంటి కలవరపాటు కనిపించలేదు గాని, వారి వాహనాల్లో మాత్రం కదలిక వచ్చింది. పెద్దగా సకిలిస్తూ అసహనంగా కదలటం మొదలుపెట్టాయి అవి.

"వాటిని చూసి ఆ మొసళ్ళు ఒడ్డుమీదికి వస్తే లేని పోని గొడవ. దూరంగా వదలటం చాలా మంచిది" తన అశ్వాన్ని అదుపు చేయడం చేతకాక తమ నాయకుడివంటి వ్యక్తితో చెప్పాడు ఒక సైనికుడు.

"నిజమే... అసలు అటువంటి పని జరగటం కోసమే వాడు ఇటుగా వచ్చి వుంటాడు" అంటూ తన అశ్వాన్ని దిగి, దాన్ని ఒడ్డుకు దూరంగా తీసుకువెళ్ళమని సూచించాడు ఆ వ్యక్తి.

ఒకరి తర్వాత ఒకరుగా తమ వాహనాల మీదినించి దిగి వాటన్నిటినీ నదీతీరానికి దూరంగా వున్న పొదల మధ్యకు పంపించారు సైనికులు అందరూ.

అటువంటి పరిణామం ఏదైనా జరుగకపోతుందా అని ఓపికగా ఎదురు చూస్తున్న శివుడికి ఎంతో ఆనందం అయిపోయింది. నదిలోకి కొండరాయిని

విసిరిన వెంటనే పక్కకు తిరిగి, దగ్గర్లో వున్న ఒక పెద్ద చెట్టుమీదికి ఎగబ్రాకాడు అతను. శబ్దం చేయకుండా ముడుచుకు కూర్చున్నాడు.

ఇప్పుడు నిశ్శబ్దంగా క్రిందికి జారి, ఒడ్డుమీద వున్న సైనికులు తనను గమనించే లోపల పొదల మధ్యకు చేరుకున్నాడు.

గుంపుగా నిలబడి వున్నాయి సైనికుల అశ్వాలన్నీ... అతని వంక ప్రశ్నార్థకంగా చూశాయి. దగ్గర్లో వున్న ఒక అశ్వం మీదికి ఎగబ్రాకి, కాలి మడమలతో దాన్ని గట్టిగా అదిలించాడు అతను. చెవులు చిల్లులు పడిపోయేటట్లు బిగ్గరిగా రెండు పొలికేకలు పెట్టాడు.

ఝల్లుమన్నాయి కాబోలు వాటి గుండెలు– పిచ్చిగా సకిలిస్తూ ఒక్కసారిగా పరుగు మొదలుపెట్టాయి.

గట్టుమీది సైనికులు వెనక్కి పరిగెత్తుకు వచ్చేసరికి, పొదల్ని దాటి అవన్నీ తాము వచ్చిన దారిలోకి వెళ్లిపోయాయి.

“కొట్టండి... వాడిని పడగొట్టండి” బిగ్గరిగా అరిచాడు నాయకుడి వంటి వ్యక్తి– విపరీతమైన కోపంతో రగులుకుపోతూ.

వీపులకు వ్రేలాడుతున్న విల్లంబుల్ని వెంటనే చేతుల్లోకి తీసుకున్నారు ఆ సైనికుల్లో కొంతమంది.

అప్పటికప్పుడు వారిలో ఎవరైనా బాణాలు వదిలితే తప్పకుండా దెబ్బతిని వుండేవాడు శివుడు.

“తప్పుదారి పట్టించి క్షేమంగా వెనక్కి వస్తావని అనుకున్నాను గాని, ఇటువంటి పాడుపని చేస్తావని ఊహించలేదు... నువ్వు వట్టి మూర్ఖుడివి” అంటూ ఒక చెట్టుదగ్గర నిలబడి ఆ సైనికుల కంటె ముందుగా బాణప్రయోగం మొదలుపెట్టాడు వెనుకగా వచ్చిన వాసుదేవుడు.

చూస్తూ చూస్తూ వుండగానే నలుగుర్ని నేలకూల్చాడతను. అతనికి ఒక అడుగు అవతలగా నిలబడి తానుకూడా మరో ఇద్దరిని పడగొట్టింది జ్వాల.

బాణాలను వదలాలనే ఆలోచనను వెంటనే విరమించుకుని, ఒడ్డుమీద వున్న బండల చాటుకు పరిగెత్తారు మిగిలిన సైనికులు.

“మనం ఇద్దరమే వున్న విషయాన్ని వాళ్ళు గమనిస్తే ఒక్కపెట్టున వచ్చి చుట్టుముడతారు... ఆలస్యం చేయటం అనవసరం” అంటూ బాణాల్ని వదలటం ఆపి, తన అశ్వం మీదికి ఎగిరాడు వాసుదేవుడు.

వాసుదేవుడు, జ్వాల తనను చేరుకునే సమయానికి, కొంచెం దూరం అడవిలోకి వచ్చేశాడు శివుడు.

"మూర్ఖంగా ప్రవర్తిస్తే ప్రవర్తించాడు గాని, మనకి ఈ వాహనాలు ఉచితంగా లభించాయి... చెట్లతోపులో వున్న మనవాళ్ళు అవసరం అయితే వేగంగా అవతలికి వెళ్ళిపోవటానికి బాగా ఉపయోగపడతాయి" కళ్ళేలు క్రిందికి జారి కాళ్ళకు అడ్డం పడుతున్నా ఆగకుండా పరుగులు తీస్తున్న ఆ సైనికుల వాహనాలను చూస్తూ ఆనందంగా అన్నది జ్వాల.

"వాటిని మీరు తీసుకుపోండి...నాకు ఇంకో చిన్న పని వున్నది" మరో పావుఘడియ తరువాత ఆమెకు చెప్పాడు శివుడు.

"నిన్నటి నించి నేను గమనిస్తూనే వున్నాను. పని ఏమిటో చెప్పకుండా పిచ్చిపట్టినట్లు పొదల్లో తిరుగుతున్నావు" చిరుకోపంతో అన్నది జ్వాల.

"నిజమేరా... శివుడూ... నిన్ను వెంటబెట్టుకుపోకుండా మేము గనుక వెనక్కి వెళితే సాగరుల వారి సతీమణి మామీద కోపం చేస్తుంది. నువ్వు చేయదలుచుకున్నది ఏమిటో మాకు తెలిస్తే, ఏదో ఒక విధంగా ఆమెకు నచ్చచెప్పవచ్చు" అన్నాడు వాసుదేవుడు కూడా.

"నేను వెంటనే అత్యవసరంగా ఏదైనా ఎలుగుబంటిని వెతికిపట్టుకోవాలి" అన్నాడు శివుడు.

అదిరిపడి ఆశ్చర్యంగా ఒకరివంక ఒకరు చూసుకున్నారు వాసుదేవుడు, జ్వాల. "ఎలుగుబంటినా? ఎందుకు?" అడిగింది ఆమె.

"శిఖావంతుడికి అసలు ఆ ఆలోచన ఎలా వచ్చిందో తెలుసుకోగలిగితే వాడి పథకాన్ని మనం అడ్డుకోవచ్చు" అన్నాడు శివుడు.

"తల్లీ... నువ్వు ఈ అశ్వాలన్నిటినీ మన చెట్లతోపుకు చేర్చగలవా?" వెంటనే జ్వాలను అడిగాడు వాసుదేవుడు.

"మీరేం చేస్తారు?" ఎదురు ప్రశ్న వేసిందామె.

"వాడి ఆలోచన చాలా విచిత్రంగా వున్నది. వాడిని ఒంటరిగా వదిలితే ఇప్పుడు చేసిన సాహసం వంటిదే ఇంకొకటి చేసి పీకలమీదికి తెచ్చుకుంటాడు" అన్నాడు అతను.

"నేను కూడా మీ వెంట రావటానికి ఏమిటి అభ్యంతరం?" సాలోచనగా అడిగింది జ్వాల.

"ఈ అశ్వాలను మన వారి దగ్గరికి చేర్చాలి గదా!"

"చేర్చిన తర్వాత ముగ్గురం కలిసి వెళ్ళవచ్చు... ఇప్పటికిప్పుడు అర్థాంతరంగా ఎలుగుబంట్లను వెతకవలసిన అవసరం లేదని నా అభిప్రాయం" తన నిర్ణయం ఏమిటో చెప్పీ చెప్పకుండా చెప్పింది ఆమె.

ఆ పైన వేరే మాట మాట్లాడలేదు వాసుదేవుడు.

❖ ❖ ❖

సంపంగి నగరం శత్రువుల చేతికి చిక్కిన తరువాత మరో రోజు కూడా గడిచిపోయింది. కోటలో నుంచి తప్పించుకు వచ్చిన భటులతో, ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకుని పారిపోయి వచ్చిన ప్రజలతో అడవిలోని చారులతాదేవి స్థావరం పూర్తిగా నిండిపోయింది.

"ఒక్కళ్ళు కూడా తిండికి లేక పస్తులుండాల్సిన పని లేదు. అవసరం అయితే చీకటి సమయంలో అందరమూ వెళ్ళి కోటమీద పడి ఆహార పదార్థాలను దొంగిలించుకు వద్దాం... అందరికీ ఆహారం ఇవ్వవలసిన బాధ్యత మనది" కిటకిటలాడిపోతున్న చెట్లతోపు వెలుపల నిలబడి, గట్టిగా నిట్టూర్పులు విడుస్తున్న మంత్రి మహేశ్వరుడికి చెప్పిందామె.

అటువంటి సాహసం ఏదో చేస్తారని ఊహించి, శిఖావంతుడి సైన్యం ముందుగానే ఆహార పదార్థాలను కోటకు దూరంగా తరలిస్తోందని ఆమెకు గుర్తు చేయటానికి సంకోచించాడు మహేశ్వరుడు. ఆ పని సాధ్యపడకపోతే, మరో ప్రమాదకరమైన ఆలోచన చేస్తుందన్న భయంతో "అంత సాహసం అవసరం లేదు తల్లీ... శ్రావస్తి నగరానికి వర్తమానం పంపాను. ఆ మండలాధిపతి పాతిక శకటాలమీద ఆహారం పంపిస్తున్నాడు. వందమంది భటుల్ని కూడా సర్వాయుధాలతో మనకి తోడుగా వుండటానికి పంపుతున్నాడు" అని చెప్పాడు.

"వందమందేనా? శ్రావస్తి నగరంలో నాకు తెలిసి కనీసం వెయ్యిపదమూడు వందల సైన్యం వుండాలి" అనుమానంగా చూస్తూ అన్నదామె.

"ఆ సైన్యంలో మూడొంతులు మహాబలురవారి దగ్గరికి వెళ్ళిపోయాయి. అక్కడ రాజధాని సరిహద్దుల్లో శిఖావంతుడే స్వయంగా యుద్ధానికి వెళుతున్న వార్తలు వినిపిస్తున్నాయి. చక్రవర్తి క్షేమం కూడా చూసుకోవాలి కదా!" అన్నాడు మహేశ్వరుడు.

ఆ పైన ఏమీ మాట్లాడలేదు చారులతాదేవి. వెనుదిరిగి ఒక పెద్ద వృక్షం క్రింద తమ భటులు తనకోసం సిద్ధం చేసిన అడవి ఆకుపందిరి కిందికి పోయి, కూర్చోవటానికి అనువుగా తయారుచేయబడిన పెద్ద బండరాయిమీద కూర్చున్నది.

పందిరి వెనుక భాగంలో కటికనేల మీద చతికిలబడి కూర్చొని వున్నది జ్వాల. వాసుదేవుడితోను, శివుడితోను ఏదో విషయాన్ని గురించి దీర్ఘంగా చర్చిస్తోంది.

"మీ చర్చలో నేను కూడా పాల్గొనవచ్చునా?" బండరాయి మీది నించి లేచి, వారి దగ్గరికి పోతూ అడిగింది చారులతాదేవి.

"రహస్య చర్చలేమీ కాదు... నిన్నటినుంచీ ఈ అడవిలో వున్న ప్రతి పొదని, ప్రతి మలుపుని గాలించి గాలించి వదులుతున్నాం. ఒక్కటంటే ఒక్క ఎలుగుబంటికూడా మాకు కనిపించలేదు" అన్నది జ్వాల.

"ఎప్పుడూ లేని విధంగా అశాంతి, ఆందోళనతో అల్లకల్లోలమైపోతున్నది అడవి. జంతువులన్నీ దూరంగా తప్పుకోవటమో, పారిపోవటమో, దాక్కోవటమో ఏదో ఒకటి జరిగివుంటుంది" సాలోచనగా చెప్పింది చారులతాదేవి.

"ఆ మాటే మేముకూడా అనుకుంటున్నాము. ఇంక వెతకవలసిన ప్రదేశం ఒక్కటే మిగిలింది. అయితే అటుగా వెళ్ళటానికి వాసుదేవులవారు అంగీకరించటం లేదు" అంది జ్వాల.

ప్రశ్నలు నిండిన కనులతో అతనివంక చూసింది చారులతాదేవి.

"శ్రావస్తి నగరానికి వెళ్లే రహదారికి ఆవలివైపున వుంటుందా ప్రదేశం. విషపు మొక్కలతో విచిత్రమైన పొదలతో మహా ప్రమాదకరమైన వాతావరణం. అందుకే వద్దంటున్నాను" అన్నాడు అతను.

"సాగరుల వారు మన యుద్ధగజాలను ఎక్కడ దాచిపెట్టి వుంచారు?" ఉన్నట్లుండి ఇంకో ప్రశ్న వేసింది చారులతాదేవి.

"బహుశా ఆ దరిదాపుల్లోనే ఎక్కడో నిలబెట్టి వుంటారు. మేము తిరిగిన ప్రదేశాల్లో జాడలు ఏమీ మాకు కనిపించలేదు" అన్నది జ్వాల.

"సాగరుల వారు వెళ్ళగలిగిన ప్రదేశంలోకి మనం వెళ్ళలేకపోవటమనే మాటలకు అర్థం లేదు. వెళ్ళి ఆయన్నే అడిగితే వెంటనే తెలిసిపోతుంది. అడవిలోని జంతువులన్నీ ఏమైపోయాయో" చెప్పింది ఆమె.

అప్పటివరకూ మౌనంగా కూర్చుని వున్న శివుడికేసి తిరిగింది జ్వాల. "యుద్ధగజాల జాడల్ని నీ ఏనుగులు అనుసరించగలవు కదా... మనల్ని అక్కడికి తీసుకుపోగలిగితే మన సందేహాలకు సమాధానాలు దొరుకుతాయి" అన్నది.

తనకు ఆ మాట చాలా బాగా నచ్చినట్లు తల వూపి వెంటనే లేచి నిలుచున్నాడు శివుడు. ఏదైనా ఒక నిర్ణయం తీసుకున్న తర్వాత ఆచరణలో పెట్టడానికి ఆలస్యం చేసే అలవాటు అతనికి లేదని చారులతాదేవికి తెలుసు.

"ఒక్క క్షణం ఆగండి. నేను నా ఖడ్గాన్ని తెచ్చుకుంటాను" అంటూ తిరిగి పందిరి ముందు భాగంలోకి వచ్చింది.

"నువ్వు మాతో ఎందుకత్తా? నువ్వు వస్తే మరి ఇక్కడి వారి బాధ్యతా?" ఆందోళనగా అడిగింది జ్వాల.

"ఇక్కడివారి సంగతి మహేశ్వరుడు చూసుకుంటాడు. నేను మీతో రావటంలేదు. నా భర్త దగ్గరికి వస్తున్నాను. నీకేమైనా అభ్యంతరం వున్నదా?" చిరుకోపంతో అడుగుతూ, ఒక సేవకురాలు అందించిన ఖడ్గాన్ని తీసుకున్నది చారులతాదేవి. దూరంలో వున్న మహేశ్వరుడిని దగ్గరికి పిలిచి తన నిర్ణయాన్ని వినిపించిది. అతను వద్దని అంటాడనుకున్న జ్వాలకు నిరాశే ఎదురైంది.

"ఏ క్షణంలో శిఖావంతుడి సైన్యం ఈ ప్రదేశాన్ని కనిపెడుతోందోనని భయంతో వణికిపోతున్నాను. దేవిగారిని మీరు దూరంగా తీసుకుపోయే ఆలోచన చెయ్యటం నాకు నిజంగా చాలా నచ్చింది. ఇంక నాకు భయం లేదు. నిన్న మీరు తోలుకువచ్చిన అశ్వాలు మనకి చాలా బాగా ఉపయోగ పడతాయి. వాటిమీద మన భటుల్ని అడవి అంచుల వరకు పంపి శత్రువులను చికాకుపెట్టే చర్యలు మొదలుపెడతాను" సంతోషంగా చెప్పాడతను.

చెట్లతోపుకు దూరంగా నిలబెట్టి వుంచిన తనేనుగుల దగ్గరికి చారులతా దేవిని తీసుకుపోయి ఆడ ఏనుగుమీద ఆమెను, జ్వాలను కూర్చోబెట్టాడు శివుడు. మగ ఏనుగుమీద తను వాసుదేవుడితో కలిసి కూర్చున్నాడు. మడమలతో అదిలించి దాన్ని ముందుకు నడిపించాడు.

"దారి తప్పి దూరంగా వెళ్ళిపోకుండా గున్న ఏనుగును తన తొండంతో అదిలించి, తన ముందు నడిపిస్తూ వారిని అనుసరించింది ఆడ ఏనుగు.

❖ ❖ ❖

సూర్యుడు పడమటి దిశకు మారుతున్న సమయంలో "శివుడూ... నాకు ఆకలిగా వున్నది. ఏనుగుల్ని ఆపు" అని బిగ్గరగా అరిచింది జ్వాల.

మగ ఏనుగు తలమీద అరిచేత్తో తట్టాడు శివుడు. వెంటనే ఆగిపోయింది అది. దానితోపాటు గున్న దాని వెనుకే ఆడ ఏనుగు రెండూ దారి మధ్యలో కదలకుండా నిలుచుండిపోయాయి.

"మీరు విశ్రాంతిగా కూర్చోండి. నేను ఏవైనా పళ్ళు కనిపిస్తాయేమో వెతికి తీసుకువస్తాను" అన్నాడు శివుడు క్రిందికి దూకుతూ.

"వెతకటం అనవసరం. అవిగో నోరు ఊరించే చెట్లు..." అంటూ వారి పక్కనే పాతిక విండ్ల దూరంలో వున్న ఒక వృక్షాన్ని చూపించింది జ్వాల.

మామిడికాయల మాదిరి కనిపిస్తున్నాయి ఆ వృక్షపు కొమ్మలకు వ్రేలాడుతున్న పళ్ళు. మధురమైన సువాసనలు గాలివాలున దారిమీదికి ప్రసరిస్తున్నాయి.

క్షణం కూడా ఆలస్యం చేయకుండా అటుకేసి పరిగెత్తబోయిన శివుడుని, చటుక్కున చేయి పట్టుకుని ఆపేశాడు అతని వెనుకే ఏనుగుమీదినించి దిగిన వాసుదేవుడు.

"ఎందుకు ఆపటం? అవి తినదగినవి కాదా?" ఆశ్చర్యంగా అడిగాడు శివుడు.

"తినదగినవే అవి. కాని వాటిని సమీపించటం మాత్రం చాలా ప్రమాదం. ఇటు చూడు" అంటూ తన పాదాల దగ్గర్లో కనిపించిన ఒక పెద్ద కొండరాయిని ఎత్తి బలంగా చెట్టు దగ్గరికి విసిరాడు వాసుదేవుడు.

పచ్చటి పసిరిక గడ్డి మొలచి వున్నది ఆ వృక్షం చుట్టూ. ఆ కాయలు వెలువరిస్తున్న సువాసనల మాదిరిగానే ఆహ్లాదకరంగా కనిపిస్తోంది ఆ ప్రదేశం. దారిని వదిలిపెట్టి వెంటనే ఆ చెట్టుక్రిందికి పోయి విశ్రాంతి తీసుకోవాలని అనిపించేటంత సుందరంగా వున్నది.

గింగిరాలు తిరుగుతూ పోయి సరిగ్గా చెట్టుకు నాలుగు బారలు ఇవతలగా పసిరిక గడ్డిమీద పడింది వాసుదేవుడు విసిరిన కొండరాయి.

పడిన వెంటనే గంధకపు పొగ మాదిరి బుస్సున పసిరికలో నుంచి పైకి లేచింది దట్టమైన పొగ.

తొండాలను గాలిలోకి ఎత్తి పెద్దగా ఘీంకారాలు చేస్తూ శివుడి ఆజ్ఞకోసం ఎదురు చూడకుండానే దూరంగా పరిగెత్తాయి ఏనుగులు.

వృక్షానికున్న కాయలు ఎంతటి మధురమైన వాసనలను వ్యాపింప చేస్తున్నాయో, అంతకు రెట్టింపు దుర్వాసనను వెలువరించింది కొండరాయి పడిన ప్రదేశంలోని పసిరికగడ్డి.

“ఇంతకంటె భయంకరమైన ప్రమాదాలు ఇంకా చాలా కనిపిస్తాయి ఈ అడవిభాగంలో... మనుష్యులే కాదు... అడవి జంతువులు కూడా ఇటుగారావు. వచ్చిన వెంటనే దూరంగా పారిపోతాయి” తలపాగా అంచుతో ముక్కులు మూసుకుంటూ చెప్పాడు వాసుదేవుడు.

అతని మాటల్ని లక్ష్యపెట్టకుండా తాను ముందుగా పరిగెత్తి ఆ గడ్డిమీద కాలుపెట్టిన వెంటనే ఏమి జరిగి వుండేదో తలుచుకునే సరికి చెమటలు పట్టినంత పని అయింది శివుడికి.

“మరి జ్వాలకు ఆకలి వేస్తోందట, ఆహారం సంగతేమిటి?” ముక్కు మూసుకుని తనుకూడా వేగంగా ఇవతలికి వచ్చేస్తూ అడిగాడు.

“మనం సాగరుల వారి దగ్గరికి వెళ్ళేవరకూ ఈ దారిని వదిలి ఒక్క అడుగుకూడా అవతలకు వేయకూడదు. మనకు ఖచ్చితంగా తెలిస్తే తప్ప ఏ చెట్టునూ సమీపించకూడదు...” అంటూ తిరిగి మగ ఏనుగుమీదికి ఎగబ్రాకాడు వాసుదేవుడు.

మరో అర్ధఘడియలో చీకట్లు దట్టం అవుతాయనగా, వారు అనుసరిస్తున్న దారి అంతమైపోయి ఎదుట ఒక పెద్ద కొండలోయ ప్రత్యక్షం అయింది.

ఆ లోయలో నిలువబడి వున్నాయి సంపంగి నగర యుద్ధగజాలన్నీ. నెమ్మదిగా నడుస్తూ వచ్చిన మగ ఏనుగును చూడగానే నేల అదిరిపోయేటట్లు అడుగులు వేస్తూ పరిగెత్తుకు వచ్చింది పట్టపు టేనుగు.

❖ ❖ ❖

"ముక్కుతాడు కట్టి, మూరెడు కర్రతో నెత్తిమీద తాటిస్తే వెనుక కాళ్ళమీద నిలబడి చేయమన్న పనులన్నీ చేసే ఎలుగుబంటిని చూసి భయపడి పారిపోయి వచ్చిందది... ఢీ కొట్టించరా శివుడూ... దాని బలం ఎటువంటిదో మనకి తెలిసిపోయింది. ఢీ కొట్టించు" కంగారుగా తన ఏనుగును ఆపుతున్న శివుడికి చెప్పింది చారులతాదేవి.

ఆ మాటలు తనకు వినిపించనట్లు, మగ ఏనుగును ఆపి, ఆడ ఏనుగును తమ ముందుకు రప్పించాడు శివుడు.

అంతకుముందు నగర ద్వారం దగ్గర ఎలా అరిచిందో ఇప్పుడు కూడా అదే జరిగింది. చిల్లులు పడేటట్లు ఘీంకరిస్తూ పట్టపు టేనుగు దారిని అడ్డుకున్నది ఆడ ఏనుగు.

ఆ సందడిని ఆలకించి పరుగు పరుగున వచ్చేశాడు సాగరుల వారు. దూరంగా వున్న దట్టమైన పొదల మధ్యలోనుంచి ఏనుగుల మీదనించి దిగిన తన వారిని చూసేసరికి ఎందుకో స్వల్పంగా చెమరించాయి ఆయన కళ్ళు.

"ముందు మీ ఏనుగును వెనక్కి పిలవండి..." దగ్గరగా పోతూ అన్నది చారులతాదేవి.

వెంటనే పట్టపు టేనుగును సమీపించి, పొడవాటి దాని దంతాలను ఒక చేత్తో గట్టిగా పట్టుకుని బలంగా వెనక్కి నెట్టాడు సాగరుల వారు. "శత్రువులు ఎవరూ లేరు, అందరూ మనవాళ్ళే. ఆ ఏనుగులు మన శివుడివి. అవికూడా మనవే.." మృదుస్వరంతో చెపుతూ దూరంగా తీసుకుపోయి పొదల్లో వున్న ఒక చెట్టుక్రింద నిలబెట్టి వచ్చాడు.

తను ఏనుగులతో అడవిలోకి వచ్చేసిన తర్వాత కోట దగ్గిర పరిస్థితి ఎలా వున్నదో ఆయనకి వివరంగా చెప్పాడు వాసుదేవుడు.

ఏదో ఒకటి చేసి మనం వెంటనే వాళ్ళని దూరంగా తరిమేయాలి. తరిమి వేసిన తర్వాత చక్రవర్తికి సహాయం చేయటానికి వెళ్ళాలి. శిఖావంతుడు ఈపాటికి సరిహద్దుల మీద తన మిగిలిన సైన్యాన్నంతా కేంద్రీకరించి వుంటాడు" అని కూడా చెప్పాడు.

"ఏ పని జరగాలన్నా ముందు ఆ దుర్మార్గుడు తీసుకువచ్చిన ఎలుగు బంట్లను ఎలా ఎదిరించాలో తెలుసుకోవాలి. ఆ పని చేయకపోతే గజ సైన్యం

ఎందుకూ పనికిరాదు. ఈ గజ సైన్యం లేకపోతే శిఖావంతుడి సైన్యం ధాటిని తట్టుకోలేం అనుకుంటూ పోతే మీరు శిఖావంతుడి సైన్యాన్ని ఎదుర్కోలేరు" అంటూ ఒక చెట్టుచాటునుంచి ఇవతలికి వచ్చాడు ఒక వృద్ధుడు.

ఐరావతం మాదిరి నిలుచుని వున్న మగ ఏనుగును, దాన్ని కదలకుండా నిలబెట్టి వుంచిన శివుడిని చూసేసరికి, అమితమైన ఆశ్చర్యం అతని కన్నుల్లో ప్రత్యక్షం అయింది.

"ఎవరీ బుడతడు? ఎవరిదీ మహాగజం?" అడిగాడు కుతూహలంగా.

"వాడు శివుడు... నా బిడ్డ... ఈ ఏనుగు కూడా వాడిదే... వాడి మాటని తప్ప ఎవరి మాటను లక్ష్యపెట్టదు..." సగర్వంగా చెపుతూ సాగరుల వారివంక చూసింది చారులతాదేవి.

"ఈయన నా గురుదేవుడు... నాకు గజసైన్యాన్ని నడిపించటం ఎలాగో నేర్పిన మహనీయుడు... ప్రస్తుతం మనం ఎదుర్కొంటున్న సమస్యకు పరిష్కారం చెపుతారని వచ్చాను..." వెంటనే చెప్పాడు సాగరుడు. తన సతీమణిని, జ్వాలను ఆ వృద్ధుడికి పరిచయం చేశాడు.

చటుక్కున ముందుకు పోయి ఆయన పాదాలకు నమస్కారం చేసింది చారులతాదేవి. "మీరు ప్రసాదించిన మహా విద్య కారణంగానే మా దేశంమీద శత్రువుల నీడలు పడకుండా ఇంతవరకూ సుఖంగా జీవిస్తూ వచ్చాము. ఇప్పుడు మాత్రమే అనుకోని సమస్య వచ్చిపడింది" అంటూ చెప్పింది.

చేతిని జాచి ఆదరపూర్వకంగా ఆమె తలను నిమిరాడు ఆ వృద్ధుడు. "పరిష్కార మార్గం కనిపించని సమస్యలు ఈ భూ ప్రపంచంలో ఏవీ వుండవు. మనం చేయవలసిందల్లా, సరియైన పద్ధతిలో ఆ మార్గాన్ని వెతకటమే... నిలువబడి మాట్లాడుకుంటే ఏ మార్గమూ కనిపించదు. నా కుటీరానికి పోయి మాట్లాడుకుందాము. పదండి..." అంటూ వెనుతిరిగి పొదల్లోకి దారితీశాడు.

ఒకరి వెనుక ఒకరుగా అతన్ని అనుసరించి, గలగలా ప్రవహించే ఒక సెలయేటి దగ్గర కొండరాళ్ళతో కట్టిన కుటీరం దగ్గరికి పోయారు అందరూ.

కుటీరం ముందున్న రెండు సమాధుల్ని గమనించగానే వాసుదేవుడి కేసి చూసింది జ్వాల.

"ఇప్పటికిప్పుడు అనవసరమైన ప్రశ్నలు వేస్తే అతనికి ఇబ్బందిగా వుంటుంది. నెమ్మదిగా అడుగుదాము" సమాధానం ఇచ్చాడు వాసుదేవుడు.

"ఏమిటి... మీ గుసగుసలు?" అది గమనించి వెంటనే అడిగింది చారులతాదేవి.

"ఆ సమాధుల గురించి అడగాలని అనుకుంటున్నారు. అవి నా పంచప్రాణాలలో రెండింటివి. ఒకటి నా అర్థాంగిది. రెండవది నా కుమార్తెది" ఆ మాటలు తనకు వినిపించినట్లు వెంటనే చెప్పాడు ఆ వృద్ధుడు.

❖ ❖ ❖

సాగరుల వారు వదిలిపెట్టి వచ్చిన ప్రదేశంలోనే నిలబడి వున్నది ఆయన పట్టపుటేనుగు. శివుడి ఏనుగు మాత్రం అలా ప్రశాంతంగా నిలబడలేదు.

నిమిషానికి రెండుసార్లు అటువైపే చూస్తోంది. ఏ మాత్రం అవకాశం దొరికినా పోయి దానిమీద కలబడాలన్న కాంక్ష చాలా స్పష్టంగా కనిపిస్తోంది దాని కనుల్లో. అందువల్ల దాన్ని ఒంటరిగా వదిలిపెట్టి, మిగిలినవారితో కలిసి కుటీరంలోకి వెళ్ళలేకపోయాడు శివుడు.

చీకట్లు దట్టం అయిన తర్వాత కూడా వాటిదగ్గరే ఆగిపోయాడు. బంకమట్టితో చేయబడిన ఒక పాత్ర నిండుగా వేడి వేడి జావను తీసుకువచ్చి అతనికి ఇచ్చింది చారులతాదేవి.

"సరయిన పదార్థాలు ఏవీ ఇక్కడ లేవురా... ఉన్నవాటితోనే సరిపెట్టుకోవాలి" అన్నది ఆ వట్టి జావను ఇస్తున్నందుకు బాధపడుతూ.

చిరునవ్వు నవ్వి, చిటికెలో పాత్రను ఖాళీ చేసేశాడు శివుడు. ఎంగిలి పాత్రను సెలయేట్లో శుభ్రం చేసుకురావటానికి బయలుదేరబోతుండగా ఆపి, ఆ పాత్రను తాను తీసుకున్నది ఆమె.

"ఈ పని చేయవలసింది మేము... నువ్వు కాదు... నీ ఏనుగుల గురించి ఆలోచించుకో" అంటూ కుటీరం దగ్గరికి వెళ్ళిపోయింది.

నకనకలాడుతున్న ఆకలి ఉపశమించిన వెంటనే తిరిగి చురుకుగా ఆలోచించటం మొదలుపెట్టింది శివుడి అంతరంగం.

సంపంగి నగరం చుట్టుపట్ల నుంచి మటుమాయం అయిన అడవి జంతువులన్నీ ఎక్కడికి పోయి వుంటాయి??

మొదటి ఝాము గడిచి రెండవ ఝాము అడుగుపెట్టే సమయంలో కూడా లభించలేదు అతనికి సమాధానం.

పగలంతా ప్రయాణం చేసివుండటం వల్ల అలసిపోయారు కాబోలు, కుటీరంలోనే నిద్రలకు ఉపక్రమించారు చారులతదేవి, జ్వాల ఇద్దరూ. కుటీరం వెనుక భాగంలో వున్న చదరపు రాళ్ళమీద పడుకున్నారు వారిని ఆహ్వానించిన వృద్ధుడు, వాసుదేవుడు.

యుద్ధ గజాల దగ్గరే తన పడకను ఏర్పాటు చేసుకున్నాడు సాగరుల వారు. రెండవ ఝాము కూడా గడిచిపోయిన తర్వాత ఆ గజాలుకూడా నిద్రలకు ఉపక్రమించినట్లు దట్టమైన నిశ్శబ్దం ఆవరించుకున్నది ఆ ప్రదేశాన్ని.

తల్లిదండ్రులకు దగ్గరగా నేలమీద అడ్డదిడ్డంగా పడుకున్నది గున్న. దాని నడుము మీద తల పెట్టుకుని తాను కూడా నిద్రపోతున్న శివుడికి, ఎందుకో వున్నట్లుండి వచ్చేసింది మెలకువ.

నిశ్శబ్దంగా అడుగులు వేస్తూ వచ్చింది ఒక ఆకారం... కుటీరం ముందున్న సమాధుల్లో ఒకదాని దగ్గర కూర్చుని ఏదో ఆలోచనలో నిమగ్నమయింది.

గున్నను వదిలి నిశ్శబ్దంగా లేచాడు శివుడు. తనతోపాటుగా పైకి లేవబోయిన గున్నను వద్దని ఆపాడు. ప్రశ్నార్థకంగా తలలు ఊపిన పెద్ద ఏనుగుల్ని నిశ్శబ్దంగా వుండమని సైగ చేస్తూ నాలుగు అడుగులు ముందుకు వేసి, సమాధి దగ్గర వున్న ఆకారం కేసి పరిశీలనగా చూశాడు.

"ఏమిట్రా చూస్తున్నావు? నిద్ర పట్టటం లేదా? చలిగా వున్నదా?" అతను అవునన్నట్లు తల వూపకముందే తన భుజాల మీద వున్న మందపాటి ఉత్తరీయం వంటి వస్త్రాన్ని అతనికేసి జాస్తూ మాట్లాడింది ఆ ఆకారం...

ఎవరు? సాగరుల వారు.

"మీరు... మీరు ఇక్కడ... ఈ సమాధుల దగ్గర..." ఏం మాట్లాడాలో తెలియకపోవడం వల్ల అస్పష్టంగా అన్నాడు శివుడు.

"నిద్ర పట్టలేదురా నాకు కూడా... అందుకే ఇక్కడికి వచ్చాను. నువ్వు పడుకో" అంటూ తన ఉత్తరీయాన్ని అతని మీదికి విసిరి మళ్ళీ ఏనుగుల దగ్గరికి వెళ్ళిపోయాడు సాగరులవారు.

ఆయన విసిరిన ఉత్తరీయాన్ని పట్టుకుని ఆశ్చర్యంగా చూస్తూ నిలబడి పోయిన శివుడుకి వినిపించాయి మరికొన్ని అడుగుల చప్పుళ్ళు.

అదిరిపడి తలతిప్పేసరికి, కుటీరం వెనుక నుంచి ఇవతలికి వస్తున్న వాసుదేవుడు కనిపించాడు.

"ఏమిటిరా ఆలోచన శివుడు?" దగ్గరికి వచ్చిన వెంటనే అడిగాడు.

"సాగరుల వారు ఆ సమాధి దగ్గర కూర్చుని..." అంటూ తను చూసిన దృశ్యాన్ని వివరించి చెప్పబోయాడు శివుడు.

"సంపంగి నగరానికే కాదు... ఈ అడవికి కూడా ఆయన సామ్రాట్టురా... తనకు ఎప్పుడు ఇష్టమైతే అప్పుడు ఎక్కడికైనా వెళతారు... ఎక్కడైనా కూర్చుంటారు... అందులో ఆశ్చర్యపడాల్సిన అవసరం ఏముంది?" నవ్వుతూ అడిగాడు వాసుదేవుడు.

ఎన్ని అధికారాలున్నా, ఎంత సామ్రాట్టు అయినా అర్థరాత్రి వేళ అటువంటి పనులు చేయటం దేనికో శివుడికి కొంచెంగా కూడా అవగతం కాలేదు.

"అర్థం చేసుకోగల వయస్సు కాదు నీది. చిన్నవాడివి. నీకు అనవసరం. పోయి హాయిగా నిద్రపో" అని చెప్పి అతి బలవంతంగా అతన్ని తిరిగి ఏనుగుల దగ్గరికి నెట్టి, అతను గున్న నడుముమీద తలపెట్టి పడుకున్న తర్వాత సాగరుల వారు అతనికి ఇచ్చిన ఉత్తరీయాన్ని అతనికి కప్పి వెనక్కి వెళ్ళిపోయాడు వాసుదేవుడు.

పది క్షణికాల తరువాత ఎంత మెలకువగా వుందామని అనుకున్నా వుండలేకపోయాడు శివుడు. తనకు తెలియకుండానే నిద్రలోకి జారిపోయాడు.

❖ ❖ ❖

ప్రచోద నగరానికి రక్షణగా నాలుగువేల కాల్బలాన్ని, రెండువేలమంది అశ్వికుల్ని కాపలా పెట్టాడు శిఖావంతుడు. మరో రెండువేలమందిని, అవసరం అయితే సంపంగి నగరంకేసి వెళ్ళిన వారికి సాయంగా పంపించటానికి సిద్ధంగా వుంచి, మిగిలిన సమస్త సైన్యాలను జ్వలిత సామ్రాజ్యపు రాజధానికేసి నడిపించాడు.

సంపంగి నగరం తమకు వశమైందని, సాగరుడి గజబలం అడవిలోకి పారిపోయిందని తెలిసిన క్షణం నుంచీ అతని ఆనందానికి హద్దులు లేకుండా పోయాయి.

"సాగరుడు సామాన్యుడు కాదు. మన పథకానికి విరుగుడు ఏదో ఒకటి ఆలోచించుకుని, గజాలను రాజధానికేసి తరలిస్తాడు" దుమ్ముతెరలు రేపుతూ ప్రయాణం ప్రారంభించిన సైన్యాన్ని ఒక కొండగుట్ట మీదినుంచి చూస్తూ తన మంత్రులతో అన్నాడు.

"మన పథకానికి విరుగుడు ఆలోచించడం అతనివల్ల కాదు ప్రభూ... ఒకవేళ సంపంగి నగరాన్ని వదిలేసి అతను రాజధానికేసి ప్రయాణం అయితే అడ్డుకోవటానికి శ్రావస్తి నగరానికి ఇవతలగా మరికొంతమంది ఆటవికులను వారి ఎలుగుబంట్లతో సిద్ధంగా వుంచడం జరిగింది. ఇక మనం ఆ గజబలాన్ని గురించి మర్చిపోవచ్చు" నమ్మకంగా చెప్పాడు ఒక మంత్రి.

"అడవిలో అడుగుపెట్టగానే అవలికి జారుకున్న కనకయ్య శ్రేష్ఠి ఏమైపోయాడు?" అడిగాడు శిఖావంతుడు.

"కనకయ్య శ్రేష్ఠి వంటఇంటి కుందేలు. ఎక్కడికీ పోలేడు. రాజధానికి వస్తే మనకి దొరికిపోతాడు. రాకుండా శ్రావస్తిలోనే వుండిపోతే, రాజధానిని లోబరుచుకున్న వెంటనే మనం ఆ నగరం మీద పడతాము. అతను అతి తేలికగా దొరికిపోతాడు" మరింత నమ్మకంగా చెప్పాడు ఆ మంత్రి.

"మంచి మాటలతో మనల్ని వంచించి ఏదో సాధించ ప్రయత్నించిన అతన్ని వదిలిపెట్టకూడదు. సమర్థులైన వారిని శ్రావస్తికి పంపించి వెంటనే బంధించమని ఆజ్ఞ ఇవ్వండి" సూటిగా చెప్పాడు శిఖావంతుడు.

అప్పటికప్పుడు ఆరువందలమంది భటుల్ని సిద్ధం చేశాడు ఆ మంత్రి. "శ్రావస్తి నగరంలో వున్న సైన్యం చాలా భాగం రాజధానికి తరలించబడినట్లు మనకి తెలిసింది. మీరు నేర్పుగా వ్యవహరించి ఆ నగరాన్ని స్వాధీనం చేసుకుని మండలాధిపతితో పాటు కనకయ్య శ్రేష్ఠిని కూడా బంధించండి" అని ఆజ్ఞలు ఇచ్చాడు.

నదీ ప్రవాహం మాదిరి కదులుతున్న ఆ మహాసైన్యంలో నుంచి చిన్నపాయ ఒకటి చీలి పక్కకు ప్రవహించినట్లు, పక్కకు తిరిగి శ్రావస్తి నగరం వైపు ప్రయాణం మొదలుపెట్టారు ఆ సైనికులు అందరు. రెండు రోజుల తరువాత చీకటి సమయంలో నగరాన్ని సమీపించి, ఒక చెట్లతోపు దగ్గర విశ్రమించారు.

❖ ❖ ❖

ఉదయం నిద్రలేచిన క్షణం నుంచీ చీకటి పడిన తర్వాత నిద్రలకు ఉపక్రమించే వరకూ సాగరులవారికి, వాసుదేవుడికి, జ్వాలకు ఒకటే ఆలోచన.

శిఖావంతుడి భల్లూక సైన్యాన్ని ఎదిరించి తిరిగి సంపంగి నగరాన్ని స్వాధీన పరచుకోవటం ఎలా?

"సంపంగిని వశపరచుకోవటానికి తొందరపడవలసిన అవసరం లేదు. ఇప్పుడు మీరు రాజధానిని రక్షించుకోవడం అత్యవసరం. శిఖావంతుడు అక్కడ విజయం సాధిస్తే ఇక అతన్ని అడ్డుకోవడం అసాధ్యం" రెండవ రోజు సాయం సమయంలో తన అభిప్రాయాన్ని అందరికీ చెప్పాడు అక్కడ కుటీరంలో నివశించే వృద్ధుడు.

"రాజధానికి గజబలాన్ని తరలించాలనే మాట వినటానికి బాగానే వున్నది. అక్కడ కూడా ఆ భల్లూక సైన్యం ఎదురయితే?" కొంచెంగా కూడా తడుము కోకుండా వెంటనే అడిగాడు దూరంగా కూర్చుని వున్న శివుడు.

అక్కడికి వచ్చిన తర్వాత ఇప్పటివరకూ అతనితో ముఖాముఖీ మాట్లాడలేదు వృద్ధుడు.

"మేము అందరం వయసు మళ్ళిపోయిన వృద్ధులం. అందరిలోకి అతిపెద్ద వృద్ధుడిని నేను. వృద్ధాప్యం వల్ల మా మతులు సరిగ్గా పనిచేయటంలేదు. వయసులో వున్నవాడివి నువ్వు. నీ బుద్ధి చురుకుగా కదులుతుంది. నువ్వే చెప్పు ఏదైనా పరిష్కారమార్గం" అన్నాడు వృద్ధుడు.

ఆ మాటల్లో ఏదో వెక్కిరింపు, ఈసడింపు వున్నట్లు వెంటనే అనిపించింది జ్వాలకి. చివ్వున తల ఎత్తి విసురుగా ఏదో చెప్పబోతుండగా, కనుసైగ చేసి ఆపేశాడు వాసుదేవుడు.

"నేనుకూడా శివుడి వయసు దానినే. నా బుద్ధికూడా చురుకుగానే కదులుతుంది. మరి నన్నెందుకు ఆలోచించమని అడగటం లేదు?" అన్యాపదేశంగా తనను వదిలి శివుడిని మాత్రమే ఎత్తిపొడవటం తనకు నచ్చనట్లు మెత్తగా అడిగింది.

చిన్నగా నవ్వాడు వృద్ధుడు. "శివుడికీ నీకు పోలిక ఏమిటి తల్లీ? నువ్వు జ్వలిత సామ్రాజ్యానికి కాబోయే మహారాణివి. వాడు తల్లి ఎవరో తండ్రి ఎవరో తెలియని అనాథ... అనామకుడు" అన్నాడు.

వారి సంభాషణతో తనకు నిమిత్తం లేనట్లు, అందరికీ ఆహారాన్ని సిద్ధం చేసే పనిలో తలమున్కలై వున్నది చారులతాదేవి. ఒక్కసారిగా ఆ పనిని వదిలి విసురుగా కుటీరంలో నుంచి బయటికి వచ్చింది.

"శివుడు అనాథ, అనామకుడు కాదు. వాడు మా బిడ్డ... మా తరువాత సంపంగి నగరానికి కాబోయే మండలాధిపతి" ఆవేశంగా చెప్పింది.

"తల్లీ... తొందరపడకండి... సంపంగి నగరానికి కాబోయే మండలాధిపతి ఎవరో నిర్ణయించవలసింది ఇప్పుడు కాదు... నిర్ణయించేది కూడా మీరు కాదు. చక్రవర్తి ఎవరిని నియమిస్తే వారు అవుతారు" అంటూ ఆమెను వారించటానికి ప్రయత్నించాడు వాసుదేవుడు.

అతను చేసిన కనుసైగను గమనించి ఎంతో ప్రయత్నంమీద మాటలు తూలకుండా బిగపట్టుకుంటున్న జ్వాలకు కూడా అంటుకుంది మేనత్త ఆవేశం.

"చక్రవర్తి నిర్ణయించవలసిన అవసరంలేదు. నేను ఈ సామ్రాజ్యానికి కాబోయే మహారాణిని. నేను నిర్ణయిస్తున్నాను. ఈ క్షణం నుంచీ సంపంగి నగరం జ్వలిత సామ్రాజ్యంలో భాగమే అయినా, కలిసి వుండవలసిన అవసరంలేదు. సంపంగి పాలకులకు స్వయం నిర్ణయాధికారం వుంటుంది. ఎవరిని తమ వారసుడిగా సాగరుల వారు నియమించదలుచుకుంటే వారు ఈ నగరానికి పాలకులు అవుతారు... ఇది నిజం... ముమ్మాటికీ నిజం" తీవ్రమైన కంఠంతో చాలా గట్టిగా చెప్పింది.

ఆమెను ఆపటానికి ప్రయత్నించటం వల్ల ఉపయోగం ఏమీ వుండదని తెలిసి, ఇబ్బందిగా చూస్తున్న వాసుదేవుడి మొఖంలో ఆశ్చర్యం తాండవించింది.

"ఎందుకు ఆ ఆశ్చర్యం?" అడిగింది జ్వాల.

"ఆటవికులకు పట్టుబడినప్పటి జ్వాలవి కాదు నువ్వు. చాలా ఎదిగిపోయావు తల్లీ" ఆప్యాయత నిండిన కంఠంతో అన్నాడతను.

"నేను తప్పుగా మాట్లాడానా?" అడిగింది జ్వాల.

"తప్పు మాట్లాడావని అనలేను గాని, రాజకీయాల గురించి నీకు సరైన అవగాహన లేదని మాత్రం చెప్పగలను. రాజ్యాల గురించి రాచరికంలో వారసుల్ని గురించి మాట్లాడేటప్పుడు మన వ్యక్తిగతమైన ఆప్యాయతలకు, అనురాగాలకు ఆవేశ కావేశాలకు స్థానం వుండకూడదు. సాగరుల వారి

అభిప్రాయం ఏమిటో తెలుసుకుంటే నువ్వు మాట్లాడింది తప్పో కాదో నీకే అర్థం అవుతుంది" మృదుస్వరంతో జ్వాలకు చెప్పాడు వాసుదేవుడు.

సాగరుల వారికేసి చూసింది జ్వాల. చారులతాదేవి నోటివెంట ఏదైనా ఒక మాట వెలుపలికి వస్తే ఆయన ఆ తరువాత ముందు వెనుకలు ఆలోచించ కుండానే గుడ్డిగా తలూపేస్తాడని అందరూ అనుకోవటం ఆమెకు తెలుసు.

శివుడిని తమ వారసుడిగా నిర్ద్వంద్వంగా ప్రకటించింది చారులతాదేవి. ఇప్పుడు ఎందుకు కాదని అంటారు?

"ఇప్పుడున్న పరిస్థితిలో మనం ఇటువంటి మాటలు మాట్లాడుకోవటం పద్ధతి కాదు. మన గజబలాన్ని ఆ ఎలుగుబంటి సైన్యం నుంచి కాపాడుకోవటం ఎలాగో ఆలోచించాలి. సరిహద్దుల దగ్గరికి వచ్చిన శిఖావంతుడి చెంపలు వాయగొట్టి వెనక్కి తరమటం ఎలాగో తెలుసుకోవాలి" అంటూ దీర్ఘంగా నిట్టూర్చి జ్వాల మొఖంలోకి సూటిగా చూశాడు సాగరులవారు.

"ఇప్పుడు జ్వలిత సామ్రాజ్య రక్షణకు సహాయపడే ఉపాయం చెపితే సువర్ణానదికి ఆవలివైపున వున్న ఆటవికుల్నయినా సరే సంపంగి నగరానికి ప్రభువుల్ని చేయవచ్చు. నగరం క్షేమంగా వుండాలి. నా సామ్రాజ్యం కుశలంగా వుండాలి. అంతే" ఖచ్చితమైన కంఠంతో చెప్పాడు తన చివరి అభిప్రాయాన్ని.

చారులతాదేవి వెలిబుచ్చిన అభిప్రాయాన్ని ఆయన రెండో ఆలోచన లేకుండా బలపరుస్తాడని గట్టిగా అనుకున్న జ్వాలకు మతిపోయినంత పని అయింది ఆ మాటల్ని వినేసరికి.

కుటీరంలో నుంచి బయటకి వచ్చి ద్వారం దగ్గిరే నిలబడి వున్న చారులతాదేవికి కూడా అదేమాదిరి అయింది కాబోలు- విపరీతమైన రోషంతో ఎర్రకలువల మాదిరి మారిపోయిందామె వదనం.

సాగరుల వారి మాటలకు విరుద్ధంగా ఏదో చెప్పటానికి ప్రయత్నం చేసింది ఆమె. మాటలు పెదవుల్ని దాటి బయటికి రాకముందే చేతిని ఎత్తి అడ్డుకున్నాడు ఆయన.

"శివుడు నీ బిడ్డే. నేను కాదని అనటం లేదు. నీ వైభవానికి, వైభోగానికీ వాడు వారసుడే అనటంలో ఎటువంటి అసందర్భము లేదు. అయినాసరే సంపంగి నగరానికి సంబంధించినంత వరకూ నగర శ్రేయస్సే మనకి

ముఖ్యం. సంపంగి జ్వలిత సామ్రాజ్యంలో భాగం... స్వయం ప్రతిపత్తి వున్నా లేకపోయినా మనం చక్రవర్తి అధికారానికి లోబడి వుండవలసిందే. జ్వాల కాబోయే మహారాణి మాత్రమే... మహారాణి కాదు" అన్నాడు దృఢస్వరంతో.

"అదికాదు ప్రభూ... నేను చెప్పేది ఏమిటంటే?" అంటూ మరోసారి మాటల్ని సాగదీయపోయింది చారులతాదేవి.

"చాలు దేవీ... ఈ విషయాన్ని ఇక్కడితో వదిలివేయటం చాలా మంచిది. మనం దేశదిమ్మరుల మాదిరి అడవులు పట్టింది వారసులు ఎవరో తెలుసుకోడం కోసం కాదు. నగరాన్ని రక్షించుకోవటం ఎలాగో తెలుసుకోవటం కోసం" చురుకుగా చూస్తూ అన్నాడు సాగరులవారు.

తను చెప్పదలచుకున్న మాటల్ని తనలోనే దాచుకుని, విసురుగా కుటీరంలోకి వెళ్ళిపోయింది చారులతాదేవి.

చక్రవర్తి మహాబలుల వారికి సాగరుల వారు ఎంత విధేయుడో, పూర్తిగా తెలిసి వచ్చేసరికి సిగ్గుతో వివర్ణమైంది జ్వాల వదనం. "నన్ను మీరు క్షమించాలి. తొందరపాటుతనంతో అతిశయపు మాటలు మాట్లాడాను" వెంటనే చెప్పిందామె చిన్న కంఠంతో.

బరువుగా నవ్వి, ఆమె తల నిమిరాడు సాగరుడు. "అతిశయం ప్రదర్శించే అర్హత నీకు వున్నది... మరేం ఫర్వాలేదు" అన్నాడు.

నోరు తెరిచి ఒక్కమాట కూడా మాట్లాడకుండా, విప్పారిన నేత్రాలతో అందరివంకా చూస్తూ కూర్చుని వున్నాడు వృద్ధుడు. చారులతాదేవి అభిప్రాయాన్ని వినేసరికి ఒకింత కాంతివంతం అయింది అతని వదనం... సాగరుల వారి మాటలకు చిన్నబోయింది. గాఢమైన నిట్టూర్పు ఒకటి వెలువడింది అతని నాశికా రంధ్రాలలో నుంచి.

సాగరుల వారు గమనించలేదు గాని, వాసుదేవుడు మాత్రం చూడనే చూశాడు. ఎవరూ గమనించకుండా జ్వాలకు సైగ చేశాడు.

"అదేపనిగా ఆలోచిస్తూ కూర్చుంటే ఎదుట వున్న సమస్యకు సమాధానం లభించకపోగా, కొంగ్రొత్త అనుమానాలు పుట్టుకువస్తాయి ఒక్కోసారి. కొద్దిసేపు ఎటువంటి మాటలు మాట్లాడకండి... మనసులు ప్రశాంతం అవుతాయి" అంటూ లేచి సెలయేటి దగ్గరికి వెళ్ళిపోయాడు వృద్ధుడు.

"శివుడిని గురించిన మాటలు వచ్చినప్పుడల్లా అతని వదనంలో రకరకాల భావాలు ప్రత్యక్షం అవుతున్నాయి. కొంచెం గట్టిగా గమనిస్తూ వుండటం మంచిది" జ్వాలకు మాత్రమే వినిపించేటట్లు చెప్పాడు వాసుదేవుడు.

"అతనికి శివుడికి సంబంధం ఏదైనా వుండి వుంటుందా?" ఆశ్చర్యంగా అడిగింది జ్వాల.

"అడవి చివర నివశించే ఇతనికి, నగరంలో నాలుగు గోడల మధ్య పెరిగి పెద్దవాడవుతున్న శివుడికి మధ్య సంబంధం వుండటం కష్టమే అయినా అసంభవం మాత్రం కాదు. శివుడు నగరంలోనే జన్మించాడని చెప్పటానికి ఆధారాలు లేవు. నువ్వు కొంచెం హెచ్చరికగా వుంటే ఏదైనా ఆధారం లభించవచ్చు" అన్నాడు వాసుదేవుడు.

తల వూపి కుటీరంలోకి నడిచింది జ్వాల. తన గజదళం దగ్గరికి వెళ్ళిపోయాడు సాగరుల వారు. శివుడి వెనుకే అతని ఏనుగుల దగ్గరికి పోయాడు వాసుదేవుడు.

❖ ❖ ❖

కట్టెల పొయ్యిమీద పెద్ద మట్టిపాత్రను పెట్టి, అడవిలో లభించే వెదురు బియ్యంతో అందరికీ జావను కాస్తోంది చారులతాదేవి.

"ఈ పొగ తగిలితే నీ కళ్ళు మంటలు పెడతాయి. వెళ్ళి వెలుపల కూర్చో" అంటూ జ్వాలను వెనక్కి పంపించేయటానికి ప్రయత్నించింది.

"నేను వెళ్ళి వెలుపల కూర్చుంటే మళ్ళీ వాదనలు మొదలవుతాయి. కాబోయే మహారాణినే గాని, ఇప్పుడు మాత్రం కాదని అంటున్నారు సాగరుల వారు. ఆయనతో వాదన పెట్టుకోవటం నాకు ఇష్టంలేదు" నవ్వుతూ చెప్పింది జ్వాల.

"శివుడి మీది ప్రేమ నాతో లేనిపోని మాటలు మాట్లాడించింది గాని, ప్రభువులు చెప్పిందే నిజం. మా భావాలు ముఖ్యం కాదు. మా నగరం క్షేమంగా వుండటం ముఖ్యం" తనుకూడా నవ్వుతూనే చెప్పింది చారులతాదేవి.

"బయటినించి చూస్తే నువ్వు నీ ప్రభువు ఉత్తర దక్షిణ ధృవాల మాదిరిగా కనిపిస్తారు గాని మీరిద్దరూ ఒకటే తోడుదొంగలు" అన్నది జ్వాల.

కట్టెల పొయ్యి దగ్గిర్నించి లేవకుండానే, చేతిని జాచి ఆమె నెత్తిమీద ఒక మొట్టికాయ వేసింది చారులతాదేవి ఆప్యాయంగా.

"ఎన్ని అభిప్రాయ బేధాలున్నా భార్యాభర్తలన్న తర్వాత ఎప్పుడో ఒకచోట ఒకటైపోవాలి. శివుడంటే ప్రభువుల వారికి నాకంటె ఎక్కువ అభిమానం. నేను బయటికి కనిపిస్తాను. వారు కనిపించరు. అంతే తేడా" అన్నది.

భగభగలాడుతున్న కట్టెలు ఎందుకనో వున్నట్లుండి మంటలకు బదులు దట్టమైన పొగల్ని వెలువరించటం మొదలుపెట్టేసరికి కుటీరంలో నిలబడటం కష్టమైపోయింది జ్వాలకి.

"నేను ముందే చెప్పాను. నువ్వు ఈ పొగని భరించలేవని. మొండిపిల్లవి... బయటికి వెళ్ళిపో..." పమిటె చెంగుతో కనులు అద్దుకుని, పొడుగాటి గొట్టంతో కట్టెలు ఊదుతూ చెప్పింది చారులతాదేవి.

పక్కనే వున్న గోడను ఆసరాగా చేసుకుని, కళ్ళను గట్టిగా మూసుకుంటూ అడుగులు వేసింది జ్వాల. కనులు మూసుకోవడం వల్ల వెనుక ద్వారానికి ఒక పక్కగా పెట్టి వున్న పెద్ద బుట్ట ఆమెకు కనిపించలేదు.

అడవిలో దొరికే రకరకాల పళ్ళు ఫలాలను సేకరించి, ఆ బుట్టలో భద్రపరి చాడు వృద్ధుడు. దారికి అడ్డుగా వుండకుండా వెనుక ద్వారం దగ్గర పెట్టాడు.

మండుతున్న కళ్ళను తెరవకుండానే వెనుక ద్వారం దగ్గరికి బయలుదేరిన జ్వాల పాదాలకు తగిలి ఇంతెత్తున లేచి బయటికి దొర్లింది ఆ బుట్ట.

"చూసుకుని అడుగు వేయవద్దా? చూడు ఎలా పడిపోయిందో!" అంటూ చారులతాదేవి హెచ్చరించేసరికి కళ్ళు తెరిచి చూసింది జ్వాల.

చిందరవందరగా పడిపోయి వున్న పళ్ళు, ఫలాలు అన్నింటినీ ఒకటొకటిగా ఎత్తి మళ్ళీ బుట్టలో పడవేయబోతుండగా వచ్చింది ఆమెకు ఆ అనుమానం.

"అత్తా... అత్తా... బయటికి రా" ఉన్నట్లుండి అదోరకమైన ఉద్వేగం తన మనస్సును ఉత్సాహపరుస్తుండగా బిగ్గరగా పిలిచింది.

ఆశ్చర్యంగా చూస్తూ పొయ్యి దగ్గర్నించి లేచి ఆమె దగ్గరికి వచ్చింది చారులతాదేవి.

"చూడు, ఈ బుట్టని సరిగ్గా చూడు..." అన్నది జ్వాల.

చూసింది చారులతాదేవి. వెదురు చువ్వలతో తయారుచేయబడిన బుట్ట కాదు అది. యుద్ధ బాణాలను తయారుచేసే కలపను సన్నగా చీల్చి అల్లబడినట్లు స్పష్టంగా తెలుస్తోంది.

"ఎవరు తయారుచేశారో గాని, వారి నైపుణ్యాన్ని మెచ్చుకుని తీరాలి. చాలా అందంగా వున్నది" అన్నదామె తిరిగి పొయ్యి దగ్గరికి పోబోతూ.

కనులు చిట్లించి ఆమె మొఖంలోకి చూస్తున్న జ్వాల పెదవుల మీదికి వెంటనే పరిగెత్తుకు వచ్చింది ఒక చిరునవ్వు.

"కట్టెల పొగ నీ కళ్ళనే కాదు మనసును కూడా మూసుకునేటట్లు చేసేసింది. సరిగ్గా చూడు..." అంటూ చేయిపట్టుకుని ఆపింది.

ఆశ్చర్యం, అనుమానం కలగలసిన చూపులతో మళ్ళీ బుట్టకేసి తిరిగింది చారులతాదేవి.

"బాగుంది జ్వాల... అల్లిక అద్భుతంగా వుంది. అచ్చు మనం పాత సామాను కొట్టంలో చూసిన బుట్ట మాదిరిగానే..." అంటూ అదిరిపడి మాటల్ని ఆపివేసింది.

"అదీ సంగతి... ఇప్పుడు నీ కనులే కాదు మనసుకూడా తెరుచుకుంది. ఇది ఖచ్చితంగా మీకు శివుడు ఎటువంటి బుట్టలో దొరికాడో అటువంటిదే" అంటూ నేలమీద చతికిలబడి బుట్టని వడిలోకి తీసుకున్నది జ్వాల.

"పరాయి వారి వస్తువును గురించి మనం ఇలా మాట్లాడుకోవడం మంచిది కాదు... వదిలేయ్" అన్నది చారులతాదేవి.

"మనం దాన్ని ఎత్తుకుపోవాలని అనుకోవటం లేదు. ఇటువంటిదాన్నే ఇంతకుముందు చూశామని చెప్పుకోవటంలో తప్పు ఏమీలేదు" అంటూ మరింత దీక్షగా ఆ బుట్టని పరిశీలించటం మొదలుపెట్టింది జ్వాల.

పొగలు వెలువరిస్తున్న కట్టెల్ని ఊది మంటలు తిరిగి ప్రత్యక్షం అయ్యేటట్లు చేయాలన్న మాట మరిచిపోయి, ఆమె పక్కనే కూర్చున్నది చారులతాదేవి.

"మన దగ్గర వున్నది దీనికి జోడీ అయి వుంటుంది. రెండూ ఒకే విధంగా వున్నాయి. ఈ బుట్ట ఎవరిదో..."అంటున్న జ్వాల నోటిని గట్టిగా అదిమిందామె.

"సాగరుల వారి గురువుగారిదే ఈ బుట్ట... వేరే వారిది ఇక్కడికి ఎలా వస్తుంది?" అని అడిగింది.

"అయితే ఆయన్ను అడగటం తప్ప వేరే మార్గం లేదు..." అంటూ బుట్టని కుటీరంలో పెట్టి ముందుభాగంలోకి బయలుదేరింది జ్వాల. రెండు అడుగులు కూడా వేయకముందే చేయి పట్టుకుని ఆపేసింది చారులతాదేవి.

"ఇప్పుడున్న పరిస్థితుల్లో ఈ మాటలు వింతగా విచిత్రంగా కనిపిస్తాయి. ఈ గండం గట్టెక్కిన తర్వాత చూద్దాం... అప్పటివరకూ ఏమీ మాట్లాడవద్దు" అన్నది.

"ఏదైనా ఆలోచన నా మనస్సులోకి వస్తే వెంటనే దాన్ని ఆచరణలో పెట్టటం నాకు ఇష్టం. తర్వాత చూద్దామని పక్కకు నెట్టడం నాకు అలవాటు లేదు" అన్నది జ్వాల.

"ఏ పనికైనా సమయం సందర్భం అంటూ రెండూ వుంటాయి. ఇప్పుడు ఈ పనికి అవి లేవు... ఇందాకటి చర్చ మళ్ళీ మొదలౌతుంది. సాగరుల వారికి కోపం వచ్చేస్తుంది. నా మాట విని నోరు మూసుకో... నెమ్మదిగా విచారణ చేద్దాం" విశదంగా వివరంగా చెప్పింది చారులతాదేవి.

రెండు క్షణికాల తర్వాత గట్టిగా నిట్టూర్చి, తల వూపింది జ్వాల. "శివుడి జన్మ రహస్యానికి సంబంధించిన ఆధారం ఒకటి అనుకోకుండా మనకి కనిపించింది. ఇటువంటివే మరికొన్ని ఈ చుట్టుపట్ల అగుపించటానికి అవకాశాలు వున్నాయి. ఎవరితోను ఏమీ చెప్పకుండా వాటిని నేను వెతికి పట్టుకుంటాను. నీకు ఏమైనా అభ్యంతరమా?" అని అడిగింది.

"ఎవరికీ ఎటువంటి ఇబ్బంది కలగకుండా నువ్వు ఎన్ని పరిశోధనలు చేసినా నాకు ఎటువంటి అభ్యంతరమూ లేదు" ఒప్పుకున్నది ఆమె.

కుటీరంలోకి నెట్టిన బుట్టవంక మరోసారి చూసి ముందు ద్వారంలో నుంచి బయటికి వెళ్ళిపోయింది జ్వాల.

❖ ❖ ❖

గలగలమని మృదుమధుర ధ్వనులు చేస్తూ ప్రవహిస్తున్న సెలయేరు ఏమంత పెద్దది కాదు... లోతు కూడా ఏమంత అధికంగా లేదు.

అయినా సరే అవతలి పక్కకు పోవటానికి కొన్ని బండరాళ్ళను తెచ్చి ఒకచోట వరుసలో వంతెన మాదిరి పేర్చాడు వృద్ధుడు.

ఆ బండల మీద అడుగులు వేసి, దుస్తులు తడిసిపోకుండా ఆవలి పక్కకు పోయాడు శివుడు.

ఎత్తుగా ఎదిగి వున్న ఒక చెట్టు కొమ్మను విరిచి, ఆరుమూరల పొడవుండే ఆయుధం మాదిరి తయారు చేసుకున్నాడు.

"చీకట్లు కమ్ముకోబోతున్న సమయంలో పొదల్లో తిరగటం మంచిదికాదు. ఏం చేస్తున్నావురా శివుడు? ఎందుకు దండం?" ఇవతలి ఒడ్డున బండరాళ్ళ మీద కూర్చుని వున్న వాసుదేవుడు వెంటనే అడిగాడు అతన్ని.

"ఊరికే కూర్చుంటే ఏమీ తోచడం లేదు. కాస్సేపు అలా అలా తిరిగి వస్తాను" అంటూ సమాధానం కోసం ఎదురు చూడకుండా పొదల్లోకి వెళ్ళిపోయాడు శివుడు.

రెండు క్షణికాలు ఆగి తనుకూడా లేచాడు వాసుదేవుడు. సెలయేటి దగ్గరికి పోకముందే వడివడిగా అడుగులు వేస్తూ వచ్చింది జ్వాల. తమ మాటల్ని ఆలకించేవాళ్ళు ఆ చుట్టుపట్ల ఎవరూ లేరని నిశ్చయం చేసుకుని, చిన్నకంఠంతో కుటీరంలో తను చూసిన బుట్టని గురించి అతనికి చెప్పింది.

నొసలు ముడివేసి శ్రద్ధగా వింటున్న వాసుదేవుడి వదనం ఒక్కసారిగా విప్పారింది ఆ మాటలు ముగిసే సమయానికి.

"మంచి విషయాన్ని చక్కగా కనిపెట్టావు. వీలు చూసుకుని మనం సాగరుల వారి గురువును అడిగేద్దాం" అన్నాడు.

"ఆ వీలు చూసుకునేది ఎప్పుడు?" అడిగింది జ్వాల.

"మన నగరాన్ని రక్షించుకునే మార్గం కనిపించిన తర్వాత. అప్పటివరకూ ఇటువంటి మాటలు మాట్లాడటమే కాదు వాటిని గురించి ఆలోచించటం కూడా తప్పే అవుతుంది" అన్నాడు వాసుదేవుడు.

"అత్తయ్యకూడా ఇలాగే చెప్పింది. మీరందరూ ఒకే గురువు దగ్గర విద్యాభ్యాసం చేశారా?" అసహనంగా అడిగింది జ్వాల.

చిన్నగా నవ్వి ఆమె శిరస్సు నిమిరాడు వాసుదేవుడు. "ఇంకా కొంచెం ఎదిగిన తర్వాత నువ్వు కూడా ఇలాగే మాట్లాడతావు. కొంచెం ఓపిక పట్టు" అన్నాడు.

ముక్కును గట్టిగా ఎగపీల్చి అసహనంగా నేలను తన్ని వెనక్కి వెళ్ళిపోయింది జ్వాల. శివుడి వెనుకే పొదల్లోకి పోయే ఆలోచనను విరమించుకుని, తిరిగి బండరాళ్ళ దగ్గరే కూర్చుండిపోయాడు వాసుదేవుడు.

శివుడు ఎటువంటి బుట్టలో దొరికాడో, అటువంటిదే సాగరుల వారి గురువు దగ్గర వున్నది. శివుడు దొరికిన బుట్టలో తమకు కనిపించిన వస్త్రం వంటివి కూడా అతని దగ్గర మిగిలి వుంటాయా??

కుటీరంలోకి పోయిన జ్వాలను వెనక్కి పిలిచి, ఆ ఆలోచనను ఆమెకు వినిపించాలన్న కోరికను అతి బలవంతంగా అదుముకున్నాడు అతను. తొందరపాటు మనిషి జ్వాల. అప్పటికప్పుడు కుటీరాన్నంతా తిరగదోడి గోల గోల చేసేస్తుంది. అది మంచిది కాదు.

ఎంత ప్రయత్నించినా మనసులో నుంచి ఆ ఆలోచనల్ని అవతలికి నెట్టడం చేతకాకపోవడంతో విసుగ్గా తల విదిలించి బండరాళ్ళ దగ్గిర్నించి లేచాడు అతను. చిన్నగా నడుస్తూ సాగరులవారి గజదళం దగ్గరికి బయలుదేరాడు.

❖ ❖ ❖

చుట్టూ వున్న పొదలన్నిటిని పరిశీలనగా చూస్తూ అడుగులు వేస్తున్న శివుడి నాశికారంధ్రాలకు సోకింది ఒక తియ్యటి వాసన.

ఎక్కడివాడక్కడ ఆగిపోయి గట్టిగా ఎగబీల్చాడు నాసికను.

చీకటి సమయంలో విచ్చుకునే అడవిపూలు కూడా మధురమైన వాసనలు వెదజల్లుతాయని తెలుసు అతనికి.

కాని అది పూలవాసన కాదు. బాగా పరిచయమైనటువంటిదే.

ఎప్పుడు ఎక్కడ ఎలా పరిచయం అయిందో జ్ఞప్తికి తెచ్చుకోవటానికి ప్రయత్నం చేస్తూ మరో పది అడుగుల దూరం వెళ్ళి వున్నట్లుండి ఒక చెట్టు దగ్గర ఆగిపోయాడతను.

తేనె వాసన అది. కొండరాళ్ళకు, ఎత్తయిన చెట్టు కొమ్మలకు వ్రేలాడే తేనె పట్లు ఎక్కువగా వున్న ప్రదేశంలో నిలబడితే అటువంటి సుగంధమే తెలియవస్తుంది.

తనకు తెలియకుండానే తల ఎత్తి తాను ఏ చెట్టుక్రింద నిలబడ్డాడో ఆ చెట్టుకొమ్మల్లోకి చూశాడు అతను.

చీకట్లు దట్టం అవటం వల్ల ఏమీ కనిపించలేదతనికి. పెద్ద పెద్ద కొమ్మలు మాత్రం రెండు దర్శనం ఇచ్చాయి.

'వెలుగు వున్నప్పుడు వచ్చి వెతకటం బాగుంటుంది. తేనెలో ముంచిన పదార్థాలంటే గున్నకి మహా ఇష్టం' అనుకుంటూ వెనుతిరగబోతుండగా కనిపించింది అతనికి... పది ధనువుల దూరంలో వున్న పెద్ద పొద దగ్గర ఒక కదలిక.

ఝల్లుమన్నది అతని శరీరం. అతనికి తెలియకుండానే వెంట తీసుకువచ్చిన చెట్టుకొమ్మని బిగించి పట్టుకున్నాయి చేతులు.

కనిపించినట్లే కనిపించి ఆ పొద అవతలి భాగంలోకి వెళ్ళిపోయింది ఒక ఆకారం.

గుబగుబలాడుతున్న గుండెల్ని చిక్కబట్టుకుని మెల్లిగా ముందుకు నడిచాడు శివుడు. పది క్షణికాల తర్వాత ఆ పొదని సమీపించాడు. చెట్టుకొమ్మను గాలిలోకి ఎత్తి పట్టుకుని ఒక్కసారిగా ఆవలి పక్కకు దూకాడు.

పెద్ద వెడల్పాటి మట్టిపాత్రని పొద దగ్గిర పెట్టి, సన్నగా పొడుగ్గా వున్న తోలు తిత్తిలో నుంచి ఏదో ద్రవాన్ని ఆ పాత్రలోకి వంపుతోంది అతనికి కనిపించిన ఆకారం.

"ఎవరు నువ్వు? ఏం చేస్తున్నావు ఇక్కడ?" కరకు కంఠంతో అడగాలని అనుకున్నాడు శివుడు. అడుగుతూనే పైకెత్తి పట్టుకున్న చెట్టుకొమ్మతో భుజాల మీద బలంగా కొట్టాలని నిర్ణయించుకున్నాడు.

అంతవరకూ చక్కగానే జరిగిపోయింది. నోరు తెరిచిన తర్వాత మాటలు బయటకి వచ్చే సమయంలో తల ఎత్తి అతనివంక చూసింది ఆ ఆకారం.

నోటికి బలమైన చెయ్యి ఏదో అడ్డం వచ్చినట్లు నోటిలోనే ఆగిపోయాయి మాటలు. గాలిలోకి ఎత్తిన చెట్టుకొమ్మ అతనికి తెలియకుండానే క్రిందికి వాలిపోయింది.

"రహస్యంగా సంచరించాలని అనుకుంటున్న శత్రువు నిన్ను చూడగానే భయంతో వణికిపోతూ నీ ప్రశ్నకు సమాధానం ఇస్తాడని అనుకుంటున్నావా?" తోలుతిత్తిని క్రిందపెట్టి, చేతుల్ని తన చర్మపు దుస్తులకు తుడుచుకుంటూ లేచి నిలబడ్డాడు సాగరులవారి గురువుగారైన వృద్ధుడు.

సిగ్గుతో ఎర్రగా కందిపోయింది శివుడి మొఖం.

"క్షమించాలి... చీకటి మూలంగా సరిగ్గా చూడలేకపోయాను" తలవంచుకుంటూ అస్పష్టంగా సమాధానం ఇచ్చాడు.

"ఆయుధం అంటూ పట్టుకోనేకూడదు. పట్టుకున్న తర్వాత అశ్రద్ధ అస్సలు పనికిరాదు. ఎవరినైనా ఎదిరించటానికి సిద్ధపడినప్పుడు అన్ని విషయాలు కూలంకషంగా పరిశీలించి చూసుకున్న తర్వాతనే ముందుకు రావాలి..." అతన్ని క్రిందినించి పైదాకా పరిశీలనగా చూస్తూ అన్నాడు వృద్ధుడు.

"తేనెవాసన చాలా గట్టిగా తగులుతోంది. ఈ చుట్టుపట్ల తేనెపట్లు ఏమైనా వున్నాయా?" తెలివిగా మాట మారుస్తూ అడిగాడు శివుడు.

"తేనెపట్లు ఈ లోయలో ఎక్కడా లేవు" అన్నాడు వృద్ధుడు.

"మరి నాకు సోకుతున్న వాసన ఎక్కడినించి" అని అడుగుతూ క్రిందికి చూసి, ఆ మాటల్ని మధ్యలోనే ఆపేశాడు శివుడు.

పొద దగ్గర వృద్ధుడు పెట్టిన పాత్రలో తొణుకు తొణుకుమంటోంది తేనె. అతను క్రిందపెట్టిన తోలుతిత్తిలో కూడా తేనె వున్నట్లే కనిపిస్తోంది.

"ఇది... ఈ పాత్ర... ఎందుకు?" అయోమయంగా చూస్తూ అడిగాడు అతన్ని.

"ఎర వేస్తున్నాను" ముక్తసరిగా సమాధానం ఇచ్చి, దగ్గర్లోనే వున్న ఇంకో పొద దగ్గిరికి పోయాడు వృద్ధుడు.

ఆ మాట తనకు అర్థం కాలేదని చెప్పటానికి బిడియపడ్డాడు శివుడు. తనంతట తానే తెలుసుకోవాలని నిశ్చయించుకుంటూ అతన్ని అనుసరించాడు.

ఎప్పుడు పట్టుకున్నాడో గాని, అడవికోళ్ళ వంటి నాలుగు పెద్ద పెద్ద పక్షుల్ని పట్టుకుని, పారిపోకుండా వాటి పాదాల్ని రెండింటినీ సన్నపాటి దారంతో గట్టిగా కట్టివేసి ఆ పొద దగ్గిర పెట్టి వుంచాడు వృద్ధుడు. శివుడు చూస్తూ వుండగానే దుస్తుల్లో నుంచి చిన్న కత్తిని బయటికి తీసి వాటి మెడల మీద చిన్న చిన్న గాట్లు పెట్టాడు.

ప్రాణాలు తీసే గాట్లు కావు అవి. అయినా సరే వెల్లువలా వెలుపలికి వచ్చింది రక్తం. వెలుపలికి వచ్చిన వెంటనే ఆ ప్రదేశమంతా నెత్తుటి వాసనతో మలిన పడిపోయింది.

ఒక్కొక్క పక్షిని విడివిడిగా పైకి ఎత్తి ఎదుట వున్న పొదకి వ్రేలాడదీశాడు వృద్ధుడు.

పాదాలు బంధింపబడ్డాయే గాని, వాటి రెక్కలు మాత్రం విడిపడే వున్నాయి. ఇప్పుడు వాటిని తపతపమని కొడుతూ బిగ్గరిగా కిక్కరించటం మొదలుపెట్టాయి ఆ పక్షులు.

ఒక పక్కనుంచి మధురమైన తేనె వాసన, మరొక పక్కనుంచి వెగటు కలిగించే రక్తపు వాసన. ఆ రెండింటినీ మించి ఆ పక్షులు చేస్తున్న సవ్వడి.

ఎర వేయటమనే మాటకు వృద్ధుడు చెప్పకుండానే అర్థం అవగతమయి పోయింది శివుడికి.

"అడవి జంతువుల్ని వేటాడటానికి ఆ ఏర్పాట్లు చేసేస్తున్నాడు అతను. శిఖావంతుడి సైన్యం అడవిలోకి ప్రవేశించినప్పుడు దూరంగా పారిపోయిన జంతువులు బహుశా ఆ లోయ దగ్గిరికే వచ్చివుంటాయి.

ఆ వచ్చిన వాటిలో ఎలుగుబంట్లు ఏవైనా కనిపించే అవకాశం వున్నదేమో అతన్నే అడిగి తెలుసుకోవాలన్న కోరిక వెంటనే కలిగింది శివుడికి.

కోరిక అయితే కలిగింది కాని, అడిగే అవకాశం మాత్రం లభించలేదు. అడవి పక్షులు రెక్కల్ని తపతపలాడిస్తూ కెక్కిరించటం మొదలుపెట్టగానే గిరుక్కున వెనుతిరిగాడు వృద్ధుడు. తేనెతో నిండిన పాత్ర దగ్గర పడవేసిన తోలు తిత్తిని తీసి శివుడికి అందించాడు. "దాన్ని తీసుకుని నువ్వు కుటీరం దగ్గరికి వెళ్ళిపో... నేను కాస్సేపటి తర్వాత వస్తాను" అంటూ అతన్ని వెనక్కి నెట్టాడు.

ధైర్యం తెచ్చుకున్నాడు శివుడు. "మీరు ఏ జంతువును వేటాడాలని అనుకుంటున్నారు?" అని అడిగాడు.

"ఇప్పుడు కాదు... తర్వాత చెప్తాను. ముందు ఇక్కడినించి వెళ్ళిపో. తేనె వాసన గాలి వాలున లోయ చివరిదాకా వెళ్ళిపోయి వుంటుంది" అంటూ అతన్ని మరోసారి వెనక్కి నెట్టబోతూ ఆగిపోయాడు వృద్ధుడు.

వారిద్దరూ నిలబడివున్న ప్రదేశానికి పాతిక ధనువుల దూరంలో వున్న పొదలో విపరీతమైన కదలిక మొదలుకావటమే అందుకు కారణం.

"వాసన తగిలితే వెతుక్కుంటూ వచ్చేస్తాయని అనుకున్నానే గాని, ఇంత తొందరగా పరిగెత్తుకు వస్తాయని ఊహించలేదు. వెళ్ళిపో... ఆలస్యం చేస్తే ప్రాణాలకు ప్రమాదం..." అంటూ వేగంగా పరిగెత్తి అంతకుముందు శివుడు ఏ చెట్టుక్రింద నిలుచున్నాడో ఆ చెట్టుమీదికి ఎగబ్రాకాడు వృద్ధుడు.

అతనితోపాటుగా కదిలి వెనక్కి అయితే వచ్చాడు గాని, అతను ఆదేశించినట్లు దూరంగా వెళ్లిపోలేదు శివుడు. అతను ఎక్కిన చెట్టుకు పది అంగల దూరంలో వున్న ఇంకో చెట్టుచాటున నిలబడి ముందుకు తొంగి చూశాడు. చూసిన వెంటనే దాహం వేస్తున్నట్లు ఎండుకుపోయాయి అతని పెదవులు. వేపాకులు నమిలినట్లు చేదుగా తయారయింది నోరు.

చురకత్తుల వంటి కోరలు బయటికి కనిపించేలా నోళ్ళు తెరిచి, ఎనుబోతుల మాదిరి ఎగిరి ఎగిరి దూకుతూ తేనెపాత్ర వున్న పొద దగ్గరికి వచ్చేశాయి మూడు ఎలుగుబంట్లు.

ఒకేసారి పాత్రమీదికి ఎగబడ్డాయి మూడు.

తేనె వాసన తగిలితే వాటికి పిచ్చెక్కిపోతుందని తెలుసు శివుడికి. వృద్ధుడు వేసిన ఎర వాటికోసమేనని ముందుగానే తెలుసుకోలేకపోయిన తన తెలివి తక్కువతనాన్ని నిందించుకుంటూ చుట్టూ చూశాడతను.

చర్మం కోసమో, మాంసం కోసమో కత్తుల వంటి పంజాల కోసమో వాటిని చూడాలని అనుకోలేదు తను. పట్టుకోవాలి... ప్రాణాలతో పట్టుకుని, అవి ఏనుగుల మీదికి ఎలా ఎగబడుతున్నాయో గమనించాలి. వృద్ధుడు గనుక వాటిని మాంసం కోసమే వేటాడాలని అనుకుంటే తన ఆలోచనను అతనికి చెప్పి, వాటిని చంపకుండా ఆపాలి.

వట్టి చేతులతో వాటిని పట్టుకోవటం అసాధ్యం, అసంభవం... బలమైన రజ్జువులు కావాలి.

పొదవాటి తాళ్లవంటి అడవితీగెలు ఏమైనా కనిపిస్తాయేమోనని చుట్టు చూసిన శివుడికి ఆ తీగెలు కనిపించలేదుగాని, చెట్టుమీదినించి క్రిందికి దూకి ఎలుగుల దగ్గరికి పోతున్న వృద్ధుడు కనిపించాడు.

తేనెతో తొణుకు తొణుకులాడుతున్న పాత్రను ముందుగా చేరుకోవాలన్న తొందరలో ఒకదానితో ఒకటి పోటీపడి ఒకేసారి ఆ పాత్రను సమీపించాయి ఎలుగులు. ఆ సందడిలో పాత్ర తిరగబడి అందులోని తేనె అంతా నేలపాలు అయింది.

నేలపాలయిన తేనెను నాకటం కోసం అవి ఒకదానితో ఒకటి గొడవ పడటం మొదలుపెట్టాయి. చూస్తూ చూస్తూ వుండగానే తీవ్రమైన పోరాటంగా మారిపోయింది అది.

బరువుగా వున్నాయి వాటి శరీరాలు. భయంకరంగా వినవస్తున్నాయి వాటి గురకలు. పంజాలతో రక్కుకుంటూ, కోరలతో కొరుక్కుంటూ ఒకదాన్ని మరొకటి గాయపరచుకోవటం సాగించాయి.

పది క్షణికాల తరువాత పక్కకు దొర్లి పోరాటాన్ని విరమించుకున్నది ఒక ఎలుగు. తేనెమీది భ్రమను వదిలేసి వృద్ధుడు పొదకు కట్టిన అడవి పక్షుల దగ్గిరికి వెళ్లింది.

చెట్టుమీదినించి కిందికి దూకిన వృద్ధుడు అటువంటి అవకాశం కోసమే ఎదురు చూస్తున్నాడు కాబోలు, తాను ధరించి వున్న చర్మపు దుస్తుల క్రిందినించి పొడవాటి తాడును బయటికి తీసి గాలిలోకి విదిలించాడు.

ఉచ్చుముడి వేసి వున్నది ఆ త్రాడు చివరి భాగంలో. గింగిరాలు తిరుగుతూ గాలిలోకి లేచి సూటిగా పోయి అడవి పక్షుల్ని అందుకోవటానికి వెనుక కాళ్ళమీద లేచిన ఎలుగుబంటి మెడకు చుట్టుకున్నది ఆ ఉచ్చు.

గావురుమని అరిచి క్రింద పడిపోయింది అది.

దట్టంగాను, చాలా దళసరిగాను, బరిశె మొన కూడా చొచ్చుకు పోలేనంత మందంగాను వుంటాయి ఎలుగుబంటి రోమాలు. మాంసం కోసమే వృద్ధుడు వేటాడుతున్నట్లయితే, తాడును విసరటం వల్ల ఎటువంటి ఉపయోగం వుండదని అనిపించింది శివుడికి.

అతను ఎలుగు మెడచుట్టు తగిలించిన ఉచ్చు, ఏ ఇతర జంతువుమీదికైనా విసిరి వుంటే చిటికెలో గట్టిగా బిగుసుకునేది. కన్ను మూసి కన్ను తెరిచేటంతలో ప్రాణాలు తీసేసి వుండేది.

క్రిందపడిన ఎలుగుకు మాత్రం ఎటువంటి హాని కలిగించలేకపోయింది అది. జానెడు వెడల్పున నోటిని తెరిచి చెవులు చిల్లులు పడిపోయేటట్లు భీకరమైన ధ్వనులు చేస్తూ క్రిందనించి లేచింది అది.

"గున్న ఏనుగు మాదిరి గుడ్లు మిటకరించి చూడకు. సాయం చెయ్..." అని శివుడిని హెచ్చరిస్తూ తన చేతుల్లో వున్న తాడు రెండో కొనను పక్కనే వున్న చెట్టు మొదలుకు కట్టేశాడు వృద్ధుడు. నడుముకు వ్రేలాడుతున్న కత్తిని తీసి ముందుకు పరిగెత్తాడు.

"చంపద్దు... దాన్ని చంపవద్దు... ప్రాణాలతో పట్టుకోవాలి" హడావుడిగా తన మనసులోని మాటను బయటపెట్టాడు శివుడు.

వినిపించుకోలేదా వృద్ధుడు. వినిపించుకునే వ్యవధి కూడా లేదు. ఎందుకంటే కత్తిని పట్టుకుని అతను ఆ ఎలుగు దగ్గరికి పోకముందే అతన్ని గమనించాయి తేనెపాత్ర దగ్గర తగాదా పడుతున్న ఎలుగులు రెండు.

'వచ్చేయండి... వెనక్కి వచ్చేయండి...' బిగ్గరగా అరిచాడు శివుడు.

వెనక్కి గెంతాడు వృద్ధుడు. నేలబారుగా పెరిగి వున్న ఒక అడవి తీగె ఎడమ కాలిని చుట్టుకోవడంతో వెల్లకిలా పడిపోయాడు.

గుండెలు జలదరించేటట్లు గురకపెట్టి ఒకేసారి అతని మీదికి దూకాయి ఆ రెండు ఎలుగులు. మెడను చుట్టుకుని వున్న ఉచ్చుముడిని పంజాలతో చేధించటానికి ప్రయత్నం చేస్తూ తను కూడా ఎగిరి దూకింది మూడో ఎలుగు.

ఏం చేయాలో అర్థంకాని పరిస్థితిలో చిక్కుబడిపోయాడు శివుడు. క్రింద పడిపోయిన వృద్ధుడి పని అయిపోయినట్లే... పోటుగాడి మాదిరి ముందుకు పోతే తనుకూడా ప్రాణాలను పోగొట్టుకోవాల్సిందే. గిరుక్కున వెనుతిరిగి వచ్చిన దారినే సెలయేటి దగ్గరికి పారిపోవటమే ఉత్తమం.

ఆ కోరిక ఎంత బలంగా మనసులో ప్రవేశించినా, ఎందుకనో అతని అడుగులు మాత్రం వెనక్కి తిరగలేదు. వృద్ధుడి మీదికి ఎగబడుతున్న ఎలుగులు తనను చూస్తే పొరపాటున కూడా వదిలిపెట్టవని తెలుస్తూనే వున్నా, తన చేతిలోని చెట్టుకొమ్మను బిగించి పట్టుకుని దారుణమైన కేకలు పెడుతూ ముందుకు దూకాడు.

ఉన్నట్లుండి వినవచ్చిన ఆ పొలికేకలు క్షణికం పాటు... ఒకే ఒక్క క్షణికం పాటు ఎలుగుల్ని బిత్తరపోయేట్లు చేశాయి. వృద్ధుడి మీదికి పోయి పంజాలతో అతని గుండెల్ని గాయపరచబోతున్నవి కాస్తా తలలు తిప్పి అతనికేసి చూశాయి.

ఆ ఒక్క క్షణంలోనే గిర్రు గిర్రుమంటు తిరిగి, దగ్గర్లో వున్న ఎలుగు ముఖంమీద పడింది శివుడి చేతిలోని చెట్టుకొమ్మ. ఒంటిమీది రోమాలయితే మందంగా వుంటాయి గాని మూతిమీద మాత్రం అటువంటి రక్షణ ఏమీ లేకపోవటంతో ఫెడీమని తగిలింది దెబ్బ.

చెవులు చిల్లులు పడిపోయేటట్లు భీకరంగా అరుస్తూ వెనక్కి దొర్లింది ఆ ఎలుగు. ఉచ్చుముడికి దొరికిపోయిన ఎలుగు మీద పడి దాన్ని కూడా తల్లక్రిందులు చేసేసింది.

తను కొట్టిన దెబ్బ ఎటువంటి ఫలితాన్ని ప్రసాదించిందో చూసుకునే తీరిక శివుడికి లేదు. మీదికి వచ్చేసిన మూడో ఎలుగు మీదికి చెట్టుకొమ్మను ఎత్తే వ్యవధి లేకపోవటం వల్ల బరిశె మాదిరి ముందుకు చాచి బలంగా పొడిచాడు దాని నోటిలో.

సూటిగా పోయి అంగిలిని గాయపరిచింది కాబోలు ఆ ఆయుధం. మొదటి ఎలుగు మాదిరి భీకరంగా అరవకపోయినా, అదే శృతిలో గురక పెడుతూ వెనక్కి దొర్లింది అది కూడా.

ఆ కాస్త వ్యవధి చాలనిపించింది శివుడికి. చటుక్కున వదిలేశాడు చెట్టుకొమ్మని. గబుక్కున క్రిందికి వంగి, అమాంతంగా పైకి ఎత్తాడు వృద్ధుడిని.

"దెబ్బతిన్న ఎలుగులు పిచ్చిఎక్కినట్టు ప్రవర్తించి, విధ్వంసం సృష్టిస్తాయి. పారిపోవాలి మనం దూరంగా వెళ్ళిపోవాలి" అంటూ తన చేతుల్లో నుంచి జారి క్రిందపడిపోయిన కత్తికోసం కూడా వెతుకులాడకుండా, వట్టి చేతులతోనే వెనక్కి పరుగు మొదలుపెట్టాడు వృద్ధుడు.

ఉచ్చుముడి పడిన ఎలుగు అక్కడే ఆగిపోయింది, ముడి వున్న త్రాటి రెండోకొసను అతను చెట్టు మొదలుకు చుట్టడం వలన. మిగిలిన రెండూ భూతాల మాదిరి వెంటాడటం మొదలుపెట్టాయి వారిద్దరినీ.

ఎత్తయిన చెట్టు ఏదయినా చూసుకొని దానిమీదికి ఎగప్రాకాలన్న కోరిక కలిగినట్లే కలిగి వెంటనే మాయమైపోయింది శివుడి మనసులో నుంచి.

మనుష్యులు మాత్రమే కాదు... ఎలుగులు కూడా ఎక్కగలవు వృక్షాల మీదికి. అటువంటి ఆలోచన లేని పనులు చేసి వాటిని తప్పించుకోవడం కుదరని పని.

"పరిగెత్తరా శివుడు. ఇంకా వేగంగా పరిగెత్తు... వచ్చేస్తున్నాయి పిశాచాలు..." పరుగు ఆపకుండా భుజాల మీదినించి వెనక్కి చూసిన వృద్ధుడు వున్నట్లుండి హెచ్చరించడంతో ఒక్కసారిగా అంతం అయిపోయాయి అతని ఆలోచనలు.

వృద్ధుడి హెచ్చరికలో అసత్యం అంటూ ఏమీలేదు. మూడు అడుగుల దూరంలోకి వచ్చేశాయి ఎలుగులు. గట్టిగా ఒక ఎగురు ఎగిరితే సూటిగా నడుముల మీద పడతాయి.

విపరీతమైన దాహం వేస్తున్నట్లు ఎండుకుపోయింది శివుడి గొంతు. "మీరు ముందు పరిగెత్తండి. వాటిని నేను ఆపగలనేమో చూస్తాను" అంటూ తన దట్టీలోనే వున్న చురకత్తిని చేతుల్లోకి తీసుకున్నాడు.

అతను అటువంటి పని ఏదో చేస్తాడని తనకు ముందే తెలిసినట్లు చటుక్కున అతని చేయి పట్టుకుని తనతోపాటు పరిగెత్తించాడు వృద్ధుడు.

ఇంకా సమీపంలోకి వచ్చేశాయి ఎలుగులు. ఒక్క అడుగు... ఒకే ఒక్క అడుగు వేగంగా వేస్తే చాలు... దొరికిపోతారు వారిద్దరు.

❖ ❖ ❖

"శివుడు ఏడి?"తన ఏనుగుల దగ్గిర్నించి కుటీరం దగ్గరికి వస్తూ, కుటీరం వెలుపల నిలబడివున్న జ్వాలను అడిగాడు సాగరులవారు.

"తను ఎక్కడికి పోతున్నాడో, ఏం చేయబోతున్నాడో ఎప్పుడయినా ఎవరికయినా ముందుగానే చెపుతాడా?" చిరుకోపంతో అడిగింది ఆమె.

"వాడు సెలయేటిని దాటి పొదల్లోకి పోయాడు" వెనకనుంచి సమాధానం ఇచ్చాడు వాసుదేవుడు.

"చీకటి పడిన తర్వాత పొదల్లో వాడికేమిటి పని? ఎందుకు పోయాడు?" అసహనంగా అడిగాడు సాగరులవారు.

"అదేమిటో వాడికే తెలియాలి... వాడికంటే ముందుగా మీ గురుదేవుడు కూడా అటే వెళ్ళాడు..." నవ్వుతూ చెప్పాడు వాసుదేవుడు.

ఆ మాటల్ని వినగానే ఉపశమించాలి సాగరుల వారి అసహనం. కాని అలా జరుగలేదు. "శిఖావంతుడి సైన్యం అడవిలోకి వచ్చిన వెంటనే జంతువులన్నీ ఇటుగానే పారిపోయి వచ్చినయ్. ఏమరుపాటుగా వుంటే మీదపడి ప్రాణాలు తీస్తాయి. ఆ సంగతి నా గురుదేవుడికి తెలుసు. తెలిసికూడా వాడిని వెంటబెట్టుకుని ఎందుకు పోయినట్లు?" అన్నాడు.

"వెంట బెట్టుకు పోలేదు. అసలు వాడు వెనుక వస్తున్నట్లుగా కూడా ఆయనకి తెలిసి వుండకపోవచ్చు" అన్నాడు వాసుదేవుడు.

సాగరుల వారి అసహనం కాస్తా ఆందోళనగా మారిపోయింది."కాగడ తీసుకో... ఒకసారి అటుగా వెళ్ళి చూసి వద్దాము" అన్నాడు.

అనటంతో ఆగలేదు. చీకటివేళల్లో అటువంటి పనుల కోసమే ముందుగా సిద్ధం చేసి, కుటీరం పక్క భాగంలో పెట్టిన కాగడాల్లో రెంటిని తనే వెలిగించి ఒకటి వాసుదేవుడికి ఇచ్చాడు.

"నేను కూడా వస్తున్నాను... ఆగండి..." అంటూ అతని సమాధానం కోసం ఎదురుచూడకుండా తాను కూడా ఇంకో కాగడాని తీసుకుని కుటీరం వెలుపల భగభగలాడుతున్న నెగడులో పెట్టి వెలిగించింది జ్వాల. వారి వెనుకగా పరుగు తీసింది.

"శివుడు... ఒరేయ్ శివుడు... ఎక్కడ? ఎక్కడ వున్నావురా?" పెద్ద కంఠంతో పిలవటం మొదలుపెట్టాడు వాసుదేవుడు, సెలయేటిని అధిగమించి పొదల్లోకి అడుగుపెట్టిన వెంటనే.

❖ ❖ ❖

"వచ్చేసినయ్‌రా... దగ్గరికి వచ్చేసినయ్..." ఎగుసుకు వస్తున్న ఆయాసాన్ని అదుముకోవటానికి ప్రయత్నం చేస్తూ శివుడిని హెచ్చరించాడు వృద్ధుడు.

అతను పనికట్టుకుని ప్రత్యేకంగా చెప్పాల్సిన అవసరం లేకుండా ఆ విషయం తెలుస్తూనే వున్నది శివుడికి.

"అరేయ్ శివుడు... నువ్వు వెళ్ళిపో... ఆ కత్తిని నాకు ఇవ్వు" ఉన్నట్లుండి చేతిని జాస్తూ అన్నాడు వృద్ధుడు.

అంతకుముందు మాదిరి వేగంగా కదలలేకపోతున్నాడు అతను. ఆయాసం అధికం అయిపోతున్నట్లు అస్పష్టంగా వున్నాయి మాటలు.

కత్తిని అందుకుని అతను వెనుతిరిగే లోపలమీదికి దుమికి తమ పంజాలకు పని చెప్పేస్తాయి ఎలుగులు. ఎదురు దాడి చేసేందుకు అవసరమైన వ్యవధిని అవి ఇవ్వవు.

"అయిపోయిందిరా నా పని... ఇంక పరిగెత్తటం నావల్ల కాదు" అంటూ ఒక్కసారిగా ఆగిపోయాడు వృద్ధుడు.

కనుచివరల నుంచి అతనివంకే చూస్తున్నాడు శివుడు. అతను ఆగిపోగానే తనుకూడా ఆగిపోయాడు.

ఒక్కసారిగా వచ్చివారిద్దరి మీద పడాలి వెనుక వున్న భూతాలు. అయితే అలా జరగలేదు. ఆగిపోయిన వెంటనే ఆగిన చోటే నిలబడి వుండలేదు శివుడు. పక్కకు జరిగి వృద్ధుడి మీద పడ్డాడు. అతని భుజాల చుట్టూ చేతులు వేసి అతన్ని కూడా క్రింద పడవేశాడు.

వారిద్దరూ ఆగిపోతారని గాని, క్రింద పడతారని గాని ఊహించలేదా ఎలుగులు. వేగంగా ముందుకు వెళ్లిపోయాయి. పది అడుగుల దూరం పోయిన తర్వాత గాని వాటికి తెలియలేదు శత్రువులిద్దరూ వెనుకే వుండిపోయిన సంగతి. తెలిసిన వెంటనే అవికూడా వెనక్కి తిరిగాయి.

ఎగసుకు వస్తున్న ఆయాసాన్ని అణచుకోవటానికి ప్రయత్నం చేస్తూ క్రిందనించి లేచి, తన చురకత్తిని వాటికేసి జాచాడు శివుడు.

సరిగ్గా అప్పుడే అతని చెవులకు చేరింది వాసుదేవుడి కంఠం. "ఒరేయ్ శివుడు... ఎక్కడ? ఎక్కడ వున్నావురా" అంటూ.

విపరీతమైన సంతోషంతో ఉక్కిరిబిక్కిరి అయిపోతూ, గొంతెత్తి ఒక గావుకేక పెట్టాడు శివుడు. గుండెలు జలదరించేలా ధ్వనిస్తుందని అతను అనుకున్నాడు గాని, ఆయాసం మూలకంగా పీలగా వినవచ్చిందది.

మూడు గంతుల్లో అతని మీదికి, క్రిందనే వున్న వృద్ధుడి మీదికి వచ్చి పడవలసిన ఎలుగులు– ఎందుకనో ఒక్కసారిగా ఆగిపోయాయి.

ఆశ్చర్యంగా చూసిన శివుడికి వెంటనే కనిపించాయి కాగడాలు. పొదల మీదినించి వస్తున్న గాలితెరలు తగిలి భగభగలాడుతున్నాయి అవి.

"శివుడు... ఎక్కడ? ఎక్కడరా?" అని మరోసారి కేక వేయబోతూ, పిశాచాల మాదిరి నిలబడివున్న ఎలుగుల్ని చూచాడు వాసుదేవుడు.

"ప్రభూ... జాగ్రత్త..." అని సాగరుల వారిని హెచ్చరిస్తూ, తన కాగడాలతో సహా వాటి మీదికి దుమికాడు.

అతనితోపాటు సాగరుల వారు, ఆయన వెనుకగా జ్వాల అందరూ ముందుకు వచ్చేసరికి వేగంగా దిగజారిపోయింది ఎలుగుల ధైర్యం. నిటారుగా నిలుచున్నవి కాస్తా ముందు పాదాలను నేలకు ఆనించి అతివేగంగా అడవిలోకి పరిగెత్తాయి.

"నీకు అసలు బుద్ధి అనేది లేదురా... చీకటి పడిన తర్వాత ఎవరైనా ఒంటరిగా వేటకు వస్తారా? మేము రావడం క్షణం ఆలస్యం అయివుంటే ఏమైపోయి వుండేవాడివి?" కోపంగా అంటూ శివుడి దగ్గరికి వచ్చి, క్రింద వున్న వృద్ధుడిని చూడగానే, అదిరిపడి మాటల్ని ఆపేశాడు వాసుదేవుడు.

"మీరుకూడా వీడితో చేతులు కలిపారా?" చేతిని అందించి లేపి నిలబెడుతూ ఆశ్చర్యంగా అడిగాడు.

"శిఖావంతుడి భల్లూక సైన్యం మీ ఏనుగుల్ని ఎలా చెదరగొట్టిందో తెలుసుకోవటానికి తనుకూడా ఒక ఎలుగుబంటిని పట్టుకోవటానికి ప్రయత్నం చేస్తున్నాడు... అవునా కాదా?" చిరుకోపంతో అడిగాడు వృద్ధుడు.

అవునని తలవూపాడు వాసుదేవుడు.

"ఒకదాన్ని పట్టుకుని వాడికి బహుమతిగా ఇవ్వాలని నేను ఇటుగా వచ్చాను. నా వెనుకే వాడు కూడా తయారయ్యాడు..." చెప్పాడతను.

"మరి దేన్నయినా పట్టుకున్నాడా?" అడిగాడు వాసుదేవుడు.

తలవూపి జరిగినదంతా చెప్పాడు వృద్ధుడు. "వెనక్కి వెళ్లి చూద్దాం. ఆ ఎలుగు ఇంకా అక్కడే వుండి వుండవచ్చు" అంటూ తిరిగి వెనక్కి దారి తీశాడు.

పారిపోయిన ఎలుగులు పొదలచాటున మాటువేసి మళ్ళీ మీదికి దుముకకుండా వుండేందుకు కాగడాల్ని గాలిలో వూపుతూ వెంట నడిచారు అందరు.

పదినిమిషాలు పట్టింది వారికి వృద్ధుడు తేనెపాత్రతో ఎలుగుల్ని ఆకర్షించిన ప్రదేశాన్ని చేరుకోవటానికి.

మెడకు చుట్టుకున్న ఉచ్చును వదిలించుకోవటానికి పిచ్చి పిచ్చిగా ప్రయత్నం చేస్తూ అక్కడే వుండవలసిన మొదటి ఎలుగు మాత్రం వారికి కనిపించలేదు. తనను చుట్టుకున్న త్రాటిని కోరలతో కొరికి ఛిన్నాభిన్నం చేసి, అడవిలోకి పారిపోయింది అది. ఆ చుట్టుపట్ల ఎక్కడా కనిపించలేదు వారికి.

❖ ❖ ❖

"ప్రభువులు వాసుదేవుడితో కలిసి పొదల్లోకి వచ్చివుండకపోతే ఈ పాటికి నువ్వు ప్రాణాలు వదిలేసి వుండేవాడివి. ఇంకెప్పుడూ ఇటువంటి పనులు చెయ్యబోకు" జరిగినదంతా జ్వాల చెప్పగా విని, కోపంగా శివుడిని హెచ్చరించింది చారులతాదేవి.

ఆమె మట్టిపాత్రలో అందించిన జావను తాగుతూ బుద్ధిగా తలవూపాడు శివుడు.

"తల వూపడం కాదు. నాకు మాటను ఇవ్వు. ఇంకెప్పుడు ఎలుగుబంట్ల కోసం పొదల్లోకి పోనని" పట్టుదలగా అన్నది ఆమె.

"వెళ్ళను తల్లీ... బుద్ధి వచ్చింది... అసలు యికమీదట వాటి ఊసే తలపెట్టను" తడుముకోకుండా చెప్పాడు శివుడు.

ఫక్కున నవ్విన జ్వాల చారులతాదేవి కోపంగా చూసేసరికి, చటుక్కున తలవంచుకున్నది.

"ఎందుకే ఆ నవ్వు?" కోపంగా అడిగింది ఆమె.

"ఎలుగుబంట్ల జోలికి పోకపోతే శిఖావంతుడి సైన్యాన్ని ఎదిరించే మార్గం ఎలా తెలుస్తుంది అత్తా?" అడిగింది జ్వాల.

"ఆ తెలుసుకునేది ఏదో పెద్దవాళ్ళు తెలుసుకుంటారు. మీరు విరగబడి ప్రాణాల మీదికి తెచ్చుకోవాల్సిన అవసరంలేదు" ఖచ్చితంగా చెప్పి కుటీరంలోకి వెళ్ళిపోయింది చారులతాదేవి.

జావను తాగిన తర్వాత మట్టిపాత్రను క్రిందపెట్టి నెమ్మదిగా తన ఏనుగుల దగ్గరికి పోయాడు శివుడు. తొండాన్ని ఊపుతూ అతని దగ్గరికి వచ్చి తలతో అతని గుండెల్ని తడిమింది గున్న. దగ్గరికి జరిగి నిలబడ్డాయి పెద్దవి రెండు.

సాగరుల వారి గురుదేవుడు ఎలుగుమీద ఉచ్చును విసిరిన దగ్గర్నించీ మొదలుపెట్టి సాగరుల వారు కాగడాలతో వచ్చినంత వరకూ వివరంగా వాటికి చెప్పాడు శివుడు.

"శిఖావంతుడి సైన్యాన్ని ఎదిరించే మార్గం ఒకటి నాకు తెలిసినట్లే తెలిసి అంతలోనే ఎటో వెళ్ళిపోయింది. గుర్తు చేసుకోవటానికి ప్రయత్నం చేస్తున్నాను. కాని గుర్తుకు రావడం లేదు" అని అన్నాడు.

తమ ఉనికి అతనికి, అతని ఏనుగులకు తెలియకుండా కొంచెం ఆవలగా వున్న పొదచాటున కూర్చుని అతని మాటలన్నిటినీ విన్నారు వాసుదేవుడు, జ్వాల.

"ఎలుగుబంట్లు మీదపడి ప్రాణాలు తీసేస్తాయని భయపడినట్లున్నాడు. మతిమరుపు వచ్చేసింది" చిన్న కంఠంతో అన్నది జ్వాల.

"ఏ విషయంలో మతిమరుపు?" ఆశ్చర్యంగా అడిగాడు వాసుదేవుడు.

"మనం పట్టుకు వెళ్ళిన కాగడాల్ని చూసి ఆ ఎలుగులు బెదిరాయి. నిప్పును చూస్తే అడవి జంతువులు ఏవైనాసరే దూరంగా పారిపోతాయి" చెపుతూ వాసుదేవుడి వంక ప్రశ్నార్థకంగా చూసింది ఆమె.

"శిఖావంతుడి సైన్యం మీదికి కూడా కాగడాల్ని పట్టుకువెళితే?" అంతకుముందు లేని ఉత్సాహం ఒక్కసారిగా మాటల్లో ప్రతిధ్వనిస్తుండగా అడిగింది.

గట్టిగా నిట్టూర్చి తల అడ్డం తిప్పాడు వాసుదేవుడు. "చీకటి సమయం కాబట్టి కాగడాల వెలుగును చూసి భయపడ్డాయి ఆ ఎలుగులు. పగటివేళలో ఆ వెలుగు కనిపించదు. వేడి తగిలితే తప్ప తమ ఎదుట నిప్పు వున్నదని వాటికి తెలియదు... అంత దగ్గరిగా కాగడాల్ని పట్టుకుపోవటం చాలా కష్టం" అన్నాడు.

"మరి శివుడికి వచ్చి మాయమైన ఆలోచన ఏమై వుంటుంది?" అడిగింది జ్వాల.

"గుర్తుకు వచ్చిన తర్వాత వాడే చెపుతాడు" అంటూ నెమ్మదిగా వెనక్కి జరిగాడు వాసుదేవుడు.

శివుడి పక్కనే నేలమీద పడుకున్నది గున్న. దాని నడుము మీద తలపెట్టుకున్న శివుడి మొఖాన్ని తొండాలతో నిమురుతూ నిలుచున్నాయి పెద్ద ఏనుగులు.

"వాడు నిద్రకు ఉపక్రమించాడు. మనంకూడా వెళ్లిపోదాం" అంటూ జ్వాలకు సైగ చేసి కుటీరం వైపు అడుగులు వేశాడు వాసుదేవుడు.

❖ ❖ ❖

శక్తివంచన లేకుండా ప్రయత్నం చేసింది జ్వాల నిద్రపోవటానికి. పొరపాటున కూడా మూతలు పడలేదు ఆమె కనులు.

"మెత్తటి పరుపుల మీద పడుకోవటానికి అలవాటు పడటం వల్ల వచ్చిన తంటా ఇది... అందుకే నిద్ర రావటం లేదు" అంటూ తాను శయనించిన బండరాయి మీది నించి లేచి చుట్టూ చూసింది.

సమాధుల దగ్గర కనిపించాడు ఆమెకు గాఢనిద్రలో వున్న వృద్ధుడు. సాగరుల వారు, వాసుదేవుడు ఇద్దరూ తమ గజదళం దగ్గరికి వెళ్ళి వున్నారు. కుటీరం ద్వారంలో నిద్రిస్తోంది చారులతాదేవి.

"ఈ ప్రదేశంలో నిశాచరురాలి మాదిరి నిలుచున్నదాన్ని నేను ఒక్కతినే కాబోలు..." అనుకుంటూ కుటీరంలోకి వెళ్లింది జ్వాల.

అక్కడ వున్న కుండలోని నీటిని తాగి, తిరిగి తాను విశ్రమించిన బండరాయి దగ్గరికి రావాలని ఆమె ఉద్దేశ్యం.

కుండమీద పెట్టబడి వున్న మట్టిపాత్రలో నీటిని ముంచుకుంటూ వుండగా, ఆమె చూపులు ఎదుట వున్న కుటీరం గోడకేసి ప్రసరించాయి.

పళ్ళు, ఫలాలతో నిండివున్న బుట్ట ఆ గోడ దగ్గరే నిలబెట్టి వున్నది. దాన్ని చూసేసరికి జ్వాల కనులముందు మరోసారి మెదిలింది సంపంగి నగరం రాజభవనంలోని సామాన్ల కొట్టంలోని పాతకాలపు బుట్ట.

రకరకాల వస్త్రాలు కూడా కనిపించాయి ఆ బుట్టలో. అటువంటివే ఆ కుటీరంలో కూడా ఎక్కడయినా అగుపిస్తాయా??

వృద్ధుడు ధరించే చర్మపు దుస్తులు తప్ప మరే విధమైన వస్త్రాలు లేవు కుటీరంలో. చారులతాదేవి తన వెంట తెచ్చుకున్నవి, తనవి మాత్రమే ఒక పక్కగా మడతలు పెట్టి వున్నాయి.

నీటిని తాగి దాహం తీర్చుకునే ఆలోచనను విరమించుకుని, కుటీరం మధ్య భాగంలో వెలుగుతున్న చిన్న నెగడులోంచి ఒక కట్టెను బయటికి లాగింది ఆమె. గట్టిగా ఊది కాగడా మాదిరి మంటను పెద్దదిగా చేసింది. అది వెలువరిస్తున్న వెలుగులో కుటీరాన్నంతా కలియచూసింది.

"మనం ఇక్కడికి వచ్చినప్పటినుంచీ చూస్తున్న ప్రదేశమే... కొత్తగా కనిపించే వింతలు, విశేషాలు ఇప్పటికిప్పుడు ఈ నిశిరాత్రి వేళ కనిపిస్తాయని అనుకోవటం భ్రమ..." చిన్నగా వినవచ్చింది వాసుదేవుడి కంఠం కుటీరం వెనుక భాగంలోని ద్వారం దగ్గర్నించి.

ఉలిక్కిపడి చేతుల్లోని నిప్పు మొద్దును క్రిందపడవేసినంత పని చేసి అంతలోనే సర్దుకున్నది జ్వాల.

"మన స్థావరాన్నంతా కలియతిరిగే బాధ్యతను నాకు అప్పగించారు సాగరుల వారు. చీకటి మాటున ఆ ఎలుగులు సెలయేటిని దాటి దాడి చేయటానికి వస్తాయని వారి అనుమానం" అని చెబుతూ లోనికి వచ్చాడు.

"ఇప్పుడు నువ్వు చేయదలచుకున్నది ఏమిటి?" అనికూడా అడిగాడు.

"ఈ కుటీరం యజమాని అయిన వృద్ధుడికి సంబంధించిన వస్తువులు ఏవైనా ఇతరుల కంటపడకుండా దాచిపెట్టడానికి ఇక్కడ అవకాశం వున్నదో

లేదో తెలుసుకోవాలి" నిప్పుమొద్దు వెలుగును గోడలన్నిటి మీద పడేటట్లు తిప్పుతూ చెప్పింది జ్వాల.

"వంటరిగా నివశిస్తున్నాడు... అడవి మీద ఆధారపడి బ్రతుకుతున్నాడు. వేరే వస్తువులు ఏముంటాయి? కత్తులు, బాణాలు తప్ప" అడిగాడు వాసుదేవుడు.

"బయట వున్న సమాధుల్లో నిద్రిస్తున్నది అతని మాదిరి మగవాళ్ళు కాదు. అడవాళ్ళు.. ఆడవాళ్ళకి కత్తులు, బాణాలు సరిపోవు... అవసరమైన సామాగ్రి చాలా వుంటుంది. అటువంటివి ఏవైనా ఈ ప్రదేశంలో కనిపిస్తాయని నా ఆశ..." చెప్పింది జ్వాల.

"అటువంటివే గనుక ఏమైనా వుంటే, వాటిని పరాయివారు పరికించ కూడదని అతను భావిస్తూ వుంటే కనిపెట్టడం చాలా కష్టం" అన్నాడు వాసుదేవుడు.

"పరాయివారు పరికించకూడదని వస్తు సముదాయాన్ని ఎవరెవరు ఎక్కడెక్కడ దాచిపెట్టి వుంచుతారో నాకంటె మీకే బాగా తెలుసు.. మనం చేస్తున్నది అధర్మకార్యమని అనుకోకుండా మీరు గట్టిగా చూడండి" అంటూ ప్రోత్సహించింది జ్వాల.

తన వృత్తిలో అటువంటి పనులు చేయటానికి ప్రత్యేకమైన శిక్షణ ఇవ్వబడుతుందన్న సంగతి ఆమెకు తెలిసినందుకు అతిగా ఆశ్చర్యపడలేదు వాసుదేవుడు.

ఆమె చేతిలోని నిప్పుమొద్దును తను తీసుకుని ముందుగా కుటీరంలోని నేలనంతా నిశితంగా చూశాడు. ఆ తరువాత గోడలవంక పరికించటం మొదలుపెట్టాడు.

వెనుక గోడ దగ్గర ద్వారానికి రెండు అడుగుల దూరంలో నేలకు మూడు అడుగుల ఎత్తునవున్న ఒక కొండరాయిని చూడగానే దగ్గరికి పోయి అరచేత్తో గట్టిగా తట్టాడు.

ఆ రాతి వెనుక భాగం బోలుగా వున్న శబ్దం వెంటనే వినవచ్చింది. నిప్పుమొద్దును జ్వాలకు అందించి, ఆ రాయిని పట్టుకుని బలంగా ముందుకు లాగాడు. వెంటనే కదిలింది అది. ఊడి అతని చేతిలోకి వచ్చింది. అది

ఊడిన ప్రదేశంలో వారికి కనిపించింది ఒక పెద్ద అర. ఆ అర నిండుగా వున్న పాతకాలపు దుస్తులు, విలువైన ఆభరణాలు అగుపించాయి.

❖ ❖ ❖

శిఖావంతుడి భల్లూక సైన్యం గుంపు కట్టి తనమీదికి వస్తున్నట్లు కల కన్నాడు శివుడు. అదిరిపడి లేచి కూర్చున్నాడు.

అప్పటికే రెండు అడుగులు ముందుకు వేసి, సెలయేటికేసి చూస్తున్నాయి అతని ఏనుగులు. అతను లేచి కూర్చోగానే చిన్నగా శబ్దం చేస్తూ అతని వంక చూశాయి.

"అర్థం అయింది. ఏదో ప్రమాదం ముంచుకు రాబోతున్నదని నాకు అనిపించబట్టే ఒక దరిద్రపు కల వచ్చింది" అంటూ పైకి లేచి ముందుకు పరిగెత్తాడు శివుడు.

సెలయేరు దాటి ఆవలి పక్కకు పోయేందుకు వీలుగా వృద్ధుడు నిర్మించిన రాళ్ళ వంతెనమీదుగా ఇవతలి ఒడ్డుమీదికి వస్తూ కనిపించాయి అతనికి రెండు ఎలుగులు.

"ఇవి మనమీద కక్షను పెంచుకున్నట్లు కనిపిస్తోంది. మన అడుగుజాడల్ని బట్టి వెతుకుతూ వచ్చేశాయి" తన వెనుకే వచ్చిన ఏనుగులకు చెబుతూ, కుటీరం ముందున్న నెగడు దగ్గరికి పరిగెత్తాడు శివుడు.

సాగరుల వారు, వాసుదేవుడు తమతోపాటు అడవిలోకి తెచ్చిన కాగడాల వంటివే మరికొన్ని ఆ నెగడు దగ్గరే కనిపించాయి అతనికి.

రెండింటిని తీసి నెగడులో పెట్టాడతను. అవి అంటుకుని జ్వాలల్ని వెలువరించటం మొదలుపెట్టగానే వాటిని పట్టుకుని ఎలుగులకు ఎదురు పరిగెత్తాడు.

ఎలుగుల్ని చూసీ చూడగానే ఎక్కడివక్కడ ఆగిపోయాయి ఏనుగులు. కాగడాలతో అతను వాటికి ఎదురు వెళ్ళటాన్ని చూసి ముందుకు కదిలింది గున్న. తొండాన్ని గాలిలోకి ఎత్తి కీచుగా ఘీంకరిస్తూ పరిగెత్తింది.

తమ బిడ్డ కదిలేసరికి, ఆగలేకపోయాయి పెద్ద ఏనుగులు. చెవులు చిల్లులు పడేటట్లు శబ్దాలు చేస్తూ అవికూడా ఒడ్డుకేసి నడిచాయి.

ఆ శబ్దాలకు నిద్రాభంగమై వేగంగా పైకి లేచాడు వృద్ధుడు. గజదళం దగ్గర వున్న సాగరులవారు కూడా పరిగెత్తుకు వచ్చారు.

"వాటి సంగతి తర్వాత చూద్దాం... ఇప్పుడు వద్దు" జ్వాల బయటికి తీస్తున్న ఆభరణాలను, వస్త్రాలను తిరిగి వెనక్కి నెట్టి ఇవతలికి లాగిన కొండరాయిని యథాస్థానం లోనికి చేర్చాడు వాసుదేవుడు. తన ఖడ్గాన్ని పట్టుకుని బయటికి పరిగెత్తుకు వచ్చాడు.

అతని వెనుకే వెళ్ళబోయిన జ్వాల చేతిని పట్టుకుని బలవంతంగా ఆపివేసింది చారులతాదేవి.

తన వారందరూ ఆయుధాలతో ప్రమాదాన్ని ఎదిరించటానికి వస్తున్న సంగతిని శివుడు గమనించలేదు.

"నేను కాగడాలతో వాటిని బెదిరిస్తాను... మీరు వాటిని క్రిందికి నెట్టి పచ్చడి చేసేయండి" అని తన ఏనుగులకు చెపుతూ ఎలుగుల మీదికి పోయాడు.

తమ పంజా దెబ్బతో అతని గుండెల్ని చీల్చివేయాలన్నంత కక్ష ఆ ఎలుగుల కళ్ళల్లో కనిపిస్తోంది. అతని చేతుల్లోని కాగడాలు వాటిని కొద్దిగా వెనకడుగు వేసేటట్లు చేశాయి.

అవి అలా వెనక్కి జరిగిన సమయంలోనే వేగంగా పోయి వాటిని తమ తొండాలతో చుట్టి నేలకేసి కొట్టాయి ఏనుగులు. పాదాలతో బలంగా అదిమాయి.

వికృత శబ్దాలు చేస్తూ విరిగిపోయాయి ఎలుగుల శరీరాల్లోని ఎముకలు. పోరాటం మొదలైన మూడే మూడు క్షణికాల్లో అవి ప్రాణాలు పోగొట్టుకుని కదలిక లేకుండా వుండిపోయాయి.

❖ ❖ ❖

"... ఇదే.. ఇదే నాకు గుర్తుకు వచ్చినట్టే వచ్చి వేధించుకు తింటున్న విషయం. ఇదే శిఖావంతుడి సైన్యాన్ని ఎదిరించే ఉపాయం..." తల్లిదండ్రుల కంటె ముందుగా కదిలి తన వెనుకే ఎలుగుల మీదికి వచ్చిన గున్న తలను గట్టిగా కౌగలించుకుంటూ బిగ్గరిగా అరిచాడు శివుడు.

"ఏమిటిరా అది? కాగడాలతో ఎలుగుల్ని బెదిరించటమా?" నొసలు ముడివేస్తూ అడిగాడు వాసుదేవుడు.

అవునని తలవూపాడు శివుడు.

"ఏడ్చినట్లుంది నీ ఉపాయం. పగటి సమయంలో కాగడాల వెలుగు ఎలుగులకు కనిపించదు... అవి బెదరవు" అన్నాడతను.

"పగటి సమయంలో కనిపించవు... నిజమే... కాని మనం పగటిపూట ఏనుగుల్ని కదిలించము... చీకటి సమయంలోనే దాడికి దిగుతాము..." అన్నాడు శివుడు.

ప్రాణాలు వదిలిన ఎలుగుల శరీరాల వంక చూస్తూ నిలబడిన సాగరుల వారి వళ్ళు ఝల్లుమన్నది ఆ మాటల్ని వినేసరికి. తనకు తెలియకుండానే తల తిప్పి వృద్ధుడి వంక చూశాడు.

"చీకటి వేళలో గజయుద్ధమా? ఇంతవరకూ ఇటువంటి మాటను నేను ఎక్కడా వినలేదు..." సాలోచనగా అన్నాడు వృద్ధుడు.

"ఎలుగుల వంటి క్షుద్రజీవుల పనిపట్టాలంటే ముందుగా వాటికి కొంత భయాన్ని కలిగించాలి. అది మంటల్ని చూపించడం వల్లనే సాధ్యపడుతుంది. మన ఏనుగులు ఏ సమయంలోనైనా మన మాట వింటాయి. నా గున్న ఎలా కదిలిందో మీరు చూశారు కదా..." అన్నాడు శివుడు.

తను ఏం చెపితే అది చేసే పట్టపు టేనుగు కనులముందు మెదిలి, సాగరుల వారి పెదవులమీదికి పరిగెత్తుకుంటూ వచ్చేసింది ఒక చిరునవ్వు.

అప్పటికప్పుడు వెనుతిరిగి తన గజదళం దగ్గరికి పోయి, వాటన్నిటినీ ప్రయాణానికి సిద్ధం చేయాలని అనిపించింది గాని, అడవిదారిలో పొంచివుండే ప్రమాదాల సంగతి గుర్తుకు వచ్చి, ఆ కోరికను అతి బలవంతంగా అణుచుకున్నాడు సాగరులవారు.

"అందరూ నిద్రలకు ఉపక్రమించండి... తెల్లవారగానే మనం ప్రయాణం అవుతున్నాము" ఖచ్చితమైన కంఠంతో చెప్పి, వడివడిగా అడుగులు వేస్తూ ఏనుగుల దగ్గరికి వెళ్ళిపోయాడు సాగరుడు.

అతని కంఠంలో ధ్వనించిన ఉత్సాహం అందరినీ ఆకర్షించి, వారిని కూడా ఉత్తేజితుల్ని చేసింది. ఎవరి స్థానాల్లోకి వారు వెళ్ళి విశ్రమించారు గాని, సాగరుల వారు ఆజ్ఞాపించినట్లు నిద్రలు మాత్రం పోలేకపోయారు.

"శివుడి ఎత్తుగడ ఫలితాన్ని ఇస్తుందంటావా అత్తా?" అటు దొర్లి, ఇటు దొర్లి అర్థఘడియ తరువాత చారులతాదేవిని అడిగింది జ్వాల.

"ఫలితాన్ని ఇస్తుందనే ప్రభువులు భావిస్తున్నారు..." చెప్పింది చారులతాదేవి.

"గజయుద్ధంలో మొనగాడు. పైగా తనకు ఆ విద్య నేర్పిన గురువు దగ్గరే వున్నాడు. వారిద్దరికీ తోచని ఈ ఉపాయం శివుడికి మాత్రమే ఎలా తోచింది" అడిగింది జ్వాల.

"వాడు వయసులోనే చిన్నవాడు. ఆలోచనల్లో చాలా పెద్దవాడు" అన్నది చారులతాదేవి.

"అటువంటి లక్షణాలు నేర్చుకుంటే వచ్చేవి కావు... పుట్టుకతోనే వస్తాయి. నీకు తెలిసి అటువంటి చురుకయిన జ్ఞానం కలిగిన వాళ్ళు సంపంగి నగరంలో గానీ, లేక మన రాజ్యంలో గాని ఎవరైనా వున్నారా?" మళ్ళీ అడిగింది జ్వాల.

"వెలుగు రాగానే ప్రయాణమని ప్రభువుల వారు ఆదేశించారు. నిద్రపొమ్మని చెప్పారు. వినిపించలేదా?" చిరాకుగా అడిగింది చారులతాదేవి.

చిన్నగా నవ్వింది జ్వాల. తను అటువంటి ప్రశ్నలు ఎందుకు వేస్తున్నదో ఆమెకు అర్థమైనందువల్లనే అలా చిరాకు పడుతున్నది.

"అత్తా.. నిజం చెప్పు. శివుడి తల్లిదండ్రులు ఎవరో నిజంగానే నీకు తెలియదా?" వున్నట్లుండి దగ్గరికి జరిగి ఆమె మొఖంలోకి సూటిగా చూస్తూ అడిగింది.

"నిజమేమిటి? అబద్ధమేమిటి? తెలిసివుంటే ఒకటికి పదిసార్లు వాడు మా బిడ్డ మా బిడ్డ అని గొంతుచించుకుని చెప్పవలసిన అవసరమే వుండేది కాదు. వాడి పెద్దవారిని పిలిపించి శాస్త్రప్రకారం మాకు దత్తుడిగా స్వీకరించి వుండేవాళ్ళం. మేము ప్రకటించవలసిన అవసరం లేకుండానే వాడు సంపంగి నగరానికి కాబోయే ప్రభువని అందరికీ తేటతెల్లం అయి వుండేది" కొంచెం ఆవేశంగా చెప్పింది చారులతాదేవి.

"నిద్రపట్టక కాలక్షేపం కోసం మాట్లాడిన మాటలకు నువ్వు ఇంతగా ఆవేశపడవలసిన అవసరం లేదత్తా... ఇంక నిన్ను విసిగించను. నిద్రపో" అంటూ అవతలి పక్కకు తిరిగి కనులు మూసుకున్నది జ్వాల.

పది నిమిషాల తరువాత తలతిప్పి చూసింది. నిద్రపోయింది చారులతాదేవి. ఒంటిమీద చెయ్యి వేసినా గమనించలేనంత గాఢ నిద్దుర.

చప్పుడు చేయకుండా పైకి లేచింది జ్వాల. నాలుగు అడుగుల్లో వెనుక ద్వారాన్ని సమీపించి, అంతకుముందు వాసుదేవుడు వెలికి తీసిన కొండరాయిని ఇవతలికి లాగి, దాని వెనుక భాగంలో భద్రపరచి వున్న వలువల్ని, ఆభరణాల్ని నేలమీద పెట్టింది.

"తన శిష్యుడికి చెందిన వారిమని మనల్ని ఆదరించాడు సాగరుల వారి గురుదేవుడు. ఆయన దాచిపెట్టుకున్న రహస్యాల్ని తెలుసుకోవటమే ఒక తప్పు. ఆ రహస్యాలకు చెందిన ఆధారాల్ని మాయం చెయ్యాలని కోరుకోవటం మహా తప్పు..." రహస్యంగా వినవచ్చాయి వాసుదేవుడి మాటలు.

ఉలిక్కిపడి చూసిన జ్వాల కనులకు కనుపించాడు అతను ద్వారం వెలుపల. "తెల్లవారగానే ప్రయాణమని సాగరుల వారు చెప్పగానే నువ్వు ఇటువంటి పని ఏదో చేస్తావని నేను ఊహించాను" ఆమె తల ఎత్తి చూడగానే అన్నాడు అతను.

"తిరిగి మనం ఈ ప్రదేశంలోకి వస్తామో రామో తెలియదు. వాటి గుట్టు ఏమిటో బట్టబయలు కాకపోతే నాకు నెమ్మదిగా వుండదు" ఆభరణాలన్నిటినీ ఒక పెద్ద వలువలో మూటకట్టి అతని దగ్గరికి జరుపుతూ చెప్పిందామె.

"ఇప్పుడు ఈ సమయంలో వీటిని పరిశీలించటానికి వీలుపడదు. తీరికగా పరిశోధిద్దాము..." అంటూ ఆ మూటని, కుటీరంలోనే వున్న జ్వాలకు సంబంధించిన సామాగ్రిలో దాచిపెట్టేశాడు వాసుదేవుడు. ఆమె ఇవతలికి లాగిన కొండరాయిని యథాస్థానంలోకి నెట్టి తను వెలుపలికి వెళ్లిపోయాడు.

తేలికపడిన మనస్సుతో మేనత్త పక్కనే పరుండి, కనులు మూసుకున్నది జ్వాల. అతి కొద్దిసేపట్లోనే నిద్రలోకి జారిపోయింది.

❖ ❖ ❖

నిద్రచాలకపోవటం వల్ల నిప్పు కణికల మాదిరి ఎర్రబడి పోయి వున్నాయి మంత్రి మహేశ్వరుడి కనులు. తమకు జరిగిన అవమానాన్ని తలచుకుని తలుచుకుని క్రుంగిపోయి వున్నది అతని అంతరంగం.

జ్వలిత సామ్రాజ్యానికి పెట్టని కోటవంటి సంపంగి నగర గజసైన్యం దిక్కు తెలియని రీతిలో పారిపోయి రావటం అదేపనిగా కలచివేస్తోంది అతని గుండెల్ని.

తను అధైర్యపడుతున్నట్లు బయటికి కనిపిస్తే తమతో వున్న యావన్మందీ అదే మాదిరి భీతావహులవుతారన్న సంగతి పూర్తిగా తెలిసినవాడు కాబట్టి, తనను అల్లకల్లోలం చేస్తున్న భావాలను తనలోనే దాచుకుని, బయటికి మాత్రం గంభీరంగా కనిపిస్తున్నాడు అతను.

శిఖావంతుడి సైన్యాన్ని ఏమార్చి, తమ సర్వస్వాన్నీ కోటలోనే వదిలి, మూడు వంతులకు పైగా అడవిలోకి పారిపోయి వచ్చారు సంపంగి నగర పౌరులు.

"మీరు మాకు ఏం చేయాలో చెప్పండి. ఏవైనా ఆయుధాల్ని మాకు ఇవ్వండి. మూకుమ్మడిగా పోయి శిఖావంతుడి సైన్యాన్ని ఎదిరిస్తాం... విజయమో వీరస్వర్గమో తేల్చుకుంటాము" పారిపోయి వచ్చిన వారిలో అనేకమంది యువకులు అదేపనిగా అడగటం మొదలుపెట్టారు అతన్ని.

తలవూపి వారితోపాటు తాను కూడా బయలుదేరాలన్న కోరికను అతి బలవంతంగా అదుముకుంటున్నాడు మహేశ్వరుడు. మృత్యువుకు ప్రతిరూపాలనదగిన తమ ఏనుగుల్నే భయపెట్టి కారడవి పాలు చేసిన భల్లూక దండు వున్నది శిఖావంతుడి సైన్యం దగ్గర. మదగజాల్నే భయపెట్టిన ఆ పిశాచాలు మానవుల్ని వదిలిపెడతాయా? చిటికెలో మట్టగించి మట్టిలో కలిపివేయవా?

తనంతట తానుగా కోటమీదికి దండు వెడలే ఆలోచనను అణిచేసుకున్నాడు అతను. "అందరికీ ఆహారం అందేలా చూసుకోవాలి మనం. ఏ క్షణంలోనైనా ప్రభువుల వారు రావచ్చు. ఆయన వచ్చిన వెంటనే మనం యుద్ధానికి బయలుదేరవలసి వుంటుంది. సిద్ధంగా వుండండి" చెట్లతోపులో తలలు దాచుకున్న తమ సైనికులకు, పౌరులకు చెపుతూ అంతకుముందు చారులతా దేవి విశ్రమించటానికి సిద్ధం చేయబడిన గుడారం దగ్గర నిలుచున్నాడు.

ఉన్నట్లుండి అతివేగంగా అతని దగ్గరికి వచ్చాడు ఒక సైనికుడు. "అడవిలో నుంచి అదేపనిగా ఏదో సందడి వినవస్తోంది. చెట్లమీద వున్న పక్షులన్నీ చికాకుగా ఎగురుతున్నాయి" వస్తూనే విన్నవించాడు అతను.

ఝల్లుమన్నాయి మహేశ్వరుడి గుండెలు. నల్లరాతి గుట్టలవైపు నుంచి మరికొన్ని సైన్యాలు... శిఖావంతుడివి... అటుగా రావటం లేదు కదా?

"అందుకోండి మీ ఆయుధాల్ని. దాడి చేయటానికి సిద్ధం అవండి" అని అందరినీ హెచ్చరిస్తూ తన కత్తిని ఒరలో నుంచి తీసి, చెట్లతోపు వెలుపలికి పరిగెత్తాడు.

కత్తుల్ని బరిశెల్ని, బాణాల్ని అందుకున్నారు సైనికులు. చేతులకు అందిన రాళ్ళను రప్పల్ని తీసుకున్నారు అక్కడ ఆశ్రయం పొందిన పౌరులు. అంతకుముందే సిద్ధం చేసి పెట్టుకున్న చెట్టుకొమ్మల్ని పట్టుకున్నారు అనేకమంది యువకులు.

అడవి లోపలి భాగంలోకి పోయిన సాగరులవారు తిరిగి వచ్చే సమయానికి తామందరూ ప్రాణాలతో వుండడం జరుగుతుందో, జరగదో తెలియకుండా పోయింది మహేశ్వరుడికి.

"ఒకసారి పారిపోయి వచ్చాము. ఇంకోసారి అటువంటి పని చేయలేము. ఈరోజు మనం ఉండటమో ఊడటమో జరిగిపోవాలి" పళ్లు బిగపట్టి చెప్పాడు తన వెనుక వున్న సైనికులందరికీ.

"జయము జయము... సాగరుల వారికి జయము జయము. జ్వలిత సామ్రాజ్యానికి అఖండ విజయము" ఒకేసారి గొంతులు కలిపి పెద్దగా నినదించారు సైనికులందరూ.

ఉప్పొంగి పోయింది మహేశ్వరుడి అంతరంగం. విపరీతమైన ఉద్వేగంతో స్వల్పంగా కంపించడం మొదలుపెట్టాయి అవయవాలు.

శత్రువు కనిపించిన వెంటనే దూసుకుపోవటానికి సిద్దంగా ఒక పాదాన్ని ముందుకు జాచి నిలుచున్నాడు.

వంద ధనువుల దూరంలో వున్న ఒక పెద్ద మర్రిచెట్టును దాటి ఒకే ఒక్క అడుగు ముందుకు వేసిన మరుక్షణం కనిపిస్తాడు శత్రువు.

బరిశె మొనల వంటి ములుగులు కలిగి వున్న బాణాలను విళ్ళకు తొడిగి, ఊపిర్లు బిగపట్టారు ధనుర్ధారులైన సైనికులు.

మర్రిచెట్టును దాటి ముందుకు వచ్చింది నడికొండ వంటి ఏనుగు. అది సంపంగి నగర గజదళానికి నాయకత్వం వహించే పట్టపు టేనుగు.

మతులు పోయినట్లు నోళ్ళు తెరుచుకు చూశారు పోరాటానికి సిద్ధంగా నిలబడిన సైనికులు అందరు. వెర్రివాడిలా నిలుచుండిపోయాడు మహేశ్వరుడు.

"సిద్ధంగానే వున్నారా? చాలా సంతోషం. చీకటిపడే సమయానికి మనం నగర సమీపంలోకి వెళ్లిపోవాలి. నడవండి... అందరినీ నడిపించండి... ఈ నట్టడవిలో కారట్లాడాల్సిన అవసరం మనకి లేదు." ఉరుములాంటి కంఠంతో

అందరికీ వినపడేటట్లు బిగ్గరగా అన్నాడు పట్టపు టేనుగు మీద ఆశీనుడై వున్న సాగరులవారు.

❖ ❖ ❖

వేళ తప్పకుండా పంచభక్ష్య పరమాన్నాలతో భోజనం చేసి తాంబూలం వేసుకోవటం కనకయ్య శ్రేష్టికి అలవాటు.

శిఖావంతుడి సైన్యం దగ్గర్నించి పారిపోయి వచ్చిన క్షణం నుంచీ పూర్తిగా మారిపోయింది ఆ అలవాటు.

"బ్రతకటం కోసమే ఆహారం. ఆహారం తీసుకోవటం కోసమే బ్రతకటం కాదు" తనవారికే కాదు తనకు కనిపించిన ప్రతివారికి చెప్పటం మొదలు పెట్టాడు.

శ్రావస్తి నగరానికి చేరుకున్న వెంటనే రాజధానికి ప్రయాణమై తన అజ్ఞానాన్ని చక్రవర్తికి ఎరుకపర్చి, క్షమాపణలు కోరుకోవాలని అనుకున్న అతని కోరిక మాత్రం అలాగే వుండిపోయింది. తీరలేదు.

శుశ్రుతుడితో కలిసి అతను శ్రావస్తి చేరుకున్న మూడు ఘడియల్లోనే నగరానికి దగ్గరగా ప్రత్యక్షమైనాయి శిఖావంతుడి ఆటవిక సైన్యం. వారివద్ద వున్న ఎలుగులను చూసి, అవి సామాన్యమైన పెంపుడు జంతువులని భ్రమపడిన పౌరులు కొంతమంది దుర్మరణం పాలవటంతో, అది శిఖావంతుడి పన్నాగమేనని పూర్తిగా అవగతమయింది అందరికీ.

"సంపంగి నగరం నుంచి గజబలం రాజధానికి వెళ్ళకుండా అడ్డుకోవటం శిఖావంతుడి లక్ష్యం..." ఆ సంగతి తెలిసిన వెంటనే అన్నాడు శుశ్రుతుడు.

సంపంగి నగరం పతనమైన వార్త అప్పటికే అల్లకల్లోల పరుస్తోంది శ్రావస్తి నగరాన్ని. రాజధానికి పంపగా నగర రక్షణకోసం నిలువరించిన సైన్యంలో కొంతమందిని సంపంగి నగరం వైపు పంపించాడు నగర పాలకుడు.

"ఆటవిక సైన్యం మనమీద దాడి చేయటానికి నిశ్చయించుకుంటే ఎదిరించటం ఎలాగో మాకు తెలియటంలేదు. ఎవరికైనా ఏదైనా ఆలోచన వస్తే మాకు చెప్పండి" నగర పెద్దలందరినీ సమావేశ పరచి అర్థించాడు నగర పాలకుడు.

తమను వివశుల్ని చేస్తున్న భయాందోళనలను బలవంతంగా అదుము కోవటానికి విఫల ప్రయత్నాలు చేస్తూ అందరూ కలిసి ఒక పక్కగా కూర్చుని వున్న కనకయ్య శ్రేష్ఠికేసి చూశారు.

"నాకు కొద్దిపాటి వ్యవధి ఇవ్వండి... ఆటవికులు నగరం మీద దాడి చేయటానికి వచ్చివుంటే ఈపాటికి ఆ పని జరిగిపోయి వుండేది. వాళ్లు రహదారులను దిగ్బంధనం చేసేందుకు వచ్చారు. మనకోసంకాదని నా ఉద్దేశ్యం" సాలోచనగా అన్నాడు కనకయ్య శ్రేష్ఠి.

"ఏ పని చేయటానికైనా సమర్థులు మీరు. మా ఆశలన్నీ మీ మీదనే" అర్థింపుగా అన్నాడు నగర పాలకుడు.

మొట్టమొదటిసారిగా అవతలి మనిషి మాటల్లోని ఆర్తి కనకయ్య శ్రేష్ఠికి అర్థం అయింది. శౌర్య సాహసాల్లో ఎవరికీ తీసిపోని శ్రావస్తినగర పాలకుడు. కాని ఇప్పుడు బేలగా మాట్లాడుతున్నాడంటే, అందుకు కారణం తన ప్రాణాలకు హాని జరగబోతున్నదని కాదు, తనమీద నమ్మకముంచిన నగరపౌరులకు ఆపద ముంచుకు వస్తోందని...

ఆ ముప్పును అడ్డుకోగల తెలివితేటలు తనకు మాత్రమే వున్నవని, అవతల అతనితోపాటు నగర పెద్దలు భావిస్తూ వుండటాన్ని గమనించేసరికి, అదోరకమైన సంతోషభావం శ్రేష్ఠి గుండెల్ని పులకింపచేసింది.

"నా సర్వశక్తులు, నా సర్వ సంపదలు పణంగా పెట్టయినా సరే నగర పౌరులకు ఎటువంటి కష్టాలు రాకుండా చూస్తాను. నన్ను నమ్మండి" తనకు తెలియకుండానే వాగ్దానం చేశాడు.

"కనకయ్య శ్రేష్ఠి వర్ధిల్లాలి... కనకయ్య శ్రేష్ఠికి జయము... జయము" ఒక్కసారిగా మార్మోగిపోయింది సభాభవనం.

ఏదో తెలియని అనుభూతితో నిండిపోయాయి శ్రేష్టి గుండెలు. అందరికీ చెప్పి వడివడిగా వెలుపలికి వచ్చి, తన అశ్వ శకటంలో కూర్చున్నాడు. పావు ఘడియ తరువాత తన భవనాన్ని చేరుకుని, శుశ్రుతుడిని తన దగ్గరికి రప్పించుకున్నాడు.

"నువ్వు ఏం చేస్తావో నాకు తెలియదు. ఏమైనా చెయ్... శ్రావస్తి మీదికి శిఖావంతుడి సైన్యం రాకూడదు" తన మనసులోని మాటను సూటిగా బయటపెట్టాడు.

"ఎటువంటి సైన్యాన్నయినా ఎదిరించేందుకు ఎన్నెన్నో మార్గాలున్నాయి. పిశాచాల వంటి ఆ ఎలుగు బంటి సైన్యాన్నే ఎలా ఎదుర్కోవాలో తెలియటం లేదు" సాలోచనగా అన్నాడు శుశ్రుతుడు.

"వాసుదేవుడి తర్వాత అంతటి మేధాశక్తి సంపన్నుడివని పేరు... గట్టిగా ఆలోచిస్తే నీకు సాధ్యం కాని పని అంటూ ఏమీ వుండదు. నా అంగబలం అర్థబలం నా సర్వసంపదలను పణంగా పెడతాను" అన్నాడు కనకయ్య శ్రేష్ఠి.

అటువంటి మాటలు అతని నోటివెంట వెలువడతాయని ఊహించలేదు కాబోలు, అమితాశ్చర్యంగా చూశాడు శుశ్రుతుడు.

సభా భవనంలో అందరూ తనకేసి చూసినప్పుడు నగర పాలకుడు తనను అర్థించినప్పుడు తనలో చెలరేగిన భావనలను వివరంగా అతనికి చెప్పాడు శ్రేష్ఠి.

"నలుగురి మంచినీ కోరుకోవటంలో ఇంత ఆనందం వుంటుందని, నేను ఎన్నడూ భావించలేదు" అనికూడా అన్నాడు.

"అన్నీ తెలిసిన నేను కూడా అపరాధం చేశాను. మీరు అప్పచెప్పిన పనిని దిగ్విజయంగా పూర్తిచేసి నా పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకుంటాను" అన్నాడు శుశ్రుతుడు.

వెంటనే తన ఆసనం ప్రక్కనే వున్న జేగంటను ఠంగున మ్రోగించాడు కనకయ్య శ్రేష్ఠి. ఆ శబ్ద తరంగాలు పూర్తిగా అణిగిపోకముందే ఆ మందిర ద్వారం దగ్గర ప్రత్యక్షం అయినారు అతని అనుచరులు అందరూ.

"ఈ క్షణం నుంచీ మీరు మీ పరివారం అందరూ శుశ్రుతుడి ఆజ్ఞలకు లోబడి నడుచుకోండి. మనం మన నగరాన్ని కాపాడుకోవాలి" గంభీరంగా అన్నాడు శ్రేష్ఠి.

"ప్రభువుల వారికి ఇంకా తెలిసినట్లు లేదు. నగరం వెలుపల వున్న ఆటవికులకుతోడుగా ఇంకో సైన్యం వస్తోంది. అది నగరంమీద దాడి చేయటానికి వస్తున్నట్టు అందరూ చెప్పుకుంటున్నారు" వీధిలో వుండగా తమకు తెలిసిన మాటను బయటపెట్టారు అనుచరులు.

అటువంటి మాట అంతకుముందు ఎప్పుడయినా హఠాత్తుగా చెవుల పడటం జరిగితే అందరికంటే ముందుగా తనకెందుకు తెలియలేదని

ఆగ్రహించేవాడు కనకయ్య శ్రేష్ఠి. అందరినీ తిట్టటమో, కఠిన శిక్షకు గురి చేయటమో జరిగివుండేది.

ఇప్పుడు మాత్రం పరమ ప్రశాంతంగా ఒక నిట్టూర్పును మాత్రం వెలువర్చాడు. "అనుకుంటూనే వున్నాము. జరగనే జరిగింది" అంటూ శుశ్రుతుడి కేసి చూశాడు.

"ఆ సైన్యం ఆటవికుల దగ్గరికి వచ్చేలోపుగా ముందు మనం ఆ ఎలుగుబంట్ల సంగతి తేల్చుకోవాలి. ఆలోచించు" అంటూ హెచ్చరించాడు.

తలవంచి నమస్కారం చేసి, ఆ మందిరం వెలుపలికి పోయాడు శుశ్రుతుడు. ప్రధాన గూఢచారి వాసుదేవుడితో సరిసమానమైన ప్రజ్ఞ అతనికి వున్నదని శ్రేష్ఠి చెప్పిన మాటల్లో అసత్యం ఏమీలేదు. శ్రావస్తి నగర కోట గోడల మీదినుంచి దూరంలో కనిపిస్తున్న ఆటవికుల గుడారాల్ని ఒకసారి చూడగానే, ముడివడ్డాయి అతని కనుబొమ్మలు తీవ్రమైన ఆలోచనతో.

"ఆయుధాలతో అవి కేవలం పాతిక సంఖ్యలోనే వున్నాయి. గుంపుగా పోయి కొంతమంది ఆటవికుల్ని, మిగిలినవారు ఆ భూతాలను ఎదిరించ వచ్చును గాని..." అంటూ మాటల్ని ఆపాడు ఆ అనుచరుల నాయకుడు.

అడవిని గురించి, అడవి జంతువుల గురించి, ముఖ్యంగా ఏనుగులను వేటాడటాన్ని గురించి పూర్తి అవగాహన కలిగినవాళ్ళు వాందరందూ. అందువల్ల అతని మాటల్ని అతిశయపు మాటలుగా భావించలేదు శుశ్రుతుడు. అసలు ఆ ఆటవికుల వద్ద వున్న ఎలుగుల సంఖ్యను చెప్పటంలోనే వారి ప్రజ్ఞ తేటతెల్లం అవుతోంది.

"నీ అభిప్రాయం వినటానికి నేను సిద్ధంగా వున్నాను... చెప్పు అదేమిటో" అని అతన్ని ప్రోత్సహించాడు.

"ఆ దుర్మార్గపు జీవులను చూసేసరికి సాగరులవారి గజబలం బెదిరి అడవిలోకి పారిపోయిందని విన్నప్పుడు మాకు ఆశ్చర్యం కలిగిన మాట నిజం. కాని ఇప్పుడు మేము ప్రత్యక్షంగా వాటిని చూసిన తర్వాత అర్థం అయింది. అవి మనవంక చూసే చూపులకు రక్తం గడ్డకట్టుకుపోతుంది. చెమటలు కమ్మి మైకం ముంచుకు వచ్చేస్తుంది..." తన అనుభవాన్ని వెంటనే చెప్పాడు ఆ అనుచరుల నాయకుడు.

మరింత తీవ్రంగా ఆలోచించాడు శుశ్రుతుడు. "ఈ ప్రపంచంలో మనకు ఎదురయ్యే ప్రతిసమస్యకి ఏదో ఒక పరిష్కారం వుండే వుంటుందని పెద్దలు చెపుతూ వుంటారు. మనం చెయ్యవలసిందల్లా దాన్ని వెంటనే కనిపెట్టటం..." అంటూ చేతులు వెనక్కి విరిచికట్టుకుని అటూ యిటూ తిరగటం మొదలు పెట్టాడు.

మిట్ట మధ్యాహ్నపు సూర్యుడి వేడి వల్ల, సరిగ్గా ఆ మండుటెండలో కోటగోడల మీద ఎటువంటి నీడా లేకుండా నిలబడి వుండటం వల్ల విపరీతమైన దాహం వేసింది శ్రేష్ఠి అనుచరులందరికీ.

ఆ సంగతి వారు చెప్పకముందే కోటగోడల మీద రక్షణగా నిలబడి వున్న ఇద్దరు సైనికులకు తెలిసిపోయింది.

"ఒక్క క్షణం ఓపిక పట్టండి" అంటూ గోడ వెనుక వున్న సోపానాల మీదుగా క్రిందికి దిగి, ఒక మంచినీటి పాత్రతో పైకి వచ్చాడు ఒక భటుడు.

ఒకరి తరువాత ఒకరుగా దాహం తీర్చుకుంటున్న శ్రేష్ఠి అనుచరులను చూసీచూడగానే శుశ్రుతుడి మనసులో మెదిలింది ఒక ఆలోచన.

"యుద్ధానికి సిద్ధం అయ్యేముందు అందరికీ అవసరమైన ఆహారం, నీరు మొదలైనవన్నీ సిద్ధంగా వుంచుకోవటం సైనికుల అలవాటు. మరి ఈ ఆటవికులకు ఎటువంటి అలవాటు వున్నది?" అని అడిగాడు.

"వాళ్ళు ప్రకృతిమీద ఆధారపడి బతికేవాళ్ళు ఎప్పటికప్పుడు వేటతోనే కడుపులు నింపుకుంటుంటారు..." అంటూ ఆటవిక సైన్యం విడిది చేసిన ప్రదేశంలోని పొదల్ని, అటవీ భూముల్ని చూపించారు శ్రేష్ఠి అనుచరులు.

"ఆహారం వేటాడతారు. బాగానే వున్నది. మరి నీరు??" ఆతృతగా అడిగాడు శుశ్రుతుడు.

ఆటవికుల గుడారాలకు దగ్గరిగానే వున్న పెద్ద చెరువులను చూపించారు శ్రేష్ఠి అనుచరులు.

"ఈ చుట్టుపట్ల ప్రశస్తమైన నీరు లభించే జలాధారం అది ఒక్కటే. దానిలోనుంచి చిన్న కాలువ ద్వారా వచ్చే నీటినే మన నగర ప్రజలు కూడా త్రాగటానికి ఉపయోగించుకుంటారు" అంటూ ఆ చెరువు దగ్గిర్నించి తవ్వబడిన చిన్న కాలువను కూడా చూపించాడు అనుచరుల నాయకుడు.

పది నిమిషాల పాటు ఆ కాలువ వంకే పరిశీలనగా చూశాడు శుశ్రుతుడు. "వర్షాలు అధికమై చెరువులో నీరు గట్టు దాటి బయటికి వస్తే, ఈ కాలువ కూడా వరదపోటుకు గురి అవుతుంది కదా" అన్నాడు.

"ఆ విషయం కూడా పరిగణనలోకి తీసుకోబడింది. నీరు అధికంగా వస్తే వెంటనే అడ్డుకట్ట వేయటానికి వీలుగా కొన్ని కవాటాలు ఏర్పరచబడ్డాయి" అంటూ కోటగోడల క్రింద సిద్ధంగా వున్న పెద్ద పెద్ద తలుపుల్ని అతనికి చూపించాడు అనుచరుల నాయకుడు.

ఆటవికుల గుడారాల వంక మరోసారి పరిశీలనగా చూశాడు శుశ్రుతుడు. "శిఖావంతుడు నగరం మీదికి దండెత్తటానికి పంపిన సైన్యం ఎప్పుడు ఇక్కడికి వస్తుందని అంచనా?" అని అడిగాడు.

"రేపు ఉదయం వేళలో వారిని మనం చూడవచ్చును" అన్నాడు నాయకుడు.

గట్టిగా నిట్టూర్చి తన ఆలోచనలు పూర్తి అయినట్లు తలవూపాడు శుశ్రుతుడు. "నగర పాలకుడికి వార్త పంపి, చెరువులో నుంచి వచ్చే జల మార్గాన్ని మూసివేయించండి" అని ఆజ్ఞ ఇచ్చాడు.

ఎందుకో అవగతం కాలేదు శ్రేష్ఠి అనుచరులందరికీ. అయోమయంగా చూడటం మొదలుపెట్టినా పట్టించుకోలేదు శుశ్రుతుడు.

"చీకటి పడేంత వరకే వ్యవధి వున్నది. నాలుగైదు రోజులకు సరిపడే నీటిని నిలువ చేసుకోమని నగరంలోని వారందరికీ చాటింపు వేయించండి. అత్యవసర పరిస్థితి ఇది. శిఖావంతుడి సైన్యం నగరాన్ని ముట్టడించినట్లే భావించాలి మనం" అంటూ శ్రేష్ఠి అనుచరుల నాయకుడిని దగ్గరికి పిలిచి, అతని చెవిలో తన ఉపాయాన్ని విడమరిచి చెప్పాడు.

అయోమయం కాస్తా ఆశ్చర్యంగా మారిపోతుండగా గబగబా తలవూపాడు అతను.

"వెంటనే మీ ఆజ్ఞలను అందరికీ తెలియపరుస్తాను..." అంటూ అతనికి నమస్కరించి, సోపానాల మీదుగా క్రిందికి పరుగు తీశాడు.

సూర్యుడు పడమటి దిశలో పడుతున్న సమయానికల్లా శ్రావస్తి పౌరులందరికీ చేరిపోయింది ఆ వార్త.

"శిఖావంతుడి సైన్యం ముట్టడి చేసినట్లుగానే భావించి, అందరూ త్రాగునీటిని తమ తమ అవసరాలకు కావాల్సిన పరిమాణంలో వెంటనే భద్రపరుచుకోండి... నగరంలోకి వచ్చే నీటి జాలు ఆపివేయబడుతోంది. తిరిగి కాలువను అడ్డుకునే కవాటాలను తెరిచేటంత వరకూ నగరంలోని బావుల్లో లభించే ఉప్పునీటిని తాగవలసిందేనని గమనించండి."

చెవులు చిల్లులు పడిపోయేట్లు డప్పుల్ని మ్రోగిస్తూ వీధుల వెంట తిరిగారు అనేకమంది సైనికులు.

అందరితోపాటు తానుకూడా ఆ చాటింపుల్ని ఆలకించాడు కనకయ్య శ్రేష్ఠి. "ముట్టడి ఇంకా మొదలు కాలేదు. అసలు మొదలవుతుందో లేదో తెలియదు. ఇప్పటినుంచీ ఎందుకు ఈ జాగ్రత్తలు?" అని అడిగాడు నెమ్మదిగా వచ్చిన శుశ్రుతుడిని.

"ఆటవికుల దగ్గర వున్న భల్లూక సైన్యం భరతం పట్టమని మీరు ఆజ్ఞ యిచ్చారా? ఆ ప్రయత్నంలో ఇది ఒక భాగం. అవసరం అయితే నగరంలోని బావుల్లో లభించే ఉప్పునీటినే త్రాగి కాలక్షేపం చెయ్యాల్సి రావచ్చు" ముక్తసరిగా చెప్పాడు శుశ్రుతుడు.

"నాకు అర్థం కాలేదు" అన్నాడు కనకయ్య శ్రేష్ఠి.

"ఇప్పుడు అర్థం కాదు. పని పూర్తి అయిన తర్వాత మీకు తప్పకుండా తెలుస్తుంది" అంటూ తనకు కేటాయించబడిన మందిరంలోకి వెళ్ళిపోయాడు శుశ్రుతుడు.

❖ ❖ ❖

చీకట్లు దట్టం అవుతున్న సమయంలో సంపంగి నగర పొలిమేరలను చేరుకుని, అడవి మొదట్లో ఆగింది సాగరులవారి గజ సైన్యం.

కోట మీదినించి అడవివైపు వీయటం మొదలుపెట్టింది గాలి. ఆ గాలివాలున ఏనుగులన్నిటికీ సోకింది కోట వెలుపలే గుడారాల్లో వున్న ఎలుగుబంట్ల దండు వాసన.

తలలు విదిలించి ఒక్కసారిగా ఘీంకారాలు చేశాయి అవి. వెనుతిరిగి మళ్ళీ అడవిలోకి పరిగెత్తటానికి చూశాయి.

పట్టపు టేనుగును వాటి వెనుకే నిలబెట్టి వుంచాడు. అటువంటి పరిస్థితి ఎదురుకావచ్చని ముందుగానే ఊహించిన సాగరులవారు.

"నిలబడండి... ఒక్క అడుగు కూడా కదిలించవద్దు... ఆగిపోండి" ఖంగు ఖంగుమంటున్న కంఠంతో హెచ్చరించాడు. తన ఏనుగును కదిలించి వాటిని అడ్డగించి ఆపివేశాడు.

"మీ ఆలోచన ఏమిటో వెంటనే కార్యరూపంలో పెట్టటం మంచిది. మన ఏనుగుల గోల కోటలోకి వినిపించినట్లుంది. గోడలమీద సందడి మొదలయింది" కనులు చిట్లించి కోటవైపే చూస్తున్న మహేశ్వరుడు వెంటనే హెచ్చరించాడు.

"శివుడిని పిలిపించండి... వెంటనే నా దగ్గరికి పంపించండి" అన్నాడు సాగరులవారు.

మంత్రి మహేశ్వరుడు స్వయంగా కదలబోయాడు గాని, ఆ అవసరం లేకుండానే అక్కడికి వచ్చేశాడు శివుడు.

'కోట గోడల మీద కాగడాలు కనిపించటం లేదు. గమనించారా?" వస్తూనే అడిగాడు.

అప్పటివరకూ ఆ విషయాన్ని మహేశ్వరుడు పట్టించుకోలేదు. "నిజమేరా... నీడల మాదిరి పరిగెత్తుతున్నారు... వెలుగుతో వాళ్ళకి అవసరం వున్నట్టు లేదు" అన్నాడు ఆశ్చర్యంగా.

"నడిచి నడిచి అలసిపోయి వున్నాయి ఏనుగులన్నీ. ముందుకు దూకించటం సాధ్యపడుతుందా?" సాగరులవారినే ప్రశ్నించాడు శివుడు.

చివ్వున వచ్చేసింది కోపం సాగరుల వారికి. "యుద్ధ శిక్షణ అంటే తెలియని నీ అడవి ఏనుగులు కదలగా లేనిది మావి కదలలేవా? అవాకులు పేలకుండా జరగవలసింది చూడు" విసురుగా అన్నాడాయన.

అనటం అయితే అన్నాడుగాని, అలసిపోయిన తన గజాలు తాను అనుకుంటున్నంత సమర్థవంతంగా యుద్ధంలోకి దిగలేవేమోనన్న సంశయం కొద్దిగా పీడిస్తూనే వున్నది ఆయన మనస్సుని.

"గాలివాలున ఎలుగుల జాడ మన గజబలానికి తెలుస్తుందని అనుకోలేదు. ఇవి ఘీంకారాలు మొదలుపెడతాయని కూడా భావించలేదు. పొరపాటు జరిగిపోయింది" చిన్నకంఠంతో మహేశ్వరుడికి మాత్రమే వినిపించేటట్లు అన్నాడు.

"జరిగిపోయిన దానికి బాధపడినందువల్ల ఉపయోగం లేదు. పోనీ కొద్దిగా వెనక్కి వెళ్లి రేపు ఉదయమే పోరాటం మొదలుపెట్టవచ్చు. ఈ కటికచీకటిలో తొందర పడటం దేనికి?" అడిగాడు మహేశ్వరుడు.

సాగరుల వారి ఆలోచన ఏమిటో తెలియదు అతనికి. అడవిలో వుండగా ఏదో ఆలోచించుకుని మళ్ళీ యుద్ధానికి వచ్చాడని అనుకుంటూ వున్నాడు గాని, ఏమి ఆలోచించాడో మహేశ్వరుడి ఊహకి అందలేదు. అన్నిటినీ మించి శివుడిని ఆలోచన అడగటమేమిటో అంతకన్నా అవగతం కాలేదు.

కోట గోడలమీద కొద్దికొద్దిగా మొదలైన సందడి క్రమక్రమంగా రణగొణ ధ్వనుల స్థాయికి చేరుకుంటూ వుండటంతో, తన అనుమానాలన్నిటినీ తనలోనే దాచుకున్నాడు మహేశ్వరుడు.

"సిద్ధంగా వుండండి... ఇంతకుముందు మాదిరి మనం దాడి చేసేవరకూ ఆగరు వాళ్ళు. తామే ఎదురుదాడికి దిగవచ్చు..." అని ఏనుగుల వెనుక నిలబడిన తమ సైనికుల్ని హెచ్చరించటానికి బయలుదేరాడు.

యదార్థమే అయినాయి అతని మాటలు. చిమ్మచీకటిలో జీ భూతాల మాదిరి కోటగోడల మీద నిలబడటమే కాదు- నిశ్శబ్దంగా కోట తలుపుల్ని తెరిపించారు సైనికులు. బరిశెలు, కత్తులు పట్టుకుని గట్టు తెగిన ప్రవాహం మాదిరి కోట వెలుపలికి వచ్చేస్తున్నారు.

"పూర్తి అయినాయా ఏర్పాట్లు?" ఖంగుమంటున్న కంఠంతో బిగ్గరిగా ప్రశ్నించాడు సాగరుడు.

వరసల్లో నిలబడిన సైనికుల వెనుక గుంపులు గుంపులుగా నిలవబడిన నగర పౌరుల్లో కొంతమందిని ఎంపిక చేసిపెట్టింది రాణి చారులతాదేవి. వందల సంఖ్యలో అడవిచెట్లమీద పడి పొడుగాటి కొమ్మల్ని విరిచి తీసుకు వచ్చారు వారందరూ. తాము ధరించి వున్న దుస్తుల్లో సగభాగాలను తమ తలపాగాలను నిలువుగా చించి ఆ కొమ్మలకు చుడుతున్నారు.

వందల సంఖ్యలో కాగడాలు సిద్ధం అవుతున్న సంగతి ఒకరు చెప్పవలసిన అవసరం లేకుండానే మహేశ్వరుడికి తెలిసిపోయింది.

అయితే మంటలు మలిగిపోకుండా నిలువబడి వుండాలంటే నూనెను ఉపయోగించాలి. కొమ్మలకుచుట్టిన ఆ వస్త్రాల మీద నూనె పోస్తే తప్ప అవి ఎక్కువ సమయం మంటల్ని వెలువరించలేవు.

ఆహారం సంపాదించుకోవటమే అతికష్టమైపోయింది అడవిలో తమకి. కాగడాల మీద పోయటానికి నూనె ఎక్కడినించి వస్తుంది?

"మహేశ్వరుల వారు గాభరాపడవలసిన పనిలేదు. ఒక్కొక్క కాగడా పది క్షణికాలపాటు వెలిగినా చాలు... వెలుగు నశించిపోయే లోపల ఇంకో కాగడాని సిద్ధంగా వుంచి పట్టుకుంటాము. అవసరం అయితే మా వంటిమీద వలువలన్నిటినీ కొమ్మలకు చుట్టి, నగ్నంగా నిలుచోవటానికి కూడా మేము సిద్ధమే" అతని కన్నుల్లో ప్రతిఫలించిన అనుమానాన్ని గమనించి ఆవేశంగా చెప్పాడు ఒక పౌరుడు.

"అంతదాకా రాదు పరిస్థితి. తొందరపడి మీరెవ్వరూ ఆ పని చేసి మమ్మల్ని భయపెట్టవద్దు..." వెంటనే అన్నాడు చారులతాదేవితో పాటు ఆ ఏర్పాట్లను పర్యవేక్షిస్తున్న వాసుదేవుడు.

అంత భయంకర పరిస్థితిలోను నవ్వులతో మార్మోగిపోయిందా ప్రదేశం. అందరినీ ఆవరించుకోబోతున్న భయం తొలగి దూరంగా పారిపోయింది.

❖ ❖ ❖

రాత్రి మొదటి ఝాము గడిచిపోయింది. రెండవ ఝాము మెల్లగా మొదలయింది. కనకయ్య శ్రేష్టి అనుచరుల్లో పదిమందిని వెంటబెట్టుకుని నగర ద్వారాల దగ్గరికి వచ్చాడు శుశ్రుతుడు.

అతని ఆలోచన ఏమిటో తెలియకపోయినా, వందమంది భటులతో స్వయంగా తను కూడా ద్వారాల దగ్గరికి వచ్చాడు నగర పాలకుడు.

"నిశ్శబ్దంగా జరిగిపోవాలి నేను తలపెట్టిన కార్యం. ఎక్కువమందితో వెళితే శత్రువులకు తెలిసిపోతుంది. పడిన కష్టం అంతా మట్టికొట్టుకు పోతుంది" తమతోపాటు కదలబోయిన ఆ భటులందరినీ ఆపుతూ చెప్పాడు శుశ్రుతుడు.

"మరి మేము ఏం చెయ్యాలి?" అని అడిగాడు నగర పాలకుడు.

"పదునైన ఆయుధాలతో పాటు యుద్ధబాణాలను పట్టుకుని కోటగోడల మీద సిద్ధంగా వుండండి... అవసరం అయితే శంఖాన్ని ఊది సహాయం అర్థిస్తాను. వెంటనే ఆయుధ ప్రయోగం మొదలుపెట్టండి" అన్నాడు శుశ్రుతుడు.

ఎన్నో అనుమానాలు, మరెన్నో సంశయాలు నగర పాలకుడి మనసులోకి ప్రవేశించి అతన్ని అతలాకుతలం చేసేశాయి.

కటిక చీకటిలో కోటను దాటి వెలుపలికి పోతున్నాడు శుశ్రుతుడు. ఆ చీకటిలోనే అతను శంఖాన్ని ఊది తమ సహాయం అర్థిస్తే ఏ విధంగా సహాయం చేయగలడు తను? ఎవరిమీద ఆయుధాల్ని ప్రయోగించాలి? ఎవరిమీదికి యుద్ధ బాణాల్ని వదలాలి?

"కాగడాలను వెలిగించి వుంచమంటారా?" తన అనుమానాలకు సంశయాలకు తనే సమాధానాన్ని వెతుక్కుంటూ అడిగాడు అతను.

"పొరపాటున కూడా ఆ పని చేయకండి. కాగడాలు వెలిగించటం అంటే మనం మెలకువగా వున్నామని శత్రువులకు తెలియచెప్పటమే. ఇప్పుడు నేను చేయబోయే పని ఏమిటో వారికి తెలియకూడదు" అంటూ కోట ద్వారాల దగ్గర వున్న కావలి భటులకు సైగ చేశాడు శుశ్రుతుడు.

ఇరువది మూరలకు ఇంకా కొంచెం ఎక్కువ ఎత్తే వున్నాయి ఆ ద్వారపు తలుపులు. వాటిమధ్య భాగంలో ఒకే ఒక మనిషి అవతలకు పోయేందుకు వీలుగా అమర్చబడి వున్నది మరో చిన్న తలుపు.

శబ్దం వెలుపలికి రాకుండా దాన్ని తెరిచారు కావలి భటులు.

ఒకరి తర్వాత ఒకరుగా శుశ్రుతుడు, అతని వెంట వున్న జనం అవతలికి పోగానే తిరిగి గట్టిగా మూసివేశారు.

"అందరూ గోడలమీదికి నడవండి... శుశ్రుతుల వారు చెప్పినట్లు మీ ఆయుధాల్ని సిద్ధంగా పట్టుకోండి" తన భటులకు ఆజ్ఞ ఇచ్చాడు నగర పాలకుడు.

❖ ❖ ❖

"కాగడాల్ని వెలిగించారా?" ఖంగుమంటూ వినవచ్చింది సాగరుల వారి కంఠం.

చెకుముకి రాళ్ళ సహాయంతో నిప్పు చేసి, గజ సైన్యం వెనుక భాగంలో పెద్ద పెద్ద నెగళ్ళను అంటించారు జనం. తాము తయారుచేసిన కాగడాల్లో కొన్నింటిని ఆ మంటల్లో పెట్టి పట్టుకున్నారు.

చిటికెలో వెలిగాయి అవి. అంతకుముందు వరకూ కటిక చీకటితో నిండి వున్న ఆ ప్రదేశం ఒక్క క్షణికంలో పట్టపగలుగా మారిపోయింది.

"జయము జయము సాగరుల వారికి" బిగ్గరిగా అరిచాడు, సాగరుల వారి ఏనుగులకు దూరంగా తన ఏనుగుల్ని నిలబెట్టి వుంచిన శివుడు.

అతని కంఠంలో ధ్వనించిన ఆవేశం, ఉత్సాహం తమ తనువులన్నిటినీ కంపింపచేస్తుండగా, కలిసికట్టుగా కేకలు పెట్టారు కాగడాలను పట్టుకున్న జనం. "జయము జయము... సంపంగి నగర గజబలానికి సంపూర్ణ విజయము."

"నడవండి... ఈ రాత్రి గడిచి తెల్లవారేసరికి మనం మన నగరంలో వుండటమో, చచ్చి స్వర్గంలో వుండటమో తేలిపోవాలి... నడవండి" ఉరుము వంటి కంఠంతో సైనికులను ఉత్సాహపరుస్తూ తన ఖడ్గాన్ని ఒరలో నుంచి తీసి ముందుకు పరిగెత్తాడు వాసుదేవుడు.

అప్పటికి కూడా మహేశ్వరుడికి అవగతం కాలేదు సాగరుల వారి యుద్ధతంత్రం ఏమిటో. అలాగని అయోమయంగా చూస్తూ అక్కడే నిలువబడి పోలేదతను. తనుకూడా తన ఆయుధాన్ని వెలుపలికి తీసి వారి వెనుకే పరుగులు తీశాడు.

ఎలుగుబంట్ల జాడల్ని పసిగట్టి ఆందోళనకు గురైన ఏనుగులు వెనక్కి పారిపోకుండా పట్టపుటేనుగుతో కాపలా నిలబడి వున్నాడు సాగరుల వారు. రెండో ఆలోచన లేకుండా దాన్ని కోటకేసి పరిగెత్తించాడు.

"కాగడాలన్నీ ఏనుగులతో సమానంగా నడవాలి... ఎట్టి పరిస్థితిలోను దూరంగా పోకూడదు" బిగ్గరగా అరుస్తూ తన ఏనుగుల్ని కూడా అటుకేసి నడిపాడు శివుడు.

తన తల్లితండ్రి బీభత్సంగా ఘీంకరిస్తూ కదిలేసరికి గున్నకు కూడా ఆవరించుకున్నది ఆవేశం. అదికూడా కనుగుడ్లను గిరగిరా తిప్పుతూ వాటిని అనుసరించబోయింది.

ఇద్దరు సైనికులను ప్రత్యేకంగా ఆ పనికోసమే జ్వాలకు అప్పగించాడు వాసుదేవుడు.

"చిలిపితనం దానికి చాలా అధికం. శివుడి మాదిరిగానే గుడ్డిగా పరుగులు తీసి ప్రమాదాల్లో చిక్కుపడుతుంది. ఎట్టి పరిస్థితిలోను ఇది యుద్ధరంగంలోకి రాకూడదు. రాకుండా చూడవలసిన బాధ్యత నీది" అనికూడా ఆదేశించాడు.

గున్నతో పాటు తనను కూడా యుద్ధంలోకి రాకుండా ఆపే పన్నాగమని తెలిసినా, ఆ సమయంలో ఎదురు చెప్పలేదు జ్వాల. తలవూపి అంగీకరించింది.

ఇప్పుడు తల్లిదండ్రుల వెనుకే కదలబోయిన గున్నని గట్టిగా పట్టుకునే బాధ్యతను వాసుదేవుడు కేటాయించిన భటులిద్దరికీ వదిలి, తాను తన అశ్వాన్ని శివుడి వెనుకే పరుగులు తీయించింది.

గప్పుగప్పున వెలుగుతూ ఏనుగులతో పాటు వస్తున్న కాగడాలను చూసే సరికి పరమానందమైపోయింది శిఖావంతుడి సైన్యాధిపతులకి.

“మనకి శ్రమ తగ్గించారు. తమను ఎక్కడ కొడితే తమ ప్రాణాలు పోతాయో తామే మనకి చూపించుకోబోతున్నారు” ఉత్సాహంగా అన్నాడు ఒక సేనాపతి.

అంతలోనే వచ్చింది ఒక అనుమానం మరో దళపతికి. “ఎట్టి పరిస్థితిలోను చీకటి పడిన తరువాత మంటలు వేయటం గాని, కాగడాల్ని చూపించటం గాని చేయవద్దని ఎలుగుల్ని తీసుకువచ్చిన ఆటవికులు మనకి చెప్పారు. వారి మాటల ప్రకారమే ఇంతవరకూ మనం కాగడాల్ని వెలిగించలేదు. వాళ్ళు అలా చెప్పటానికి కారణం ఏమిటో నాకు తెలియదు. మీకెవరికైనా తెలుసా?” అని అడిగాడతను.

వేగంగా వచ్చేస్తున్న గజబలాన్ని, దాన్ని అనుసరించబోతున్న సైనికుల్ని చూసి యుద్ధం చేయటానికి ఉత్సాహపడిపోతున్న మిగిలిన వారెవరూ ఆ మాటల్ని చెవిన వేసుకోలేదు.

“ఆటవికులు అలా చెప్పటం వెనుక ఏవేవో నమ్మకాలు ఆచారాలు వుండి వుంటాయి. మామూలు సమయాల్లో మంటలు వద్దని అన్నారుగాని, యుద్ధ సమయంలో అలా చేయవద్దని చెప్పలేదు”అంటూ తన అశ్వాన్ని ముందుకు పరిగెత్తించాడు ఒక సేనాపతి.

అప్పటికీ తీరలేదు అనుమానం ఆ దళపతికి. “ఇందులో ఏదో తిరకాసు వుంది. రాత్రివేళల్లో యుద్ధం జరగదని అనుకుంటూ వుండటంవల్ల పని కట్టుకుని ఆటవికులు హెచ్చరించి వుండకపోవచ్చు. వెళ్ళి వాళ్ళనే అడిగితే ఒక సంశయం నివృత్తి అయిపోతుంది” అనుకుంటూ తన వాహనాన్ని ఎలుగులు విశ్రాంతి తీసుకుంటున్న గుడారాల దగ్గరికి పరిగెత్తించాడు.

గుడారాలను సమీపించక ముందే ఆగిపోవాల్సి వచ్చింది అతను. బరిశెల్ని బారు చేసి అతన్ని అడ్డుకున్నారు కాపలాగా నిలబడిన ఆటవికులు కొందరు.

"ఎలుగుల్ని బయటికి వదలండి. అవతల సాగరుడి ఏనుగులు చిందులు తొక్కుతూ రావటం మీకు కనిపించటం లేదా?" తను ఎందుకు వచ్చాడో ఆ పనిని మర్చిపోయి ఆశ్చర్యంగా అడిగాడు దళపతి.

"మేము ముందుగానే మీకు చెప్పాము. మీరందరూ కలిసి ఆ కాగడాల వాళ్ళని నరికి, మంటలు కనిపించకుండా చూడండి. అప్పుడు మేము ఎలుగుల్ని ఏనుగుల మీదికి వదులుతాము" నిబ్బరంగా చెప్పాడు ఒక ఆటవికుడు.

"కాగడాలను ఆర్పేయటం చెప్పినంత తేలిక కాదు. దగ్గరికి పోయినవాళ్ళని తొండాలతో చుట్టి నేలని అదిమేస్తాయి ఆ ఏనుగులు. అది మామూలు ఏనుగుల మందకాదు. సాగరుడి గజ సైన్యం" ఆందోళనగా అన్నాడు దళపతి.

"ఎవరి సైన్యమైనా సరే... మంటలు వుండగా మేము చేయగలిగింది ఏమీలేదు. మంటని చూస్తే ఎలుగులు వెనక్కి తిరుగుతాయి. మేము ముందే చెప్పాము" అన్నాడు ఆటవికుడు

గుండెల్లో రాయి పడినంత పనై, వెంటనే తేరుకుని తన అశ్వాన్ని మరింత వేగంగా తనతోటి సేనాపతుల దగ్గరికి పరిగెత్తించాడు దళపతి.

అప్పటికే అతను ఆటవికులకు చెప్పిన పనే జరుగుతోంది అక్కడ. కాగడాల వెలుగులో గురిచూసి శత్రువులను పడగొట్టవచ్చుని సంతోషపడిన ఆ సేనాపతుల సంతోషం ఆవిరైపోతోంది అతివేగంగా.

దారుణంగా ఘీంకరిస్తూ దొరికిన వారిని దొరికినట్లు పాదాలతో అదిమి పాతాళ లోకానికి పంపించేస్తూ ముందుకు వస్తోంది సాగరుడి గజ సైన్యం.

"వదలమని చెప్పండి... ఎలుగుబంటి సైన్యాన్ని వెంటనే రంగంలోకి దిగమని ఆజ్ఞలు ఇవ్వండి" తన ఎడమ భుజంలో దిగబడిన ఒక బాణాన్ని మధ్యకు విరిచి అవతలకు విసురుతూ జీరపడిన కంఠంతో అరిచాడు ముఖ్య సేనాపతి.

తన అశ్వాన్ని అతని చెంతకు నడిపించి, ఆటవికులు చెప్పిన మాటల్ని తూచా తప్పకుండా తెలియచేశాడు దళపతి.

మరో రెండు బాణాలు వచ్చి ఈసారి తన గుండెల్లో దిగబడినట్లు అదిరిపడ్డాడు ముఖ్య సేనాపతి.

"అడవిలోకి పారిపోయినప్పుడే వెంటపడి సాగరుడి అంతం చూసి వుండాల్సింది. తీరుబడిగా ఆలోచించి మన పథకానికి విరుగుడు తెలుసుకున్నాడు. చీకటి సమయంలో ప్రకాశవంతమైన మంటల్ని చూసి ఎలుగులు చెదిరిపోతాయని ముందుగానే మనం గ్రహించలేకపోవటం నిజంగా మనదే తప్పు..." అంటూ తన దట్టీలో దోపుకుని వున్న కొమ్మబూరని తీసి చెవులు చిల్లులు పడేవిధంగా ఊదాడు.

ముందుకు పోతున్న సైనికుల్ని వెనక్కి పిలిచే సంకేతం అది. యుద్ధాన్ని ఆపి, ఆత్మరక్షణ విధానాలను అవలంబించమని చెప్పటానికి గుర్తు.

ఎగుసుకు వస్తున్న కార్చిచ్చు వంటి గజాలను ఏదో ఒకవిధంగా ఎదిరించ టానికి ప్రయత్నిస్తున్న శిఖావంతుడి సైన్యమంతా ఒక్కసారిగా వెనుతిరిగి కోటలోకి పరుగులు మొదలుపెట్టింది.

"ఎలుగుల్ని కూడా కోటలోకే నడిపించండి. వెలుపలే వుంటే అవి హతమారిపోవచ్చు" జరుగబోయేది ఏమిటో తనకు తెలిసినట్లు మరో ఆజ్ఞను అందరికీ వినిపించాడు ముఖ్య సేనాపతి.

అదిగో... అప్పుడు మొదలయింది అసలు సమరం.

❖ ❖ ❖

రెండవ ఝాము కూడా గడిచిపోయే వరకూ వేచిచూడవలసి వచ్చింది శుశ్రుతుడికి. గాలి చెరువుమీదినించి ఆటవికులున్న ప్రదేశం వైపు వీస్తూ వుండడం వల్ల.

"మనం ఎందుకు వచ్చామో ఆ వచ్చిన పని ఎంత త్వరగా పూర్తిచేసుకుని వెనక్కి వెళ్ళిపోతే అంత మంచిది. ఎక్కువసేపు ఇలా నక్కి కూర్చుంటే ఆటవికులు పసికట్టేస్తారు" చిన్నకంఠంతో శుశ్రుతుడికి చెప్పాడు కనకయ్య శ్రేష్ఠి అనుచరుల్లో ఒకతను.

"ఈ గాలిలో మనం ముందుకుపోతే ఇప్పుడే బట్టబయలు అవుతుంది మన ఉనికి. గాలివాలున మనల్ని పసికట్టేస్తారు వాళ్ళు. అడవి జంతువులకి వాళ్ళకి తేడా ఏమంత అధికంగా వుండదు" హెచ్చరించి అతని నోటిని మూయించాడు శుశ్రుతుడు.

మూడవ ఝాము కూడా మూడువంతులు గడిచిపోయిన తర్వాత వున్నట్లుండి తన దశను మార్చుకున్నది గాలి. ఆటవికుల దగ్గిర్నించి చెరువు వైపు మారటం మొదలుపెట్టింది.

ఆపైన క్షణికం పాటు కూడా ఆలస్యం చేయకుండా అందరినీ చెరువు గట్టు ఎక్కించి, నీటి అంచు దగ్గరికి నడిపించాడు శుశ్రుతుడు.

"శబ్దం కాకుండా గట్టుకు గండి కొట్టండి" అని ఆజ్ఞ ఇచ్చాడు.

అతను సూచించినట్లు పెద్దపెద్ద పలుగులు, పారలు, మట్టిని పోసే తట్టలు తీసుకువచ్చినా, అవి దేనికో అంతవరకూ తెలియలేదు కనకయ్య శ్రేష్ఠి అనుచరు లెవరికీ.

ఎలుగులు ఎగిరి దూకకుండా గోతులు తవ్వటానికో... తవ్విన గోతుల మీద సన్నటి పుల్లల్ని పరిచి మట్టితో కప్పెట్టి, ఏనుగుల్ని పట్టుకున్నట్లుగా వాటిని కూడా పట్టుకోవటానికో అనుకుంటున్నారు వాళ్ళు.

చెరువుకు గండి కొడితే నగరంలోని వారికి తాగునీళ్ళు లేకుండా పోతాయి. తిరిగి వర్షాకాలం వచ్చేటంత వరకూ ఉప్పునీళ్ళతో కాలక్షేపం'అనబోతూ, నగరంలో శుశ్రుతుడు వేయించిన చాటింపు గుర్తుకు వచ్చి మాటల్ని ఆపేశారు వాళ్ళు.

"యుద్ధం అంటూ రానే కూడదు. వచ్చిన తర్వాత రేపటి గురించిన ఆలోచన చేయకూడదు. ఈ ఎలుగులు మాత్రమే మనల్ని పిరికివాళ్ళుగా మారుస్తున్నాయి. వీటిని అంతమొందిస్తే మనం సగం విజయం సాధించినట్లే. అందుకోసం ఎటువంటి కష్టం వచ్చినా తట్టుకోవటానికి సిద్ధంగా వుండాలి. ప్రారంభించండి పనిని" అంటూ గర్జించాడు శుశ్రుతుడు.

రెండో ఆలోచన లేకుండా నడుములు వంచారు కనకయ్య శ్రేష్ఠి అనుచరులు. పలుగులతో చెరువు కట్టను తవ్వారు కొందరు. పారలతో మట్టిని ఎత్తి తట్టల్లో పోశారు మరికొందరు. ఆ మట్టిని తీసుకుపోయి దూరంగా గుట్టపెట్టారు మిగిలినవారు.

తూర్పు దిక్కు తెల్లబడే సూచనలు కనిపించటం మొదలుపెట్టే వరకూ వంచిన నడుములు ఎత్తకుండా పని చేశారు అందరూ.

"తెల్లవారబోతోంది దేవరా.. ఆ అడివి జనులు ఎవరైనా చెరువు దగ్గరికి వస్తే రట్టు అయిపోతుంది మన గుట్టు" పారతో మట్టిని ఇవతలకు లాగుతూనే తన ఆందోళనను బయటపెట్టాడు ఒకతను.

"అడవి జనాలు వస్తే ఏదో ఒకటి చేయచ్చు. అంతకంటే మించిన ప్రమాదం ఇంకోటి వచ్చేసింది..." అంటూ ఆటవికుల గుడారాలకు ఆవలగా ఉన్న రహదారి వైపు చూపించాడు శుశ్రుతుడు.

తలలు ఎత్తి అటు చూసిన కనకయ్య శ్రేష్ఠి అనుచరులందరికీ కనిపించింది ఆటవిక సైన్యానికి బాసటగా వస్తున్న శిఖావంతుడి మరో సైన్యసమూహం.

"అనుకున్నంతా అయింది. వాళ్ళ కంట పడగానే నరికి ముక్కలు చేసేస్తారు" విపరీతమైన భయంతో అంటూ తన దగ్గర వున్న పారను కిందికి వదిలేశాడు ఒకతను.

కంటికి కనిపించనంత వేగంతో కదిలి, అతని మొఖం మీద పడింది శుశ్రుతుడి పిడికిలి.

సన్నగా శలాక మాదిరిగా కనిపించే అతనికి అంత బలం వుంటుందని ఊహించలేదా కనకయ్య శ్రేష్ఠి అనుచరుడు. గావురుమని అరవబోయాడు.

అంతకుముందు కంటే మరింత వేగంగా కదిలింది శుశ్రుతుడి చేయి... అతని నోటిని బలవంతంగా మూసేసింది.

"చెప్పిన పని చేయకుండా పిరికిమాటలు మాట్లాడితే శిఖావంతుడి సైన్యం చేతిలో కాదు... నా చేతుల్లోనే మీరు ప్రాణాలు పోగొట్టుకుంటారు. తవ్వండి త్వరగా..." కరకరలాడుతున్న కంఠంతో అందరినీ హెచ్చరించాడు.

అతని మొఖంలో ప్రత్యక్షం అయిన కరుకుతనాన్ని చూసి నిజంగానే భయపడిపోయారు వారందరూ. వంచిన తలలు ఎత్తకుండా తమ పనిలో నిమగ్నమైపోయారు.

❖ ❖ ❖

శిఖావంతుడి ప్రధాన సైన్యాధిపతి వెనక్కి వచ్చేయమనే సంకేతాన్ని తన సైన్యానికి పంపిన వెంటనే అతని వ్యూహం ఏమిటో శివుడికి తెలిసిపోయింది.

"మనం కాగడాల్ని ఎందుకు పట్టుకు వచ్చామో కనిపెట్టేశారు. కోటలోకి పోయి తప్పించుకుంటారు. గుడారాల్లో వున్న ఎలుగుల్ని కూడా కోటలోకి

తీసుకుపోయి కాపాడుకుంటారు" అంటూ తన ఏనుగుల్ని వేగంగా నడిపించాడు వెనుతిరుగుతున్న సైనికుల మీదికి కాదు... ఎలుగులు విశ్రాంతి తీసుకుంటున్న గుడారాల మీదికి.

"కాగడాలు... కాగడాలు కదలాలి... కదలండి అందరూ..." గొంతు చిరిగిపోయేలా అరిచింది గున్న ఏనుగు దగ్గిర్నించి అటుగా వచ్చిన జ్వాల.

ఆరిపోతున్న కాగడాలను వదిలేసి, సిద్ధంగా వున్నవాటిని వెలిగించుకున్నారు ఆ ఏనుగుల పక్కగా నడుస్తున్న జనం.

"సాగరుల వారి కంటె ముందుగా మనం గుడారాల దగ్గరికి పోవాలి... నడవండి... వేగంగా కదలండి" అని హెచ్చరిస్తూ మగ ఏనుగు శరీరాన్ని మడమలతో తడిమి, అరిచేతులతో దాని కుంభస్తలాన్ని అదిమాడు శివుడు.

భూమి అదిరిపోయేటట్లు అడుగులు వేస్తూ పరుగు మొదలుపెట్టింది అది. వెనుకే సాగింది ఆడ ఏనుగు.

గుడారాలకు దగ్గర పోయిన వెంటనే బీభత్సంగా గురకలు పెడుతూ, బయటికి వచ్చాయి ఎలుగులు. బరిశెలతో వాటిని అదిలిస్తూ తాముకూడా ఏనుగుల్ని ఎదిరించటానికి సిద్ధం అయ్యారు ఆటవికులు.

మగ ఏనుగు మీదికి లంఘించబోయిన మూడు ఎలుగుల మొఖాల మీదికి తమ దగ్గర వున్న కాగడాలను ఊపారు ఏనుగుల పక్కనే వున్న పౌరులు.

అదిరిపడి వెనక్కి దూకాయి అవి. వెనుదిరిగి దూరంగా పారిపోవటానికి ప్రయత్నించాయి. వాటిని బెదిరించిన కాగడాలు మాత్రమే కాకుండా, ఇంకా కొన్ని ఏనుగులకు రెండో ప్రక్కన వెలుగుతున్నాయి. వాటి వెలుగులో పారిపోతున్న ఎలుగులు స్పష్టంగా కనిపించాయి మగ ఏనుగు కళ్ళకి.

నిర్మోహమాటంగా తొండాన్ని జాచి రెండింటిని గాలిలోకి విసిరేసింది అది. మూడవ ఎలుగు శరీరంమీద పాదాలు మోపి పచ్చి పుచ్చకాయను చిదిపినట్లు చిదిపేసింది.

అటువంటి పనినే ఆడ ఏనుగుకూడా చేసేసింది. అదే సమయంలో బీభత్సంగా ఘీంకరిస్తూ ఆ ప్రదేశంలోకి వచ్చేసింది సాగరుల వారి గజబలం.

అంతకుముందు భయపడి పారిపోవాల్సి వచ్చిందన్న అవమానం మనసును మండించేస్తున్నట్లు విరుచుకుపడింది పట్టపు టేనుగు.

"అంటించండి... గుడారాలన్నిటికీ నిప్పు ముట్టించండి" సందు చూసుకుని నలుగురు పౌరులకు ఆదేశించింది జ్వాల. అడ్డుకోబోయిన ఆటవికులను తన ఖడ్గంతో అవతలికి తరిమేస్తూ ఆ పౌరులకు రక్షణ కల్పించింది.

పరుగు పరుగున పోయి, తమ దగ్గర వున్న కాగడాలు కొండెక్కిపోయే లోపల గుడారాలన్నింటికీ ఒకదాని తర్వాత ఒకటిగా నిప్పు ముట్టించారు ఆ పౌరులు.

కాగడాల గుడ్డి వెలుగుతోనే సగం ప్రకాశవంతంగా మారి వున్న యుద్ధరంగం... ఒక్కసారిగా పూర్తి వెలుగులతో నిండిపోయింది.

భగభగలాడుతూ గుడారాలను స్వాహా చేస్తున్న అగ్నిజ్వాలలను చూసి మరింతగా చెదిరిపోయాయి శిఖావంతుడి ఎలుగుబంట్లు అన్నీ. వికృతంగా శబ్దాలు చేస్తూ దూరంగా పరుగులు తీయటం మొదలుపెట్టాయి.

సిద్ధంగా వున్నారు మహేశ్వరుడు, వాసుదేవుడు. "ఒక్క చీమకూడా ప్రాణాలతో అడవిలోకి పోకూడదు. ఒక్కదాన్ని కూడా వదిలిపెట్ట కూడదు" అని కేకలు పెడుతూ తాము తమ ఆయుధాలకు పని కల్పించారు. తమతో వున్న సైనికులందర్నీ ఆదేశించారు.

ఎక్కడికక్కడ తలలు తెగి క్రిందపడిపోయాయి పారిపోచూసిన ఎలుగులన్నీ. వాటిని కాపాడుకోవటం కోసం ప్రయత్నం చేసిన ఆటవికులు కూడా ఆ సైనికుల ప్రతాపాగ్నికి సమిధలైపోయారు.

ఎంత హఠాత్తుగా మొదలయిందో ఆ యుద్ధం, అంతే హఠాత్తుగా అంతం అయిపోయింది. అరుపులతో, కేకలతో, ఏనుగుల ఘీంకారాలతో, ఎలుగుల గురకలతో దద్దరిల్లిపోయిన ఆ ప్రదేశం ఒక్కసారిగా సాగరులవారికి జయజయ ధ్వానాలతో కంపించిపోయింది.

"ఆలస్యం వద్దు ప్రభూ... ఆవేశాన్ని తగ్గనీయకూడదు. ఇదే వేగంతో నగరంమీద పడిపోవటమే మంచిది" పట్టపు టేనుగు మీదినించి దిగబోతున్న సాగరులవారికి చెప్పాడు మహేశ్వరుడు.

సాగరుల వారు సమాధానం చెప్పకముందే దారుణంగా వినవచ్చాయి ఉన్నట్లుండి కొన్ని హూంకారాలు.

"ఏమిటది? ఏమైంది?" ఆశ్చర్యంగా అడిగాడు సాగరుల వారు తిరిగి పట్టపుటేనుగు మీదికి చేరుకుంటూ.

"శిఖావంతుడి సైన్యం కోట తలుపుల్ని మూసివేస్తోంది. శివుడు వారిని ఎదిరిస్తున్నాడు. యువరాణి జ్వాల సైనికుల్ని ఉత్సాహపరుస్తోంది" అని చెప్పాడు వాసుదేవుడు.

కోట ద్వారాల దగ్గర జరుగుతున్నది సరిగ్గా అదే. గుడారాలు మంటలు బారినపడి ఎలుగులన్నీ చెల్లాచెదురైన వెంటనే కోట తలుపుల్ని మూసి వేయమని ఆజ్ఞ ఇచ్చాడు ప్రధాన సేనాపతి.

"మనల్ని ఎదిరించటానికి ఆ సాగరుడు కోటగోడల మీద సిద్ధంగా వుంచిన సామాగ్రితో అతన్నే తల్లక్రిందులు చేసేద్దాం. ఎలుగుల సాయం లేకపోయినా మనం భయపడాల్సిన అవసరంలేదు" అంటూ కొంత సైన్యాన్ని గోడల మీదికి పంపించటం మొదలుపెట్టాడు.

అటువంటి పనే జరుగుతుందని, శివుడి కంటె ముందుగా జ్వాల ఊహించింది. "నువ్వు ద్వారాల్ని వశపరచుకోవాలి... ఆలస్యం చేస్తే మనకి జననష్టం చాలా అపారంగా వుంటుంది" అని అతన్ని హెచ్చరించింది.

పాదాలతో తడిమి మగ ఏనుగును ద్వారాల దగ్గరికి పరిగెత్తించాడు శివుడు. మూసుకోబోతున్న ఒక తలుపును ఢీ కొట్టించి, మధ్యలోనే ఆపేశాడు.

"సైనికులారా... కదలండి... నగరంలోకి పోయి శత్రువులను ఊచకోత కోయండి" అని హూంకారాలు చేస్తూ తను నగర ప్రవేశం చేసింది జ్వాల.

విషయం ఏమిటో అవగతమైన వెంటనే ఒక్క క్షణం కూడా ఆలస్యం చేయకుండా తన గజబలాన్ని కోటగుమ్మం దగ్గరికి పరిగెత్తించాడు సాగరుల వారు.

పై నుంచి బండరాళ్ళ వర్షం... సలసల కాగుతున్న నీటి తుంపరులు.

బాధతో ఘీంకరించవలసిన ఆ ఏనుగులు చిన్నపాటి బాధా సూచక శబ్దం కూడా చేయకుండా గబగబా కోటలోకి వస్తూ వుండటం– శిఖావంతుడి ప్రధాన సైన్యాధిపతికి మతిపోయినంత పని అయింది.

"ఏమిటిదీ? సాగరుడి ఏనుగులకు బాధ అంటే ఎలా వుంటుందో తెలియదా?" అయోమయంగా చూస్తూ తనవారిని అడిగాడతను.

"బాధ తెలుస్తుంది. కాని అవి యుద్ధగజాలు. సున్నితమైన వాటి శరీర భాగాలకు రక్షణగా ఇనుప తొడుగులు, చర్మపు కవచాలు ధరింప చేయబడ్డాయి" చెప్పాడు ఒక సైన్యాధిపతి.

తీరిపోలేదు ప్రధాన సేనాపతి అనుమానం. "అంత రక్షణ ఏర్పాటు చేయబడినప్పుడు మరి అవి ఎలుగుల్ని చూసి ఎందుకు బెదిరినట్లు?" అని అడిగాడు.

"ఎలుగుల్ని చూసి అవి మానసికమైన బాధకు గురి అయినాయి. ప్రతి జంతువుకు ఏదో ఒక విధమైన భయం వుంటుంది. సాగరుడి ఏనుగుల్ని భయపెట్టిన మన ఎలుగుబంట్లు వట్టి గుడ్డలు చుట్టి నిప్పు ముట్టించిన చెట్టుకొమ్మల్ని చూసి బెంబేలెత్తిపోయాయి" వివరంగా చెప్పాడు ఆ సేనాపతి.

తలవూపి ఆ మాటల్ని మనసులో భద్రపరుచుకున్నాడు ప్రధాన సేనాపతి. అయితే ఆ అనుభవాల్ని ఉపయోగించుకుని లబ్ధి పొందే అవకాశం మాత్రం అతనికి లభించలేదు.

ఒకదాని వెనుక ఒకటిగా కోటలోకి వచ్చేశాయి సాగరుల వారి ఏనుగులు. వాటి చాటున నిలబడి గోడల మీదినించి కురుస్తున్న శిలావర్షాన్ని తప్పించుకున్నారు ఆయన సైనికులు. శరీరాన్ని మాడ్చివేసే వేడినీటి జల్లులు తమమీద పడకుండా రక్షణ పొంది, వీరావేశంతో నగర ప్రవేశం చేశారు.

గోడల క్రింద వున్న శిఖావంతుడి సైన్యం చెల్లాచెదరయిపోయింది ముందుగా... ఆ తరువాత గోడల మీద వున్నవారు ఆయుధాల్ని విసర్జించి తలా ఒక పక్కకు పరుగులు తీశారు.

తూర్పుదిక్కు తెల్లబడబోతున్న సమయంలో సాగరుల వారికి స్వాధీనం అయిపోయింది సంపంగి నగరం.

❖ ❖ ❖

"వచ్చేసింది శిఖావంతుడి సైన్యం. దగ్గరికి వచ్చేసింది" చేస్తున్న పనిని ఆపి, ఒకసారి తల ఎత్తి చూసిన కనకయ్య శ్రేష్ఠి అనుచరుడు కూడా కీచుగా అందరినీ హెచ్చరించబోయాడు.

చేతులు ఉపయోగించే సమయం లేకపోవటంతో ఎడమ పాదాన్ని ఎత్తి అతని గుండెలమీద బలంగా తన్నాడు శుశ్రుతుడు.

వెర్రిగా అరిచాడు ఆ అనుచరుడు. వెల్లకిలా పడిపోయాడు. చీమ చిటుక్కుమన్నా పెద్దగా వినిపించేటంత నిశ్శబ్దంతో నిండివున్న ఆ ప్రదేశంలో, చాలా పెద్దగా వినవచ్చింది. అతను అరిచిన అరుపుకు అదిరిపడి చెరువుకేసి చూశారు గుడారాల దగ్గర వున్న ఆటవికులు.

"తవ్వండిరా మూర్ఖశిఖామణులారా... గట్టుకు వెంటనే గండి తవ్వి పక్కకు తప్పుకోండి... ఆలస్యం చేశారంటే ఇంతవరకూ మనం పడిన కష్టం అంతా వృధా అయిపోతుంది. తవ్వేయండి" జాగ్రత్తలన్నిటినీ గాలికి వదిలేసి భీకరంగా అరిచాడు శుశ్రుతుడు.

ఆలస్యం చేస్తే అలా అరవటంతో ఆగకుండా అతను తన నడుముకు వ్రేలాడుతున్న ఆయుధాన్ని తీసి తమ మీదికి విరుచుకు పడతాడేమోనన్న భయం కూడా కలిగింది కాబోలు... మరింత వేగంగా పని చేశారు కనకయ్య శ్రేష్ఠి అనుచరులు.

గుడారాల దగ్గర వున్న ఆటవికులకు మరింత స్పష్టంగా తెలిసివచ్చాయి చెరువు దగ్గర కదలికలు. ఎవరికీ అర్థం కాని తమదైన భాషలో ఒకరినొకరు హెచ్చరించుకుంటూ చెరువు దగ్గరికి బయలుదేరారు వారిలో కొందరు.

కొత్తగా వస్తున్న శిఖావంతుడి సైన్యం కూడా గుడారాల దగ్గరికి వచ్చేసింది. ఆటవికుల అనుమానం ఏమిటో అవగతమైన ఆ సైన్యాధిపతి తను కూడా చెరువు దగ్గరికి వెళ్ళమని సైగ చేశాడు కొంతమంది సైనికులకు.

"తవ్వండి... తవ్వండి. తవ్విపారేయండి" ఎగుసుకు వస్తున్న ఆందోళనను అదుముకోవటానికి విపరీతంగా శ్రమపడుతూ అందరినీ హెచ్చరించాడు శుశ్రుతుడు.

ముందుగా గట్టు సమీపంలోకి వచ్చారు ముగ్గురు ఆటవికులు. అక్కడ జరుగుతున్నదేమిటో కళ్ళారా చూసి గావుకేకలు పెట్టటానికి నోళ్ళు తెరిచారు.

దబ్బున శబ్దం చేస్తూ తిరిగి అవతల పడింది అదే సమయంలో, ఆఖరి మట్టిపెళ్ళ. తొణుకు తొణుకుమంటున్న చెరువులోని నీరు శరవేగంతో కదిలి, శుశ్రుతుడు తవ్వించిన ప్రదేశంలో నుంచి ఒక్కసారిగా ముందుకు దూకింది.

గావుకేకలు పెట్టబోతున్న ఆటవికులు కాలు నిలదొక్కుకోవటానికి ప్రయత్నం చేయకముందే ఆ నీటివేగాన్ని తట్టుకోలేక వెల్లకిలా పడిపోయారు.

వారితో పాటు తల్లక్రిందులైపోయారు వారి వెనుక వున్న సహచరులు. వారి మాదిరిగానే ఒక పక్కకు కొట్టుకుపోయారు కొత్తగా వచ్చిన సైన్యంలోని వారు.

కన్నుమూసి కన్ను తెరిచేటంతలో మరింత పెద్దదైపోయింది చెరువు కట్టకు శుశ్రుతుడు ఏర్పరిచిన గండి. ప్రళయకాలంలో ఉప్పొంగే సముద్రంలా వికృత శబ్దాలు చేస్తూ వెళ్ళి ఎలుగుబంట్లు విశ్రాంతి తీసుకుంటున్న గుడారాలను ముంచెత్తింది నీరు. గుంపులుగా నిలబడిన ఆటవికుల్ని అవతలికి నెట్టేసింది. కొత్తగా వచ్చిన సైనికుల్ని చెల్లాచెదురు కావించింది.

విరిగిపడుతున్న గట్టుకు దూరంగా జరుగుతూ ఆ దృశ్యాన్ని చూసి భూతబేతాళుడి మాదిరి వికటంగా నవ్వాడు శుశ్రుతుడు.

“ఎలుగులకు నీటిలో ఈదటం వచ్చు. ఈత రాని జంతువు ఏదీ ఈ ప్రపంచంలో సామాన్యంగా ఎవరికీ కనిపించదు. అవి ఈదుకుంటూ పొడి ప్రదేశంలోకి పోకముందే వాటి అంతు చూడవచ్చు. అందుకోండి మీ ఆయుధాల్ని” అని అందరినీ హెచ్చరిస్తూ తను ముందుకు పరిగెత్తాడు. పరిగెత్తుతూనే తన దట్టీలో వున్న శంఖాన్ని తీసి భీకరంగా ఊదాడు.

తెల్లబడుతున్నది ఆకాశం… కోటగోడల మీది వారికి చెరువుగట్టుకు గండిపడటం… చెరువులోని నీరు గుడారాల మీద విరుచుకుపడటం, ఆటవికులతో పాటు మిగిలిన సైన్యం కూడా కకావికలం అవటం స్పష్టంగానే కనిపిస్తోంది.

శుశ్రుతుడి శంఖారావాన్ని వినగానే “పదండి అందరూ… పరిగెత్తండి” అని ఆజ్ఞలు జారీచేసి అందరికంటె ముందుగా తను కదిలాడు నగర పాలకుడు.

గుడారాలలో నుంచి బయటికి వచ్చిన ఎలుగులు మళ్ళీ పొడి ప్రదేశం వైపు కదులుతూ వుండగానే వాటిమీద కురిసింది బాణవర్షం.

గట్టి నేలమీదికి చేరుకుని తమ సహజసిద్ధమైన క్రౌర్యాన్ని ప్రదర్శించే అవకాశం వాటికి లభించలేదు.

నీరు చేరుకోలేని ఎత్తయిన ప్రదేశాల్లో నిలబడి కత్తులతో జొన్న కంకుల్ని నరికినట్లు వాటి తలల్ని నరికేశారు శుశ్రుతుడితో వచ్చిన కనకయ్యశ్రేష్ఠి అనుచరులు.

ఆపసోపాలు పడుతూ నీటిలో నుంచి బయటపడిన శిఖావంతుడి సైనికుల్ని ఊచకోత కోశాడు నగర పాలకుడు తన భటులతో కలిసి.

సూర్యుడు ఒక మూరెడు ఎత్తుకు ఎదిగే సమయానికి అంతం అయిపోయింది ఆ పోరాటం.

తీవ్రమైన గాయాలు తగిలినా, ఏదో ఒక మూలగా కొంచెం ప్రాణమున్న ఎలుగుల మూలుగులతోను, అవయవాలు తెగిపోవటం వల్ల శిఖావంతుడి సైన్యంలో కొందరు చేస్తున్న ఆర్తనాదాల్తోను దద్దరిల్లిపోసాగింది ఆ ప్రదేశం.

జరిగింది తెలిసి గుంపులు గుంపులుగా కోట వెలుపలికి వచ్చేశారు లోపల వున్న జనం. నగర పాలకుడికి జేజేలు పలికారు. శుశ్రుతుడిని, కనకయ్య శ్రేష్ఠి అనుచరుల్ని భుజాల మీదికి ఎత్తుకుని కోట లోపలికి తీసుకుపోయారు.

"చెరువులోని నీరు వృథాగా వెళ్ళిపోయిందని మీరెవ్వరు దిగులు పడవద్దు. అవసరం అయితే నా ధనమంతా ఉపయోగించి అడవిలోని నీటి వనరులలో నుంచి తాగునీటిని నగరంలోకి తెప్పిస్తాను. మీకు ఎటువంటి బాధా కలుగకుండా చూస్తాను" అందరూ వింటూ వుండగా నగరం మధ్యలోని రచ్చబండ మీద నిలబడి పెద్ద కంఠంతో అందరికీ వాగ్దానం చేశాడు కనకయ్య శ్రేష్ఠి.

అతన్ని మెచ్చుకున్నారు నగర ప్రజలు. ఎంత గాఢంగా మెచ్చుకున్నారంటే అదేపనిగా బుగ్గలమీదికి జాలువారాయి కన్నీళ్ళు అతనికి.

"ఇక్కడి పరిస్థితుల్ని నగర పాలకుడు సరిదిద్దుకుంటాడు. మనం వెంటనే రాజధానికి వెళ్లి అక్కడ మనవల్ల కాదగిన సాయం ఏదైనా వున్నదేమో చూడాలి" అన్నాడు అతనితో శుశ్రుతుడు.

శ్రావస్తి నగరం దగ్గర రహదారిలోని శత్రువుల్ని దునుమాడటం పూర్తి అయిన సంగతిని ఒక కమ్మమీద వ్రాసి నలుగురు భటుల్ని సంపంగి నగరంవైపు పంపించాడు నగర పాలకుడు.

"సంపంగి పాలకుడు ఎక్కడ వున్నాడో తెలియదు. అడవిలోనో, అడవి అంచుల దగ్గిరో ఎక్కడో ఒకచోట వుంటాడు. వెతికి పట్టుకోండి. జాగ్రత్త" అనికూడా చెప్పాడు.

అతను సిద్ధం చేసిన అశ్వ శకటంలో రాజధానికి బయలుదేరారు కనకయ్య శ్రేష్ఠి, శుశ్రుతుడు.

❖ ❖ ❖

పన్నెండు ఏనుగులకు గాయాలై, కదలలేని పరిస్థితికి చేరుకోవటంతో, పగలంతా వాటిదగ్గరే వుండిపోయాడు సాగరుల వారు. వాటి ప్రాణాలకు ఎటువంటి ప్రమాదమూ లేదని వైద్య శిఖామణులు వివరంగా చెప్పిన తరువాతనే అంతఃపురానికి తిరిగి వచ్చాడు.

శిఖావంతుడి సైన్యం నగరాన్ని నాశనం చేయటం మొదలుపెట్టింది. ధనధాన్యాదుల్ని దోపిడీ చేసింది. భవనాల్ని కూలగొట్టింది. అంతఃపుర మందిరాల్ని కూడా పాడుపెట్టటానికి చూసింది.

"మనం తిరిగి కోలుకోవాలంటే కనీసం రెండు మూడు సంవత్సరాల సమయం పడుతుంది" నగరమంతా కలియతిరిగి వచ్చిన తర్వాత వివరంగా చెప్పాడు మంత్రి మహేశ్వరుడు.

"మేము ఈ పనులు ప్రారంభిస్తాము. ముందు మీరు చక్రవర్తికి బాసటగా వెళ్ళాలి... బయలుదేరండి" అన్నది చారులతాదేవి.

గాయపడిన గజాలను గజశాలలోనే వదిలి, మిగిలిన బలగాలతో మరోసారి కోట వెలుపలికి బయలుదేరాడు సాగరులవారు.

సంపంగి నగరాన్ని స్వాధీనం చేసుకోవటానికి ఎంత ఉత్సుకతను చూపించిందో, అంత ఉదాసీనతను ప్రదర్శించింది జ్వాల- రాజధానికి తిరిగి వెళ్ళేందుకు.

"అవతల యుద్ధం అతిఘోరంగా జరగబోతోంది. ఈ సమయంలో నువ్వు మీ తండ్రిగారి దగ్గర వుండడం చాలా ముఖ్యం" చెప్పింది చారులతాదేవి.

జ్వాల ఒక్కతే కాదు... అందరికంటె ముందుగా ప్రయాణం కావాల్సిన వాసుదేవుడు కూడా, ఆ ప్రయాణం తమకు ఇష్టం లేనట్లు మౌనంగా వుండిపోవటంతో అధికమైపోయింది ఆమె అనుమానం.

"ఏమైంది మీకు? అవతల చక్రవర్తి అపాయంలో వున్న సంగతిని మీరు పట్టించుకోరా? శిఖావంతుడి సైన్యమంటే మీకు చెమటలు పడుతున్నాయా భయంతో?" అంటూ నిందా వ్యాఖ్యలు కూడా పలికింది.

అప్పటికీ రాలేదు వారిలో చలనం.

"తల్లీ... సాగరులవారు కదిలి వెళ్ళారు. సంపంగి నగర గజబలం తిరిగి తన పూర్వపు బలాన్ని సంతరించుకున్నది. ఇక శిఖావంతుడి ఆశయం సిద్ధించటం అసంభవం. యుద్ధం జరగదు. మీరు భయపడాల్సిన పనేమీ లేదు" ఓపికగా చెప్పాడు వాసుదేవుడు.

ఇంకా ఇంకా అధికమైపోయింది చారులతాదేవి అనుమానం.

"నాశనమైన నగరాన్ని తిరిగి ఉద్ధరించే పనిమీద విశ్రాంతి కూడా తీసుకోకుండా తిరుగుతున్నాడు మహేశ్వరుడు. కనీసం అతనికి సహాయంచేసే ఆలోచన కూడా మీలో కనిపించటంలేదు... ఊరికే కూర్చుని మాటలతో కాలక్షేపం చేయదలుచుకున్నట్లుగా కనిపిస్తోంది" అంటూ చురుకుగా చూసింది.

ముసిముసిగా నవ్వింది జ్వాల. ఇంకా ఎక్కువైపోయింది చారులతాదేవిలోని అసహనం.

"మీరు చేయదలుచుకున్నది ఏమిటో నాకు తెలిసి తీరాలి. అంతే" ఖచ్చితమైన కంఠంతో చాలా గట్టిగా అన్నది.

అదే సమయంలో పాత సామాగ్రిని భద్రపరిచే మందిరంలో నుంచి శివుడు చిన్నతనంలో ఏ బుట్టలో దొరికాడో, ఆ బుట్టని తెచ్చి జ్వాల ముందు పెట్టింది ఒక పరిచారిక.

"మన అదృష్టం బాగుండి శిఖావంతుడి సైనికులు ఈ బుట్ట వున్న మందిరం దగ్గరికి పోలేదు. పోయి వున్నట్లయితే మన కథ అంతా తిరిగి మొదటికి వచ్చేసి వుండేది" అంటూ అందులోని పాత వస్త్రాన్ని తీసి క్రింద పరిచింది జ్వాల.

విప్పారిత నేత్రాలతో చూస్తూ వుండిపోయింది చారులతాదేవి. కోట వెలుపల యుద్ధం జరుగుతున్నప్పుడు జ్వాల తనకు అప్పగించిన నగలు, వస్త్రాల మూటను ఒక పౌరుడికి అప్పగించి, అతన్ని యుద్ధానికి దూరంగా నిలబెట్టాడు వాసుదేవుడు. నగరంలోకి వచ్చే సమయంలో తిరిగి ఆ మూటని స్వాధీనం చేసుకుని తనతోపాటు తీసుకువచ్చాడు.

ఇప్పుడు దాని ముడిని విప్పి అందులోని వస్త్రాలను, నగలను జ్వాల క్రిందపరిచిన వస్త్రం ప్రక్కన పెట్టాడు.

"అదే... అదే పోలిక. ఈ వస్త్రాలన్నీ ఒకే ప్రదేశంలో నేయబడ్డాయి. ఒక కుటుంబమే వీటిని ఉపయోగించింది" అంటూ నగలను కూడా విడదీయటం మొదలుపెట్టింది జ్వాల.

అతివలు అలంకరించుకునే ఆభరణాల గురించి పూర్తిగా తెలుసు చారులతాదేవికి.

"అరవంకీలు అవి... చెవులకు పూర్వకాలంలో ఉపయోగించిన జూకాలు... చంద్రహారం వున్నది. ముత్యాలసరం వున్నది. పాపిట సేరు... నాశికకు అందాన్ని ఇచ్చే బులాకీ... పచ్చలపతకం... నడుముకు వజ్రాల వడ్డాణం... బంగారు కడియాలు... శిరస్సుమీది చేమంతి బిళ్ళ. కెంపుల అంగుళీయ కాలు..." అంటూ ఒక్కొక్క ఆభరణాన్ని వర్ణించటం మొదలుపెట్టింది.

ఆమె పేరు పెట్టి చూపించిన ఆభరణాలన్నిటినీ దూరదూరంగా పెడుతున్న జ్వాల... ఆఖరిగా మిగిలిన ఒక అమూల్యమైన కంఠాభరణాన్ని పైకి ఎత్తి ఆమెకు చూపించింది.

కనక పుష్యరాగమణి ఒకటి పెద్ద బంగారు పతకంలో పొదిగి కనిపిస్తోంది. కంటికి సరిగ్గా కనిపించని అతిసన్నటి గుర్తులు ఏవో, ఆ పతకం వెనుక ముద్రించబడి వున్నాయి.

"కంఠాభరణమే ఇది. కాని దాని ప్రత్యేకత ఏమిటో నాకు తెలియదు" పరిశీలనగా చూస్తూ చెప్పింది చారులతాదేవి.

వాసుదేవుడి కేసి చూసింది జ్వాల. ఆ హారంమీది గుర్తుల్ని చూసిన వెంటనే అమితమైన ఆశ్చర్యం, ఆ తరువాత అదోరకమైన ఆనందం అతని ముఖంలో చాలా స్పష్టంగా కనిపించటం మొదలైంది.

"మాకు తెలియనిది మీకు తెలుసని మాకు అర్థమైంది. ఏమిటో చెప్పండి" అసహనంగా అడిగింది జ్వాల.

"తల్లీ... శివుడి వారసత్వం సామాన్యమైంది కాదు. తలుచుకుంటే నాకు తల తిరిగిపోతుంది" అన్నాడు వాసుదేవుడు.

అధికం అయిపోయింది జ్వాల అసహనం. "దయచేసి వెంటనే చెప్పండి. ఆలస్యాన్ని భరించటం నా వల్ల కావటం లేదు" చురుకుగా చూస్తూ వేగంగా అడిగింది.

"ఆ కంఠాభరణం సౌగంధి నగర పాలకుల అధికారాన్ని సూచిస్తుంది. సౌగంధి పాలకులు, వారి సంతానం తప్ప మరెవ్వరూ ధరించేది కాదు" అతి నెమ్మదిగా చెప్పాడు వాసుదేవుడు.

అయోమయంగా చూసింది జ్వాల. చారులతాదేవి అయితే అస్సలు తనకు ఏమీ అవగతం కానట్టు తల విదిలించింది.

"శివుడు మనకి లభించిన బుట్టలోని వస్త్రం వంటిదే అడవిలోని వృద్ధుడి దగ్గర మనకి దొరికాయి. అంటే శివుడికి అతనికి ఏదో సంబంధం వున్నట్లే లెక్క. అవునా? కాదా?" అడిగాడు వాసుదేవుడు.

అవునన్నట్లు తలవూపింది జ్వాల.

"ఆ వృద్ధుడి దగ్గరే ఈ కంఠాభరణం కూడా వున్నది. అంటే సౌగంధి దేశానికి చెందిన రాజకుటుంబీకులు ఎవరితోనో అతనికి సంబంధం వున్నట్లుగా కూడా నిరూపితమౌతోంది. అవునా?" మళ్ళీ అడిగాడు అతను.

కొంచెంగా ఏదో అంశం స్ఫురణకు వచ్చినట్లు అనిపించి అంతలోనే అయోమయమైపోయింది జ్వాలకు.

"మీరు మాట్లాడేది ఏమిటో నాకు ఏదీ తెలియటంలేదు. వివరంగా చెప్పితే సంతోషిస్తాను" ఉన్నట్లుండి అన్నది చారులతాదేవి.

"సుబోధుడు అనే వీరుడు సౌగంధి దేశపు యువరాణిని ప్రేమించి, ఆ పాలకులకు ఇష్టం లేకపోయే సరికి, పారిపోయి ఎక్కడో తలదాచుకున్నాడు" అన్నాడు వాసుదేవుడు.

అప్పుడు తెలిసిపోయింది జ్వాలకి. అతనే సుబోధుడు. అడవిలో మనకి ఆశ్రయం ఇచ్చింది అతనే. సాగరుల వారికి గజ యుద్ధంలో శిక్షణ ఇచ్చింది కూడా అతనే. సందేహం లేదు" ఆనందంగా అరిచింది.

తల వూపుతూ చిరునవ్వు నవ్వాడు వాసుదేవుడు.

"ఆ సుబోధుడి భార్య సౌగంధీయుల యువరాణి. వారిద్దరికీ ఒక ఆడపిల్ల. ఆమె మన శివుడికి జన్మనిచ్చింది. కారణాంతరాల వల్ల ఆమె మరణించింది. తను శివుడిని పెంచటం అసాధ్యమని భావించి సుబోధుడే శివుడుని ఈ బుట్టలో పెట్టి రాజమందిరం దగ్గర వదిలి వెళ్ళాడు. ఇందులో ఎటువంటి

సందేహం లేదు. ఇప్పుడే వెళ్లి అతన్ని గట్టిగా అడిగితే అసలు విషయం మనకి తెలిసిపోతుంది" అన్నాడు.

"శివుడు సౌగంధ దేశపు యువరాణికి వారసుడా?" తన చెవులను తనే నమ్మలేనట్లుగా అనుకున్నది జ్వాల.

"అదొక్కటే కాదు తల్లీ... ఇంకొక విశేషం వున్నది. బహుశా అది నీకు తెలియకపోయి వుండవచ్చు" అన్నాడు వాసుదేవుడు.

"ఏమిటది?" ఆశ్చర్యంగా అడిగింది జ్వాల.

"సౌగంధ దేశపు యువరాణిని సుబోధుడు వివాహం చేసుకుని తీసుకువచ్చిన తర్వాత ఆ వంశీయుల్లో ఎవరికీ ఇప్పటివరకు పుత్రసంతానం కలగలేదు. సింహాసనానికి వారసులైన వారందరూ స్త్రీలే. ఒక్క శివుడు మాత్రమే పురుషుడు. ఆ రాజ్య నియమాలను బట్టి చూస్తే వాడే సౌగంధదేశ సింహాసనాన్ని అధిష్టించే అధికారం కలిగి వున్నటువంటివాడు" చెప్పాడు వాసుదేవుడు.

నివ్వెరపోయినట్లు మొఖం పెట్టింది జ్వాల. ఎందుకనో ఒక్కసారిగా చిన్నబోయింది చారులతాదేవి వదనం. అంతలోనే తేరుకున్నది ఆమె.

"మీ మాటలు నిజమై శివుడు సౌగంధ దేశానికే చెందిన వాడైనంత మాత్రాన వాడికి రాజ్యాధికారం ఎలా సిద్ధిస్తుంది? వాడి అమ్మమ్మని వాళ్లుకాదని అనుకున్నారు గదా... ఆమె వివాహాన్ని అంగీకరించలేదు గదా" అన్నది.

"శివుడి మీద మమకారం మీచేత అలా అనిపిస్తోంది గాని, రాజకీయాల్లో శాశ్వత శత్రువులు వుండరు తల్లీ... తమ రక్త సంబంధీకుల్లో ఒక మగవాడు వున్నట్లు ఆ దేశాధిపతులకు ఇంకా తెలియదు. తెలిస్తే చిటికెలో తమ మనస్సులను మార్చుకుంటారు. అందులోనూ ఆ వారసుడు సాగరుల వారి పెంపకంలో పెరిగినట్లు తెలిస్తే మరింత వేగంగా వచ్చి వెంటబెట్టుకుపోతారు" అన్నాడు వాసుదేవుడు.

"నిజమే కాని మనం మరో విషయాన్ని మర్చిపోతున్నాము" అన్నది జ్వాల.

"ఏమిటది?" అడిగాడు వాసుదేవుడు.

"శివుడి తల్లి ఎవరో మనం ఊహించాము. అడవిలో వృద్ధుడిని అడిగితే యదార్థం ఏమిటో తెలిసిపోతుంది. బాగుంది ఇంతవరకూ. మరి తండ్రి ఎవరు?" అడిగింది జ్వాల.

"ఇంత దూరం వచ్చిన తర్వాత మనం ఊహాగానాలు చేయకూడదు. వెళ్లి ఆ సుబోధుడినే అడిగి చూడటం బాగుంటుంది" అన్నాడు వాసుదేవుడు.

జ్వాల తనకేసి చూడకముందే ద్వారం దగ్గర వున్న భటులను పిలిచి తాము అడవిలోకి పోయేటందుకు ఏర్పాట్లు చేయమని ఆజ్ఞలు ఇచ్చింది చారులతాదేవి.

❖ ❖ ❖

అంతకుముందే ముగిసిన యుద్ధం మూలకంగా తన ఏనుగులు అలిసిపోయి వుంటాయనే మాటను మరిచిపోయినట్లు అతి వేగంగా ప్రయాణం చేయించాడు సాగరుడు.

శ్రావస్తి నగరం ఇంకా చాలా దూరంలో వున్నదనగానే అతనికి ఎదురు వచ్చారు ఆ నగర పాలకుడు పంపించిన భటులు. తాము తీసుకువచ్చిన సమాచారాన్ని అతనికి అందించారు.

తన గజదళం అటుగా వస్తే అడ్డుకోవటానికి సిద్ధంగా వున్న భల్లూక దళాన్ని శుశ్రుతుడు తెలివిగా మట్టుపెట్టించాడని, కనకయ్య శ్రేష్ఠి అతనికి పూర్తి సహాయసహకారాలు అందించాడని తెలియగానే శుశ్రుతుడిని క్షమించేశాడు సాగరులవారు.

"సంపంగి నగరంలో అతను యధేచ్ఛగా తిరుగాడవచ్చని మామాటగా అతనికి తెలియజేయండి" అనిచెప్పి తన బలగాన్ని మరింత వేగంగా నడిపించాడు.

❖ ❖ ❖

"ఎప్పుడో జరిగిపోయిన సంఘటనల్ని ఇప్పుడు తవ్వుకోవడం దేనికి? శివుడిని తమ బిడ్డగా నిర్ణయించుకున్నారు కదా..." తరిచి తరిచి అడుగుతున్న చారులతాదేవితో అన్నాడు వృద్ధుడు.

వాసుదేవుడు ఊహించినట్లు సుబోధుడే అతను. శివుడి తల్లికి తల్లి సౌగంధ దేశపు యువరాణీ అయింది.

"శివుడి తండ్రి ఎవరో తెలుసుకోవాల్సిన అవసరం మాకు వున్నది. వాడి లక్షణాలు, వాడి వాలకంమాకు కొన్ని అనుమానాలు రేకెత్తిస్తున్నాయి" ఖచ్చితంగా చెప్పింది జ్వాల.

దీర్ఘంగా నిట్టూర్చి చారులతాదేవి వంక చూశాడు సుబోధుడు.

“తల్లీ... నువ్వు క్షమించాలి... శివుడి తండ్రి నీ భర్త అయినటువంటి సాగరులవారే” అన్నాడు.

అటువంటి సమాధానమే ఏదైనా చెవుల పడితే నిబ్బరంగా వినిపించుకోవటానికి సిద్ధంగానే వున్నా ఎంత ఆపుకున్నా ఆగకుండా ఆమె బుగ్గలమీదికి జాలువారాయి భాష్పధారలు.

“ఎందుకు చెప్పలేదు మాకు? మా మధ్య రహస్యాలు ఏమీ వుండవని అనుకున్నాను. కానీ ఇంత ముఖ్యమైన విషయాన్ని ఆయన నాకు ఎందుకు చెప్పలేదు?” తనలో తను అనుకున్నట్టు పైకే అన్నది.

“నా బిడ్డను చేపట్టిన సంగతిని మీకు చెప్పకపోవడం నిజంగా తప్పే” అన్నాడు సుబోధుడు.

“అదికాదు... సంతానం లేక నేను అలమటించిపోతుంటే చూస్తూ ఊరుకోవడం. తనకు సంతానం వున్నదని చెపితే నేను కాదని అంటానని అనుకున్నారా?” ఆవేశంగా అడిగింది చారులతాదేవి.

బరువుగా నిట్టూర్చి తల అడ్డం తిప్పాడు వృద్ధుడు.

“తన ద్వారా నా బిడ్డ శివుడికి జన్మ ఇచ్చిన సంగతి సాగరుల వారికి తెలియదు తల్లీ... అసలు జరిగింది వేరే వున్నది” అన్నాడు.

“వివరంగా చెప్పండి. ఏదీ దాచిపెట్టుకోవాల్సిన అంశం కాదు. దాని పరిణామాలు చాలా ఉధృతంగా వుంటాయి” అన్నాడు వాసుదేవుడు.

“సాగరుల వారు నా దగ్గర గజయుద్ధాన్ని అభ్యసిస్తున్న సమయంలో నా బిడ్డ అతనిమీద మనసు పడింది. పెళ్ళి చేసి పంపించాలన్న కోరిక నాకు కలిగిన మాట వాస్తవం. అయితే తమ యువరాణిని తమకు తెలియకుండా తీసుకు వచ్చినందుకు సౌగంధ పాలకులు నామీద కక్ష పెంచుకున్నారు. సాగరుల వారు ఉద్వాహం (పెళ్ళి) ఆడిన యువతి తమ వంశానికి చెందినది అని తెలిస్తే వాళ్లు తప్పకుండా సంపంగి నగరం మీద యుద్ధం ప్రకటించటమో, హంతకుల్ని పంపించి అందరినీ చంపించటమో చేస్తారు. అందువల్ల నేను అయిష్టంగానే వారి సంబంధాన్ని తృణీకరించాను. నా బిడ్డను నగరానికి తీసుకుపోవటానికి వీలులేదని చెప్పాను. నేను సుబోధుడినని సాగరుల వారికి

తెలియదు. శిఖావంతుడితో యుద్ధం ముగిసిన తర్వాత కొంతకాలానికి అతను నా బిడ్డను తనతో పంపించమని అర్థించటానికి మళ్ళీ వచ్చాడు. అప్పటికే శివుడికి జన్మనిచ్చి నా బిడ్డ పెద్దల్లో కలిసిపోయింది. నెలల శిశువును నేను రహస్యంగా మీ రాజమందిరం దగ్గర వదిలి వచ్చాను" చెప్పటం మొదలుపెట్టాడు సుబోధుడు.

నీరు నిండిన కనులతో అలా చూస్తూనే వుండిపోయింది చారులతాదేవి. తన చెవుల్ని తనే నమ్మలేనట్లు ఆశ్చర్యంగా వింటున్నది జ్వాల.

"సంతానం కలిగిన సంగతి సాగరుల వారికి తెలియదు. తెలియజెప్పటం వల్ల లేనిపోని ఘర్షణలు తలెత్తవచ్చనిపించి నేను మౌనంగానే వుండిపోయాను."

"నా భార్యా బిడ్డల మీది భ్రమతో వారి వస్తువుల్ని, వస్త్రాలను భద్రపరచు కోవటం జరిగింది. వాటి మూలకంగానే ఇప్పుడు ఈ విషయాలు బయటకి వచ్చాయి."

"శివుడు నా మనవడు. సాగరుల వారికి పుత్రుడు. వాడిలో మీరు చూస్తున్నవన్నీ మా పోలికలే" అంటూ మాటల్ని ముగించాడు సుబోధుడు.

మాటకు మాటగా ఏదో ఒకటి మాట్లాడవలసిన జ్వాల మౌనంగా వుండిపోయింది. చారులతాదేవి కళ్ళవెంట అశ్రుధారలు తప్ప నోటివెంట మాటలు రాలేదు.

గంభీరమైన నిశ్శబ్దం ఆ ప్రదేశాన్ని ఆవరించుకున్నది.

"తల్లీ... మన అనుమానాలన్నిటికీ సమాధానాలు లభించాయి. ఇప్పుడు చేయవలసింది ఏమిటి?" ఉన్నట్లుండి అడిగాడు వాసుదేవుడు.

చటుక్కున లేచి కుటీరం ఎదుట వున్న సమాధుల దగ్గరికి పోయింది చారులతాదేవి.

"బిడ్డలు లేకుండా మిగిలిపోవాల్సిన మా వంశానికి వారసుడిని అందించి నన్ను, నా భర్తను కాపాడిన మీరు... మాకు దేవతలు..." అంటూ మోకరించి ప్రార్థన చేసింది.

"మనం వెంటనే మన నగరానికి వెళ్ళిపోదాము. సుబోధుల వారిని కూడా మనతో తీసుకుపోతున్నాము" లేచి నిలబడుతూ చెప్పింది.

"తల్లీ... మీరు పొరపాటు మాట్లాడుతున్నారు. నేను ఎవరో తెలిసిన వెంటనే మీకు సౌగంధ దేశంతో విరోధం వచ్చేస్తుంది" ఆందోళన నిండిన కంఠంతో అన్నాడు సుబోధుడు.

"శిఖావంతుడి కంటె గొప్పవాళ్ళా ఆ సౌగంధీయులు? వాళ్లని జయించటానికి మా శివుడు ఒక్కడు చాలు. వాడిని వాడి ఏనుగుల్ని ఉసికొల్పి వదిలితే చిటికెలో వారి గర్వం అణిగిపోతుంది" సగర్వంగా అన్నది చారులతాదేవి.

"అదికాదు తల్లీ... వాళ్ళు యుద్ధం చేయకపోవచ్చు. కాని వారి దేశం నుంచి మీకు వచ్చే వస్తువుల ఎగుమతి దిగుమతులు ఆగిపోవచ్చు. ఈ సంగతి బయటికి పొక్కితే చక్రవర్తికి ఆగ్రహం కలుగవచ్చు" సర్దిచెప్పటానికి ప్రయత్నించాడు సుబోధుడు.

శివుడు అభిమానించటం వల్ల తనకు బిడ్డ కాదనీ, రక్తసంబంధం వల్ల తమకు నిజమైన వారసుడనీ ఖచ్చితంగా తెలిసిన తర్వాత ఎవరి మాటలను వినిపించుకోదలచలేదు చారులతాదేవి.

"ఇది మా కుటుంబ వ్యవహారం. చక్రవర్తికి ఇష్టం వున్నా లేకపోయినా శివుడు మా బిడ్డ. భగవంతుడు కూడా కాదనలేని సత్యం ఇది" అంటూ వాసుదేవుడి కేసి తిరిగిందామె.

"సుబోధుల వారితో మేము నగరానికి పోతాము. మీరు వెంటనే మన ప్రభువులను కలుసుకోవాలి. ఇక్కడ జరిగింది చెప్పాలి. యుద్ధం ముగిసిన వెంటనే నగరానికి తిరిగి రమ్మని సూచించాలి" అంటూ క్షణకాలం మాటల్ని ఆపింది.

ఆమె ఇంకా ఏదో చెప్పాలనుకుంటున్న సంగతి అర్థమైపోయింది వాసుదేవుడికి. "చెప్పండి తల్లీ..." అంటూ ప్రోత్సహించాడు.

"ఎప్పుడో ఏదో జరుగుతుందని అనుకుంటూ భయంతో కాలం వెళ్ళదీయటం నాకు నచ్చదు. శివుడి జన్మ రహస్యం ప్రపంచానికంతటికీ తెలియాలి" అన్నది.

"మీరు నగరానికి వెళ్లిన తర్వాత అందరికీ తెలిసిపోతుంది కదా... సుబోధుడిని చూడగానే అందరూ అసలు విషయాన్ని గ్రహిస్తారు కదా" అన్నాడు వాసుదేవుడు.

"మన నగరంలో తెలియటం కాదు. మన రాజ్యంలో కూడా కాదు. శివుడు ఎవరో ఆ సౌగంధీయులకు కూడా తెలియాలి" గంభీరంగా అన్నది ఆమె.

అదిరిపడి చూశాడు వాసుదేవుడు.

"అత్తా... తొందరపడటం మంచిది కాదు. సాగరుల వారు విజయులై నగరంలోకి వచ్చిన తర్వాత ఈ మాటలు మాట్లాడుకోవచ్చు" అంటూ సర్దిచెప్పటానికి ప్రయత్నం చేసింది జ్వాల.

"ఇది రహస్యమేమీ కాదు. చెప్పుకోకూడని వృత్తాంతం అంతకన్నా కాదు. మా బిడ్డ మహర్జాతకుడు. అందరికీ తెలియవలసిందే" మొండిగా సమాధానం ఇచ్చింది చారులతాదేవి.

"సుబోధుల వారు చెప్పినట్లు ఆ సౌగంధీయులు పగ తీర్చుకునే ప్రయత్నం వెంటనే చేస్తే?" అనుమానంగా అడిగాడు వాసుదేవుడు.

"మన మహేశ్వరుడు నగరంలోనే వున్నాడు. మా మాటల్ని శిరసావహించే భటులు మా దగ్గరే వున్నారు. అన్నిటినీ మించి తన ఏనుగులతో శివుడు సిద్ధంగానే వుంటాడు. వాళ్ళు చేయగలిగింది ఏమీ లేదు. ఏమైనా చేయటానికి ప్రయత్నం చేస్తే నిర్మొహమాటంగా తిప్పికొడతాము... నిజం ఏమిటో మాత్రం వెంటనే వెల్లడి కావల్సిందే" మరింత పట్టుదలగా అన్నది చారులతాదేవి.

ఆమెకు సర్ది చెప్పటం ఆపైన అసాధ్యమని అర్థమై తలవూపాడు వాసుదేవుడు. తామందరూ తిరిగి నగరంవైపు ప్రయాణం కావటానికి కావల్సిన ఏర్పాటు చేయటానికి బయలుదేరాడు.

"నవ్వుతూ నవ్వుతూ మొదలుపెట్టిన పని మనం ఊహించని రీతిలో చాలా దూరం వెళ్ళిపోయింది" అతనితోపాటు అడుగులు వేస్తూ అన్నది జ్వాల.

"సౌగంధీయుల ప్రవర్తన ఎలా వుంటుందో తెలుసుకోగలిగితే అంతా సుఖాంతం అవుతుంది" సాలోచనగా అన్నాడు వాసుదేవుడు.

"సుబోధుల వారు భయపడుతున్నట్టు వాళ్ళు నిజంగానే ఈ విషయాన్ని అవమానంగా భావిస్తారా?" అడిగిందామె.

"గతంలో అలాగే భావించారు. సుబోధుడి జాడలు తెలిసినట్లయితే తప్పకుండా కాటికి పంపించే ఏర్పాట్లు చేసి వుండేవాళ్ళు. మరి ఇప్పుడు వాళ్ల మనస్సులు ఎలా వున్నాయో మనకి తెలియదు" అన్నాడు వాసుదేవుడు.

"తెలుసుకునే ప్రయత్నం చేస్తే?" అడిగింది జ్వాల.

ఆమె తలమీద చెయ్యి వేసి ఆదరంగా నిమురుతూ చిన్నగా నవ్వాడు వాసుదేవుడు.

❖ ❖ ❖

జ్వలిత సామ్రాజ్యంలో భాగాలయిన మండలాలన్నిటి నించీ వచ్చిన సైనికులను తమ సైన్యాధిపతులకు అప్పగించి ఎవరెవరు ఏ ఏ పనులు చేయాలో కూలంకషంగా చర్చించి సభా భవనం దగ్గరికి వచ్చాడు మంత్రి గుణధాముడు.

వెంటనే ఆయన ఎదుటికి పోయి వినయంగా నమస్కారం చేశాడు శుశ్రుతుడు.

"ఎంతో ముఖ్యమైన విషయాలను గురించి నీతో చర్చించి, నీ అభిప్రాయం తెలుసుకుందామనుకుంటూ నీ కోసం భటుల్ని పంపించాను" అతని భుజాన్ని ఆప్యాయంగా తడుతూ అన్నాడు గుణధాముడు.

సాగరుల వారి కారాగారంలో నుంచి తను తప్పించుకుని బయట పడటానికి ఆ భటులే కారణమని ఆయనకి చెప్పలేదు శుశ్రుతుడు.

"రకరకాల ఒత్తిళ్ళు అనుకోనివిధంగా ఉక్కిరిబిక్కిరి చేసేశాయి. ఒకటి చేయబోయి ఇంకోటి చేయటం జరిగింది. తప్పులు దిద్దుకోవటానికి చాలా సమయం పట్టింది" అని మాత్రం అన్నాడు.

ఒకవేళ అతను జరిగింది ఏమిటో వివరంగా చెప్పటానికి ప్రయత్నించి వున్నా గుణధాముడు తీరికగా వినిపించుకునే స్థితిలో లేడు.

"జరిగిన వాటిని గురించి ఇప్పుడు వద్దు. జరగబోయేది చూసుకోవాలి. శిఖావంతుడి ఆలోచనలు అతని వ్యూహాలు మనకి పూర్తిగా తెలియాలి" అన్నాడు.

"గుణధాముల వారు అనవసరమైన కలతకు గురి అవుతున్నట్లు కనిపిస్తోంది" నవ్వుతూ అన్నాడు శుశ్రుతుడు.

"కలతకు గురి కాకపోతే మరి దేనికి గురి అవుతాను? పెట్టనికోట వంటి సాగరుడు అడవులు పట్టిపోయాడు. అఖండ విజయాల్ని అనాయాసంగా సంపాదించి పెట్టే సంపంగి నగర గజదళం కూడా చెల్లాచెదురైపోయింది.

ఇంక ఈ శిఖావంతుడిని నిలువరించటం ఏ విధంగా సాధ్యపడుతుంది?" గుణధాముని ప్రతిమాటలోను నిరాశ ప్రతిధ్వనించింది.

ఒక్కక్షణం పాటు విపరీతమైన ఆశ్చర్యానికి గురై అంతలోనే తనను తాను సంబాళించుకున్నాడు శుశ్రుతుడు.

సంపంగి నగరం నుంచి వర్తమానాలు ఏవీ రాజధానికి వచ్చినట్లు లేవు. నగరాన్ని స్వాధీనపరుచుకున్న శిఖావంతుడి సైన్యాధిపతులు వార్తలను చేరవేసే పావురాలను పూర్తిగా నిర్మూలించి వుంటారు.

శ్రావస్తి నగర పాలకుడి దగ్గిర్నించికూడా ఏ విషయాలు వెల్లడి కాలేదు. ఎలాగూ కనకయ్య శ్రేష్టి రాజధానికి ప్రయాణమౌతూ వుండడంతో విజయవార్తని అతనే చక్రవర్తికి తెలియచేయగలడని ఊహించి మిన్నకుండి పోయాడు నగర పాలకుడు.

"మహామంత్రుల వారు వెంటనే దైన్యభావాన్ని వదిలి ధైర్యం తెచ్చుకోవాల్సిన అవసరం వున్నది" అంటూ జరిగిన సంఘటనలన్నిటినీ సవివరంగా తెలియచేశాడు శుశ్రుతుడు.

"శిఖావంతుడి భల్లూక దళం నిర్జించబడింది. సాగరుల వారి మార్గాన్ని నిరోధించటానికి సిద్ధమైన ఆటవికుల్ని శ్రావస్తి సేనల సహాయంతో మేము మట్టుబెట్టాము. సంపంగి నగర గజదళం రాజధానికి ప్రయాణం అయింది. ఈపాటికి మూడు వంతుల దూరం వచ్చేసి వుంటుంది" అన్నాడు.

మంత్రం వేసినట్లు మటుమాయం అయిపోయింది గుణధాముడి వదనంలోని నిర్వేదం. "నిజమేనా శుశ్రుతా... నువ్వు నిజమే చెపుతున్నావా?" ఆనందాన్ని అణచుకోవటం చేతకాక బిగ్గరగా అడిగాడు.

"ప్రభువుల సమక్షంలో నిజం కాకుండా అసత్యం పలుకగల ధైర్యం నాకు ఎలా వుంటుంది? కనకయ్య శ్రేష్ఠి విశ్రాంతి భవనంలోనే వున్నారు. పిలిపించి వారిని కూడా మాట్లాడించండి. మరికొన్ని వివరాలు మీకు తెలియవచ్చు" గుంభనంగా అన్నాడు శుశ్రుతుడు.

గంభీరంగా తలవూపాడు గుణధాముడు. "కనకయ్య శ్రేష్ఠి వున్నట్లుండి శిఖావంతుల వారి దర్శనానికి వెళ్ళినట్లు మాకు తెలిసింది. ప్రచోద నగరంలోని తన వాణిజ్య వ్యవహారాలు సరిచూసుకోవటానికి ప్రయాణమై వుంటాడని

చక్రవర్తి అభిప్రాయపడ్డారు. నీ మాటల్ని బట్టి చూస్తుంటే ఇంకో భావం గోచరిస్తోంది. జరిగింది ఏమిటో నాకు పూర్తిగా తెలియాలి” అంటూ సభా భవనం ప్రక్కనే వున్న ఒక పూతోటలోకినడిచి ఒక చెట్టుక్రింది బండరాయి మీద కూర్చున్నాడు.

తనకు తెలిసిన మాటల్లో ఒక్కదాన్ని కూడా వదిలిపెట్టలేదు శుశ్రుతుడు. తను చేసిన పనుల్ని కూడా దాచిపెట్టకుండా సర్వం సవివరంగా తెలియచేశాడు.

“నాకు బుద్ధి వచ్చింది. నా కంటె ముందుగా శ్రేష్ఠి మనసు పూర్తిగా కళంక రహితమైంది. శ్రావస్తిని కాపాడటానికి, సాగరుల వారి మార్గాన్ని నిష్కంటకం చేయటానికి ఆయన పూనుకున్న పద్ధతి అపూర్వం” అని చెప్పాడు.

“మరి సాగరుల వారి అనాథ శరణాలయంలో పెరిగిన ఆ శివుడి సంగతేమిటి? అతనికి సాగరుల వారి అర్ధాంగి చారులతాదేవికి వున్న సంబంధం ఏమిటి?” సూటిగా అడిగాడు గుణధాముడు.

సంపంగి నగరాన్ని సాగరుల వారు స్వాధీనపరచుకున్నట్లు తెలిసినా, పూర్తి వివరాలు శుశ్రుతుడికి తెలియవు. అంతకుముందు తెలిసిన మాటల్నే మరోసారి చెప్పాడతను.

“శివుడి శక్తియుక్తుల మీద ఆమెకు పూర్తి విశ్వాసం వున్నది. గజాల్ని నడిపించటంలో అతని శక్తి సాగరులవారికంటే అధికమట. తమ కడుపున పుట్టినవాడిగానే భావిస్తున్నారట…” అన్నాడు.

“నిన్ను మా సమక్షంలోకి తీసుకురమ్మనమని ఇద్దరు భటుల్ని పంపించాము. వాళ్ళు ఏమైపోయారో తెలియటం లేదు” అంటూ బండరాయి మీదినుంచి లేచాడు గుణధాముడు. “చక్రవర్తి ఇంకా సభాభవనంలోనే వున్నారు. వెంటనే వారికి నువ్వు చెప్పిన శుభవార్తను తెలియచేయాలి” అంటూ అటుకేసి కదిలాడు.

“ప్రభూ… కనకయ్య శ్రేష్ఠి ప్రవర్తన మీద తమకు ఏమైనా అనుమానాలు వున్నాయా?” వెనుకే నడుస్తూ అడిగాడు శుశ్రుతుడు.

“మన ఆంతరంగికుడి మాదిరిగా మర్యాదలు అందుకుంటూ, తన స్వార్థం కోసం అతను శిఖావంతుడి చెంతకుపోవటం నిజంగా క్షమార్హం కాదు. శిరచ్ఛేదనం చేయించవలసిన నేరం. కాని అతను శ్రావస్తిని కాపాడేందుకు చూపిన చొరవ ప్రశంసనీయం…” అంటూ రెండు క్షణికాల పాటు మౌనంగా వుండిపోయాడు గుణధాముడు.

"తిరిగి మరోసారి తన స్వార్థబుద్ధిని బయటపెట్టుకోకుండా వుంటే చాలా బాగుంటుంది" అన్నాడు తీవ్రంగా ఆలోచిస్తూ.

"అందుకు నేను బాధ్యత... కనకయ్య శ్రేష్ఠిలో మార్పు వచ్చింది" వెంటనే చెప్పాడు శుశ్రుతుడు.

"అయితే నువ్వే వెళ్లి అతన్ని సగౌరవంగా చక్రవర్తి దర్శనానికి తీసుకురా... సముచితంగా సత్కరిద్దాము" అన్నాడు గుణధాముడు.

తృప్తి కలిగింది శుశ్రుతుడికి. వెంటనే వెనుతిరిగి కనకయ్య శ్రేష్ఠి విడిది చేసి వున్న మందిరం వైపు వెళ్లిపోయాడు.

తలలు వంచి అభివాదం చేస్తున్న ద్వారపాలకులవంక గంభీరంగా చూస్తూ సభాభవనంలోకి వెళ్ళాడు గుణధాముడు.

అలసట నిండిన మనసుతో సింహాసనం మీద కనిపించాడు చక్రవర్తి. "రేపు ఉదయ వేళలో శిఖావంతుడి సైన్యం దాడి ప్రారంభిస్తుందని తెలిసింది. మన ఏర్పాట్లు పూర్తి అయినట్లే కదా?" గుణధాముడిని చూడగానే అడిగాడు.

తలవూపాడు గుణధాముడు.

"సాగరుల వారి జాడలు తెలియరాలేదు. యువరాణి ఏమైపోయిందో తెలియటం లేదు" గాఢంగా నిట్టూరుస్తూ అన్నాడు చక్రవర్తి.

తనకు తెలిసిన విజయ వార్తను ఆయనకు చెప్పకుండా ఆలస్యంచేయటం, ఆయన్ను ఇంకా బాధలోనే వుంచటం మహాపరాధమని తెలిసిపోయింది గుణధాముడికి. శుశ్రుతుడు చెప్పినవన్నీ ఆయనకు తెలియచేయటానికి పెదవులు విప్పబోతుండగా "జయము జయము చక్రవర్తికి... మహాబలుల వారికి విజయము" అంటూ అభివాదం చేశాడు లోనికి వచ్చిన ద్వారపాలకుడు ఒకతను.

చివ్వున తల ఎత్తి అతని వంక చూశాడు చక్రవర్తి.

"సాగరుల వారి గజదళం శిఖావంతుడి సైన్యానికి ఎదురుగా మూడువందల ధనువుల దూరంలో నిలబడి వున్నది. సంపంగి నగరాన్ని తిరిగి స్వాధీనం చేసుకుని మనకి రక్షణగా వచ్చారాయన. యువరాణి వారు గూఢచారి వాసుదేవుల వారితో ఇంకా సంపంగిలోనే వుండిపోయారట" పెద్ద కంఠంతో బిగ్గరగా చెప్పాడు ఆ ద్వారపాలకుడు.

చివాలున సింహాసనం మీదినించి లేచి నిలుచున్నాడు చక్రవర్తి మహాబలుడు.

"ఎలా తెలిసింది శుభవార్తా?" ఆత్రుతగా అడిగాడు.

"శుశ్రుతుల వారిని వెతకటానికి మహామంత్రి సంపంగి నగరానికి పంపించిన భటులు పొరపాటున అక్కడి చెరసాలలో బంధింపబడి, ఇప్పుడు విడుదలై ఇంతకుముందే నగరానికి తిరిగి వచ్చారు ప్రభూ..." చెప్పాడు అతడు.

"రప్పించండి వారిని. వెంటనే రప్పించండి" అధికమైపోతున్న ఆత్రుతను అణుచుకోవటం అసాధ్యమై మరింత బిగ్గరగా ఆజ్ఞ ఇచ్చాడు మహాబలుడు.

తలవాల్చి నమస్కారం చేస్తూ వెనక్కి పోయాడా భటుడు. పది క్షణికాల తరువాత ఇద్దరు భటులను వెంట బెట్టుకుని వచ్చాడు.

దుమ్ము ధూళితో అసహ్యకరంగా వున్నాయి వారిద్దరి దుస్తులు. అదేపనిగా ప్రయాణం చేసి వచ్చినట్లు పూర్తి అలసట ప్రస్ఫుటంగా కనిపిస్తోంది వారి వదనాల్లో.

"సంపంగి నగరం స్వాధీనమైన వెంటనే శిఖావంతుడి సైన్యాధిపతులు మమ్మల్ని చెరసాలలో నుంచి వదిలి, తమకు నగరాన్ని నాశనం చేయటంలో సహాయం చెయ్యమని ఆజ్ఞలు ఇచ్చారు" అన్నాడు వారిలో ఒకతను.

"నగరాన్ని నిర్మించటంలో సహాయాలు అవసరం అవుతాయి. నాశనం చెయ్యటానికి దేనికి?"ఆశ్చర్యంగా అడిగాడు గుణధాముడు.

"చక్రవర్తుల వారి అభిమానాన్ని పొందిన సాగరుల వారికి అపూర్వమైన సంపదలు కానుకలుగా ఇవ్వబడివుంటాయని ఆ సైన్యాధిపతులు భావించారు. ఆ సంపదల్ని ఎక్కడ దాచిపెట్టారో తెలుసుకోవటం కోసం అంతఃపుర మందిరం విధ్వంసం మొదలుపెట్టారు..." తమ సహాయాన్ని వాళ్లు అపేక్షించటానికి కారణాన్ని చెప్పాడు రెండో భటుడు.

"ఆ తరువాత ఏం జరిగింది?" ఆలస్యాన్ని భరించటం అసాధ్యమై పోతున్నట్టు అసహనంగా అడిగాడు చక్రవర్తి.

"సాగరుల వారు తమ దత్తపుత్రుడైన శివుడి సాయంతో శిఖావంతుడి ఎలుగుబంటి సైన్యాన్ని ఎదిరించటం ఎలాగో కనిపెట్టి నగరం మీదికి వచ్చిపడ్డారు. ఆ సైన్యాన్ని చెల్లాచెదురు చేసి విజయం సాధించారు" చెప్పాడు మొదటి భటుడు.

''మహామంత్రి...'' ఖంగుమంటున్న కంఠంతో గుణధాముడిని సంబోధించాడు చక్రవర్తి.

"ప్రభూ... ఆజ్ఞ ఇవ్వండి..." వెంటనే అడిగాడు గుణధాముడు.

"ఇంతటి శుభవార్తను తెచ్చిన ఈ భటులిద్దరికీ చెరి ఒక గ్రామాన్ని దానం చెయ్యండి. వారి ఆగమన వార్తను తీసుకువచ్చిన ద్వారపాలకుడికి పదివేల బంగారు నాణేలు బహూకరించండి" అన్నాడు చక్రవర్తి.

కాగడాల మాదిరి సంతోషంతో వెలిగిపోతున్న ఆ భటుల వంక చూస్తూ తలవూపాడు గుణధాముడు. "మీరిద్దరూ ఎందుకు బంధింపబడ్డారో, ఎలా బందీలు అయ్యారో శుశ్రుతుడు మాకు వివరంగా చెప్పాడు. బంధించబడ్డారన్న ఆక్రోశంతో మీరు శిఖావంతుడి సేనాధిపతులకు ఏమైనా సాయం చేశారా? అంతఃపుర మందిరాల విధ్వంసంలో పాలుపంచుకున్నారా?" అని వారిని అడిగాడు.

"మేము జ్వలిత సామ్రాజ్య పౌరులం ప్రభూ... శిఖావంతుడి సైన్యంలోని వాళ్ళం కాదు. అంతఃపురం మందిరాల మీదినించి వారి దృష్టిని నగరంలోని పురాతన భవనాల మీదికి మరలించాము. అంతఃపుర మందిరాలకు పెద్ద నష్టం కలగలేదని... విచారణ జరిపితే మీకు తెలిసిపోతుంది" తమను అనుమానించినట్లు మాట్లాడేసరికి చిన్నబుచ్చుకుంటూ అన్నాడు మొదటి భటుడు.

"సాగరుల వారి దత్తపుత్రుడు శివుడు గురించి చెప్పండి... చక్రవర్తికి తెలియకుండా ఎప్పుడు జరిగిందా దత్తత కార్యక్రమం?' అడిగాడు గుణధాముడు.

"అదేమిటో మాకు తెలియదు ప్రభూ... నగరంలో చెలరేగిన కలకలం అది. మాకు తెలిసినది మీకు చెప్పాము. ఆ శివుడే పూనుకోకపోయినట్లయితే శిఖావంతుడి భల్లూక సైన్యాన్ని ఎదిరించటం ఎలాగో సాగరుల వారికి తెలిసేది కాదట. అడవిలో దారి తప్పిన యువరాణి వారిని రక్షించటం కూడా అసాధ్యమైపోయేదిట. ఎవరు అంగీకరించినా, అంగీకరించకపోయినా అతను తమ వారసుడేనని సాగరుల వారి ధర్మపత్ని ఘంటాపథంగా చెప్పారట" అన్నాడు ఆ భటుడు.

"మీరు చూపిన చొరవకు, చేసిన సేవకు చక్రవర్తి పూర్తిగా తృప్తి చెందారు. వారు మీకు అనుగ్రహించిన బహుమానాలు త్వరలోనే మీ స్వంతం అవుతాయి. ఇళ్ళకు వెళ్ళి విశ్రాంతి తీసుకోండి" అంటూ అతన్ని అతని సహచరుడిని అవతలికి పంపి, చక్రవర్తి వైపు చూశాడు గుణధాముడు.

"మా సోదరి అనాలోచితంగా ఏ పనీ చేయరు. ఆమె ఆ శివుడిని తన బిడ్డగా భావించదలచుకుంటే మాకు ఎటువంటి అభ్యంతరము వుండదు" వెంటనే అన్నాడు చక్రవర్తి.

''చారులతాదేవి మీ సోదరి కాబట్టి ఆమె చేసిన పనిని మీరు సమర్థిస్తున్నారని అందరూ అనుకుంటారు" అన్నాడు గుణధాముడు.

"అది నిజమే కదా... మేము చెపుతున్నది కూడా అదే కదా... ఇందులో ప్రత్యేకంగా మాట్లాడుకోవాల్సింది ఏముంది'' ఆశ్చర్యంగా అడిగాడు మహాబలుడు.

"ప్రభూ! ఇది మీ కుటుంబ వ్యవహారం కాదు. జ్వలిత సామ్రాజ్య పరిపాలనలోని ఒక ముఖ్యమైన విధాన నిర్ణయం. మన పాలనలోని మండలాలలో మండలాధిపతులకు వంశ పారంపర్య హక్కులు లేవు. సమర్థత చూపినంతవరకే వారు అధికారంలో వుంటారు. వారి తర్వాత ఎవరు అధిపతులుగా వుండాలో నిర్ణయించాల్సింది మనమే. తమకు తాముగా వాళ్ళు నిర్ణయించుకోకూడదు" అన్నాడు గుణధాముడు.

"సాగరుడికి స్వయం నిర్ణయ అధికారం ఇవ్వబడలేదా?"

"ఇవ్వబడలేదు. ఇవ్వబడుతుందని అందరూ అనుకుంటున్నారు గాని అధికారికంగా మనం ధృవీకరించలేదు."

"అయితే ఇప్పుడు ధృవీకరించుకుందాము."

"ఆలోచించండి ప్రభూ...ఇప్పటికిప్పుడు కాకపోయినా భవిష్యత్తులో మరో మండలాధిపతి ఈ విషయాన్ని ఆసరాగా తీసుకుని వంశపారంపర్య హక్కులు కోరవచ్చు. అఖండ జ్వలిత సామ్రాజ్యంలో చీలికలు ఆరంభం అయ్యే అవకాశం వుంది."

గుణధాముడి మాటల్లోని యదార్థం ఆలోచనలో పడవేసింది చక్రవర్తి మహాబలుడిని.

"సాగరుడు లేకపోతే మనం లేము. మన సామ్రాజ్యం లేదు. అతని విషయంలో ఏదో ఒక వెసులుబాటు చూపించకపోతే ఎలా?" కొద్దిసేపటి తరువాత అడిగాడు ఆయన.

"ప్రస్తుతం వచ్చిన బాధ అదే ప్రభూ... సాగరుల వారు లేకపోతే జ్వలిత సామ్రాజ్యానికి రక్షణ లేదు. అక్కడ ఆ శివుడు వుండి వుండకపోయినట్లయితే ఇప్పుడు సాగరుల వారు మనకి రక్షణగా వచ్చి వుండేవాడు కాదు. కాని సామ్రాజ్య పరిపాలనకు మీ పూర్వీకులు ఏర్పరిచిన నియమాలు చాలా కఠినంగా వున్నాయి. మనమే ఆ నియమాలను ఉల్లంఘిస్తే ప్రజలు వాటిని ఎలా గౌరవిస్తారు?" అడిగాడు గుణధాముడు.

"ఎలా గుణధామా? ఈ సమస్యను పరిష్కరించటం ఎలా?" ఆవేదనగా అడిగాడు చక్రవర్తి.

"ఇప్పటికిప్పుడు పరిష్కరించవలసిన సమస్య కాదు ఇది. ఆ శివుడు ఇంకా చిన్నపిల్లాడే... అతని విద్యాభ్యాసం కూడా పూర్తి అయివుండదు. ముందుగా మనం శిఖావంతుడి పీచం అణచాలి. ఆ తర్వాత ప్రభువులే స్వయంగా సంపంగి నగరానికి వెళ్ళి మీ సోదరితోను, సాగరుల వారితోను, ముఖ్యంగా అక్కడి మంత్రి మహేశ్వరుడితోను మాట్లాడవచ్చు" అన్నాడు గుణధాముడు.

తీవ్రమైన ఆలోచనతో ముడుతలు పడినట్లు కనిపిస్తున్న చక్రవర్తి వదనం ఒక్కసారిగా తేటపడింది ఆ మాటల్ని వినేసరికి. "నిజమే... మన వాసుదేవుడు కూడా అక్కడే వున్నాడు. అవసరం అయితే మనకి మార్గనిర్దేశనం చేస్తాడు" అంటూ తలవూపాడు.

అదే సమయంలో అతి స్పష్టంగా వినవచ్చాయి పెద్దగా మోగుతున్న యుద్ధ భేరీల మ్రోతలు.

"ఏం జరిగింది? ఏమిటా చప్పుళ్ళు?" తాము ఆజ్ఞలు ఇవ్వకుండా యుద్ధం ఆరంభం అవదన్న నమ్మకం సడలిపోతుండగా ద్వారపాలకులను పిలిచి అడిగాడు గుణధాముడు.

సభా భవనం ఎదుట వున్న రాచవీధిలోకి పరిగెత్తుకు పోయి, పాతిక క్షణికాల తరువాత తిరిగివచ్చాడు ఒక ద్వారపాలకుడు.

"యుద్ధం ఆరంభమయింది ప్రభూ... సాగరుల వారి గజదళం శిఖావంతుడి సైన్యం మీదికి దూసుకుపోతున్నదట... దానికి బాసటగా మన సైనికులు అందరూ కదులుతున్నారు" అని చెప్పాడు.

ఆపైన ఒక్కక్షణంకూడా ఆలస్యం చేయలేదు చక్రవర్తి. "రండి వెంటనే వచ్చి మా కవచ శిరస్త్రాణాలను అందించండి. మేము సమీపంలో లేకపోయినా ధైర్యంగా పోరాడబోతున్న మా సైనికులను మేము ఉత్సాహపరచాలి. మేము వెంటనే యుద్ధరంగంలోకి వెళ్ళిపోవాలి" తన అంగరక్షకులను పిలుస్తూ ఆజ్ఞలు ఇచ్చాడాయన.

అర్థఘడియ తరువాత అందమైన యుద్ధరథం ఎక్కి స్వయంగా సరిహద్దుల దగ్గరికి పోయాడాయన.

విరగబడిపోతున్న తన పట్టపుటేనుగు మీద ఆశీనుడై కొమ్ముబూర సహాయంతో మిగిలిన ఏనుగులన్నిటినీ పరుగులు తీయిస్తూ కనిపించాడు సాగరుడు.

పొడవాటి బరిశెల్ని పట్టుకుని ఆ ఏనుగులకు రక్షణగా కదులుతోంది చక్రవర్తి సైన్యం. కరకు కత్తులతో, పదునైన బాణాలతో ఆ సైన్యానికి కాపుదలగా నిలబడుతున్నారు మిగిలిన సైనికులు.

చక్రవర్తి ఆగమనాన్ని గమనించి ఆకాశం బ్రద్దలైపోయేటట్లు జయజయ ధ్వానాలు చేశారు అందరూ.

"జయము జయము మహాబలి చక్రవర్తికి... జయము జయము అఖండ జ్వలిత సామ్రాజ్యనేతకు..."

❖ ❖ ❖

చెవులు గట్టిగా మూసుకోవాలన్న కోరికను అతి బలవంతంగా అదుము కుంటూ గిరుక్కున వెనుతిరిగి, తన శిబిరంలోకి వెళ్ళిపోయాడు శిఖావంతుడు.

సంవత్సరాల తరబడి శ్రమించి తయారుచేసుకున్న తన సైన్యం, సాగరుడు తీసుకువచ్చిన గజదళాన్ని చూడగానే భయంతో వణికిపోవడాన్ని గమనించే సరికి అవమానంతో రగులుకుపోతున్నాయి అతని గుండెలు.

"ఆకులు అలములు ఆరగిస్తూ అడవిలో సంచరించే ఆ దిక్కుమాలిన ఏనుగులు నా కలల్ని నాశనం చేయటానికి ప్రత్యక్షం అయ్యాయి. ఏది

జరుగుతుందో అదే జరుగుతోంది" ఆవేదనగా అన్నాడు తనతో పాటు శిబిరంలోకి వచ్చిన తన మంత్రుల్ని చూసి.

"యుద్ధం ఆరంభం అయిందే గాని, అంతం కాలేదు ప్రభూ... మన సైన్యం వెనుకంజ వేసిందేగాని ఓటమితో పారిపోవటం లేదు" ధైర్యం చెప్పటానికి ప్రయత్నం చేశాడు ఒక మంత్రి.

"అవి... ఆ ఏనుగులు... వాటిని జయించటానికి ఎలుగుబంట్లను తీసుకురావచ్చని నీకు చెప్పింది ఎవరు?" వున్నట్లుండి అడిగాడు శిఖావంతుడు.

నెత్తురు లేనట్లు తెల్లగా పాలిపోయాయి ఆ మంత్రుల మొఖాలు. ఒకరి వంక ఒకరు చూసుకుంటూ, అందరికంటే వెనుకగా నిలుచునివున్న వ్యక్తిని అతనికి చూపించారు.

"నీ మాటల్ని నమ్మి అడవి పందుల వంటి ఆ ఆటవికుల ఆగడాలు భరించాను. వాళ్ల గూడేలకు అమితంగా ఆహార ధాన్యాలను, పశువుల్ని పంపించాను. జ్వలిత సామ్రాజ్యం నా హస్తగతం అయిన తర్వాత వాళ్ళందరికీ సంపంగి నగరం చుట్టూ వున్న అటవీ భూముల్ని అప్పగిస్తానని వాగ్దానాలు చేశాను. ఇంత చేసిన తర్వాత ఇప్పుడు జరుగుతున్నది ఏమిటి?" కోపంగా అడిగాడు శిఖావంతుడు.

"సంపంగి నగరం స్వాధీనం అయింది కదా ప్రభూ... తిరిగి ఆ నగరం మన చేయి దాటిపోవటానికి మన సేనాపతుల నిర్లక్ష్యమే కారణం గాని, ఆటవికుల తప్పు ఏదీ లేదు కదా..." చిన్నకంఠంతో జరిగింది ఇంకోసారి గుర్తు చేయబోయాడు ఆ మంత్రి.

"దగ్గర నిలబడి నువ్వు ఆ పరిస్థితిని ఎదుర్కోవాల్సింది పోయి నా దగ్గర వుండి నీతులు వల్లిస్తున్నావా?" అంటూ ఒరలో వున్న ఖడ్గాన్ని సర్రున బయటికిలాగి అతని తలమీద ఒక వేటు వేశాడు శిఖావంతుడు.

పుటుక్కున తెగి అవతల పడింది తల. ప్రాణం లేని శరీరం మొదలు నరికిన చెట్టుమాదిరి విరుచుకు పడిపోయింది.

ఒకేసారి కదలి ఆ శిబిరంలో నుంచి బయటికి పారిపోవాలన్న కోరిక మిగిలిన మంత్రులందరికీ కలిగింది. అడుగులు కదిపిన మరుక్షణం శిఖావంతుడి ఆగ్రహం మరింత అధికం అయిపోతుందన్న భయంతో ఎక్కడి వారక్కడే నిలుచుండిపోయారు.

"ఎలుగుబంట్లకు కాగడాల్ని చూపిస్తే అవి భయపడతాయని చీకట్లో తప్ప పగటి సమయంలో కాగడాల వెలుగు వాటిని భయపెట్టలేదని సాగరుడికి మొదట్లో తెలియలేదు. చీకట్లో యుద్ధం చేస్తే తప్ప మనల్ని జయించటం కష్టమని అతనికి ఎలా తెలిసింది? ఎవరు చెప్పారు?" భయంతో బిత్తరచూపులు చూస్తున్న మిగిలిన మంత్రుల్ని అడిగాడు కరుకు కంఠంతో శిఖావంతుడు.

"ప్రభూ... మన సైన్యంలో గాని, మాలోగాని నమ్మకద్రోహం చేసినవారు ఎవరూ లేరు. అసలు ఆ కాగడాల రహస్యం ఎవరికీ తెలియదు ఒక్క ఆ ఆటవికులకు తప్ప" ధైర్యం తెచ్చుకుని చెప్పాడు ఒక మంత్రి.

"అదే అడుగుతున్నాను. మనకికూడా తెలియని ఆ రహస్యం సాగరుడికి ఎలా తెలిసింది? మనల్ని మించిన తెలివి వున్నదా అతనికి?" మరింత తీవ్రంగా అడిగాడు శిఖావంతుడు.

"సాగరుడు కాదు ప్రభూ...సాగరుడు పెంచి పోషిస్తున్న ఒక అనాథ బాలకుడు చేసిన ఆలోచన అది. వాడికి సుబోధుడు తోడయినాడు" అన్నాడు ఆ మంత్రి.

"సుబోధుడా? ఎవరా సుబోధుడు?" ఆగ్రహం కాస్తా ఆశ్చర్యంగా మారిపోతుండగా అడిగాడు శిఖావంతుడు.

సంపంగి నగరం తమ చేయి జారిపోతున్నదని తెలియగానే ప్రాణాలు దక్కించుకుని పారిపోయి వచ్చిన తమ దళపతుల్లో కొంతమంది తెలియచేసిన విచిత్రమైన విశేషాలను వివరంగా అతనికి చెప్పటం మొదలుపెట్టాడు ఆ మంత్రి.

❖ ❖ ❖

వీర విహారం చేశాయి సాగరుల వారి యుద్ధ గజాలు. సగానికి సగం నాశనమైపోయింది శిఖావంతుడి అశ్వికదళం. మూడు వంతులు ముక్కలు చెక్కలైపోయారు రథికులు. అర్థయోజన దూరం వెనక్కి పరిగెత్తింది కాల్బలం.

"చాలు... ఇక చాలు... శిఖావంతుడి పీచం అణిగిపోయినట్లే. నీ ఏనుగు లన్నిటినీ వెనక్కితిప్పి మన రాజోద్యోగ వనంలో విశ్రాంతిగా నిలబెట్టు... తన రథం దిగి సాగరుల వారు అధివసించి వున్న పట్టపు టేనుగు దగ్గరికి వస్తూ సంతోషంగా అన్నాడు మహాబలి చక్రవర్తి.

కవచ శిరస్త్రాణాలు ధరించి ఆయన స్వయంగా యుద్ధభూమిలోకి రావటాన్ని చూసి జ్వలిత సైన్యాలు రెచ్చిపోయి యుద్ధం చేయటం వల్లనే ఈరోజు యుద్ధంలో తమది పైచేయి అయిందని తెలుసు సాగరుడికి.

"శిఖావంతుడు సామాన్యుడు కాదు ప్రభూ. వాడు ఓటమిని అంగీకరించి తన కిరీటాన్ని తమ పాదాల దగ్గర పెట్టేవరకూ యుద్ధం ముగిసిపోయిందని అనుకోకూడదు. వాడు కట్లపురుగు. మీమీద భల్లూక సైన్యాన్ని ప్రయోగించినట్లు ఇక్కడ కూడా ఇంకో కొత్త ఎత్తు ఏదో ఎత్తుతాడు" పట్టపు టేనుగు మీదినించి దిగి చక్రవర్తికి ప్రణామం చేస్తూ చెప్పాడు.

"ఏ ఎత్తు ఎత్తినా మనకు వచ్చే నష్టం ఏమీ లేదు. నువ్వు నీ ఏనుగులు ఇక్కడ వుండగా వాడు చేయగలిగింది ఏమీ లేదు" అతన్ని ఆలింగనం చేసుకుంటూ ఆనందంగా అన్నాడు చక్రవర్తి.

"జయము జయము సాగరుల వారికి, సంపంగి నగర గజదళానికి సంపూర్ణ విజయము..." పెద్దపెట్టున జయజయ ధ్వానాలు చేశారు జ్వలిత సైనికులు.

"గాయాలపాలయిన వారికి వైద్య సహాయం వెంటనే అందించాలి. మృతుల శరీరాల్ని సగౌరవంగా నగరంలోకి తీసుకుపోయి బంధువులకు అప్పగించాలి. అందరికీ ఆహార పానీయాలు అందించాలి. తిరిగి శిఖావంతుడు తనంతట తానుగా యుద్ధం మొదలుపెట్టేంతవరకూ అందరికీ విశ్రాంతి" గంభీరమైన కంఠంతో ప్రకటించాడు చక్రవర్తి.

సైనికులకు సంబంధించినంత వరకూ ఆయన ఆజ్ఞల్ని తు.చ. తప్పకుండా పాటించదలిచాడు గుణధాముడు. సాగరుల వారి ఏనుగుల్ని రాజోద్యాన వనంలోకి పంపించమనే ఆజ్ఞకు మాత్రం అతను అంగీకరించలేదు.

"అపురూపమైన వృక్షాలున్నాయి. అత్యంత అరుదైన పూ పొదలున్నాయి. ఆకలి మీదున్న ఈ జీవాలు వాటన్నిటినీ నాశనం చేసేస్తాయి" అంటూ తన అభ్యంతరాన్ని వెలువరించబోయాడు.

గుణధాముడి మాటలకు ఏనాడూ కోపం తెచ్చుకోని చక్రవర్తి ఇప్పుడు ఒక్కసారిగా కనుబొమలు ముడివేసి తీవ్రంగా చూశాడు అసహనంగా.

"ఆ జీవాలే గనుక వచ్చి వుండకపోతే మనకి ఈ రాజ్యము, ఈ రాజ్యంలోని ఆ ఉద్యానవనము ఏదీ దక్కేది కాదు. వృక్షాలు నాశనం అయినా, పూపొదలు

పాడయిపోయినా సరే ఈ సాహస జీవాలకు సరైన విశ్రాంతి స్థలం మన ఉద్యానవనమే. వెంటనే తీసుకుపోండి అక్కడికి” ఖంగుమంటున్న కంఠంతో ఆజ్ఞ ఇచ్చాడు.

రాజ్యం అంటే ఎలా వుండాలో, రాజ్యపరిపాలన ఏ పద్ధతిలో కొనసాగాలో మొదలయిన అంశాల మీద పూర్తి అవగాహన కలిగినటువంటి వాడు మంత్రి గుణధాముడు.

“క్షణికమైన అభిమానాలకు, ఆవేశాలకు లోబడి నిర్ణయాలు తీసుకో కూడదు. రాజోద్యాన వనం రాజుల సొత్తు కాదు. రాజ్యం సొత్తు. ఒక్కసారి మీరు మీ నిర్ణయాన్ని పునరాలోచించుకోండి” అన్నాడు నెమ్మదిగా.

అతను అంత గట్టిగా తన మాటల్ని సమర్థించుకునేసరికి, వెంటనే వచ్చింది చక్రవర్తి మహాబలుడికి ఒక పెద్ద అనుమానం.

“సాగరుడికి లేనిపోని వాగ్దానాలు చేసేస్తానని భయపడుతున్నావా?” అతనికి మాత్రమే వినిపించేటట్లు అడిగాడు.

“అవును ప్రభూ... సంపంగి నగర వారసత్వం గురించి లోతుగా అధ్యయనం చేయందే తమరు ఎటువంటి నిర్ణయాలు తీసుకోకూడదు. ఇప్పుడున్న పరిస్థితిలో మీరు ఎవరు ఏమడిగినా కాదనలేరని మాకు అనిపిస్తోంది” అన్నాడు తనుకూడా రహస్యంగానే.

“నీ మాటల్ని కాదని అననుగాని, సాగరుడు ఆ విషయాన్ని గురించి ప్రస్తావిస్తే నీతో మాట్లాడమని చెపుతాను. సరేనా?” అన్నాడు చక్రవర్తి.

తృప్తిగా తలవూపి సాగరుల వారికేసి తిరిగాడు గుణధాముడు. “వృక్షాలకు హాని జరగకుండా పూపొదలు పాడయిపోకుండా ఈ ఏనుగులన్నిటికీ ఆహారం అందించే ఏర్పాట్లు చేస్తాము... మీరు కూడా ఒక కంట కనిపెట్టుకుని వుండాలి” అన్నాడు.

మహామంత్రి గుణధాముడు చెప్పిన మాటల్లో ఇసుమంత కూడా అసత్యం లేదు. రాజోద్యానవనంలో పచ్చ పచ్చగా కనిపిస్తున్న వృక్షాలను, సుగంధ పరిమళాలను వెదజల్లే పువ్వులతో నిండివున్న పొదల్ని చూసిన వెంటనే చెవులు గింగిర్లెత్తేలా ఘీంకారాలు చేస్తూ వాటిమీదికి వెళ్లబోయాయి సాగరుల వారి ఏనుగులన్నీ.

కొమ్ము బూరాని ఊదటంతో ఆగలేదు సాగరుల వారు. పొడవాటి బరిశె నొకదాన్ని పట్టుకుని ధ్వజస్తంభం మాదిరి వాటి మార్గానికి అడ్డుగా నిలుచున్నాడు.

అవకాశం ఇవ్వనే ఇచ్చారు కదా అని విశృంఖలంగా సంచరించటం నేరం. నిలిచిపోండి. ఎవరో ఒకరు మీకు ఆహారం తీసుకువచ్చి ఇచ్చేవరకూ కదలకుండా నిలబడి వుండండి" ఖంగుమంటున్న కంఠంతో ఆజ్ఞ ఇచ్చాడు.

ఎక్కడివక్కడ ఆగిపోయాయి ఆ మహాగజాలు. విశ్రాంతిగా నిలబడి తమకు ఆహారం తీసుకువచ్చే వారికోసం ఎదురుచూడటం మొదలుపెట్టాయి.

❖ ❖ ❖

"సుబోధుడు సౌగంధీయుల యువరాణిని ప్రేమించి, ఎవరికీ తెలియకుండా ఎక్కడికో తీసుకుపోయినవాడు. అవును కదూ?" తన మంత్రుల్లో ఒకతను చెపుతున్న మాటల్ని ఆసక్తిగా వింటూ అన్నాడు శిఖావంతుడు.

"అవును ప్రభూ... అతగాడే. సంపంగి అడవుల్లో అతి రహస్యంగా తల దాచుకున్నాడు. అతన్ని వెతికి పట్టుకోవడానికి ఆ సౌగంధ పాలకులు ఎన్నెన్నో ప్రయత్నాలు చేశారు గాని ఫలితం లేకపోయింది" అన్నాడు ఆ మంత్రి.

"రహస్యంగా తలదాచుకున్న సుబోధుడికి ఈ మాయలమారి ఏనుగులకు యజమాని అయినటువంటి సాగరుడికి ఎలా జత కుదిరింది?" అనుమానంగా చూస్తూ అడిగాడు శిఖావంతుడు.

"అది ఇప్పటి విషయంకాదు ప్రభూ... సుభోదుడు గజయుద్ధంలో నేర్పరి. గతంలో మనం జ్వలిత సామ్రాజ్యం మీద యుద్ధం చేసినప్పుడు ఆ అడవుల్లో స్థావరాన్ని ఏర్పాటు చేసుకున్నాడు సాగరుడు. ఆ సమయంలో అతనికి ఆ సుబోధుడు తారసపడ్డాడు. వారి మధ్య స్నేహం పెరిగింది. అతనికి సుబోధుడు గజ యుద్ధంలోని మెలకువల్ని నేర్పాడు. సంపంగి గజదళం అప్పటినుంచే అరివీరభయంకరం అయిందిట..." అన్నాడు ఆ మంత్రి.

"మరి ఆ సుబోధుడితో పాటుగా ఇప్పుడు సాగరుడికి ఆలోచన చెప్పటంలో సహాయపడిన బాలకుడు ఎవరు?"నొసలు ముడివేస్తూ అడిగాడు శిఖావంతుడు.

సంపంగి నగరంలో సాగరుడు అనాధ బాలబాలికల్ని చేరదీసి విద్యా బుద్ధుల్ని చెప్పించటానికి చేసిన ఏర్పాట్లను వర్ణించాడు ఆ మంత్రి. శివుడు ఆ బాలబాలికల్లో ఒకడని చెప్పాడు.

"తల్లి ఎవరో తండ్రి ఎవరో తెలియని ఒక పేద బీద అనాధకు మనల్ని పరాజితుల్ని చేయగల మేథస్సు వుండటం ఆశ్చర్యాలలో కెల్లా మహా ఆశ్చర్యం" కనులు పెద్దవి చేస్తూ నిజంగానే ఆశ్చర్యపడ్డాడు శిఖావంతుడు.

"వాడి మేధస్సు నిరుపమానమట ప్రభూ. గజ యుద్ధంలో సాగరుల వారు వాడిముందు తీసికట్టేనట..." సంపంగి నగరం తిరిగి సాగరుడి ఆధీనం అవటంలో వాడి పాత్రే అధికమట" చెప్పాడు ఆ మంత్రి.

ఆశ్చర్యం కాస్తా ఆగ్రహంగా మారుతుండగా చివాలున ఆసనం మీదినించి లేచాడు శిఖావంతుడు.

"మన మార్గానికి అవరోధంగా మారగల ఒక బుడతడు సంపంగి నగరంలో పెరిగి పెద్దవాడవుతున్నాడని ముందుగానే తెలుసుకోలేకపోయిన మీ అందరికీ శిరచ్ఛేదనం జరిగి తీరవలసిందే" అంటూ శిబిర ద్వారం కేసి చూసి "ఎవరక్కడ?" అని గర్జించాడు.

వెంటనే లోపలికి వచ్చారు ఇద్దరు సైనికులు.

"అవసరమైనప్పుడు అవసరమైన సూచనలు ఇవ్వలేని ఈ మందబుద్ధి లందర్నీ తీసుకుపోయి సైనికులందరూ చూస్తూ వుండగా తలలు తరిగి..." అంటూ ఇంకా ఏవేవో ఆజ్ఞలు జారీ చేయబోయి మధ్యలో వున్నట్లుండి మాటల్ని ఆపాడు శిఖావంతుడు.

దుమ్ము ధూళి నిండి వున్న దుస్తులతో, అదేపనిగా అతివేగంతో ప్రయాణం చేయటం వల్ల ఏర్పడిన అలసటతో అడుగులు అతి బరువుగా వేస్తూ ఒక గూఢచారి లోపలికి రావటమే అందుకు కారణం.

"అత్యంత విలువైన సమాచారాన్ని తీసుకురావటం చేత తమరి అనుమతి కోసం ఆగలేదు, నన్ను క్షమించండి ప్రభూ" లోపలికి రాగానే తలవంచి అభివాదం చేస్తూ చెప్పాడతను.

"నువ్వు తీసుకువచ్చిన సమాచారం నిజంగానే విలువైనదై వుండకపోతే నీకు బహుమానం మరణమే" ఆసనం మీద కూర్చుంటూ కోరగా చెప్పాడు శిఖావంతుడు.

"సంపంగి నగరంలో మన అపజయానికి కారకుడైన అనాథ బాలకుడిని తమ వారసుడిగా ప్రకటించింది సాగరుల వారి సతీమణి చారులతాదేవి" చెప్పాడు ఆ గూఢచారి.

తన ఆగ్రహానికి కారణమైన మంత్రి వంక చూస్తూ "సరిగ్గా అదేమాట కాకపోయినా ఇంచుమించు అటువంటిదానిని గురించే మాట్లాడుకుంటు న్నాము మేము. ఆ బాలకుడు సౌగంధీయుల యువరాణిని ప్రేమించి పెళ్లాడిన సుబోధుడి సహాయంతో..." అంటూ ఆ మంత్రి తనకు చెప్పిన మాటల్ని మరోసారి వల్లించబోయాడు శిఖావంతుడు.

"ప్రభూ... అతను ఎవరో కాదు. సౌగంధి దేశపు యువరాణికి సుబోధుడికి పుట్టిన ఒక ఆడబిడ్డకు పుత్రుడు. ఆ బిడ్డను చేపట్టింది మరెవ్వరో కాదు. సాగరులవారే..." గబగబా చెప్పాడు గూఢచారి.

ఆసనం వెనక్కి చేరగిలబడి తీరికగా కూర్చోబోతున్న శిఖావంతుడు వెన్నుమీద ఎవరో బలంగా చరిచినట్లు అయి గబుక్కున లేచి నిలుచున్నాడు.

"అవును ప్రభూ...శివుడు అనాథ కాదు. అభిమానంతో వారసుడిగా గుర్తింప బడిన వాడు కాదు. అతను రక్తసంబంధం ద్వారా సాగరుల వారికి నిజమైన వారసుడు. అందుకే అతనికి అన్ని తెలివితేటలు" మళ్ళీ చెప్పాడు గూఢచారి.

"అడవిలో నుంచి చారులతాదేవి వాసుదేవుడితో కలిసి ఆ సుబోధుడిని సంపంగి నగరానికి తీసుకువచ్చింది. నగరంలోని ప్రతివీధికి టముకరులను పంపి ఈ విషయాన్ని చాటింపు వేయించింది. జ్వలిత సామ్రాజ్యంలో ఎన్ని నగరాలున్నాయో వాటన్నింటికి విషయం అర్థం అయ్యేలా లేఖలు వ్రాసి భటుల్ని పంపిస్తున్నారు" అనికూడా చెప్పాడు సవివరంగా.

అంతకు కొన్ని క్షణాలకు ముందే మంత్రులందరికీ మరణశిక్షను విధించిన సంగతిని మరచిపోయినట్లు వారందరి వంకా అయోమయంగా చూశాడు శిఖావంతుడు.

"ఈ వార్త ఇంకా సాగరుల వారి దాకా వచ్చివుండదు ప్రభూ... వచ్చివుంటే పోరు మరింత ఘోరంగా, ఉధృతంగా జరిగివుండేది. సంతోషం హెచ్చయి నప్పుడు సామర్థ్యం కూడా పెరిగి పెద్దదైపోతుంది" అన్నాడు ఒక మంత్రి. తనుకూడా తమకు విధింపబడబోతున్న శిక్షను గురించి మర్చిపోయినట్లు.

"సాగరుడికి సంతోషాన్ని కలిగించే వార్త మనకి కోపాన్ని రప్పించాలి. లేదా బాధను రగిలించాలి. అటువంటి అనుభూతులు నాకు కలగటం లేదు. ఈ వార్త సాగరుడిలో ఏ విధమైన స్పందనను కలిగిస్తుందో తెలియదు కాని, నాకు మాత్రం ఉత్సాహాన్ని రేకెత్తిస్తోంది." వున్నట్లుండి అన్నాడు శిఖావంతుడు.

తెల్లబోయి చూశారు అందరూ. తాము వింటున్నది యదార్థమో కాదో అన్నట్లు వెలవెలా పోయాయి వారి మొఖాలన్నీ.

"సుబోధుడి గురించి కొన్ని సంగతులు నాకు తెలుసు. గతంలో అతను సౌగంధ దేశపు యువరాణిని పెళ్ళాడి పారిపోయిన సమయంలో అతను గనుక మన రాజ్యంలోకి వచ్చివుంటే తమకు పట్టివ్వమని ఆ పాలకులు నా తండ్రిగారికి వినతి పత్రాలు కూడా పంపి వున్నారు" సాలోచనగా చెప్పుకుంటూ పోయాడు శిఖావంతుడు.

"అతనంటే ఆ కక్ష ఆ పగ ఇంకా ఆ పాలకుల మనస్సుల్లో రగులుతూనే వుండి వుంటుంది" అంటూ అప్పటికప్పుడు ఒక నిర్ణయానికి వచ్చినట్లు ఉత్సాహంగా ఆసనంమీద కూర్చున్నాడు.

"అనుకోని విధంగా ఉత్పన్నమైన ఈ పరిస్థితిని మనం వెంటనే మనకి అనుకూలంగా మలుచుకోవాలి" అంటూ మంత్రులకేసి చూశాడు.

"వెంటనే సౌగంధీయుల దగ్గరికి మీలో కొందరు వెళ్ళి సుబోధుడిని గురించి, అతని భార్యకు పుట్టిన బిడ్డను గురించి ఆ బిడ్డకు సాగరుడికి పుట్టిన ఆ శివుడి గురించి చెప్పి వారి ఆవేశాలను రెచ్చగొట్టండి. వాళ్లు పగ తీర్చుకునే ఆలోచన చేసేటట్టు మాట్లాడండి. మనం వారికి సహాయం చేయగలమని చెప్పండి."

"యుద్ధాలంటే అసహ్యించుకునే ఆ దేశీయులు నిజంగానే యుద్ధం చేయదల్చుకుంటే అదిచాలా భయంకరంగా వుంటుంది. వారికి మనకి మధ్యనపడి జ్వలిత సామ్రాజ్యం ముక్కలు చెక్కలైపోతుంది. విజయం మనదే అవుతుంది. సాగరుడి గజబలమే కాదు... ఆ సర్వేశ్వరుడు స్వయంగా వచ్చినా మనల్ని అడ్డుకోలేడు" ఉత్సాహం ఉరకలెత్తుతుండగా ఒక్కొక్క మాటను వత్తివత్తి పలుకుతూ చెప్పాడు.

అతని ఆనందం ఆ మంత్రులకు కూడా ఆవరించుకున్నది. అప్పటికప్పుడు శిబిరంలో నుంచి బయటికి పరిగెత్తారు వారిలో ముగ్గురు. వేగంగా ప్రయాణం చేయగల అశ్వాలను అధిరోహించి సౌగంధ దేశం వైపు పరిగెత్తించారు.

❖ ❖ ❖

మహాబలి చక్రవర్తి సేవకులు తీసుకువచ్చిన పచ్చిగడ్డి మోపుల్ని స్వయంగా అందుకుని తనే ప్రతి ఏనుగు ముందు పెట్టాడు సాగరుల వారు. అంతఃపుర వంటశాల నుంచి పెద్ద పెద్ద గంపలతో తీసుకురాబడిన మధుర పదార్థాలను, మోదకాలను తనే వాటి తొండాలకు అందించాడు.

"మీరు వెళ్లి విశ్రాంతి తీసుకోండి ప్రభూ. చక్రవర్తి మీకోసమే ఎదురు చూస్తున్నారు" వినయంగా చెప్పారు సేవకులు అతనికి.

అయినా సరే తను చేయదలుచుకున్నదేమిటో చేసేశాడు సాగరుల వారు. ఏనుగులన్నిటికీ ఆహారాన్ని అందించిన తర్వాత, ఉద్యానవనంలోనే వున్న కొలనులో స్నానం చేసి, యుద్ధ సమయంలో మలినపడిన దుస్తుల్ని మార్చుకున్నాడు. ముందు పదిమంది వెనుక ఇరువదిమంది సైనికులు కాపుగా అడుగులు వేస్తుండగా రాజభవనం వైపు బయలుదేరాడు.

రాజవీధికి అటూ యిటూ వరుసల్లో నిలువబడి వున్నారు రాజధాని పౌరులు... దోసిళ్ళతో తాము తీసుకువచ్చిన పుష్పాలను అతనిమీదికి విసిరారు. "సాగరుల వారికి జయము జయము... అఖండ జ్వలిత సామ్రాజ్య రక్షకునికి జయము జయము... ప్రచండ పరాక్రమవంతుడికి మహా విజయము" ఆకాశం బ్రద్దలైపోయేలా నగరం చుట్టూ వున్న కోటగోడలు కంపించేలా జయజయ ధ్వానాలు చేశారు.

అహంకరించలేదు సాగరులవారు. అతిశయంగా కూడా చూడలేదు.

"జ్వలిత సామ్రాజ్యంలో నేనుకూడా మీ మాదిరి ఒక పౌరుడినే. యుద్ధం చేయటం నాకు చేతనయిన విద్య. ఆ విద్యనే ఉపయోగించి నా మాతృభూమికి సేవ చేసుకున్నాను. అందుకు మీరు అతిగా నన్ను పొగడవలసిన అవసరం లేదు" వినయంగా నమస్కారం చేస్తూ చెప్పాడు జనంలో నుంచి పూలదండలు తెచ్చి తన మెడలో వేయబోయిన పుర ప్రముఖులకు.

"వినయం మీకు మరింత పేరు ప్రతిష్టల్ని తెచ్చిపెడుతుంది ప్రభూ... అవునన్నా కాదన్నా మీరు మాకు దేవుడితో సమానం" దోసిళ్ళు ఒగ్గుతూ చెప్పారతనికి ఆ ప్రముఖులు.

రాజభవన ముఖద్వారం దగ్గరే నిలుచుని ఎదురు చూస్తున్నాడు మహాబలి చక్రవర్తి. గబగబా ముందుకు వచ్చి గాఢంగా కౌగలించుకున్నాడు.

"ముందుగా మనం భోజనం చేద్దాము... మిగిలిన మాటలు తర్వాత మాట్లాడుకుందాము" అంటూ అతని చేతిని పట్టుకుని ద్వారం వైపు రెండే రెండు అడుగులు వేశాడు.

వెనుకనుంచి సముద్రఘోష మాదిరి వినవస్తూనే వున్నాయి నగర ప్రజలు చేస్తున్న జయజయ ధ్వానాలు. వారిని ఆవరించుకుని వున్న ఆనందం, ఆవేశం చక్రవర్తిని కూడా ఆక్రమించాయి.

మూడో అడుగు వేయకముందే ఆగిపోయాడాయన. "నీ వంటి వాడు మా చెప్పుచేతల్లో సామంతుడిగా వుండకూడదు. ఈ క్షణమే సంపంగి నగరాన్ని స్వతంత్ర నగరంగా ప్రకటిస్తున్నాము... నువ్వు..." అంటూ ఎవరూ ఎదురుచూడని వరాన్ని ఇచ్చివేయబోయాడు.

"ఆగండి... ఒక్కక్షణం ఆగండి ప్రభూ... ఆనంద సమయంలోను, ఆవేశపడే పరిస్థితుల్లో విధాన నిర్ణయాలు తీసుకోకుండా, మీరు దయచేసి ఆగిపోండి" ఎక్కడినించో పరుగు పరుగున వస్తూ పెద్దగా అరిచి, ఆయన్ని అడ్డుకున్నాడు మంత్రి గుణధాముడు.

"నేను చక్రవర్తిని. నా ఇష్టం వచ్చిన నిర్ణయం ఇష్టం వచ్చినప్పుడే తీసుకుంటాను. కాదనే అధికారం ఎవరికి వున్నదని మన రాచరిక నియమాలు వక్కాణిస్తున్నాయి?" కోపంగా అడిగాడు మహాబలుడు.

"సభ ఏర్పాటు చెయ్యాలి. మంత్రులందరినీ సమావేశపరచాలి. పుర ప్రముఖుల్ని రాజ్యంలోని మండలాధిపతులు అందరినీ ఆహ్వానించాలి. వారందరి అభిప్రాయాలను ఆలకించాలి. అందరి సంపూర్ణ సహకారంతో నిర్ణయాలు తీసుకోవాలి" చక్రవర్తి కోపాన్ని గుర్తించనట్లు మృదువుగా చెప్పాడు గుణధాముడు.

"మాకు అంటూ ప్రత్యేకించి ఏ విధమైన అధికారాలు లేవా?" రాచరిక నియమాలు తెలిసినా, తెలియనట్లే విసురుగా అడిగాడు చక్రవర్తి.

అంతకుముందు అదే అంశం మీద తమకు జరిగిన సంభాషణను మరోసారి మళ్ళీ మొదలుపెట్టటం ఇష్టం లేకపోయింది గుణధాముడికి.

"శిఖావంతుడి దండయాత్ర మొదలు కాబోతున్నదని తెలిసిన దగ్గిర్నించీ సరిగ్గా ఆహారం తీసుకోనట్లు చిక్కిపోయి వున్నారు సాగరుల వారు.

దండయాత్రను సమర్థవంతంగా ఎదుర్కోగలుగుతున్నాడు కాబట్టి ఇప్పుడు ఆందోళన పడకుండా ఆరగించవచ్చు. ముందు మీరు భోజనశాలకు వెళ్ళండి ప్రభూ" అన్నాడు నెమ్మదిగా.

భవన ద్వారం దగ్గర్నించి మరొక్క అడుగు కూడా అవతలికి వెయ్యలేదు మహాబలి చక్రవర్తి. "మాటలు మార్చవద్దు గుణధామా... నా బిడ్డ జ్వాల మాకు పంచప్రాణాలైతే ఈ సాగరుడు ఆరోప్రాణం. అతనికి సంబంధించిన ఏ మాటను నేను వెనక్కి నెట్టలేను" అన్నాడు దృఢస్వరంతో.

నగర ప్రజలు చేస్తున్న జయ జయ ధ్వానాలు చక్రవర్తిని పూర్తిగా వివశుడిని చేసివేశాయని తెలుసు గుణధాముడికి. రాచరిక నియమాలను ఉల్లంఘించే విధంగా ఆయన మైమరిచిపోతాడని మాత్రం అనుకోలేదు.

"భోజనశాలకు వెళ్లడం ఇష్టం లేకపోతే దయచేసి సభా భవనానికి విజయం చేయండి. సేవకులు ఆహారాన్ని అక్కడికే తీసుకువస్తారు. ఈ లోపల వారు సాగరుల వారితో కలిసి ఒక ముఖ్యమైన సమాచారాన్ని తెలుసుకోవచ్చును" అన్నాడు చిరునవ్వుతో.

అతను ఏ మాట మాట్లాడినా వెంటనే విభేదించేందుకు సిద్ధంగా వున్న మహాబలుడి ముఖంలో వెంటనే ప్రత్యక్షం అయింది అమితమైన ఆశ్చర్యం.

"ఏమిటది?" ఆత్రుతగా అడిగాడాయన.

చెప్పలేదు గుణధాముడు. చేతితో సభా భవనం వైపు చూపించాడు. నొసలు ముడివేసి తీవ్రంగా చూస్తూ సాగరుల వారి చేయి పట్టుకుని అటుకేసి నడిచాడు చక్రవర్తి.

భవన ద్వారం దగ్గర వున్న భటులిద్దరినీ వంటశాలకు వెళ్ళమని సైగచేసి ఆయన్ను అనుసరించాడు గుణధాముడు.

❖ ❖ ❖

పెద్ద పెద్ద బంగారు పళ్లెరాలలో భోజనాన్ని వడ్డించి, సింహాసనం మీద వున్న చక్రవర్తికి, పక్కనే ఒక ఆసనం మీద కూర్చున్న సాగరుల వారికి అందించాడు వంటశాలలో పనిచేసే సేవకుడు.

తన మాటలు చక్రవర్తిలో క్షణక్షణానికి కుతూహలాన్ని అధికం చేసేస్తున్నాయని తెలుసు గుణధాముడికి. అందుకే సమీపంలో లేకుండా దూరంగా కొందరు భటులతో మాట్లాడుతున్నట్టు నటించాడు.

"మా భోజనం అయిపోయింది. ఇప్పుడు చెప్పండి విశేషం ఏమిటో" పావు ఘడియ తరువాత అతనికి సైగ చేస్తూ అన్నాడు చక్రవర్తి.

సాగరుల వారు కూడా తృప్తిగా ఆరగించినట్లు స్పష్టమైన తర్వాత దగ్గరికి వచ్చాడు గుణధాముడు.

"నేను ఇప్పుడు బయట పెట్టబోతున్న సమాచారం చెవుల పడగానే ముందు సాగరుల వారికి ఆకలి అణగిపోతుంది. ఆ తరువాత ప్రభువులకుకూడా మందగించి వేస్తుంది. అందుకే ముందుగా ఏమీ మాట్లాడలేదు. అందుకు నన్ను క్షమించాలి" అంటూ తన దట్టీలో నుంచి ఒక లేఖను బయటికి తీశాడు.

అందమైన వస్త్రం మీద కరక్కాయ రసంతో నెమలి ఈక మొనను ముంచి, రమణీయంగా వ్రాసిన అక్షరాలు అతిస్పష్టంగా అగుపిస్తున్నాయి.

"శ్రీశ్రీశ్రీ మహాబలి చక్రవర్తులకు సంపంగి నగర పాలకులైన సాగరుల వారి అర్ధాంగి లక్ష్మి చారులతాదేవి వ్రాసిన సంతోషపూర్వక శుభ లేఖార్థములు..." గంభీరమైన కంఠంతో చదవటం మొదలుపెట్టిన గుణధాముడి వంక సుప్రసన్నంగా చూశాడు చక్రవర్తి. సాగరుల వారికైతే ఆసనంమీద కూర్చోవటం అసాధ్యమైపోయింది.

"త్వరగా... త్వరగా చదవండి" ముందుకు జరిగి కూర్చుంటూ తొందరపెట్టాడు.

"సంతానహీనులమై మోడుబారిన వృక్షాల మాదిరిగా బ్రతుకు వెళ్ళదీయవలసిన మా జీవితాలలో ఒక కొత్తవెలుగు ప్రవేశించింది. మేము పెంచి పోషిస్తున్న అనాథ బాలబాలికల్లో శివుడు అనే బాలకుడిని నేను మా ప్రభువుల వారు అందరికంటే అధికంగా అభిమానించి అతడిని మాకు వారసుడిగా నిర్ణయించుకున్న సంగతి ఈసరికి మీకు తెలిసే వుంటుంది."

గుణధాముడి మొఖంమీదినుంచి చూపుల్ని చటుక్కున చక్రవర్తివైపు మరల్చాడు సాగరులవారు.

చక్రవర్తి అనుమతించిన తర్వాత వెలుపలికి చెప్పవలసిన మాటను ముందుగానే బయటపెడుతున్నది తన సతీమణి. మర్యాద కాదుగదా... చక్రవర్తి మరోవిధంగా భావిస్తే...

అతని ఆలోచనలు పూర్తి కాలేదు. “ఆ సంగతి మాకు తెలుసు. ఇదివరకు నా సోదరి వ్రాసిన లేఖలను చూసినప్పుడే ఇటువంటిదేదో వినవలసి వస్తుందని మాకు అనిపించింది. తర్వాత చదవండి” అంటూ గుణధాముడికి చెప్పాడు చక్రవర్తి నిర్వికారంగా.

“మాకు శివుడు నిజమైన వారసుడే అని ఇంతకుముందే తెలియవచ్చి, సంతోషాన్ని మీతో పంచుకోవాలని ఈ శుభలేఖను వ్రాయటం జరిగింది” చదివాడు గుణధాముడు.

“నిజమైన వారసుడా? అంటే అర్థం ఏమిటి?” అయోమయంగా సాగరుల వారికేసి చూస్తూ అడిగాడు చక్రవర్తి.

చారులతాదేవి జ్వాలతోను, వాసుదేవుడితోను కలిసి అడవిలోనే వుండిపోయిన సుబోధుడి దగ్గరికి వెళ్ళి వచ్చిన సంగతి సాగరుల వారికి తెలియదు. మరింత అయోమయంగా చూశాడు గుణధాముడి వంక.

కావాలనే గుణధాముడు ఆ లేఖను ఆపి ఆపి చదువుతున్నట్టు వెంటనే తెలిసి వచ్చింది. “మహా మంత్రుల వారూ... వేళాకోళాలు ఇకచాలు. విషయం ఏమిటో పూర్తిగా చెప్పండి” కనుబొమలు ముడివేస్తూ ఖచ్చితమైన కంఠంతో అడిగాడు.

భయపడలేదు గుణధాముడు. ముఖమంతా నోరు చేసుకుని చాలా అందంగా నవ్వాడు.

“శివుడు వేరెవరో కాదు... మీ కొడుకే... మీకు సుబోధుడి కూతురికి పుట్టినవాడు. మీ వారసుడు. అడవిలోని సుబోధుడి నోటివెంట ఈ రహస్యాన్ని చారులతాదేవి బయటకి రప్పించింది. సుబోధుడిని నగరానికి తీసుకువచ్చి ఈ లేఖను మనకి పంపించింది” అని చెప్పాడు.

ముందుకు జరిగి కూర్చున్న సాగరుల వారు, ఆసనం వెనక్కి వాలిపోయి, కళ్ళను గట్టిగా మూసుకున్నాడు. ఆయనకు తెలియకుండానే కనుచివరల నుంచి బుగ్గలమీదికి వచ్చేశాయి వెచ్చటి రెండు కన్నీటి బొట్లు.

సింహాసనం మీదినించి ఛివాలున లేచి, గుణధాముడి దగ్గిర్నించి ఆ లేఖను స్వయంగా తీసుకుని ఆసాంతం రెండుమార్లు చదివిన చక్రవర్తి కళ్ళుకూడా తడి అయిపోయాయి.

"నగరంలో పండుగ ప్రకటించండి. అలయాలన్నిటిలోను విశేష పూజలు ప్రారంభింపచేయండి. అన్నదానాలు, వస్త్రదానాలు అన్ని వెంటనే మొదలు పెట్టండి. మన సైనికులందరికీ జీతభత్యాలు రెట్టింపు చేయండి" విపరీతమైన సంతోషంతో స్వల్పంగా కంపిస్తుండగా ఆజ్ఞలు ఇచ్చాడాయన.

"ప్రభూ... మీరు చెప్పినవన్నీ అక్షరాలా అమలుపర్చటం జరుగుతుంది. కాని ఇప్పటికిప్పుడు కాదు. కొంచెం నిదానంగా ఆలకించండి" అంటూ తన దట్టీలో నుంచి మరో లేఖను బయటికి తీశాడు గుణధాముడు.

"సంపంగి నుంచే మన వాసుదేవుడు వ్రాసిన లేఖ ఇది. ఈ లేఖను అతను మనకి పంపించినట్లు చారులతాదేవికి తెలియదు" అంటూ చక్రవర్తికేసి చూశాడు.

"మీరే చదవండి" అనబోయి మళ్ళీ అతను ముక్కలు ముక్కలుగా చదివి తమను ఇబ్బంది పెడతాడన్న అనుమానంతో విషయం ఏమిటో చెప్పండి" అని అన్నాడు.

"శివుడు సుబోధుడికి మనవడనీ, సౌగంధ దేశ పాలకుల్లో వారసత్వానికి అర్హుడైన ఒకే ఒక మగవాడని వాసుదేవుడు చెపుతున్నాడు. ఈ విషయం తెలిస్తే వాళ్ళు ఏ విధంగా స్పందిస్తారో ఊహించలేమని కూడా అన్నాడు" క్లుప్తంగా చెప్పాడు గుణధాముడు.

"దీనికి ఇంతగా ఆలోచన దేనికి? ఆ విషయాన్ని రహస్యంగానే వుంచేద్దాం... శివుడు మన సాగరుడి కొడుకని తేలటం ఒక్కటే మనకి కావల్సిన అంశం" చాలా తేలికగా అన్నాడు చక్రవర్తి.

చిన్నగా నవ్వి తల అడ్డం తిప్పాడు గుణధాముడు. "అది మీరు అనుకుంటున్నట్టు ఏమంత సులభమైన పని కాదు ప్రభూ" అన్నాడు.

"ఎందుకు కాదు?" ఎదురు ప్రశ్నవేశాడు చక్రవర్తి.

"ఎందుకంటే వాసుదేవుడు వారించినా వినిపించుకోకుండా చారులతాదేవి శివుడి జన్మ వృత్తాంతాన్ని మన రాజ్యంలోని మండలాలలోనేకాదు, సౌగంధ పాలకులకు కూడా వివరంగా తెలిసేటట్లు శుభలేఖలు పంపించిందిట..." చెప్పాడు గుణధాముడు.

ఏదో మాట్లాడటానికి నోటిని తెరిచాడు చక్రవర్తి మహాబలుడు. మాట మాత్రం బయటికి రాలేదు.

"సాగరుల వారు ఏమీ మాట్లాడటం లేదు. ఈ వ్యవహారంలో వారి అభిప్రాయం ఏమిటో!" బొమ్మలా కూర్చుండిపోయిన సాగరుడి కేసి చూస్తూ అన్నాడు గుణధాముడు.

నిద్రలో నుంచి ఉలిక్కిపడి లేచినట్టు ఒక్కసారిగా కనులు తెరిచాడు సాగరుల వారు. "ప్రభూ...యుద్ధం వెంటనే ప్రారంభిద్దాం. శిఖావంతుడిని వెనక్కి తరిమి నేనువెంటనే సంపంగికి వెళ్ళిపోవాలి" ఆసనం మీదినించి లేచి నిలబడుతూ అన్నాడు.

"అంత అవసరం దేనికి? ఎందుకు ఆత్రుత?" ఆశ్చర్యంగా అడిగాడు మహాబలి చక్రవర్తి.

"సౌగంధీయులు సుబోధుడి మీది పగను నా మీద నా బిడ్డడి మీదా తీర్చుకునే ప్రయత్నం చేస్తారు" అన్నాడు సాగరులవారు.

"మీరు అనవసరంగా భయపడుతున్నారు. ఆ దేశీయులకి యుద్ధాలంటే ఇష్టం వుండదు. అందులోను సుబోధుడి సంగతి ఇప్పటిదికాదు. నా అభిప్రాయం ఏమిటంటే వాళ్ళు పూర్తిగా మర్చిపోయి వుంటారు" అన్నాడు గుణధాముడు.

"వాళ్ళు పగల్ని గురించి ఆలోచించకపోతే వారసత్వాల గురించి ఆలోచిస్తారు. వాళ్ల వంశంలో ప్రస్తుతం శివుడు ఒక్కడే మగవాడని అంటున్నారు కదా! నేను దగ్గర లేని సమయంలో వాళ్ళు వచ్చి బలవంతంగా వాడిని తీసుకుపోతే?" అడిగాడు సాగరులవారు.

ఇప్పటివరకూ ఎటువంటి అనుమానాల్ని ఎవరు వెలువరించినా, ఏదో ఒక సమాధానాన్ని చెపుతున్న గుణధాముడు ఏం చెప్పాలో తెలియక మౌనంగా వుండిపోయాడు.

"వాసుదేవుడికి వెంటనే వర్తమానం పంపి శివుడిని, ఆ సుబోధుడిని వెంటనే ఇక్కడికి తీసుకువచ్చేయమని చెప్పాలి. వారిద్దరినీ కాపాడుకునేందుకు అదొక్కటే మార్గం" సాలోచనగా అన్నాడు చక్రవర్తి.

"వాసుదేవుడు సంపంగిలో లేడు ప్రభూ..." అన్నాడు గుణధాముడు.

"ఎక్కడ వున్నాడు?" ఆశ్చర్యంగా అడిగాడు చక్రవర్తి.

"చారులతాదేవి అతన్ని సాగరుల వారి వద్దకు వచ్చి జరిగినవన్నీ తెలియ చేయమని ఆజ్ఞ ఇచ్చారట. యువరాణితో ఆలోచించి అతను సౌగంధ దేశం వెళ్ళాడట" తన దగ్గర వున్న లేఖ వంక ఒకసారి చూసి, నెమ్మదిగా చెప్పాడు గుణధాముడు.

""సౌగంధ దేశమా? అతనికి ఏమి పని?" అడిగాడు చక్రవర్తి.

"చారులతాదేవి వ్రాయించిన లేఖను చూసి వాళ్ళు ఏ విధంగా స్పందిస్తారో తెలుసుకునేందుకు అవసరం అయితే అందుకు ప్రతిచర్యల్ని చేపట్టేందుకు" అన్నాడు గుణధాముడు.

''మా అనుమతి అతనికి అవసరం లేదా?'' ఉన్నట్లుండి కోపం తెచ్చుకుంటూ అన్నాడు చక్రవర్తి.

"అవసరమే గాని, అది యువరాణి ద్వారా అతనికి లభించింది" అంటూ దట్టీలో నుంచి మరో లేఖను బయటికి తీశాడు గుణధాముడు. "దీన్ని యువరాణీ వారు వ్రాశారు" అంటూ అందులోని విషయాలను చదవటం మొదలుపెట్టాడు.

అంతకుముందు అతను చదివి చూపించిన వివరాలనే తానుకూడా మరోమారు తన లేఖలో ప్రస్తావించింది యువరాణి జ్వాల.

"సాగరుల వారి రక్తం పంచుకుపుట్టిన శివుడి జన్మరహస్యం బట్టబయలు అవటంతో అత్తయ్య ఆనందానికి హద్దులు లేకుండా పోతున్నాయి. అవసరం అయితే శివుడిని సౌగంధీయులు తీసుకుపోకుండా యుద్ధం చేయటానికి కూడా అత్తయ్య సిద్ధపడుతోంది. మీరు వెంటనే సాగరుల వారికి చెప్పి శివుడితో సహా మమ్మల్ని రాజధానికి రప్పించే ఏర్పాట్లు చేయించండి. రాజధానిలో వుండగా, శివుడిని... ఎవరూ ఏమీ చెయ్యలేరు. ఈ లోపల వాసుదేవుల వారు సౌగంధీయుల స్పందన ఎలా వున్నదో తెలుసుకుంటారు. మిగిలిన విషయాలు తమ సమక్షంలో విన్నవించుకుంటాను. ఇట్లు తమ ప్రియపుత్రిక జ్వలిత యువరాణి జ్వాల."

"లెస్సగా వ్రాసింది. ఇదంతా ఆ వాసుదేవుడి శిక్షణే. నాకు తెలుసు" సంతోషంగా అన్నాడు చక్రవర్తి.

"సాగరుల వారు ఏమంటారో వినాలని కుతూహలంగా వున్నది" అన్నాడు గుణధాముడు.

"యువరాణి వయసులో చిన్నదైనా ఆలోచనలో చాలా పరిణితి చెందినదాని మాదిరిగా సమస్యను పరిశీలించింది. తన ఆలోచన నాకు పూర్తిగా అవగతమయింది. శివుడి వ్యవహారం మన మనస్సులను వేధించి అశాంతికి కారణం కాకూడదు. ముందుగా మనం శిఖావంతుడిని పూర్తిగా వెడలగొట్టాలి. ఆ తరువాతనే శివుడిని గురించి ఆలోచించాలి" సాలోచనగా అన్నాడు సాగరుల వారు.

సాగరుడంతటి మహావీరుడు తన కుమార్తెను పొగిడేసరికి చాలా ఆనందం కలిగింది చక్రవర్తికి.

"లేఖకుల్ని పిలిపించి వెంటనే ఆ ఆజ్ఞల్ని లిఖింపచేయి... సాగరుల వారితో పాటు మేముకూడా మా మాటల్ని అందులో చేరుస్తాము. సంపంగి నగరానికి కాబోయే యువరాజుకు, భావిసంపంగి గజదళ అధిపతికి మా శుభాకాంక్షలు తెలియచెయ్యి" అన్నాడు. అంతకుముందు తను చెప్పిన మాటలన్నిటినీ ఆయన మర్చిపోయాడని అర్థమై కనులు చిట్లించాడు గుణధాముడు.

"మహామంత్రుల వారు మనోవ్యధకు గురికావాల్సిన అవసరం ఏమీలేదు. అపూర్వమైన అభిమానంతో చక్రవర్తి మాకు ఎన్ని వరాలు ఇచ్చినా ఇప్పటికిప్పుడు వాటిని మేము అనుభవించే ఆస్కారం లేదు" గుణధాముడి మొఖంలోని భావాల్ని గమనించి వెంటనే చిరునవ్వు నవ్వుతూ అన్నాడు సాగరులవారు.

"అనుభవించే ఆస్కారం ఎందుకు లేదు?" అయోమయంగా అడిగాడు గుణధాముడు.

"మీకు మీ రాచరిక నియమాలు ఎలా వున్నాయో మాకు కూడా అటువంటివే మరికొన్ని వున్నాయి. పున్నమి రోజున సంపంగి నగర సైన్యాధ్యక్షుల సమక్షంలోను, నగర పెద్దల మధ్యలోను మా దగ్గర పెరిగి పెద్ద వారయిన బిడ్డలందరికీ అర్హత పరీక్షలు జరుపవలసి వుంటుంది. ఏ ఏ విద్యల్లో వారికి ప్రవేశం వుంటుందో గుర్తించిన తర్వాత వారి స్వభావాలకు తగిన

వృత్తి విద్యల్ని నేర్పటం మా సాంప్రదాయం” గంభీరంగా అన్నాడు సాగరుల వారు.

“ఆ తరువాత?” ఆశ్చర్యంగా అడిగాడు గుణధాముడు. అతనికి ఆ సాంప్రదాయాన్ని గురించి తెలియక కాదు ఆ మాటలు స్వయంగా సాగరుల వారి నోటివెంట వినటమే విచిత్రంగా వున్నది అతనికి.

“వృత్తి విద్యలు నేర్చుకున్న తరువాతనే ఎవరు ఏ విధమైన పదవిలో కొనసాగాలో నిర్ణయింపబడుతుంది. ఈ విషయంలో శివుడికి కూడా మినహాయింపు లేదు. చక్రవర్తి అతన్ని భావి గజదళాధిపతి అని కీర్తించినా, సంపంగికి యువరాజు అని ప్రకటించినా ఇప్పటికిప్పుడు జరిగే పనులు కావు అవి. కాబట్టి మీరెవరూ ఆందోళన చెందవలసిన అవసరంలేదు” చెప్పాడు సాగరులవారు.

“సాగరుడు నిజం చెప్పాడు” నవ్వుకున్నాడు చక్రవర్తి.

తలవూపి సభా భవనం వెలుపలికి బయలుదేరాడు గుణధాముడు. సాగరుల వారి మాటలు యదార్థాలే అని తెలిసినా, ఏదో అనుమానం అతన్ని ఇంకా పీడిస్తూనే వుండటం వల్ల వేగంగా అడుగులు వేయలేకపోయాడు.

అర్హత పరీక్ష తరువాతనే శివుడు అత్యున్నత పదవులు చేపట్టేందుకు యోగ్యుడు అవుతాడన్న మాట వినటానికి బాగానే వున్నది గాని, అతను సాగరుల వారి రక్తం పంచుకు పుట్టాడని తెలిసిన తర్వాత ఆ పరీక్షలతో అవసరం వుంటుందా?? ఒంటిచేత్తో శిఖావంతుడి భల్లూక సైన్యాన్ని చెల్లాచెదురు చేయించిన వీరబాలకుడికి వేరే పరీక్షలతో నిమిత్తం వుంటుందా?? చక్రవర్తి మాటలు సంపంగి నగరం దాకా చేరుకున్న వెంటనే అక్షరాలా అమలులో పెట్టబడకుండా వుంటాయా??

సభా భవనం వెలుపల నిలబడివున్న భటులందరూ తనవంక విచిత్రంగా చూస్తూ వుండటాన్ని గమనించిన వెంటనే తన ఆలోచనల్ని అతి బలవంతంగా అదుముకున్నాడు అతను.

“నా అంతరంగిక లేఖకుడు ఎక్కడ వున్నా వెంటనే నా కార్యాలయానికి తీసుకురండి” అంటూ ఆజ్ఞ ఇచ్చి వడివడిగా వేశాడు అడుగులు.

❖ ❖ ❖

మహామంత్రి గుణధాముడు సందేహపడినట్లే జరుగుతున్నది సంపంగి నగరంలో. తూర్పు దిక్కు తెల్లబడుతూ వున్న సమయంలో అంతఃపుర మందిరాలకు సమీపంలో వున్న ఒక సుందర భవనం దగ్గరికి వచ్చాడు మంత్రి మహేశ్వరుడు.

భవన ద్వారం దగ్గర కాపలా నిలబడిన భటులు తలలు వంచి తనకు నమస్కరిస్తున్నా పట్టించుకోకుండా లోపలికి పోయాడు.

విశాలమైన పడక ఒకటి, హంసతూలికా తల్పం వంటిది వున్నది ఆ భవనంలోని శయన మందిరంలో.

ఆ పడక మీద పడుకుని వుండాలి శివుడు. అంతకు ముందెన్నడూ అటువంటి సుఖాన్ని అనుభవించి వుండకపోవటం వల్ల పెద్ద పెద్ద బండరాళ్ళు వచ్చి మీద పడినా మెలకువ రానంత గాఢ నిద్దురలో మునిగిపోయి వుండాలి.

కాని అతను ఆ శయ్యమీద కనిపించకపోయే సరికి ఒకింత ఆందోళనకి గురి అయినాడు మహేశ్వరుడు.

"శివకుమారుల వారూ? ఎక్కడ వున్నారు?? ఏమైపోయారు?" బిగ్గరగా పిలుస్తూ ఆ మందిరాన్నంతా కలియచూశాడు.

అంతకుముందు గతించిన రోజుల్లో తను అతన్ని "అరేయ్, ఒరేయ్" అని పిల్చినమాట గుర్తులేక కాదు. ఇప్పుడు అతను సాగరుల వారి బిడ్డడు. సంపంగికి కాబోయే యువరాజు.

"ఎక్కడ వున్నారు శివకుమారుల వారూ?" అని మరింత బిగ్గరిగా అడుగుతూ, ఆ మందిరం వెనుక భాగంలో వున్న ఒక పెద్దచెక్కపెట్టె దగ్గరికి పోయిన తర్వాత కనిపించాడు అతనికి శివుడు.

పెట్టె ప్రక్కన కటిక నేలమీద పడుకుని వున్నాడు.

"అయ్యయ్యో... ఏమిటిది? తప్పు కదా... యువరాజులు ఇలా ఒట్టి నేలమీద శయనించటం" అంటూ శివుడు కనులు తెరిచి చూసేసరికి చటుక్కున మాటల్ని ఆపేశాడు.

"నేను ఒట్టి శివుడిని మాత్రమే. శివకుమారుడిని కాదు. ఇంకోసారి అలా పిలిచారంటే నేను మీతో మాట్లాడను" విసురుగా లేచి నిలబడుతూ చెప్పాడు శివుడు.

"యువరాజుల వారికి కోపం వచ్చినట్లుంది" నవ్వుతూ అన్నాడు మహేశ్వరుడు.

"పని కట్టుకుని పదేపదే అటువంటి మాటలు మాట్లాడవద్దు. నేను ఒట్టి శివుడిని మాత్రమే. శివకుమారుడిని కాదు. యువరాజును అంతకన్నా కాదు. ఇంకోసారి అలా పిలిస్తే..." అంటూ తనుకూడా మాటని మధ్యలో ఆపాడు శివుడు.

"పిలిస్తే ఏం చేస్తారు యువరాజుల వారు?" వినోదంగా చూస్తూ అడిగాడు మహేశ్వరుడు.

తనే కాదు అంతఃపుర దాసదాసీలు, కాపలా భటులు, నగర ప్రముఖులు అందరూ అతన్ని అదేవిధంగా సంబోధించి మాట్లాడుతున్నారని, ఆ మాటల్ని విని అతను చాలా అసహనం ప్రదర్శిస్తున్నాడని తెలుసు అతనికి.

తూర్పు దిక్కు పూర్తిగా తెల్లబడకముందే అతను అక్కడికి వచ్చింది ఆ విషయాలను గురించి మాట్లాడటానికే.

శిఖావంతుడి భల్లూక సైన్యాన్ని చెల్లాచెదురు చేసే ఉపాయాన్ని కనిపెట్టి సంపంగి నగరాన్ని కాపాడినందుకు కృతజ్ఞతా సూచకంగా పెద్ద అభినందన సభను ఏర్పాటు చేయబోతున్నారు సంపంగి పౌరులు.

ఆ సభలో అతను ఎలా నడుచుకోవాలో, ఏ విధంగా మాట్లాడాలో తెలియచెప్పటం మహేశ్వరుడి ఉద్దేశ్యం.

"అల్లరి చిల్లరిగా బాధ్యతా రహితంగా సంచరించిన శివుడికి రాచరిక మర్యాదల్ని బోధించండి. సాగరుల వారి కుమారుడు మాట్లాడితే మైమరచిపోవాలిని అందరూ" అంటూ అంతకుముందు రోజే చారులతాదేవి స్పష్టమైన ఆజ్ఞలను జారీ చేసింది.

మాట్లాడటం ఒక్కటే కాదు, నడవటం, చూడటం, కూర్చోవటం, తలను పంకించటం అన్నీ సాగరుల వారి అంతస్థుకు తగిన విధంగానే కనిపించాలంటే శిక్షణ చాలా పటిష్టంగా వుండాలి.

"నేను తోటలోకి పోతున్నాను" మహేశ్వరుడి ఆలోచనలకు అడ్డం వస్తూ అన్నాడు శివుడు.

"అదెలా కుదురుతుంది? మీరు వినవలసినవి, నేర్చుకోవలసినవి చాలా వున్నాయి" అంటూ అభ్యంతరం వెలిబుచ్చబోయాడు మహేశ్వరుడు.

హంసతూలికా తల్పంవంటి పడక దగ్గర పడవేసి వున్నాడు శివుడు తన దట్టీని. చటుక్కున దాన్ని అందుకుని, తన నడుముచుట్టూ చుట్టుకున్నాడు. అతను భవనం వెలుపలికి వెళ్ళిపోతున్నాడని గ్రహించి "ద్వారాన్ని మూసి గడియ పెట్టండి భటులూ.. శివకుమారుల వారు కోపంతో బయటికి వెళ్లిపోబోతున్నారు" బిగ్గరగా ఆజ్ఞ ఇచ్చాడు మహేశ్వరుడు.

పెద్ద శబ్దంతో మూసుకున్నాయి ఆ భవనపు తలుపులు. "శాంతంగా కూర్చుని ప్రశాంతంగా వినండి. మన సంభాషణ పూర్తి అయ్యేటంత వరకూ అవి తెరుచుకోవు" అంటూ ఒక ఆసనాన్ని శివుడి దగ్గరికి జరిపాడు మహేశ్వరుడు.

తలుపుల్ని మూయిస్తే అతను కుదురుగా కూర్చుంటాడని అనుకున్న అతని అంచనా దారుణంగా తప్పిపోయింది. గిరుక్కున వెనక్కి తిరిగి శయన మందిరం వెనుక భాగంలో వున్న గవాక్షం దగ్గరికి పోయాడు శివుడు. ఒక్కగంతులో అంచుమీదికి ఎక్కి అమాంతంగా దూకేశాడు ఆ కిటికీకి దగ్గరగా వున్న ఒక చెట్టుకొమ్మ మీదికి.

"ఆగరా శివుడు... కొంచెం... ఆగు... నా మాట విను" విపరీతమైన ఆందోళనలో పడి అతన్ని గౌరవనామంతో పిలవాలన్న మాటను మర్చిపోయాడు మహేశ్వరుడు.

"మనం తర్వాత మాట్లాడుకుందాము. ఇప్పుడు కాదు" అంటూ గబగబా ఆ కొమ్మని వదిలి మరో కొమ్మమీదికి, అక్కడినించి క్రిందికి వెళ్ళిపోయాడు శివుడు.

❖ ❖ ❖

"రాజమాత నన్ను మన్నించాలి" శివుడికి కేటాయించబడిన భవనం దగ్గిర్నించి సరాసరి అంతఃపురం దగ్గరికి పోయి చారులతాదేవికి నమస్కరిస్తూ అన్నాడు మహేశ్వరుడు.

"రాజమాతా?" ఆశ్చర్యంగా అడిగిందామె. "రాజమాత ఎవరు?" సూటిగా ప్రశ్నించింది.

"తమరే తల్లీ..." అన్నాడు మహేశ్వరుడు.

"ఈ పిలుపు చాలా విచిత్రంగా వుంది. కొత్తగా కూడా వినిపిస్తోంది. నాకు నచ్చటం లేదు."

"సంపంగి యువరాజుల వారి తల్లిగారిని రాజమాత అనకుండా వేరేవిధంగా సంబోధించడం భావ్యంగా వుండదు."

"అదేమిటో మాకు తెలియదు. మీరు ఇకముందు అలా పిలవవద్దు"

పక్కనే కూర్చుని వున్న జ్వాల ఫక్కున నవ్వింది.

"ఎందుకే ఆ నవ్వు?" చిరుకోపంతో అడిగింది చారులతాదేవి.

"రాజమాత అని ఒక్కసారి పిలిచినందుకే ఇంత చిరాకుగా వుంటే, ఎప్పుడూ లేనిది అందరూ కలిసి తనని అతిమర్యాదగా పిలుస్తుంటే ఆ శివుడు ఇంకెంత చిరాకుపడాలి?" అడిగింది జ్వాల.

అంతకుముందు రోజు తాను జారీచేసిన ఆజ్ఞల సంగతి గుర్తుకు వచ్చి తనుకూడా నవ్వకుండా వుండలేకపోయింది చారులతాదేవి.

"నిజమే సుమా... పాపం వాడు అయోమయంతో నానా బాధలు పడుతూ వుండివుంటాడు... కాని మనస్థాయికి తగిన విధంగా సంబోధనలు వుండాలి కదా" అన్నది సాలోచనగా.

"సంబోధన అనేది సహజంగా వుండాలి. మన స్థాయి ఏమిటో మనం తెలియచెప్పకముందే అవతలివారికి అర్థం కావాలి. అప్పుడు ఈ చిరాకులు, చికాకులు గందరగోళాలు ఏవీ వుండవు. శివుడిని ఇదివరకటి శివుడిగానే వదిలేయండి. అతని స్థాయి ఏమిటో దానంతట అదే వెల్లడి అవుతుంది" గంభీరంగా చెప్పింది జ్వాల.

మహేశ్వరుడి వైపు చూసింది చారులతాదేవి. "ఏడి వాడు? ఎక్కడ వున్నాడు?" అని అడిగింది.

మహేశ్వరుడు సమాధానం చెప్పకముందే తను కల్పించుకున్నది జ్వాల. "ఇంకెక్కడ వుంటాడు? తన బాధల్ని చెప్పుకోవటానికి ఆ ఏనుగుల దగ్గరికే వెళ్లి వుంటాడు" అన్నది.

పక్కనే వున్న చెలికత్తెల్ని అతని కోసం పంపించబోయి ఆఖరి క్షణంలో మనసు మార్చుకున్నది చారులతాదేవి.

"ఇప్పుడు మనం ఏం చేస్తే బాగుంటుందో నువ్వే చెప్పు" అని అన్నది జ్వాలను ఉద్దేశించి.

"ఏమీ చేయవద్దు... సాగరుల వారు తిరిగి వచ్చేంతవరకు ఎవరూ ఏ విధంగాను శివుడిని ఇబ్బంది పెట్టవద్దు. ఆ తండ్రీ కొడుకుల సంబంధమే ఒక విచిత్రమైన బంధం. ఇంతకుముందు వరకు వాడిని ఒక సామాన్యమైన బాలకుడిగా భావించి అందరితో సమానంగా చూశారు సాగరుల వారు. ఎంత కాదని అనుకున్నా ఇప్పుడు అలా అనుకోవడం కుదరదు. ముందు వారిద్దరు ఒకరినొకరు అర్థం చేసుకుని తండ్రీ కొడుకులుగా మెలగటానికి అలవాటు పడిన తర్వాత అప్పుడు మిగిలిన వారిని గురించి ఆలోచించవచ్చు" సాలోచనగా అందామె.

"అవును... నిజమే...నేను కూడా అలవాటు పడాలి" అన్నది చారులతాదేవి.

ఈసారి ఫక్కున నవ్వింది జ్వాల కాదు. తప్పని తెలిసినా ఆపుకోలేక పోయాడు మహేశ్వరుడు.

"తల్లీ... మీరెప్పుడూ వాడిని తల్లిగానే చూసుకున్నారు. ఎవరి మాటను వినిపించుకోకపోయినా వాడు మీ ఆజ్ఞల్ని మాత్రం తు.చ. తప్పకుండా పాటిస్తాడు" అన్నాడు.

నిండిపోయినట్లయినాయి చారులతాదేవికి తన గుండెలు. తనవంకే చూస్తున్న జ్వాలకు తన భావాలు కనిపించకుండా వుండేందుకు చటుక్కున తలను పక్కకు తిప్పుకున్నదామె.

"సిగ్గెందుకత్తా? నీ బిడ్డడు సామాన్యుడు కాడు. వందమంది శిఖావంతులను సైతం ఒంటిచేత్తో ఎదిరించగల తెలివితేటలున్నవాడు. వాడు నీకు బిడ్డడు అవటం కేవలం నీ ఒక్కదాని అదృష్టమే కాదు. ఈ సమస్త జ్వలిత సామ్రాజ్యం మొత్తం చేసుకున్న పుణ్యం. కవచ శిరస్త్రాణాలు ధరించి వాడు, సాగరుల వారితో కలిసి సంపంగి గజదళాన్ని యుద్ధరంగంలోకి ఉరికించే దృశ్యాన్ని ఊహించుకో" చెప్పింది జ్వాల.

ఆ మాటలు ఆమె చెప్పకపోయినా, శివుడు సాగరులవారి రక్తం పంచుకు పుట్టిన వాడని తెలిసిన క్షణం నుంచీ అటువంటి దృశ్యాలనే ఊహించు కుంటోంది చారులతాదేవి. ఇప్పుడు ఆ దృశ్యాలకు పూర్తి స్పష్టత వచ్చేసింది.

ఆమెకు తెలియకుండానే ఉప్పొంగింది అంతరంగం. వెచ్చటి రెండు ఆనంద భాష్పాలు ఆమె కనుదోయి చివరల నుంచి బుగ్గలమీదికి జాలువారాయి.

"శివుడిని వాడి మానాన వాడిని వదిలేయండి. సాగరుల వారు తిరిగి వచ్చేంతవరకూ వాడిని ఎవరూ ఇబ్బంది పెట్టకండి" వెంటనే ఆజ్ఞ ఇచ్చింది మహేశ్వరుడికి జ్వాల.

తలవంచి చారులతాదేవికి నమస్కరించి వెలుపలికి వెళ్ళిపోయాడు మహేశ్వరుడు.

"ఈ ప్రపంచంలో నన్ను మించిన అదృష్టవంతురాలు మరెవ్వరూ వుండరేమో అనిపించి, భయం వేస్తున్నదే" జ్వాలతో అన్నది చారులతాదేవి.

"అదృష్టవంతురాలికి భయం దేనికి?" ఆశ్చర్యంగా అడిగింది జ్వాల.

"ఆ సౌగంధీయుల వ్యవహారం తలుచుకుంటుంటే కంపరమెత్తుతోంది. ఏదో పిచ్చి ఆవేశంలో అందరికీ లేఖలు పంపించాను. నిద్రపోతున్న శత్రువుల్ని నాకు నేనుగా తట్టిలేపానేమోనని" అస్పష్టంగా చెప్పింది చారులతాదేవి.

"ఇవాళ కాకపోయినా ఏదో ఒకరోజున ఖచ్చితంగా వెల్లడి కావల్సిన విశేషం అది. ఒకింత ముందుగా మనం బయటికి చెప్పాము. నువ్వు అనుకుంటున్నట్లు వాసుదేవుల వారు మన రాజధానికి కాదు వెళ్ళింది... సౌగంధీయుల దగ్గరికి" అప్పుడు చెప్పింది జ్వాల.

"సౌగంధీయుల దగ్గరికా? అమ్మో... ఎందుకు?" ఒక్కసారిగా ఆందోళన ముంచుకురావటంతో మొఖం కాంతివిహీనం అవుతుండగా అడిగింది చారులతాదేవి.

"తమ వారసుడు, తమ రక్తం ప్రవహిస్తున్న వారిలో మిగిలిన ఒకే ఒక మగవాడు జ్వలిత సామ్రాజ్యంలో వున్నాడని తెలిసిన వెంటనే వాళ్ళు ఏ విధంగా ఆలోచిస్తారో తెలుసుకోవటానికి. తెలుసుకుని అందుకు తగిన ప్రతిచర్యలు చేపట్టటానికి" అన్నది జ్వాల.

"ఈ ఆలోచన ముందుగా ఎవరికి వచ్చింది? నీకా వాసుదేవుడికా?" అడిగింది చారులతాదేవి.

"ఇద్దరికీ వచ్చింది. పని జరగటం ముఖ్యం కాబట్టి ప్రత్యేకంగా పేరుపెట్టి తెలుసుకోవాల్సిన అవసరంలేదు" అంటూ తేల్చి చెప్పింది జ్వాల.

"ఒంటరిగా వదిలేస్తే శివుడు తన ఏనుగుల దగ్గరే కూర్చుంటాడు. తిండిని గురించి, నిద్రను గురించి పట్టించుకోడు... వెంటనే వెళ్ళి వాడిని నేను పిలుస్తున్నానని చెప్పి, వెంటబెట్టుకు రండి" చెలికత్తెలకు చెప్పింది చారులతాదేవి.

"మహేశ్వరుల వారి మాదిరిగా గౌరవాలు ప్రదర్శించకండి. మామూలుగా మాట్లాడండి" వెనుకనుంచి హెచ్చరించింది జ్వాల.

తలలు ఊపి పరుగులాంటి నడకతో, శివుడికి కేటాయించబడిన భవనం వెనుక భాగంలో వున్న పెద్ద తోటలోకి పోయారు ఆ చెలికత్తెలు.

ఎంత వెతికినా ఎక్కడా కనిపించలేదు శివుడు వారికి. అతనితో పాటు ఆ తోటలోనే వుండవలసిన అతని ఏనుగులు కూడా అగుపించలేదు.

❖ ❖ ❖

"యువరాజుల వారు ఒంటరిగా ఎక్కడికీ పోకూడదని మంత్రి మహేశ్వరుల వారి ఆజ్ఞ..." అంటూ నగర ద్వారం దగ్గర కాపుండే భటుల నాయకుడు అడ్డుగా నిలుచున్నాడు శివుడి మార్గానికి.

అంతకుముందు కొద్దిరోజుల క్రితం అలా జరిగివుంటే, శివుడి అనుమతితో నిమిత్తం లేకుండా అతన్ని తొండంతో మోది, పాదాలతో తొక్కి పాతాళ లోకానికి పంపించి వుండేది శివుడు కూర్చుని వున్న మగ ఏనుగు.

సంపంగి సైనికుల ఉనికికి అలవాటు పడిపోయింది అది ఇప్పుడు. ఒళ్ళు జలదరించేటట్లు ఒకసారి ఘీంకరించి శివుడికేసి తన తొండాన్ని జాచింది.

"వెంట నా ఏనుగులు వుండగా నేను ఒంటరిగా వెళ్ళటమనే మాటకు అర్థం లేదు. నగరంలో నాకు ఏమీ తోచటంలేదు. నా ఏనుగులకు కూడా చిరాకుగానే వున్నది. కొద్దిసేపు అలా అలా తిరిగివస్తాము. మహేశ్వరుల వారు అడిగితే చెప్పండి" అంటూ తనకేసి జాచబడిన మగ ఏనుగు తొండాన్ని మృదువుగా నిమిరాడు శివుడు.

ఈసారి ఆ నాయకుడి అనుమతికోసం ఆగలేదు మదగజం. గంభీరంగా ఒక శబ్దం చేసి అడుగు కదిపింది.

ఆ భటుడికి భయం కలిగింది. గబుక్కున పక్కకు దూకి దాని దారిలో నుంచి తప్పుకున్నాడు.

నగర ద్వారం ముందు వుంటుంది పెద్ద అగడ్త. దానిమీద పరుచుకుని వుంటుంది బలమైన బాదులతో తయారుచేయబడిన ఒక చెక్కల వంతెన.

ఆ చెక్కలు దడదడమని శబ్దం చేస్తూ వుండగా అవతలికి పోయిందా ఏనుగు. దానివెనకే ఆడ ఏనుగు, దాని తోకను తన తొండంతో చుట్టి పట్టుకున్న గున్న ఏనుగు కూడా నగరంలో నుంచి బయటికి పోయాయి.

"ఈ శివుడి వాలకం చూస్తుంటే ఎవరి మీదనో అలిగి అవతలికి పోతున్నట్టు నాకు అనిపిస్తోంది. వెంటనే మంత్రి మహేశ్వరుల వారికి తెలియచేయటం చాలా మంచిది" అని అంటూ అప్పటికప్పుడు తన సహచరుడు ఒకతన్ని నగరంలోకి పంపాడు ఆ భటుల నాయకుడు.

❖ ❖ ❖

అడవి మొఖం చూసి అప్పటికి చాలారోజులు గడిచిపోవడం వల్ల ఆనందంగా పరుగులు తీశాయి శివుడి ఏనుగులు. సూర్యుడు నడిమింటికి చేరుకుంటూ వున్న సమయంలో పెద్దనీటి గుంటను చేరుకుని, జలకాలాట మొదలుపెట్టాయి.

"మీరు మీ ఆటల్ని తీరికగా పూర్తిచేసుకోండి..." అంటూ వాటిని ఆ గుంట దగ్గిరే వదిలి, గుంటకు ఆవలి పక్కన వున్న దట్టమైన వృక్షాల దగ్గరికి పోయాడు శివుడు.

తియ్యటి వాసనలను వెదజల్లుతూ అతనికి కనిపించాయి చెట్లమీద వుండగానే మిగలపండిన సీతాఫలాలు కొన్ని. నాలుగు ఫలాలను ఆరగించేసరికి అణిగిపోయింది అతని ఆకలి. అక్కడే ఒక పెద్ద మారేడు వృక్షం క్రింద పడుకుని, కనులు మూసుకున్నాడు అతను. అప్పటికప్పుడు మళ్ళీ గాఢమైన నిద్దురలోకి జారిపోయాడు.

అర్థఘడియ తరువాత అతని దగ్గిరికి వచ్చి కాపలా భటుల మాదిరి అతనికి అటూ యిటూ నిలుచున్నాయి పెద్ద ఏనుగులు. శివుడి పక్కనే పడుకుని తనుకూడా నిద్ర మొదలుపెట్టింది గున్న.

❖ ❖ ❖

దడదడమని శబ్దం చేస్తూ వేగంగా క్రిందికి దొర్లుకుంటూ వస్తున్న ఒక పెద్ద కొండరాయిని గమనించి తన అశ్వాన్ని వెంటనే వెనక్కి పరిగెత్తించాడు వాసుదేవుడు.

పిడుగు పడినంత శబ్దం చేసిందా కొండరాయి అతను అనుసరిస్తున్న పర్వత మార్గం మధ్యలో పడి.

చేటలతో ఎత్తి ఎగురవేసినట్లుగా గాలిలోకి లేచింది దట్టమైన దుమ్ము. క్రిందపడిన వెంటనే ముక్కలు ముక్కలైపోయింది కాబోలు ఆ కొండరాయి– వడిశెలతో పెట్టి విసిరినట్టు వేగంగా దూసుకువచ్చాయి పెద్ద పెద్ద రాతిముక్కలు.

"ఒక్కక్షణం ఆలస్యం చేసివుంటే నీ పని నా పని రెండు పనులు ఒకేసారి పూర్తి అయిపోయి వుండేవి. ఇంత బతుకు బ్రతికి ఇంటి వెనకాల మరణించినట్లు, ఊరూ పేరూ లేని ఈ కొండ మార్గంలో గుటుక్కుమని వుండేవాళ్ళం" కొండరాయి పడినప్పుడు వినవచ్చిన శబ్దానికి భయపడిపోతున్న తన అశ్వంతో చెప్పాడు అతను.

అంతకుముందు రోజు వర్షం కురిసింది కాబోలు ఆ రాయిచుట్టూ వున్న మట్టి వర్షం ధాటికి కరిగిపోవడం వల్ల ఆ ఉత్పాతం సంభవించినట్లు తెలిసింది అతనికి.

"సౌగంధ దేశంలోని మార్గాలన్నీ ఇలాగే వుంటాయి. ఈ దేశానికి శత్రుభయం లేకుండా పోవటానికి కారణం ఈ కొండ దారులే. పదిమంది బలాఢ్యులను ఈ కొండలమీద నిలబెడితే వెయ్యిమంది శత్రువుల్ని తేలికగా యమపురికి పంపించేస్తారు" ముందుకు కదలటానికి సందేహిస్తున్న తన వాహనాన్ని అతి బలవంతంగా నడిపిస్తూ మరో మాట చెప్పాడు దానికి.

పది అడుగుల దూరం మాత్రమే పోగలిగారు... సరిగ్గా ఆ మార్గం మధ్యలో పడింది పైనుంచి వచ్చిన కొండరాయి. సగభాగం ముక్కలైనా కూడా మిగిలిన సగం దారిని పూర్తిగా ఆక్రమించి అడ్డుగా కనిపించింది.

"దాన్ని తొలగించడం మనవల్ల అయ్యేపని కాదు. తొలగించకపోతే ముందుకు పోవటం సాధ్యపడదు. ఏం చేద్దాం?" తనలో తను అనుకుంటూ, అలాగే నిలబడిన అతనికి పావు ఘడియ తరువాత కనిపించారు బలిష్టమైన అశ్వాల మీద వేగంగా ఆ ప్రదేశంలోకి వస్తున్న సైనికులు పదిమంది.

"ఎవరు నువ్వు? ఎక్కడికి నీ ప్రయాణం?" దగ్గరికి రాగానే అతన్ని గమనించి తన అశ్వం మీదినుంచి దిగుతూ అడిగాడు ఒక సైనికుడు.

తన పేరు చెప్పాడు వాసుదేవుడు. తను ఎక్కడినించి వస్తున్నాడో చెప్పాడు. "సుగంధి నగరాన్ని చూడాలని ఎంతకాలం నుంచో పెద్ద కోరిక. మూడు

దినాల నుంచీ ప్రయాణం చేస్తున్నాను... ఇక్కడ ఆగిపోవాల్సి వచ్చింది" తనదారిని అడ్డుకుంటున్న రాయివంక చూస్తూ అన్నాడు.

"ఇది ఇవాళో రేపో క్రిందికి దొర్లుతుందని అనుకుంటూనే వున్నాము. దానిక్రింద పడకుండా తప్పించుకోగలగటం నీ అదృష్టం" అంటూ అతన్ని తమ దగ్గరికి రావల్సిందిగా చేయివూపాడు ఆ సైనికుడు.

"నేను రాగలను. నా వాహనం రాలేదు" అన్నాడు వాసుదేవుడు.

"నా అశ్వం మీద నువ్వు నగరానికి వెళ్ళి కోటగోడల దగ్గర ధర్మసత్రంలో బస చేయవచ్చు. ఈ అవరోధాన్ని తొలగించిన తర్వాత మేము నీ వాహనాన్ని నీకు అప్పగిస్తాము" అన్నాడు ఆ సైనికకుడు.

రెండవ ఆలోచన చేయకుండా అందుకు అంగీకరించాడు వాసుదేవుడు. తన అశ్వంమీది చిన్న వస్త్రపు మూటను భుజానికి తగిలించుకుని, అతి నెమ్మదిగా, బహు జాగ్రత్తగా అవతలి పక్కకు పోయాడు.

తన అశ్వాన్ని అతనికి అప్పచెప్పి, బలమైన సమ్మెటతో దారికి అడ్డుగా వున్న కొండరాయిని పగులకొట్టే పని మొదలుపెట్టాడు ఆ సైనికుడు.

❖ ❖ ❖

మిట్ట మధ్యాహ్నపు సమయంలో సౌగంధ దేశపు రాజధాని సుగంధి నగరంలో అడుగుపెట్టాడు వాసుదేవుడు.

కోట ద్వారాన్ని దాటి పది అడుగులు కూడా వేయకముందే అగుపించింది అతనికి సైనికుడు సూచించిన ధర్మసత్రం.

"రండి... రండి... మీ దుస్తులు, మీ వాలకం చూస్తుంటే జ్వలిత సామ్రాజ్యం నుంచి వచ్చిన వారిగా తెలుస్తోంది. అవునా?" అతన్ని చూడగానే సాదరంగా ఆహ్వానిస్తూ అడిగాడు సత్రాన్ని నిర్వహించే మనిషి.

"నాది ఏ దేశమో చెప్పారు. చాలా బాగున్నది. ఏ నగరమో చెప్పగలరా?" సైనికుడి అశ్వాన్ని సత్రం ముందు భాగంలో వున్న కట్టుకొయ్యకు కడుతూ అడిగాడు వాసుదేవుడు.

"రెండే రెండు చెప్పగలను. ఒకటి రాజధాని నించైనా వచ్చివుండాలి. లేదా సంపంగి నించైనా వచ్చివుండాలి... సంపంగి అని నా నమ్మకం" నిశితంగా చూస్తూ చెప్పాడు ఆ మనిషి.

అతని సూక్ష్మదృష్టికి మనసులోనే అమితమైన ఆశ్చర్యాన్ని పొందాడు వాసుదేవుడు. పెదవులు విప్పి పలుకరించకముందే తనది ఏ ప్రదేశమో చెప్పగలిగినవాడు, నోరు తెరిచి ఏదైనా మాట్లాడిన మరుక్షణం తను అక్కడికి ఎందుకు వచ్చాడో తెలుసుకోగలడు. మెలకువగా వ్యవహరించకపోతే అపాయం తప్పదు.

యుద్ధాలంటే గిట్టదు సౌగంధీయులకి. అలాగని ఆత్మరక్షణ చేసుకోలేని అసమర్థులు కాదు వాళ్ళు. తమకు చెడుపు తలపెట్టిన వాళ్ళని క్షమించే మనస్తత్వం కాదు వాళ్ళది.

"ఎండన పడి వచ్చారు కాబోలు... మొఖం బాగా మలినపడి కనిపిస్తోంది. చల్లని నీళ్ళున్నాయి. స్నానం చేయండి... వేడి వేడి భోజనం సిద్ధంగా వున్నది. హాయిగా ఆరగించవచ్చు" అంటూ అతన్ని లోపలికి ఆహ్వానించాడు ఆ మనిషి.

అతను చూపించిన చిన్న మందిరంలో తను వెంట తీసుకువచ్చిన వస్త్రపు మూటను వదిలి, అతను చెప్పినట్టే చన్నీటితో స్నానం చేసి, దుస్తులు మార్చుకున్నాడు వాసుదేవుడు. రుచికరమైన భోజనం ముగించి సత్రం ముందున్న అరుగుమీద తీరికగా కూర్చున్నాడు.

"వ్యాపారం చేసే లక్షణాలు మీలో నాకు కనిపించటం లేదు. మీరు వ్యాపారం నిమిత్తం ఇక్కడికి రాలేదు. మీరు వచ్చిన పనేమిటో తెలుసుకోవల్సిన విధి నాది. దయచేసి చెప్పగలరా?" నెమ్మదిగా అడిగాడు సత్రం మనిషి.

"కొండదారిలో అశ్వాన్ని ఇచ్చి సాయపడిన సైనికుడికి ఏం చెప్పాడో అవే మాటల్ని ఒక్క అక్షరం కూడా బీరు పోకుండా ఇతనికి కూడా చెప్పాడు వాసుదేవుడు.

"సుగంధ నగరాన్ని దర్శించాలనే మీ కోరిక సమంజసమే. ఈ చుట్టుపట్ల వున్న పన్నెండు రాజ్యాలలో మా నగరాన్ని మించిన నగరం మరొకటి లేదు. ఒక్క సంపంగిని మినహాయిస్తే..." నవ్వుతూ చెప్పాడు సత్రం మనిషి.

"అదెలాగ?" ఆశ్చర్యంగా అడిగాడు వాసుదేవుడు.

"సంపంగి చుట్టూ వున్న అడవులు ఆ నగర శోభను ఇనుమడింప చేస్తాయట.... మా నగరం చుట్టూ వున్న పర్వతాలు మాకు అందాన్ని తెచ్చిపెట్టినట్లు" అన్నాడు ఆ మనిషి.

"మర్యాదగా మాట్లాడటంలో మీ సౌగంధీయులకు సాటి ఎక్కడా కనిపించదు. మీకు మీరే పోటీ..." మెచ్చుకోలుగా అన్నాడు వాసుదేవుడు.

"మా మర్యాదను మేము ఎప్పుడూ మర్చిపోము. మరి ఆ సంపంగి పాలకులు మర్చిపోతారేమో మాకు తెలియదు" వున్నట్లుండి గాఢంగా నిట్టూరుస్తూ అన్నాడు ఆ మనిషి.

ఉలికిపాటును నేర్పుగా కప్పిపెట్టుకుంటూ ప్రశ్నార్థకంగా అతని మొఖంలోకి చూశాడు వాసుదేవుడు.

"గతంలో మా యువరాణీ వారిని దొంగచాటుగా తీసుకుపోయిన సుబోధుడికి సంపంగి పాలకులు ఆశ్రయం ఇచ్చినట్లు తెలిసింది. మాకు ద్రోహం చేసినవారిని ఆ నగరం వాళ్ళు దాచిపెట్టటం మర్యాద అనిపించు కుంటుందా?" కనులు చిట్లిస్తూ అడిగాడు ఆ మనిషి.

ఒక్కక్షణం పాటు అల్లకల్లోలమైపోయాయి వాసుదేవుడి ఆలోచనలు. సుబోధుడి వ్యవహారం ఏదో ఒక సమస్యను తెచ్చిపెడుతుందని తాము అనుకుంటూనే వున్నారు. దారిన పోయే దానయ్యలకు ఆశ్రయం ఇచ్చే ఒక సామాన్యమైన సత్రపు మనిషికి కూడా ఆగ్రహం కలిగించేంతటి పరిణామానికి కారణం అవుతుందని మాత్రం అనుకోలేదు.

"సంపంగి పాలకులు సుబోధుడికి ఆశ్రయం ఇచ్చినట్లు మీకు ఎలా తెలిసింది?" ఎవరో ఒకరు ఆ వృత్తాంతాన్ని కొంచెం వక్రీకరించి చెప్పటం వల్లనే అతను అలా మాట్లాడుతున్నాడని అనుకుంటూ అడిగాడు.

"సంపంగి మండలాధీశుడు సాగరుడి సతీమణి పంపిన లేఖ ఒకటి మా పాలకుడికి చేరింది" క్లుప్తంగా అన్నాడు సత్రపు నిర్వాహకుడు.

వెంటనే వచ్చింది వాసుదేవుడికి ఒక పెద్ద అనుమానం. చారులతాదేవి వ్రాయించిన లేఖలో శివుడి వారసత్వమే ప్రధానాంశం. సుబోధుడికి ఆశ్రయం ఇచ్చామన్న మాట లేనేలేదు అందులో.

"నాకు తెలిసినంతవరకు నిన్న మొన్నటి వరకూ అసలు ఆ సుబోధుడు ఎవరో కూడా సంపంగిలో ఎవరికీ తెలియదు... సాగరుల వారు అతని పుత్రికను చేబట్టినప్పుడు కూడా అతను సుబోధుడనే విషయం ఆయనకి తెలియదు. అన్నిటికంటే విచిత్రమైన అంశం ఇంకోటి వున్నది. చెపితే మీరు నమ్మక పోవచ్చును" సాలోచనగా అన్నాడు ఆ మనిషితో.

"నేను సుగంధి పాలకుడిని కాదు. నువ్వు సంపంగి పాలకుడివి కూడా కాదు. మనం ఉబుసుపోక మాట్లాడుకోవటంలో తప్పేమీ లేదు. నువ్వు చెప్పదల్చుకున్నది ఏమిటో చెప్పు. నమ్మటమో నమ్మకపోవటమో నేను నిశ్చయించుకుంటాను" నవ్వుతూ అన్నాడు ఆ మనిషి.

"సుబోధుడి పుత్రిక ద్వారా తనకు సంతానం కలిగిన సంగతి ఆ సుబోధుడు నోరుతెరిచి చెప్పేంతవరకు సాగరుల వారికి తెలియదు. తెలిసికూడా ఎన్నో రోజులు కాలేదు. అటువంటప్పుడు సాగరుల వారు సౌగంధీయుల పట్ల అనుచితంగా ప్రవర్తించటానికి ఆస్కారం ఏది? తెలిసిన వెంటనే తడవు చెయ్యకుండా లేఖను వ్రాయించి పంపించారు కదా... ఆయన మంచితనాన్ని తప్పుపట్టటంలో అర్థం ఏమైనా వున్నదా?" అడిగాడు వాసుదేవుడు.

సాలోచనగా తలవూపాడు సత్రపు మనిషి. "నువ్వు చెపుతున్నదే యదార్థమైతే సంపంగి పాలకుడు నిష్కల్మష హృదయుడేనని ఒప్పుకోక తప్పదు. కాని నిజం వేరేగా వున్నట్లు తెలుస్తోంది" అన్నాడు.

అప్పుడు అతను ఆ మాట మాట్లాడినప్పుడు వెంటనే వాసుదేవుడి కనులముందు మెదిలాడు శిఖావంతుడు.

"శిఖావంతుడు వారివద్ద నుంచి వర్తమానం ఏదైనా ఈ పట్టణానికి వచ్చిందా?" తడుముకోకుండా అడిగాడతను.

"నీకెలా తెలుసు?" ఆశ్చర్యంగా అడిగాడా మనిషి.

తన ఊహ యదార్థమేనని తెలిసిపోయింది వాసుదేవుడికి. వెంటనే చెప్పాడతను సంపంగిమీద జరిగిన దాడిని గురించి. సుబోధుడి మనవడైన శివుడు శిఖావంతుడి భల్లూక సైన్యాన్ని ఎలా చిందరవందర చేశాడో వివరించాడు.

"శిఖావంతుడు మూర్ఖుడే కాదు. పచ్చి అవకాశవాది. సంపంగికి సౌగంధికి మధ్య చిచ్చుపెట్టి తద్వారా తను లాభపడాలనుకునే రకం. పెద్ద గుంటనక్క. ఖచ్చితంగా అతను యదార్థాన్ని వక్రీకరించే వర్తమానాన్ని మీ పాలకులకు పంపే వుంటాడు. సందేహం లేదు" అన్నాడు.

తీవ్రమైనాయి సత్రపు మనిషి మొఖంలోని ఆలోచనలు. అతను పెదవులు విప్పి ఇంకో మాట ఏదైనా మాట్లాడితే వెంటనే సమాధానం ఇచ్చేందుకు సిద్ధంగానే వున్నాడు వాసుదేవుడు.

అటువంటివేవీ బయల్పడలేదు అతని నోటినుంచి. "కొండదారుల్లో ప్రయాణం చేసి చేసి అలసిపోయిన మిమ్మల్ని అదేపనిగా మాట్లాడించి చాలా కష్టపెట్టాను. దయచేసి క్షమించండి. విశ్రాంతి తీసుకోండి" అంటూ మర్యాద నిండిన కంఠంతో చెప్పి అవతలికి వెళ్ళిపోయాడు.

సత్రం ప్రక్కభాగంలోనే వున్నది ఒక అశ్వశాల. అరనిమిషం తరువాత అందులో నుంచి బయటికి వచ్చింది ఒక అశ్వం. పక్కలకు కూడా చూడకుండా దాన్ని రాచవీధిలోకి పరుగులు తీయించాడు అశ్వికుడు.

తను సత్రం మనిషికి చెప్పిన మాటలు సౌగంధి పాలకుల చెవులకు చేరబోతున్నాయని తెలిసిపోయింది వాసుదేవుడికి. ఎందుకంటే ఆ అశ్వికుడు మరెవరో కాదు సత్రం నిర్వాహకుడే.

❖ ❖ ❖

నూరు వసంతాల వయసు రాబోతున్నది సౌగంధి పాలకుడైన శివకేశవ చంద్రుడికి. శరీరపటుత్వం సన్నగిల్లిపోతున్న సూచనలు కనిపిస్తున్నాయి. ఎవరో ఒకరు పక్కనే నిలబడి పట్టుకోకపోతే లేచి నిలబడటం కష్టమనిపిస్తుంది. కనులు చిట్లించి తదేకంగా చూస్తే తప్ప దూరంలో వున్న వారి మొఖాలు కనిపించటంలేదు.

"భగవంతుడి దయవల్ల వృద్ధాప్యం వల్ల వచ్చే అవలక్షణాలు తప్ప వేరే విధమైన రుగ్మతలేవీ తమ దరికి చేరలేదు. అదృష్టవంతులు ప్రభూ తమరు..." ఆ రోజు ఉదయం వేళలో వచ్చిన రాచవైద్యుడు ఆయన నాడిని పరిశీలిస్తూ చెప్పాడు నవ్వు మొఖంతో.

"ఈ ఘటం ఇలాగే ఆరోగ్యంగా వుండగానే వెళ్ళిపోవాలని నేను కోరుకుంటున్నాను. కాని అది సాధ్యపడేటట్లు కనిపించడం లేదు. మానిపోయిందని అనుకుంటున్న గాయం తిరిగి రేపబడింది. మనసంతా అల్లకల్లోలమైపోతోంది" ఆయన్ని పిలిపించిన కారణాన్ని వివరించాడు శివకేశవ చంద్రుడు.

తిరిగి రేగిన గాయం ఏమిటో తెలుసు వైద్య శిఖామణికి. నలుగురు కుమార్తెలు సౌగంధ పాలకుడికి. పుత్రులు లేరు. పెద్దకుమార్తె సుబోధుడిని చేపట్టి దేశం వదిలి పారిపోయింది. మిగిలిన ముగ్గురూ తండ్రి చూపించిన

వారినే పెళ్ళిళ్ళు చేసుకున్నారు. వారందరికీ ఆడబిడ్డలే పుట్టారు... ఆ ఆడబిడ్డలకు కూడా మగ సంతతి లేదు. ఆడపిల్లలే.

పదిహేను తరాల మహోజ్వల చరిత్ర కలిగిన సౌగంధ పాలకుడి వంశంలో మొట్టమొదటిసారిగా తల ఎత్తింది రాజ్యాంగ సంక్షోభం. శివకేశవ చంద్రుడి తర్వాత సింహాసనం అధిష్టించగల అర్హత వున్న మగవాడు ఎవడు??

"శారీరక రుగ్మతలకు వైద్యం చేయటం నా వృత్తి. ఒక్కోసారి ఆ రోగాలతో పాటుగా మనస్సులకు సోకే జబ్బులను కూడా నయం చేయవలసిన అవసరం ఏర్పడుతూ వుంటుంది. రాజకీయంగా మీకు ఆలోచనలు చెప్పగల స్థాయి నాకు లేదుగాని, ఒక చిన్న మాట చెప్పటానికి అనుమతి ఇవ్వండి ప్రభూ" చిన్నగా అన్నాడు ఆ వైద్యశిఖామణి.

"అందుకే మిమ్మల్ని పిలిపించుకున్నాను. నిరభ్యంతరంగా చెప్పండి" అన్నాడు శివకేశవ చంద్రుడు.

"మీకు ఇష్టం వున్నా లేకపోయినా మీ రక్తం మీ పెద్దకుమార్తె మనవడిలో ప్రవహిస్తోంది. సౌగంధ వంశంలో మగబిడ్డ లేడనే మాటకు అర్థం లేదు. మీ అనుమతి లేకుండా వివాహం చేసుకున్న మీ కుమార్తె తన మనవడికి మీ పేరే పెట్టుకున్న విషయం మీ దృష్టికి రాలేదా?" అన్నాడు వైద్యశిఖామణి.

చటుక్కున తల ఎత్తి చుట్టు చూశాడు శివకేశవ చంద్రుడు. ఆయనకేదీ సరిగ్గా కనిపించలేదు గాని, ఏదైనా ఆజ్ఞ యిస్తే వెంటనే ఆచరణలో పెట్టటానికి సిద్ధంగా నిలబడిన సేవకులకు వెంటనే తెలిసిపోయింది ఎందుకలా చూశాడో...

వినయంగా తలలు వంచి వెనక్కి వెనక్కి జరిగారు వారందరూ. ఆ మందిరంలో నుంచి వెలుపలికి పోయి తలుపులు మూసివేశారు.

"కొంతకాలం పాటు నా కుమార్తె చేసిన పనిని నేను అసహ్యించుకున్న మాట వాస్తవం..." చిన్న కంఠంతో చెప్పాడు శివకేశవ చంద్రుడు.

"నాకు తెలుసు ప్రభూ... తమరిది దయా హృదయం. తమరే కాదు... ఏ తండ్రీ మొదట్లో కోపగించుకున్నా కాలక్రమంలో బిడ్డల్ని క్షమించేయడం, సర్వసాధారణం. యువరాణి వారిని మీరు ఎప్పుడో క్షమించేశారు... అయితే..." అంటూ మాటల్ని ఆపాడు వైద్యుడు.

"చెప్పండి... మాటల్ని ఆపకండి" ప్రోత్సహించాడు ప్రభువు.

"క్షమించిన సంగతిని పదిమందికీ తెలిసేటట్లు బహిరంగపరచి వున్నట్లయితే ఈ రోజున ఇటువంటి పరిస్థితి వచ్చివుండేదికాదు. మీరు మీ భావాల్ని మీ మనసులోనే వుంచుకోవడం వల్ల వచ్చిన తంటా యిది."

గాఢంగా నిట్టూర్చాడు శివకేశవ చంద్రుడు. "నేను చేసింది మంచిదేనని చెప్పలేనుగాని, శివుడి ఆజ్ఞ లేనిదే చీమైనా కుట్టదనే మాట ఒకటి వుంది. ఈ రోజున ఈ పరిస్థితి ఎదురుపడటం కోసమే నేను మా భావాల్ని నా మనసులోనే దాచిపెట్టుకోవటం జరిగిందేమో?" అన్నాడు.

"ఎప్పుడూ లేనిది ప్రభువులు వేదాంతం మాట్లాడుతున్నారు. ఆ అవసరంలేదు ప్రభూ. తమరు తలవూపితే తమకోసం తమ ప్రాణాలను కూడా తృణపాయంగా విసర్జించేవారు సౌగంధ ప్రజలు" ఆవేశంగా అన్నాడు వైద్యుడు. "మీరు సంపంగి మీద యుద్ధం ప్రకటించదలుచుకుంటే పది రెండు ఘడియల్లో సిద్ధం అవుతారు మన సైనికులు. సంపంగిని పునాదులతో సహా పెకలించి" అని ఇంకా ఇంకా ఏమేమో మాట్లాడబోతున్న అతన్ని తల విదిలింపుతో ఆపేశాడు ప్రభువు.

"యుద్ధాలు చేయటం మన సంస్కృతి కాదు" అన్నాడు.

"అవమానాన్ని భరించి బ్రతకటం కూడా సంస్కృతి కాదు గదా ప్రభూ?"

"అవమానమా? ఎవరికి?" చిన్నగా నవ్వుతూ అడిగాడు శివకేశవ చంద్రుడు.

"అదేమిటి ప్రభూ? ఆ సంపంగి పాలకులు సుబోధుడిని దాచిపెట్టి, తమకు ఏమీ తెలియదని మనల్ని మభ్యపెట్టి" నగరంలో ప్రచారం అవుతున్న మాటల్ని గుర్తుకు తెచ్చుకుంటూ చెప్పబోయాడు వైద్యుడు.

అతన్ని ఆగమని సైగచేసి, పక్కనే వున్న జేగంటను ఠంగున మ్రోగించాడు శివకేశవ చంద్రుడు.

వెంటనే లోనికి తొంగిచూశాడు ఒక సైనికుడు.

"ధర్మసత్రపు నిర్వాహకుడిని ప్రవేశపెట్టు" ఆజ్ఞ ఇచ్చాడు ప్రభువు.

అర నిమిషం తరువాత లోనికి వచ్చాడు సత్రపు మనిషి. తలవంచి ముందు ప్రభువులకు, తర్వాత వైద్యుడికి నమస్కరించాడు.

“నువ్వు తెలుసుకు వచ్చిన వివరాలను వైద్యుల వారికి కూడా తెలియచెప్పు” ఆజ్ఞాపించాడు ప్రభువు.

ఒక్కమాటను కూడా వదిలిపెట్టకుండా సత్రంలో తనకు సంపంగి పౌరుడికి జరిగిన సంభాషణను వివరించి చెప్పాడు ఆ మనిషి.

“నీ సేవకు మేము సంతృప్తులమయ్యాము. జరుగవలసింది ఏమిటో మేము నిర్ణయించుకుంటాము. నువ్వు వెళ్ళిపోవచ్చును” అంటూ అతన్ని అవతలికి పంపి వైద్యుడి వంక చూశాడు శివకేశవచంద్రుడు.

“సంపంగి పాలకులు పంపిన లేఖలోని విషయాలు నిజమా? శిఖావంతుడి మంత్రులు చెప్తున్నవి నిజమా? ఎవరిని మనం నమ్మాలి?” అని అడిగాడు.

“శిఖావంతుడి మంత్రులు చెపుతున్నవాటిని నమ్మితే మనం సంపంగి మీద యుద్ధానికి బయలుదేరవలసిందే” అన్నాడు వైద్యుడు.

‘‘సంపంగి నించి వచ్చిన లేఖను నమ్మినా కూడా యుద్ధానికి బయలుదేరినంత గడబిడ చేయవలసిందే” అనికూడా చెప్పాడు.

“ఆ రెండు పనులు శిఖావంతుడికే లాభాన్ని చేకూర్చిపెడతాయి. వారు, మనము తగవు పడుతున్నప్పుడు అతను యుద్ధంలో పైచెయ్యి సాధిస్తాడు” అన్నాడు శివకేశవ చంద్రుడు.

“అయితే ఇప్పుడు మనం చేయవలసింది ఏమిటి ప్రభూ?” అడిగాడు వైద్య శిఖామణి.

“సమర్థుడైన మనిషిని సంపంగికి పంపి యదార్థం ఏమిటో తెలుసుకోవాలి. రహస్యంగా జరిగిపోవాలి. రెండోకంటివాడికి తెలియకూడదు” సాలోచనగా అన్నాడు శివకేశవ చంద్రుడు.

“మరి సాగరుడికి తమ మనవరాలికి పుట్టిన బిడ్డడి సంగతి?” సూటిగా అడిగాడు వైద్యుడు.

“అతను తప్పకుండా ఇక్కడికి రావల్సిన వాడే. అయితే ఎలా వస్తాడో, ఏ విధంగా వస్తాడో తర్వాత తేల్చుకుందాము. ముందు ఈ సుబోధుడి సంగతి తేలిపోవాలి” అన్నాడు ప్రభువు.

“సమర్థులను ఎంపిక చేయటం కొంచెం కష్టతరమే. మన దగ్గర వున్న వారిలో ఎవరిని పంపినా ఎంతో కొంత గుట్టు బట్టబయలు అయిపోతుంది. నాకు రెండురోజులు వ్యవధి ఇవ్వండి” అన్నాడు వైద్యుడు.

"ఏదో ఒకటి వెంటనే చెయ్యండి. శిఖావంతుడి మంత్రులు మనవారందరినీ పూర్తిగా రెచ్చగొట్టి యుద్ధానికి సిద్ధం చేయకముందే పని పూర్తి అయిపోవాలి" అన్నాడు ప్రభువు.

ఆసనం మీదినించి లేచి అభివాదం చేశాడు వైద్యుడు. ప్రక్కనే పెట్టిన తన మందుల పేటికను తీసుకుని ఆ మందిరంలో నుంచి వెలుపలికి బయలుదేరాడు.

మందిర ద్వారాన్ని సమీపిస్తుండగా... చిన్న కంఠంతో అతన్ని వెనక్కి పిలిచాడు శివకేశవ చంద్రుడు.

"ఏమైనా చెప్పదలచుకున్నారా ప్రభూ?" వినయంగా అడిగాడు వైద్యుడు.

"సంపంగి నగరానికి పంపించే మనిషికి చెప్పండి. వచ్చేటప్పుడు ఆ బాలకుడి చిత్రం ఏదైనా లభిస్తే వెంట తీసుకురమ్మనమని" అస్పష్టంగా చెప్పాడు ప్రభువు.

చిన్న నవ్వొకటి వైద్యుడి పెదవులమీద ప్రత్యక్షమై వెంటనే మాయమై పోయింది. "తప్పకుండా చెప్పి పంపుతాను ప్రభూ... ఆ పని కూడా అత్యంత ముఖ్యమని వివరిస్తాను" అంటూ వెనుతిరిగాడు.

❖ ❖ ❖

సుగంధి నగరం ఎలా వుంటుందో చూడటానికి వచ్చిన వారు కడుపులోని చల్ల కదలకుండా సత్రంలోనే కూర్చుని వుండటం లేనిపోని అనుమానాలకు తావు ఇస్తుందని వాసుదేవుడికి తెలుసు.

అశ్వశాలలో వున్న వాహనం మీద ఎక్కడికో అత్యవసరంగా వెళ్ళిన సత్రం మనిషి తిరిగి వచ్చేంతవరకూ అరుగుమీదనే కూర్చున్నాడు అతను.

సూర్యుడు నడిమింటికి చేరుకుంటున్న సమయంలో తిరిగి వచ్చాడు అతను. అరుగుమీది పరదేశిని చూసి సాదరంగా నవ్వి, తన పనులలో తను పూర్తిగా నిమగ్నుడైపోయాడు.

తాను అతనికి చెప్పిన విషయాలు అప్పటికప్పుడు ఏదో ఒక ప్రమాదాన్ని తెచ్చిపెట్టే సూచనలు కనిపిస్తే, వెంటనే అక్కడినించి తప్పుకోవటానికి సిద్ధపడే వున్నాడు వాసుదేవుడు. అటువంటి చిహ్నాలు ఏవీ కనిపించకపోవటంతో నెమ్మదిగా అతని దగ్గరికి పోయాడు.

"నగరంలోకి అడుగు పెట్టీ పెట్టగానే నాలాంటివాళ్ళు వెంటనే దర్శించ వలసిన ప్రదేశాలు ఏమున్నాయో చెప్పగలరా?" అని అడిగాడు.

"రాజభవనానికి సమీపంలో నిర్మించబడిన శివకేశవాలయం చాలా అందంగా వుంటుంది. ముందుగా వెళ్లి ఆ దేవుడికి నమస్కారం పెట్టుకోవాలి. ఆ తరువాత దాని వెనుక భాగంలో వున్న రాజోద్యానవనం. ఈ చుట్టుపట్ల లభించే పుష్పజాతులన్నీ పెంచబడుతున్నాయి అక్కడ" వివరంగా చెప్పాడు సత్రం మనిషి.

అతనికి కృతజ్ఞతలు తెలియచేసుకుని, నెమ్మదిగా వీధిలోకి వచ్చాడు వాసుదేవుడు.

సరిగ్గా అప్పుడే తన అశ్వాన్ని నడిపించుకుంటూ వస్తున్న సైనికుడు అతనికి కనిపించాడు.

"దారికి అడ్డుగా పడిన ఆ రాతిబండ చూడటానికి చిన్నదిగానే వున్నా పూర్తిగా పగలగొట్టేసరికి మా ప్రాణాల మీదికి వచ్చింది. అందుకే బాగా ఆలస్యం అయింది. ఇదిగో మీ వాహనం" అంటూ కళ్ళేలను అతనికి అప్పగించి, కట్టుకొయ్య దగ్గరే నిలబడి వున్న తన వాహనాన్ని తీసుకుని నగర ద్వారాల దగ్గరికి వెళ్ళిపోయాడు.

అలసిపోయినట్లు కనిపిస్తున్న తన వాహనాన్ని తీసుకుపోయి అశ్వశాలలో వదిలాడు వాసుదేవుడు. తిరిగి వీధికేసి బయలుదేరబోతుండగా అతని చెవులకు చేరింది శృంగ నాదం.

"తప్పుకోండి... ప్రజలందరూ వీధిలో నుంచి పక్కకు తప్పుకోండి. శివకేశవ చంద్ర ప్రభువుల వారికి అభిమాన పాత్రుడైన భద్రేశ్వరుల వారు వస్తున్నారు. తప్పుకోండి" అని హెచ్చరికలు చేస్తూ అతివేగంగా అశ్వాల మీద వచ్చారు పదిమంది రాజభటులు.

వీధిలోకి పోబోయి, మధ్యలోనే ఆగిపోయిన వాసుదేవుడిని చూసి చిన్నగా నవ్వాడు పరుగులాంటి నడకతో బయటికి వచ్చిన సత్రం నిర్వాహకుడు.

"శివకేశవ చంద్ర ప్రభువుల రెండవ కుమార్తెకు అల్లుడు భద్రేశ్వరుడు. మా ప్రభువుల తరువాత సింహాసనాన్ని అధిష్టించే అదృష్టవంతుడని అందరూ అనుకుంటూ వుంటారు" వాసుదేవుడు అడగకముందే వివరంగా చెప్పాడు.

"అల్లుడు సింహాసనాన్ని అధిష్ఠించటమా? మరి మీ సాంప్రదాయం...." అంటూ" సత్రం నిర్వాహకుడు తల అడ్డం తిప్పటంతో ఆగిపోయాడు వాసుదేవుడు.

"పెద్దగా మాట్లాడటం మంచిది కాదు. సాంప్రదాయం ప్రకారం నువ్వు చెప్పిన సుబోధుడి మనవడే సింహాసనానికి వారసుడు. కాని దేశాన్ని వదిలి పారిపోవటం వల్ల పెద్దకుమార్తె సంతానం అర్హత కోల్పోయిందని కొంతమంది అనుకుంటున్నారు. ఏది ఏమయినా అది ఇప్పుడిప్పుడే తేలిపోయే విషయం కాదు. మా శివకేశవ చంద్ర ప్రభువులు ఇంకో పది పన్నెండు సంవత్సరాలు హాయిగా పరిపాలన కొనసాగించగలరు" అన్నాడు సత్రం మనిషి.

అతని మాటలు ముగుస్తూ వుండగానే, పదిమంది అంగరక్షకులు వెన్నంటి వస్తుండగా బలిష్టమైన అశ్వాన్ని అధిరోహించి, సత్రం సమీపంలోకి వచ్చాడు భద్రేశ్వరుడు.

పెద్ద పెద్ద అంగలు వేస్తూ వీధి మధ్యకు పోయి అతనికి తలవంచి నమస్కరించాడు సత్రం నిర్వాహకుడు.

"ఇందాక నువ్వు రాజమందిరం దగ్గరికి వచ్చావని తెలిసింది. ప్రభువులతో మాట్లాడావని కూడా తెలిసింది. ఏమిటో విషయం?" తన అశ్వాన్ని ఆపి గంభీరంగా అడిగాడు అతన్ని భద్రేశ్వరుడు.

సత్రం మనిషి ఏం మాట్లాడబోతాడో వినటానికి చెవులు రిక్కించాడు వాసుదేవుడు.

భద్రేశ్వరుడే గనుక నిజంగా సౌగంధ సింహాసనాన్ని ఆశిస్తూ వుండి వుంటే, సత్రం మనిషితో తను మాట్లాడిన మాటలు అతనికి ఆగ్రహాన్ని కలిగిస్తాయి.

సత్రం మనిషిని శిక్షించే ఆలోచన చేయవచ్చు. అతనితోపాటు తననుకూడా శిక్షించమని ఆజ్ఞలు ఇవ్వవచ్చు.

"ఇతనే ప్రభూ... సంపంగి నగరం నుంచి వచ్చిన యాత్రికుడు ఇతనే" వాసుదేవుడి వైపు చేయి చూపిస్తూ చెప్పాడు సత్రం మనిషి.

"మన సింహాసనానికి ద్రోహం చేసిన సుబోధుడి గురించి కొన్ని విచిత్రమైన మాటలు చెప్పాడు. వాటిని వెంటనే ప్రభువులకు తెలియచేయటం మంచిదని నిశ్చయించుకుని రాజభవనం దగ్గరికి వచ్చాను" తడుముకోలేదు. తడబడలేదు. ధారాళంగా చెప్పేశాడు.

"ఏమిటో ఆ విచిత్రమైన మాటలు?" వాసుదేవుడి వైపు చూస్తూ విలాసంగా అడిగాడు భద్రేశ్వరుడు.

సత్రం మనిషి తెలివితేటలకు మనసులోనే మెచ్చుకోకుండా వుండలేక పోయాడు వాసుదేవుడు. 'తెలివిగా తను తప్పించుకుని నేర్పుగా తనను ఇరికించాడు. అతనికి తను చెప్పిన ఆ విచిత్రమైన మాటలు ఇప్పుడు వెంటనే భద్రేశ్వరుడికి వినిపించకపోతే తన వీపు వాచిపోవడం తప్పనిసరి.'

"మాట్లాడవేమిటి? ఏమని చెప్పావు నువ్వు?" ఉన్నట్లుండి భద్రేశ్వరుడు కరుకుగా ప్రశ్నించటంతో అంతం అయిపోయాయి అతని ఆలోచనలు.

"నడివీథిలో నిలబడి తమవంటి ప్రభువులతో మాట్లాడటం మర్యాదగా వుండదు ప్రభూ... దయచేసి లోపలికి దయచేయండి. వివరంగా చెపుతాను" ఒక అడుగు ముందుకు వేసి నమస్కరిస్తూ అన్నాడు.

ఛెంగున అశ్వం దిగాడు భద్రేశ్వరుడు. పెద్ద పెద్ద అడుగులు వేస్తూ సత్రం లోపలికి పోయాడు.

"క్షమించాలి పరదేశీ... నోటికి వచ్చినది వాగేశాను. తలవూపి వెళ్ళి పోతాడని అనుకున్నాను. పట్టుదలగా ప్రశ్నలు వేస్తాడని అనుకోలేదు" భయం నిండిన కంఠంతో వాసుదేవుడితో అన్నాడు సత్రం నిర్వాహకుడు.

"నువ్వు మీ ప్రభువుతో మాట్లాడింది ఇతనికి తెలిస్తే ఏమవుతుంది?" అడిగాడు వాసుదేవుడు.

అంతకుముందు అతని మనసులో మెదిలిన మాటలే తిరిగి ఇప్పుడు సత్రం మనిషి నోటివెంట బయటికి వచ్చాయి.

"సుబోధుడి గురించి మంచి మాటలు ఏమైనా బయటికి వస్తే భరించలేడు. మా ప్రభువు మనసు మార్చుకుని అతన్ని క్షమించేస్తాడని భయం... తనకు సింహాసనం దక్కకుండా పోతుందని భయం" ఎవరికీ వినబడకుండా చిన్న కంఠంతో చెప్పి, పరుగులాంటి నడకతో తనుకూడా లోపలికి పోయాడతను.

ఉన్నతమైన ఆసనాన్ని ఒకదాన్ని తెచ్చి భద్రేశ్వరుడిని అందులో కూర్చోబెట్టారు అతని అంగరక్షకులు.

"ఇప్పుడు చెప్పు" కాలుమీద కాలు వేసుకుంటూ ఠీవిగా వాసుదేవుడిని అడిగాడు భద్రేశ్వరుడు.

"సుబోధుడు తమ దేశంలోనే వున్నాడనే సంగతి బయటికి పొక్కకుండా చాలా జాగ్రత్తలు తీసుకున్నాడు సంపంగి పాలకుడైన సాగరుడు. కాని ఈ మధ్య శిఖావంతుడి గూఢచారులు కొందరు ఆ రహస్యాన్ని కనిపెట్టారు."

శిఖావంతుడి మనష్యులు అక్కడికి వచ్చి తమ వాదనల్ని ఏ విధంగా మొదలుపెట్టి వుంటారో ఊహిస్తూ చెప్పాడు వాసుదేవుడు.

గంభీరంగా తలవూపాడు భద్రేశ్వరుడు. "ఇందులో విచిత్రం ఏముంది?" సత్రం మనిషిని చూస్తూ అడిగాడు.

అంతకుముందు ఎంతో తెలివిగా మాట్లాడిన ఆ మనిషి మొఖం రక్తం లేనట్లు పాలిపోవడం వాసుదేవుడికి అగుపించింది.

"శిఖావంతుడి భల్లూక సైన్యాన్ని ఓడించి సంపంగి నగరాన్ని తిరిగి స్వాధీనం చేసుకున్న తరువాత సుబోధుడి గుట్టు రట్టు అయిన సంగతి సాగరుడికి తెలిసింది. వెంటనే అతను ఎవరూ ఊహించని ఒకపని చేశాడు. సుబోధుడికి మారువేషం వేయించి శిఖావంతుడి రెండవ రాజధాని ప్రచోద నగరానికి పంపించాడు. యుద్ధం ముగిసిపోయే వరకూ తనను అక్కడే వుండమని ఆజ్ఞ ఇచ్చాడు" అంతకుముందు సత్రం మనిషి ఎలా తడుము కోకుండా మాట్లాడాడో అదేవిధంగా తనుకూడా చాలా మెత్తగా, వేగంగా చెప్పేశాడు.

భద్రేశ్వరుడి వదనంలో వెంటనే ప్రత్యక్షం అయింది ఆశ్చర్యం. "సుబోధుడు ఇప్పుడు ప్రచోద నగరంలోనే వున్నాడా?" అని అడిగాడు.

అటూ ఇటూ చూసి, తాను చెప్తున్న మాటలు ఎవరికీ వినబడకూడ దన్నట్లు గొంతును బాగా తగ్గించి, ప్రచోద నగరంలో ఒక వీధిపేరు చెప్పాడు వాసుదేవుడు. ఆ వీధిలో వున్న ఒక చిన్న భవంతిని వర్ణించాడు.

"సుకేతుడని పేరు పెట్టుకుని ఆ భవంతిలోనే వుంటాడు సుబోధుడు. ఈ నిర్వాహకుడికి నేను చెప్పిన మాటలు ఇవే" అన్నాడు.

"నువ్వు ఇక్కడికి ఎందుకు వచ్చావు?" అడిగాడు భద్రేశ్వరుడు.

ఆ ప్రశ్న తప్పకుండా వేయబడుతుందని ముందుగానే ఊహించటం వల్ల అప్పుడు కూడా తడుముకోలేదు వాసుదేవుడు.

"సుబోధుడిని ప్రచోద నగరం తీసుకుపోయిన భటుల్లో ఒకతను నాకు బాగా కావల్సినవాడు. అక్కడికి వెళ్ళివచ్చిన తర్వాత ఒకరోజు మదిరాపానం చేసి ఆ మత్తులో ఈ సంగతి నాకు చెప్పాడు. సౌగంధీ పాలకులకు ఈ విషయాన్ని చెపితే నాకు ఏదైనా బహుమతి లభిస్తుందన్న ఆశతో ఈ నగరాన్ని చూసేందుకు వచ్చిన పరదేశిలా నగర ప్రవేశం చేశాను" అన్నాడు వాసుదేవుడు.

"ఇతను నీకు చెప్పాడు. నువ్వు ప్రభువులకు చెప్పావు? బహుమతి ఇచ్చావా?" చటుక్కున సత్రం మనిషికేసి తిరుగుతూ అడిగాడు భద్రేశ్వరుడు.

సత్రం నిర్వాహకుడు నోరు తెరవకముందే మళ్ళీ తనే మాట్లాడాడు వాసుదేవుడు. "చెప్పాలనే వెళ్ళాడు. అర్థఘడియపాటు బొమ్మ మాదిరి ప్రభువుల సమక్షంలో నిలబడ్డాడు. ఒక్కమాట కూడా మాట్లాడకుండా వచ్చేశాడు" అన్నాడు.

అతను అందించిన మాటల్ని వెంటనే అందిపుచ్చుకుని, దీర్ఘంగా నిట్టూర్చాడు సత్రం నిర్వాహకుడు. "నేను వెళ్ళిన సమయానికి ప్రభువుల దగ్గరికి మన ఆస్థాన వైద్యశిఖామణి కూడా వచ్చారు. ప్రభువులకు ఉద్రేకాన్ని కలిగించే మాటలేమీ మాట్లాడవద్దని హెచ్చరించారు. నోరు మూసుకుని వచ్చేశాను" అన్నాడు గబగబా.

"నిజమే... సబోధుడు మారువేషంలో మరోచోటికి పారిపోయాడని తెలిస్తే ప్రభువులకు ఉద్రేకం కలుగుతుంది. మళ్ళీ ఎప్పుడు వెళ్లి చెప్పాలని అనుకుంటున్నావు?" అన్నాడు భద్రేశ్వరుడు.

"తమరికి తెలియచేసిన తరువాత పనికట్టుకుని ప్రభువులకు చెప్పవలసిన అవసరం ఏముంది? తమరు సర్వసమర్థులు" సత్రం మనిషి నోరు తెరువకముందే తను కల్పించుకున్నాడు వాసుదేవుడు.

చిన్ననవ్వు ఒకటి తళుక్కున భద్రేశ్వరుడి మొఖంలో మెరిసి వెంటనే మాయమైపోయింది.

"ప్రభువులకే కాదు... నగరంలో ఇంకెవరికీ ఈ మాటలు తెలియనీయకు... ఇంతటితో మర్చిపోవాలి" అంటూ ఆసనంలో నుంచి లేచాడు.

ఎప్పుడు ఏ క్షణంలో అతను ఎటువంటి ప్రశ్న వేస్తాడోనన్న అనుమానంతో ఊపిరి బిగపట్టి నిలుచుని వున్న వాసుదేవుడికి గుండెలమీదినించి కొండంత బరువు దిగిపోయిన అనుభూతి కలిగింది.

"ప్రభువులు సూక్ష్మగ్రాహులు. ధర్మదాతలు" చేతులు నులుముకుంటూ చిన్నగా గొణిగాడు.

తన వెనుక వున్న ఒక అంగరక్షకుడికి సైగ చేశాడు భద్రేశ్వరుడు. గలగలలాడుతున్న నాణేల మూటలో నుంచి పది బంగారు నాణేలను ఎంచి వాసుదేవుడి చేతిలో పెట్టాడు ఆ అంగరక్షకుడు. పక్కనే వున్న సత్రం నిర్వాహకుడికి మూడునాణేలు ఇచ్చాడు.

సంతోషం అధికం అయిపోయినట్లు తలలు వంచి అభివాదం చేశారు వారిద్దరూ. అంగరక్షకులు వెనుకగా వీధిలోకి వచ్చి భద్రేశ్వరుడిని సాగనంపారు.

"నువ్వు ఎవరివి మిత్రమా?" భద్రేశ్వరుడు దృష్టిపథం నుంచి దూరం అయిపోయేదాకా ఆగి, వాసుదేవుడిని అడిగాడు సత్రం నిర్వాహకుడు.

"నేను పరదేశిని. సంపంగి నగరం నుంచి" అంటూ తన చరిత్రను మరోసారి మొదలుపెట్టబోయిన అతన్ని వెంటనే ఆపేశాడు.

"సామాన్యులకు ఎవరికీ ఇంత వేగంగా ఆలోచించే శక్తి వుండదు. అవతలి మనిషి మొఖంలోని భావాలను చూసి అతనికి నచ్చే సమాధానాలకు అప్పటికప్పుడు సిద్ధం చేసుకునే తెలివి ఎవరో అతికొద్దిమందికి మాత్రమే వుంటుంది. ఆ కొద్దిమంది కూడా ప్రత్యేకంగా శిక్షణ పొందినవారే అయివుంటారు" వాసుదేవుడి మొఖంలోకి సూటిగా చూస్తూ అన్నాడు.

"ఆ శిక్షణ ఏదో నువ్వు కూడా పొంది వున్నట్లు నాకు అనిపిస్తోంది. సౌగంధి పాలకులకు యుద్ధాలంటే ఇష్టం వుండదు. మరి గూఢచారులతో అవసరం ఎందుకు?" నవ్వుతూ అడిగాడు వాసుదేవుడు.

"యుద్ధాలంటే ఇష్టం వుండనంత మాత్రాన దేశంలో శాంతిభద్రతల్ని పరివేక్షించుకోవలసిన అవసరంలేదని అనుకుంటున్నావా? ఈ భద్రేశ్వరుడి వంటి స్వార్థపరుల్ని ఒక కంట కనిపెట్టుకుని వుండాలంటే ఎవరో ఒకరు శిక్షణ పొంది తీరవలసిందే కదా!" తనుకూడా నవ్వుతూ చెప్పాడు సత్రం నిర్వాహకుడు.

"నన్ను వాసుదేవుడు అంటారు" అన్నాడు వాసుదేవుడు.

వెనుకనుంచి ఎవరో తన వెన్నుమీద చరచినట్లు ఉలిక్కిపడ్డాడు సత్రం నిర్వాహకుడు. చెయ్యిపట్టుకుని గబగబా ఒక మందిరంలోకి తీసుకుపోయి మందిరం తలుపుల్ని గట్టిగా మూశాడు.

"ఎందుకు వచ్చాము మనం ఇక్కడికి?" ఆశ్చర్యంగా అడిగాడు వాసుదేవుడు.

రెండు అడుగులు వెనక్కి వేసి అమాంతంగా వాసుదేవుడి పాదాలముందు బోర్లా పడి, అతని పాదాలను కనులకు అద్దుకున్నాడు సత్రం మనిషి.

"ఎంతో అదృష్టం చేసుకున్న వారికి తప్ప గూఢచారి వాసుదేవుల వారి దర్శనం లభించదని అందరూ అనుకుంటారు. నేను నిజంగానే అదృష్టవంతుడిని" అంటూ లేచి నిలబడి మరోసారి నమస్కరించాడు.

జ్వలిత సామ్రాజ్యం చుట్టుపట్ల వుండే రాజ్యాల్లో తనకు వున్న పేరు ప్రఖ్యాతులు ఎటువంటివో తెలుసు వాసుదేవుడికి. కాని ఇప్పుడు ఆ సత్రం మనిషి మాటల్ని వినేసరికి చలిగాలి వీచినట్లు జలదరించింది అతని శరీరం.

తనకున్న పేరు ప్రతిష్టలకు తగినట్లు ఎటువంటి సమస్యకైనా న్యాయబద్ధమైన పరిష్కారం సూచించగల సమవర్తిగా తనను భావిస్తే కొంపలు అంటుకుంటాయి. శివుడి వారసత్వ విషయాన్ని సంపంగి నగరానికి అనుకూలంగా మార్చటం కోసం తను ప్రయత్నిస్తున్నట్టు తెలిసిన తర్వాత మటుమాయమై పోతుంది అభిమానం. మెచ్చుకోలు మాటలు మాట్లాడిన ఆ నోటితోనే దూషణలు ప్రారంభం కావచ్చు

వాసుదేవుడి ఆలోచనలు పూర్తికాకముందే టకటకమని మ్రోతలు చేశాయి మూసివున్న ఆ మందిరం తలుపులు.

"ఎవరది? ఎవరు తలుపుల దగ్గర?" తీవ్రస్వరంతో బిగ్గరగా అడిగాడు సత్రం నిర్వాహకుడు.

"భద్రేశ్వరు లవారి అనుచరులు వస్తున్నారు..." ఒక తలుపును ఓరగా తెరుస్తూ చెప్పాడు అతని క్రింద పనిచేసే సేవకుడు ఒకతను.

"భద్రేశ్వరుల వారి అనుచరులా? ఆయనే స్వయంగా వచ్చివెళ్ళిన తర్వాత వీళ్ళు రావటం ఏమిటి?" ఆశ్చర్యంగా తనలో తనే మాట్లాడుకుంటూ మందిరం వెలుపలికి పోబోయాడు సత్రం మనిషి.

"నువ్వు గూఢచారి దళానికి చెందిన మనిషివని భద్రేశ్వరునికి తెలుసా?" అడిగాడు వాసుదేవుడు.

"ఒక్క శివకేశవ చంద్ర ప్రభువులకు మాత్రమే తెలుసు. వేరెవ్వరికీ తెలియదు. అందరూ సత్రం నిర్వాహకుడినే అనుకుంటూ వుంటారు" అయోమయంగా చూస్తూ చెప్పాడు సత్రం మనిషి.

చటుక్కున అతని చేతిని పట్టుకుని, ఆ మందిరం వెనుక భాగంలో వున్న ఇంకో ద్వారం దగ్గరికి పరిగెత్తించాడు వాసుదేవుడు.

"భద్రేశ్వరుడు మన మాటల్ని గురించి లోతుగా ఆలోచించి వుండటం జరిగి వుంటుంది. నువ్వు మీ ప్రభువుల వారి దగ్గరికి వెళ్ళి ఏమీ మాట్లాడకుండా వచ్చావని మనం చెప్పింది అసత్యమని తెలిసిపోయి వుంటుంది" అంటూ ఆ వెనుక ద్వారంలో నుంచి సత్రం వెనుక భాగంలో కనిపించిన చిన్న పూతోటలోకి పరిగెత్తాడు.

"భద్రేశ్వరుడికి అన్ని తెలివితేటలు లేవు. మనం అనవసరంగా భయపడు తున్నామనిపిస్తోంది" అంటూ అతని చేతుల్ని వదిలించుకుని మళ్ళీ భవనంలోకి బయలుదేరబోయాడు సత్రం మనిషి.

సరిగ్గా అప్పుడే వినవచ్చింది ఉరుము వంటి ఆ కంఠం. "వెతకండి... మొత్తం మందిరాలన్నిటినీ వెతకండి. నిర్వాహకుడితో పాటు సంపంగినించి వచ్చిన ఆ పరదేశిని కూడా పట్టుకోవాలి... వెతకండి" అంటూ.

నిశ్చేష్టుడై నిలబడిపోయిన సత్రం మనిషి చేతిని మరోసారి పట్టుకుని మరింత వేగంగా ఆ తోట చివరి భాగంలోకి పరిగెత్తాడు వాసుదేవుడు. అడ్డుగా ప్రత్యక్షం అయిన ఆవరణ గోడమీదినించి అవతలి పక్కకు దూకి, వెనుక వున్న సత్రం మనిషికి సహాయం చెయ్యడం కోసం ఒక్క క్షణికం పాటు ఆగాడు.

అదే అతను చేసిన తప్పు. ఆగకుండా గోడని అధిగమించిన మరుక్షణం మరింత వేగంతో పరుగుతీసి వున్నట్లయితే తప్పించుకోగలిగి వుండేవాడు చుట్టుముట్టబోతున్న ప్రమాదం నుంచి.

"అడుగో... అడుగడుగో... పారిపోవటానికి ప్రయత్నం చేస్తున్నాడు పట్టుకోండి..." అని అరిచింది గోడకు కొంచెం దూరంలో నుంచి ఇంకో కంఠం.

సత్రం మనిషిని బరబరా గోడమీదినించి క్రిందికి లాగి మహావేగంతో పరుగు మొదలుపెట్టాలనుకుంటున్న వాసుదేవుడిని పూర్తిగా కమ్ముకున్నారు పాతికమంది సైనికులు... బలమైన బరిశెల్ని గుండెలకు ఆనించి కదలకుండా నిలబెట్టేశారు.

❖ ❖ ❖

చీకట్లు కమ్ముకోబోతున్న సమయంలో శివకేశవ చంద్రుల వారి దగ్గరికి వచ్చి ఒక వెదురుగొట్టాన్ని అందించాడు ద్వారం దగ్గర కావలి వుండే సేవకుడు.

"మన భవన ద్వారం దగ్గర పడేటట్లు ఎవరో విసిరారు ప్రభూ... విసిరింది ఎవరో కనిపెట్టటానికి మేము చేసిన ప్రయత్నాలు విఫలం అయ్యాయి. ఇందులో ఏదో లేఖ వుండివుంటుందని భవనరక్షకుడు అనుమానిస్తున్నాడు" అని వివరించాడు.

గట్టిగా ఊపితే గలగలమని శబ్దం చేస్తున్న ఆ వెదురు పరికరం వంక దీక్షగా చూసి, పక్కనే వున్న పిడిబాకుతో రెండుగా చీల్చాడు శివకేశవ చంద్రుడు.

సేవకుడి మాటలు యదార్థమేనని వెంటనే తేలిపోయింది. సన్నపాటి తాటియాకు మీద లిఖించబడి వున్నాయి కొన్ని అక్షరాలు.

తన ఆసనం పక్కనే వున్న దీపం వెలుగులో వాటిని పరిశీలనగా చూశాడు శివకేశవ చంద్రుడు.

"మీ వారసుడిని గురించి పూర్తి వివరాలు తెలుసుకోదలచుకుంటే ఓపిక చేసుకుని ఎవరికీ తెలియకుండా రహస్యంగా శివకేశవాలయం వెనుక వున్న తోటలోకి రెండవఝాములో రావాలి. సంపంగి నగరం నుంచి వచ్చిన పరదేశిని. నేను బహిరంగంగా మిమ్మల్ని కలుసుకోవడం ప్రమాదకరమని భావించి ఈ లేఖను వ్రాస్తున్నాను."

ధవళ వర్ణాన్ని సంతరించుకుని వున్న మీసాలను సవరించుకుంటూ దీర్ఘంగా ఆలోచించాడు శివకేశవ చంద్రుడు. ప్రక్కనే వున్న జేగంటను మ్రోగించి, "వైద్యుల వారిని వెంటనే రమ్మని చెప్పండి" అని లోపలికి తొంగి చూసిన సేవకుడికి ఆజ్ఞ ఇచ్చాడు.

ఒక ఘడియ తరువాత ఔషధాల సంచిని గట్టిగా పట్టుకుని పరుగులాంటి నడకతో వచ్చాడు వైద్య శిఖామణి.

"మీకు అప్పచెప్పిన పనిని పూర్తిచేశారా?" వెంటనే అడిగాడు ప్రభువు.

"కొంచెం సమయం అవసరమని విన్నవించుకున్నాను గదా... నా ఆలోచన ఏమిటంటే నగర ద్వారాల దగ్గర వున్న సత్రం నిర్వాహకుడినే..." అంటూ మాటల్ని ఆపాడు వైద్యుడు ప్రభువు చిన్నగా నవ్వేసరికి.

"ఎందుకు నవ్వుతారు ప్రభూ?" ఆశ్చర్యంగా అడిగాడు.

"మన నగరంలో మా వారసుడిని గురించి మనకంటే ఎక్కువగా ఆలోచించేవాళ్ళు ఎవరో వున్నారు. బహుశా మనం మాట్లాడుకున్నది ఏమిటో వారికి తెలిసివుండవచ్చు" అంటూ వెదురు పరికరంలో నుంచి వెలువడిన లేఖను అతనికి అందించాడు శివకేశవ చంద్రుడు.

పైనుంచి క్రిందిదాకా ఒకటికి రెండుసార్లు చదివి గాఢంగా నిట్టూర్చాడు వైద్యుడు. "ఒంటరిగా వెళ్ళటమనే మాట ఎందుకనో నాకు నచ్చటంలేదు. వెంట నేనుకూడా వస్తాను. మన వెనుక ఇంకా కొంతమంది సైనికుల్ని కూడా తీసుకుపోదాము" అన్నాడు.

"తను సూచించిన పద్ధతికి విరుద్ధంగా ప్రవర్తిస్తే లేఖ వ్రాసిన మనిషి మనకి కనిపించకపోవచ్చు. అసలు ఈ ఎత్తుగడ ఏమిటో మనం తెలుసుకోవాలి. భవిష్యత్తులో తిరిగి ఇటువంటివి జరుగకుండా జాగ్రత్త పడాలంటే ఇందులో వ్రాయబడినట్లు చేసి తీరాలి" సాలోచనగా అన్నాడు ప్రభువు.

"ప్రభూ... తమరికి గతంలో వున్న ఓపిక ఇప్పుడు లేదు. తోటలో ఏదైనా గడబిడ జరిగితే తట్టుకోవటానికి తగిన సామర్థ్యం మీలో లోపించింది. దయచేసి నామాట వినాలి" వేడుకోలుగా అన్నాడు వైద్యుడు.

"నా సామర్థ్యం లోపించిందన్న సంగతి మీకు తెలుసు. అవసరం అయితే ఏదో ఒక ఔషధాన్ని ఇచ్చి కాపాడేందుకు మిమ్మల్ని పిలిపించాను. మొదటి ఝామున పూర్తి అవగానే మనం తోటలోకి పోతున్నాము" అన్నాడు ప్రభువు.

"మీరు మందిరాన్ని వదిలి ఒక్క అడుగు అవతలికి వేసినా అందరికీ తెలిసిపోతుంది. రహస్యంగా వెళ్ళడం ఎలా సాధ్యం?" అడిగాడు వైద్యుడు.

జేగంటను మరోసారి గట్టిగా మ్రోగించాడు ప్రభువు..." మేము వైద్యుల వారితో ఏకాంతంగా చాలామాటలు మాట్లాడాలి. తిరిగి పిలిచేవరకూ ఎట్టి పరిస్థితిలోనూ మమ్మల్ని పలుకరించవద్దు" అని ఆజ్ఞ ఇచ్చాడు లోపలికి వచ్చిన సేవకుడికి.

వినయంగా తలవూపి, అంతవరకూ ఓరగా వేసి వున్న తలుపుల్ని గట్టిగా మూసి బయటివైపు గడియపెట్టాడు ఆ వ్యక్తి.

"మొదటి ఝాము గడిచిపోబోతున్నది. ఓపికగా నడవటానికి ఏదైనా ఔషధం ఇస్తారా?" ఆసనంలో నుంచి లేచి, ఒక పక్కగా పెట్టివున్న తన ఖడ్గాన్ని అందుకుంటూ అడిగాడు శివకేశవ చంద్రుడు.

మందుల సంచిలో నుంచి ఒక చిన్నపెట్టెను తీసి అందులో వున్న ఒక చిన్న గుళికను ఆయన చేతికి అందించాడు వైద్యుడు. "అర్ధఘడియ వరకు మిమ్మల్ని వేగంగా నడిపిస్తుంది. ఆ తరువాత మాత్రం విపరీతమైన నీరసం వచ్చేస్తుంది" అన్నాడు.

మారు మాట్లాడకుండా ఆ గుళికను నోటిలో వేసుకుని, అంతవరకూ తను కూర్చుని వున్న ఆసనం వెనుక భాగంలో వున్న ఒక మీటను బలంగా అదిమాడు శివకేశవ చంద్రుడు.

చిన్న చిన్న ప్రకంపనల్ని వెలువరిస్తూ పక్కకు జరిగింది ఆ మందిరం చివరి భాగంలో వున్న ఒక గోడ. ఇద్దరు మనుష్యులు ఒకేసారి ప్రవేశించటానికి వీలుగా వున్న ద్వారం ఆ ప్రదేశంలో ప్రత్యక్షం అయింది.

వైద్యుడు వెనుక నడుస్తుండగా ఆ ద్వారంలో నుంచి సన్నపాటి సొరంగంలోకి అడుగుపెట్టాడు శివకేశవ చంద్రుడు.

వెంటనే జరిగి వారు అధిగమించిన ద్వారాన్ని మూసివేసింది పక్కకు జరిగిన గోడ. "ఎన్నోమార్లు ఈ మార్గం ద్వారా ఆలయం వెనుక వున్న తోటలోకి పోయి వచ్చేవాళ్ళం మేము. అందువల్ల మాకు వెలుగుతో నిమిత్తం లేదు. ఈ దారి మీకు తెలియదు. కాబట్టి కొంచెం జాగ్రత్తగా నడవండి" వెనుక వున్న వైద్యుడిని హెచ్చరిస్తూ ముందుకు నడిచాడు ప్రభువు.

వెంటనే ఒక అనుమానం వైద్యుడి మనసులోకి అడుగుపెట్టింది. "మీకు కాకుండా ఈ మార్గం గురించి ఇంకా ఎవరెవరికి తెలుసు ప్రభూ?" అని అడిగాడు.

"మా అమ్మాయిలకు అందరికీ తెలుసు. వారి సంతానానికి తెలుసు" అన్నాడు ప్రభువు.

ఆపైన మరేమీ మాట్లాడలేదు వైద్యుడు. మౌనంగా నడిచాడు.

పావు ఘడియ తరువాత ఆలయం వెనుక భాగంలోని ఆవరణ గోడలో వున్న ఒక రహస్య ద్వారాన్ని తెరిచి తోటలోకి అడుగుపెట్టారు ఇద్దరూ.

పదే పది అడుగులు వేశారు. పదకొండో అడుగు వేయకముందే చేపల వల మాదిరి విప్పారుకుని వచ్చి వారి తలల మీదపడింది ఒక మందపాటి వస్త్రం.

తన చేతిలోని ఖడ్గంతో ఆ వస్త్రాన్ని ఛిన్నాభిన్నం చేయటానికి ప్రయత్నించాడు శివకేశవ చంద్రుడు. ఆ ప్రయత్నం ఫలించకముందే తలమీద పడింది బలమైన దెబ్బ ఒకటి.

బాధగా శబ్దం చేసి క్రిందికి వాలిపోయాడాయన. పడిపోకుండా పట్టుకోవటానికి ప్రయత్నం చేయబోయిన వైద్యుడి తలమీద కూడా పడింది అటువంటి దెబ్బే మరొకటి. కనుల ముందు మెరుపులు ప్రత్యక్షం అవుతుండగా తనుకూడా నేలకూలిపోయాడతను.

❖ ❖ ❖

"సౌగంధి నుంచి వర్తమానం ఏదైనా వచ్చిందా?" యుద్ధం మొదలైన ఏడవ రోజు సూర్యోదయం కాకముందే తన శిబిరంలో నుంచి వెలుపలికి వస్తూ ఒక సేనాధిపతిని ప్రశ్నించాడు శిఖావంతుడు.

"ఇంతవరకూ ఏమీ రాలేదు ప్రభూ..." విన్నవించుకున్నాడు అతను.

"సంపంగి నగరం మీద సౌగంధీయులు దాడి చేయబోతున్నారన్న మాట బయటికి వస్తే తప్ప ఈ సాగరుడి వేగం అణిగిపోదు. ఆలస్యం అయిన కొద్దీ మనకి నష్టం చాలా అధికం అయిపోతున్నది. సంపంగి గజబలాన్ని చూస్తే చెమటలు పట్టేస్తున్నాయి మన సైనికులకు" కనులు చిట్లిస్తూ అన్నాడు శిఖావంతుడు.

"మాలో ఎవరినైనా సౌగంధి నగరానికి వెళ్ళి రమ్మంటారా?" వినయంగా అడిగాడు ఆ సేనాపతి.

"అక్కడినించి వర్తమానం ఏదైనా వస్తూవుంటే మీరు వెళ్ళినా వెళ్ళకపోయినా వచ్చేస్తుంది. మరో రెండు దినాలు ఆగుదాము" అంటూ వెనుతిరిగి శిబిరంలోకి వెళ్లబోయాడు శిఖావంతుడు.

తన ప్రశ్నలకు సమాధానం ఇచ్చిన తరువాత ఆ సేనాపతి అవతలికి వెళ్ళిపోకుండా అక్కడే నిలబడి వుండటం కనిపించింది అతనికి.

"ఏమైనా చెప్పదలచుకున్నావా?" వెంటనే అడిగాడు.

"ఈ రోజుతో యుద్ధాన్ని పరిసమాప్తం చేస్తానని సాగరుడు చెప్పినట్లుగా మనకి తెలిసింది. యుద్ధం తీవ్రతరం కావచ్చు" నెమ్మదిగా చెప్పాడు సేనాపతి.

పెదవులు బిగించాడు శిఖావంతుడు. యుద్ధాన్ని తీవ్రతరం చేయటమంటే గజదళం విచ్చలవిడిగా తమ మీదికి దూసుకురావటం...

సాగరుడి దృష్టి సైనికుల మీద గాని, సేనాపతుల మీద గాని వుండదు. తనమీద వుంటుంది.

"ఎందుకైనా మంచిది. ప్రభువులు మరి కొంతదూరం వెనక్కిపోయి శిబిరాన్ని ఏర్పాటు చేసుకోవాలి. అవసరం అయితే ఆత్మరక్షణ కోసం ఏదైనా ఎత్తయిన ప్రదేశంలోకి వెళ్ళిపోయేందుకు సిద్ధంగా వుండాలి" అంటూ శిఖావంతుడు తీసుకోవాల్సిన జాగ్రత్తలను చెప్పటం మొదలుపెట్టాడు సేనాపతి.

అతను చెప్పటం పూర్తి కాకముందే చెవులు చిల్లులు పడేటట్లు గుండెలు ఝల్లుమనేటట్లు మోగటం మొదలుపెట్టాయి జ్వలిత సైనికుల దగ్గరి యుద్ధభేరీలు. భూమి కంపించేటట్లు అడుగులు వేస్తూ అల్లంత దూరంలో ప్రత్యక్షం అయ్యాయి సంపంగి ఏనుగులు. భీకరంగా ఘీంకారాలు చేస్తూ శిఖావంతుడి సైనికుల మీద కలబడ్డాయి.

సేనాపతులకు తీరికగా ఆజ్ఞలు ఇచ్చే వ్యవధి శిఖావంతుడికి లభించలేదు. చూస్తూ చూస్తూ వుండగానే ఘోరంగా మారిపోయింది పోరు.

కవచ శిరస్త్రాణాలు ధరించిన జ్వలిత చక్రవర్తి ఆ రోజు రథంమీద కాకుండా ఒక అశ్వం మీద యుద్ధరంగంలోకి వచ్చాడు. వేటుకు రెండు తలలు చొప్పున తెగనరుకుతూ వీరవిహారం చెయ్యడం మొదలుపెట్టాడు.

అరుపులు, కేకలు, ఆర్తనాదాలు, యుద్ధభేరీల మ్రోతలు, కాహళుల చప్పుళ్ళతో దద్దరిల్లిపోవడం మొదలుపెట్టిందా ప్రదేశం.

సూర్యుడు రెండు బారల దూరం ఆకాశంలోకి పైకి లేచిన సమయానికి సడలిపోయింది శిఖావంతుడి బిగువు.

మధ్యాహ్న సమయం దగ్గర పడేసరికి యుద్ధం ప్రారంభం అయిన ప్రదేశాన్ని వదిలి చాలా దూరం వెనక్కి వెళ్ళిపోవాల్సి వచ్చింది.

"ఎక్కడ? శిఖావంతుడెక్కడ? ఏమైపోయాడు?? ఎక్కడ దాక్కున్నాడు?" తన పట్టపు టేనుగు మీద నిఠారుగా నిలబడి చుట్టూ చూస్తూ గుండెలు గుబగుబలాడేటట్లు కేకలు పెడుతున్న సాగరుల వారిని చూసేసరికి ఎందుకో ముంచుకు వచ్చేసింది నీరసం శిఖావంతుడికి.

సంవత్సరాల తరబడి శ్రమపడి తయారుచేసుకున్నాడు సైన్యాన్ని తను. సంపంగి తనకు పట్టుబడితే చక్రవర్తి మహాబలుడు కూడా పట్టుబడినట్లే అని భావించాడు.

చిక్కినట్లే చిక్కి ఒక అనాథ బాలకుడి తెలివితేటల కారణంగా తన చేజారి పోయింది సంపంగి నగరం. ఆలనా పాలనా లేకుండా అడవుల్లో అల్లాడి పోవాల్సిన సాగరుడు తనను పేరుపెట్టి యుద్ధానికి పిలిచేంతటి మొనగాడై పోయాడు.

అంతా ఆ బాలకుడి మూలంగానే జరిగింది. తన ఆశయం అణగారి పోవటానికి వాడే కారకుడు.

"ప్రభూ... వచ్చేస్తున్నాడు సాగరుడు... తమరి దగ్గరికి వస్తున్నాడు" గాయాల పాలైన సేనాపతి ఒకడు పరుగు పరుగున వచ్చి విన్నవించేసరికి తన ఆలోచనల్ని దూరంగా పెట్టుకున్నాడు శిఖావంతుడు.

"ఈరోజు మనకి నష్టం ఎంత?" అస్పష్టంగా అడిగాడు.

"పదాతి దళం పూర్తిగా ఓడి దూరంగా పారిపోయింది. రథాల్లో ఒక్కటికూడా మిగలలేదు. అశ్వికదళం మాత్రం అలా అలా ఆత్మరక్షణ తీసుకుంటోంది" చెప్పాడు ఆ సేనాపతి.

"వెనుతిరిగి వెంటనే మన సరిహద్దుల్లోకి వెళ్ళిపొమ్మని ఆజ్ఞ ఇవ్వండి. ఈ సాగరుడి అంతు చూసిన తర్వాతనే మనం మహాబలుడి మీదికి రావాలి. ఈసారి యుద్ధం మనం సంపంగి మీదనే చేయాలి. సాగరుడిని, ఇతని అనాథ బాలకుడిని ఒకేసారి మట్టుబెట్టి మట్టిలో కలిపేయాలి. తిరోగమించండి" వున్నట్లుండి ఆజ్ఞ ఇచ్చి, తన శిబిరం వెనుక నిలబడి వున్న అశ్వం మీదికి దుమికాడు శిఖావంతుడు. మడమతో అదిలించి అతివేగంగా తమ సరిహద్దుల వైపు పరిగెత్తించాడు తన అశ్వాన్ని.

"అడుగో... అడుగో శిఖావంతుడు. అశ్వం మీద పారిపోతున్నాడు" తనబరిశెతో చూపిస్తూ బిగ్గరిగా అరిచాడు ఒక జ్వలిత సైనికుడు.

పట్టపు టేనుగు కుంభస్తలం మీద బలంగా తట్టి, తన కొమ్ముబూరని బిగ్గరిగా ఊదాడు సాగరులవారు.

దూర దూరంగా నడుస్తున్న గజబలం అంతా దగ్గరి దగ్గరిగా వచ్చేసింది. "కదలండి... శిఖావంతుడి సరిహద్దుల కేసి కదలండి" ఖంగుమంటున్న కంఠంతో ఆజ్ఞ ఇచ్చాడు సాగరులవారు.

దుమ్ముతెరలు దట్టంగా పైకి లేచేటట్టు పెద్ద పెద్ద అడుగులు వేస్తూ కదిలాయి ఏనుగులన్నీ. పాతిక ధనువుల దూరం కూడా పోకముందే, తన అశ్వాన్ని వేగంగా పరిగెత్తిస్తూ వాటి మార్గానికి అడ్డుగా వచ్చాడు చక్రవర్తి మహాబలుడు.

"అడ్డు తప్పుకోండి ప్రభూ... ఈ రోజు శిఖావంతుడి రాజ్యాన్ని సర్వనాశనం చేయవలసిందే" ఉద్రేకం నిండిన కంఠంతో చెప్పాడు సాగరులవారు.

"పారిపోయే పామును పారిపోనీయటమే మంచిది. మొండిగా వెంటపడితే మనకే నష్టం. శిఖావంతుడి పని అయిపోయింది. ఇప్పట్లో వాడు యుద్ధం గురించి ఆలోచించలేడు" అశ్వం దిగి నిలబడుతూ అనునయంగా చెప్పాడు చక్రవర్తి.

"వాడు ఒట్టి కట్లపాము ప్రభూ..." అన్నాడు సాగరులవారు.

"కావచ్చు. కాని కోరలు ఊడిన కట్లపాము. పారిపోతున్న శత్రువుల వెనుక పరుగులు తీసి మన సైనికులు గాని, నీ ఏనుగులు గాని దెబ్బతినటం నాకు ఇష్టంలేదు" ఖచ్చితమైన కంఠంతో చెప్పాడు చక్రవర్తి. చెపుతూనే మంత్రి గుణధాముడికి సైగ చేశాడు.

గుణధాముడు యుద్ధభేరీలను మ్రోగించే వారికి చేయి ఊపాడు. వెంటనే మ్రోగటం మొదలుపెట్టాయి అవి.

"మహాబలి చక్రవర్తికి జయము జయము, సాగరుల వారి గజదళానికి జయము, జయము. జ్వలిత సామ్రాజ్య సైనికులకు మహా విజయము" వేలకొద్దీ కంఠాలు ఒక్కసారిగా నినదించటం మొదలుపెట్టాయి.

కోటగోడల వెనుక నిలబడి యుద్ధ ఫలితం ఎలా వుంటుందోనని ఆత్రుతగా ఎదురుచూస్తున్న నగర ప్రజలందరికీ అర్థమైపోయింది.

గగ్గోలుగా అరుస్తూ అధికారులు, సైనికులు ఎంత ఆపినా, ఆగకుండా యుద్ధభూమిలోకి పరిగెత్తుకు వచ్చారు అందరూ.

❖ ❖ ❖

"శిఖావంతుడి గర్వం అణిగిపోయింది. దెబ్బ తిన్న నక్క మాదిరి తోక ముడిచి వెనక్కి పారిపోయాడు... సంపంగి గజదళం వెనుతిరిగి సంపంగి కేసి బయలుదేరింది."

చీకటి పడుతున్న సమయంలో ఒక పావురం మోసుకు వచ్చిన వర్తమానం సంపంగి నగరంలో కనీవినీ ఎరుగని ఉత్సాహానికి నాంది పలికింది.

కాగడాలు పట్టుకుని నగర వీధుల్లో నృత్యాలు చేయటం మొదలుపెట్టారు పౌరులు. కోటగోడల మీద జ్యోతులు వెలిగించి నగర దేవతలకు పూజలు చేయడం మొదలుపెట్టారు ఆడంగులు.

"శివుడు ఏడి? ఎక్కడికి పోయాడు?" కనిపించిన ప్రతివారిని అడుగుతూ నగర ద్వారం దగ్గిరే నిలుచున్నాడు మంత్రి మహేశ్వరుడు.

"వద్దు వద్దన్నకొద్దీ ఏనుగులతో బయటికి పోయాడు. ఎంత చెప్పినా వినిపించుకోలేదు. ఎంత ఆపుదామని ప్రయత్నించినా ఆగలేదు" తలవంచుకుని చెప్పాడు అక్కడి భటుల నాయకుడు.

అటువంటి సమాధానం అంతకుముందు శివుడు ఎవరో తెలియకముందు వినవచ్చి వుంటే తడుముకోకుండా వాడి మొండితనం మీద తన అభిప్రాయాన్ని చాలా వివరంగా వెల్లడించి వుండేవాడు మహేశ్వరుడు.

ఇప్పుడు అలా చేయలేకపోయాడు. ఎందుకంటే ఏదైనా పని చేయాలని తీర్మానించుకున్న తర్వాత ఎవరు ఎన్ని చెప్పినా వినిపించుకోవడం సాగరుల వారికి అలవాటు లేదు.

"వీడికి ఆ మొండితనం ఎక్కడినించి వచ్చిందో తెలిసింది తనకి. తెలిసిన తర్వాత చేయగలిగింది ఏముంది?" ఆ భటుల నాయకుడి భుజం తడుతూ అనునయంగా అన్నాడు.

"ఆ గుణమే గనుక లేకపోతే శిఖావంతుడి దెబ్బను మనం తట్టుకుని వుండేవాళ్ళం కాదు" అన్నాడు చిన్నకంఠంతో.

"అక్షర లక్షలు విలువ చేసే మాట అది. లెస్సగా చెప్పావు. ఇంకాసేపట్లో చారులతాదేవి గారి వద్దనుంచి నీకు వర్తమానం వస్తుంది. వాడిని ఒంటరిగా బయటికి వెళ్ళనివ్వటానికి కారణం ఏమిటో చెప్పాల్సి వస్తుంది. సమాధానం సిద్ధం చేసుకుని నిలబడి వుండు" అంటూ వెనుతిరిగి నగరంలోకి బయలుదేరాడు మహేశ్వరుడు.

తెల్లగా పాలిపోయింది భటుల నాయకుడి వదనం. వెఱ్ఱిచూపులు చూస్తూ అలాగే విగ్రహంలా నిలుచుండిపోయాడు.

❖ ❖ ❖

తలమీద ఎవరో పలుగులు పెట్టి పొడిచినట్లు బాధపడుతూ కనులు తెరిచాడు వైద్యుడు. ఒక్కక్షణం పాటు తాను ఎక్కడ వున్నదీ తెలియలేదు అతనికి.

"నేను ఎక్కడ వున్నాను? నాకు ఏమైంది?" అని అడుగుతూ పైకి లేవబోయాడు.

అప్పుడు తెలిసివచ్చింది అతనికి. వేలుపెట్టే ఎడం కూడా లేకుండా వెనక్కి విరిచి కట్టివేయబడి వున్నాయి అతని చేతులు. పాదాలుకూడా అదే మాదిరి బంధింపబడి వున్నాయి.

"ఎవరు నన్ను ఇలా బంధించింది? ఎవరు?" అయోమయంగా చూస్తూ బిగ్గరగా అడిగాడు.

వెంటనే అతని కనులముందు ప్రత్యక్షం అయింది ఒక వదనం. అదేపనిగా తాంబూలం సేవించడం వల్ల కాంతిని కోల్పోయిన పల్వరుస బయటికి కనిపించేలా పెద్దనవ్వు నవ్వాడు.

"భద్రేశ్వరుల వారూ... మీరా? మీరు ఇక్కడ..." అంటూ చటుక్కున మాటను ఆపాడు వైద్యుడు– తాను ఎక్కడ వున్నాడో, ఎందుకు వున్నాడో తెలియకపోవటం వల్ల.

"మనం చేరుకోవాల్సిన ప్రదేశం ఇంకా చాలా దూరంలో వున్నది. అనవసరంగా అరిస్తే గొంతునొప్పి పుట్టడం తప్ప వేరే ఉపయోగం వుండదు. వైద్యులు మీరు. మీకు చెప్పగలిగిన వాడిని కాదు నేను... నోరు మూసుకుని వుండండి" మృదువుగా అన్నాడు భద్రేశ్వరుడు.

అప్పుడు అతను ఆ మాటలు మాట్లాడిన తర్వాత గుర్తుకువచ్చింది వైద్యుడికి జరిగింది ఏమిటో.

రహస్యమార్గం ద్వారా ఆలయం వెనుక వున్న తోటలోకి అడుగు పెట్టారు తాము. వెంటనే తమ తలల మీద పడింది ముసుగు. బలమైన దెబ్బలు కూడా తగిలాయి.

"ప్రభువుల వారు ఎక్కడ? శివకేశవ చంద్రులవారు ఏరి??" విపరీతమైన ఆందోళనతో కంఠం కంపిస్తుండగా అడిగాడు.

"వంద సంవత్సరాలు వస్తున్న మనిషికి అంత త్వరగా తెలివి ఎలా వస్తుంది? మీరంటే వయసుమీద వున్నారు కాబట్టి తలకి తగిలిన దెబ్బనించి త్వరగా తేరుకున్నారు. ఆ ముసలి ప్రభువు ఇంకా మైకంలోనే వున్నాడు" అంటూ ప్రక్కకు చూపించాడు భద్రేశ్వరుడు.

అటుకేసి చూసిన వైద్యుడికి తన మాదిరిగానే కరచరణాలు బంధింపబడి వున్న శివకేశవ చంద్రుడు కనిపించాడు.

ఆయనే కాదు... ఆయనతో పాటుగా మరో ఇద్దరు నూతన వ్యక్తులు కూడా అక్కడ పడుకోబెట్టబడి వున్నారు.

"వారెవరు?" ఆశ్చర్యంగా అడిగాడు వైద్యుడు.

"ఒకరు మీకు బాగా తెలిసినవారే.. సత్రం నిర్వాహకుడిగా వేషం వేయించి నగరంలో గూఢచర్యం చేయటానికి నియమించిన మనిషి" అన్నాడు భద్రేశ్వరుడు.

"మరి రెండవ వ్యక్తి?" అడిగాడు వైద్యుడు.

"సంపంగి నించి వచ్చాడు. మీ ప్రభువుల వారసుడి గురించిన వార్తను మోసుకువచ్చి మీకందరికీ మహదానందం కలిగించినవాడు" చెప్పాడు భద్రేశ్వరుడు.

"నన్ను... మమ్మల్ని ఎందుకు బంధించారు?" అడిగాడు వైద్యుడు.

అప్పటివరకూ అతని ప్రశ్నలన్నిటికీ తడుముకోకుండా సమాధానాలు ఇస్తున్న భద్రేశ్వరుడు పెద్దగా నవ్వి తల అడ్డం తిప్పాడు.

"వైద్యుడంటే ఒంటికి వచ్చిన రోగాలకు ఔషధాలు ఇచ్చి, ఎవరు ఏది ఇస్తే అది పుచ్చుకుని అవతలికి పోవాల్సిన మనిషి అని అర్థం. తనకు సంబంధం లేని విషయాల్లో తల దూరిస్తే ఫలితం ఇలాగే వుంటుంది" అంటూ తలను వెనక్కు తిప్పుకున్నాడు.

అప్పుడు తెలిసివచ్చింది వైద్యుడికి మరో విషయం. కాళ్ళు చేతులు బంధింప బడిన తనను, శివకేశవ చంద్రుల వారిని, సత్రం మనిషి, అతనితో పాటుగా వున్న ఆగంతకుడిని ఏదో శకటంలో ఎక్కడికో తీసుకుపోతున్నాడు భద్రేశ్వరుడు.

ఎక్కడికి తీసుకుపోతున్నాడో తెలియకపోయినా ఎందుకు తీసుకుపోతు న్నాడో అతని వాలకాన్ని బట్టి చూస్తుంటే చాలా తేలికగా అవగతమై పోతోంది.

ఆలయం వెనుక వున్న తోటలోకి రహస్యంగా రమ్మనమని లేఖను వ్రాయించి, రాజభవన ద్వారంలో పడవేయించింది అతనే. ఎవరికంటా పడకుండా ప్రభువుల వారు తోటలోకి ఎలా రాగలడో అతనికి తెలుసు.

శయన మందిరంలోని సొరంగమార్గం ప్రభువులతో పాటు వారి కుమార్తెలకు కూడా తెలుసు. తన భార్యనించి అతను కూడా తెలుసుకోవడం వల్లనే అటువంటి నాటకం ఆడేందుకు వీలు కలిగింది.

నగరానికి దూరంగా తీసుకుపోయి తమతో పాటు ప్రభువులకు కూడా ప్రాణహాని తలపెట్టే ఆలోచన చేస్తున్నాడు అతను. ఆ తరువాత ఆ నిందను సంపంగిలో వున్న సుబోధుడి మీదికి నెట్టి తను చేతులు దులుపుకుంటాడు.

సుబోధుడి మీద సహజంగా అందరికీ వున్న వ్యతిరేకత మరింత అధికం అయిపోతుంది. అతని ద్వారా జన్మించిన బిడ్డడిని పొరపాటున కూడా సౌగంధీయులు తమకు ఏలికగా అంగీకరించరు.

రాజు లేని రాజ్యం అరాచకం పాలు పడుతుందని అందరినీ ఒప్పించి తాను సింహాసనాన్ని అధిష్టిస్తాడు భద్రేశ్వరుడు.

స్వతహాగా పెద్ద తెలివితేటలున్న మనిషి కాదతను. ఇటువంటి కుట్రను కొనసాగించగల సామర్థ్యం ఎలా అలవడింది??

ఎగుడు దిగుడు మార్గంలో ప్రయాణం చేస్తున్న శకటం వున్నట్లుండి ఒక చిన్నగోతిలో పడి పైకిలేవటంతో సంభవించింది ఒక కుదుపు.

తలమీద మరో దెబ్బ పడినంత బాధ వైద్యుడికి కలిగింది. అదే కుదుపు కారణంగా నెమ్మదిగా కళ్ళు విప్పాడు పక్కనే పడుకోబెట్టబడి వున్న శివకేశవ చంద్రుడు.

"వైద్యులవారూ... మనం ఎక్కడ వున్నాం?" అని ప్రశ్నించబోయి చటుక్కున ఆగిపోయాడాయన.

"ప్రభువుల వారికి ప్రణామాలు..." శకటం ముందుభాగంలో వేలాడుతున్న ఒక తెరను కొద్దిగా పక్కకు తప్పించి, ఇవతలికి తొంగిచూస్తూ అన్నాడు భద్రేశ్వరుడు.

"ఎవరికీ తెలియకుండా రహస్యంగా మమ్మల్ని తోటలోకి రమ్మనమని లేఖలో వ్రాసింది చూడగానే మాకు నీ మీదే అనుమానం కలిగింది. ఎదుటికి వచ్చి వుంటే నీ తల ఎగిరిపోయి వుండేది. దొంగదెబ్బ కొట్టి నీ దుర్మార్గాన్ని ప్రదర్శించుకున్నావు" కరుకుకంఠంతో అన్నాడు శివకేశవ చంద్రుడు.

"వృద్ధుడివి... గట్టిగా రెండు మాటలు మాట్లాడినా, మూడు అడుగులు వేసినా అలసిపోయే శక్తిహీనుడివి. గబ్బిలం మాదిరి ఎంతకాలం సింహాసనాన్ని అంటిపెట్టుకు కూర్చుంటావు?" అడిగాడు భద్రేశ్వరుడు.

"బండరాళ్ళతో నిండివుండే కొండ చెరియల మీద పదిమందికి ఉపయోగపడే పంటలు పండించవచ్చని, అడుగు తీసి అడుగు వెయ్యటానికి కూడా వీలుపడని ఏటవాలు ప్రదేశాల్లో రహదారులు నిర్మించవచ్చని ప్రజలకు చెప్పి, వారిని మెప్పించి సౌగంధ సామ్రాజ్యాన్ని స్థాపించారు నా పూర్వీకులు. ఒంట్లో ఊపిరి ఉన్నంతకాలం ప్రజలకు మేలు చేస్తూనే బ్రతికాను. అటువంటి మహామహులు అధిష్ఠించిన సింహాసనం మీద నీవంటి అధములు కూర్చోవటం ఎప్పటికీ జరగదు" కనుకొలకులు ఎర్రబడుతుండగా కఠినంగా అన్నాడు శివకేశవ చంద్రుడు.

"తండ్రి మాటను ధిక్కరించి ఒక అధమాధముడిని వరించిన నీ పెద్దకూతురు ఎవరు? ఆమెకు పుట్టిన బిడ్డ ఎటువంటిది? ఆ బిడ్డకు జన్మించిన వాడు నీకు వారసుడు ఏ విధంగా అవుతాడు? అధమాధముల్లో కెల్లా పరమ అధమాధముడు కాదా వాడు?" కోరగా చూస్తూ అడిగాడు భద్రేశ్వరుడు.

"వాడు ఎవరనేది అప్రస్తుతం. వాడిలో మా సౌగంధీయుల రక్తపుచారికలు వుంటాయి. ఆ అర్హత నీకు లేదు. నువ్వు అనర్హుడివి" క్లుప్తంగా చెప్పాడు శివకేశవ చంద్రుడు మరోసారి.

"ముసలివాడివి కాబట్టి నీ వయస్సును గౌరవించి ఆ సంభాషణను ఇక్కడితో వదిలేస్తున్నాను... సౌగంధికి కాబోయే చక్రవర్తిని నేనే" తనుకూడా తన నిర్ణయాన్ని అదేమాదిరి క్లుప్తంగా చెప్పాడు భద్రేశ్వరుడు.

"నీ అంతట నువ్వుగా చక్రవర్తినని ప్రకటించుకోవడం వల్ల ఏమీ ఉపయోగం లేదు. ప్రజలు అంగీకరించాలి. ప్రభువుల వారి రక్తపుఛాయలు

లేనివారిని సౌగంధ ప్రజలు తమ ఏలికగా అంగీకరించరు” వున్నట్లుండి కల్పించుకున్నాడు మగతగా పడివున్న సత్రం మనిషి.

“ఓ... నీకు తెలివి వచ్చిందన్నమాట... సమయానికి మాకు శిఖావంతుడి మంత్రులు మార్గదర్శనం చేయబట్టి నీవు ఆడిన నాటకం బట్టబయలు అయింది. ఇంతకాలంగా నిన్ను చూస్తూనే వున్న మాకు నువ్వు ఈ ముసలినక్కకు గూఢచారివని తెలియనే లేదు” అతనికేసి తిరుగుతూ అన్నాడు భద్రేశ్వరుడు.

“శిఖావంతుడిని నమ్మినవాళ్లు ఎవరూ బాగుపడలేదు ప్రభూ...” అన్నాడు సత్రం మనిషి.

“నేను బాగుపడతాను. నా మార్గాన్ని సుగమం చేసింది అతని మంత్రులే...” అన్నాడు భద్రేశ్వరుడు.

“దయచేసి కొంచెం లోతుగా ఆలోచించండి. మనల్ని రెచ్చగొట్టి సంపంగి మీద యుద్ధానికి బయలుదేరదీయటం ద్వారా, జ్వలిత సామ్రాజ్యంలో కల్లోలం సృష్టించటమే శిఖావంతుడి ఉద్దేశ్యం. ఆ సందడిలో అతను మహాబలి చక్రవర్తి మీద విజయం సాధించవచ్చని కలలు కంటున్నాడు. తను ఆడుతున్న ఆటలో మనల్ని పావులుగా చేసుకుంటున్నాడు” ఓపికగా చెప్పాడు సత్రం మనిషి.

“మనం సంపంగి మీద యుద్ధానికి బయలుదేరుతున్నామని నీకు ఎవరు చెప్పారు?” అడిగాడు భద్రేశ్వరుడు.

“శిఖావంతుడి మంత్రులు వచ్చింది అందుకే కదా... సుబోధుడు సంపంగిలో వున్నాడని...” అని చెప్పబోతున్న సత్రం మనిషి వంక చూస్తూ బిగ్గరిగా నవ్వాడు భద్రేశ్వరుడు.

“సుబోధుడి గురించిన మాటలు మరోసారి బయటికి వచ్చేసరికి ఈ ముసలిరాజుకు మనోవ్యధ అధికం అయింది. ఆ ఆలోచనలతోనే తనచుట్టు ఏం జరుగుతోందో కనిపెట్టలేకపోయాడు. సుబోధుడి మీద మీకున్న కక్షను సౌగంధ సింహాసనం సంపాదించుకోవటానికి వాడుకుంటాను. సింహాసనాన్ని నాకు కాకుండా చేయటానికి ప్రయత్నిస్తే మాత్రం నేను ఎవరినైనా సరే ఎదిరిస్తాను” అన్నాడు.

మౌనంగా ఆ మాటల్ని వింటున్నాడు వైద్యుడు. వింటున్నకొద్దీ భద్రేశ్వరుడి మనసులో ఎటువంటి ఆలోచనలు రూపుదిద్దుకుని వున్నాయో తేటతెల్లం అయిపోతున్నది అతనికి.

రాజధానికి దూరంగా తీసుకుపోతున్నాడు తమని. బహుశా సంపంగి సరిహద్దుల్ని దాటించి అక్కడి అడవుల్లోకి ప్రవేశపెడతాడు. రహదారి దగ్గరిగా మంచి ప్రదేశాన్ని చూసి శివకేశవ చంద్రుల వారితో సహా అందరినీ చంపి అక్కడే వదిలేస్తాడు.

ఆ నిందను చక్కగా సుబోధుడి మీదికి పంపకం చేస్తాడు. తమ రక్తం ప్రవహించే సుబోధుడి మనవడి కోసం సుబోధుడిని క్షమించి మళ్ళీ సౌగంధికి స్వయంగా ఆహ్వానించటానికి వెళితే అటువంటి ఘోరం జరిగిపోయిందని అందరికీ చెప్పి నమ్మిస్తాడు.

ఆ నమ్మకద్రోహాన్ని భరించలేని సౌగంధీయులు అతనినే తమ అధిపతిగా ఎన్నుకుని, ఆ తరువాత-

ఆ తరువాత జరిగేది ఏమిటో వైద్యుడి ఊహకి అందలేదు. వారిని బంధించి తీసుకుపోతున్న శకటం ఇంకో గోతిలో పడి మరో కుదుపు కుదపటంతో అంతం అయిపోయాయి అతని ఆలోచనలు.

"ప్రభూ... తమరి దేహపరిస్థితి ఎలా వున్నది?" తలతిప్పి పక్కకు చూస్తూ తన ప్రభువును అడిగాడు.

"దేహపరిస్థితి కంటె మానసిక పరిస్థితే మహా చికాకుగా వున్నది. మా బంధనాలు విడిపోయి మా చేతికి ఒక ఖడ్గాన్ని ఎవరైనా ఇస్తే బాగుంటుందని అనిపిస్తోంది" పళ్లు బిగపడుతూ అన్నాడు శివకేశవ చంద్రుడు.

పెద్దగా నవ్వి మళ్ళీ తలను తెరల చాటుకు లాక్కున్నాడు భద్రేశ్వరుడు. "చింత చచ్చినా పులుపు చావలేదు ప్రభువుల వారికి. చేతికి కత్తిని ఇస్తే ఏదో చేసేద్దామని ఆరాటపడిపోతున్నాడు..." అంటూ ఎవరికో చెప్పాడు.

వెంటనే చెవులు రిక్కించాడు వైద్యుడు. భద్రేశ్వరుడితో పాటుగా మరెవ్వరో కూర్చుని వున్నారు శకటం ముందుభాగంలో. ఎవరై వుంటారు?

"సౌగంధీయుల సమస్యలన్నిటినీ పూర్తిగా తెలుసుకుని చక్కగా విశ్లేషించ గలిగిన మీకు భద్రేశ్వరుడితో పాటు కూర్చుని వున్నది ఎవరో తెలియకపోవడం

విచిత్రంగా వున్నది" అంటూ వినవచ్చింది అంతకుముందు ఎన్నడూ అతను వినివుండని కంఠం ఒకటి.

అదిరిపడి అటుచూసిన అతని కనులకు నవ్వుతూ కనిపించాడు సత్రం మనిషి పక్కనేపడివున్న సంపంగి పౌరుడు.

"మీరందరూ మాట్లాడుకుంటున్న సమయంలోనే నాకు తెలివి వచ్చింది" తలతిప్పి చూస్తూ చెప్పాడతను.

"భద్రేశ్వరుడితో కూర్చుని వున్నది ఎవరో నీకు తెలుసా?" అడిగాడు వైద్యుడు.

"వేరే ఎవరు కూర్చుంటారు? అతనికి సాయం చేసేందుకు వచ్చిన శిఖావంతుడి మంత్రులే అయివుంటారు" అన్నాడు ఆ మనిషి.

"ఇంత పెద్దకుట్ర కళ్ళఎదుట జరుగుతుంటే గమనించలేకపోవటం నిజంగా మా అసమర్థతే. వృద్ధులమైపోయాం కాబట్టి మాకు మా ప్రాణాల మీద ఆశలేదు. బోలెడంత భవిష్యత్తు వున్న మీరందరూ మా మూలకంగా ఆపదలో చిక్కబడటమే మమ్మల్ని బాధిస్తోంది" వున్నట్లుండి అన్నాడు శివకేశవ చంద్రుడు.

"అధైర్యపడకండి ప్రభూ... పట్టుబడినంత మాత్రాన ప్రాణాలు పోగొట్టుకోవాలనే నియమం ఎక్కడా లేదు. సంపంగి సరిహద్దులు దాటి అడవిలోకి అడుగు పెట్టేంత వరకూ మనకు ఎటువంటి ప్రమాదమూ లేదు" అన్నాడు సంపంగి పౌరుడు.

"అంతగట్టిగా ఎలా చెప్పగలవు?" ఆశ్చర్యంగా అడిగాడు చక్రవర్తి.

"సంపంగికి తీసుకుపోయే రహదారి మీద ప్రయాణం చేస్తోంది మనల్ని బంధించి వుంచిన ఈ శకటం. మీ దేశంనుంచి వ్యాపారపు పనుల మీద ప్రతిరోజూ ఎవరో ఒకరు ఈ దారిలో ప్రయాణిస్తూనే వుంటారు. మనల్ని మట్టుబెట్టే సమయంలో అటువంటి వారెవరూ సమీపంలో వుండకూడదు. అందుకు సరిహద్దుల్ని దాటి అడవుల్లోకి పోవాల్సిందే" అన్నాడు ఆ మనిషి.

అతను ఆ మాటల్ని ముగిస్తూ వుండగానే వారున్న శకటం ఒక్కసారిగా ఆగిపోయింది.

"ఎవరో ప్రయాణీకులు గుంపుగా వస్తున్నట్లున్నారు" చెవులు రిక్కించి బయటినుంచి వినవస్తున్న శబ్దాలను ఆలకిస్తూ అన్నాడు ఆ మనిషి.

“ఎవరు మీరు? ఎక్కడినించి రాక?” శకటం ముందుభాగంలో లేచి నిలబడి వారిని అడుగుతున్నాడు భద్రేశ్వరుడు.

“మేము వ్యాపారం చేసుకోవటానికి శ్రావస్తి నగరం వెళ్ళి అక్కడినుంచి సంపంగికి వచ్చాము. సంపంగి నించి సరాసరి వచ్చేస్తున్నాము” వినవచ్చింది సమాధానం.

“సంపంగి పరిస్థితి ఏమిటి? రాజధానిలో వాతావరణం ఎలా వుంది?” అడిగింది ఒక కొత్త గొంతు.

“శిఖావంతుడి మంత్రుల్లో ఒకడి కంఠం అది. పేరు సుకేతుడు. నేను భద్రేశ్వరుల వారికి చెప్పిన కట్టుకథలో ఇతని నామాన్నే ఉపయోగించాను. ప్రచోద నగరంలో ఇతను నివశించే భవంతినే వర్ణించాను. ఇతను స్వయంగా వచ్చివుంటాడని తెలియకపోవడంవల్ల పెద్ద తప్పు జరిగిపోయింది. ఇతని ద్వారానే నా గుట్టు రట్టు అయివుంటుంది” తన పక్కనే వున్న సత్రం మనిషికి చెప్పాడు వాసుదేవుడు.

“రాజధానిలో వాతావరణాన్ని గురించి అడగటం ఏమిటి?” ఆశ్చర్యంగా ప్రశ్నించాడు సత్రం మనిషి.

“అక్కడ జరుగుతున్న యుద్ధాన్ని గురించి అలా అడిగాడు” అంటూ ఊపిరి బిగపట్టాడు వాసుదేవుడు.

“అందరికీ తెలిసిన విషయం మీకు ఇంకా తెలియకపోవడం ఆశ్చర్యంగా వున్నది. సాగరుల వారి గజదళం దెబ్బకి శిఖావంతుడికి చుక్కలు కనిపించాయి. రథబలం నాశనమైపోయింది. కాల్బలం పూర్తిగా ఓడి పారిపోయింది. అశ్వికులు ప్రాణాలు అరిచేతుల్లో పెట్టుకుని పారిపోయారు” ఉత్సాహంగా చెపుతున్నాడు ఒక ప్రయాణీకుడు.

“సంపంగి నగరంలో పండుగలు జరుగుతున్నాయి. ఉత్సాహం వెల్లివిరుస్తోంది” అంటున్నాడు మరో వ్యక్తి.

“వాడు... సాగరుడి దగ్గర పెరిగి పెద్దవాడైన అనాథ బాలకుడు వాడి జన్మకు కారకుడైన సుబోధుడు వారిని గురించిన సమాచారం ఏమిటి?” అడిగాడు భద్రేశ్వరుడు.

"మేము సంపంగిని వదిలిపెట్టి వచ్చేనాటికి వారిద్దరూ క్షేమం. అనాథ బాలకుడు సంపంగికి యువరాజట..." అన్నాడు ఆ వ్యక్తి.

చెవులు రిక్కించి వింటున్న వాసుదేవుడి మనస్సును రెండు అంశాలు వెంటనే కలవరపాటుకు గురిచేశాయి.

శివుడు సంపంగికి చెందిన వాడేనని, సౌగంధీయుడు కాదని, అందరూ అనుకుంటున్న మాటల్ని గనుక ఆ ప్రయాణీకులు బయటపెడితే భద్రేశ్వరుడికి అమితమైన సంతోషం కలుగుతుంది. తమను అడవుల్లోకి తీసుకుపోవాల్సిన అవసరం లేదని గ్రహించి, అతను దొరకగానే హతమార్చేస్తాడు. శిఖావంతుడు యుద్ధంలో ఓడిపోయినట్లు తెలిసిన తరువాత అతని మంత్రుల ఆలోచనలు ఎలా వుంటాయో తెలియదు. భద్రేశ్వరుడిని అతని ఖర్మానికి అతన్ని వదిలిపెట్టి తమ దారి ఏదో తాము చూసుకుంటారా లేక తమ పథకాన్ని చివరిదాకా కొనసాగిస్తారా??

వాసుదేవుడి సందేహాలకు సరైన సమాధానాలు లభించకముందే కదిలింది ఆగిపోయి వున్న శకటం.

"ఆలస్యం అనవసరం... వెంటనే పూర్తి అయిపోవాలి పని... వేగంగా పోనీయాలి" శిఖావంతుడి మంత్రులు భద్రేశ్వరుడితో చెప్పటం మాత్రం వినవచ్చింది.

"సౌగంధి సరిహద్దులు దాటి సంపంగి భూభాగంలోకి వచ్చేశాము" వెంటనే అన్నాడు వాసుదేవుడు.

"నీకు ఎలా తెలుసు?" ఆశ్చర్యంగా అడిగాడు సత్రం మనిషి.

"గాలి వాసన చెపుతోంది. పర్వతాల దగ్గర వచ్చే వాసనలు కావు ఇవి. దట్టమైన అడవుల మూలకంగా తెలియవచ్చే సువాసనలు" గుండెల నిండా గాలిని పీల్చుకుంటూ చెప్పాడు వాసుదేవుడు.

సత్రం మనిషి మరేదో మాట్లాడబోతుండగా తొలగింపబడింది వారికి శకటం ముందుభాగానికి అడ్డుగా కట్టబడి వున్న తెర.

"దించండి. క్రిందికి దించండి" అంటూ వినవచ్చింది భద్రేశ్వరుడి కంఠం.

శకటం చివరి భాగంలో ప్రత్యక్షమై ముందు వైద్యుడిని, తర్వాత ప్రభువులను ఆ తరువాత సత్రం మనిషిని శకటంలో నుంచి దించి, దారి పక్కనే ఎత్తుగా ఎదిగి వున్న ఒక వృక్షం మొదట్లో పడుకోబెట్టారు ఇద్దరు సైనికులు.

"మిమ్మల్ని పోషిస్తున్నది శివకేశవ చంద్రుల వారు, మీరు విశ్వాసం చూపించవలసింది ప్రభువులకే. స్వామిద్రోహం చేస్తున్నారు మీరు" వారిని చూసి కోపంగా అరిచాడు వైద్యుడు.

పెద్దగా నవ్వి తన ప్రక్కనే నిలబడి వున్న శిఖావంతుడి మంత్రుల కేసి చూశాడు భద్రేశ్వరుడు.

"వాసుదేవుడిని కూడా దించండి" అన్నాడు ఒక మంత్రి.

"పేరు పెట్టి మరీ చెపుతున్నారు. అతను ఎవరో మీకు తెలుసా?" ఆశ్చర్యంగా అడిగాడు భద్రేశ్వరుడు.

"అతడు వాసుదేవుడు... జ్వలిత సామ్రాజ్యంలో పేరు ప్రతిష్టలున్న గూఢచారి" అన్నాడు ఆ మంత్రి.

ఒక్కసారిగా వెలవెలబోయింది భద్రేశ్వరుడి వదనం. "వాసుదేవుడా? జ్వలిత చక్రవర్తికి ఎంతో అభిమాన పాత్రుడైన గూఢచారి ఇతనేనా?" అని అడిగాడు.

"మా ముందుచూపువల్ల ఇతన్ని మొదట్లోనే గుర్తించి బంధింప చేయగలిగాము. ఆలస్యం చేసివుంటే మీ ప్రభువును పట్టుకోవటం అసంభవమై వుండేది" అన్నాడు ఆ మంత్రి.

శకటంలో నుంచి తన భటులు క్రిందికి దించి, చెట్టుక్రింద పడుకోబెడుతున్న వాసుదేవుడి వంక పరిశీలనగా చూశాడు భద్రేశ్వరుడు.

"ఇతగాడు సౌగంధి నగరంలోకి వచ్చిన కారణం ఏమిటి?" అన్నాడు.

"మేము మీకు సహాయపడటం ద్వారా సంపంగి నగరానికి కీడు జరుగుతుందని భయపడి వుంటాడు. అందుకే అడ్డుకోవటానికి వచ్చివుంటాడు" అన్నాడు మరో మంత్రి.

వారెవరికీ తాను సౌగంధికి ఎందుకు వచ్చాడో తెలియదని అర్థమై తేలికగా ఊపిరి పీల్చుకున్నాడు వాసుదేవుడు.

భద్రేశ్వరుడు రాజద్రోహం ఆలోచన చెయ్యటం వల్ల, శివుడి వారసత్వం విషయం వెనక్కి నెట్టి వేయబడింది. సుబోధుడి మీద కక్ష తీర్చుకునే ప్రయత్నం మీదనే అందరి దృష్టి కేంద్రీకరించబడుతుంది.

అతన్ని సంపంగిలో లేకుండా అవతలికి పంపివేస్తే సమస్య తేలికగా పరిష్కరించబడుతుంది. యువరాణి జ్వాలతో ఆలోచించి తను సౌగంధి

నగరానికి ఎందుకు వచ్చాడో ఆ వచ్చిన పని నెరవేరినట్లే. భద్రేశ్వరుడి బారినుంచి ప్రాణాలతో తప్పించుకోగలిగితే అంతా సుఖాంతమే.

"వాసుదేవుల వారు మనసు పెట్టి ఆలోచిస్తే పరిష్కరించబడని సమస్య అంటూ ఏమీ వుండదని నేను విన్నాను" వున్నట్లుండి అన్నాడు సత్రం మనిషి.

చెట్టుక్రింద పడుకోబెట్టబడిన వారందరినీ అక్కడికక్కడ వధించటమా, మరో ప్రదేశానికి తరలించి అక్కడ మట్టుబెట్టటమా అనే విషయాన్ని గురించి చర్చించుకుంటున్నారు భద్రేశ్వరుడు, శిఖావంతుడి మంత్రులు.

వారి సంభాషణను ఆలకించటానికి ప్రయత్నిస్తున్న వాసుదేవుడు ఉలిక్కి పడి చూశాడు సత్రం మనిషికేసి.

"మిమ్మల్ని వేడుకుంటున్నాను. దయచేసి మా ప్రభువులను కాపాడండి. మా ప్రాణాలు పోయినా పరవాలేదు. మా ప్రభువు మాత్రం క్షేమంగా వుండాలి" జీరపడిన కంఠంతో అర్థించాడు సత్రం మనిషి.

శివకేశవ చంద్రుడు మరణిస్తే శివుడి వారసత్వం సమస్య సమసిపోతుందని తెలుస్తూనే వున్నది వాసుదేవుడికి. అతని తర్వాత ఆ విషయాన్ని గురించి ఎవరూ గట్టిగా ఆలోచించరు. కొద్దిసేపు మంచిచెడులను పక్కను నెట్టి కళ్ళను గట్టిగా మూసుకుంటే భద్రేశ్వరుడు మొదటగా తన ఖడ్గాన్ని ఆ ప్రభువుమీదనే ప్రయోగిస్తాడు.

అతని ఆలోచనలు పూర్తి కానేలేదు. "ఆలస్యం అనవసరం... హతమారిపోయిన ఈ ముసలివాడు అందరికీ అగుపించాలంటే రహదారికి దగ్గర్లోనే పడివుండాలి" అంటూ ఒక భటుడి దగ్గర వున్న ఖడ్గాన్ని తను తీసుకుని వేగంగా ముందుకు వచ్చాడు భద్రేశ్వరుడు.

"భద్రేశ్వరులవారూ... తప్పు... మీరు చాలా పెద్ద తప్పు చేస్తున్నారు" ఆవేదన నిండిన కంఠంతో అన్నాడు వైద్యుడు.

పళ్ళు బిగపట్టి కత్తిని గాలిలోకి ఎత్తాడు భద్రేశ్వరుడు.

ఆ దృశ్యాన్ని చూడలేక కనులను గట్టిగా మూసుకున్నాడు వైద్యుడు. ఆయనతో పాటుగా సత్రం మనిషి.

❖ ❖ ❖

"మా ఆచార్యుల వారు మాకు చూపించిన పటాలలో ఈ రహదారి చాలా ప్రముఖంగా గుర్తించబడి వున్నది. ఇది సరాసరి సౌగంధ దేశంలోకి తీసుకుపోతుంది" మగ ఏనుగు కుంభస్తలం మీదినించి ప్రక్కకు వంగుతూ ఆడ ఏనుగుకు చెప్పాడు శివుడు.

ఆ మాటలు అర్థం అయ్యాయో లేదో గాని, చిన్నగా ఘీంకరించింది అంది. తల్లి శబ్దం చేసింది కాబట్టి తనుకూడా అలాగే చేయాలని భావించింది కాబోలు... కీచుగా అరిచింది గున్న.

కనులు చిట్లిస్తూ కత్తిని శివకేశవ చంద్రుడి గుండెల మీదికి దింపబోతున్న భద్రేశ్వరుడు ఉలిక్కిపడి వెనక్కి చూశాడు.

దట్టంగా వున్న పొదలను రెండుగా చీలుస్తూ దారి మీదికి వచ్చింది ఒక మహాగజం. అక్కడ ఇతర మానవులు కనిపిస్తారని ఊహించలేదు కాబోలు గుండెలు జలదరించేలా ఘీంకరించింది.

"ఎవరు మీరు? ఏం చేస్తున్నారిక్కడ?" ఆశ్చర్యంగా అరిచాడు దానిమీది శివుడు.

"చంపేయండి... భద్రేశ్వరుల వారూ... ముందు వచ్చిన పనిని పూర్తి... చేసేయండి" సంభ్రమంగా హెచ్చరించాడు భద్రేశ్వరుడిని శిఖావంతుడి మంత్రుల్లో మూడవవాడు.

మరోసారి శివకేశవ చంద్రుడికేసి తిరిగిన భద్రేశ్వరుడు ఎవరో తనకు తెలియకపోయినా, అతను ఏం చేయబోతున్నాడో శివుడికి అర్థం అయింది.

"ఆగండి... ఆగిపోండి" అని హెచ్చరిస్తూ మగ ఏనుగు తలమీద అరచేత్తో అదిమాడు.

భూమి అదిరేటట్లు అడుగులు వేస్తూ కదిలిందది. అడ్డం వచ్చిన శకటాన్ని తలతో బలంగా తట్టింది.

పక్కకు వంగి ఎందుకూ పనికిరాని విధంగా ముక్కలు ముక్కలైపోయిందది. దాన్ని నడిపించే వృషభాలు భయంతో రంకెలు పెడుతూ దూరంగా పరుగులు తీశాయి.

"ఆపండి... ఆ ఏనుగుల్నిఆపండి" కీచుగాఅరిచాడు శిఖావంతుడి మంత్రి ఒకతను.

మగ ఏనుగు శకటాన్ని నాశనం చేయటాన్ని చూడగానే బిక్కచచ్చిపోయారు భద్రేశ్వరుడి సైనికులు. తమ ఆయుధాన్ని వదిలి దూరంగా పరుగులు తీశారు.

ఈ దృశ్యాలేవీ భద్రేశ్వరుడికి కనిపించలేదు. కత్తిని రెండవసారి గాలిలోకి ఎత్తి శివకేశవ చంద్రుడి గుండెల్లో దింపబోతుండగా నీటిలో నుంచి ఎగిరిపడిన చేపమాదిరి కాళ్ళు చేతులు బంధింపబడి వున్నా లెక్కచెయ్యకుండా గాలిలోకి ఎగిరి భద్రేశ్వరుడి మీద పడ్డాడు వాసుదేవుడు.

అతను అలా పైకి లేవగలడని ఊహించకపోవటం వల్ల తమాయించుకో లేక పక్కకు తూలాడు భద్రేశ్వరుడు. తూలిన వాడిని తను కూడా వాసుదేవుడి మాదిరి తన శరీరంతో ఢీ కొట్టాడు సత్రం మనిషి.

"వచ్చేయ్‌రా శివుడూ... త్వరగా..." బిగ్గరిగా అరిచాడు వాసుదేవుడు.

శిఖావంతుడి మంత్రుల మీదికి పోతున్నాయి శివుడి ఏనుగులు. దారి మార్చుకుని ఒక్కసారిగా చెట్టుక్రిందికి వచ్చేశాయి.

తన కత్తితో మగ ఏనుగు తొండంమీద దెబ్బ వెయ్యబోయాడు భద్రేశ్వరుడు. వెనుకనుంచి అతన్ని పట్టుకుని అమాంతంగా గాలిలోకి ఎత్తింది ఆడ ఏనుగు. అటూ యిటూ ఊపి నేలకేసి బలంగా బాదింది.

కెవ్వుమనే కేకకూడా గొంతు దాటి బయటికి రాకముందే, తల పగిలి, నడుములు విరిగి, కళ్ళు తేలవేశాడు భద్రేశ్వరుడు.

❖ ❖ ❖

"ఎక్కడో నగరంలో వుండవలసిన వాడివి, అడవిలోకి ఎలా వచ్చావురా?" మగ ఏనుగు మీదినించి క్రిందికి దూకి తన బంధనాలు సడలిస్తున్న శివుడిని అడిగాడు వాసుదేవుడు ఆప్యాయంగా.

నగరంలో అందరూ చూపిస్తున్న అతి గౌరవాలను తట్టుకోలేక తను పారిపోయి వచ్చినట్లు చెప్పలేదు శివుడు.

"నేను రాలేదు... నా ఏనుగులు తీసుకువచ్చాయి" అని మాత్రం అన్నాడు.

తన బంధనాలు తొలగిపోగానే, మిగిలినవారి కట్లు వూడతీశాడు వాసుదేవుడు. నిస్త్రాణగా కనిపించిన శివకేశవ చంద్రుడిని చెట్టుకు ఆనించి కూర్చోబెట్టి, విరిగిపోయిన శకటంలో కనిపించిన ఒక మంచినీటి చర్మపు సంచిని ఆయనకు అందించాడు.

"శిఖావంతుడి మంత్రులు ఏమైపోయారో చూడాలి... వాళ్ళు తప్పించుకోకూడదు" అంటూ రహదారి మీదకి పోబోయి శివుడి ఏనుగులు కోరగా చూడటంతో ఆగిపోయాడు సత్రం మనిషి.

"అరేయ్ శివుడూ... నువ్వు చూడరా..." అన్నాడు వాసుదేవుడు.

రహదారికి ఆవలి పక్కన వున్న పొదలలోకి పోబోయిన శివుడిని ఆపి, "సమయానికి వచ్చి మా ప్రాణాలు కాపాడావు. ఎవరివి చిరంజీవి నువ్వు?" ఆప్యాయంగా అడిగాడు చెట్టుకు ఆనుకుని కూర్చున్న శివకేశవ చంద్రుడు.

ఊపిరి బిగపట్టాడు వాసుదేవుడు. ఎందుకో తెలియలేదుగాని, శివుడు నోరు తెరిచి సరైన సమాధానం చెపితే అప్పటికప్పుడు అటునుంచి అటే సౌగంధి నగరానికి తీసుకుపోబడతాడని అతనికి అనిపించింది.

"నేనా? నేను వేరెవరినో కాదు. వాసుదేవుల వారికి శిష్యుడిని" నవ్వుతూ చెప్పి పొదల్లోకి పరుగు తీశాడు శివుడు.

ఎంతో దూరం పోవాల్సిన అవసరం లేకుండానే కనిపించారు అతనికి రహదారి మీదినించి పారిపోయి వచ్చిన శిఖావంతుడి మంత్రులు.

దారికి అడ్డుగా వున్న ఒక పెద్ద ఊబిలో చిక్కబడబోయి, అదృష్టం బాగుండటం వల్ల తప్పించుకోగలిగారు. అయితే పొదల మధ్య ప్రయాణం చేతకాక ఒక చెట్టుక్రింద చతికిలబడిపోయాడు.

❖ ❖ ❖

రాజధాని నించి స్వయంగా బయలుదేరి వచ్చాడు చక్రవర్తి మహాబలుడు. జ్వలిత సామ్రాజ్యంలోని మండలాధిపతులందరూ సపరివార సమేతంగా వచ్చారు.

సామ్రాజ్య చరిత్రలో ఎప్పుడూ ఎవరికీ ఎదురుపడని ఒక చిక్కు సమస్యకు పరిష్కారం ఆలోచించే సభ జరగబోతున్నదని తెలిసి, సామాన్య ప్రజలు కూడా బళ్ళు కట్టుకుని తీర్థయాత్రలకు వెళుతున్నట్టు సంపంగి నగర ప్రవేశం చేశారు.

కిటకిటలాడిపోతున్నాయి వీధులు. ఒక్క క్షణికం పాటు కూడా తీరిక లేకుండా వచ్చిన వారికి వచ్చినట్లే వండి వడ్డనలు చేస్తున్నారు నగరంలోని పూటకూళ్ళ ఇళ్ళ యజమానులు.

విడిది చేయటానికి సరయిన చోటు లభించకపోవడంతో నగరం వెలుపల వున్న మైదానాన్ని కూడా ఆక్రమించుకున్నారు చాలామంది.

“ఈ పద్ధతి ఇదేవిధంగా ఇంకో పది దినాల పాటు కొనసాగితే, శిఖావంతుడి సైన్యం సృష్టించిన విధ్వంసం కంటే ఎక్కువగా ఇబ్బంది పడవలసి వస్తుంది.

నగరంలోని ఆహార పదార్థాల నిలువలు తరిగిపోతాయి. ధరలు ఆకాశాన్ని అంటుకుంటాయి. సాగరుల వారికి పరిపాలనానుభవం లేదనే మాటనే వినవలసి వస్తుంది” మహామంత్రి గుణధాముడి దగ్గర వాపోయాడు మంత్రి మహేశ్వరుడు.

“అప్పుడే ఏమయింది? సౌగంధ దేశం నుంచి దాదాపు రెండువేల మంది జనం వస్తున్నట్టు తెలిసింది. వెయ్యిమంది సైనికులను వెంటబెట్టుకుని శివకేశవ చంద్రుడి వారసులందరూ వస్తున్నారట” నవ్వుతూ చెప్పాడు గుణధాముడు.

“నవ్వుకోవాల్సిన విషయమా ఇది?” చిరుకోపంతో అడిగాడు మహేశ్వరుడు. తల అడ్డం తిప్పాడు గుణధాముడు. “కానే కాదు. గతరాత్రి శివకేశవచంద్రుడు స్వయంగా సాగరుల వారితోను, చారులతాదేవి గారితోను మాట్లాడాడట. ఈరోజు సభలో ఏదో ఒకటి నిర్ణయింపబడుతుంది” అన్నాడు.

అతను చెప్పినట్లుగానే సూర్యోదయమైన ఒక ఘడియకు కిక్కిరిసి పోయింది సభా భవనం.

“శివుడు మా బిడ్డడు. అతనే మా వారసుడు” అంటూ తన అభిప్రాయాన్ని వెల్లడించింది సాగరులవారి సరసనే కూర్చున్న చారులతాదేవి.

“వారసత్వం విషయాలను నిర్ణయించవలసిన పరిస్థితుల్లో తండ్రి చెప్పిన మాటలకే ప్రాధాన్యత వుంటుంది. తల్లివైపు వారికి ఆ అధికారం వుండదు” తన మాటల్ని వినిపించాడు మహేశ్వరుడు.

“శివుడు సౌగంధీయుడు కాదు... సంపంగి నగరానికి చెందినవాడు. అతను మావాడే” వున్నట్లుండి లేచి నిలబడుతూ అన్నాడు శ్రావస్తి నగరం నుంచి రాజధానికి వెళ్ళి, అక్కడినించి చక్రవర్తితో పాటు సంపంగికి వచ్చిన కనకయ్య శ్రేష్ఠి.

కలకలం చెలరేగింది అప్పటి వరకూ మౌనంగా వున్న సౌగంధీయుల్లో. ఎఱ్ఱబడిన వదనాలతో వేగంగా పైకి లేచి ఏదో చెప్పబోయారు వారిలో కొందరు. చేయిఎత్తి వారిని ఆపేశాడు శివకేశవ చంద్రుడు.

"అందరూ అనాథ బాలుడిగా భావించిన శివుడిని తమ కన్నబిడ్డ మాదిరిగా అభిమానించి ఆదరించిన సాగరుల వారి సతీమణికి నా వందనాలు. ఆమె కడుపున పుట్టినవాడు కూడా అంతటి ప్రేమను పొందగలిగి వుండేవాడు కాదని మాకు అనిపించింది. జ్వలిత సామ్రాజ్యానికి కాబోయే మహారాణి జ్వాలా కుమారి చెప్పిన సంగతుల్ని విన్న తరువాత" గంభీరమైన కంఠంతో చెప్పాడాయన.

"తల్లి బిడ్డలను విడదీసే ఆలోచన మాకు లేదు. కాని, మా రాజ్య నియమాల ప్రకారం మా రాచరక్తం ప్రవహిస్తున్న మగవాడే మా సింహాసనాన్ని అధిష్టించాలి."

ఒక్కొక్క మాటను అతిస్పష్టంగా పలుకుతూ చెపుతున్న ఆ వృద్ధ మహారాజు మొఖంలోకే చూడసాగారు అందరు.

"శివుడు ఇంకా చిన్నపిల్లడే... పెరిగి పెద్దవాడై పేరు ప్రతిష్టల్ని మరింతగా సంపాదించుకోవాలి... అతనికి వివాహం జరిగేవరకూ మేము బ్రతికి వుండటానికి ప్రయత్నం చేస్తాము. ఎందుకంటే శివుడికి జన్మించే బిడ్డల్లో ఒక మగబిడ్డను మాకు ఇస్తే సింహాసనాన్ని అతనికి అప్పగించాలి గనుక."

సూది క్రిందపడినా పెద్దగా వినిపించేంత నిశ్శబ్దం సభా భవనాన్ని ఆవరించుకున్నది.

"శివకేశవ చంద్రుల వారు చక్కగా చెప్పారు" మొట్టమొదటగా నోరు విప్పాడు మహాబలి చక్రవర్తి.

"ఆ రోజున మా బిడ్డ మా మాటను వినిపించుకోలేదని అహంకరించి ఆమెను దూరం చేసుకున్నాము. కన్నబిడ్డ దూరం అయితే ఆ బాధ ఎలా వుంటుందో మేము స్వయంగా అనుభవించాము. అటువంటి పరిస్థితి నా బిడ్డవంటి చారులతాదేవికి రాకూడదు" అన్నాడు శివకేశవ చంద్రుడు.

చటుక్కున ఆసనం మీదినుంచి లేచి, ఆయన పాదాలకు నమస్కారం చేసింది చారులతాదేవి. "ఒరేయ్ శివుడూ... రారా... నువ్వు కూడా ప్రణామం చెయ్యి" అని బిగ్గరిగా పిలిచింది.

"తల్లీ... సభా మర్యాదల్ని మర్చిపోకండి... శివకుమారుల వారు సంపంగికి యువరాజు. సంపంగి గజదళానికి కాబోయే..." అంటూ ఆమెకు మర్యాదల్ని గుర్తుచేయబోయాడు మంత్రి మహేశ్వరుడు.

"కాబోయే కాదు... మా గజదళానికి ఇప్పుడే అధిపతిగా నిర్ణయించి బాధ్యతల్ని అప్పగిస్తున్నాను" అంటూ అందుకున్నాడు సాగరులవారు.

"నగరంలో ఏదైనా చికాకు కలిగితే శివుడు తన ఏనుగుల్ని వెంటబెట్టుకుని అడవిలోకి పారిపోకుండా అడ్డుకోవటానికి వేసిన పథకం" సాగరుల వారి మాటల వెనుక వున్న కారణాన్ని పక్కనే వున్న వాసుదేవుడికి వివరించి చెప్పింది జ్వాల.

"ఇప్పుడు మాత్రం ఏమయింది? పారిపోదలుచుకుంటే వాడిని ఆపేదెవరు?" అడిగాడు వాసుదేవుడు.

"ఇంతవరకూ వాడి స్నేహితులు ముగ్గురే. ఇకనుంచీ గజశాలలోని జీవాలన్నీ వాడి స్నేహితులే అవుతాయి. అన్ని ఏనుగుల్ని వెంటబెట్టుకు పోవాలంటే యుద్ధాలకు వెళ్ళాల్సిందే... కారణం లేకుండా కదిలించటం సాధ్యం కాదు..." నవ్వుతూ చెప్పిందామె.

శివకేశవ చంద్రుడి నిర్ణయం అందరికీ నచ్చింది. చప్పట్లతో జయజయ ధ్వానాలతో సభాభవనం దద్దరిల్లిపోతోంది.

మంత్రి మహేశ్వరుడు అతి బలవంతంగా ధరింపచేసిన పట్టుదుస్తుల వంక చికాకుగా చూసుకుంటున్న శివుడి వంక ఆప్యాయంగా చూసింది చారులతాదేవి.

**అయిపోయింది**

